# శ్రీ తిరుపతి వేంకటేశ్వర కృతులు

( షష్టిపూర్తి మహోత్సవ ముద్రణము. )

## సంపుటము. 5

షష్టిపూర్తి మహోత్సవసంఘము, బందరు.

౧౯౩౫.

# ప్రబంధములు.

( *Scholar's edition* )

# పీఠిక

నేటి కాలపు రసజ్ఞుల యభిరుచుల కనుగుణముగా నీకూర్పు నందు కొన్ని మార్పు లచటచట సలుపబడినవి. అంతియేకాక ఒక సీసపద్యముగూడ వదలబడినది. పద్యము వదలినచోటను, మార్పులొనర్చినచోటను చుక్కగుర్తులుంచితిమి.

ఈ కొలది మార్పులచే గ్రంథస్వరూపము చెడలేదనియే తలంచెదము.

ముఖ్యమైన అచ్చుతప్పులు శుద్ధపత్రమున జేర్చితిమి. ఇంకను మిగిలిపోయినవానిని యథోచితముగా సవరించుకొందురు గాతమని సహృదయులను వేడుచున్నాను.

ఆంధ్రజాతీయ కళాశాల,
బందరు. 10_4_35

కాటూరి వేంకటేశ్వరరావు,
పరిచరణ కార్యదర్శి.

క. నీలారమణీమణియు మ
హాలక్ష్మియు భువియుఁ దనకు నర్ధాంగులు గాఁ
జాలిన దేవుడె వేంకట
శైలేశుఁడు సంపదల నొసఁగుఁ గృతిపతికిన్. ౫

తే.గీ. కలుములనెలంది గాతాపుఁ గడుపునంట
సుతులనెలంది కోఁచిన నోమునంట
భోగము లన్నియుఁ గలిగింపఁజాలు నంట
బ్రహ్మ దీర్ఘాయువును గృతిపతి కొసంగు.

సీ. ఆశిశుత్వ మొదలుగాఁగ నాభాష్యపర్యంత మే మహామహుఁడు మా కిచ్చె విద్య
కన్న సంతానంబుకన్న నెక్కుడు గాఁగ నేదయాళుండు మమ్మాదరించెఁ
బెండ్లి పేరంటముల్ ప్రియ మెలర్పఁగఁ జేసి యేగుణనిధి మమ్ము బాగుఁ జేసెఁ
బిండికై చుల్లిల్లు తిరుగనీయక యన్న మేయన్నదాత మా కింట నిడియె

తే.గీ. సకలదిగ్దేశ రాజన్యసభలయందు
డంబు మీఱ శతావధానం బొనర్చి
నిర్వహింపఁగ నెవ్వఁ డాశీర్వదించె
నంజలి ఘటించెదము బ్రహ్మయగురుమణికి.

ఉ. నిరుపమగ్రంథజాలము లనేకములన్ రచియించి సజ్జనా
దరముగ నాదివాకరసుధాకరతారక మచ్ఛకీర్తి భా
స్వరులగు కాళిదాసముఖసత్కవిచంద్రులకున్ ప్రియావిధిన్
దిరుపతి వేంకటేశకవిధీరుల మే మొనరింతు మంజలుల్.

సీ. నన్నయాదుల పెట్టినాఁడు కదా, తిక్కనాదికవీంద్రుల కాదిభిక్ష
పెక్కులోపల భిక్ష పెట్టె శ్రీనాథాదికవుల కెల్లరకుఁ దిక్కనమనీషి
శ్రీనాథకవిరాజశేఖరుం డల పెద్దనకవిత్వమునకుఁ బ్రాణమ్ము వోసెఁ
బెద్దనాదిఁ గవులకు నిదియె మార్గముఁ జూపెఁ దాతగా రయిన పెద్దన్నగారు

తే.గీ. వీరలును వీరిమార్గమ్ముఁ గోరి యాంధ్ర
కృతుల నొనరించి బహుబహూకృతుల నలరు
వారలును మాకుఁ బూజ్యులు వారికన్న
నితరకవిసత్తముల జోలి యేల మాకు?

తే.గీ. సోమయాజులమార్గంపు సొంపు గనక
పిన్న పెద్దల మర్యాద పేరు గొనక
భట్టురీతిని వాపోవునట్టి వట్టి
కాకవులుఁ గాకవులు నొక్కకడుపువారె. ౧౦

తే.గీ. ఎచ్చరికలేనియొకఁ దప్పుండెఁ బేరికైన
ధర్మమే భ్రాంతి పురుషులధర్మ మగుటఁ;
బుటకు దెబ్బదిశదొకొండు తొటుకులుండు
వారు వీరను నొకతీరువారు గారు. ౧౧

తే.గీ. తనకు సాల్గు నిఘంటుపదములు వచ్చు
ననుచుఁ బదిమందికి నిఁ దెలియంగ మాఱు
మూలపదములు గుప్పిన ముచ్చటగునె ?
ప్రతిపదమ్మున రస ముట్టిపడినఁ గాక. ౧౨

సీ. పాపిష్ఠరాజులపాలి దయ్యమ్ము సంధ్యావందనమునకు చావగారు
పరదేశసంచార కరణమ్మునకు రైల్వే జపతపమ్ములకెల్ల సవతితల్లి
ముక్తికాంతాసంగమునకుఁ దారువుఁగత్తె సద్యశోవ్యాప్తికిఁ జాటుడప్పు
ఆనందమునకు దివ్యాంగనాసంగంబు రాజసంబునకు గారాలకూచి

తే.గీ. భాగ్యభోగ్యమ్ములకు నెల్లఁ బట్టుఁగొమ్మ
యఖిలవేత్తృత్వమునకు దివ్యాంజనంబు
సరసజనులకుఁ గర్ణరసాయనంబు
కవిత యిట్టిది యని చెప్పఁగాఁ దరంబె ? ౧౩

తే.గీ. కవులు నూతను లనియును, గత నవీన
మనియు నాక్షేపణ యొనర్తురంచు మేము
కొంచెమెఱుఁగుదు మైనను “ గొత్తక్రొత్త
కొమ్మన ” యటన్న సామెత నమ్మినాము.

ఉ. అంచితు లైనవార లిది యారసి యీరసముగ్ గ్రహించి లా
లించినఁ జాలుఁ; గొంద “ అవి లే వివి లే ” వని గేలిసేయు నా
రంచు తలంప మానుదుమె ? యందఱినిగ్ దనియింప మత్తు ని
ర్మించిన బ్రహ్మకైనఁ దరమే ? యిది పెద్ద తెలుంగ సామెతే ? ౧౪

క. అని శిష్టాచారంబుల
నాదరించి యొక కృతి సేయ నున్నంతట మ
మ్మును వాడ రేవుకులవ
ర్ధన వేంకటకృష్ణమంత్రి రాపించి యనెన్. ౧౬

మ. తిరుపతివేంకటేశ్వరసుధీమణులార ! కవీంద్రులార ! దు
స్తరతరబుద్ధిభాక్ర్తితశతావధానవిధానపటిష్ఠులార ! దు
ర్భరము శతావధాన మెసకమ్మునఁ గన్గొన నిచ్చ పుట్టె మీ
కరయఁగ దాన నేర్పు గల దంచు జగద్విదితంబు గావునన్. ౧౭

క. మిమ్ముఁ బిలువఁ బంపితిని జే
స్త్రి మెయిన్ మాయన్నగారి ప్రేరేపణచే
శ్రీమ మెన్నక వచ్చితిరి ము
దము నొసఁగించితిరి మిగుల ధన్యుఁడ నైతిన్. ౧౮

తే.గీ. కవు లనేకులు జగమునఁ గలరు గాని
శాస్త్రివేత్తలు గా; రట్టి శాస్త్రిశక్తి
గలిగి కవితావిశేషంబు గలిగి శతవ
ధాన మొనరింప మీవలెఁ దగ రొరులకు. ౧౯

క. ఊరూరికి నొక్కొక రవ
ధారం బెత్తిరఁట శతవధానము చెలుపన్
గారుపులఁ జూచి నక్కయు
నారూఢిగ వాఁత లిడిన నట్లగు నేమో. ౨౦

తే.గీ. "రామరాజభూషణుఁడు ధర్మ సుకవియును
మాడభూషి వేంకటకవిమండనుండు
కవులలోపల విఖ్యాతి గాంచి శతవ
ధాన మొనరించి" రనుచు వదంతి గలదు. ౨౧

తే.గీ. వదంతియే కాని చూడ లే దనుచు శతవ
ధాన మష్టవధానంబుఁ దగ నొనర్పఁ
జేసి బహుమతు లొసరించి స్నేహకీర్తి
బడసె నొకతఁడె వంతికోద్యానమందు. ౨౨

వ. వినోదంబుగాఁ గతిపయమిత్రసహితుండై కూర్చుండి యస్మద్విరచితమ్ములగు ధాతురత్నాకర కాశీసహస్ర శృంగారశృంగాటక శుకరంభాసంవాదాదికంబులగు సంస్కృతగ్రంథంబుల నచ్చటచ్చటి శ్లోకమ్ములును వేంకటగిరి గద్వాలవిజయనగరాదిసంస్థానమ్ములఁ బ్రసంగవశమ్మున నొనర్చిన చాటుపద్యమ్ములును విని సంతసింపుచు మేదురం బగు నాదరమ్మున మమ్ముం గాంచి యిట్లనియె.

చ. తెలుఁగున జాటుపద్యములు తీయనవై యలరారఁ జేయు మీ
రలు పనిఁబూని యందమగు గ్రంథ మొకం డతినూతనమ్ముగా
నలరియు నీతియుక్త మగునట్లు ప్రధానరసంబు చిప్పిలన్
గలయ రచింప రాదె? కృతినాయకుఁగా ననుఁజేసి యొప్పఁగన్. ౨౪

ఉ. తాత కృతీంద్రుఁడయ్యెఁ బినతాతకుమారుఁడు సుబ్బరాయవి
ఖ్యాతుఁడునుం గృతిం గనె నఖండయశుండు భుజంగరావు వి
ఖ్యాతయశుండు మాకుఁ బినతండ్రి యతం డొక సత్కృతిన్ గనెం
దాతలనాఁటనుండి కృతినాథులు మాదుకులీను లందురున్. ౨౫

తే.గీ. రాజులచరిత్రలును గవిరాజచరిత
ములును గ్రంథమ్ములకు వన్నెగలుగఁజేయు;
నందులో నామనమ్మున కరసి చూడఁ
గవులకతలకు రాజులకతలు లొచ్చు. ౨౬

వ. కావున నేడేనియొక కవిచరిత్రంబు శృంగారరసప్రధానంబై నీతియుక్తం బగు నట్టులఁ గల్పించి యొనర్చుట నాయభిమతంబని చెప్పి సబహుమానంబుగాఁ గర్పూరతాంబూలంబుఁ బెట్టుటయు.

సీ. అతిరహస్యంపుసంగతికిఁ దాళపుఁబెట్టె మంచిచెడ్డలకుఁ జూపించుత్రోవ
కాలయాపనకుఁ జక్కనియుపాయం బమిత్రధ్వంసమునకు ఫిరంగిగుండు
ఘనకార్యములకుఁ బెట్టినపేరు దారిద్ర్యభంజనమ్మునకుఁ దుపాకిదెబ్బ
యాపన్నివారణ కౌషధప్రాయమ్ము తులలేని సుఖదుఃఖములకుఁ ద్రాసు

తే. గీ. ఆత్మసంరక్షణమున కిమ్మైనకోట
సంశయమ్మునకు వినాశసమయ మరయ

సకలలోకోపకారంబుసలుపు సుజన
మైత్రికన్నను వేఱొండు మహిఁ గలదె ? ౨౮

వ. అని చెప్పి కృతినాయకువంశావతారంబు వర్ణింప నారంభించితిమి. ౨౯

## వంశవర్ణన

తే. గీ. అబ్జసూతి మొగమ్మున నవతరించి
నిగమములతోడఁ బుట్టువై జగతి మొదటి
వర్ణమనఁ దగు బ్రాహ్మణవర్ణమందు
శ్రీలఁ దులఁదూఁగుచుందు రార్వేలవారు. 30

క. ఆయార్వేలనియోగుల
లో యోగము గల్గి మిగుల లోకోన్నతను
శ్రీయును విద్యయు యశమును
జాయనిదై వాడరేవువంశం బలరున్. 3౧

వ. అవనిప్రమంత్రియై యశము నందనివాఁడుఁ బరోపకారమున్
దవులనివాఁడు సంతతవదాన్యత మించనివాఁడు భూసుర
ప్రవరుల కన్నదానము నపార మొనర్పనివాఁడుఁ బండితా
శ్రయశుఁడు వాడరేవుకులమందు జనింపఁ డదేమి చిత్రమో! 3౨

తే. గీ. అక్కులక్రమమందుఁ దా నవతరించె
మంత్రిమాన్యుండు కృష్ణయమంత్రివాళి
సత్యసంధుండు త్యాగి యాజన్మభోగి
యతులితాన్నప్రదాత విఖ్యాతినేత. 33

క. ఆకారము సౌశీల్యం
బేకాకృతిఁ జెందినట్టు లెసక మెసఁగ న
శ్లోకుఁడు నతిలోకుఁడు నగు
నాకృష్ణయభార్య పాపమాంబిక సతియై. 3౪

క. లలితాంగి యగుచుఁ దగుతన
తలునీతిలకమ్మునం దతఁడు గనె ముగురన్
జెలమయఁ బెదచినసీత
న్నల లలితాకృతులఁ గృతుల నవనవమతులన్. 35

ఉ. ఇలఁ గల మంత్రిపుంగవుల కెల్లరకున్ దలఁ దాఁటి బుద్ధిలో
పల గురు వంతరై కవులపాలిఁటికల్పనగంబుభాతిఁ గో
ర్కె లొసఁగు రామచంద్రినగరీవరసాధిపుఁగూర్మిమంత్రియై
చెలమయమంత్రి వర్ధిలె విశేషయశస్సితదిక్తటీకుఁడై. ౩౬

తే. గీ. లీలమెయిఁ బల్లకీలోని కాలు నేలఁ
పెట్టక చెలంగుసంపద నెట్టుకొనఁగఁ
జెలఁగె సత్యవరపుఁదహసీలుదారుఁ
డగుచు ననయము నాచెలమయ్యమంత్రి. ౩౭

చ. చెలమయమంత్రికిన్ సుగుణసేవధికిన్ దగు లేమయున్ సతీ
తిలకము చారుతావిధికిఁ దేట గుణమ్ములపేట "యచ్చమా
లలనకు సాటి రాఁదగరు లాఁతివెలందు" లటంచు నెంత్రు లో
కులు, చెలమయ్య యాతరుణికోస మొనర్చినపుణ్య మెట్టిదో! ౩౮

చ. చెలమయమంత్రి కచ్చమకు శ్రీకరుఁ డార్యనుతుండు సద్యశో
విలసితదిగ్వితానుఁ డగు వెంకటరాయఁడుఁ గృష్ణయాఖ్యుఁడున్
గలితగుణాఢ్యుఁడై సొబగుఁ గాంచి చెలంగెడుసుబ్బరాయఁడున్
గలిగిరి పుత్రులై సమధికంబగు బుద్ధిబలంబుడంబునన్. ౩౯

ఉ. సుజనులయందు రక్తి పెరసుందరులందు విరక్తి దైవత
ద్విజగురులందు సక్తి నిరుపేదలయందు సమప్రసక్తి దు
స్త్యజరిపుషట్కముక్తి సరసంబగుభుక్తి మృదూక్తియుక్తి వి
శ్వజనసదానురక్తి సహజమ్ములు వేంకటరాయమంత్రికిన్. ౪౦

తే. గీ. సకలమతసారసిద్ధాంతసంగ్రహంబు
నొనరిచిన మేటి నాచికేతునిచరిత్ర
మల్లికార్జునకవిజనమౌళిచేతఁ
గృతిఁ గనిన మేటి యాతని కెవరు సాటి! ౪౧

తే. గీ. మహితసోమేశ్వరస్వామిమనికిపట్టు
గౌతమీపుణ్యతీరప్రకాశితంబు
పూసపాటిమహేంద్రునిపోలు కోటి
పల్లెలాణాకు నేతయై ప్రబలె[illegible]డు. ౪౨

తే. గీ. శ్రీ కనకహాల యతిశాలపాలియన్న
ప్రాజ్ఞ సకలసుగుణములపట్టినిల్లు
నమ్మహాలక్ష్మిసాటి కామమ్మ తనకు
సహచరి గాఁగ వన్నెమాతనయుఁ డలరె. ౧౩

కం. అయిదవ్వర కుదయించిరి
శ్రీయుతుఁడు చెలమయమంత్రి ధీరుం డగునా
రాయణమూర్తియు సుజనవి
ధేయుండు భుజంగరాయధీశేవధియున్. ౧౪

ఉ. మేధ మెయిన్ బృహస్పతిసమీకృతుఁ డా చెలమయ్యమంత్రి గం
గాధరరామరాయనృపకాంతుఁడు రావుకులాగ్రగణ్యుఁ డా
రాధితసత్కవీంద్రుఁ డతిరమ్యుఁడునై తగు పేరికాపుకో
నాథునిమంత్రియై యశమునన్ దెర గట్టె దిగంత మంతటన్. ౧౫

తే. గీ. అతఁడు మంత్రిత్వమువహించి యఖిలరాజ
కార్యముల నిర్వహించెడికాలమందు
రాజురాజను మాటమాత్రంబకాని
రాజు నెఱుఁగరు ప్రజలు చిత్రంబు గాదె? ౧౬

చ. పదునగు సన్నయన్నమును బట్టి వదల్చినఁగాని జిడ్డు కే
ల్వదలనిమంచి నేయియును పాయసమున్ బలుపిండివంటలున్
మదికి ముదం బొసంగెడిఘుమంఘుమఁ బొల్చెడికాయగూరలున్
పొదలఁ దదీయపఙ్క్తిఁ దిని పోదురు బ్రాహ్మణు లెందరేనియున్. ౧౭

ఉ. క్రాఁగినవేఁడినీళ్లను సుఖంబుగ స్నానముఁ జేసి తృప్తిగా
నోగిరమున్ భుజించి సెగ సొప్పెడిసత్రపుఁజావడిన్ సుఖ
శ్రీ గణియించుచున్ నిదురఁ జెందుచుఁ జెల్మయమంత్రి నెంతురు దూ
రాగతు లైనబ్రాహ్మణు లహో! యని సొక్కుచుఁ గత్తిపూడిలోన్ ౧౮

ఆ. వాడరేవువంశవర్ధనుం డగుచెల
మయ్య కత్తిపూడియందు సత్ర
ముంచు కారణమున నొక్కింత చోరుల
బాధ తగ్గె నడచు ప్రజలకెల్ల. ౧౯

సీ. చలము మీఱంగ శత్రుల జయించి ప్రతాపమార్జించి మించెఁ దిక్కన్నమంత్రి
పైడియాకులలోనఁ బండితకవికోటి కన్నమ్ముఁ బెట్టె విస్సన్నమంత్రి
బలుచమత్కారంబు గలగ్రంథములకు నాయకుఁడై చెలంగె సింగన్నమంత్రి
యడుగువారలకు నెక్కుడుగ మాన్యములిచ్చి యశముఁ గైకొనియె నక్కన్నమంత్రి

తే. గీ. యొక్కొకరి కొక్కొక విశేషమున్న దంతె
కాని యన్నివిశేషముల్ గలుగ లేదు
కనఁగఁబో ! యివియన్ని యఖండుఁడైన
మహితవాగ్దేవు చెలమయామాత్యమణికి. ౫౦

తే. గీ. అన్నిఁటికి నేమి గాని కార్యార్థి యగుచు
నెచటి కేగిన నేలాటియెడలనైన
వందవందలకొలఁది సద్బ్రాహ్మణులకు
నిత్యమును వంట చెలమయామాత్యునెంట. ౫౧

ఉ. భావిపురాతనాద్యతనపార్థివులం దల పీఠికాపురీ
రావునృపాలశేఖరుని రాణకు మించిన రాజచంద్రుఁ, డా
దేవుకులుండుఁ దన్నరవరేణ్యుని మంత్రియునైన చెల్మయన్
జేవ నెదుర్చుమంత్రిజనశేఖరునిన్ గనఁబోల దొక్కెడన్. ౫౨

తే. గీ. చతురమతియునుఁ గడుఁ జండశాసనప్ర
భావుఁడగు కాచిమంచి గోపాలకృష్ణ
మంత్రి గారాపుఁగూఁతురు మహితసుగుణ
యైన కామేశ్వరమ్మఁ బెండ్లాడె నతఁడు.

క. ఆకామాంబిక గుణముల కాకరము సతీత్వమునకు నాలయము శుభ
శ్రీకిన్ ఠావై చెలఁగె రమాకాంత యనంగ నయ్యుమాకాంత యనన్. ౫౪

చ. అలచెలమయ్యమంత్రి గనె నాసతియందు మనోజతేజునిన్
విలసితసద్యశఃకలితు వేంకటరావు ననంతకాంతి జొ
బ్బిలు గుణవంతు నప్రతిము వేంకటరత్నసమాఖ్యు నల్వురన్
సలలితరూపశీలవిలసన్మతులై తనరారు కూఁతులన్. ౫౫

సీ. ఇరువురు నాకృతి యెసకంబు గలవార లిరువురు సమశైలిఁ బరఁగువార
లిరువురు గుణముల నెన్నంగఁ దగువార లిరువురు యోగ్యత నెసఁగువార

[illegible] తిరుపతికవివిద్యల నెఱుఁగువారు
[illegible] బిరుదులు గనువారు తిరుపతిఁ గవులకు నిచ్చువారు

తే. గీ. తిరుపతిని భాగ్యభోగ్యముల్ గలుగువారు
తిరుపతిని దాతతండ్రుల సరణివారు
అమరు వేంకటరాయరత్నముల కతన
యుక్తిగా నేర దిది స్వభావోక్తిగాని. ౫౬

తే. గీ. తను 'కలెక్టరు' వ్యాసనూత్రిములు తెల్గు
నన్ బొనర్చిన యాజగన్నాథరావు
తనయ వేంకటరత్నమాతరుణిఁ బెండ్లి
యాడె వేంకటరావు ప్రఖ్యాతి యెసఁగ. ౫౭

క. ఆవెలఁదియందు వేంకటరా వొక్కకుమారుఁగనియె రమ్యాకార
శ్రీ వెలయువానిఁ జెలపతిరావున్ గామేశ్వరియన రంజిలు కూఁతున్. ౫౮

క. ఆ వేంకటరావు పునస్త్రీ వెలయఁగఁ బెండ్లియాడెఁ జెల్లాయమ్మన్
భావ్రకగుణసంపన్నన్ భావమునకు వచ్చినట్లు పరఁగెడిసాధ్విన్. ౫౯

తే. గీ. పెద్ద 'తహసీలుదారుఁడై' పేరుగొన్న
తేజుగల నందివాడ పేట్రాజుకూఁతు
ననుగుణగుణాఢ్యఁ బద్మనాభమ్మయనెడి
రమణిఁ బెండ్లాడె వేంకటరత్నమంత్రి.

శా. ఆమ్నాయాఖిలభోగభాగ్యములచే నాపద్మనాభమ్మయాం
దారోన్యాయ్యురహార సౌఖ్యగుణగణ్యాకార సౌభాగ్యస
త్కారన్ వేంకటరత్నమంత్రి గనియెన్ గామేశ్వరీనామక
న్యారత్నమ్మును సొంపు పెంపు వెలయన్ గామేశ్వరీసత్కృపన్. ౬౦

## షష్ఠ్యంతములు.

సీ. ఏతాదృశక్ష్మాతభూతివిఖ్యాతివిద్యాతిశయద్యోతితాంతరునకు
సంస్కృతాంధ్రకవిత్వసారస్యమారందధారామధుకరాయితశుభమతికిఁ
జెలమహామాత్యసంచితపుణ్యరాశికిఁ గామేశ్వరాంబికాగర్భమణికిఁ
బద్మనాభాంబికాపతికి వేంకటరాయసోదరునకు దాతృతాదరునకు

తే. గీ. వాడరేవుకులాబ్ధిపూర్ణోడుపతికిఁ
బ్రథితమౌద్గల్యమునిగోత్రపావనునకు
సరసకవిజనపిక పుష్పసమయమునకు
మహితవెంకటరత్నసన్మంత్రిమణికి. ౨౨

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా మా యొనర్పంబూనిన కేవలకల్పితప్రబంధం
బగు శ్రవణానందమ్మునకుఁ గథాక్రమం బెట్టి దనిన ౨౩

కథాప్రారంభము

చ. కల దొక పట్టణంబు కలకాల మపారసుధాశనంబుచే
నలరు దనజ్ఞ యన్నమున కాసలుసేయ ధరాతలమ్ములో
పల జనియించి పాయలనెపమ్మున నుండెడి దేవకోటినాఁ
జెలఁగెడి శిష్టకోటికిఁ బ్రసిద్ధ మనంతపురాభిధానముగా. ౨౪

సీ. అరుణోదయమున నిత్యస్నాన మొనరించి యర్ఘ్యప్రదానమ్ము లాచరించి
నీర్కావిదోవతుల్ నియతిగా ధరియించి పలుమాఱు పింజెపింజెలు ఘటించి
భూతిరేఖలు మూఁడు మొగమునఁ గీలించి భ్రూమధ్యమునఁ జుక్కబొట్టుపెట్టి
నారికేళకటాసనమ్ములఁ గూర్చుండి జంధెపుసవరణల్ సలుపుకొనుచు

తే. గీ. బ్రహ్మచారులు వేడ్క సంభ్రమముతోడ
ననువదించుచు నుండఁగా ననుదినంబు
వేదసంతలఁ గాలమ్ము వెళ్లఁబుత్తు
రనుగుణమ్ముగ వైదికు లప్పురమున. ౨౫

సీ. రాజులెల్లరును భార్గవరాములే యనఁ దేజంపుఁ బెంపు నుతింపవలెనె ?
కోమటు లెల్ల జక్కులరాజులే యన నైశ్వర్యములపెంపు లడుగవలెనె ?
పాదజు లెల్లను బలరాములే యన హాలసంపదలు నొక్కి పలుకవలెనె ?
వెలకాంత లెల్ల రంభలె యన్న రూపసంపద లిట్టి వంచుఁ జెప్పంగవలెనె ?

తే. గీ. వనము లెల్లను నందనవనములె యనఁ
గుసుమసంపత్తులను వేఱె కొనరవలెనె ?
యనఁగఁ జెలువారు నపురమ్ము ననుపమాన
పుష్పసౌరభ ఘనసంతోషపుష్ప సరిగాగా.

చ. చదువుల నన్నియుక్ జదువఁజాలిన శిష్యులు చుట్టుముట్టఁగా
నది యిది యంచు నెంచక సమస్తరసమ్ములతోడ నెప్ప డె
య్యది పరిష్కృతంబొ తదరిసమయత్నము నొంది వచింపుమందు రొ
ప్పిదముగ నప్పరంబునఁ గవిప్రవరుల్ సరసత్వ మొప్పఁగన్. ౧౯

వ. అట్టికవిపుంగవులందు విశిష్టాద్వైతమతమ్మున.

క. మేదురసంపద్యుక్తుఁడు, మేధావి యశస్వి సుకవిమిత్రుఁడు కవితా
మోదామృతాంబునిధి మధుసూదనుఁ డను నొక్క సుకవిసుందరుఁ డొప్పున్.

ఉ. చిన్నతనమ్మునన్ గడుఁ బ్రసిద్ధపు విద్యల నభ్యసించి సం
పన్నత గల్గి కుందకుసుమం బనఁ దల్లికిఁ దండ్రి కొక్కఁడై
వన్నెయు వాసియున్ రుచిరవర్తనమున్ జెలువార నొప్పు న
ప్పెన్నిధి, తల్లిదండ్రు లిలు పెత్తన మూత్తమరీతిఁ జేయఁగన్. ౨౦

ఉ. "మానవదేహి కెంత మతిమంతున కింతటిలోన నోనమా
లైనను రావు వానిఁ గనినయ్యమ లెంతటిపుణ్యశాలులో
గాని సుఖమ్ము లిట్టివుసుఁ గాంచినవారలవే" యటంచుఁ బే
రాని నుతింత్రు కేళిసమయమ్ముల దంపతులెల్ల నాతనిన్. ౨౧

సీ. "నాకళ్ల యెదుట మొన్నటిదాఁకఁ జిన్నతనంపుఁ జేష్టల సంచరింపలేఁడొ !
నాకళ్లయెదుట నున్నతి లేక నెత్తినా వీధివీధుల విఱ్ఱవీఁగలేదొ !
నాకళ్లయెదుట నెంతయునింతరఘువంశమును జంకఁబెట్టుక చనఁగలేదొ!
నాకళ్లయెదుట నున్నతు లెల్ల నవ్వంగఁ జిటిపొటిపద్దెముల్ సెప్పలేదొ !

తే. గీ. ఎంతలో నెంతవాఁడయ్యె ! నెంత బుద్ధి
వచ్చె ! నెటువంటి సత్కీర్తి వచ్చెఁ ! జిత్ర"
మనుచు నాతని చర్యలే యభినుతింత్రు
పండితవరేణ్యు లక్కవి భాగ్య మేమొ ! ౨౨

క. ఎప్పుడు మనమునఁ దలఁచినఁ దప్పక కడుపారఁగన్నతల్లింబలెఁ దా
నప్పరమేశ్వరి యాతని కప్పుడె కననాను బుణ్య మది యెట్టిదియో ! ౨౩

సీ. కవితఁ జెప్పఁగ నేర్చుఁ గలవు గీఁకఁగ వేయిగంటలకైన నిష్కంటకముగఁ
జదువఁ జెప్పఁగ నేర్చు శబ్దశాస్త్రాదికం బది మేలనుచుఁ బండితాళి మెచ్చ

మద మడంపఁగ నేర్చుఁ బదిమందికవు లొక్కటై దుష్టవాదమ్ము సందుకొనిన
మాటలాడఁగ నేర్చు మధురమ్ముగా విన్నవార లెల్లరును 'వహ్వ' యనంగ

తే. గీ. 'బాగుబాగ' నియనఁ బాటఁ బాడనేర్చు
సతులితంబుగఁ జదరంగ మాడనేర్చు
పడిపడిగ ముత్యములరీతి వ్రాయనేర్చు
సుందరగుణాఢ్యుఁ డమ్మధుసూదనుండు. ౨౪

చ. అతనికవిత్వముఁ విని 'యహా' యని మెచ్చనిబుద్ధిమంతులున్
జతురునిఁ జూచి వానిసరసత్వముఁ గోరని ప్రౌఢకాంతలున్
సితకిరణానుషంగమును జెంది కరంగనిచంద్రికాంతముల్
క్షితిని "నహి ప్రతిష్ఠ" యని చెప్పుదు రాతనిభాగ్య మెట్టిదో ! ౨౫

తే. గీ. సుధకు మాధుర్యముఁ బలె, సూర్యునకును
దైక్ష్ణ్యముంబలె శశికి శీతలతవోలె
నెంత చెప్పిన నాతనియెడల నతిశ
యోక్తి గాఁజాల దది స్వభావోక్తి యగును. ౨౬

ఉ. శంకము మీఱు నానుకవిపుంగవువీధిక నొక్కవేశ్య మీ
నాంకునిచేతిబాణ మన నందముఁ జందము గల్గి శైశవా
లంకృత యయ్యు విద్యల నలంఘ్యపటుత్వము గాంచి మించు ని
శ్శంకగ దానిఁ బోలఁగలసారసనేత్రను జూడ మెక్కడన్. ౨౭

క. లీలలలోఁ దగువేశ్యా, బాలలలో మిన్నయగుచుఁ బరఁగినకతనన్
బాలామణి యందురు తద్బాలామణిలీల లెన్న బమ్మకుఁ దరమే ? ౨౮

* తే.గీ. బాల్యవయసుననుండి యాబాల చాలఁ
గవివరునితోడఁ గ్రీడింపఁగాఁ దలంచి
క్రమముగాఁ *బ్రాయమలరార గడుసుదనము
మీఱ* పదునాలు గేండ్ల యోయారియయ్యె. ౨౯

సీ. "పాడెనా ! గంధర్వపాటవంబుదగల పికవాణి నాదంబు చిన్నవోవ మాను
ఆడెనా ! రంభాముఖాప్సరోభామినీవర్గ మెల్లను దల ల్వంచుకొనును
కూడెనా ! యక్షేశుకోశమ్మునైన ఋణవిముక్తికిఁ దగ్గఱ మిచ్చి తేలలేదు
నేఁడెనా ! వేదాంతవిద్యావిశేషమ్ముఁ దైనను మారువమాటాడ రేఁడు"

తే. గీ. అనుచుఁ దనుఁజూచుజనులెల్ల నభినుతింప
సాటిబోటులలో నీటుగొట్టుఁగల్గి
వఱలెనౌరౌర ! జిలిర ! వహ్వా ! వహాప్వ !
మేలుమేల్ ! రాజధాని యాబాలసాని.

క. అమ్మధుసూచనసారస్యమ్మంతు విని సోయగమ్ము నరసియు ననురా
గమ్ము మదినూనె దైవకృతమ్మన నబ్బాల దానిదశ యెట్టిదియో ! ౨౧

గీ. వయసువాఁడఁట ! యామీఁద వైష్ణవుఁడఁట !
సుకవియఁట ! సూక్తినిధియఁట ! సోయగంబు
గలుగువాఁడఁట ! మనము గఱఁచకున్నె ?
జాఁతికైనను నేలాటినాతికైన.

వ. ఇట్లు తదధీనచిత్తయై తన మనమ్మున

సీ. ముద్దుమాటల ముక్కుమొగ మెఱుంగనివాని ధనమేల ? వానిసౌందర్యమేల ?
బంధవ్యవాయసంపద లెఱుంగనివాని ధనమేల ? వానిసౌందర్యమేల ?
చుంబనప్రక్రియాసుఖ మెఱుంగనివాని ధనమేల ? వానిసౌందర్యమేల ?
సరససంగీత వైఖరులెఱుఁగనివాని ధనమేల ? వానిసౌందర్యమేల ?

తే. గీ. ఇన్నియును గల్గి జగతిలో వన్నెకెక్కి
సతులఁదేలించు సుకవిపండితుల నతుల
రతులఁదేలింప కతిధనయుతుల నధమ
తతులఁ గవఁగూడు తనువులగతు లవేల ?

వ. ఇట్లుపట్టరానితమకమ్ము చుట్టుముట్ట నెట్టకేలకు గుట్టువెడి తల్లికి మెల్లనఁ దన
మనోభిప్రాయం బెఱింగించి సిగ్గువిడిచి యిట్లనియె.

చ. చతురుఁడటంచు సర్వకవిసత్తముఁడంచు మహాత్ముఁడంచుఁ బి
న్నతనమువాఁడటంచును ఘనమ్ముగ నాతనిఁ జెప్పికొందు రే
యతివకుఁగల్గునో యతని నర్మిలిఁగూడి సుఖింపు టెన్న నా
యతివయె ధన్య, జన్మ మన నయ్యదియే ! సొగసన్న నద్దియే ! ౨౪

ఆ. వె. సరసుఁడగుచు సర్వసందర్భములయందుఁ
బెద్దయయ్యు వయసు పేర్మిచేతఁ

బిన్నయైనవాని మన్ననలేమన్న
సానకిందివన్నె దానివన్నె. ౮-౭

తే. గీ. కలిమి గలవారనేకులు గలరుగాని
తెలివిగలవారుకారు; నాతీరు తెలివి
గలుగువారలఁ గూడఁగాఁ దలఁచియుండుఁ
గాని ధనవద్ద్విపాత్పశుగణముఁగాదు.

క. ధనవంతులు ధనవంతులు, ధనవంతులటంచుఁ బల్కెదవు కాని సదా
ధనమెంత తెచ్చియిచ్చిన, ధనమా ? మఱి సౌఖ్యకరము తల్లీ ! చెపుమా. ౮-౯

చ. " వెలధనమింత " యంచనిన వేగమె యాధనమిచ్చి మచ్చుమం
దులు వెదఁజల్లినట్లు కడు దొంగవిలాసము లూనుకట్టుబొ
మ్మలఁ గవఁగూడువారి యధమంబగుజన్మము నొక్కజన్మమా ?
వలచినబాలికన్ గవయువారిది జన్మముగాక తల్లిరో !

* తే. గీ. విత్తమార్జించు పనికైనై వేలకొలఁది
గా నుపాయములున్నవికాని శార
దాకుచమ్ములు గలవాఁడు దక్క నితరుఁ
డింతిఁ కౌఁగిటఁ జేర్చిన సేవించుసుఖము శి

తే. గీ. గర్భగతునకునైనను గల్పనమ్మ
నేయు వృత్తినటంచును జెప్పచుంద్రు;
పెట్టఁడా ! పట్టెఁడన్నము పృథివిలోన
మనలఁ బుట్టించినట్టి యవ్వనజభవుఁడు.

తే. గీ. అదియునుంగాక నీవు ద్రవ్యంబు వేల
కొలఁదిగా నార్జనముఁజేసి కూడఁబెట్టి
యుంటి; వయ్యదిచాలదే ? యొరులకీయ,
మేమును భుజింప నాశకు మేరగలదె ? ౯-౩

తే. గీ. ఇట్లు బాలామణియును గామేచ్ఛపట్టఁ
జాల కాచార్యతనయుండు చాల సరసుఁ
డనుచుఁ దనతల్లితోడ ధనాశ గూడ
దనుచు బోధించిబోధించి యనియె మఱియు.

చ. “ వితతయశుండు ధార్మికుఁడు వేలకువేలు గణించువాఁడు పం
డితుఁడు సమస్తరాజమకుటీమణిరంజితపాదుఁ డార్యస
న్నుతుఁడగు సాధరాసురుఁ డనుంగుఁ బ్రియుండగుఁగాత ” మంచు స
న్నుతి యొనరింతు నెంతయు నినున్, సమకూర్పఁగదే! గయమ్మనన్. ౯౫

తే. గీ. అనుచుఁ దనతల్లితోడఁ జెప్పినదికాని
తానుతానయి స్వాతంత్ర్యమూనదయ్యె;
నెంతవలపున్న నెంతవలంతియైన
జననిఁ గికురింపలేదు వేశ్యాచఘాటి. ౯౬

చ. అనుతనపుత్రిమాటలు హృదబ్జము బిట్టలరింప వృద్ధభా
మినియు మనమ్ములో సుతకుమేలు గణింపుచు “ మంచిదమ్మ ! నీ
కనుగుణుఁడైన పూరుషు రయమ్మున నే సమకూర్తునమ్మ ! నీ
వనుమితి మానుమమ్మ ! మనమం ” దనుచున్ గడుఁబ్రీతిఁ బల్కెన్.

ఆ. వె. కూఁతు బుజ్జగించి కొమరార దీవించి
చింత వల దటంచుఁ జెప్పి చెప్పి
వానిఁ దెచ్చు టెంత పని యంచు నూరించి
యిట్టు లనియె మరల వృద్ధవేశ్య. ౯౮

ఉ. “చిన్నతనమ్మునందు సమశీలవయస్కులఁ బిన్నవారలన్
గ్రిన్ననఁ గూడి యల్లరి యొనర్చుచు నుండఁగఁ జూచి పెద్ద లే
మన్నను సర్వదా మనగృహమ్ముల నుండెడివాని కింత య
త్యున్నతి వచ్చెఁగా ?” యనుచుఁ దోఁచును నాకు ముదంబు నెమ్మదిన్. ౯౯

ఉ. స్త్రీలను జూడఁ డెన్నఁడును శిష్యులపాఠము లెప్పుడున్ విడన్
జాలఁడు కార్యమున్నను బజారునకైనను రాఁడు భావమున్
సోలఁగఁజేయఁ డట్టిమధుసూదనునిన్ వరియించి తమ్మిలో !
గోలవు, వాని నెట్లు సమకూర్తుఁగదే ? జగదేకసుందరీ ! ౧౦౦

తే. గీ. పండితులయొద్ద మాయలు పనికిరావు
మాయ పన్నిన నద్ధరామరుఁడు పిదప
నించుకేనియుఁ దెలిసి శపించె నేనిఁ
దనయ ! యొకగవ్వకైనను బనికి రాము. ౧౦౧

ఉ. లోకములోన మానవులలో ద్విజులే ఘను, లంతకన్న న
స్తోకకలావిదుల్ ఘనులు, సూరివరేణ్యులకన్న సత్కవి
త్వాకలనమ్ము గల్గెడి మహాత్ము లమోఘవచస్కు లమ్మ! వీ
రేకద? మాపి రెందఱి నరేంద్రులనో వచనాశుగమ్ములన్. ౧౦౨

సీ. సాహిణిమారుండు చచ్చిపోవుటఁ జూడఁ గవివరేణ్యుల కోపకలనఁ గాదె?
రాజకళింగగంగరాజు భిక్షువుఁ డౌట కవివరేణ్యులకోపకలనఁ గాదె?
పోతనరేంద్రుండు పాలియు సంగతిఁ జూడఁ గవివరేణ్యులకోపకలనఁ గాదె?
పెద్దాపురపుఁ గోట పెద్దమ్మ కిల్లౌట కవివరేణ్యులకోపకలనఁ గాదె? ౧౦౩

తే. గీ. కరుణ గల్గిన నిల్లు బంగార మాను
గరుణ దప్పిన నడవియౌ గడియలోన
బ్రహ్మకొడుకైనఁ గవులకు భయముఁ జెందు
మన మనఁగ నెంత? యమ్మక్క! మదిని జూడు.

తే. గీ. ఐన నొక్క యుపాయంబుఁ బూని వాని
మన గృహం బేగుదెంచు న ట్లనుఘటింప
వలయు; నవ్వైష్ణవసుతుండు వచ్చువఱకుఁ
జిలుకవలె నుండు మీవు సొమ్ములు ధరించి. ౧౦౪

వ. ఇట్లు తనతనయ నొప్పించి యిప్పని యెట్లు సమకూర్తునని మనమ్మున యోజించుచున్నంత నొక్కనాఁడు దైవవశమ్మున నమ్మధుసూదనుండు. ౧౦౫

క. కట్టున్ బొట్టున్ జుట్టున్ బిట్టుపసం బుట్టఁజేయ బిరబిర మనుచున్
నెట్టనఁ దనవీధిం జనుపట్టున సడిఁగట్టె వృద్ధవారాంగనయున్. ౧౦౬

తే. గీ. ఎదురుచని " సామి! మీదాసి పదములకు న
మస్కరించుచున్నది మాగృహంబు
చెంత కొకసారియైన వేంచేయవలదె?
మహిఁ బ్రపత్తికిఁ దారతమ్యములు గలవె! ౧౦౭

వ. అదియునుంగాక యేడుమూఁడు పురుషాంతరమ్ములనుండి మీపూర్వుల మంగళాశాసనపరిభావమ్మునను దిరుమంత్రోపదేశపరిభావమ్మునను నొక్కింతయుఁ గొదవలేక నేఁటివఱకు వర్ధిల్లుచుంటిమి. మాయర్థప్రాణమ్ములు భవదధీనమ్ములగుటంజేసి,

క. ఒకమాటు మాదుగేహమునకు దయసేయకయె చనుట న్యాయమె నీకున్ ?
సకలజనులు భగవంతున కొకటేకద! పక్షపాత ముండునె ? చెప్పుఁడీ”

తే గీ. అనుచుఁ బల్కిన పల్కుల కతఁడు మాఱు
మాటఁ జెప్పఁగ లేఁడాయె; మహిని బల్కి
చేతఁ బాలైనఁ దాత్రిరు స్నేహరీతి
చేత విక్షుమైనఁ ద్రావుట సిద్ధమ కద !

తే.గీ. నక్క పొదరిల్లు పంచాననంబు కరణి
వారకామిని యిలు సొచ్చె వైష్ణవుండు;
ఎన్ని చదువులు చదివిన నేమి నీచు
లకు గురుత్వంబు వైష్ణవులకు సతంబు. ౧౧౧

క. మత్యమరాచార్యసమప్రత్యయసచివాగ్రగణ్య ! పండితసుకవి
స్తుత్యా ! వేంకటరత్నామాత్యమణీ ! సుజనకమలమాన్యద్యుమణీ ! ౧౧౨

చ. చెలమయమంత్రిపుత్ర ! సరసీజశరోపమగాత్ర ! నీరజా
తలసితనేత్ర ! సర్వజనతానుతిపాత్ర ! కవీంద్రదక్షిణా
నిలశిశుచైత్ర ! దానజితనీరజబాంధవపుత్ర ! రాజతా
చలహరహీరకాశసితసారసతుల్యయశోధురంధరా ! ౧౧౩

కవిరాజ విరాజితము.

లలితసుహృత్కవిబంధుయుతామితలక్షణలక్షితచిత్రితకం
బలయుతదివ్యసభాభవనాంతరపారరసప్రసరత్కవిమం
డలకవితామృతసంతతపానమనఃప్రియకారకభాషణకో
మలతరవర్తన ! తోషితబాంధవ ! మంత్రిశిఖామణి ! ధీరమణీ ! ౧౧౪

· గద్య.
ఇది...శ్రీతిరుపతి వేంకటేశ్వరప్రణీతంబైన
కేవలకల్పితంబగు శ్రవణానందంబను
మహాప్రబంధమునందుఁ బ్రథ
మాశ్వాసము.
శ్రీ శ్రీ శ్రీ

౭౨ పద్యములో * (నాకళ్లు) ఇది లోకోక్తి కనుకరణము

శ్రీరస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్రవణానందము

## ద్వితీయాశ్వాసము

---

క. పంకేజాతవిలోచనపంకరుహాభవాదివినతపదకుక్కుటరూ
పాంకితశంకరకింకర ! వేంకటరత్నప్రధాన ! విశ్వజనీనా ! ౧

తే. గీ. అనఘరింపు మనంతరం బతని నుచిత
సీనమం దుండఁగాఁ జేసి వేశ్యమాత
బత్తి దళుకొత్త మిగులఁ బ్రపత్తి దనర
నిట్లు లనియెను గౌరవం బుట్టిపడఁగ. ౨

తే. గీ. వైష్ణవోత్తమ ! మీ పాదపద్మరజము
వలన మాయిల్లు పావనత్వంబు నందె
ధన్యనైతిని మాకన్య ధన్యయయ్యె
నెన్నియో మంగళము లబ్బు నింక మాకు. 3

ఉ. దాసజనప్రసన్నుఁడగు తామరసాక్షుని దాసులైన మీ
దాసులకున్ దదంఘ్రియుగదాసులకుం దదధీనవృత్తిలో
దాసులకుం దదీయపదదాసులకుం గడుదాసురాల వి
శ్వాసము గల్గువారలకు వైష్ణవులే కద ? రంగనాయకుల్. ౪

తే.గీ. చిన్నతనమున మాయింటి కెన్నఁడేని
స్నేహితులఁ గూడి మీరు విచ్చేయుచుండ్రు
నాలుగైదేండ్లనుండి యెన్నఁడును రారు
దాసి తరియించునట్టి విధ మింకెట్లు ? ౫

వ. అని వినయమ్మునం బల్కు నజ్జరఠవేశ్య కయ్యాచార్యుం డిట్లనియె ౬

ఉ. వచ్చుట కేమిగాని పలువారలు చూచిన లేనిపోనివౌ
మచ్చలు వున్నఁ యీతని గుణమ్ములు మంచివి గాఁవటంచుఁ దా
రచ్చటనచ్చటం బలికి యల్లరిసేతురు ; లోకు లన్న 'బల్
ముచ్చులు సత్య మెన్నుదురె? లోకము మాయను మూఁకు దున్న దే? ౭

ఉ. ఇంతకుఁదప్పు వేఱొకటి యేదియు లే దిఁక సందియంబు కా
సంత యటన్న ; వృద్ధ యను "నయ్యది సత్యమె లోకు లైనవా
రెంతటివారి నైన నిటు లెంచుదు రైనను వారివల్ల నా
వంతయుఁ హానిఁ గార్యమనునట్టిది లేదుగదా ! తలంపఁగన్. ౮

ఉ. నిప్పున కంటునే చెదలు ! నీరజమిత్రున కంటునే తమం ?
బెప్పటికైన మీరలిటు లేటికి సందియ మందుచుందు ? రో
యప్ప ! రమానివాసునిదయన్ దమ రెంతటివార లైనన్
దప్పునె ? దాసురాండ్రపయిఁ దప్పులు పట్టక యాదరించుటల్". ౯

వ. ఇట్లుచితాలాపమ్ములం బ్రొద్దుఁ బుచ్చుచున్నంత ౧౦

సీ. ముంగాల సింగారముం గార మేలు బంగారు రంగారు లంగా ధరించి
దబ్బకాయలఁ జూచి యబ్బగారని పిల్చు గబ్బిగుబ్బలఁ గంచుకమ్ము దొడిగి
చందమామ మిటారమొంగు మోమున గంగసిందూరనామంబుఁ బొందుపఱచి
కలువరేకులజాలు గెలువఁజాలెడి సోగచెలువు కందోయిఁ గజ్జలము దీర్చి

తే.గీ. లీలఁ గీల్జడఁజుట్టి చొల్లెమ్ము వెట్టి
లలితరుచి నొప్పుచున్న బులాకితోడ
మించి ముసిముసినగవులు మేలమాడ
విప్రదరిఁజేరె నప్పు డవ్వైశ్యతనయ. ౧౧

ఉ. పైఁట దొలంగి పాదములపైఁబడ గాజులు మ్రోయ సర్వదే
శాటనపావనంబగు ధరామరుపాదసరోజయుగ్మ మా
బోటి నమస్కరించె నలపుష్పశరానుఁడు బాణపఙ్క్తికిన్
వాటము గాక తా గిరటనైచినచాప మనంగ నత్తఱిన్. ౧౨

వ. ఇట్లు నమస్కరించినఁ దగుగతి మంగళాశాసనం బొనర్చి చనుట కుద్యుక్తుండగు నక్కవివర్యుం జూచి వృద్ధ యిట్లనియె ౧౩

క. అమ్మా ! మన యయగారికి నిమ్మా ! తాంబూల మింటి కేగెదరఁట. వే
పొమ్మ కొనిరమ్మ మనపుణ్యమ్మున వారిటకు వచ్చినారు గదమ్మా ! ౧౪

సీ. అయ్యగారి దర్శనం బాచరింపఁగనలె నంచు నెంతయుఁ గుతూహలముతోడఁ
బల్కుచుందువు నీవు కల్కిరో ! యెన్నాళ్ళనోయుండి వార లీయూరిలోన
దయచేసి యుండియు దయచేయ రెన్నఁడు మనయింటి కటువంటి మాన్యు లిపుడు
దయచేసినారు తద్దయు నీదు సుకృతంబు ఫలియించె, నీనోము పండె నమ్మ !

తే. గీ. వారితో మాట లాడ కీవయస నీవు
సిగ్గుగైకొని తలవంచు టెగ్గుగాదె !
వార లేమనుకొందు రీవరుసఁ జూచి ?
యన్యులా ? వారు మనకుఁ బద్మాయతాక్షి ! ౧౫

వ. అని తల్లి పల్కుటయు. ౧౬

ఉ. చేతను బళ్ళెరంబుఁ గొని సిగ్గొకకొంచెము వెన్కలాగఁగా
వాతెఱయందుఁ జిర్నగవు వాటపుఁబంతము లాడుచుండ మే
ల్మూఁతల గుబ్బలున్ బయఁటలోపల నాఁగురుమూఁత లాడఁగా
నాతని డగ్గరెన్ వికసితాంబుజలోచన గుండె ఝల్లనన్. ౧౭

ఉ. "ఇచ్చిన నిప్పుడే పెడలు నీయన, నీయక యిట్టు లెంతసే
పిచ్చుటఁ గాలయాపనము నే నొనరింతు" నటంచు నెంచుచున్
ముచ్చట వెన్కకున్ మఱియు ముందటికిన్ దిగలాగఁ గొంతసే
పచ్చపలాక్షి*యూరకొనె ; నట్లగుఁగా మది మోహ ముండినన్ ! ౧౮

సీ. కరము కంపమునొంద సరులు తల్లడమందఁ జెమటచేతను జెక్కు చెమ్మగిల్లఁ
గనులు చాపలమూన మనము గోరికలానఁ దనువు పులకలచే దళముగాఁగ
నవ్వు అవ్యక్తఁదీయ అవ్వు చివ్వునడాయఁ జనులు గందరగోళమునుసరింప
సిగ్గు వెన్కడుగేయఁ జేటు ముందడుగేయ మోహమ్ము తలకెక్కి మురువుఁజూపఁ

తే. గీ. బళ్ళెరము బల్లమీఁదను మెల్ల నునిచి
తమలపాకులు దీసి హస్తమునఁ బూని
పొలఁతి తాంబూలమిచ్చునప్పు డొకవింతఁ
జేసె నావింత యేమని చెప్పవచ్చు ? ౧౯

వ. ఇట్లు తాంబూలం బొసంగిన గ్రహించి చన నుద్యుక్తుం డగునమ్మధుసూదనున కవ్వేశ్యమాత మరల నిట్లనియె. ౨౦

తే. గీ. తప్పుగాఁ జూడరేని నేనిప్పు డొక్క
మనవిఁ జేసెద ; దేవర మనవి చిత్త
గింపవలెఁ దప్పయిన క్షమియింప వలయు
దాసరుల తప్పు దండముతో సరికద. ౨౧

తే. గీ. వర్ణములలోన వృత్తిని బట్టిచూడ
మాకులం బెంతకేనియుఁ గాకులంబు
" తగిన యన్నంబు లోనికిఁ దగినకూర
దొరక " దనుసామెతకు మేమె గుఱుతుసుండి. ౨౨

మ. ధనమా ? లోపములేదు ; విద్యయును విూదాస్యమ్మునంజేసి కై
కొనె నీకన్నియ, రూపురేఖలకుఁ దక్కుంగల్గు మావారిలోఁ
గనుగీసై తగు హెచ్చుతగ్గు, గడువేడ్కన్ నాటి గోబోట్లకీ
తని వర్తింపఁగఁజేయకుండుటకు నెంతే నెంతు స్వాంతంబునన్. ౨౩

ఉ. పుట్టిననాఁటనుండి ధనమున్ గడియించుట కిచ్చలేదు నా
కెట్టులనైనఁ గాని ఘనులెల్లరు మెచ్చుటయే ధనంబు సీ !
పొట్టకునై కదయ్య ? పలుపోకలు పోవుట, ధాత పెట్టఁడే
పట్టెఁడుకూడు ? నన్నము నెపమ్మునఁ జచ్చినవార లుండిరే ? ౨౪

ఉ. ఏదెసనైన సత్పురుషు లెల్లరు మెచ్చెడి సత్ప్రవర్తనం
బూఁది క్రమప్రకారమున నుత్తమసమ్మతిగా ధనంబు సం
పాదనఁ జేయు టొప్పగును ; మాన్యులు మెచ్చనిద్రవ్య మేల ? పా
కీది గడింపదే ధనము ; కీర్తికిరాని ధనంబు కాల్పనే ? ౨౫

శా. ఏనే కాదు మదీయమైన కులమం దెన్నో తరాలాయెఁగా
నీ నీచున్ వినఁబోరు, చూడరు ; ధనం బీనీ ధనం బీయకే
పోనీ బ్రాహ్మణజాతిఁ దక్క నితరున్ భోగింపఁగాఁబోరు ; కా
దేనిన్ క్షత్రియజాతి, యన్యము 'ముదాశే' మాకుఁ జర్చింపఁగన్. ౨౬

ఉ. కాసుల నిత్తుమంచు నరకాసుల నిత్తుమటంచు పత్సర
గ్రాసమువచ్చు భూముల నొకానొక నిద్రకె యిత్తుమంచు నా

యీ సుత నెల్లవా రడుగ, నేమొకొ ? నామన మిచ్చగింప ; దే
దోసమొ కాని నా తనయతోడు సుఁడీ ! యనృతమ్ములాడినన్. ౨౭

ఉ. అందఱు కన్నివంకలను నల్లుచునుండునెకాని యెవ్వనిం
బొందుట కిచ్చగింప ; దదెపో, యని యేనును నూరకుందు ; మీ
యందున మాత్రి మిచ్చ గల దంచును సూచనఁ జేయుచుండు ; నే
"నందనిద్రాణూనిపం డిది" యటందును ; దా "నది కాదు కా" దనున్. ౨౮

తే.గీ. కాన దీనిని మీదాసిఁగా నొనర్చి
సంతసము పెరుమాళ్లకు సంఘటింతు
భాగవతులకై ంకర్యంబు భగవదధిక
సమ్మతం బని కాదె ? వైష్ణవమతంబు. ౨౯

వ. అన నయ్యాచార్యకవివరుం డద్దాని కిట్లనియె. ౩౦

ఉ. కోరినమాట మంచిదియె కోరఁగవచ్చును గోరినంత నే
నేరము గల్గునే ? వినుము నీదగుమాటకు నుత్తరంబు నీ
కోరిక లేకయే జగతిఁ గోరెడివారలు వేనవేలు నీ
వారసికాగ్రగణ్యులకు నర్పణ సేయుము నీదు పుత్రికన్. ౩౧

క. రసికతయన నెట్టిదియో యిసుమంతయు మాకు నున్న, యిటువంటి పనుల్
రసికులవి ; మేమయినచో రసహీనము మఱియు నిహాపరమ్ముల వెలియున్. ౩౨

చ. పర మటులుండఁగా వినుము భామిని ! "తానఁట, సత్కవీశ్వరో
త్తరుఁడఁట, మంచిచెడ్డలవిధమ్ము సమస్త మెఱుంగునట్టి ధీ
వరుఁడఁట, వేశ్యకన్యకకు వల్లభుఁడౌనఁట, యెంతవింతయో !
హరిహరి" యంచు లోకులను నాయపకీర్తికిఁ దాళఁజెల్లునే ? ౩౩

క. "ఎవరికినిఁ దెలియ" దంచును, సవరణఁ జేయకుము ; పిల్లి చయ్యనఁ దన క
న్నవ మూసి పాలుద్రావిన నెవరికిఁ దెలియకయ యుండునే ? కనుఁగొనుమీ. ౩౪

తే.గీ. అన్నియు నెఱుంగు ప్రోడవే యగుదువైనఁ
గాని యొక్కటివినుము నిక్కమగు మాట
ఎట్టి సంగతులైనను నిముడుఁ గాని
జారచోరత్వములు దాఁగఁజాల వెందు. ౩౫

తే.గీ. మఱి యిఁకేమన్న, నింకొకమాట వినుము
ఎట్టివాఁడైన నెలయాలి నెనసెనేని
యశము గంగనుబడఁ నపయశముపచ్చుఁ
గాన మాబోఁట్ల కిది మంచిగాదు నిజము.

క. అని పలుకుచున్న విప్రునిఁ గని "యీగతి మీరు పలుకఁగా నగునె? యశం
బున కేమి లోపమబ్బును? కనమే మును కవులకొక్క కతలు మహాత్మా?

సీ. ధనకామినీమణీజనలోలుఁడైనట్టి కాళిదాసున కేమి ఘనత దరిగెఁ?
చింతామణీవారకాంతాయుతుండైన లీలాశుకున కేమి లీల దగ్గె?
విధివిరామములేక వేశ్యాకాంతలఁగూడు శ్రీనాథకవి కేమి చేటు మూఁడె?
విత్తకాంతాధరాయత్తచిత్తుండైన ధూర్జటికవి కేమి దోస మబ్బె?

తే.గీ. గ్రంథములయందుఁ దాము శ్రీరంగనీతు
లెన్నియో చెప్పుదురుగాని యెంచిచూడ
వారకాంతలఁ దడవనివారు లేరు
కవులసంగతి సే నెఱుంగనిది కాదు. 3౯

వ. అదియునుంగాక విశిష్టాద్వైతసిద్ధాంతవిరుద్ధం బంటిరేని. 3౯

క. 'అడియ' నని కోరుచున్నప్పుడు కాదనఁబోరు వైష్ణవులు; తొండరడి
ప్పొడియాళ్వారొక మా నెలపడఁతిం గొనె; బ్రహ్మరథము పట్టరె? జియ్యల్. 

క. రసభరితములగు కావ్యము లసమానమ్ముగ నొనర్చి యఖిలజనులకున్
రసికత నొసఁగు సుకవులే రసికులు గా రనుచు మూర్ఖురాలికిఁ జెపుఁడీ. ౪౦

తే. గీ. సిద్ధమయినట్టి యన్నంబు, చేతికంది
నట్టి పరిపక్వఫలమును, నంగనామ
ణిప్రథమయౌవనమును బండితు లుపేక్ష
సేయఁగా రాదు చేసినఁ జెడును మీఁద. ౪౨

వ. అదియునుంగాక. ౪౨

క. భూదానము కన్యావిద్యాదానమ్ములు పరిగ్రహణయోగ్యమ్ముల్
గాఁ దెలియఁజెప్పుదురు మీ భూదేవతలే" యటన్న భూసురుఁ డనియెన్. ౪౪

క. కులమును దెలివియుఁ దేటయుఁ గలుకులయెడ ముందుఁ జూడఁగావలె నందుం
గులము ప్రధానమ్మగు నది కలియనిచో దానిఁ బొందఁగా రాదు కదా! ౪౫

తే. గీ. కాళిదాసాదికవులకుంగతికి మాకు
హస్తిమశకాంతరంబగు నది యటుండ
వారి లోనరించినట్టి సద్వర్తనములు
చేయవచ్చును జెడ్డలు చేయ రాదు. ౪౬

క. కవులకుఁ గలిగినరసికత కవనమునం దుపచరింపఁగా యోగ్యతరం
బవుఁగాక కులవిహీనలఁ గవయుటకా? యన్న వృద్ధ కనుఁగొనుచుఁ బలికెన్. ౪౭

క. కులభేద మెన్నఁగూడదు; తెలివియుఁ జేటయును గల్గుతెఱవలయెడ నీ
యిలలో "స్త్రీరత్నం దుష్కులాదపి" యనంగ వినమె? సూతకులేశా. ౪౮

క. "ఏజాతివారిఁగూడిన నాజాతియె యగును వేశ్య" యంచును విద్వ
ద్రాజులు వచించుమాటలనే జూటామాటలనుచు నెంచితిరి గదా? ౪౯

వ. అనిన నద్దానియుక్తినైపుణ్యమ్మున కచ్చెరువడి మాటలచే సంతోషపెట్టి చనువాఁడై
చిఱునవ్వు నవ్వుచు నాతం డిట్లనియె. ౫౦

తే.గీ. యోగమున్నను దప్పింప నొకరివశమె,
యుక్తిపై యుక్తులకు నంతముండదు గద?
మహి వినుట లేదె "మాటకు మాట తెవులు
నీళ్లకును నాచు తెవు" లను నీతిరీతి. ౫౧

క. అని పసికి పొంగ్గువోయిన పనియును రేపకడ వత్తుననియును నవ్వే
శ్యను నొప్పఁజేసి చనె నాతనిగృహమున కతఁడు శంకితస్వాంతుండై. ౫౨

వ. అట్లు చని యాతండు తనమనమ్మున. ౫౩

తే. గీ. నిదురఁబోఁగొట్టుఁ, గర్మము గా నెత్తికెక్కుఁ,
గలుపతఘటించుఁ గుండయుఁ గట్టియుఁ దన
చేతి కానఁగూర్చు నదిగానఁ జెప్పనగునె
వేశ్యకును నస్యమునకును భేదమిలను? ౫౪

ఉ. రాగములేకయే పయికి రాగముగల్గినరీతిఁ జూపుచున్
రోగముగల్గియున్ బయికి రోగములేదని బొంకులాడుచున్
సాగినయంతవట్టుఁ గడుఁ జల్లఁగ ద్రవ్యము దోచిపుచ్చు నీ
భోగముజాతి నమ్మఁటలు పోలవు గా! భువి నెంత వెత్తికిన్, ౫౫

సీ. మాయమాటలకు నమ్మిక మైన వ్యాఖ్యాత తులలేని పచ్చిబూతులకు బుంగ
యనుచితవ్యాపారమునకుఁ బెట్టినపేరు స్తుతిపాఠవాక్యసంతతికి వంది
పరమనోభిప్రాయహరణమ్మునకు నద్ద మనృతవాక్యముల కిమ్మైనకొంప
తనయానువిరచితావినయమ్ములకు ఛత్ర మఖిలదోషములకు నాలయంబు

తే. గీ. జెట్టుసరిమాటలకు నెల్లఁ బుట్టినిల్లు
నిఖిలధనసంతతులకు శనిగ్రహంబు
వెనుకముందును దెలియని పెట్టివెట్టి
విటులపాలిటి యమదూత వేశ్యమాత. ౫౬

ఉ. కావున వేశ్యమాత లనఁగా మటుమాయలమారిముండ ; లి
ట్లేవగ నైన లాలనము లిచ్చకముల్ పయిపూఁత కూరుముల్
కేవల సత్యరీతిగను గీల్కొనఁజేసి ధనమ్ము దోఁతు ; రీ
త్రోవ లెఱుంగమే ; బుధులతోడను సాగునె ? యిట్టివేషముల్. ౫౭

ఉ. జారసఖిన్ ఘనాంగనను జారునిఁ జోరునిఁ ద్రాగుఁబోతు నె
వ్వారును గీర్తి కాసపడువారలు కొంపకుఁజేర్పరాదు ; త
ద్ద్వారముఁ గార్యముండినను దామును ద్రొక్కఁగరాదు ; నిక్కమీ
తీరు పెఱుంగకున్నఁ గొని తేవలెనే ! యపకీర్తి యేరికిన్. ౫౮

ఉ. కావున నిట్టిసంగతులు గౌరవహీనులపెట్టె పొమ్ము లీ
త్రోవలు మంచి పూరుషులు ద్రొక్కరు, త్రొక్కిననారి మెచ్చ, ని
త్రోవలఁ గాలువెట్టనినరుండు మహాత్ముఁడు ; కాలుపెట్టినా,
కేవల నిందితుండు నపకీర్తి సతీమణికిం బ్రియుండునౌ. ౫౯

సీ. కొండమాచార్యపుత్రుండు రామామణి నెనసి నిర్భాగ్యుఁడై చనఁగలేదొ
నీలకంఠావధాని కుమారుఁ డలచంద్రముఖిఁగూడి మాన్యమమ్ముకొనలేదొ
హనుమంతరావు చేకొనినదత్తుఁడు సుందరినిఁగూడి కొంపమ్ముకొనఁగలేదొ
అల్లకృష్ణయమంత్రి యనుజుండు మణిమాలతోఁగూడి ముష్టి యెత్తుకొనలేదొ

తే. గీ. వీరలొక లెక్కయే ! జమీందారులెంద
రెంద అప్పులపాలగు టెఱుఁగఁబడదు ?
అమరుఁగాక హిరణ్యశృంగములు తనకు
వెలవెలఁదిపొందు పలుకష్టములకు విందు. ౬౦

క. అని మనమున ననుకొని, జరగినసంగతివలన సెట్టికీర్తి గలుగునో
యని సంశయించె నాతఁడు ; ఘనులకు నపవాదకన్నఁ గష్టము గలదే? ౬౧

తే. గీ. మనము చెడకున్నకతన నమ్మదనుఁ డతని
యింటిపంచకునైనను నేగకుండె ;
మనసు చెడఁగొట్టుకొన్న యమ్మగువ మిన్న
దాపునను గాఁపురమునె పెట్టె దన్వకుండు. ౬౨

తే. గీ. అంతఁ గొన్నిదినంబుల కఖిలజనుల
కపరిమితమోదదాయకంబై తనర్చె
సంతతామోదభారవిశాలనవర
సాలకలితమగుచు వసంతఋతువు. ౬౩

తే. గీ. 'ఇంట సతులను డించి యిట్లుంట మీకుఁ
బరువు గా' దని పోషితభర్తృకలగు
నారిపక్షము వహియించి పాంథజనులఁ
గూఁకలిడె ననఁ గోకిలల్ కూఁత లిడియె. ౬౪

సీ. అత్తతోఁ బోరాట మంది పోయినయట్టిజామాత తనుఁదాన సఖ్యపడియె
భార్యతోడ విరోధపడి పోయినమగండు మగుడ భార్యను బ్రతిమాలుకొనియె
సన్న్యసించుటకు నిశ్చయ మందిన విరాగి రాగాంధుఁడై తన రమణిఁ గవిసెఁ
గార్యార్థమై దూరగతుఁడైన సంసారి తత్తరమ్మున నూరిదారి పట్టె

తే. గీ. బ్రహ్మచారులు పెండ్లికై పాట్లఁ బడిరి
వేశ్యమాతలతోడను విగ్రహించి
నట్టి విటులెల్ల నద్దాని ననుసరించి
రహహ! యేమందు నవ్వసంతాగమమున. ౬౫

సీ. చిన్నారి పొన్నారి చిఱుతప్రాయపు వధూవరుల వివాహముల్ నెరపువారు
పచ్చియు రాని గుబ్బలకుల్కు గల గుబ్బెతలకు శోభనములు సలుపువారు
ముడివేయుటకుఁ దడావడిసిగల్ గల కుఱ్ఱలకు నుపనయనముల్ జరపువారుఁ
గ్రొత్తక్రొత్తగఁ గట్టుకొనిన లోగిండ్ల గృహప్రవేశమ్ముల నందువారు

తే. గీ. స్వామికళ్యాణమహములు సలుపువారు
గ్రామదేవత జాతరల్ గడపువారు

లలి వసంతోత్సవమ్ముల నలరువారు
నైరి ప్రజలెల్ల నవ్వసంతాగమమున. ౬౬

వ. ఇట్లు వసంతబుతువు చెలంగునెడ నొక్కనాఁ డమ్మనుసూనుండు సాయాహ్నం
బున శీతవాతపోతనిషేవణమ్మునకై యంతికోద్యానమ్మునకుం జని యచట సుధా
సైకతవిలేపనస్వచ్ఛం బగు నొక్కచప్పరం బధిష్ఠించి తదారామరామణీయకంబు
విలోకించుచు వికసితాంతరంగుఁడై యున్నంతఁ దదుపవనంబు నొక చెలిమిన్న
తదీయవివిక్తసందర్శనాభిలాషిణియగునబ్బాలామణికిఁ జెప్పిన నప్పుష్కాక్షియు,

సీ. తననవ్వుకన్నఁ జక్కని తెల్పు గల చల్వకండువా బుజముచక్కటి నటింపఁ
దనమేనికన్న మెత్తని క్రొత్తమల్లెపూవులు వేణినుండి జల్ జలనిరాలఁ
దనకాంతికన్న హెచ్చన నొప్పుబంగారు మొలనూలు కటిమీఁద మొనసియాడఁ
దనమోవికన్న నెఱ్ఱనిరంగు గలగాగరా పదమ్ములమీఁద రంగు లీన

తే. గీ. వలపు చిగురింపఁగోర్కెలు దొలకరింప
మనము పెనఁగొనఁ సందియం బినుమడింప
నతనిఁగనుఁగొను వేడుక లలవరింపఁ
దత్క్షణమయేగె నంతికోద్యానమునకు. ౬౭

వ. ఇట్లు చని తొదవ్వుల నాతనిం గాంచి సమీపమ్మునకుం జన సంశయించుచున్నంత.

సీ. బలుపసందుగ నొప్పు పైణీ తైకపైఁ బైఁటలో హారముల్ నీటుఁజూప
మలఁచినట్లున్న దండలఁ గ్రిక్కిఱిసి దండకడియమ్ము లోకవింతకాంతి నీన
మురువుఁజూపెడి ముద్దుమోవిపైఁ బ్రసరించు తళుక్కుముత్తెము తళ త్తళ నటింప
భ్రమ పుట్టఁజేయు పాదముల నొప్పెడినూపురధ్వనుల్ గతికి సారస్య మొసఁగ

తే.గీ. నెసక మెసఁగంగఁ గాంతి నద్దెసఁజెలంగ
ముసిముసినగవు మొగమున మొలకలెత్త
నల్లనల్లనఁ దనకడ కరుగుదెంచు
సుందరినిఁ గనె నమ్మధుసూదనుండు. ౭౦

వ. ఇట్లుగాంచి తదాగమనమ్మున కచ్చెరువడి యచ్చెలి కిట్లనియె. ౭౧

తే.గీ. పొద్దుగ్రుంకెను జీఁకటుల్ పొసఁగనాయెఁ
బొలుపుమీఱఁగ భూషణభూషితాంగి

వగుచుఁ దోడింతలేక యుద్యానమునకు
నేల వచ్చితి? చనిఁబూని బాలసాని! ౭౨

వ. అనుచు నొక్కింత స్మితపూర్వకమ్ముగ నడిగిన నక్కన్నె మిన్న యిట్లనియె.

ఉ. సెండియు నేపె ప్రస్తుమని వేగిరపాటున గంటయైనఁ గూ
ర్చుండడె యల్లనాఁడు పని యున్నదటంచును నేగి మీరు రా
కుండుటఁజేసి మిమ్ముఁగన నొయ్యన నొంటిగ నేగుదెంచితిం;
బండితులైనవారల కబద్ధము లాడుట భావ్యమే కదా! ౭౪

తే. గీ. నాఁడు మాయమ్మతోడ మీ రాడు యుక్తు
లకు సదుత్తరములు చెప్పుటకు నొకింత
దలఁచియును మిన్నకుంటి మాతల్లిఁ జూచి,
చెలువెలందుల పొందంత వెక్కసంబె? ౭౫

చ. కలయుట తప్పటంచుఁ బలుకం దగునే? మఱి వేశ్యకాంతలం
గలయుట లేదె? బ్రాహ్మణులు, గానమె వారిల, నన్యకాంతలం
గలయుట తప్పగాని వెలకాంతలఁ గూడుట తప్పు గాదు; తా
"వలచిన మేనమామసుతె వావియు కా" దని యందు రేమొకో! ౭౬

క. కులకాంతతోడఁ గూడినఁ గలదే మఱి తప్పిదంబు? గనుఁగొనఁడే మదిఁ
గులకాంతయు వెలకాంతయు నిలలో నొకతీరువారలే మనుజునకున్. ౭౭

ఉ. పాపమటంచుఁ బల్కితిరి పంచశిలీముఖబాణసంభవ
త్తాపముచేత బాధపడుతన్వి ననాదరణం బొనర్చినా
పాపముకన్న నన్యమగు పాపము లెక్కడె? యట్టిపాపమున్
బాపెడిపుణ్య లీచిఱుతపాపము గీపము లెక్కసేతురే? ౭౮

సీ. సంపెంగఁ బోలుపువ్వము గల్గునే? యొక్కటేఁటి కయ్యది వెనుపోటు గాక
తుహినాంశుఁబోలుపస్తువు గల్గునే? పద్మతతులకు నైధనతారగాక
మొగలిఁబోలెడి దళమ్ములు గల్గునే? కాలగపునకు షష్టాష్టకంబు గాక
గానమ్మువంటిసత్కల గల్గునే? వేటమృగముల కయ్యదియుఁ జు క్కెదురు గాక

తే.గీ. వలచి వలపింపఁగల్గిన వారముఖ్య
వంటివగలాఁడి గల్గునే? వనితలందు

తమమదికి వేఱురీతిగాఁ దట్టెఁగాక !
భూమిసురరాజ ! కవితాసతీమనోజ ! ౭౯

సీ. పండితపామరాపారమోదదము గానమ్ము మాపెట్టెలో సొమ్ము గాదె?
శుభకార్యములయందు సొంపు సంపాదించువిధి మేము పెట్టినభిక్ష గాదె?
మన్మతవేదాంతమార్గోపదేశమ్ము లనఁగ మాతలనె పుట్టినవి గావె?
మునిభీతిలో మునిఁగినరాజు నుద్ధరింపఁగ మమ్ముఁ జెప్ప చెప్పవలెఁ గాదె?

తే.గీ. సురతనైపుణ్యముల మదిఁజొన్పఁ రసిక
వరుల కందఱు మాతరువాతఁ గాదె ?
ఎన్ని విధములఁ జూచిన మన్ననలకుఁ
దగుదుమేకాని నిందకుఁ దగము మేము.

సీ. కామాగమాభ్యాసకలన మీకుఁ గవీంద్ర ! కామాగమాభ్యాసకలన మాకు
తత్తదంగస్ఫూర్తిమత్త మీకుఁ గవీంద్ర ! తత్తదంగస్ఫూర్తిమత్త మాకు
నవరసాలంకరణరతి మీకుఁ గవీంద్ర ! నవరసాలంకరణరతి మాకు
సనుమనస్కామోదశయ్య మీకుఁ గవీంద్ర ! సనుమనస్కామోదశయ్య మాకుఁ

తే. గీ. బరవశవిధానకౌశలపటిమ మీకుఁ
బరవశవిధానకౌశలపటిమ మాకుఁ
గాన మీకును మాకు నైక్యంబు తప్పు
గాదు ; వివరించి చూడుమీ కవివరేణ్య !

సీ. సరసపద్యావిశేషసక్తి మీకుఁ గవీంద్ర ! సరసపదవిశేషసక్తి మాకుఁ
జిత్రబంధశ్లేషసిద్ధి మీకుఁ గవీంద్ర ! చిత్రబంధాశ్లేషసిద్ధి మాకు
శుచికులోదయకృతస్ఫూర్తి మీకుఁ గవీంద్ర ! శుచికలోదయకృతస్ఫూర్తి మాకు
అభినవపాండిత్యవిభుత మీకుఁ గవీంద్ర ! యభినయపాండిత్య విభుత మాకు

తే. గీ. నన్నిటను మీకుమాకును నరసిచూడఁ
దొల్య మేగాని వర్ణభేదమొకఁడుండె
నింతమాత్రము భేద మదేరికైనఁ
గలదని యెఱుంగరే ? మీరు కవులుగారె ? ౮౨

వ. అదియునుం గాక. ౮౩

చ. అతికఠినప్రయాసమున నార్జనఁ జేసిన కామశాస్త్ర మే
గతిఁ జరితార్థ మౌను? కులకాంతలయం దది గూడ దంచు నా
రతికలయే వచించుఁ; బరభామల కంతటికాల మబ్బునే?
వెత యగుఁగాదె? లక్షణవివేకము లక్ష్య మెఱుంగ కుండినన్. ౭౪

తే.గీ. అనుచు నొకమాట కొకమాట కతుకకుండఁ
బల్కు, దరహాస మొనరించుఁ, బైటజార్చు,
మనములోఁగోర్కె వెలిజేయుమనుచు మరుఁడు
ప్రేరణముసేయ నాపఁగా నేరతరము? ౭౫

వ. అను నబ్బాలామణిసయుక్తికమ్ములగు వచనమ్ములకు సంతసింపుచు నతండద్దాని
కిట్లనియె. ౭౬

ఉ. ఎన్నఁడు నేర్చి తీవగల? నెన్నఁడు నేర్చితి విన్నమాటలన్?
మొన్నటిదాన వీవు సరిపో! యిపు డెంతటిదానవైతి? నిన్
బిన్నటినాఁ డెఱుంగుదును "బెప్పె పె మెమ్మె మె" యంచు నుండు వీ
వెన్నిట జాణవైతి, విపు డెవ్వనినైనను బుట్టఁబెట్టవే! ౭౭

వ. అని పలికి. ౭౮

సీ. రమణీమణీవిహార మెఱుంగనట్టినీవరుఁడౌటనే మది గరఁగ లేదొ
ధనకామినీమణీజనతత్పరత మంచి కాదనియే మది గరఁగ లేదొ
క్షణసుఖమ్మునకు యశమ్ము గంగను గల్పఁగా రాదనియొ మది గరఁగలేదొ
మనమీఁది తాత్పర్యమా వెలచెలి? కిట్టి దరుదనియే మది గరఁగ లేదొ

తే.గీ. కాని యక్కన్నె మిన్నకు లోనుగాక
చనియెఁ దనయింటి కాతఁడవ్వనము విడిచి;
క్రమముగాఁ గాని యింతమాత్రమున కట్టి
ఘనుల బుద్ధులు పెడమార్గమునకుఁ జనునె! ౭౯

తే. గీ. అతనిహృదయవిగంబు దా నరయకునికి
సిగ్గిలుచు నత్తలోదరి చింతగొనుచు
నాతఁ డేగినమార్గమ్ము నరసికొనుచు
నింటికే తెంచెఁ జిన్నవోయినవిధమున. ౮౦

క. దొరకక దొరకక సమయము దొరకినఁ బైఁబడక నే మృదువచనముల చేఁ
గరఁగింప నెంచ నగునే! కరఁగునె? నిప్పించుఁ జెప్పఁగా ఘృణ సుకటా!

క. అని యీగతిఁ దనమనమునఁ దనివారని కోర్కిలతలు పట్టములై మే
కొనఁగ నిలుపోపమిని గడుఁ గనికర మగురీతి గోఁపఁగా నున్నయెడన్. ౨

చ. కనుఁగొని తల్లి యిట్లను "సుఖమ్ముగ నుండఁగ లేక నెట్టి రీ
తిని నిటు గుంద నేటికిమదిం? గలవా? ధరణీతలమ్మునం
దున విటశేఖరుల్ పదులు నూఱులు వేలును లక్షలున్, ధనాం
గన లిటు నెట్టిఁ బూనుదురె? కాదనరె? సరివారు విన్నచోన్. ౩

ఉ. రమ్మనినంతమాత్రనె కర మ్మనురాగము మీఱ వచ్చువా
రిమ్మహి వేనవేలు గల; రిట్టి విటాగ్రణులం ద్యజించి నీ
విమ్మహిదేవసూను నలయింపఁగ నేటికి? రానివారలన్
రమ్మని పిల్వ వేడుకనరా? సరివారలు నవ్వకుందురా? ౪

చ. జనుల కనేకమార్గముల సంపద లేర్పడియుండెఁ గాని యౌ
వనమె ధనమ్ముగా మనకు వారిజసంభవుఁ డిచ్చె; నిట్టియౌ
వనమున లేనిపోనివలవంతలఁ గాలము వెళ్లఁబుత్తురే?
చినిఁగినచీర నమ్మకముఁజేసినఁ గొందురె? యెట్టివెఱ్ఱులున్. ౫

సీ. చిన్నదా, పెద్దదా? చెప్పు నీకన్న మాణిక్యము వేవేల్ గణించి పోసి
మొదటి కన్నెఱికమ్ము తుద ముట్టెనో, లేదొ మీనాక్షి గట్టించు మేడఁ జూడు
నీకన్న కన్నె చిన్నెలు గల్గెనే? కాంతి యొడలెల్ల బంగారుతొడవులాయె
నందమా, చందమా? యది యదృష్టమెకాక యలివేణి యెంతమాన్యము గడించె

తే. గీ. నేఁటి కేఁడాదియాయె నీకీడువచ్చి
గవ్వయైనను నీవల్ల గడనయెఱుఁగఁ
బాడి చెప్పిన నీకుఁ గోపమ్ము వచ్చుఁ
గష్టసుఖములు నీ వెఱుంగవు గదమ్మ? ౬

సీ. చక్కరవిల్కాని సామ్రాజ్యలక్ష్మి సాఁ బ్రక్కనున్నప్డు చూపట్టవలదె?
కేళికారీతిఁ జొక్కించువేళలను జంత్రపుబొమ్మ పోల్కెఁ గన్పట్టవలదె?
ఎదురుగాఁ దోతెంచునెడ విలాసంపుసంపదల ప్రోవనఁగఁ జూపట్ట వలదె?
చెలి పెంచుకొన్న గారంపుకీరంబునా భాషించునప్డు గన్పట్ట వలదె?

తే. గీ. విటుల మోహింపఁ జేసెడి వేళలందు
మచ్చుమంతులఁ బొమ్మనా మనల వలచె?
సాని సాని యనంగనే సంబరంబె,
వేరురీతులఁ దాని * సంసారి యనరె! ౯౭

శా. ఏరేవ్వానికినైనఁ గాని హృదయం బీరాదు వాఁ డెట్టివాఁ
డే యౌఁ గాక; యొకం డటంచు మన పేషా, సూత్రముం గట్టెనే?
బోయీవానికి నొక్కఁడే ప్రభువఁటే, బోగాల కొక్కం డఁటే
రాయం, డమ్మరో? నెత్తిఁబూని కులమర్యాదల్ విడం జూతురే? ౯౮

క. అని పలికెడి తనపలుకులు విని యనువిసకున్నయట్లు శైనయించుసుతం
గని యిట్లనుఁ గాగ్యమ్మన కనుకూలంబై వట్రోవ యాపటిలంగన్. ౯౯

ఉ. ఏల విచారమంద? వినుమీ! యయువారికి దగ్గరైనచు
ట్టాలఁట, పెండ్లియంచుఁ గడు దంబుగ మేళము రమ్మటంచుఁ దాం
బూలము నిచ్చి పోయి రెటుఁ బోతివో? నిన్ గనవార లెంతయున్
జాలము చేసి రిచ్చట, నెసం జనుదెంచునఁ టయ్యవారునున్. ౧౦౦

ఉ. వచ్చుట నిక్కమేని యయవారటకున్ సమయమ్ముఁ జూచి నే
నచ్చకబుచ్చకల్ గొలిపి యాదరముం గలిగించి నీయెడం
బొచ్చెము లేనికూర్మిఁ దగఁ బొత్తు లగింపఁగఁ జేతు నమ్మ; నీ
వుచ్చటఁ దీర్తు నీవిఁకఁ బ్రమోదముఁ జెందఁగదమ్మ! నెమ్మదిన్. ౧౦౧

చ. పరిచయ మెక్కుడైనపిదపన్ మఱి యెంతటివారికైన ము
ఖ్యరమగు మోహవారినిధిమగ్నులఁ గా నొనరింప వచ్చు నీ
వెఱుఁగవు గోల వాట, నిటు లెందఱు నెందఱు మోసపుచ్చి ర
మ్మరో? యిఁకఁ దక్కు నీతఁ దనుసానము మానుము వానసమ్మునన్. ౧౦౨

క. నీపాటయు నీయాటయు నేపుగ నొకనాల్గు రోజు లీతండు గనం
గా పాడఁగలఁడె ధైర్యం? చేపాటిఁకిఁ దన? బుద్ధిశౌర్యంగుఁడె? చెపుమా.

తే. గీ. మనకు మేళములకు వచ్చు ధనముకన్నఁ
బెగినవారలతోడ సందర్భములు ఘ
టించుటే ముఖ్యమగు లాభ మెంచి చూడు
మే మెఱుంగుదు మీలాభ మిందువదన? ౧౦౪

ఉ. మేళ మటంచు నేగునెడ మేలిమిసొమ్ములు లేనిదైన బల్
లీలలు లేనిదైన వెలలేమ పసందుగ నెర్వుసొమ్ములం
దాలిచి వేషభాషలఁ గనంబడినంత నె యెంత వారికిన్
బాళి మనమ్మునన్ మిగులఁ బాల్పడు నే మనుకొంటి వమ్మ గో? ౧౦౫

ఉ. ఇంతియకాక యున్నఁ దమయింట నెసంగెడి సుందరాంగులో
కాంతలకన్న నెక్కుడగు కాంతలమే మన ? మెంత చక్కనౌ
కాంతకుఁ గాంతుఁడైన మనకాంతలఁ గన్గొని మోసపోవు; నా
నింతకు ముఖ్యకారణము నెన్నఁగ మేళమనుష్య కోమలీ. ౧౦౬

క. నవనాగరికులు గొందఱు శివశివ! మన మేమి తప్పుఁ జేసితి మొ "శుభం
బవు నెడ మేళమ్ములు పిల్వవల" దటంచును బ్రతిజ్ఞఁ బట్టి రఁటమ్మా. ౧౦౭

క. "మేళమునకు బదులుగ వీణాలాపమ్ములకు మోదమందఁగ రాదే ?
హేలమెయిఁ బాడువైణికు లేలా భోగాలకన్న నెసకం బిడగో?" ౧౦౮

క. వీరల కిచ్చెడి ధనమున నాఱువపా లిడిన వార లధికామోద
శ్రీ రాణింపఁగఁ బాడరె ? వారాంగనలేల? పో ! వివాహమ్ములకున్. ౧౦౯

ఉ. వారలలో శతాంశమును బాడఁగ లేరది యట్టులుండ సిం
గారము లూని వచ్చిన నెగాదిగఁ జూచి మహాంతవారలున్
ధీరత మాని ద్రవ్యమును దేహమునుం జెడగొట్టుకొందు రీ
వారసఖీసమన్వితవివాహము లేరికి ము ప్పొనర్పవే" ౧౧౦

క. అని సభలు చేసి లెక్చెరు లనేకములొనర్చి "మేళ మరుదెంచినచోఁ
జను దేరము పెండ్లికిమే," మనికొందఱు నిశ్చయించి రని వింటేఁజూమీ. ౧౧౧

క. "కానిండు మానునె ? యనూచానాచారము" లటంచు సభ్యులమాటల్
వోనాడి పెండిలికి మేళానకుఁ దాంబూల మిడి రెలమి నీసామల్. ౧౧౨

క. అని కూఁతునకుం జెప్పిన విని బాలామణియు "నెప్డు పెండిలి యగు" నం
చును నెంచుచున్న నాలోనన నె వచ్చె వివాహమును ఘనంబుగ నంతన్. ౧౧౩

తే. గీ. చుట్టపక్కాలతో బలుసొబ గెలర్పఁ
దరలి వెడలిరి పెండ్లికందఱును గలసి
ముఖ్యబంధువు లగుకతమునను బెండ్లిఁ
జూడఁగా నేగె నమ్మధుసూదనుఁడును. ౧౧౪

క. వాగ్దేవుపసంశభవ! సురరాడ్రమణీయవిభవ! కవిరాజనుకవితా
లిడగ్రిసనా! కల్పావనిరుడాగ్రిజసమానదానగోచిష్ణుమతీ! ౧౧౫

ఉ. వేంకటరాయసోదర! నవీనసుమాస్త్ర! పురారికామినీ
కింకర! పీఠికానగరకీర్తితమందిర! పద్మనాభమా
పంకజభాస్కరా! సుకవిబాంధవసంయుతసౌధభూమికా!
వేంకటరత్నమంత్రిమణి! విశ్వజనీనకలాగ్రిణీమణీ! ౧౧౬

మాలిని. సుకవికమలమిత్రా! సుందరాకారచైత్రా!
వికచకమలనేత్రా! విశ్వసౌమిత్ర్యపాత్రా!
ప్రకృతసుకృతకృత్యా! పండితగ్రామనుత్యా!
సకలసచివగణ్యా! సజ్జనస్తుత్యగుణ్యా! ౧౧౭

గద్య.

ఇది...శ్రీతిరుపతి వేంకటేశ్వరప్రణీతంబైన
కేవలకల్పితంబగు శ్రవణానందంబను
మహాప్రబంధమునందు ద్వితీ
యాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ



(౧౭) వ పేజీలో * పూరకోనె - ఇది గ్రామ్యము.

(౨౭) వ పేజీలోని * (సంసారి) యను పదము లోకోక్తి కనుకరణమనిగాని అచ్ఛిత్ర్యయాంతమగు సంసారశబ్దముపై ... చేసికొనిన రూపమనిగాని గ్రహింపవలయు.

ఇందుకుఁ బ్రయోగము. వైజయంతీవిలాసములో. 'ఏ మనందునుముసలాపె యేవివేకి.'

శ్రీరస్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్రవణానందము

## తృతీయాశ్వాసము

క. చతురకవితావిద్యాలంపట ! ఆజన్మప్రకృష్టభాగ్యోదయ ! దు
ర్ఘటకార్యసంఘటక ! వేంకటగిర్యాత్మామాత్య ! సుకవికమలాదిత్యా !

వ. అవధరింపు మనంతరంబు. ౨

చ. జరిగె వివాహ మద్భుతరసప్రసరత్కలకంఠకంఠభా
స్వరతరుణీమణీనటనసంగతమంగళవాద్యఘోషవి
స్ఫురితదిగంతరాగతవిశుద్ధచరిత్రధరాసురాధిరా
జరుచిరమంగళశ్రుతిరసప్రథితప్రమదప్రదంబుగన్. ౩

సీ. ఒకచోట సకలవైదికసంతతులగోష్ఠి యొకచోటఁ బండితపరికరగోష్ఠి
యొకచోట సుకవిరాణ్నికురంబముల గోష్ఠి యొకచోట మంచివైణికులగోష్ఠి
యొకచోట సరసగాయకవతంసులగోష్ఠి యొక్కచోటను వారయువతిగోష్ఠి
యొకచోట నైతిహాసికకథారసగోష్ఠి యొకచోటఁ బారిహాసికులగోష్ఠి

తే. గీ. యొక్కచోటఁ జిరంటికాయువతిగోష్ఠి
యొక్కచోటను భటరాట్సముదయగోష్ఠి
యతిశయిల్లఁ గరిమమ్ముగా నైదురోజు
లును జెలంగె వివాహమ్ము ఘనులు మెచ్చ. ౪

ఉ. ఒక్కపు డొక్కవేషము మఱొక్కపు డింకొక వేష మింక నొ
క్కొక్కపు డొక్కవేషమును నొప్పుగఁ దాల్చి విలాసయుక్తవా
చొక్కపుఁ బైఁడిబొమ్మయనఁ జూపఱు లాసను జెంద బాల దా
నెక్కుడు నేర్పుగా నభినయించు సభాసదు లెల్ల మెచ్చఁగన్. ౫

శా. ఆనాట్యాభినయమ్ము లారసకచఃపార్పిరంభసంరంభ మ
త్యానందం బొడఁగూర్ప సభ్యజను "లయ్యారే! బళీ! మేలుమే!
లీనారీమణి పేరదేమొ? యహహా! యీబాలయా రెద్దియో
యీ నాట్యం గనఁబోము దీని కెనయా నేణాక్షి నింకొక్కతెన్." ౬

వ. అందు నపరిమితానందంబునఁ గొందఱు సాము సెట్టిరి.

చ. అసమగసాధ్విలో నభినయమ్మను తెప్ప సహాయమూని మా
నసములు కేళి సల్పఁగ మనమ్ముల వెంటనె యిందిరియాళి సం
తసమున లేచిపోవఁగ సదస్యులు చిత్రపుబొమ్మలైరి నీ
వసఁ గనుఁగొన్నమాత్రన సెబాసు! సెబాసు! సరోజలోచనా. ౭

శా. భావంబా! సొగసా! రసప్రసరమా! పాండిత్యసందర్భమా!
హావంబా! స్వకపోలకల్పనములా! వ్యంగ్యప్రధానత్వమా!
నీ వేపండితునొద్ద నేర్చితివొ కానీ నీరజాతేక్షణా!
యీవే రంభవుగాక రంభయన వేఱే లేదు చర్చింపఁగన్. ౮

వ. ఇదియునుం గాక.

సీ. ఆబాల ననురక్తినంది మాఁడనివారు చూచి మోహాబ్ధిలోఁ జొరనివారుఁ
జొచ్చి మారునిబాధ సొక్కి వాపిలనివారు వాపిలి లోపల సిగ్గుపడనివారుఁ
బడియును వారలబసకుఁ జననివారుఁ జనియు "మామాట" యంచననివారు
నని విఫలత్వంబుఁ గనకయుండినవారుఁ గని మదిలో నీర్ష్యఁ గననివారు

తే.గీ. నూటి కొకరైన నచ్చటి నీటుకాఁడె
కాండ్రలో మందునకునైనఁ గానరారు;
పెద్ద పెద్దల మనములే బిగువు చెడఁగ
వారలకు నట్టులుండు టబ్బిమ్ము గాదు. ౧౧

చ. ఇది యిటులుండ నమ్మదిత యేసమయమ్మున నైన వీలుగా
నదను తటస్థమైన యపు డమ్మధుసూదనుతోడ హాస్య మొ
ప్పిదముగఁ జేయుఁ గన్గొలుపుఁ బ్రేమ చలిర్పఁగ గోట గీఁటుఁ దా
బదు లొనరింపఁ డాతఁ డొకపట్టునసైన నదేమి చిత్రమో! ౧౨

వ. ఇట్లు వివాహంబు సలక్షణంబుగాఁ జేసికొని పెండ్లివారేగు నయ్యవసరమ్మునం
దత్పురసమీపమ్మున: ౧౩

సీ. ప్రాఙ్నదీతరణతంద్రాళుపాంథాహూతనావికప్రతివచోరావకంబు
ఆనీయమానమీనాకులీభవదనేకానాయకరధీవరాకులంబు
అంతకీపాగతానంతగోగోపాలకాయ్రసనద్వారికాగణంబు
వికసత్కుసుమపుంజవిహరమాణనవీనమలయమారుతపోతమానితంబు

తే. గీ. అపరగోత్రోవిహారాగతాసన్నాన
హూణమిథునావలోకనాహూయమాన
హాలికాన్యోన్యభాషణవ్యాకులంబు
చేతము గరంచు నొక్కధునీతటంబు. ౧౪

తే. గీ. కాననగుటయు వారు భాస్కరుఁడు చరమ
గిరి సమీపమ్మునకుఁ జేరనగుటయును
దత్తరమ్మున నౌక లందఱును నెక్కి
దాఁటసాగిరి నావికుల్ దాఁటఁజేయ. ౧౫

తే. గీ. "వారకాంతనుగూడ నీవంటివాఁడు
కర్హమా" యని వారుణి యధికకోప
శోణదృక్కోణయైతన్నుఁ జూచుకతన
నో యనఁగ సూర్యుఁ డారుణ్యమొందె నంత. ౧౬

తే. గీ. పద్మినీకాంత యపరదిగ్భామఁగూడఁ
గాఁ జనెడి కాంతుఁ దా బలాత్కారముగను
లాగ, జాఱిన రక్తచేలం బనంగ
సంజకెంజాయ దోఁచె దిక్సంధులందు. ౧౭

తే. గీ. వారకాంతను దవిలి తా వసువిహీనుఁ
డగుచు నిచ్చోటనిఁక నుండఁదగ దటంచు
వ్రీడచే సూర్యుఁ డస్తాద్రి వెన్కఁ జేరె
రిక్తులకు వారకాంతలు రిపులు గారె ?

శా. జారెన్ సంజ, పతత్రిసంఘములు వృక్షవ్రాతనీడమ్ములన్
దూరెన్, హాలికజాతి యిండ్లకడ కత్యుచ్చైరయం బొప్పఁగాఁ
జేరెన్, మన్మథుఁ డాశుగమ్ములను నిస్సీమప్రభావమ్మున
న్నాటెన్; భర్తలరాఁక చిత్తసరణిన్ గోరెన్ వధూసంతతుల్. ౧[illegible]

సీ. చోరసంస్తృత్యసాధారణాధారంబు జారసాంగత్య కేదారభూమి
ఘూకలోకాలోకచాకచక్యంజనం బేకాకికోకశోకాకరంబు
దీపావళీమహాటోపసంధానంబు నక్షత్రవజ్రశాణఫలకంబు
చాక్షుషజ్ఞానపరిశమనాధిదైవంబు కృషికృతితతిసముత్కృష్టవిఘ్న

తే. గీ. మఖిలమార్గాపరోధ బ్రహ్మగ్రహంబు
నుచ్చభూనీచభూసమానోపకరణ
మపరిమేయం బఖండఁ బనంతమగుచు
నాక్రమించెఁ దమంబు దిక్చక్రమెల్ల.

తే. గీ. అచ్చటచ్చట నొకటొక్కటై గణింపఁ
దగిన నక్షత్రము లగణ్యదశ సహించి
తమకు నుపకారకంబగు తమము కొంత
పో నడంచెఁ గృతఘ్నుని పోల్కి నపుడు.

సీ. కమలినీముఖవిలాసముల కెవ్వాని దీప్తిప్రచారంబు సుప్తిప్రదంబు
కైరవిణీవక్త్రికలన కెవ్వాని యాగమన మవ్యభిచారకారణంబు
చంద్రికాపక్షితృష్ణావ్యాధి కెవ్వాని ప్రాప్తి నిర్వ్యాజదివ్యౌషధంబు
కోకీమనోనంతశోకాబ్ధి కెవ్వాని యుదయంబు పర్వచంద్రోదయంబు

తే. గీ. మానినీజనమానహానాని కెవని
రాక నళినీమనోనాథు రాక, వివహి
జనుల కెవ్వాఁడు ప్రత్యక్షశమనుఁ డాతఁ
డుదయమందెను జంద్రుఁ డత్యుచ్చుఁడగుచు. ౧౯

తే. గీ. ఇటుల వెన్నెల లెల్లెడ నెసక మెసఁగ
గచ్చు చేసినయట్లు జగంబు మెఱసె
నదిని దరియించి సాము లందఱు ననేక
మార్గముల నేగ సాఁగి రమందగతుల. ౨౦

తే. గీ. అన్న దీతీర సౌభాగ్య మరసికొనుచు
మోదమందుచు నమ్మధుసూదనుండు
తా నొకఁడ యేగుచున్న యత్తటిని బాల
వెనుకఁ జనసాఁగె నిదివేళ యని తలంచి. ౨౧

సీ. మైక దాఁటియు బనారసుకండువా దాఁటి గబ్బిగుబ్బలకాంతి గంతు లిడఁగ
గాగరా దాఁటి పైఁ గట్టుపుట్టము దాఁటి తొడలయందం బడావడి నొనర్పఁ
గర్ణమ్ములను దాఁటి గండస్థలము దాఁటి కమ్మలకాంతి యాగడముఁ జూపఁ
దలదాఁటి మొలదాఁటి తళుక్కుమీఱెడి మేల్మిబంగారుజడ బరాబరులు సేయఁ

తే. గీ. బాహ్యగతవృక్షగళితపుష్పపరికీర్ణ
మై శుకపికాళికలకూజితాభిరామ
మై మలయమారుతోపేతమై తనర్చు
నట్టి యాయేటియొడ్డున నరిగి యరిగి. ౨౫

సీ. చెట్టుచెట్టునకు విచ్చినపుష్పజాలంబు వర్షించు వలిపిల్లవాయువులకు
నడుగడుగునకుఁ బల్లవాంతరమ్ములనుండి కెరలి పైఁ బడు చంద్రికిరణములకుఁ
దేపతేపకు దిమ్మదిరుగ ఝుమ్మని మీఁదఁబడి హళాహళిసేయు భ్రమరములకు
మాటిమాటికిఁ గామమంత్రముల్ తెనిఁగించి విప్పిచెప్పెడి శుకపికములకును

తే గీ. గెరలి యన్యోన్యమును రతిక్రీడ సల్పి
కోరికల కీరిక లొసంగు శారికలకు
ధైర్యమును ధారవోసి తత్తటమునందు
మెల్లమెల్లనఁ బరుగిడుఁ బల్లవోష్ఠి. ౨౬

శా. వన్నెల్ గుల్కెడి నవ్వునెమ్మొగముతో వాలారు లేఁజూపుతో
సన్నంబై యసియాడు నెన్నడుముతో జానైన చన్దోయితోఁ
గన్నుల్ చల్లఁగఁ జేయఁజాలు వగతోఁ గంపించు మైదీవతో
వెన్నాడంగల వేణికాభరముతో వెన్నాడెఁ దా నాతనిన్. ౨౭

సీ. చిన్నివన్నెలమోముచెల్వు వడ్డి యొసంగు చిన్నారిపొన్నారి చెమటగాని
వాయాసమున నెప్ప ల్లల్లనల్లన నార్చు శ్రీయుతంబగు కన్నుఁ దోయిదాని
నొలయు నిట్టూర్పు వాయువులచేఁ దబ్బిబ్బులై యుబ్బు పెన్గుబ్బ లమరుదానిఁ
గరఁగి నీరై నాసికను జాలువాఱుసిందూరంపుతోరంపుసొరుదానిఁ

తే. గీ. గలకలధ్వాన లొలయఁ జొంకమ్ముపిఱుఁ
జాఱు మొలనూలుగల కటిస్థలముదానిఁ
గందియున్నట్టి పాదయుగంబు దానిఁ
గనియె మధుసూదనుండు వెన్కకును దిరిగి. ౨౮

క. కనినంతనె తనమనమున ఘనమైన వికారరీతి గనుపట్టుటయున్
దనలోఁ దా నిట్లని యనుకొనియె సమస్తంబు నెఱుఁగు కోవిదుఁ డగుటన్. [illegible]

సీ. పగలు భార్యను బట్టి పడఁగొట్టు మొక్కొపి భృత్యుఁడై చరియించు రేయియందుఁ
బగలు స్త్రీ యన శత్రువుగఁ జూచు విజ్ఞాని నిశియందుఁ బరమాత్మనియతిఁ జూచుఁ
బగలు సన్న్యాసమే "బహుబా" గనెడి వాఁడె రాతిరి తనదుభాగ్యను స్మరించుఁ
బగలు "వివాహంబు వద్దుప" ద్దనుచుండి పెండ్లికై రాతిరి వేర్మి గోలుపుఁ

తే. గీ. గాన నెటువంటివాఁడైనఁ గాని రాత్రి
యేకతమ్మున స్త్రీ గాంచి పోకె నేనిఁ
దత్తరం బంది పగవశాయత్తుఁ డగుచుఁ
గోర్కెలిగురొత్తఁ బైఁబడఁ గోరకున్నె ? ౩౦

తే. గీ. అనుచుఁ బరిపరి విధముల నతఁడు తన మ
నంబులో నూహసేయు, జ్ఞానంబుగల్గు
వారల కొకప్డు వికృతి చేకూరుఁగాక
యితరులం బోలెఁ దుందుడుకెనయఁ బోరు.

వ. ఇట్లతండు డోలాయమానమానసుం డగుచు మెల్ల మెల్లన చనుచున్నంతఁ నబ్బాలామణియు,

క. పిలిచి యిటులనిచు ముగ్గులు పలుకఁగ "మీతోడఁ గలసికొనుటకునై నే
నలసి చనుదెంచితిని నావలనైనను జూడ దిది నెబానన రావే ?

క. మావారలు కడుదూరముగా వచ్చుచున్నవారు కావున మిమ్మున్
నే వేఁడెద నిచ్చోటన్ మావారలు వచ్చుదనుక మసలుట కొఱకున్. ౩౮

వ. అనిన నాతండును బ్రతిఁజెప్ప నేరక వల్లెయని యచ్చోఁ గూరుచుండుటయు నక్కన్నెమిన్న యాతని పజ్జకుం జేరి యిట్లనియె.

చ. సరసుఁడ వంచు నెంతయును జాతురి గల్గినవాఁడ వంచు నుం
డగుఁడ నటంచు నిన్ గని యనన్ గదియన్ గమకింప నాశయిన్
గరుణ యొసంగ వాయె నిది కాముకధర్మమె ? కోరుదాని నీ
వగుస ననాదరింపఁ దగవా ? మగవారల కెందు" నావుడున్. ౩౯

క. "మగువా ! కాముకులగు నమ్మగవారికి నీవు చెప్పుమాటలు సరిగా
దగుఁగాని మమ్ముబోఁట్లకుఁ దగునా ? చెప్పు"మన నిట్లతనికనెఁ జెలియున్.

తే. గీ. తత్కరస్పర్శతస్స్ఫురదుత్తరళచిత్స్ర
వణములను బీజమునఁ బునర్భవము నొంది,
యంతలోవృద్ధిఁ జెంది కొండంతయగుచు
నాతనికిఁ గ్రోరలోనఁ బ్రత్యక్షమయ్యె. ౫౩

సీ. నడచు నేకాని యానడచు మార్గం బేడ కేగునో యాతని కెఱుక లేదు
చూచు నేకాని యాచూచు పదార్థము లెవ్వియో యాతని కెఱుక లేదు
తలఁచు నేకాని యాతలఁపులో సంగతి యెద్దియో యాతని కెఱుక లేదు
నవ్వు నేకాని యానవ్వు నవ్వుట కేమి హేతువో యాతని కెఱుక లేదు

తే. గీ. పలుకు నేకాని పిలిచినవార లెవరొ
యెంతమాత్రము నాతని కెఱుక లేదు;
ఏమి చెప్పుదు! నంతలో నింత యయ్యె
నాతని యవస్థ యా ధూమకేతు వలన. ౫౪

క. వివిధములగు సందియములు వివిధములగు కోరికలును విభ్రమగతులఁ బెన్
గవిసి కొలువంగ నాతఁడు భవనమ్మును జేరె జిల్లపడిన మనముతోన్. ౫౫

ఉ. చందురుఁ జూచి యుల్కిపడుఁ, జల్లనిగాలికి నెట్టఁజెందు, నే
చందము నందముం గనఁగ నైఁపఁడు, నిద్దురఁ జెందనోపఁ డా
సుందరిచందముల్ మదిని జొన్పి యసాధ్యములైన కోరికల్
సందడిఁ జేయు మందుని పసందునఁ గుందుఁ గవీంద్రుఁ డెంతయున్. ౫౬

ఉ. "వేసవి మల్లెమొగ్గలకు వియ్యపురాలు రదాళి, నాసలో
వీసము గాదు గంధఫలి, వేల్పు మిటారుల తోడికోడ లౌ
రా! సఖి, దానిఁ బోల్పఁదగవా? యితరాంగనలన్, సెబాసు! బా
లాసతిఁ బోలఁగల్గు నవలా భువిలో నహి లేదు లే" యనున్. ౫౭

వ. అని పట్టరాని తమకమ్మున.

శా. వెన్నన్ జెంపలగొట్టు మైనునుపుతో, వింతైన కెమ్మోవితో,
సన్నల్ సేసెడి ముద్దుకన్నుఁగవతో, జాఱైన పయ్యంటతో,
గన్నేరుంబువు గాగరా సొబగుతోఁ గామించి దోతెంచు నిన్
గన్నారం గని ముచ్చటాడఁగల భాగ్యం బెన్నఁడో? కోమలీ. ౫౮

సీ. పలు కొక్కటియె సేయుఁ బదివందల వరాలు వాలుఁజూపులు రెండు వేలు సేయు
నగ వొక్కటియె సేయు నాల్గువేల వరాలు విఱ్ఱవీఁగుట లాఱువేలు సేయుఁ
బద మొక్కటియె సేయుఁ బదివేల వరహాలు లావణ్య మది యొకలక్ష సేయుఁ
బలుసోయగమె సేయుఁ బదిలక్షల వరాలు కులుకుగుబ్బలతీరు కోటి సేయు

తే.గీ. ముద్దుగులుకెడి నెమ్మోము మూఁడుకోట్లు
నాసనాబ గెన్న డెబ్బదినాల్గుకోట్లు
నుదుటి సిందూరనామమ్ము నూఱుకోట్లు
నీకు వెలఁజెప్ప శక్యమే? నీలవేణి. ౬౦

సీ.*కలికిరో! మెత్తనై యలరు నీ మే నొక్కసారి గిల్లినఁ బాలు గారకున్నె!
యబలరో! ×మించులై యలరు నీచూపులు సోకినంతనె మసిచొక్కకున్నె! ×
పొలఁతిరో! మృదులమై యలరునీ కెమ్మోవి నొక్కినంతనె తేనె చిక్కకున్నె!
చెలియరో! నీదుకౌఁగిలి యొక్కత్రుటియైనఁ బడసిన రస ముట్టిపడక యున్నె!

తే. గీ. మగువ! నీతోడ నొకమాఱు మాటలాడ
సరసకవితావిశేషంబు మొఱయకున్నె?
ముదిత! యొకసారి నీకనుల్ ముద్దుగొనిన
బ్రహ్మకైవల్యపదవి చేఁబడక యున్నె? ౬౧

సీ. తడబాటుచేతఁ జే యొడిసి పట్టి 'కటాక్ష ముంచుమా' యన నాలకించనైతిఁ
దుమ్మిన విచ్చు తుందుడుకు గుబ్బలఁ గౌఁగిలించఁ బూనిన సమ్మతించనైతిఁ
గలకండకన్న మిక్కుటమైన రుచిగల్గు కెమ్మోవి రుచులారగించనైతి
వెడవింటివాఁడు ఉవ్విన బాణములఁ జాల వగలఁ బొందిన జాలిఁ దగులనైతిఁ

తే. గీ. బవలుచెయి పట్టి పిలిచినఁ బలుక కట్టి
చాన నమసన చీఁకటిలోన నీలి
చీరఁ గట్టినతఱి సన్నఁజేయు నెట్టి
పగిది నేఁ గోలుపోతి దైవంబ! నేఁడు. ౬౨

చ. కనుఁగవ కింపు గల్గి తగు కామకలాభ్యసనంబు గల్గి యౌ
వనమున లేఁత యయ్యు రసభావములం గడుఁ బెద్దయై తనం
తన వలపున్నదైన వనితామణి యెవ్వనికబ్బుఁ? బ్రాగ్భవం
బునఁ దులలేని పుణ్యములు పూవులు పూచి ఫలింప కుండినన్. ౬౩

చ. జిలిబిలిపల్కులన్ సొగసుఁ జిల్కెడి ముద్దులఁ దారుమారులన్
వలపులచోద్యముల్ మిగుల వన్నెలఁ జిన్నెలఁ గల్గు కౌఁగిలిం
తలు బ్రతిమాలుటల్ కసరి తప్పులువట్టుటలుం దెలంగుకాం
తలరతమే రతంబు ; మఱి తక్కినవెల్ల రసాతిదూరముల్. ౬౪

చ. పలచినలేమఁ గూడుటయె భాగ్యము, భార్యలవల్లఁ బుత్త్రసౌఖ్యం
బలవడ ; దన్యకాంత లనఁగా, మఱి తల్లులంటిరారు ; వే
శ్యలకిది సున్న ; యొక్కయెడ సంభవ మంటెన నట్టివేశ్యతోఁ
గలయుటకన్న వేఱొకటి కల్గునె ? స్వర్గము మోక్షముల్ భువిన్. ౬౫

ఉ. తానఁట, వేశ్యకాంతయఁట ! తానయి తాఁ బెనుగోరు నంట ! యొం
టేనియు ముద్దులాఁడి యఁట, యీడును జోడఁట ! ఖానిగ్గైనఁ దా
మానఁ గలాఁడె ? వేయి పయిమాటలు సెప్పఁగ నేర్పుఁగాని ; యే
మైనను దీనిఁ గూడవలదా ? యిలఁ దా జనియించి నందుకున్. ౬౬

సీ. కలుగనే కలుగదు కలిగె నేనియు బ్రాహ్మణునకు శూద్రస్త్రీగమనము గల్గఁ
గలుగనే కలుగదు కలిగె నేనియుఁ బండితునకుఁ బరస్త్రీగమనము గల్గఁ
గలుగనే కలుగదు కలిగె నేనియును రాజునకు దాసస్త్రీగమనము గల్గఁ
గలుగనే కలుగదు కలిగె నేనియుఁ గవీంద్రునకుఁ బణ్యస్త్రీగమనము గల్గఁ

తే. గీ. గలుగ దొకవేళఁ గలిగినఁ గలుగు మునుల
కప్సరస్త్రీగమన మని యనుట వలనఁ
గవులకును వేశ్యలకుఁ దప్పుగాదు చెలిమి ;
దానిలో నపరియత్నసిద్ధ మిదికాదె ! ౬౭

ఉ. కోరినదాని మాను టది గొప్పవిశేష, మిఁకట్టిపూరుషుం
డారయ లేఁడు నూటి కొకఁడైనను, గోటికి నొక్కరుండు చే
కూరునొ, లేదొ ? తా నగుచుఁ గోరెడి పూరుషుఁడన్న నెట్టివాఁ
డై రసహీనుఁడై జగమునం దపహాస్యతఁ గాంచకుండునే !

సీ. తనకుఁ దానై వండుకొని తిన్న నద్దియన్నంబు గాఁదద్ది సున్నంబు గాని
తనకుఁ దానై వేసికొనిన నయ్యది పీడియమ్ము గాదది పడియమ్ము గాని
తనకుఁ దానై పెట్టికొనిన నయ్యది మంచికొప్పు గా దది బ్రాంతచెప్పు గాని
తనకుఁ దానై చెప్పుకొనిన నయ్యది సుప్రతిష్ఠ గా దది యపప్రతిష్ఠ గాని

తే. గీ. తనకుఁ దానయి పొంద రమ్మనుచుఁ గాంతఁ
గోరునది నోరుగాదు పైజారుగాని
యప్రయత్నసిద్ధమ్ముగ నబ్బినట్టి
పొందు లోడఁగూర్చుఁ గాదె పెంపొందు సుఖము ! ౧౯

. కవితయు వనితయుఁ దనయంత వలచి వచ్చిన ముదం బొదవఁ జేయును ; మ
క్కువ లేక బలాత్కారంపు విధమ్మున వచ్చినదియ పో ! దుఃఖమిడున్. ౨౦

. ధనకాంతామోహమ్ములు జనులకు స్వాభావికములు జగమున; నెవఁ డీ
ధనకాంతామోహమ్ములఁ గన కుండునొ వాని శివునిఁగా నెన్నఁ దగున్. ౨౧

వ. అని మఱియును. ౨౨

మ. తగునే ? సత్కవి నైన నాకు ధనకాంతాసంగమం, బీపని
న్నగరే ? పండితులైనవారు విని నన్, నాకేమి యౌ ? నవ్వినన్
మగుడ న్నవ్వెద వారి నంచు మది నిమ్మాడ్కిం బ్రశంసించు నా !
"తెగితే లింగఁడు రాయి" యంచను జనోక్తి న్నమ్మె నేమో కదా ! ౨౩

ఉ. కాంతల నమ్మరాదు నెలకాంతల నంతకు మున్నె నమ్మ రా
దెంత విరుద్ధ ముండునె ? ఛీ ! నెలకాంతకు మోహ ముండునే !
వింత గదా ! జగమ్ములను వేములతీయఁదనంబు, లింతకుం
గొంత మనమ్ములో నరయఁ గూడదె ? తుందుడు కింత చెల్లునే ! ౨౪

*ఉ. కాంతలమాట నమ్మకొని కంతునికిం గడు లోఁకువై తదీ
యాంతరభావముల్ దెలియ "కై సరుబొజ్జ" యటంచు నుబ్బుచుం
డెంతవివేకులైన మది నీవిషయంబు పరీక్షసేయఁగా
నెంతయు x"కుక్కతోఁకగొని యేటను బడ్డ"x విధంబుగాదొకో ?

ఉ. చేడెలు పిన్నకాలమునఁ జిన్నెలు వన్నెలు లేక యెంతయున్
"బూడెదబుస్స"నాకృతినిఁ బొందియు నంతట నీడు వచ్చుచోఁ
బాడుగఁ జేతు రెంత మతిపారగుచిత్తము నైన ; నయ్యయో !
"గాడిదపిల్ల కోమలము" గాదె ? విచారణఁ జేసి చూచినన్. ౨౬

ఉ. "మందులు నెట్టి యెంత మతిమంతుని చిత్తము నైన లోనుగాఁ
గొందురు వారకాంత"లని కొందఱు పల్కుదు రెంతవెఱ్ఱులో !

x ఋక్కసక్కు కొని తెం.పు కు బడ్డ x

మందులు వేఱె యున్నవియె? మాయలమాటలుఁ దక్కుఁ జూపులున్
మందతరస్మితమ్ములును మక్కువ చెక్కిలి నొక్కులున్ వినా. ౮౮

వ. అని మఱియుఁ బశ్చాత్తాపమ్మున. ౮౯

సీ. గరగరలాడు గాగరపన్నె కుచ్చెలల్ కాళ్ళపై వింతగా గంతులిడఁగ
జిల్గుకంచెలలోనఁ జిక్కి చక్కని గుబ్బదోయి మాటికిని దుంగుడుసు సేయ
మునులనైనను దాసులను జేయఁగాఁ జాలు చూపు లింతనరాని సొబగునీన
గాంగేయసచ్ఛాయ గడతుకొల్పెడి దేహకాంతి చూపఱు గుండె గలఁగఁ జేయు

తే. గీ. నెన్నియో వన్నియల గుంపు లీనఁ జాలు
నగవు మొగమున కెంతయో సొగసుఁ దెలుప
వచ్చి నాచిత్తము హరింప వచ్చును గద?
పరువు మరియాదలు దలంప వలదె? కాంత! ౯౦

ఉ. కంతునికేల నొప్పెసగు కమ్మని మామిడి పూలగుత్తి నా
నెంతయు నాదు కన్నుఁగవ కింపు ఘటించి యిదేమె? యోసి క
ర్ణాంతవిలోచనా! మనము నర్మిలి దొంగిలి పాఱిపోతి వా
వంతయు శంక లేక, మది నంత యరాజక మంచు నెంచితే! ౯౧

క. ఈవిధమున నతఁ డెంతయు నావేదనఁ జెందుచుండె నవ్వనితయుఁ దా
నేవిధి దోఁచక గృహమునకై తగ మీఱంగఁ జేరి యాత్మగతమునన్. ౯౨

చ. తలఁచునొకో? మనమ్మున నతండు ననుం గనదానిఁగా, నటుల్
దలఁచిన నేమియౌను? దరిద్రుల చాటున నుండువాఁడు నా
చెలిమి గణించి నాగృహముఁ జేరఁగ నెంచునె? యిట్టివానిపైఁ
దలఁపు ఘటించుటే మొదటితప్పిఁక మాటలు వేయు నేటికిన్. ౯౩

సీ. మొదట నేనన్నచో మొగమునెత్తనివాఁడు క్రమముగా మోమెత్తి కాంచఁదొడఁగెఁ
దరువాత మాట కుత్తర మొసంగనివాఁడు ఋజురీతి నుత్తరం బీయఁ దొడఁగెఁ
బిమ్మట నర్మవాక్యమ్ము లాడనివాఁడు గొంచె మారీతి భాషించఁ దొడఁగెఁ
నటుమీఁద సంస్పర్శ నాదరింపనివాఁడు కేల్పట్టికొనుట కంగీకరించె

తే. గీ. విడె మొసంగిన గ్రహియించి వేసికొనియె
గోటుగీఁటినఁ జాటుగా మాటుకొనియె

మాట లిఁక వేయు నేల ? నా మాటయన్న
నడుగుదాఁటు నె ? యిఁకఁ గొంత గడచుమీఁద. ౧౩

ఉ. అంతకు నోర్వఁ డాయెఁ బరమాత్ముఁడు, శ్రేయముఁ జెందువారి క
త్యంతము విఘ్నముల్ సలుపు, నంతియకాని యొకప్పుడైనఁ గా
సంతయుఁ జేయఁబూనఁడు సహాయము, దైవము మాఱఁజెల్లు నే?
యింతకు నాకు వానికిని సేర్పడి యుండినఁ దప్పిపోవు నే? ౧౪

ఉ. తా నయి కోరు టన్నఁ గడుఁ దప్పిద మౌఁ గద వారకాంత ; కెం
జేనియు నద్దియుం గలిగె నేని సెబా సనిపించుకొన్న మే
లౌ ; నది యట్లుగాక యిటులైనను వేఱేకఁ జెప్పనున్న దే ?
లేనిది లేక యుండ సరిలేమలు నవ్వుటయుం దటస్థమౌ. ౧౫

క॥ ఇటుఁ గుటిలాలక మనమున గుటగుటమను, మారు దూఱుఁ గువలయమిత్రుం
బెటిలి పడఁ దిట్టు, నళులను గటకట మని పండ్లు గొఱికి కసరు విసువుచే. ౧౬

తే॥ గీ॥ యామినీగోపకామిని యాకసంబ
నెడిఘటమ్మున జ్యోత్స్న యనియెడి పెరుఁగు
దరచి చేర్చినవెన్నముద్దయన నంత
వెడలెఁ దెల్లనికాంతితో వేగుఁజుక్క. ౧౭

సీ. ఏచరణాయుధం బింపు మీఱఁగఁ బాణిని యతికి బ్రహ్మాస్వాదినియతిఁ దెల్పె
నేచరణాయుధం బాచారివిప్రనిత్యస్నానదైవజ్ఞతను వహించె
నేచరణాయుధపారిచర్యరూపుఁడై హరి నిశీధము వేకువనఁగఁ జేసె
నేచరణాయుధశ్రీచేత శూలి పిఠాపురమ్మున నుండెఁ గాఁపురమ్ము ౧౮

తే. గీ. అట్టిచరణాయుధసమాజ మఖిలజార
చోరులకు గుండెలో దిగుల్ బోరుకలఁగ
ఉఉఉఊఊ యటంచు నత్యుచ్చరీతి
గూయసాఁగెను దమతమ గూళ్ళ నుండి. ౧౯

సీ. జాటిపోయిన నీవి సవరించి సవరించి కులుకుగుబ్బల పైఁకఁ గుదురుపఱచి
వీడిపోయిన కొప్పు బిగువుగా ముడివైచి సొగసుదుప్పటి మేల్ముసుంగు వెట్టి
చెలికానితోడను జెప్పలేకే చెప్పి మోహమ్మున మఱొక్కముద్దు వెట్టి
చనలేక యొకకొంత సాఁగి వెన్కకుఁజూచి మనములోఁ గాఁతిన్యమును వహించి

తే. గీ. సంతసం బొక్కవైపు విచార మొక్క
వైపుఁ బెనఁగొన 'నీలాటిపనుల నోన
రింపఁగా వలె'నని నక్కఁ జేలకాయ
రీతిఁ గని చనె జారనారీజనంబు. ౮౯

చ. చనుటకు నుద్యమించుఁ, "జన శక్యముగా" దని పన్నళించు, నిం
చినతమిఁ గౌఁగిలించు చెలిచేతుల దూరముగాఁగ నుంచుఁ, జ
య్యనఁ దల వంచు, నున్సురని యాత్మ విచారమునంగు ముందుఁ దా
వనితను బాయునప్పు డొకపల్లవుఁ డుల్లము తల్లడిల్లఁగన్. ౯౦

చ. వలపు దలిర్పఁగాఁ బ్రియునివక్షమునం బవళించి నిద్రచే
నలసత గానుపింప వెలయాంద్రు కలల్ గులుకంగ మేలుకొ
ల్పులఁ దగఁ బాడఁగా నిదురపూనికతో విరుపూని లేచి సం
దులఁ గడుగోప్యమై తనరుత్రోసలఁ బోయిరి చాటుపల్లవుల్.

తే. గీ. లేపి పల్లవులను బంపి, లేఁతపాప్రియ
మలరు తమకన్నియలఁగూడ మెలఁకువఁగనఁ
జేసి వీణియశ్రుతిఁ జేసి చెప్పఁ దొడఁగి
రపుడు గీతమ్ములను వృద్ధలౌ గణికలు. ౯౨

సీ. కించిద్వికసదబ్జచంచదంచచ్చంచరీకదంపతుల సస్పృహులఁ జేసి
సమరతావధిఁ బృథక్ఛయ్యాస్వపద్దంపతుల నొక్కశయ్యపైఁ గలయఁ గూర్చి
యుపరతక్రీడామహోత్సవాలసకామినీకుచస్థలఘర్మనీర ముడిపి
సంకేతితస్థలస్థనవప్రసవతల్పగతపరిమళముతోఁ గలసి మెలసి

తే, గీ. అమితతృష్ణార్దితభుజంగసముదయప్ర
మదవిధానాతికుశలసంపదలఁ బొదలి
మలయానిలయపటీరదుమ్రవలయనిలయ
మారుతములు ప్రభాతసంపదలఁ దెలిపె. ౯౩

తే. గీ. తత్తదుద్యానవనఫలతతులు మెసవి
యినుఁడు రాఁబోవుచున్నవాఁ డనియెఱింగి
పరువుపరువున నన్నియుఁబక్షి గట్టి
తమతమ నివాసములకు ఘూకములు సేరె. ౯౪

తే. గీ. క్రమముగా జాఱె రాత్రి, సర స్తటప్రి
దేశములఁ జేరి రెల్ల వైదికవతంసు,
లరుగఁ జొచ్చిరి పాంథులు దురముదనరఁ,
దారక లడంగెఁ, జంద్రుఁ డస్తగుచియయ్యె. ౯౫

సీ. [illegible] పితాపాదప శోభయం బాత్నవీ న్యాప్తి పాపోచ్చయంబు
కో ప్రయాగ మాస్తోకముహూర్తం [illegible] సువసిమానికిఁ దెద్దకాపు మొకము
సురతసంతోషవిస్ఫురణమ్మునకు స్వామి నుతెనుతాపమ్మున కొసఁగంబు
ఆవాలముల పన్ను లార్జించు కరణమ్ము నీఁకటి పాఱటి నీఁడపురువు

తే. గీ. భువనజాతంబు లేయెడఁ బ్రోచుపాఱిడ,
మూఁడుమూర్తులు నివసించు మేడ, జగము
పాలిటి సులోచనం, బహర్పతి క్రమమ్ము
గా నుదయమందెఁ గన్నులకఱవు దీఱ. ౯౬

శా. స్నానంబుల్ పచరించువారు జపముల్ సంధించువా రగ్నిసం
మ్మానంబుల్ నెఱవేర్చువారుఁ దరణిం బ్రార్థించువా రాత్మసం
ధ్యానంబుల్ పొసఁగించువారు నిగమధ్యానమ్ములం జేయుచా
నానందాబ్ధినిఁ దేలువారలునునై రచ్చెల్లరున్ వైదికుల్. ౯౭

శా. ప్రాతఃకృత్యములన్ యథోచితముగాఁ బాటించి పాత్రమ్ములన్
జేతం బూని నవీనపాఠమును నిశ్శేషమ్ముగాఁ జూచి తా
మా తాత్పర్యము గొంత గొంత మదిలో నానించి విద్యార్థు లెం
తో తాత్పర్యముతోడ దేశికులఁ గన్గోఁ బోయి రప్పట్టునన్. ౯౮

క. మౌద్గల్యసగోత్రభవా ! సాద్గుణ్యవిచార ! ధనదసమధికవిభవా !
హృద్గతభవా ! సుకవితావిద్గణ్యప్రాభవా ! పవీణాగ్రభవా ! ౯౯

క. గణనాతీతగుణప్రశీచణ ! కవితారమణ ! సరససాహిత్యరసో
ల్బణ ! చరణాయుధరూపప్రణయనపదసేవనానుదీణధురీణా ! ౧౦౦

స్రగ్విణి. కామమాంబాలసద్గర్భశ్రీమణీదామ ముక్తామణీ ! ధామభాస్వన్మణీ !
సోమధామోపలస్ఫూర్తి సౌధాంతరారామరామాదికప్రాజ్యభాగోదయా !

ఇది.. శ్రీ తిరుపతి వేంకటేశ్వరప్రణీతంబైన కేవలకల్పితంబగు శ్రవణానందంబను
మహాప్రబంధమునందు తృతీయాశ్వాసము. శ్రీ శ్రీ శ్రీ.

శ్రీరస్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్రవణానందము

## చతుర్థాశ్వాసము

---

క. నూత్నప్రఖ్యాతిజితప్రత్నధరానాధమంత్రిరత్న! సుకృతకృ
ద్యత్నధృఢచిత్త! వేంకటరత్నామాత్యమణి! విబుధరాడ్రాజమణీ! ౧

వ. అవధరింపు మనంతరంబు. ౨

క. మెల్లన మేల్కాంచి యతండుల్లములో నుండు వికృతి యొరుల కెవరికిం
దెల్లము గాకుండఁగ సంఫుల్లవదనుఁడగుచుఁ గాలమును గడపుచుఁదాన్. ౩

క. ఏదియుఁ దోఁచక కడుఁ జెంపేది ముదముఁ దక్కి "యెట్టు లీమోహజలం
ధీముధుఁ గర్తవ్యం బిఁక నేది?" యని మనమ్ములోన నెంతయు పగతోఁ. ౪

ఉ. ఈవిషయంబు మానుకొనుటే కడు సౌఖ్యమటంచు నెంచి తా
నావిధిఁ జేయ నిశ్చయము నందిన యంతనె మోహమగ్నలం
బై వెనువెంట నంటు; నటులైనను జేయుదు నన్నతోడనే
భావము వేనవేలు ప్రతిబంధకముల్ గనఁ జేయు నెంతయున్. ౫

క. మానుదునా? చేయుదునా? మానుదుఁ జేయుదు నటంచు మల్లాడి యొగిన్
మానిన విచార మొక్కఁడె, పూనియొనర్చిన విచారములు పెక్కులుగా! ౬

క. అని తనమదిలో ననుకొనియును బుద్ధినిఁ ద్రిప్పలేక యొగి నుత్తర మ
క్కనకాంగికి లిఖియింపుటకును బ్రారంభించెఁ గొంతకొంత తెగువతోన్. ౭

మ. రణదుద్యన్మణికంకణక్వణజితప్రద్యుమ్నకంఖాణికిన్
గణనాతీతకలాలసద్రమణికిన్ గాదంబినీవేణికిన్
గణికోద్యన్మణికిన్ బ్రశస్తతరరేఖాపాణికిన్ బాలికా
మణికిన్ వక్త్రజితాబ్జశీతఘృణికిన్ మాద్యత్పికీవాణికిన్! ౮

క. అనవద్యయాపనోపయ,ఘనరసికసమాగమాధికసుఖోదయసం
దనధనములు గలుగఁగ దీవన లిడి నా వ్రాయు వ్రాఁతవల నెట్టి దనన్ ;—

క. కడుమాటలేల ? విను, లోఁగడ మాకుఁ గలానిధిత్వకారణమునఁ జం
ద్రుఁడు బంధుఁడు నీకైకద ! బెడిసెం జంద్రునకు మాకు విమలేందుముఖీ ! ౧౦

క. కలువలరేనికి వేఁడిమి, చిలుకకు విశ్వాస, మగ్నిశిఖకును శైత్యం
బలవడునుగాక, వెలకాంతలకు వలపు గలుగుటది వినఁబడదు కదా ! ౧౧

తే. గీ. అట్టి గణికాకులమ్మునఁ బుట్టినట్టి
దానవే కద ! నీవును దరుణి నీకు,
వలపుగలదన్న మూర్ఖునివంటివాఁడె
నమ్మనేరఁడు ; నేనెట్లు నమ్మనేర్తు ? ౧౨

క. నిజమయిన వలపుగలుగని గజగామినిఁ గవయువానికన్న నధముఁడీ
త్రిజగతి లేఁ ; డదియ యనంగజను రసాభాస మనఁగఁ గాంతామణిరో !

క. ధనమును గులమును వృత్తంబును రూపముఁ జూతు రెందు బోటులు ; మీలోఁ
బని లేదు తక్కినవి యొక ధనమె ప్రధానమ్ము గదవె తరుణీమణిరో ! ౧౪

తే. గీ. కోరితివి నన్ను ; నాబోఁటి ధీరుఁగోరి
యేమిసంపాదనముఁ జేసెదే లతాంగి ?
ధనము గల్గినవాని నొక్కని వరింపఁ
దగు నదియె కాదె నీకులధర్మ మరయ ? ౧౫

క. ఇది యంతయు నీమదిలోఁ బదిలముగా నూహ చేసి వ్రాయవలెఁ జుమీ !
తుది నిష్ఠురంబు కన్నను మొదటనె నిష్ఠురము మెఱుఁగు పూర్ణేందుముఖీ ! ౧౬

క. అని వ్రాసి పంపె నంతట దినకరుఁ డస్తాద్రి కేగెఁ దిమిరము ప్రబలెన్
వనజాహితుఁ డుదయించె మదనుఁడు పథికసతులమనముఁ దల్లడపఱచెన్. ౧౭

క. ఏమియుఁ దోఁచక యచ్చనితామణి యున్నంతఁ గమ్మ తారసిలుటయుం
బ్రేమ దలిర్పఁగఁ జూచి మహామోదముఁజెంది తల్లి కంతయుఁ జెప్పెన్. ౧౮

వ. తల్లియు సంతసించి "జాగు సేయక వినయపూర్వకమ్ముగాఁ బ్రత్యుత్తరముం బంపు" మని చెప్పటయు నక్కన్నియ యిట్లనియె. ౧౯

క. ఏమని వ్రాయుదు నీతని ? కేమని వ్రాసినను నీత డియ్యకొను ? నటం
చీ మాడ్కిని యోజింపుచుఁ దామెల్లన నిట్లు వ్రాసెఁ దగు నైపుణితోన్. ౨౦

వ. శ్రీమదుభయవేదాంతప్రవర్తకులగు మధుసూదనాచార్యులగారి సన్నిధికి గాను
రాలగు బాలామణి సాష్టాంగంబు లొనర్చి కుశలోపరి వ్రాసికొను మనవి ౨౦

క. నిన్నటిరాతిరి నుండియుఁ గన్నులుదీసికొని యెదురు గనుఁగొనుచును నే
నున్నతఱి మీర లంపిన విన్నాణపుఁగమ్మ మునికి వేష్కగ నంపఁగఁ. ౨౧

శా. తాపంబాఱె, విచారమా సడలెఁ, జిత్తంబు మహానందవి
ద్యాపారమ్యముఁ గాంచె, దైన్యగుణమా దౌదవ్వులంజేరె, నా
శాపాశం బతిదీర్ఘమై భవదపేక్షన్ వృద్ధిబొందించి యీ
టోపప్రక్రియ నొప్పెఁ బూవిలుతుబంటుల్ నాకు బంట్లైరిఁకన్. ౨౨

క. ఇందుకు సందియమును మీరందం బనిలేదు మీరలంపించిన క
మ్మందగఁ నైకొని బ్రహ్మానందభరితురాల నైతి నానాగతులన్. ౨౩

క. మిముఁగోరినదెందులకో తమ రెఱుఁగుదు, రే నెఱుఁగుదు, ... సుమ
సుమబాణుఁడెఱుఁగు నిది నిక్కము మీసందియముఁ బాపఁగా నేనిపు నే?

ఉ. నాయెడఁ బ్రేమ లేనికతనం దమకన్నియు సందియమ్ము లే
పాయక తోఁచుచున్నవి సెబా! సిఁక మిమ్మన నేల? మీమనం
బా యరవిందసంభవుఁడె యట్టు లొనర్చిన యప్పు, డింతనుం
గాయజుఁ డేమిసేయ సమకట్టెనో? మీమదిఁ ద్రిప్ప నేర్తునే. ౨౫

క. "రవి కెఱుఁగరాని దైనను గవు లెఱిఁగెద" రంచుఁ జెప్పఁగా విందుసు స
త్కవులైన భవాదృశు లొక యువిద మనస్థితి నెఱుంగ నోకకష్టంబె? ౨౬

ఉ. కోరిన యంతమాత్రమునఁ గోరికతీరఁ గ్రహించి యెక్కడా
గౌరవబుద్ధిఁ జూచి కనుగందఁగనీక సమస్తరీతులం
జేరికఁ జేసి పంతమును జెల్లఁగఁజేసెడి నాయకుండు చే
కూరఁగ నోఁచినట్టి సుమకోమలి నోము లవెట్టి నోములో! ౨౭

ఉ. ఏలిన నేలుఁగాక జగమెల్లను, రూపమునందు మన్మథుం
బోలినఁ బోలుఁగాక; పలుభూషలు వెట్టినఁ బెట్టుఁగాక! యే
కాలమునందుఁ గాని రసికత్వపు సంపదచేఁ గవీంద్రులం
బోలెడివార లీ జగతిఁ బుట్టి రటన్న ప్రసిద్ధి వింటిమే? ౨౮

చ. కవులొనరించు గ్రంథములఁ గాంచిన వారలె యెక్కడా రస
జ్ఞవరులఘుంచు నిక్కెదరుగా! యటువంటి ప్రబంధముల్ విలా

సవిధి గణించు నట్టి కవిచంద్రుల కెట్టి రసజ్ఞతావిశే
షవిలసనంబు గల్గునో విచార్యము గాదె స్వతంత్రురాలికిన్ ! ౩౦

చ. ఇదియొక కారణం; బిదియు నిట్లనె యుండఁగ నిండు; మీకుఁ జె
ప్పఁదగినదానఁ గా, నయినఁ బల్కెద, నొక్కతె కొక్కపూరుషుం
గదిసిన యంతమాత్ర మది గల్గును, వేఱొకఁడంతకన్నఁ దాం
బదిపదిరెట్లు లెక్కుడగు వాఁడయినన్ మదిపుట్టనేర్చునే ? ౩౧

ఉ. కావున నీక్షణంబ తమకమ్మున వచ్చి యనుగ్రహించి నన్
బ్రోవఁగఁ గోరెదం దమకుఁ బుట్టెడి శంకలకున్ సదుత్తరం
బావల నిచ్చెదం, గడుఁ గృపాకరులై క్షమియింప వేఁడెదన్
దైవము సాక్షి యింతయును దథ్యమటంచును వ్రాసి పిమ్మటన్. ౩౨

చ. రవి మెఱుఁ గాయె నక్కలువరాయనికన్న, నిదేమి పాపమో
పవనునికన్న నామదికిఁ బావకుఁడే మెఱుఁగాయె నక్కటా !
శివశివ ! వేయిమాట లిఁకఁ జెప్పఁగ నేటికిఁ ! జిత్తజాతసం
భవమగు నాయవస్థ భగవంతుఁ డెఱుంగును నే నెఱుంగుదున్. ౩౩

వ. అని వ్రాసి యంపిన నమ్మధుసూదనుండును. ౩౪

చ. రయము భయమ్ము సంభ్రమము రక్తి విరక్తి నిరాదరాదరో
దయనయముల్ మదిం గదిసి తత్తదుపాధులఁ బుట్టఁజేయ నొ
క్కయెడ రహస్యరీతి నది గాంచి పఠించి తదీయభావని
శ్చయ మొనరించియుం జదువసాఁగుఁ బునఃపునరాదరంబునన్. ౩౫

క. కను మరలంగను మరలంగను మరలంగను నతండు గాంతు దలిర్పన్
వనజాయతలోచన లంపిన వార్తల నెంతకైనఁ బ్రేమాస్పదముల్ ! ౬

తే. గీ. ఇట్టులాకమ్మఁ గనికని యెట్టకేల
కాసరోజాక్షి పొందు నేయంగ నిశ్చ
యించి తగురీతి నట కేగుదెంచుటకును
బయలువెడలె నిశీథసమయమునందు. ౩౭

మ. ఒకకొంతేగును, సంశయించును; సముద్యుక్తత్వమున్ జెందు, వే
ఱొక కొంతేగు, యథాస్థితింగను; నిరుద్యోగమ్ము వాటించు; ని

టికిఁ దోఁతెంచుట కూహసేయు ; నిటులెందేఁ గంటిమే వింత ! వి
ద్యకదా, హేతు వతండు సంశయ సముద్రాంతర్గతుం డాటకున్ ! ౩౮

మ. మనుజుండై జనియింప రాదు, జనియింపంగల్గినం బాండితీ
ధనుఁడై యుండఁగఁ బోల, దట్లయినచోఁ దప్పేమి ? యవ్వాఁడు పుం
స్త్వనిరూఢిం గనఁబోల, దట్లయిన నవ్వాఁ డంగనాకాముఁడై
చనరా దొందెడ, కట్టులైనను రహస్యప్రక్రియల్ గూడునే ? ౩౯

ఉ. " ఎవ్వరు గందురో మఱియు నెవ్వరు విందురో యేమనందుగో
యెవ్వరు పల్కరింతురో మఱేమొ ?" యటంచును సంశయించు వాఁ
డివ్వసుధం బరాంగనల నెట్టులఁ బొందగనేర్చు ? బోగపుం
జవ్వని పొందుసేయుటయె సాధ్యము గా దటువంటివానికిన్. ౪౦

క. కఱచెడిపామును మీఁదం బఱచెడి భూతంబు నెఱుఁగఁబడక మనసు ని
బ్బరముగఁ దిరిగెడి గరకరి బిరుదులె పో ! జారకృతికిఁ బెట్టిన పేరుల్. ౪౧

సీ. చూపట్టునట్టివస్తువు లెల్లఁ దనుఁ బట్టఁగావచ్చు వారంచుఁ గాంచకున్నె ?
వినవచ్చునట్టి నిస్వన మెల్లఁ దనుఁ బల్కరించు పల్కు లటంచు నెంచకున్నె ?
ఎడనెడ నడచి పోయెడి వారలెల్లఁ దన్ జూచువారలె యంచుఁ దోఁచకున్నె ?
అగుపట్టు నట్టి గృహమ్ములన్నియుఁ బ్రియురాలివే యని శంక నందకున్నె ?

తే. గీ. అహహా ! క్రొత్తగ వ్యభిచార మాచరింపఁ
బోవుచున్న రహస్యపుఁ బురుషులకుఁ ద
టస్థమగునట్టి యీదురవస్థ శత్రు
వర్గమునకైన వలదురా ! వలదు వలదు. ౪౨

వ. ఇట్లు సంశయించుచుఁ దుదకుఁ జనఁజాలక కాలయాపనంబునకై యొక సుహృ
ద్గేహమ్మునకుం బోయి యటఁ బరుండుటయు. ౪౩

చ. దొరకిన పెన్నిధానమును దొంగల కిచ్చినరీతి, నాతఁ డీ
వరుసఁ బరుండి యుండ, గుణవంతుఁ డనం జను నొక్క మిత్రుఁ " డీ
కరణిఁ బరుండనేమి ? " యని గట్టిగఁ దన్నడుగంగ నాతఁ డా
దరమునఁ జేతి కిచ్చె నల తన్వి లిఖించినయట్టి పత్రికన్. ౪౪

క. ఇచ్చి "భవత్తాత్పర్యం బచ్చొత్తిన రీతిఁ జెప్పనగు" నన నతఁడీ
సచ్చరితున కిది తగదని చెచ్చెరఁ దలపోసి హితముఁ జెప్పఁదొడంగెన్. ౪౫

చ. "కులమును బ్రాయముం యశముం గోవిదభావము భాగ్యవత్తయుం
జెలువము సత్ప్రవర్తనముఁ జేతికి మించినయట్టి యోగియుం
గలిగిన మిమ్ము నొక్క వెలకామిని గోరుటకబ్బురంబె, మి
మ్ముల వినినంత నే చెలికిఁ బుట్టకయుండు మనోవికారముల్ ? ౪౬

ఉ. చిన్నతనమ్మునుండియుఁ బ్రసిద్ధివహించి జగంబునందు బల్
వన్నెకునెక్కఁగల్గు తగువర్తనచేఁ జరియించునట్టి మీ
రన్న, మహానుభావులు గదా ? తమబోఁటులె యిట్టులైనచో
నున్నటువంటి వార 'లిది యుక్తమొకో' యని సంశయింపరే ! ౪౭

సీ. తల్లిదండ్రులువిన్నఁ దప్పుగా గణియింతు రత్తమామలు విన్న నాదరింప
రూరిపెద్దలువిన్న గారవింపరు, మాట వినఁదగువారును వినరు, తనకుఁ
బ్రాణమిత్రులుగూడఁ బరిభవింపఁగఁజూతు రాలు చుల్కనఁజేసి గాసిఁజేయుఁ
దన నవుకరుఁగూడఁ దన్ను హేళనఁజేయు నన్న నన్యులమాట లెన్న నేల ?

తే. గీ. ధనము చెడుఁ, గీర్తి చెడు, దేహమునకు లేని
పోనిదురవస్థ గల్గును గాన విత్త
కాంతలనుగూడువారి కొక్కయెడనైన
నగుపడదు సౌఖ్యము విచార మడుగవలెనె ?

వ. ఇదియునుం గాక ౪౯

సీ. అర్థ మిచ్చినయప్పు డతిగౌరవము సేయు నర్థ మీకున్న మూఁడంకె వేయుఁ
గాసు లిచ్చినఁ గాళ్లు గడిగి నెత్తిని దాల్చుఁ గానులీకున్న బింకాలఁ జూపు
లంచ మిచ్చినను లాలించి ముద్దులు వెట్టు లంచ మీకున్నఁ జీట్లించు మొగము
నగలు దెచ్చినయప్డు నగ లెన్నియో చూపు నగలు తేకున్న నావగలు నున్న

తే. గీ. చీర లిచ్చినయప్డు హర్షించి చూచుఁ
జీర లీకున్న యప్డు ఘూంకించి చూచుఁ
గంచుకాగడ వెలిఁగించి కనినఁగాని
వలపు గన్పట్టునే వారవనితలకును ? ౫౦

తే. గీ. వన్నెచిన్నెలుగల గొల్లకన్నెమంత
సర్వజనులును ద్రొక్కు బజారుసంత

అందఱును నేఁగ నేమించినట్టిపుంత
వంతలకు వింతదొంతర వారకాంత. ౫౦

ఉ. ఏరికినైనఁ గూడవు ధనేచ్ఛఁ జరించెడి వారకామినీ
చారుకుచోపగూహనవిచారము లన్నవి యుత్తమోత్తమో
దారయశోవిశేషపరిధానవిభూషితసత్కృతిక్సతీ
వారు లనంగ నొప్పు తమవంటి మహాత్ముల కర్హ మెట్లగున్ ! ౫౨

మ. గుణవంతుండనునోట "మండలము..." తిరుఁడంచున్ బుధా
గ్రణు లాక్షేపణఁజేయఁబూనుదురు ; పల్కంజేసి నూబోఁటులన్
గణనంజేయ రటంచు మైత్రినిటుఁ బల్కంబూనితింగాని వా
గ్రణముంజేసి మరల్తురే ? హరిహరబ్రహ్మాదులైనన్ మిమున్. ౫౩

క. వినది కాదని యనఁగాఁ గానిది యౌనని పచింపఁగాఁగల మీతో
నేస్తా, వాదము చేయుట ? యేనూఱుగురైన మీకు నెదురే ? చెపుడీ". ౫౪

క. అని యాతఁడు పలికిన, నిట్లను, "మీతోఁ జెప్పి మంచియగునో, కాదో
వినఁగోరి యడిగితిని మంచి నిదానమ్ముగను మీరు చెప్పుతిరిసుఁడీ. ౫౫

క. తనకెంత తెలివి కలిగినఁ దనకార్యముపట్టఁ దానె తగుభునుటు యొ
ప్పనిపని ; యోగ్యతగలిగిన తనమిత్రుల నడుగుటొప్పుఁ దగపరికెందున్. ౫౬

ఉ. ఇంతియ కాక మీరెఱుఁగరే ? ననుఁ జిన్నటనాఁట నుండి యీ
వింతలలోని కొన్నిఁడును వేడుకఁ జేసి మనంబుఁ దోఁన్ప ; నీ
కాంత యదేమొ కాని నను గాసిలఁజేయుచునున్న దందుచే
వంతయు మీకుఁ దెల్పి తెలియన్ వినఁగోరితి మంచి చెడ్డలన్". ౫౭

క. అని యతఁడు చెప్పనీతులు విని యప్పనిపట్ల నితఁడు విముఖుం డాయెన్ ;
ఘనులగు మిత్రులు గలిగిన మనుజులు దుర్వ్యసనములకు మఱుగుట గలదే ? ౫౮

సీ. 'ఇప్పుడే వచ్చునో, యిఁకనె వచ్చునో' యంచుఁ దలవాకిలిల్లుగా నిలిచి నిలిచి
'వచ్చువాఁడైన నీవఱకేల రాకుండు ?' నని మనమ్మున శంక నంది యంది
'నేను వ్రాసిన కమ్మ నిజముగాఁ జూచెనో, చూడలేదో' యటంచు సొక్కి సొక్కి
'రాకుండునా ? యిప్డు రాత్రి యెంతో ప్రొద్దు పోలే'దనుచు మదిఁ బొక్కి పొక్కి

తే. గీ. యున్న కన్నెను మఱుబారి నుంచివైచి
స్నేహితునిమాటలకుఁ బ్రతిఁజెప్పలేక

చనక యచ్చోట నిద్రింప సాఁగె నతఁడు
నిదుర యేరీతిఁ బట్టెనో ? మది యెఱుంగు. ౫౯

ఉ. ఇంతకుమున్నె యవ్వనిత యెంతయు సంతస మంది 'మన్మనః
కాంతుఁడు నేఁడు రాఁగలఁడుగా !' యని భూషణభూషితాంగియై
వింతగఁ గేళికాగృహము వేగ నలంకృతఁ జేయఁ జేసి తా
మింతగఁ గాలయాపనము సేసె "యతండిటు వచ్చు" నంచు నెంచుచుక్. ౬౦

చ. వడివడి వచ్చువానిపలె వార్తను బంపుచు నంతరాత్రి దాఁ
గడచినమీఁదనైన నిటఁ గాలిడఁ, డెంతటి నల్వవాఁడి యీ
తఁడు ! నను నింత చుల్కఁగ నెటుల్ గణియించునె ? వచ్చెనేని, నే
నడుగక యుందునే ? మనముసంచలితాపముఁ దీర్చకుందునే ? ౬౧

క. అని కనులు దీసికొని యాతనిరాఁకకు నెదురుచూచుతనయం గని నె
మ్మనమున వినువు దనగ నవ్వనజానన తల్లి యిట్లు పలికెం బెలుచక్. ౬౨

ఉ. ఓతలిరాకుబోఁడి ! వినవో ! నిజ మొక్కరివంటివాఁడు గాఁ
డాతఁడు, వచ్చునే మనగృహమ్మున ? కాతనియందుఁ గాంక్ష నీ
చేతమునందు గట్టిగ వసింపుచు నుండిన నేను జెప్పు నీ
రీతిగఁ జేయు మాతఁడె పరించి గ్రహించు నినుం గ్రమమ్ముగక్. ౬౩

క. చదువను నొకమిషఁ బూని ప్రతిదినమ్మును నతని సన్నిధికి నేగినచో
మదిఁజనవు హెచ్చి క్రమముగఁ బదునుచెడు నిక్కమిది యుపాయము నుమ్మీ.

క. ఇచ్చట కాతనిమదిలో నిశ్చవోడ మెఁగాని యిచటి కేతెంచెడి యీ
ముచ్చట లన్యులు గన్నను జచ్చినచానగు నటంచు సంశయపడియెక్. ౬౫

చ. క్రమముగఁ గొంతకాలము గతమ్మ రహస్యముగాఁ బ్రివర్తనం
బమరినమీఁదఁగాని "యెవడైనను గాంచెదరేమొ" యంచు శ
క మొదటఁ దోఁచు నెట్టివిటకాంద్రుడు నన్నువు, డెప్పు డిట్టి క
ర్మముల నెఱుంగనట్టి జనమాన్యులు సందియమందకుందురే ?

తే. గీ. క్రమముగాఁ గొంతిసన్నిహిత్యమ్మ గలిగెనేని
విందురందఱు, నావిఁడఁప కొఱుచు లజ్జ ;
"నలువురు వినెడివాఁడె నె గలుగసిద్ధు,
నడుము మునిఁగెడివాఁడు కంపడాగ జలియు".

తే. గీ. ఇటులఁ దనపుత్రికకుఁ గార్యఘటనకు నదు
పాయమెఱిఁగించి నిద్రకుఁబడిరి వృద్ధ;
అటుల నొనరింప నక్కన్నె యనుమతించి
యెపుడు తెలవాఱు నని మది నెంచునంత.

ఉ. కొక్కొరకొక్కొకో యనుచుఁ గుక్కుటముల్ పలవించె; నంతలోఁ
జుక్క పొటుక్కునం బొడిచె; సుందరమంథరగంధవాహముల్
నిక్కెఁ; దమంబు సుర్రికె; నళినీసతికిన్ రుచు లెక్కె; నొక్కటై
జక్కవ లార్తిఁ దక్కె; జలజప్రియుఁ డెక్కె సురేంద్రుదిక్కుపై. ౧౯

సీ. కలుము లీనెడి కన్నుఁగవ వీధినల్లడల్ నల్లగల్వలతోరణములు గట్టఁ
గారుకమ్ములు గ్రమ్మఁగాఁ జాలు వేణికారుచులు తుమ్మెదలబారులు ఘటింప
సహజదరస్మితస్వచ్ఛకాంతులు దంతములకాంతిఁగూడి వెన్నెలలు గాయఁ
దళతళల్ మీఱు గుత్తపుఁ జన్నుఁగవ పొంగు త్రోవఁ గన్పడువారిఁదొంగిచూడఁ

తే. గీ. బ్రతిదినము ప్రాఁట నొకసారి పనినిఁబూని
యతని సన్నిధి కేతెంచు నది మొదలుగఁ
బుస్తకము హస్తమునఁబూని పొలఁతియొకతె
తనకుఁ జేఁదోడువాఁదోడుగను మెలంగ. ౨౦

ఉ. తమసుతు నూత్నయౌవనవిధమ్ము నెఱుంగరొ! వారకామినుల్
కుమతు లటం చెఱుంగరొ! చెలుల్ మఱి యెంతటివారినైన మో
హమరులుగా నొనర్తు రను నంశ మెఱుంగరొ! తల్లిదండ్రు లు
త్తము లన రాదె? వేఱొకవిధం బయినన్ మఱి సమ్మతింతురే? ౨౧

చ. ఒకరకమైన పావడ మఱొక్క రకంబగు రైకయున్ మఱిం
కొకరకమైన పైఁటయును మఱొక్కరకంబగు భూషలున్ ధరిం
చుక ముకురంబుఁ జూచుకొని సొంపుగ లేదని యెంచి, యంత వే
ఱొకటి మఱొక్క టింకొకటియున్ ఘటియించు నటేగువేళలన్. ౨౨

వ. అట్లువచ్చి

చ. చదువను పేరె గాని యొకసక్కపుమాటల నాడుచుండు, సం
దొరకినయప్పుడెల్ల నెఱిఁగా సుఖసంగతిఁ దెచ్చి “ పండితుల్

మొదలె యబద్ధమాడుదురు, మోసముచేతురు వారినమ్మ టొ
ప్పదు సుఁడి" యంచుఁబల్కి తలవంచి నగున్ మొగమెత్తుఁ గ్రమ్మఱన్. ౭౪

చ. పలుచని పండుటాకులకుఁ బాగుగ నీనెలుదీసి చక్కఁగాఁ
జిలుకలుచుట్టి దొంతరలుచేసి యమర్చి కరాంగుళీదళం
బుల నిఱికించి తెచ్చి వలపుల్ మొలపింపుచు నిచ్చి యంతటం
బలుకును జిల్కపల్కులను వ్యంగ్యపురంగు చెలంగి పొంగఁగన్. ౭౫

శా. ఎంచు న్మర్మము లెత్తి మాటికిఁ, దుటాయించుం గనుల్, బన్మిటా
రించుం జన్గవపై చెఱంగు, వల పూరించున్, నగించున్, బ్రశం
సించున్, మించు మనోవికారమును సూచించున్, మరుల్ నెంచు ; న
మ్మించుం బోఁడిస్వభావమో ? యతని నమ్మించన్ బ్రయత్నించుటో ? ౭౬

చ. ఎడపక యొల్లవేళ మఱి యెప్పుడు చూత మటన్నఁగాని య
క్కడనె వసింపుచుండుటయ కాని యొకానొకవేళనైనఁ దాఁ
దడయక యింట నుండినవిధం బది యెట్టిదియో యెఱుంగ ద
ప్పడఁతుక, దానిచిత్తమును బట్టిన భూత మదెట్టిదో కదా ! ౭౭

సీ. ఒకమాఱు మనుచరిత్రకథాంశమున వరూధిని మరుల్ సెందు పట్టునను జదువు
నొకమాఱు నాయికాదికచేష్ట లెఱిఁగించు రసమంజరీరసప్రసృతిఁ జదువు
నొకమాఱు నభినయప్రకటీకరణచణాభినయదర్పణరసాభిరతిఁ జదువు
నొకమాఱు గానవిద్యోపయుక్తస్వరసంగ్రహముఖ్యగ్రంథసంగతులు చదువుఁ

తే. గీ. గ్రొత్తక్రొత్తలు జావళీల్ క్రొత్తక్రొత్త
పదములును గ్రొత్తక్రొత్తలౌ వర్ణములును
నింపు దళుకొత్తఁగోరి రచింపఁజేయు
నేమి చెప్పఁగవచ్చు? నయ్యింతిచర్య. ౭౮

ఉ. ఆవగలాఁడి వచ్చువఱ కాతఁ డనంతవిషాదవేదనల్
భావమునందుఁ జెందు ; నటుపైఁ జనుదేరఁ గ్రమక్రమమ్ముగాఁ
జేవ మనమ్మునం దగులఁ జేయును గాని మనోవికారసం
భావన బైటఁ బెట్ట డఁట ! బాపురె ! యాతనిభావ మెట్టిదో ! ౭౯

ఆ. వె. ఆసరోజనేత్ర యరుదెంచువఱకె సం
భాష మతని, కాళతో మనోజ్ఞ

అరుగునంతవఱకె యామోద మిగతి
జరిగెఁ గొన్నిదినము లంతలోన, ౭౦

ఉ. వేసవి వచ్చె భాస్కరనవీనగవీనమితామితాచ్ఛగు
చ్ఛాసవవాసనైకదలనాకలనాకులనాయికాసము
చ్ఛ్వాసనశాసనాదికృతిఝుంకృతిసంకులషట్పదావళీ
భాసురశుష్కపుష్పవిటపప్రకరప్రతిభాప్రమోదమై. ౭౧

సీ. సూనబాణునికేళిఁ జొక్కి యక్కున వ్రాలుప్రియురాండ్రఁ బైఁటచే విసరువారు
విసరినందులకునై కొసరి యింకొకసారి వెడవెడపనుల కొప్పించువారు
నొప్పించినను నొప్పకున్న క్రొన్ననబోణులను "మాబగులు దీర్పు" మనెడువారుఁ
దీర్పుకొమ్మన్న విదిర్చి శయ్యను డిగ్గి చనువారిఁ గని ముద్దుఁ గొనెడువారు

తే. గీ. ముద్దుఁగొని సుద్దులను గొంతప్రొద్దుజరపి
మలయవాయువు లిరువురఁ గలఁకదేర్పఁ
గలయఁదమకించి కోడికూఁతలనుఁ దలఁకు
వారలైరఁట గ్రీష్మవిభావరులను. ౭౨

చ. వదలినఁ జచ్చిపోదు మనువారలు తక్క సమస్తదంపతుల్
పొదలెడి గ్రీష్మతాపమును బొంది సహింపఁగలేక తెల్లవా
ఱుదనుక వేఱువేఱుగఁ బరుండి నిశాంతసమీరపోతసం
పద లొలయంగ నైక్యగతి వర్తిలఁ బూనుదు రట్టివేళలన్. ౭౩

ఉ. వేసవితాప మిట్టి దని వేమరు నొక్కి వచింప నేల? యా
యాసము నొంది తాపమున కాఁగఁగ లేక రమావిభుండు దా
వాసముఁ జేసె నంబుధి. నివాసముఁ జేసె నుమేశుఁడున్ హిమా
నీసముపేతపర్వతవనీతటినీతటకుంజమండలిన్. ౭౪

చ. ఇతరుల దాహపుం గతుల నెన్నఁగ నేల! దినేశు నంతవాఁ
డతితరతృష్ణచేఁ దన సహస్రకరమ్ములు సాచి నేమపుం
గతి విడనాడి కుంటలనె కాదు, నదమ్ములఁ గాదు, కూపసం
తతులనె కాదు కంటికిఁ గనంబడి నంతయుఁ ద్రావె నీరమున్. ౭౫

ఉ. అట్టి బెడంగుకాఁక నలరారి వెలింగెడి గ్రీష్మతాపసం
ఘట్టనకున్ స్మరాగ్ని యలుకం గని దాఁకి యింతు నలుచు బల్

పెట్టితనంబు పూసి కడు వృద్ధినిఁ జెంది వియోగతప్తులం
బట్టి పలార్చెఁగాని పరిపంథినిఁ బట్టి పలార్చ నేర్చెనే ? ౮౬

శా. వచ్చెం బ్రోషితభర్తృకాంగనల తాపం బార్పఁ బెన్గానలం
జిచ్చుల్ మాయఁగఁ జేయ సస్యములకున్ జేయూఁత గైసేయ వి
ద్యుచ్చంచద్ఘనమాలికానినదభీత్యుద్వేజితస్వాంతయో
షిచ్చారూన్నతమాంసలస్తనభరాశ్లేషంబు వర్షర్తువున్. ౮౭

తే. గీ. వాన కేళీగృహమ్ములు వదలనీదు
చలి తమంతనె కౌఁగిలింతలను దార్చు
మబ్బు రాత్రిందివమ్ముల మాటుపఱచు
వర్ష ఋతువంత లేది ? దంపతులదాది. ౮౮

క. బోరునఁ బడియెడివర్షాసారంబులు వహ్ని నపుడు చల్లార్చంగాఁ
జారుస్త్రీకుచకలశాధారంబై బ్రతుకుఁ గాంచె దంపతిమధ్యన్. ౮౯

వ. అట్టియెడ నింట నెవ్వరును లేని యొక్కనాఁటి రాత్రిసమయమ్మున నత్తలోదరి మితభూషితాంగియై "అనుగుణంబగు సమయంబు నేఁటికిఁ జేకూరె" నని సంత సించుచు రహస్యప్రకారమ్మున

ఉ. వచ్చి గృహమ్మసొచ్చి యొకవైఖరి నాతనిఁజూచి యంతఁ దా
నచ్చపలాక్షి ధ్యాతఁ డసహాయతఁ శయ్యఁబరుండి గ్రంథమున్
జెచ్చెరఁ జూచుచుండఁ దరిఁ జేరఁగ సందియ మంది ద్వారమం
దచ్చపు బంగరుంబ్రతిమ యట్టుల డాఁగిలియుండి క్రిమ్మఱన్. ౯౧

క. మెలమెల్లనఁ జని శయ్యాతలనికటమునందు నిలువఁదత్తఱమున న
వ్వెలఁదుకఁ బొడఁగని యాతఁడు నిలువున నీరాయె నదియు నివ్వెఱపడియెన్.

క. అతఁడును నదియును నిటు ల, ప్రతిపత్తి విమూఢగూఢభావోదయసం
గతులైయుండిరి క్షణపరిమితకాలం బదియు శక్యమె ? వర్ణింపన్. ౯౩

సీ. తనకు నద్దానిపై మనము పుట్టకయున్నఁ 'బొమ్ము పొమ్మ'ని చెప్పఁబోలదొక్కొ !
ఇచ్చగల్గినఁ జనవిచ్చి కౌఁగిటఁ జేర్చి మరుకేళిఁ గరఁగింపు మెఱుఁగఁడొక్కొ !
అక్కన్నెయెవ తెయో యనుటకింతకుమున్న ప్రతిదినమ్మునుగంటఁబడనిదొక్కొ !
పాపమంచును భయంపడుట కీలోనసే హృదయసంగతులచేఁ బొదలఁడొక్కొ !

తే. గీ. కామశాస్త్రప్రశంసలఁ గనఁడొ, వినఁడొ !
యేమిభావించెనో యాతఁడెవరికెఱుక ?
రమ్మనియుఁ బొమ్మనియు మాటరాదు నోట
" వలపు సానికిఁ బలుపు దెబ్బలు " ఘటించు.

తే. గీ. అటులఁ దన్నాదరింపని యతనిరీతిఁ
గాంచి మదిలోనఁ గోపమ్ముగదుర మరలి
పోవుటకు నుద్యమించి యూర్పునిగుడించి
యించుక మనమ్ములోన యోజించి మఱియు.

ఉ. దాపునఁజేరి హస్తమునెదం గదియించినయంతమాత్రనే
కాఁపుర మాయె మేను పులకప్రకరమ్ములకున్, మనమ్ములోఁ
గాఁపురమున్నజ్ఞానము పికాపికలై చనె ; నెట్టకేలకుం
బాపపుభీతియుం దొలఁగి పర్విడె ; నెంతకుఁ జాలరంగనల్ ! ౯౬

శా. ఆరీతిం గని యాసతీతిలక మత్యానందముం జెంది " ని
న్నే రామామణి యిట్లుచేయఁగలదోయీ ? యంగనారోగ్యమా
గారా మెల్లను నీవచేసెదవు పో ! కాకేమిరా ! " యంచుఁ గ
ర్పూరామోదితపూగసంకలితతాంబూలమ్ము నందిచ్చుచున్. ౯౭

ఉ. " మంచిదికాని, ' వేశ్యలకు మాయలు మెండెటువంటివారలన్
వంచనఁజేతు ' రందు ; రది వాస్తవమే ; తమవంటి వారికిన్
వంచన మంచి గాదుకద ? వచ్చెడియట్లనె యుత్తరమ్ము వ్రా
యించియు రాకపోవు టిదియేకద ? ధర్మము మంచివారికిన్ ". ౯౮

తే. గీ. అనిన నతఁడిట్లులను " నింద్యమనియుఁ బాప
మనియు నేమానితినిగాని యన్య మెఱుఁగఁ ;
జేతునని చెప్పియును జెడ్డ సేయరాదు,
చేయనని చెప్పియును మంచిచేయవచ్చు.

ఉ. ఇప్పటికైనఁగాని మనమెంతయు సందియమందుచుండె నీ
తప్పులనెప్డు నేనెఱుఁగఁ దన్విరొ ! నీదు కతమ్మునంగదా ?
యిప్పటి కిట్టిరీతి ఘటియించె ; మఱొక్కటి విన్ము, నీయెడం
దప్పెవు తప్పునో యపుడ తప్పఁజుమీ ! మనస్నేహభావమున్. ౧౦౦

క. అని ప్రీతినవోఢఁ బలుకుచు ననుకంపాకంపితాంతరంగుండై య
న్వనితామణికిన్ వశుఁడై యనుకూలుండై పరవశుఁడై తమిఁ జెందెన్. ౧౦౧

సీ. అజ్ఞాత గాత్రభేదజ్ఞానవిలసనం బనతీతరతిరహస్యాగమంబు
అనిరుద్ధదంతచ్ఛదామృతాస్వాదనం బప్రియత్వాప్తబంధానుగమము
అనిమిత్తతాడనాన్యోన్యసంభృతసుఖం బజ్ఞేయపూర్ణమోదానుభవము
అనుపసంహృతవచఃప్రారంభసంరంభ మనివార్యఘుమ్మ్రీపకావతార

తే. గీ. మవిదితనఖక్షతవ్యథం బప్రమేయ
రసవిశేషపరిసార మరాళచేష్ట
మనియతాలింగనాఢ్య మవ్యాజగంధి
ప్రథమనిధువన మక్కవిప్రవరుఁ డెనసె. ౧౦౨

*సీ. [illegible]
[illegible]

క. కుచకించిచ్చలనంబు కటిచమత్కారంబు మేని తేవి బెళుకుఁజూ
పు చురుకు సొరెకు వర్ణింపుచు మెచ్చె నతండు దాని పుంభావంబున్. ౧౦౪

చ. ఎఱుఁగరు కష్టమింత సుఖమింత విలాసవిశేషమింత యం;
చెఱుఁగరు మోహమింత వలపింత పెనంగిన దింతయంచు నా
సరసుఁడు నాసఖీమణియు సౌఖ్యరసాంబుధిలోన మున్గి తే
లిరి ; వివరింప శక్యమె ! బళీ ! మఱి వారి వినోదవైఖరుల్. ౧౦౫

వ. అంత

తే. గీ. జారిణీజారసురతపరిసంగభంగ
మంగజానంతతాపశాంత్యౌషధంబు
చోరకృత్యాంతరాయ మాచారివిప్ర
కోటివిజ్ఞప్తి విననయ్యెఁ గోడికూఁత. ౧౦౬

వ. అంత

సీ. నలిగిపోయిన పుష్పములు కీలుజడనుండి యడుగడ్డునకుఁ దొరివయందు రాల
మలయు ప్రాతఃకాలమలయవాయువులచేఁ జెమటబిందువుల మొత్తము లణంగఁ
గురియు నున్మంచుతుంపురులు కెమ్మోవినొక్కుల కించుక భరమ్ముఁ గలుగఁజేయ
నతిరతిపరవశస్థితి వియ్యమంగు నిద్దుర నెత్తి కెక్కి తత్తఱముఁజూప

తే. గీ. 'నెవరుచూచెదరో' యంచు నించుకంత
భయముగల్గియు, 'నాకేమి భయ' మటంచు
దిటము మదిలోననూని యచ్చటుల నేర్చి
"టింగురంగా" యటంచు నింటికేగి జనిరొ.

క. దీనజనాదరణా! శరణానుగతాభరణ! సంతతాశ్రితతరణా!
నానావిధగుణవరణా! భూనుతచరణా! యఘాంకభూతేట్స్మరణా! ౧౦౮

శా. ఆగర్భానుగతప్రకృష్టధనధాన్యామూల్యసౌధాదిసు
శ్రీగణ్యా! సరసాగ్రగణ్య! సితనీరేజాతవాతాశనే
డ్భాగాలంకరణాగశీతనగమాన్యస్వచ్ఛకీర్తిప్రభా!
భోగత్యాగసుయోగ! సత్కవిజనాంభోజాబ్జినీబాంధవా! ౧౦౯

స్రగ్విణి. శ్రీమదానందవర్ధిష్ణుజిష్ణూపమారామ! కామేశ్వరీప్రాంశ్యదీప్యద్గుణా
సీమ! సీమంతినీశ్రితనూజా నయగ్రామ! కామేశ్వరీగర్భచంద్రోదయా!

గద్య

ఇది శ్రీ...తిరుపతివేంకటేశ్వరప్రణీతంబైన పేశలకల్పితంబగు
శ్రవణానందంబను మహాప్రబంధమునందుఁ
చతుర్థాశ్వాసము.

యన రాఁబోకుము వారికి న్మనకుఁ గొండం తంతరం బున్న; దో
మనమా! వద్దిక నాదుమాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! ౫

మ. 'మును లీలాశుకకాళిదాసకవిరాణ్ముఖ్యుల్ ఘనస్త్రీలతో
డను గ్రీడింపరె? దాన వారల ప్రతిష్ఠల్ వోయెనే?' యంచు నీ
వనఁ దప్పౌఁ జుమి; నక్కయేడ! దివిజాగ్ర్యస్థాలయం బేడ! ఓ
మనమా! వద్దిక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! ౬

మ. 'తనయంత న్నినుఁ గోరి వచ్చినది యీతన్వీమణి న్వీడఁగాఁ
జనునే? నీ' కని బుద్ధిచెప్పెదవు మెచ్చన్ వచ్చు నీసుద్ది; యీ
తనువే, శాశ్వతమా! పరమ్ము వలదా! తప్పుల్ విచారింపవా!
మనమా! వద్దిక నాదుమాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! ౭

మ. తనువుల్ బుద్బుదముల్, యశం బనఁగ నిత్య, మ్మట్టి యీ సద్యశ
మ్మును నీతుచ్ఛసుఖాప్తికై క్షణములోఁ బోఁగొట్ట నుంకించె దీ
వనుమానింపవు లేశమాత్రమునయినన్ హా! యెంత దౌర్భాగ్యమో?
మనమా! వద్దిక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! ౮

మ. జననంబంది సమస్తపండితులు మెచ్చన్ దెచ్చికొన్నట్టి కీ
ర్తిని నిష్కారణ మెక్కనాతికయి వ్యర్థం గల్పఁగానేల? లోఁ
గను, ఱంకొక్కటి నూఱునోములను మెక్కంజాలు నిక్కమ్ముగా
మనమా! వద్దిక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! ౯

మ. 'వనితాసంగమ మెన్నఁ జంచలము, స్వప్నప్రాభవం; బట్లు కా
దని చేయం బరిణామనీరసకరం, బాజోలికిన్ బోకు' మీ
వని వేసారులు చెప్పియుం దుదకు నాహా! యెంత చేయించితో!
మనమా! వద్దిక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! ౧౦

మ. 'నను నీ వెప్పుడుఁ బాయ వ'ద్దనుచు నా నారీవతంసంబు దె
ల్పిన 'నట్లే' యని యొప్పుకొంటివి, నిపుడా లేమ న్వీడంబాప వా
నని యూహించెద, వెంత సత్యమతివో హా! మెచ్చఁగావచ్చు నిన్
మనమా! వద్దిక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! ౧౧

మ. 'జననంబందిన దానికిన్ ఫలము వేశ్యాకామినీవక్త్రచుం
బనమే కాక మఱేమి యున్న దిదియే భవ్యం బభవ్యంబు గా'?

పని వాదించెదు, నీచరిత్ర మది వహ్వా! మెచ్చఁగా వచ్చునో
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! ౧౨

మ. జననం బందిన దానికిన్ ఫలము సచ్చారిత్రుఁడై సర్వస
జ్జనులుం దన్ను నుతింప ధర్మపరుఁడై సాక్షాత్పరబ్రహ్మముం
గన నూహించుట కాక, కామి యయి భోగస్త్రీల భోగింపుటా?
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! ౧౩

మ. 'తనుఁ దా వచ్చినవేశ్యఁ గూడు సుఖ మింతా! యెంతయో తెల్ప నా
కను వౌనా? యది యట్టు లుంచు మిది బ్రహ్మాదుల్ గణింపంగ శ
క్తిని బొందం గలరా!' యటం చనెదు, నీతీపింత గాఁబోలు నో
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! ౧౪

మ. 'అనుపయ్యోన్గద! నీకు దీనికిని జాత్యాదుల్ కళాశాస్త్రరీ
తిని, నహ్వా యిఁక దీనిపైఁ జనెడి బుద్ధిన్ ద్రిప్ప నీ వొప్పుకొ
న్నను నేనొప్పదు నే?' యటం చనెద వన్నా! యెంతస్వాతంత్ర్యమో!
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! ౧౫

క. అని యీగతిఁ దన మనమున ననేకరీతులుగ నెంచి యనుతాపమ్మున్
గను నాలోచనె యచ్చెలి చనుదెంచె యథాస్థితముగఁ గదునను మిషచే. ౧౬

క. చనుదెంచెఁగాని యాతని మునుపటిరీతిఁగను జూడ మోమోటముఁ జెం
దును, వెల్వెలఁబాఱును, సిగ్గునుగను; మెతకగుణ మెంత క్రూరపుగుణమో! ౧౭

చ. చదువఁగ సంశయించు, నెకసక్కెము లాడఁగ సంశయించు, సాం
పొదవ బుజాప్రికారమున నూరక యుంటకుఁగూడ సంశయం
బెదఁగను, నింతకన్న మునుపే కడు మేలని లోననెంచు నా
సుదతి; పరుల్ గదా! హృదయచోరులు కాంతల కంత దాఁటినన్. ౧౮

స. పిమ్మట నాతండును నిశీథసమయమ్మున మదనవిధుప్రేరితుండై యద్దాని గృహ
మ్మున కేతెంచుచు హఠాత్సంజనితకించిద్వివేకవశమ్మున. ౧౯

మ. ఘనరాజన్యశిరస్తటీమకుటసత్కారమ్ము చే మించు న
న్నునుఁ బ్రేరేపణఁ జేసి వ్యర్థముగ నెంతో పాప మార్జింప నీ
ఘననారీమణి చెంతఁ జేర్చె, దిదియున్ ధర్మమ్ము గాఁ దోఁచెనే?
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! ౨౦

మ. చనవొప్పన్ జనపాలసేవకనమస్కారమ్ములం గొంచుఁ, ద
ద్ధనసౌధమ్ముల ద్వారసీమలను నిత్యమ్ముం బ్రవర్తించు న
న్నను నిర్లజ్జునిఁజేసి వేశ్యగృహమున్ దూర్పంగ నీకొప్పునే?
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! ౧౧

మ. ఇది దుష్కార్యమటంచు నాతఁడిటు లెంతే లోన నూహించుచుం
దుదకున్ గూఢముగాఁ దదీయగృహమున్ దుంచుద్యుక్తుండై [illegible], యా
మ్మదిరాక్షీఘనసుస్తనాగ్రపరిరంభప్రక్రియాభోగముం
పదచేఁ డానెవరో యెఱుంగఁ; డపుడుం గాంచెత్యముల్ [illegible] ధానీ! ౧౨

మ. అటులేగెన్ మఱికొంతకాలము రహస్యప్రక్రియల్ [illegible]
చ్చటి కీతండును నేఁగు, నిచ్చటికి నచ్చంగాస్త్రియున్ వచ్చు. న
ప్పటి కేప్రక్రియ వీలొ యట్టులగుఁ; జెప్పన్ శక్యమే? [illegible]
ఘటనానైపుణి! యాతఁడయ్యదియొ? యక్కాంజాక్షియో [illegible]? ౧౩

చ. మదిని విరక్తి దోఁచెనో, సమంజస [illegible] పటించు [illegible]
ద్ధి దిరిగి పోయెనో, మఱి పదింబది పెద్ద లొనర్చు నిందనుం
బెదరెనొ యేమొకాని, సరవిం దదనంతర మా లతాంగి [illegible]
ర్తిదుఁడయి యాతఁ డేగఁ బరదేశ మెుకానొకఁడౌ నెపమ్మునన్. ౧౪

క. శ్రీమంతము సతతహిమానీమంతము వర్జితతటినీ గాహనమే
శీమంతము ప్రబలించెన్ హేమంతము విరహిజనులకే సంతంబై. ౧౫

క. చలి పెట్టి యుష్ణరుచి కంబలకంచుకరాంకవాద్యపహస్తుండై యి
మ్మల మునుఁగఁబోలుఁ; గిరణమ్ముల పస లేకున్నఁ దగ్గిపోవునె? [illegible] ౧౬

చ. పగలు కృశించె, రాత్రి విరవాఱెఁ, గుబేరదిగంతరాగతా
శుగము జనాళి కాశుగము సొంపునఁ దోఁచె, ననంగపహ్ని హె
చ్చె, గిరివరమ్ము లన్నియు హసించె హిమాచలమున్, జలమ్ము పం
డ్లు గొలుకసాఁగె, వృద్ధులు కడున్ భయమందిరి పాం[illegible]మలున్. ౧౭

తే. గీ. అట్టి హేమంతమున నతఁ డన్యదేశ
వాసి యగుటకు నబ్బాల పగలఁ బొగిలి
నూతనవియోగ మెంతయుఁ జేత మెరియఁ
జేయఁ దనయంతఁ దా నిటుచింతఁ జెందు. ౧౮

సీ. "గుబ్బలా యివి ? కావు; కుంభికుంభోరోజ ! నాపూర్వజన్మపుణ్యములు గాని
అధరమా యిది ? కాదు మధురబింబఫలోష్ఠి ! రహిమించు నమృతపాత్రంబు గాని
కన్నులా యివి ? కావు కమలసన్నిభనేత్రి ! కళలనీనెడి ధేనుక లగుఁ గాని
వదనమా యిది ? కాదు వారిజారిసమాస్య ! నామనోరథనిధానంబు గాని

తే. గీ. బాలికవు నీవు గావహో ! నీలవేణి
లీల నూఁగెడి మరునిడోలికవు గాని"
అనుచు నుపగతవేళ న న్నాదరించు
వాని మేలెట్లు నే మఱపంగ నేర్తు ? ౨౯

చ. నిను విడనాడి నేఁటికి గణింపఁగ నొక్క నెలాయె నోయి ! నిన్
గనుఁగొను నిచ్ఛఁ గన్నులును గాయలు గాచెఁగదోయి ! పేర్మి నె
మ్మనమున నెంచవోయి ? యనుమానము మానఁగదోయి ! నాపయిం
గనికర ముంచవోయి ? కడకంటను జూడకు మోయి ! మ్రొక్కెదన్. ౩౦

క. అని చింతించుచు మధుసూదను మిత్రుం డొక్కఁడతని తావునకుం బో
వు నెసకమున్ విని యవ్వనజనయన తనవంత యతని సన్నిధిఁ జెప్పెన్. ౩౧

తే. గీ. మాటిమాటికిఁ జెప్పి యమ్మృగువమిన్న
చింత గొనుటయు, నాతఁ డచ్చెలియ తమక
మెల్ల మధుసూదనునితోడ నెఱుఁగఁ జెప్పెఁ;
జెప్పినంతనె యాతని చిత్త మదరె. ౩౨

తే. గీ. ఇన్ని దినములనుండి యావన్నెలాఁడి
తోడఁ గ్రీడించు భాగ్యంబు గూడదయ్యె ;
సౌఖ్యములు పెట్టిపుట్టని సమయములను
సౌఖ్యములు గోర నేరికి సంభవించు ? ౩౩

ఉ. ముక్కర ముక్కునం గదిసి ముద్దులు గుల్క, బులాకి మోవిపై
చక్క నటింప, లే నగవు చాయయుఁ లజ్జయుఁ గుమ్ము లాడ నా
యక్కనఁ జేరి నాయనునయమ్ములకుం బ్రతిఁ జెప్ప కెక్కడో
మక్కువఁ గౌఁగిలించుకొను మత్సుకృతమ్మును జూచు టెన్నఁడో ? ౩౪

సీ. నాముద్దులమిటారి నావన్నెలకటారి నాపున్నెములకోవ నాదుచేవ
నావలపులదీవి నాయమృతపుబావి నాసోగనులతేట నాదుమూట

నా కోరికలయిక్క నా నాశేముల చుక్క నా రసమ్ముల సీమ నాముద్దుపేను
నా కనుంగవవిందు నా పెనుపగమందు నా కల్మి నా బల్మి నాదు చెల్మి

తే. గీ. నాదు రెండవప్రాణంబు నామనోఘ
నంబు నాగుట్టు నామట్టు నాదుపట్టు
నన్ను విడనాడి యేగతి నున్న దొక్కొ
చెప్ప కేగె నటం చేమి చేసె నొక్కొ!

ఉ. 'నాతిరో! లాతియూరికని నాథుఁ డంపెతి వా' యటన్న 'నే
నాతని నూర' లే నని తనంతనె కన్నులనీరు జాలుఁగాఁ
గాతర వైతి వంచుఁ జెలికాఁడు వచించెను ; నాదుకన్నులే
యాతనిఁ జూచెనేని మగువా! యవి యెంత విచార మొందునో.

చ. క్రమముగ మానసంబు కనుగండె నినుం గనుభాగ్య మబ్బమిన్ ,
దమకము హెచ్చె, మిన్నుపయి దాఁటినయట్టులఁ దోఁచె, నీదు పై
దములకు వాచెఁ గన్నులు, ముదంబు యథాయథలై నశించె, శ
క్యమయిన స్వప్నమందయినఁ గన్పడుమా! యొకమాఱు నెచ్చెలీ!

సీ. చిఱునవ్వు మొగమందుఁ జెంగలింపఁగ సిగ్గుపడుట కైనను సిగ్గు పడెడి దాని
భక్తి విశ్వాససంపర్కమ్ముచే బయల్ పడెడి కించిత్ప్రియాదరము దాని
ఇటు చేయు మని చెప్ప నెట్టకేలకు సమ్మతించి తత్కృతి నాచరించు దాని
సురతమ్మునం దనాదరము గల్గియు నాదరమ్ము లే దని చెప్ప రాని దాని

తే. గీ. నుత్తరము చెప్పఁదగనట్టియుక్తులకును
మొగ మొకించుక వంచుక మురియు దాని
ముగుదయని మధ్యయని చెప్పఁదగనిదానిఁ
జూడఁదగుసోయగముదానిఁ జూడవలదె!

చ. గరువపుఁజెయ్వులా? మెయినిగారములా? కులుకారుతీరులా?
పరువమునిగ్గులా? వలపుభావములా? రస మొల్కునల్కలా?
మఱవని ప్రేమలా? తలఁపు మర్మములా? వెలలేని ముద్దులా?
యఱువదిమందిరైన సరియా? మఱి యాకరియానయానకున్.

ఉ. బోటిరో! నాఁడు నేలకులు పొల్పుగ నా కిడువేళ వ్రేలునీ
నీటుగు గోట గీఁటి ; తది నేఁటికి నిన్ను స్మరింపఁ జేసెడిన్

మాటలు వేయు నేల? యొకమాట వచించెద నెంచి చూడఁగా
మాట లడంగుఁ గాని మఱి మచ్చ లడంగునె? మానినీమణీ! ౮౦

చ. రతి యన నెట్టిదో యెఱుఁగరాని ననుం గని యాత్మశక్తిచే
నతివరో! జారపూరుషులయందు మహాత్మునిఁ జేసినట్టి నీ
చతురత కేమనందుఁ? గడుఁ జాణవు జాణవు జాణ; యింత చి
న్నతనములోన నింతటి ఘనంబగు శక్తియుఁ గల్గియుండునే? ౮౧

క. ఎన్నఁడు రతి నెఱుఁగనియా మున్నె మెఱుఁ గాయె, నింత మునిఁగె నెఱిఁగినం;
"దిన్నమ్మకుఁ దిన్నంతయుఁ గన్నమ్మకుఁ గన్నయంత" కాదె మృగాక్షీ? ౮౨

చ. 'వ్రతమును బాడుచేసి నను వంచనఁ జేసితి వెంతదానవే?
యతివరో' యన్నమాట కహహా! యని నవ్వుచు 'ముద్దవైచియుం
చితిరె? బిగింపు మాట లికఁ జెప్పకుఁ' డంచు వచించునాఁటినీ
చతురత నేఁటికిన్ మదిని జల్లని వేళఁ దలంతుఁ గోమలీ. ౮౩

చ. అలదినమందు నాస్థలమునం దలకేళిగృహమ్మునందు నా
సలు దనివార నీసురతసౌఖ్యము దేలిననాఁటనుండియుం
గులసతి మోము గన్గొనుటకున్ మన సొగ్గదు; "అంకు సాఁగఁ బెం
డిలి యిఁక నేల" యంచును బఱించెడి పెద్దలనోరు కొట్టవే నే? ౮౪

ఉ. దూరమునందునుండియును దొయ్యలి! డగ్గఱి యున్న రీతిఁగాఁ
బీరముఁ జూపుచుంటి వది బేషు! సెబాసు! బళా! యిదేమె? యో
నీరజగంధి! కంటి కొకనిద్దుర పట్టక మున్నె ప్రక్కలోఁ
దూఱెదు, కన్ను విచ్చినను దుఱ్ఱున దూఁటెద వెంత దానవో? ౮౫

ఉ. అన్నుల మిన్న! నిన్నుఁ గని యందురు కొందఱు మూర్ఖు "లెంతయుం
జిన్నెలు వన్నెలుం గలుగు చేడియ గా దిది" యంచు, దాన నీ
వన్నెల కేమి లోప? మది వారలకన్నులలోప మెన్న, నా
కన్నులు వారు పెట్టుకొని కాంచిన నోరులు మూయకుందురే. ౮౬

ఉ. అన్నిటి కేమిగాని మగువా! యొకటే నిజమైనమాట, నీ
చిన్ని మెఱుంగుఁజూపులును జిత్రపుఁ బల్కులు మొల్కనవ్వులుం
దిన్నని భక్తియుం దనివి దీఱని ప్రేమయు నెంతతంద్రిలో
నున్నను నిన్ దలంపుటకు నోపిక నా కిడఁజాలెడుం జూమీ. ౮౭

చ. మమత దలిర్పఁగా నుపరిమన్మథ కేళిని గూడువేళ "నో
రమణిరో! నన్నుఁ గూడి యిటు ఱంతులు సేయఁగ నీకుఁ జెల్లెఁ గా
క మహిని దేని కా" ననినఁ "గాక మరే, యిది నాదుపూర్వపు
ణ్యా"మని వచించు నీదు వచనంబులు నామది నాట కుండునే? ౪౮

ఉ. రాపిడి గబ్బిగుబ్బల నురమ్మునఁ గ్రుమ్ముచుఁ గోర్కెఁ దెల్పుచుం
గోపము లేకయే కసరి కొట్టుచు "నొచ్చితి" నంచు వింతలం
జూపుచు ముద్దుపెట్టుచును సొంపుగ నన్మొగ మెత్తి చూచు నీ
చూపుల కీయఁగా వలదె? సోలెడు పద్యము లంబుజాననా. ౪౯

చ. సముఖముఁజేరవచ్చి బిగిచన్నులఁగ్రుచ్చి కవుంగిలించి ప్రా
యముతమిఁజూపుచుం దమలపాకుల చిల్కలు నోటఁబెట్టుచుం
దమకముమీఱ నన్నుపరతమ్మున సోలఁగఁజేయునట్టి భ
ద్రముగల నాఁటిరోజు లిఁక రా విఁక రా విఁక రావు నెచ్చెలీ! ౫౦

చ. రకముగ నన్నుఁ గూడుటకు రాతిరివెన్నెలవేళ రాఁగ, మె
చ్చి కవుఁగిలించి "నీవెవరొ? చెప్పుము నాయికలం" దటన్నఁ, జె
ప్పక నగుఁబా టటంచుఁ బొరఁబాటున మెల్లనఁ "జంద్రికాభిసా
రిక" ననిపల్కు నీవచనరీతులు నామది నుండకుండునే. ౫౧

ఉ. 'పావనకీర్తి యీతఁ' డని పండితులెల్ల నుతించి కొల్వఁగా
భూవలయమ్మునన్ యశముఁ బొందుచు నుండెడి నాకు నయ్యయో!
నీవగలే సదామదిని నిల్పి భజించుట లబ్బె నెచ్చెలీ!
దైవము వ్రాయువ్రాఁత లవి తప్పవుగా భువి నెంతవారికిన్? ౫౨

చ. సొగసులదొంతియైన యల సుందరిచెయ్వు లవెంత మూర్ఖుడుం
బొగడఁగ రాని వం చనఁడు; పున్నెము లేనిదినమ్ములన్ స్మృతిం
దగులఁగఁజేసి నాకుఁ బరితాపము హెచ్చఁగఁ జేసి నీవునుం
బొగిలిన నేమియౌ! మఱచిపోయి సుఖమ్ముగ నుండు చిత్తమా! ౫౩

ఉ. రాతిరి కొంత నిద్ర గదురంగనె దూరమునందు నున్న యా
నాతినిఁ జూడఁబోయి యట నాలుగుజాలును నుండి యిప్డుగా
చేతమ! వచ్చితీ; విటులఁ జేసిన నిన్నిఁక నేమి సేసినం
బాతక మున్నదే! యిటుల భామల మాయలఁ జిక్కవచ్చునే! ౫౪

సీ. "స్త్రీలఁ గూడినఁ జేటు చేకూరు" నని సదా పలుకు నా నా బాలఁ గలయ నేల?
కలసిన, నేమి 'లోకులు భిన్న మర్యాదలకు భంగ' మని భీతిలంగ నేల?
భీతిల్ల నేమి, యాభీతభీతమృగాక్షి నట డించి యిచ్చోటి కరుగ నేల?
అరిగిన నేమి, యాయంగన శోకనీటిబొట్టు డించక యిట్లు పొక్క నేల?

తే. గీ. గతజలమ్మున కేయాన కట్టదేల?
నెట్టి నేర్పులు గలిగిన దిట్టయైనఁ
బరులకును బుద్ధులనుఁ జెప్పవచ్చుఁ గాని
యాత్మకైనప్పు డాబుద్ధు లడుగుపట్టు. ౫౫

చ. కలిమి చెడంగనిమ్ము, కులకామిని దిట్టినఁ దిట్టనిమ్ము, నిం
దలు గలుగంగనిమ్ము, తలిదండ్రులు గుందినఁ గుందనిమ్ము, సం
కెలలు పడంగనిమ్ము, తనకీర్తికి భంగము గల్గనిమ్ము, దాఁ
గలసినకాంతఁ బాయుటది కష్టము కష్టము కష్ట మక్కటా! ౫౬

ఉ. మారకళావిశేషముల మర్మములెల్లఁ బఠించి, లక్ష్యముల్
నేరము వెట్లొకో యనుచు నేను విచారణ సేయుచుండఁగా
నారమణీలలామ తనయంతనె తాఁ గరుణించి నేర్పఁగా
నేరిచినాఁడ; గాని విడనేర్తునె? నేర్చిన దైవ మోర్చునే! ౫౭

క. అని యీగతి మోహాబ్ధిని మునిఁగి మనోరథరథమ్ముఁ బూని యతఁడు వే
గ నిజావాసముఁ జేరెను మనోరథము నిలుపఁదగిన మానిసి గలఁడే? ౫౮

వ. అట్లువచ్చినపిమ్మట ౫౯

ఉ. అక్కమలాక్షి యాతఁడును నగ్గలమై తనరారు పేర్మి పెం
పెక్కఁగఁ గొంతకాలము యథేష్టసుఖమ్ములఁ దేలుచుండఁగా
నొక్కెడ నత్తలోదరియు నొక్క యయోగ్యతఁ జేసెఁ; గంబళిన్
మెక్కుచు వెండ్రుకల్ వెదుక మేకొనుచోఁ గఱ వౌనె యేరికిన్! ౬౦

తే. గీ. రాజరాజైన నెంతటి రసికుఁడైన
నెంత గారా మొసంగిన నెంత ధన మొ
సంగినను జాటున నొనర్చు దొంగసంగ
తుల నొనర్పక మాన దీ కులట జాతి. ౬౧

వ. ఇట్లబ్బాల తనవృత్తివైఖరిం బ్రవర్తింపుచుంటయు. ౬౨

క. ఎఱుఁగక యాతం డెప్పటికరణిన్ వర్తింపుచుండెఁ గామవశుండై
ధర గణికాంగన లొనరుచు దురుపాయములేరికైన దుర్జ్ఞేయంబుల్. ౬౩

వ. ఇట్లున్నంత. ౬౪

క. అమ్మధుసూదను కష్టసుఖమ్ములకు సమప్రసక్తి గలగుణవంతుం
డమ్మగువదైన వృత్తాంతమ్మంతయు నెఱిఁగి యిట్లు తలపోసె మదిన్. ౬౫

తే. గీ. ఎన్నివిధములఁ జెప్పిన నితఁడు మున్ను
వినక తుద కాచరించె నవ్వేలఁది పొందు;
ఆచరించుట కేమి, 'యయ్యతివమిన్న
కన్న గుణవతి' లేదంచుఁ గళవళించు. ౬౬

ఉ. 'అందమునందుఁ గాని మరియాదలపట్టునఁగాని నేమపుం
జందమునందుఁగాని వెలచానలలోనన కాదు, దీనికే
చందనగంధులున్ సవతు సల్పఁగ రా' రని యాగ్రహముండు; గో
సుందరులం దగుల్కొనిన సోమరులన్ సుఖలింపశక్యమే? ౬౭

తే. గీ. అయిన నిద్దాని యవగుణా ల్బతనితోడఁ
జెప్పి విడఁదీతుఁ గాక యచ్చెలియ పొందు;
పత్నితో భర్త నెడఁబాపఁ బాప మండ్రు
కాని వెలయాలి నెడఁబాపఁ గలుషమనరు. ౬౮

వ. అని నిశ్చయించి యమ్మధుసూదను కడ కేతెంచి తత్కాలసముచితాలాపమ్ములం
గాలమ్మగడపుచు నబ్బాల దుశ్శీలంబు సకృత్స్నంబుగాఁ జెప్పి యొప్పించి
మఱియును ౬౯

ఉ. మాయలమారులైన వెలమానిను లెక్కడ! నేమపుంగతుల్
నాయకయుండు లెక్కడ! ప్రపంచమునం దెటువంటివారలున్
రోయక యుందురే! కడలుద్రొక్కిన దిట్టలతాంగియైన దు
ర్జ్ఞేయము లీధనాంగనల చిత్తము లిందు భ్రమింప రత్తముల్. ౭౦

క. ఇంతకుమును మీతోడన్ మంతనమున జెప్పినట్టి మాటలలో నొ
క్కింతయు నయథార్థముగా కంతయు నిజమాయెఁగా యటంచుఁబలికినన్. ౭౧

క. ఆతఁడు చెప్పిన మాటలు చేతమ్మున కెక్కి దాని చేష్టలయందుం
బ్రీతి చెడి తనదు ప్రతిన నిరాతంకముగా నొనర్ప నాత్మగతమునన్. ౭౨

మ. గొనముల్ సున్న, హుళక్కి సత్య మహహా! కూర్మల్ నభఃపుష్పముల్
మనముల్ సూడ శతావధానకృతులే, మానమ్ము కుందేటి కొ
మ్మని నీవెల్లనెఱింగి వారసతి నాహా! యెట్లు వాంఛించెదే!
మనమా! వద్దిఁక నాదుమాటవినుమా, మర్యాదఁ గాపాడుమా! ౭౩

మ. 'ధననారీమణులెల్లఁ దుచ్ఛమతులే తథ్యమ్ము గాఁజూడ నీ
ధననారీమణిమాత్రి మొక్కటె మహాధన్యాత్మ కాఁబట్టి దీ
నిని వర్జింపుటకూడ' దంటి; విపుడేనిన్ గూడునా, కూడదా?
మనమా! వద్దిఁక నాదుమాటవినుమా! మర్యాదఁగాపాడుమా. ౭౪

క. ఈగతి దృఢనిశ్చయుఁడై యాగరితకు వ్రాసె నిట్లు "లకటా! యశముల్
బోఁగొట్టికొంటి నీయనురాగము నిజమనితలంచి రమణీమణిరో. ౭౫

క. చెలికాఁ డాడిన పలుకులఁ గల యర్థం బెఱుఁగలేక కలికిరో! నీప
ల్కులె వేదము లని మురిసిన కలుషాత్మున కిట్టిఫలముఁ గలుగక యున్నే. ౭౬

ఉ. నిన్ననవేల! నీదు కులనీతి నెఱింగినవాఁడనయ్యుఁ బే
రెన్నికఁ గన్న సద్యశము నెంచక చంచలమానసుండనై
పన్నియు వాసియున్ రుచిరవర్తనముం జెడఁగొట్టుకొంటి నా
కన్నను మూర్ఖుఁ డింకొకఁడు గానఁగరాఁ డిఁక వేయునేటికిన్. ౭౭

చ. వలపు నిజంబటంచు మగువా! మది నమ్మితిఁ గాని యిన్ని మా
యలు గలదాన వం చెఱుఁగనైతిఁ గటా! సరివారలందు నా
దలయును వంచుకోవలసెఁ దన్వి? వ్రతంబు చెడెన్ సుఖమ్మునుం
గలుగకపోయె నిట్లగునుఁగా! వెలకాంతలతోడి కూటముల్. ౭౮

ఉ. ఓవనజాక్షి! నీదు కులయోగ్యత లెల్ల నెఱింగి నీపయిన్
భావము నిల్పి పండితులుఁ బామరులుం గడుగేలిసేయఁగా
దే! విధిచోదితుండనయి తేలిక కేలికనైతి; నేరికిం
గేవల కాలకర్మగతికిం బ్రతికూలమొనర్పఁజెల్లునే! ౭౯

సీ. పుట్టినాఁడనుకదా! భువనప్రసిద్ధమా నైష్ఠపకులమందు వనజనయన!
చదివినాఁడనుకదా! సకలవిద్యలను సజ్జనులెల్ల మెచ్చంగఁ జంద్రవదన!
తిరిగినాఁడనుకదా! పరదేశములను విద్యాపరిసంగములకై తలిరుఁబోఁడి!
పొందినాఁడనుకదా! భూమిలో నీపాటివాఁడు లేఁడనుకీర్తి పద్మగంధి!

తే. గీ. అట్టి నాబోఁటి నీబోఁటియైనయొక్క
కాంత కాసించుటే యొక కానిమాట;
దానిలోన రసాభాసదశయుఁగూడఁ
గలిగె నేనియుఁ జెప్పనా! కలికి! సుఖము. ౧౦

క. ధన మీనో? మనమీనో? చనవీనో? నీదు [illegible]త్రిచందము [illegible]
న్నను నొకటి తక్కువున్నదె! పనిలేదిఁక నీగుణంబు బ[illegible]. ౧౧

తే. గీ. కప్రపుంబొడి పంకంబుఁ గలిపి దాని
యందుఁ గస్తూరిగూర్చి గోహటము చేసి
చానిపి పన్నీటితోడఁ బెంచుదురుగాక
యున్నవాసన వాయునే? యుల్లిగడ్డ. ౧౨

తే. గీ. గతజలమ్మున కిఁక నానకట్టగట్ట
నేమియగు? నీకు నాకును ఋణముదీఱె;
మంచిపనిఁ జేసితివి, నాదుమాట లేమి,
జగతి కుపకారమగు చర్యసలిపితీవు. ౧౩

చ. వెలచెలులన్ వివేకులగు పెద్దలు పెండ్లికిఁ బిల్వరాదు; సాం
రలు గల పెండ్లికిం జనఁగరాదు; జనం గనఁబోల దాటపా
టల; నదిగాక విద్యలఁ గడంగి వచింపఁగ రాదు; దీనికిన్
సొలసినవారికెల్ల మధుసూదను దుర్గతి రాక తీఱునే? ౧౪

తే. గీ. అనుచు నెఱుఁగంగ నేర్చినయట్టివారి
కెల్ల నెఱుఁగంగఁ జేసితి విందువదన!
యెఱుఁగ నేరనియట్టి సోమరుల కీవ
కాదు బ్రహ్మయు బోధింపఁగాఁ గలాఁడె! ౧౫

క. నాకొక్కని కపకారము చేకొని యొనరించి తంచు సిగ్గిలఁ దరుణీ!
లోకోపకారకంబగు నీకృతికిన్ మెచ్చవలదె! నేర్పరు లెందున్." ౧౬

క. అని కమ్మ వ్రాసి పిదపం దనయంతన విడిచె దానిఁ దగ నమ్మధుసూ
దనుఁడు; మనము విఱిగినచో వనితామణు లన్న గడ్డిపరకలు గావే? ౧౭

క. వాసవునకైన ధనకాంతాసంగతి వలదు, దానితత్త్వమ్ము రసా
భాసము నిక్కము; సుగుణవ్యాసంగులు దానిబారిఁ బడ రెప్పట్లన్. ౧౮

మ. అతఁ డీరీతిఁ బరిత్యజించుటయు నయ్యబ్జాక్షియుం గొంతఁ దా
మతిఁ జింతించి క్రమమ్ముగా నతని ప్రేమ న్మాని పెన్మాయలాఁ
డితనం బూని స్వవృత్తి సెల్లవిటగోష్ఠిం జెంది పెంపొందె నా !
“గతిలేనమ్మకు గంజి పానక” మనంగా నిక్కమౌనే కదా ! ౭౯

సీ. తలిదండ్రు లింటిపెత్తన మొకించుక లోటు జరుగకుండెడిరీతిఁ జక్కఁబెట్ట
ననుకూల మగునీవిఁ దనకాంత తనకెంతయును వన్నె వాసి నార్జనము సేయ
నతిభక్తి గలశిష్యతతు లెల్లవేళలఁ దను గొల్చి బుద్ధిమత్తను భజింప
లక్ష్మీసరస్వతుల్ దమ పరస్పరవైరములవీడి తనగృహమ్మున వసింప

తే. గీ. బాంధవశ్రేణులెల్ల సెబా సనంగ
సకలదిగ్దేశరాజన్యసభలయందుఁ
దనయశమ్ము నిరంకుశత్వము వహింప
సుఖముగా నుండె నమ్మధుసూదనుండు. ౮౦

క. సతతపరిష్కృతభూదైవతమృష్టాన్నప్రదానవర్ధితకీర్త్యం
చితతాదృశజనకయశోవితతీ ! తతజగదతీతవితరణసుకృతీ. ౮౧

మ. పరిపూర్ణాయురపారభాగ్యవిలసద్భావాంచితా ! కీర్తిసం
భరితాశాంతర ! సత్కవిత్వకుకవిత్వస్ఫూర్తినిర్భేదత
త్త్వరహస్యప్రథమానబుద్ధిబలసంతానాధికా ! నిత్యస
త్యరతా ! చెల్మయమంత్రిపుత్ర ! కవిరాడ్దారిద్ర్యవిచ్ఛేదకా ! ౮౨

క. నానాఫలపుష్పాగనిదానోద్యానాంతరస్థితసుసౌధతలా
నూనబుధసుకవిమిత్త్రవితాన వినోదావధాన ! దాననిదానా ! ౮౩

గద్య.

ఇది శ్రీ కింకవీంద్ర ఘటాపంచానన విద్వత్కవి బాలకలానిధి
బాలసరస్వతీ శతావధాని తిరుపతి వేంకటేశ్వర
ప్రణీతం బయిన కేవలకల్పితంబగు శ్రవణా
నందంబను మహాప్రబంధమ్మునందు
సర్వంబును బంచమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ

సంపూర్ణము

శ్రీరస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః.

# లక్ష్మణా పరిణయము

## ప్రథమాశ్వాసము



శ్రీరామామణి జానకీరమణియై సేవింపఁ దమ్ముల్ సదా
గారాబమ్మునఁ గొల్వ నెల్లయెడలన్ గల్యాణముల్ మీఱ సు
శ్రీరంజిల్లు నయోధ్య నేలికొను నా శ్రీరాముఁ డెల్లప్పుడున్
శ్రీరామాధిపు నాత్మ సామధరు రక్షించున్ గృపాశాలియై.

సీ. సత్త్వరజస్తమశ్శక్తులలో సత్త్వశక్తియౌ లక్ష్మియంశమునఁ బొడమి
యాత్మానుగుణగుణాఢ్యమ్మగు వృత్తిఁ జెన్నారు విదేహుగేహమునఁ బెరిఁగి
తమను ప్రధానమై తనరెడు శివువిల్లు విఱిచిన శ్రీరాము వరునిగఁ గొని
రాజసం బణఁచి యరణ్యమే గెడి భర్తకనుకూలయై వెంట నరిగి రావ

తే.గీ. బాధులను గాంచు జనముల యార్తిఁ దోఁచి
భర్తతోడఁ గుబేర పుష్పకము నెక్కి
మరల సాకేతమేలంగ మరలి వచ్చు
సీత శ్రీరామవిభునకు సిరు లొసంగు.

శా. శ్రీ కెంగేల నెసంగు రాచిలుకఁ జేర్మిన్ జూచి ముద్దాడి "నా
బాకీ తీర్పు" మటంచు మై నిమిరి దువ్వన్, జిల్క "యక్కా! యదే
మో కృష్ణుండనె యింటె" యన్న నగు మా మోమున్ విలోకించు నా
శ్రీకాంతుండు కృతార్థుఁ జేయుత యశోర్థిన్ రామభూమీపతిన్. 3

ఉ. "కల్లలు పన్ని నన్విడిచి కొసలలో నల చెంచుబోటితో
నల్లరి సేయుదే" యని యొయారముగా మగసేఁత సేయుచో
నల్లనఁ జెక్కు గొట్టి "యకటా! కడు నొచ్చితి" వంచు నవ్వు మా
పల్లవపాణి యోగ్యునకు భాగ్యము లిచ్చుత రామశౌరికిన్. ౪

మ. నెనయంజిల్కెడు ముద్దుపల్కులను శ్రీసీలాచలోత్తామృతా
దనసారస్యము గానుపింప నిజభక్త శ్రేణి గీర్తింపఁగా
ననురాగమ్మునఁ దాటికొండనగరిన్ హాళి న్నివాసమ్ము చే
సిన యిల్వేలుపు వేంకటేశ్వరుఁడు వాసిన్ బ్రోచు రామాధిపున్. ౧

సీ. ఐదుమోములజంగమయ్యపూవుంబోఁడి యాఱుమోములవానియనుఁగుఁదల్లి
కలిమికోమలి పల్కువెలఁదుల్ గొలుచుదేవి కడిమితోఁట నెసంగుకలికమిన్న
పోతురక్కసునితోఁ బోరాడిన నెలంత జేజేలసరసి ప్రోచెడి సతంబు
పూఁపజాబిల్లి పూవుందాల్చినవెలంది జగములన్నియుఁ బ్రోపఁజాలుజాణ

తే.గీ. మంచుగుబ్బలి రాచూలి మించువన్నె
పలువఁగట్టిన యెలనాఁగ చలువచూపు
కోపులన్ జూచి రక్షించు గోకిరెడ్డి
వంశమణియైన శ్రీరాము నల్గుధాము.

శా. "నాకై ఘోరతపమ్మొనర్చి తుద కిన్నాయమ్ము గా నాతప
శ్శ్రీకిన్ భంగముకూర్చి కోరి తపు డిస్సీ! యింత మాత్రాన నే
లా? కోప"మ్మని దీనుఁడయ్యె సతియల్కన్ బాపి నవ్వించు గౌ
రీకాంతుండు కృపాళుఁడై మనుచుతన్ శ్రీరామభూమీశ్వరున్.

మ. పతిచే మున్నుగ సామవేదము పఠింపన్ జేసి యామీఁదఁ ద
ద్గతి వీణన్ బలికించి నేర్పుమెయి శుద్ధశ్రోత్రియుండైన త
త్పతికిన్ గానరసంబు నేర్పఁ దన గీతప్రౌఢిమన్ జూపు భా
రతి వాక్పాటవ మిచ్చి ప్రోచుఁ గృపమీఱన్ రామభూనాయకున్. ౨

సీ. ఒక మోము భారతీ వికచాంబుజాస్య వాతెఱఁజిల్కు తీయనితేనెఁ గ్రోల
నొక మొగం బాపడంతుకతోడ సరససల్లాపమాధుర్యంబు చూపుచుండ
నొక మొగం బావెలందుక తావిఁజిల్కు పుక్కిటివీటితమ్మ పుక్కిటవహింప
నొక మొగం బావెలంతుకతోడ రతికలావిషయికోపన్యాసవిధులు దెల్ప

తే.గీ. నొక్కమధురోష్ఠపానమునకుఁ దక్కు
కృతులఁ బ్రతిసేయ నేరని యింతిమిన్న
బిట్టు కౌఁగిలి గిలిగింత నెట్టుకొన్న
వలువ కృతిపతి కాయువు కలిమిఁబెంచు. ౩

తే.గీ. కృతిపతి యొనర్చునట్టి సత్కృతుల కంత
గంతరాయమ్ము గొడఁగూర్చ కలుగుఁగాక
మెప్పటుఁ జెల్లింపఁగలసిన మొర్తిక్కు నేఁడు
వేఁడికొందును మా బొజ్జవేల్పుదొరను, ౧౦

తే.గీ. కాళిదాస మయూరాది కవులు నన్న
యాదులు కవులు చేసిన యట్టి కావ్య
ములఁ జదివి కైత చెప్పఁగ మొదలుపెట్టి
కలుపకుందుమె? తేన్నమస్కారములను, ౧౧

తే.గీ. అన్నవస్త్రము లొసఁగి విద్యలను శిష్యు
లకు ననుదినమ్ము చెప్పు విలక్షణప్ర
భావు భావుకభావు మాపాలిదేవు
బ్రహ్మ గురువర్యుఁ గొల్తు మహాభక్తి. ౧౨

తే.గీ. ఏచతురు లోర్వలేమి పిశాచములమి
సత్కవులమీఁదఁ బడకుండ సరిపి రక్షి
సుకవులకు వందనమ్ములు కోట్లుకొలఁది
స్థిరతరమ్మగు భక్తి రచింపవలదె! ౧౩

ఆ.వె. గ్రంథచోరులైన కవులార! మాపద్య
ములను దొంగిలింప వలదు వినుఁడు
మాదు కైత కొక్క మాఱువేసము వైచి
మార్చికొంద మన్న మాఱుఁబోదు. ౧౪

ఉ. ఆఁకలిఁ దీర్చికొం చెవరికైనను ధర్మము కాన పైటి పు
ల్లాకులవంకఁబోయి యట నాఁకలి తీర్చికొనుండు లోనికిం
బోకుఁడు; పోతిరేనిఁ గడుముప్పగు; మీచిరజీవిభావ మో
కాకవులార! మీకుఁ జిరకాలము పాయకయుండుఁ గావుతన్. ౧౫

ఆ.వె. మచ్చరమ్ము విడిచి మాకవిత్వరసమ్ము, గ్రోలరయ్య! మెచ్చుకోలుగలిగి
యోర్వలేమి నేడుపొంద మీకన్నర, పోనుఁగాని యేమిపోవు మాకు? ౧౬

క. “అపితే విపితే” పనిమా, కపనము నిందింత్రుగాక కవులంపెటుకున్
జవిగల్గుకృతుల నొనరింప విరించిప్రమదకైన బరువగుఁగాదే. ౧౭

చ. పలువురు సత్కవిత్వ మది పొల్పడకుండినఁ గొన్ని పుస్తక
మ్ములు రచియించి సిగ్గిలక మోదము నొందుట తప్పుగాదు; పు
త్త్రిలు తన కుద్భవించినఁ "గురూపులు కాఁగల" రంచు భార్యతోఁ
గలయిక మానునే? సుతులఁ గాంచక యుండునె? రూపహీనుఁడున్. ౧౮

సీ. ప్రియురాలి పాలిండ్లబిగు వెఱింగినవాఁడు జిగిసైకతముందలి సొగ సెఱుంగు
రుచిరాస్య కెమ్మోవిరుచు లెఱింగినవాఁడు రసకవిత్వంపు సారస్య మెఱుఁగు
పద్మాక్షి చూపుసోవల నెఱింగినవాఁడు తీక్ష్ణకవిత్వంపుఁ దేట యెఱుఁగు
పలువెలందుకల కౌఁగిళు లెఱింగినవాఁడు మిశ్రకవిత్వప్రముఖత లెఱుంగు

తే.గీ. సంధ్యతమసాభిసారికాగంధ మెఱుఁగు
వాఁడె యాశుకవిత్వంపు జాడ యెఱుఁగుఁ
గాని యన్యుల కెఱుఁగ శక్యమ్ముగాదు
భావవిజ్ఞాన మది పయిపైనిఁ గలదె! ౧౯

క. లలితప్రబంధముల లో, పల యమకముఁ దూర్చి రసము పాడొనరింపన్
వలయునె? పెరుగునువడ్లను, గలపోసిన ముచ్చటగునె? కవివరులారా.

చ. మతిగలవారి కేనియుఁ బ్రమాద మెలర్పక పోదు; పుష్పస
మ్మితకవితాలతాంగిని రమింపుఁడు కేవలశాస్త్రిలార! మీ
మతులకు వచ్చినట్లు రసమాధురిఁ గ్రోలుఁడుగాని వ్యర్థపుం
జతురిమఁజూపి దాని స్తనశల్యపరీక్ష యొనర్పఁబోకుఁడీ. ౨౧

వ. అని శిష్టాచార పరిశంసలొనర్చి,

మ. ప్రతిసంవత్సరమాఘమాసమున గద్వాలప్రభుం డిచ్చు న
న్నత సత్కారపు వార్షికమ్ముఁగొని. కొన్నాళ్ళచ్చటన్ రాజబం
ధుతతుల్ సత్కవితాదరుల్ మిగుల సంతోషమ్ములన్ దేల్ప న
న్నతటిన్ దన్మిత్రపుస్త్యాలమందు కడుసన్మాన్యుండు స్నేహార్ద్రుఁడై. ౨౨

వ. భక్తితాత్పర్యమ్ములిగురింప నస్మత్కృత సంస్కృత గ్రంథమ్ములయందలి శ్లోక
మ్ములను నాంధ్ర ప్రబంధమ్ముల యందలి పద్యమ్ములను నదేకాయత్తచిత్త
మ్మున సానుజుండును సపుత్రమిత్రుండునునై వినుచుఁ జుట్టువారియున్న
పండితకవిసంఘము దిక్కు మొగంబై. ౨౩

సీ. గద్వాలరామభూకాంతుని యిల్లాలు గారాపుఁ జెలియ లేఘనయశునకు
సాహితీకన్య నచ్చపుభక్తి యుక్తిఁజెన్నారు రాజారెడ్డి యనుజుఁడెవని
కట్టిఁడిట్టిఁ డటంచు ననరాని మేటి తిమ్మారెడ్డి యెవనికి మఱొకతమ్ముఁ
డత్యంతసత్కవిత్వాదరుండైన లక్ష్మారెడ్డి యెవ్వాని మాతులుండు

తే.గీ. చిన్నతనమంద కృతులకుఁ జేతులొగ్గు
నిపుణబుద్ధి సీతారామనృపతి సార్వ
భౌముఁ డెవ్వానికి ననుంగు భాగినేయుఁ
డతఁడు శ్రీరామనృపతి పండితహితుండు. ౨౪

క. శ్రీతాటికొండ పురమున
నేతాదృశగరిమ నేలు నీతిపరుఁడు వి
ఖ్యాతుం డతిశాంతుఁడు వి
ద్యాతిశయుం బెఱుఁగుజాణ యనుపమకీర్తిన్.

చ. తిరుపతివేంకటేశ కవిధీరుల మమ్మనుగాంచి వాక్యచా
తురి మెఱయంగ నిట్లనె "బుధుల్ బళిరేయన మీరు గ్రంథముల్
విరచనచేసి యుంటిరి ప్రవీణతమై మఱియెన్నియేని, యం
దరయఁగ నాకు భాగవత మన్నిఁటికిం దలమానికంబగున్. ౨౫

శా. స్వామీ! మీకవితాప్రవాహము జగచ్ఛ్లాఘ్యంబు మాబోఁట్లు త
త్సామర్థ్యం బిదమిద్ధమంచు వచియింపన్నేర్తురే! లక్షణా
భామన్ గృష్ణుఁడు పెండ్లియాడుకత నాపైఁ బేర్మిమీఱం గృతిం
గా మిమ్ముం దయఁ జెప్పవేఁడెదను సత్కారమ్ము తోరమ్ముగన్. ౨౬

చ. తిరుపతివేంకటేశ్వర సుధీమణులార! కవీంద్రులార! దు
స్తరతరబుద్ధిభాక్శతవధానవిధానపటిష్ఠులార! భూ
వరహితులార! యెక్కుడు కృపామతి నాకుఁగ మాకు లక్షణా
పరిణయమున్ రచింపవలెఁ బండితమండలి కింపుగావలెన్. ౨౭

మ. కవితాకన్యక రెండుతూనిఁ గల రిక్కాలమ్మసం దల్ల వా
రు విచారింపఁగ గుర్రికన్నగలవారో, కుంటివారో, సురూ
పవిహీనాత్ములో కాఁగలారు; వినరింపన్ సర్వసంపన్న మీ
కవితాకన్య యటంచు నొక్కి పలుకంగా నేర్తు ముమ్మాటికిన్. ౨౮

తే.గీ. చెన్నపురి రాజధానిలోనున్న రాజ
వరులు నైజాములోనున్న నరవరులును
మీ శతావధాన కృతులకు మెచ్చి కాన
బంగరు బిరుదులొసఁగిరి బహుమతులుగ. 30

ఉ. ఏనుఁగునెక్కినారు ధరణీంద్రులు మ్రొక్కఁగ నిక్కినారు స
న్మానములందినారు బహుమానములం గ్రహియించినార లె
వ్వానిని లెక్కపెట్టక నివారణ దిగ్విజయంబొనర్చి ప్రా
జ్ఞానిధులంచుఁ బేరుఁగొనినారలు మీరలు కవిత్వసంపదన్. 31

శా. ఈయాంధ్రావనియందు మీకననిభూమీశుల్, మిముం బూజలన్
జేయన్నేరని రాజచంద్రులును నాచే నశ్రుతుల్; వేయునే
లా? యీనాఁటికవీంద్రులం దెవరు విద్యాశక్తి రాజన్యసం
జ్యాయత్తంబగు పట్టపేన్గుపయి సాహోపుష్టి నూరేగిరే! 32

తే.గీ. హెచ్చుతగ్గులు తులఁదూఁప నెవరికన్న
హెచ్చు మాబావగారు; వారిచ్చినారు
మీకు బంగరుబిరుదు లమ్మేటి మేటి
వారికిమ్మిచ్చు మీకు నెవ్వరికి హెచ్చు. 33

తే.గీ. శ్రీకరుండగు నరసదీక్షితుని సుతుఁడు
సుకవియగు పాపశాస్త్రికి సోదరుండు
అస్మదాస్థానమునకు ధర్మాధికారి
బారయకు మీరనినఁ గడు గౌరవంబు 34

క. మాతండ్రిగారు మును కృతి
కై తామెంతేని యత్న మలరించిరిగా
నీ తగు కవి దొరకమిఁ ద
చ్చేతం బొప్పకొనదయ్యెఁ జెప్పించుటకున్. 35

క. జనకుని కోర్కెం దీర్పని
తనయునిఁ దనయుఁడని చెప్పఁ దగదం డ్రిటుగా
వున నీకృతి కారణముగ
వనుఁ గృతకృత్యునిఁగఁ జేయ న్యాయ్యం"బనుచున్. 36

వ. వాగ్బహుమాన పూర్వకమ్ముగఁ దాంబూలంబు వెట్టుటయు నేమును నతని యోగ్యతకు నలరి యీవిభువతంసుండు తక్క గుణములట్లుండఁ బిత్రనుజ్ఞాకరణ ధురంధరత్వమ్మునను నిజమ్ముగ రాముఁడే యగునని ప్రశంసించుకొనుచు నాతనివంశక్రమంబుఁ గొండొక వివరింపఁ బూనితిమి. ౩౭

క. సిరి యే చరణము వరమా
దరమున సేవించు నట్టి సుపదము నందెను శం
కరు తలపూతోఁ బుట్టువు
ధర నుత్తమశూద్రకులము తగియెడివృద్ధిన్. ౩౮

తే. గీ. కారణాంతరముల దానఁ గలిగె నెన్ని
యేని భేదమ్ము లవి చెప్ప నేల? నాఁడు
నేఁడు నిఁకమీఁద వికృతులజాడఁ దాఁ జ
ననిదియై యొప్పు నొక పాకనాటికులము. ౩౯

ఆ. వె. క్షమకు సత్త్యమునకు సత్త్వమ్మునకు రాము
నాఁటివారు పాకనాటివారు
భోగభాగ్యములకు యోగమ్మునకుఁ గృష్ణు
నాఁటివారు పాకనాటివారు. ౪౦

తే. గీ. వారి గోత్రములెన్నియో వఱలు నందు
గోకిరెడ్డియనెడి కాఁపు కులపురుషుఁడు
గాఁగలిగి యతిరాజసకలన మిగిలి
యొక్క తెగవారు బల్ సిరినొప్పుచుండ్రు. ౪౧

చ. భరతునిఁబట్టి యిందుజులు భారతులైరి, రఘుండు హేతువై
పరఁగిరి రాఘవాఖ్య నలభానుకులప్రభవుల్, మహాయశ
స్కరుఁడగు గోకిరెడ్డి యతిశస్తగుణాకరుఁ డిందుఁగల్గుటన్
వఱలెను వాని పేర్గలిగి వంశము వీరి కసంశయమ్ముగన్. ౪౨

క. అతిరాజస గోత్రావ
స్థితిచే నతిరాజసత్వసిద్ధి గలిగెనో?
యతిరాజనులగు వీరలె
గతియగుదురో గోత్రిమట్టిగతిఁ గాంచుటకున్? ౪౩

గీ. తెలియుటకు దుర్లక్షంబని ధీరులెన్నఁ
దగిన యవ్వంశమందు ముత్యమ్ము వోలె
రంగధాత్రీవతంసుఁ డారంగ నుదయ
మంది ప్రజనేలె నిరతనిష్పందయశుఁడు. ౪౪

శా. పొంగారంగల కీర్తి కెల్లయగుచున్ భూలోకదేవేంద్రుఁడై
సింగంబన్నను జెరికింగొనక విస్తీర్ణప్రతాపాప్తి నే
లంగల్గెన్ మఱి నేల నర్థిజనులెల్లన్ దన్ను శ్లాఘింప, నా
రంగారెడ్డి గుణోత్తరత్వమది వర్ణ్యంబౌట కాశ్చర్యమే! ౪౫

గీ. ఆతనికుమారుఁ డత్యంతశీతలుం డ
నంతధరణీశుఁ డీతఁ డనంతయశుఁ డ
నంతసుగుణాకరుండు ననంతతేజుఁ
డగుచుఁ బాలించిమించె ననంత నెలమి. ౪౬

గీ. ఆతనికిఁ బుత్రుఁడయ్యెఁ దిమ్మావనీంద్రుఁ
డతఁడు పూర్వులఁబోలి రాజ్యమ్ము రామ
రాజ్యముగ నేలి పుత్రికఁ బ్రాజ్ఞసుగుణఁ
గాంచెఁ గొండమ్మ యను నొక కాంచనాంగి. ౪౭

క. శ్రీరమణు సాటిఁదగు రా
జారెడ్డికి నామె నిచ్చి సర్వోన్నతమా
తీరునఁ బెండ్లి యొనర్చి ధ
రారమణునిఁ జేసెఁ బిదప రాజ్యమ్మిడియున్. ౪౮

గీ. జలధి నిల్లటముండిన శౌరిపోల్కి
హిమగిరి వసించు నల నగజేశు మాడ్కిఁ
దాటికొండ పురమ్మునఁ దా వసించి
మించి పరిపాలన మొనర్చె నంచితముగ. ౪౯

క. ఆరామయందుఁ గనె సు
శ్రీరుచిఁదగు రామచంద్రిరెడ్డిన్ మఱి ల
క్ష్మారెడ్డిన్ గొమరులుగా
నా రాజారెడ్డి వంశ మతి వృద్ధిఁదగన్.

సీ॥ లక్ష్మీసరస్వతుల్ రహి నీడనఁగవచ్చు నన్యోన్యమును మైత్రియు మఱి నేని
సాహితీగీతులు సరినాఁగఁదగు నేకపురుషాశ్రియత్వంబు పఱల నేని
శాంతిదాంతులతోడ సాటిసేయఁగవచ్చుఁ బైనొండు లోనొండుఁ బరఁగ నేని
శ్రద్ధామనీషలు సరిచెప్పఁగావచ్చు నన్యోన్యవైరుధ్య మలర నేని

తే॥గీ॥ అక్కసెల్లెండ్రునై సమానాకృతులయి
సవతులయ్యును ఖేదమ్ము లవము లేక
క్షీరనీరవిధమ్మునఁ జెలిమిఁ గలిగి
దంబలరు బుచ్చమకును గోపాంబికకును. ౫౬

కం॥ ఆలక్ష్మీ రెడ్డియు మఱి
యాలలనలలోన బుచ్చమాంబయును లస
చ్ఛీలురు మువ్వురుగొమరుల
బాలిక నొక్కర్తుఁ గని రపారయశస్కన్. ౫౭

కం॥ శ్రీలక్ష్మీదేవియను న
బ్బాలిక తన పేరు సార్థపటిమ వహింపన్
బాల శశిరేఖయో యనఁ
గా లలివృద్ధిం దనర్చెఁ గళలలరారన్. ౫౮

ఉ॥ ఆలలనాలలాము సుగుణాకరుఁడౌ గదపాలరామభూ
పాలునకిచ్చి పెండిలి యపారముదమ్మునఁ జేసి; రాపె స
చ్ఛీలము తన్మనోహరు ప్రసిద్ధియు సిగియు నిర్ణయింపఁగాఁ
జాలుట మాక కాదు జలజాతభవాదులకే నశక్యమా. ౫౯

తే॥గీ॥ ఈమెకన్నను జిన్నలై యెల్ల సుగుణ
ములను నెవ్వరికన్నను మొదటివార
లగుచు నలరారుచుందురి రాజావనీంద్రుఁ
డును మఱియుఁ దిమ్మనృపతియు ననుపమితులు. ౬౦

కం॥ ఇరువురు విద్యలలో ఘను
లిరువురు నాకారవంతు లిరువురు నన్నన్
గురుభక్తిఁ గొల్చు గురుయశు
లిరువురు సంతానవంతు లిరువురు-శాంతుల్. ౬౧

మ. మతిమంతుండయి ఫారసీచదివి తిమ్మారెడ్డి ప్యాసయ్యె ను
న్నతమైనట్టి వకీల్పరీక్ష యిదియుండన్ దెల్గునన్ సత్కవి
ప్రతతుల్ మెచ్చఁగ నీతివాక్యపదపూర్వంబైన రత్నావళిన్
గృతిగా నై యొనరించె నమ్మహితునిన్ గీర్తింపఁగాఁ జెల్లునే. ౬౨

క. వీరికి నెల్లన్ జ్యేష్ఠుం
డై రాజిలు ననుపమానమగు శాంతికి తా
వై రామారెడ్డి మహా
ధీరుఁడు గంభీరుఁడును సుధీమాన్యుఁడునై. ౬౩

తే.గీ. ఫారసీభాష నెక్కుడు పండితుండు
కనియన్ భాషలోన నుత్కృష్టతముఁడు
తెల్గునం దెంత చేసియుఁ దెల్వి గల్గు
వాఁడు వినయాదిగుణముల వీడితండు. ౬౪

ఆ॥వె॥ ధర్మసుతున కేనిఁ దప్పు వెదకవచ్చుఁ
గాని యితనియెడలఁ గానరాదు
ఇంత శాంతి దాంతి యింత యనుద్ధతి
యింత యోగ్యతయు మఱెందు లేదు. ౬౫

తే. గీ. కవులతో స్నేహమొనరించు ఘనుఁడతండు
కవులతో స్నేహమొనరించు ఘనుఁడితండు
భేదమిట్టిది యొక్కింత లేదయేని
రామవిభుఁ డనవచ్చు నీ రామవిభుని. ౬౬

క. ఆ రాముఁ డనంతాసుత
గా రాముఁడు బెండ్లియాడెఁగా; రాముఁడితఁ
డా రామతల్లి పేరిఁటి
నారీమణిఁ బెండ్లియాడె నయవినయయుతన్. ౬౭

క. ఎంతేనిఁ దనదు పెద్దలు
సంతసముసఁ బొడల రామజనపతి యాయు
ష్మంతుని సుశ్రీమంతు న
నంతాంబికయందుఁ గనె వసంతారెడ్డిన్. ౬౮

## షష్ఠ్యంతములు.

——:o:——

సీ. ఏతాదృశగుణాళిచేతఁ బొల్చెడివాని కతులితవైభవం బలరువాని
కీర్తిచేఁ బ్రఖ్యాతి నెనసి వర్తిలువాని కతిశుద్ధమగు చిత్తమమరువాని
కధికమౌ రసికత కాధారమగువాని కఖిలవిద్యాశాలి యైనవాని
కెనలేని వినయంపు గనియైనవానికి ధైర్యమెక్కుడు గల్గి తనరువాని

గీ. కభ్యుదయములు గల్గెడు నట్లుమేము
బనులు మునుముందు గాఁజేయఁబూను లక్ష
ణాపరిణయమనెడి ప్రబంధమ్మునకుఁ గ
థాక్రమం బిప్పుడు గ్రమ్మఁ జనవలయుండు.

క. నయమా ప్రతిపదసంపదు
దయమా యామీఁద మత్తతత్త్రిపురా
డ్జయమా యదియును గాక వి
నయమా వేఱొక్కఁడుఁ డిట్లనక గాద్యగుఁడే. ౫

క. ఆ రాజేంద్రుని కొక్క కు
మారీమణి తనరు సకలమనుజేంద్రతనూ
జారత్నములకు నాపెకు
వారక యరయ హస్తిమశకవైఖరి నొప్పన్. ౬

తే. గీ. ఆసరోజాక్షి పుట్టినయది మొదలుగ
నఖిలశుభలక్షణమ్ముల నలరుకతన
లక్షణ యటంచుఁబల్కి రెల్లరును నత్త
లోదరీలక్షణము లెంత యొప్పునొక్కొ! ౭

తే. గీ. ఆమగువ జన్మనక్షత్రమేమొ కాని
పుట్టినదిగోలె శ్రీకృష్ణు పుణ్యకథలు
వినఁగ మది ముచ్చటంబడు వెన్నుఁడన్న
మాట విన్నంతమాత్ర సమ్మదముచూపు. ౮

ఉ. ఆ యెలనాగ శైశవమునందున మేల్ రతనంపుఁ దొట్టెలోఁ
బాయనికూర్మినుంచి తగుపాటలు పాడెడివేళ "లాలి కృ
ష్ణా" యన నాలకించి పదనాంబుజ మంకురితస్మితమ్ముగాఁ
గోయని మించి యాడునఁట, కోమలి జన్మవిశేష మెట్టిదో! ౯

తే. గీ. పలు పలుకులేల, గరుడపక్షులు సంతతము
సహజమగు కూజితమునఁ గృష్ణ యటన్న
నాలకించి వినోదాబ్ధి నోలలాడు
మతులెవరికైనఁ గర్మాను గతులుగావె! ౧౦

క. కేవలలక్షణయయ్యును
నావెలఁదుక సర్వలక్షణాలంకార
శ్రీవెలయ సలక్షణయనఁ
గా వృద్ధింజెందె శీతకరరేఖ యనన్. ౧౧

క. అలరులకు సౌరభమువలె
నెలకు శరత్సమయమువలె నీరదతతికిం
దొలకరి మెఱుపుంబలె న
న్నెలఁతకు తేజవ్వనంపునిగ్గులు దోఁచెన్. ౧౨

సీ. ముసిముసి నగవులపస పసందుగఁదూఁగె మొలకచూపులసౌరు తళుకుజిలికె
నడలందుఁ గడువింత జడిమ నూల్కొనసాఁగె నెదవిస్తరించి పయ్యెదనుడాఁగె
నడుము నానాఁటికి నాదారుగాఁదోఁచెఁ దొడలయందునఁ బుష్టి దొలకరించె
వాతెఱ వేఱొక్క వైఖరిఁ గననయ్యెఁ జాతురి పల్కుల నూఁతగొనియె

తే. గీ. సంతకంతకు లావణ్యమతిశయించె
వింతవింత పనులయందు వేడ్కదొడరె
సంతిపురమున నుండు టభ్యాసమయ్యెఁ
గంతునకుఁ గాఁపురంబయ్యె నింతిమేను. ౧౩

తే. గీ. జాఱుముడివైవఁ గటిపైఁ బచారుసేయు
జడఘటించిన మడమలఁ దొడరియాడుఁ
గొప్పువెట్టినఁ దలకన్న గొప్పగాంచుఁ
జొల్లెమిడుటొప్పదే యట్టి సుదతి కురుల. ౧౪

మ. పరివేషమ్ములుగట్టి పూగశకలప్రాయమ్ములై యంత బం
గరుగోలీల నతిక్రమించి లికుచాకారమ్ములై పిమ్మటన్
సరసీజమ్ములమీఱి గట్టిపడి విన్నాణంపు బల్కుప్పలై
పరిమాణింప నశక్యమై యెసఁగె నప్పద్మాక్షివక్షోజముల్. ౧౫

క. రదములను మల్లెమొగ్గలు
పొదలన్ లేఁజన్నులనెడి పూవుంగుత్తుల్
గదియ నునుఁ బల్కుకోయిల
రొదలొదవఁగఁ బుష్పసమయరూఢిన్ వనరెన్. ౧౬

క. అంత వసంతము సంతత
దంతురితలతాంతమొప్ప దాంతవిరహిహృ
త్కుంత మతికాంతసకలా
శాంతము సంతోషకరనిశాంతంబగుచున్. ౧౭

క. లేమా కున్న నిగుడిలు
నామయి మెసపంగఁ గొండలాంగనకు ని
త్యామోదప్రసదమధుర
శ్రీ మెఱయఁగఁ గంపుమూది పలు తెగరుచున్. ౧౮

క. అల కాల మల్లరిపు సము
కలసన్ శాస్త్రప్రసిద్ధ గాంధిని యొయ్యన్
గలయిక లేక తగు కాం
తులఁ గాంతలకు నిశలు దుర్దినంబయ్యెన్. ౧౯

ఉ. మామిడిపండ్లు పానకము మంజులతన్ దగు నిక్షుఖండముల్
భూమిసురాగ్రగణ్యులకుఁ బూర్ణముగానిడి చందనమ్ము పై
నోమియు వీవనల్ విసరియున్ దనియింతురు పుణ్యవంతు ల
య్యామనియందు మాధవున కాదర మెంతయు మేదురమ్ముగన్. ౨౦

క. అట్టియెడ బృహత్సేనుఁడు
దట్టములగు చూతములను దనరారె మణీ
కుట్టితకుట్టిమమై బల్
వెట్టన్వెట్టఁ దగునట్టి విరి లేఁదోఁటన్. ౨౧

చ. చరమధరాధరమ్మునకు సన్నిధిలో నొకయింత దవ్వునన్
సరసిజమిత్రుఁడుండ ఘటసంఘము గొల్వఁగ నేగి పట్టివే
ళ్లరుచి నెసంగి సర్వశుభలక్షితమై యలరారునట్టి చ
ప్పరమునఁ గూరుచుండెఁ దగు పండితమండలి చుట్టువాఱఁగన్. ౨౨

ఉ. గాయక గానముల్ సెలఁగఁగా రమణీయధనాంగనామణీ
గేయవిలాసనాట్యములొగిన్ మిగులన్ దగ స్వస్తివాచకా
గ్రీయులు వేదఘోష మొనరింప నిలింపులకంపు నింపు న
ట్లాయతమైన సంపదల నానృపుఁడంత వదాన్యమూర్తియై. ౨౩

మ. మణులన్ వజ్రములన్ మహాంబరములన్ మధ్వాదులన్ మేటి ద
క్షిణలన్ భూసురవర్గముం దనుపుచున్ గేల్మోడ్చి యవ్వారికిన్
బ్రణతుల్ సల్పుచు వీవనల్ విసరుచున్ బాటీరపంకంబు వీ..
క్షణరమ్యాకృతిఁ బూయుచున్ స్రగ్జమ్ములన్ గంధమ్ములన్ వైచుచున్..... ౨౪

ఉ. ఉన్నయెడన్ సమస్తజగదుత్సవకారణమై సమంతతో
భ్యున్నతపన్నగప్రకరపోషకమై ద్రమిడాంగనాకుచ
స్విన్నపటీరసౌరభవిశేషపరీమళమై యెలర్చె సం
పన్నవిపన్నభూరిసుఖబంధురమై మలయానిలంబొగిన్. ౨౫

క. ఆమలయానిల మొలయుట
చే మహీసురులును నృపాలశేఖరుఁడును స్ఫృ
త్యామాత్యాదిజనమ్ములు
నామోదరసాబ్ధిఁదేలు నాసమయమునన్. ౨౬

సీ. కాషాయ వస్త్రమ్ము కటితటమ్మునఁగ్రాలఁ గాయమంతయు భూతి గడలుకొనఁగఁ
ద్రిదశాపగామృత్తు నుదుటిపైఁ జెలువార మస్తకమ్మున జటామకుట మొలయ
దండకమండలుద్వయము కేలనెసంగఁ బాదమ్ములందుఁ బావాలు దనరఁ
బేరురమ్మునఁ బద్మబీజమాలయెలర్ప వీణియ బుజముపై రాణనింప

తే. గీ. నంబరమునుండి కృష్ణకృష్ణా యటంచు
సరససంగీతభంగీతసంగతులను
బాడియాడుచు నానందభరితుఁడగుచు
వచ్చె నారదుఁడా నృపవరునికడకు. ౨౭

ఉ. వచ్చినమౌనిఁ గాంచి సభవార లవారణగౌరవంబు పై
పెచ్చుగ లేచి; రంతఁ బృథివీపతికల్పితపూజ కెంతయున్
మెచ్చి మునీంద్రుఁ డాదరము మేకొనఁ దన్నృపమౌళిదత్తమౌ
పచ్చలగద్దెపై హరినిఁ బాడుచు వేడుక పిచ్చలింపఁగన్. ౨౮

వ. సుఖాసీనుండై.

ఉ. "నందకుమార! భక్తజననారకతారక! ద్వారకాపురీ
నందనచందనద్రుమ! సనాతననూతనగోపసుందరీ
బృందమిళింద! బంధురపరీమళశోభామమరంద! నీకిదే
వందనముల్ పదింబదిగ వందలువేలు ఘటింపఁగొల్చెదా! ౨౯

ఉ. ఇందుముఖీమనోజ! జగదీశ! రమేశ! విధీశనుత్య! ని
ష్పందయశోవిశాల! పరిపాలితసన్మునిజాల! సన్మనో

నందన! భక్తచందన! కనత్కనకాంబర! కృష్ణ! నీకిదే
వందనముల్ పదింబదిగ వారిజలోచన! పాపమోచనా! ౩౦

క. చిక్కవు తపముల జపములఁ
జిక్కవు జన్మముల నేమిచేసిరొ! నీకా
టక్కరి గొల్లవెలందులు
చక్కఁగఁ జిక్కితివి వారిసందిళ్ళలందున్. ౩౧

మ. అలినీలాలక భీష్మకన్య తొడపై నానందముం జెల్వ లీ
లలు చెన్నారఁగ సత్యభామ మధురాలాపమ్ములం దెల్ప ని
చ్చలు పైపెచ్చుగ నాసుదంత విడెముల్ జానొప్పనందీయ మె
చ్చులకున్ మెచ్చులొసంగు నీవిహృతికిన్ జోహారు జోడించెదన్. ౩౨

శా. కోకల్ చంకను బెట్టి గూఢగతిఁ దళ్కుంగొల్ల యిల్లాండ్ర బల్
వీఁకన్ వంచనచేసి పొన్నపయికిన్ వేంచేసి కూర్చుండి త
ద్రాకాపూర్ణనిశాకరాననల మర్మంబుల్ విలోకించు "నీ
జోకల్ లోకము మెచ్చుపోక" లనుచున్ జోడించి కేల్మోడ్చెదన్. ౩౩

శా. రాకాచంద్రికనమ్రయాఖతతిమీఱన్ జేరి కాళిందిలో
నేకాంతమ్ముగ గొల్లచేడియలతో నిచ్చల్ విసాళింపఁ గో
క్కాకాచారము దప్పకుండ నమఁగుం గోపాలకుల్ సూడ స్వే
చ్ఛాకాంతంబయియొప్పు నీపయిన రాసక్రీడ కేమ్రొక్కెదన్." ౩౪

క. అని మాటిమాటికిని న
ప్వనజాత్ముని చర్యలెల్ల వర్ణించుచు భ
క్తినిమీలితలోచనుఁడై
ముని వీణియమీటె రసము మోటలుగట్టన్. ౩౫

క. సెట్టికొని నారదుఁడు రస
ముట్టిపడన్ జలజనయను నొగిఁబొగడఁగ న
ప్పట్టునను బృహత్సేనుని
పట్టి వినియె వలపుకొంత పయిపయిఁబొంగన్, ౩౬

వ. ఇమ్మాట నారదుండును బృహత్సేనుండును గొంతవడి నుచిత ప్రసంగమ్ములఁ గాలమ్ముఁ బుచ్చుచుండి రట్టియెడ నమ్మునికొలననున్న లక్షణం గాంచి నృపున కిట్లనియె.

ఉ. "ఈయెలనాఁగ పెండిలికి నీడయి తోఁచెడిఁ బెద్దలెల్ల నా
కోయనఁ బోల్చు నూత్నమదనాంచితు నొక్క కుమారకుఁ జగ
ద్గేయునిఁ జూచి సర్వజనగేయముగా నిఁక నైనఁ బెండిలిన్
జేయక ఖిన్నకుంటి తగునే? నరపాలకులావతంసమా!" ౩౮

క. అన జనకుఁ డిట్లను "నో
యనఘా! తగునట్టి నరేంద్రాగ్రణిసుతునిన్
జనసుతుని విచారలాఁకి
వినిచిన సత్యానికిచ్చి పెండ్లియొనర్తున్." ౩౯

చ. అనవుడు మానియిట్లను "నరాధిప! మానుల మైనవారు న
చ్చినపురుషుండు పాత్రికృతులు సెప్పెడివారలఁబోలె మీకు న
చ్చునొ, యటుగాదొ! నామదికిఁ జొప్పడువాని వచింతు నాతఁ డ
క్కనకనిభాంగికిం దగినకాంతుఁడటంచుఁ దలంతు నెంతయున్, ౪౦

ఉ. ద్వారక నేలువాఁడు సముదారగుణాఢ్యుఁడు మేలువాఁడు నా
కారము చెప్పనేల! రతికాంతునిఁ గన్న మనోహరుండు దు
ర్వారరిపుప్రకాండమదభంజనుఁ డాతనికన్న మేటి యీ
ధారుణిఁ గాను నాకముఖధామము లందుఁ గనన్ వినన్ జామీ, ౪౧

ఉ. ఆతని కాంతఁ దేవప్రతి సమస్తవిభూష్యులఁ ద్వత్కుమారికా
రీతియుఁ జూడ నాతని వరింపఁగ నెంచెడియట్లు తోఁచు మే
లీతరుణీశిరోమణికి నీడతఁ, డాపరిభూతశాంబరా
రాతికి జోడు నీతనయ రాజవరేణ్యా! యొఱుంగఁ జెప్పితిన్, ౪౨

క. కాని యొకసందియము కల
దీనరలోకాధిపతుల కెల్లరకును న
వచ్చాని జనసుతుఁడు గొల్లఁడు
గాని నృపుఁడు గాఁడఁటంచుఁ, గలది వచింతున్. ౪౩

క. నారాయణుండు ధరణీ
భారము వారింప యాదవకులమ్మునఁ దా
న్నారెన్ గృష్ణుండన ని
క్కారసి తెల్పితిని గడురహస్యం బైనన్. ౪౪

క. చకితులగు లోకులకు వెఱ
పకతీఱదు గాన నొకయుపాయము కడుశా
న్తికయగుగతిఁ దెల్పెద వా
రక చాటింపుము స్వయంవరము జగమెల్లన్. ౪౫

ఉ. నీకొమిరెన్ వరింప ధరణీపతులెల్ల రహంక్రియామహో
ద్రేక మెలర్ప రాఁగలరు; తెల్లముగా నపుడీవు మత్స్యయం
త్రాకలనమ్మునన్ జయమునందిన సుందరుఁడీ కుమారికన్
జేకొనునట్లుగాఁ బ్రతినచేయు ముపాయము న్యాయ్యమైతగన్. ౪౬

ఉ. దానికిఁ గృష్ణుఁడొక్కరుఁడు దక్కఁ దదన్యు లశక్తు; లాతఁడ
మ్మానిజలమ్మునందుఁగని యుప్పరవీదిని మత్స్యయంత్రముం
బోనరుకంగలాఁ డతని పోడిమి యన్యుల కబ్బనేర్చునే
యీనరరత్నచోదకునికగ్గమె! యెంతటి రాజచంద్రులున్. ౪౭

మ. జయలక్ష్మీలలనామనోహరుఁడు కృష్ణస్వామి నీపుత్రికిన్
బ్రియుఁడై యొప్పెడి నిక్కమియ్యది నృపుల్ పేరెత్తి పైవచ్చినన్
లయమందింపఁగఁజాలమన్నె? శిశుపాలధ్వంసి నీకేల ని
ర్భయమార్గీతి నొనర్పుమిట్లు, శుభముల్ ప్రాటిల్లు నాయానతిన్," ౪౮

క. అనుపలుకులు విని నృపవరుఁ
డనుమోదముచెందె మానియరిగెం దనయి
చ్ఛను; లక్షణకున్ మనమ
మ్మనసిజజనకుపయి మాటిమాటికి వ్రాలెన్. ౪౯

తే. గీ. అంత నరపతి పురమునకరిగె; లక్ష
ణాంగనామణి యంతఃపురాంతరమున
కేగెఁ; జెలికత్తెలందఱు నిండ్లుచేరి;
డరుణుఁ డరుణప్రభాంకితకిరణుఁడయ్యె. ౫౦

## —: ఆశ్వాసాంత పద్యములు. :—

—:o:—

క. శార్ఙ్గిభాషాప్రజ్ఞో
త్కర్షాకర్షితయశోధికా! శంకరసం

క క్షణసమబుద్ధియుత! యు
మ క్షస్వీకృతివిరహిత! మానితచరితా! ౫౧

స్రగ్విణి. పాకనాట్యన్వయా! బంధురాలంక్రియా!
శ్రీకళత్రాంఘ్రిసంసేవనాప్తోదయా!
గోకిరద్వ్యాప్తసంగుప్తకీర్తీ! గుణా
లోకనైకప్రియా! లోలుపత్వాప్రియా! ౫౨

## పంచచామరము.

ధరామరస్థిరాదరా! వృథావిధోక్త్యనాదరా!
నిరంతరానురక్తి చిహ్నా! నిత్యపోషితప్రజా!
పరాభిధేయవస్తుతత్త్వపండితా! యశోన్వితా!
ధరావరేశ్వరా! సమస్తధర్మమర్మభాస్వరా!

## గద్య.

ఇది... శ్రీ తిరుపతివేంకటీయ లక్ష్మణా పరిణయంబను
మహాప్రబంధమ్మునందుఁ బ్రథమాశ్వాసము

—:o:—

శ్రీరస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః.

# లక్షణా పరిణయము

## ద్వితీయాశ్వాసము



శ్రీకర! లోకోన్నతసుగు
ణాకర! యాపనకలావిహార! సుకవితా
పాకవివేకముగల కవి
రాకకలరు వేల్పుగిడ్డి! రామారెడ్డీ!

తే.గీ. అవధరింపు మనంతరంబబ్జబంధు
నందు రాగాతిశయ మెక్కుడై చెలంగె
స్వాగతుఁడగు హరి వరుఁగఁగోర గనుకింపు
లక్షణకు గల రక్తిఁదెల్పనో యనంగ. ౧

క. అంబుజబంధుఁడు పూర్ణత
రంబై యర్ధమయి కొంతరాణించియు సూ
క్ష్మంబై తగు బింబమునఁ గ్రి
మంబుగఁదాఁ బశ్చిమాద్రిమాటున కరిగెన్. ౨

క. హరిదశ్వుఁడు తనగృహమున
కరుదెంచె నటంచుఁ బశ్చిమాంబుధి ఘణాలన్
గరమునఁ గానుకొసంగఁ ద
దరుణచ్ఛవిఁ బొల్చెననఁగ నరుణుం డెసఁగెన్. ౩

తే.గీ. పశ్చిమాచలమునఁ గాంతి పరిఢవిల్లెఁ
గాని తూరుపుఁగొండ రిక్తదశనంచెఁ;
"నొకఁడు చెడిపోవుపైఁగాని యొకఁడు బాగు
పడుటలే" దని జను లాడుపలుకు నిజము. ౪

తే.గీ. వారకాంతనువదలి యంభోరుహాప్తుఁ
డరిగినంతన యద్దాని నంటుకొనఁగఁ
దమ మరుగుదెంచె, వారకాంతలకుఁ దగిన
వాఁడు వీడిన దురవస్థ వచ్చుటుచితె! ౬

ఉ. అంబుజముల్ చలించెఁ, బతగావళి గూళ్లకుఁ జేరవచ్చెఁ, దీ
రంబులనుండి విప్రులు కరంబుల దంబుగ నీరుకావివ
స్త్రంబుల సంపుటంబులు దాసంగ గృహంబుల కేగుదెంచి, ర
థ్రింబున సంజ తగ్గె, విరఁబాఱెఁ దమంబు క్రమంబుగాదెసల్. ౭

తే.గీ. కొండలన్నియుఁ గాటుకకొండలయ్యెఁ
జెట్టులన్నియుఁ జీఁకటిచెట్టులయ్యెఁ
బండులన్నియు నేరెడు పండులయ్యె
నేమనఁగవచ్చుఁ దామసిదీమసంబు! ౮

ఆ.వె. జలజజలజబంధుశరదాభ్రములయందుఁ
గలుగు రాగమెల్లఁ గలసి జార
జారిణీమనఃప్రచారంబు గావింపఁ
బోలు లేకయున్నఁ బోవుటెట్లు. ౯

తే.గీ. గగన మను గని పెకలించి కాలపురుషుఁ
డందుఁగల వజ్రములఁ బయి నమరఁబెట్టు
చున్న పోలికఁ గ్రమముగా నొక్కటొక్కటి
గాఁబ్రకాశించెఁ దారక ల్గములుగట్టి. ౧౦

చ. వెలవెలఁబాఱెఁ దూర్పుదెస వేవిళు లొప్పినమీఁద గర్భిణీ
లలన మొగంబువోలె; శుభలక్షణలక్షితుఁడై దిగంగనా
తిలకముసొంపునన్ దగి ప్రతిక్షణవర్ధిత కాంతిసంపదల్
చెలఁగఁగఁ జందురుండు వొడిచెన్ సగపాలుతమం బడంగఁగన్. ౧౧

క. కలువలపాలిఁటి పున్నమ
పలుకుంజవరాండ్రపాలి కోరిక గజదొం
గలపాలిఁటి మృత్యువు వె
న్నెలరాయఁడు వెలిఁగె విరహిణీశత్రుం డై. ౧౨

క. తేరెఁ జకోరములెల్ల; వి
చారమ్మున మునిఁగెఁ జక్రిజంపతులు; జలం
బూరె స్నెలరాలన్; జే
కూరెన్ దంపతులకింపు; కొలఁకులు తేరెన్. ౧౩

తే.గీ. పద్మినీకాంత తనుఁజూచి పగలు నవ్వ
రాత్రి నగసాఁగె దానిఁ గైరవిణి చెలఁగి;
యేరికేనియు నవవస యేగుమీఁద
రాణ నెసఁగెడి పున్నమ రాకపోదు. ౧౪

వ. ఇట్లు చంద్రుఁడు విజృంభించుటయు.

ఉ. "నారదుఁడేలవచ్చె? జననాయకు మ్రోలకు, వచ్చెఁగాక తా
మారునిఁగన్న సుందరునిమాటల నెత్తఁగనేల? యెత్తెఁగా
కారమణీమనోహరునియందము నామది కెక్కనేల? "నా
కోరిక దీర్చువారెవరొకో! యిపు" డంచు మదిం దలంచుచున్. ౧౫

మ. "అనురాగంబది కన్నుఁగానదు, మనంబా మిఱ్ఱుపల్లమ్ములన్
గనకేచోఁ జటకునైన నేగు, నిఁక వేడ్కల్ మంచియున్ జెడ్డయున్
మనుపే నేరవు, మన్మథుండు చపలాత్ముం డెంతయు న్మూర్ఖుఁ డం
గనలన్ లోకువఁజేసి మీఁదఁబడు శక్యంబే నివారింపఁగన్?" ౧౬

క. అని పలుఁదెఱఁగుల మనమున
జననాయకపుత్రి ప్రబలసంశయడోలా
వినిహితమగు తనహితమున
కనుమతలగు చెలులులేమి నటుచూచుతఱిన్. ౧౭

ఉ. నెచ్చెలులేగుదెంచి ధరణీవరపుత్రికఁ గాంచి తద్వ్యథం
బచ్చుపడంగనెంచి ప్రియమారఁగ డగ్గఱఁజేరి యెంతయున్
బొచ్చెములేనికూర్మి పాలుపున్ దెలుపన్ విరహాగ్ని పైపయిన్
హెచ్చఁగఁ బచ్చవింటిదొర హెచ్చులునున్ బయిపెచ్చు లెసఁగన్. ౧౮

క. పొడలుటకు సంశయిలుచుచు
ముదితకుఁ దామిట్లనిరి ముద్దియలు "బళీ
యిదియేమివింత! తాపా
స్పదమయ్యె లతాంగి నేను క్షణకాలమునన్." ౧౯

చ. కుచములఁ దారహారములఁ గ్రొంబొగ రేఁగుటయేమి? చందనం
బు చిటులుటేమి? మేను తెలుపుం బలు పెక్కుటయేమి? యింతలో
విచికిలగంధి నీకుఁ గనువేఁడుకు గల్గిన హేతువేమి? యిం
త చపలతన్ వెసం గను విధంబదియేమొ? యెఱుంగఁ జెప్పుమా. ౨౦

క. నీ వైఖరిఁ జూచిన నీ
భావం బల తుంటవింటివానికి నిలయా
భావముగనె ననితోఁచెడిఁ
బైవారమె? యేము నీకుఁ బద్మదళాక్షీ. ౨౧

క. కావున నీ నెమ్మదిఁ గల
యావత్సంగతులు చెప్పు మందుం గల కా
ర్యావసరము గనుఁగొందము
నీవారికిఁ దెలియకుండ నీరజనేత్రా. ౨౨

వ. అని గ్రుచ్చి గ్రుచ్చి యడుగు నెచ్చెలుల కచ్చెలిమిన్న గ్రన్నన నిట్లనియె. ౨౩

ఉ. చెప్పెడిదేమి నాకుఁ గలచేవయుఁ ద్రోవయు మీరకాదె? మీ
యొప్పని కార్యమందు మది నుంచెడిదాననె? మీకుఁ జెప్పుటల్
తప్పనె? తప్పు గల్గునె? విధానమెఱింగిన ప్రోడలైన మీ
రెప్పని సేయఁ జాల? రిది యెంతటి కార్యము మీరు పూనినన్. ౨౪

ఉ. నారదమౌని వచ్చి జననాయకుముందరఁ గృష్ణుచర్య లిం
పార విపంచికారవము హాయిగఁ గూర్చి పచించెఁ, జించె న
మ్మారుఁడు నామనంబు పలుమాఱు శరమ్ముల నించినించి, యో
సారసగంధులార! యొకసక్కెము చేసెదరేమొ? నెమ్మదిన్. ౨౫

చ. అవనిపరుండు నమ్మునిపరాగ్రణియాన స్వయంవరమ్ము సే
యవలయునంచు నెంచె నపుడా మురవైరి యనుగ్రహించి యీ
యవనికి రాకయున్న మన మావలఁ జేసెడిదేమి? వానికో
క్కవిషయమౌనె? నానలపుకాంతలు వేసకు నేలు గల్గఁగన్. ౨౬

సీ. ఎదురుఱొమ్ముదిగక నెమ్మది కెక్కు పలుతిక్కలొదవించు రుక్మిణీయువతి కన్నఁ
దోడఁజేరి కడుమీఱి గడిదేరి ప్రోడయై ప్రేమఁజూపెడి సత్యభామకన్న,

నును కెంపు కనునింపులను ఒంపుసుంకించి ఘయిపెట్టికిలంచు దాంబూలికిన్నఁ,
జలమూని తలఁపోని పలపే నియతిఁజేసి లీలనోలాడు కాళిందికన్న;

తే. గీ. నెచటవారికిని నచటన యింట్లకెపటు
లాగికొనిపోవు గొల్ల యిల్లాండ్రకన్నఁ
చక్కఁదనమున్న దాననో, చాకచక్య
మున్నదాననొ? యేను దామోదరునకు. ౨౭

వ. అని పట్టరాని తమకమ్మున నెట్టకేలకు గుట్టుచెడ పట్టగదురి నెట్టుకొని యిట్టు
నట్టును దోఁపమిఁ దనలో, ౨౮

సీ. ఆరుక్మిణీదేవి కధరంబవైతేని యధరమా! తదధరసుధలభించు
నాసత్యభామకు హస్తంబవైతేని హస్తమా! యతని కేలంటఁగల్గు
నాజాంబవతికి వక్షోజంబవేని వక్షోజమా! తన్నఖాంకుశము లొలయు
నాసుదంతకుఁ గన్నులై జనించితిరేనిఁ గనులార! యతనిఁ గన్గొనఁగనబ్బు;

తే.గీ. తుదకు నొక గొల్లసుదతికిఁ బదములైతి
రేని చరణమ్ములార! యా శ్రీనివాసు
మానన లభించు నారీతిమాని నన్ను
నాశ్రయించితి రేమి భాగ్యమ్ము గన్గొ? ౨౯

ఉ. ఎంతటిసోయగంబొ? మఱియెంతటి చక్కని చాకచక్యమో?
యెంతటి వింతసంతసమొ? యెంతమనోహరతావిశేషమో
యెంతటి తీపియో? మఱియు నెంతకు నెంతయుఁగాక యున్న స
త్కాంతలు నన్యకాంతలును గంతుని మంతనమందు నుందురే. 30

మ. మదనుం దిట్టఁగరాదు, కోయిలలతో మాఱొడ్డఁగారాదు, నె
మ్మది వారింపఁగరాదు, కోర్కెలపసన్ మర్దింపఁగారాదు, ను
న్మదముం గ్రిందుగఁజేయరాదు, తనకామం బన్యులౌవారితో
ముచ్చటే చెప్పఁగరాదు కష్టముకదా, ప్రౌఢోడ్డియౌ పుట్టపాటుల్! 3౧

క. మదనా! నీకిది యెంతయు
నదనా? నీవంటివాని కనతలమీఁదన్

గదనార్భటి తగునా? యా
గదనాఁటిన వారిమీఁద బాహుబలంబా. ౩౨

క. పాలయలుకలుఁగల కలుకుల
కలఁక వెలికిఁగొలుపు తలఁపుగలిగింపఁగ నిజ
గలిగించెను జలజాసనుఁ
డిల నెట్లయెగ జలజముఖుల నేచెదవకటా!

క. కలసి మెలసి చెలరేఁగెడి
తలునీతలునులకు పలపుతలఁపులు పైపై
నొలయించినఁ గలుగును నీ
కిలఁ జలనము లేనికీర్తి లిక్షుశరాసా. ౩౩

చ. భుజములు తీటపట్టినను బోరఁగరాదె, పురారితోడ? నీ
రజముఖులా? భవచ్ఛితశరమ్ములదాడికిఁ దాళువారు; నీ
విజయ మెఱుంగమే? యజుఁడు విష్ణుఁడు రుద్రుఁడు నీకు దాసులౌ
ర! జగము లెల్లగెల్చి యొకరామపయిం పగునా? ప్రతాపముల్. ౩౪

శా. రాజీవంబ యటంచు వైచెదవు లగ్రాజీవముల్ జీవమా
రా జాగేల? యటంచు జీవమును గ్రూరంబై వెలింజేయు నో
రాజీవాస్త్ర! భవద్వినోదములు మార్జాలంపు సయ్యాటలై
రాజీవాక్షుల నేచుచున్న విధి ధర్మంబౌనె? సన్నోటికిన్. ౩౫

వ. అని చంద్రు నుద్దేశించి,

తే.గీ. చంద్రి జీవనదాన నీధామమెన్న
జీవనదమార్గ మాకృతిలీవి జీవ
నస్వరూపమ్ము నీకు ననాథజీవ
నాపహరణంబు యుక్తమౌనా? శశాంక! ౩౬

తే.గీ. పంకజములకు నీకును బద్ధవైర
మట్టి పంకజనాయకు ననుసరించి
చేపచూపెడ వార! రాజీవవైరి
పరమశత్రులు గలసినఁ బ్రతుకఁదరమె: ౩౭

చ. సహజకళంకయుండి గురుసామజయానను గూడి యామినీ
విహరణశీలుఁడై దివి భువి న్నిలుపోపకయున్నయట్టి నీ
యహమిక కంగనామణులు నా నొక లెక్కయె? యింతయేల? స
ద్గ్రహము శరమ్మునం గనని యెడ్డెల నేమన నేమిలాభమా. ౩౯

చ. ఎదుటికి వచ్చి ప్రస్నముల నింపుజనింపఁగఁ జల్లినట్టి యా
మ్మదను మహోగ్రకోపమున మాపిన యాపురవైరి యిప్పుడున్
గదలక నెత్తికెక్కి నినుఁ గాదనఁ డాగ్రహమూనఁ డక్కటా
మది నొకలింగధారి వని మాటికిఁ దా నభిమాన మూనెరో. ౪౦

క. అని చందురునిం బలుమఱు
గినిసి పలికి చెవులు -దించు కీరమ్ముల మిం
చినగతిఁ గేరెడి పికములఁ
గను లెఱ్ఱఁగఁజేసి యనిలుఁ గని యిట్లనియెన్. ౪౧

క. చలమూన నేల? మలయా
చలమారుతమా! వియోగచలమానిసులన్
బలమాఱఁజేయు టిదెయొక
బలమా? కలమాట తెల్పు పకైకులస్థలనా. ౪౨

ఉ. ఈగతి దూఱిదూఱి యొక యింతయుఁ దాళఁగలేక మూర్ఛవో
గాఁ గని నెచ్చెలుల్ చలువగందము గుబ్బలఁబూసి శీతలో
ద్యోగము లెన్నియేనియును దోఁచినపట్టు నొనర్చి తేర్చి యిం
కేగతి నిర్వహింతు మని యెంచి తలంచుచు నున్నయంతటన్. ౪౩

తే.గీ. కెలనఁ బంజరముననున్న చిలుక పలికె
"నేల యీలీల యోజింప నేనుగల్గఁ?
గృష్ణు నెఱుఁగనొ? ద్వారక కేఁగలేనొ?
కార్యమును బొత్తుపఱచెడి గతు లెఱుఁగనొ? ౪౪

ఉ. మున్నొకనాఁడు చూచితిని ముచ్చటమీఱఁగ ద్వారకాపురం
బన్నగవైరి ప్రోలు నగజాధిపువీడు రమేశురాజధా
ని న్నగఁజాలు నన్నగరి నిచ్చలుఁ గాఁపురమున్న భూసురుల్
జన్నములందుఁ బ్రోడలు విశాలయశుల్ నిగమాంతకోవిదుల్. ౪౫

ఉ. వారల పాండితీమహిమ వారలయోగ్యత వారితీరు న
వ్వారి కులానువర్తనము వారలతేజము వారిసంపదల్
వారి కుటుంబవైఖరులు వారిపరోపకృతిస్స్వభావముల్
వారిజసంభవుండయిన వర్ణనసేయఁగలేఁ డొకింతయున్. ౪౬

క. అదిఁయేమి వింతయో యొక
పదియేఁడులు వచ్చువఱకె పదమున్ గ్రమమున్
దుడుకుట్టిఁ జెప్పనేర్తురు
చదువుల కిక్కలగు బ్రహ్మచారులు నగరిన్. ౪౭

ఉ. కత్తులపైఁ బరీక్షనిడఁగాఁదగు వేదము, శాస్త్రమన్న మీ
చిత్తమువచ్చినంత యిఁకఁ జెప్పెడిదేమి, కవిత్వమన్న పే
రెత్తి జయింపశక్యమె మఱెవ్వరికేని, సమస్త విద్య ల
ప్నత్తనభూసురాగ్రణుల పాలనరాదె? మఱింతయేటికిన్. ౪౮

ఉ. రాజులచేమి? సంపదల రాజిలు వారలు లేరె? తత్పురిన్
రాజులు నిర్జితప్రక్షితరాజులు రక్షితవేదశాస్త్రవి
రాజులు సమ్మదాయితవరాజులు సంపదలందు మేటి రా
రాజులు కీర్తినిర్మలితరాజులు రాజులు భోగసంపదన్. ౪౯

తే. గీ. కోమటులసంపదలను బేర్కొనఁగనేల
యాదియంతమ్ము నొందియు నాదియంత
మును గనక మధ్యమమ్ము లెచను ననేక
ములు మణులు వజ్రములు రత్నములును నెలమి. ౫౦

తే. గీ. విష్ణుపదజులు సదసద్వివేక మెఱిఁగి
తగు ననంతాప్తిచే మహోదయముగాంచి
విధుని సంసేవనముగల్గి విధివిహితగ
తుల నతులవైఖరుల నొప్పుదురు పురమున. ౫౧

ఉ. అప్పురి వారకామినుల యందము చంప మాటుండనిండు బల్
కుప్పలుగా ధనంబు పదికోటులొసంగనఁగాని నీచులన్
రెప్పలు విప్పిచూడరు సరేకద! విద్యలుమాపి ద్రవ్యమున్
గొప్పగ సంగ్రహించి యనుకూలురఁగూడి సుఖింతురెంతయున్. ౫౨

చ. అను శుకరాజుమాటలు హృదబ్జము బిట్టలరింప నెచ్చెలుల్
విని గదియంగఁజేరి పృథివీవరు పుత్త్రికఁగాంచి "నీమన
మ్మునఁ గల కోర్కె లింపలరఁ బూర్తియొనర్పఁగఁ బూనినట్టి నీ
యనుఁగు శుకమ్ము మాట వినవమ్మ! మనఃపరితాప మాఱఁగన్. ౫౯

చ. పులుఁగుల కిట్టికార్యములు పూనఁగఁ జెల్లదటంచు నెంచఁగా
నలపతి పల్లనాఁడు దమయంతికి నన్నలుతోడ నేస్తముం
గలుపదె యొక్కయంచ? గనఁగా నివి కొత్తలె? తత్తదున్నత
స్థలముల కేగఁజెల్లునె? వెసన్ మఱియొక్కరి కెంతవారికిన్. ౬౦

శా. ద్వారమ్ముల్ పనిలేదు కోటలనినన్ దాఁటుల్ తదంతస్స్థితా
గారంబుల్ సొర శంకలేదు పులుఁగుల్ గా కిట్టికార్యమ్ము లె
వ్వారల్ దీర్పఁగలారు? నీ మనమునన్ బాటిల్లు తాపమ్ము నీ
కీరాగ్రేసరుతోడఁ జెప్పఁదగదే? కీరేశ్వరాలాపినీ. ౬౧

ఉ. అమ్మరో! యిట్టికార్యముల యం దెటు జాగొనరింపరాదు వే
గమ్ముగ నీమనోరథము గాదిలిచిల్కకుఁ జెప్పిపంపు జా
లమ్మొనరింపఁబోకుము విలంబము చెట్టయగున్ "శుభస్యశీ
ఘ్రమ" మ్మని చెప్పినన్ వినవుగా, తడవాయె నిశీథమేగెడిన్." ౬౨

క. అని మాటిమాటికిని బో
ధనచేసెడి చెలుల విసువు దనరఁగఁ గని నె
క్కొని మఱియు మఱియు బోధిం
చిన మెల్లనఁ జిల్కతోడఁ జెలి యిట్లనియెన్. ౬౩

క. రమ్మనుమీ, సైపుట భా
రమ్మనుమీ, విరహ మతిభరమ్మనుమీ, వా
రమ్మనుమీ వ్యవధి, సుదూ
రమ్మనుమీపురి, స్వయంవర మ్మనుమి తగన్. ౬౪

క. చలమనుమీ మరుసకును, ని
శ్చలమనుమీ మన్మనము, బచలమనుమి మృగం
చల మన్యులపై, నిదిచం
చలమానిని గాదటంచు శౌరికిఁ జెపుమీ. ౬౫

క. మొక్కితినమ్మా, తనకుం
దక్కితినమ్మా, విశేషతాపభరమునన్
సొక్కితినమ్మా మిగులన్
జిక్కితినమ్మా, స్వయముగఁ జెప్పితి నమ్మా. ౭౬

క. అనుమానమేల? నిక్కము
నిను మాన నటంచుఁ బలికె నెలఁతుక పేర్మిన్
జనుమాన మొసఁగుమనుమా
చనుమా కనుమా కృపానుసారిన్ శౌరిన్. ౭౭

క. విరు లరులు, సరులు నురులు, హి
మరుచియు నకర్మిమరుచి, పికనాద్యద్భృంగ
స్వర ముర భీకరతర, మే
మఱ కిదియంతయును దెల్పుమా నరహరికిన్. ౭౮

చ. అనియనుపన్ శుకంబరిగె; నంచితసంచితపుణ్యగణ్యస
జ్జనధననందనందనలసత్పదపద్మరజోనుషంగస
ద్మనిభృతవాసభాసురమదప్రమదామృదుగానదూనదే
వనిచయమై తనర్చు నల ద్వారకకున్ గనుబంతచారిగా. ౭౯

తే. గీ. కుక్కుటములంతఁ గొక్కురుకోయటనియె
దిక్కులం దించుకించుక తెల్విదోఁచెఁ
జుక్కవాడిచెఁ బొటుక్కునఁ జూడఁజూడ
దీపములు తెల్లవారె సంతాపమాఱె. ౮౦

శా. చోరుల్ తాఁటిరి తారకల్ జుణిఁగె గచ్ఛన్విచ్ఛఁగా జారిణీ
జారుల్ వాటిరి మారుఁడున్ మరలెఁ గాసారంపుఁ దీరమ్ములం
బాఱుల్ సేరిరి దూరమేగు పథికుల్ మార్గంబులంబట్టి రం
భోరుట్సారభపూరపూరితములై పొల్పారె నుందెమ్మెరల్. ౮౧

సీ. అభిసారికాంగనావ్యభిచారములు తగ్గెఁ దమము తూరుపు పర్వతమ్ము డిగ్గెఁ
గువలయమ్ములరంగు దవుదవ్వుల మణంగ నెడవింటివాని యాగడపుడంగెఁ
బద్మినీకాంతకుఁ బ్రాయంబు నిండారె నంబుజారికి వైభవంబు తీఱె
నేకీభవించుచుఁ గోకముల్ చెలరేఁగె గుడ్లగూబలు కొండగుహల డాఁగె

తే. గీ. రంగుమెయి మత్తువస్తువుల్ మ్రింగిమ్రింగి
యొడలెఱుంగని రతముల బడలిబడలి
తెలివిఁగనలేని బలుసోమరులకుఁ దక్కఁ
దెల్లముగ నెల్లవారికిఁ దెల్లవారె. ౭౨

ఉ. రంగుగఁ దూర్పుకొండపయి రాజిలు చెట్టునఁబుట్టినట్టి నా
రంగఫలంబనంగఁ గడురమ్యములౌ నరుణప్రభాచ్ఛటల్
నింగినిఁ బర్వఁ బంకజవనీకమనీయత మాటిమాటి కు
ప్పొంగ నహస్కరుండు పొడుపుంగనెఁ జక్కవ లోకకైతగన్. ౭౩

తే.గీ. ప్రాఙ్నగము సూర్యుఁడనుపుత్రుఁ బడయుకతన
సంతసమ్మున దిక్కుల కంత రక్త
రాంకవమ్ములు బహుమతి రాణనొసఁగె
నాఁగ నీరెండ చెన్నారె నాల్గుదెసల. ౭౪

ఉ. అంతకు లక్ష్మణాసతియు నాబిడ నెచ్చెలులున్ దిగంతర
ప్రాంతనిషక్తదృష్టులయి పల్కులు కీరము రాక చూచుచున్
గంతు దురంతతాపమునఁ గ్రాఁగెడి రాతనయన్ బ్రమోదిత
స్వాంతనొనర్ప నేగిరి వసంతునికోటకుఁ బూలతోఁటకున్. ౭౫

సీ. గొలలచేఁదూఁగు కదళికల్ ఫలమ్ములఁ గొమరారు నారికేళములగములు
చేయెత్తు నిడుపవచ్చెడి పూగములు కిసాలయములఁ దగురసాలంపుఁ దరులు
పూలఁబిందెలఁబండ్ల వ్రాలెడి పనసలు పండినచెఱకులఁ బ్రబలుమడులు
నడుగడ్గునకును జొప్పడు పిల్లకాల్వలు కంటికి నింపగుపంటచేలు

తే.గీ. చక్కని కొలంకులును మేటి చంద్రకాంత
ఫలకవేదులు కేళిశూళులు సుమాళ
మలరు కేళీగృహమ్ములు పొలుపుదెలుపు
వలపుజిలికెడి యుద్యానవనమునందు. ౭౬

సీ. ఉభయపార్శ్వములందు నొప్పారు మల్లికాప్రతతి సౌందర్యంబు పాఁబుఁజూచి
దూరదూరమ్ముగాఁ గేరుకోయిలలతోఁ దులదూఁగగు మావుల సరసియాగసి
జలజలరాలు పుష్పములకుప్పల సౌరభమువొల్చు పొగడవృక్షములు గాంచి
మలయవాయువులచేఁ గలయఁబర్వెడి పరాగముల నొప్పెడి నికుంజములనెంచి

కాతని దర్శనం బెటుల నబ్బెనో? యేగతి విన్నవించితో?
చేతము చల్లనౌనటులఁ జెప్పఁగరాదె సవిస్తరమ్ముగన్. ౬౪

చ. కువలయనేత్రి సారెకును గోరికలీరికలెత్త నీగతిం
దవిలి పునఃపునఃప్రకలితమ్మగు నాదరముం దురమ్ముగా
నవిరళమై రసప్రసరమైతగు వాక్యపరంపరన్ గడుం
గవిసెడుకోర్కెఁ బల్కెనెసఁగన్ ద్విజరాజవతంస మిట్లుగన్. ౬౫

క. ఏ నరుగుపజ్జకుఁ గాలిని
మే నెఱుఁగనుగాని యాతఁడేతెఁగినయట్టులన్
మానోకఁడు నొక్కఁడై యో
మానిని! సౌధాగ్రమందు మసలుచునుండెన్. ౬౬

చ. ఎలమిఁ బచారు సేయు జలజేక్షణు దవ్వులఁ గాంచి కార్యమున్
ఫలితమగుంగదా యనుచుఁ బక్షములన్ ధ్వని రేఁగకుండ ని
శ్చలగతి నాతఁడున్న మణిసౌధము పొంతకు నేగి తద్గవా
క్షలసదుమన్ దృగంచలము సాచి గృహాంతరమెల్లఁ జూచితిన్. ౬౭

చ. చిలుకలు కొన్ని పంజరవిశేషములన్ గను పట్టె; నంత లో
పలికి వెసన్ జనంగ నొక పద్మదళాక్షియు లేకపోయె; నా
తలఁపున సందియంబగుఁగదా, యపుడేమి యొనర్పఁగావలెన్?
జలజదళాక్షుఁడైన నొక చందనగంధియు లేకపోవునే! ౬౮

వ. ఇట్లు సంశయించి వెండియును.

సీ. కారుకమ్ముల నేలఁగాఁజాలె నెమ్మేను నెమలిపించియము పెన్నెఱుల నొప్పెఁ
గరముల శంఖచక్రములు పేర్మి నెసంగె వనమాల గళమున నెసఁగి వ్రేలెఁ
గౌస్తుభం బక్కుపైఁ గళల నీనఁగఁ సాఁగె శ్రీవత్సమును వింతచెలువు దెలిపెఁ
బీతాంబరంబు విస్ఫీతమై కనుపట్టె వేణువా మోవిపై రాణ నలరె

తే. గీ. తక్కఁగల గొల్లవారల బల్మె కెక్కుటెల్ల
చక్కనగు షక్కిఁ గన్పట్టె; నక్కమితఁడు
కృష్ణుఁడేయని యోజించి కెలననుండి
యెదుటవారిలితి నాతఁడు నదిరిచూడ. ౬౯

చ. చెలఁదిరో! యేమిచెప్పనగు చెన్నునివింతలు, నన్నుఁజూచి“యో
చిలుక! భవత్సఖీమణికి సేమమె? పెండిలి యౌనటొప్పు? ఆ
య్యలికులవేణి కేనృపునియం దనురాగముగల్గె? నీకునుం
దెలియకపోదు నాకుఁ దగఁదెల్పుము పెండిలి కేనువచ్చెదన్.” ౯౧

చ. అని వచనమ్మునన్ బలుచనైనను నను లేనగవంకురింప నన్
గని యొకసక్కఫుంగతినిఁ గంజవిలోచనుఁడాడె నాతఁ డే
యనువున నీమనోరథమునారసె దయ్యమెటుంగు! నాకుఁగో
చెనపుడు నారదుండరిగి చెప్పెనటంచుఁ గురంగలోచనా. ౯౨

ఉ. అదియునుగాదు నిక్క, మతఁడాతనితో నినుఁ జెప్పఁగాక, నీ
మదిఁగలమర్మ మెట్లతని మానసమం టె! నటుండనిమ్ము; నా
కిది కడుఁబెద్దవింత! నను నీవనుపం జనినట్టిదానిఁగా
నెదనెటు నిశ్చయించె? జగదీశ్వరుఁ డాఁడెటుంగకుండునే. ౯౩

వ. అంత నేనును మహానుభావుండగు నతనికి నమస్కరించి వినయమున్నన
నిట్లంటి. ౯౪

క. దేవా! నీనెఱుఁగనికత
లేవీటన్ గలుగు? నీకు నేనెఱిఁగింపం
గావలయునె? పునరుక్తము
గావలయునె? యంచుఁ జెప్పఁగా దొరఁకొంటిన్. ౯౫

తే. గీ. భూసరోజముఖీమణిభూషణంబు
సప్తభూమికహాటకసౌధవరము
సకలసంపద్విభాసురజనచయంబు
మదరిముల కెల్ల తనరారు మదరిపురము. ౯౬

క. పాఠులు ధృతనిగమవ్యా
పారులు సమధీతనిగమపారులు జితకో
పారులు సమస్తశాస్త్రా
పారు లుదారులు నజాతపారులు నగరిన్. ౯౭

ఉ. అచ్చటి రాచవారు కలనైనను బోరులనోగగారు, ని
వ్వచ్చునినైన మెచ్చ, రల భార్గవరాముఁడు నేఁడునున్నఁబై

పెచ్చునిపించుకొందుమని బీరము బేరములాడుచుంద్రు; కాల్
గుర్చిచ్చినఁ బాఁపరాతలలకున్ దలవంపులొనర్తు రెంతయున్. ౯౭

ఉ. తాతలనాఁటి పాతులకతమ్మున నాతని కంపలేముగా
కాలుఁడు మమ్ముఁబోలె ఘనమార్జనచేసె నెయంచు నూరుషం
జాపపుజాతివారచట జక్కులరాయని లెక్కసేయ రే
పాతులు లేకయే ఘన మపారముగా గడించి మించుటన్. ౯౮

క. పాడజు లెల్లరు ద్విజసే
వాదరు లత్యంతవిభవు లప్పురియం దా
మోదింపఁ దగనివస్తువు
లేదొక్కటియేనియును వళీకం బేలా. ౯౯

వ. అట్టిపురమ్మున కధీశ్వరుండు

క. కలఁడు బృహత్సేనధరా
తలనాథుం, డతఁడు మిగుల ధర్మాత్ముం డా
లలితునకు నొక్కకూఁతురు
వెలఁగున్ లక్షణయటంచుఁ జెప్పెదు రా పెన్. ౧౦౦

ఉ. మాచెలియంచుఁ జెప్పికొనుమాటలుగావివి యామెఁబోల నా
మాచెలి యయ్యుమాసతియు మారునినారియు మాఱుగారు దే
వా! చెలులుందురొంగద పదాఱుసహస్రము లిప్పురమ్మునం
దాచెలియందమందలి పదాఱవతీరున మాఱనేర్తురే! ౧౦౧

వ. అని వెండియు.

సీ. నీలంపుమణులు మా నెలఁత వెన్నెలలంటి పడఁతిగుబ్బలు దబ్బపండులంటి
దానిమ్మగింజలు తరుణిదంతములంటి మగువ కెమ్మోవి బింబఫలమంటి
చెలిమిన్ననూఁగారు చీమలబారంటిఁ గలికినళుల్ తరంగమ్ములంటి
వనజాస్యనాసిక కనకపుష్పంబంటి వెలఁదికన్నులు పద్మదళములంటి

తే. గీ. సకియ నెమ్మోము పూర్ణిమాచంద్రుఁడంటి
కొమ్మ పెందొడ లంటికంబమ్ములంటి

నడుము సున్నంటెఁ బొక్కిలి సుడియటంటెఁ
దనుసు నీకంటె రమ్మని తగులుకొంటెని, ౧౧౨

క. కరములు నీరజశోభా
కరములు గళ మెన్న దరనిగళమను సభిరాం
కురములు హిమకర రేఖాం
కురములు పదములును విజితకోకనదప్రసూనముల్. ౧౧౩

ఉ. బంగరుబొమ్మ, సంపఁగులపట్టు చొక్కాటపుఁబ్రతిక్క పేలు మో
రంగులకుప్ప మారునిశరంబు రసంబుల తేట గ్రజపున్
ముంగర నేరుపుండఁగుట నుద్దులమూట గొరాలపేట నా
యంగన, దానిఁబోలఁగల యంగన లేదని నొక్కి చెప్పితిన్. ౧౧౪

ఉ. నారదమౌని వచ్చి జననాయకునొద్ద నొకింతగా భవ
చ్చారుతరప్రభావముల చందమునందముసుండఁగన్ మనం
బూరఁగఁజేయుచుం దెలిపె నోయదునందన! తత్ప్రణంబ నీ
పై రుచివెట్టె నా చెలియ, పట్టిగ నిక్కముగాద దేరికన్. ౧౧౫

క. అళులనిన నులికిపడు నె
చ్చెలులన్నన్ గసరుఁ బికవిశేషధ్వనికిన్
దలఁకు శశియన్న నులుకున్
జిలుకలకొలికి యళు కేమి చెప్పఁగవచ్చున్? ౧౧౬

చ. నిను నుతియించు నిన్ గసను నీసనిసన్ దలఁగొ త్తించూచుఁ గా
నినుఁ బలుమానునుం దలఁచు నీదు కథాసుధఁ గ్రోలు నంతట
న్నినుఁగను నిన్ను మ్రొక్కు మఱినిన్ను వినున్ నినుఁబాడు మాటికి
న్నినుఁబలవించు నిన్నెడపు నీమయమంతయు నాలతాంగికిన్. ౧౧౭

ఉ. చక్కనివాఁడవీవు నెఱజాణలజాణ నరేంద్రకన్య; బల్
టక్కరివీవు సొంపగుబెడంగున మేటి నృపాలబాల; నీ
వక్కమలాస్యకుం దగుదు వక్కమలాస్యయు నీకుఁజాలుఁ; గా
మ్రొక్కె నుతించె వేఁడికొనె ముంచినఁ దేల్చిన నీవసుమ్మిఁకన్, ౧౧౮

క॥ అని నీచెప్పిన సంగతు
లను శతగుణముగ నొనర్చి లలితగతుల బో

ధనచేసి "వత్తునిట" కని
యనిపించితి నా హస్తమందు హస్తంబిడియెన్. ౧౦౯

చ. అని చిలుకాడుమాటలు హృదబ్జము నుల్లసిల్లఁ జేయఁ జక్షణా
వనజముఖీలలాము ముఖవారిజ మంకురితస్మితమ్ముగాఁ
జనవున నుల్లసిల్లఁ జెక్కులు చెక్కులుం దనిపించె; సార్థకా
మినులకు మాటలాడ్కలు తటి మేటిపరిమ్ములౌ సంగ దైవముల్. ౧౧౦

తే.గీ. అంత నెచ్చెలు లిట్లని రానరేంద్ర
పుత్రితో "నీదు కార్యమ్ము పొత్తుపఱచి
నట్టి చిల్కకు సమ్మాన మాచరించి
చిల్క తేజీదొరను వెలిఁజేయనగును". ౧౧౧

మ. అనఁ జూచాయల నత్తలోదరియుఁ దానంగీకృతిం దెల్ప న
వ్వనజాస్యల్ నృపపుత్రితో సరసిలో వాలాయమోలాడి యొ
డ్డునకున్ వచ్చి కురుల్ విదిర్చికొని పట్టుంబుట్టముల్ గట్టి నె
క్కొని భూషల్ ధరియించి బొట్టులిడి కోర్కుల్ మిన్నుముట్టన్ దగన్

సీ. కిలకిలమనుచుఁ గోకిలలు గూసెడిచోట నళిదంపతులగాన మమరుచోటఁ
జిలుకముత్తైదువుల్ గలసి యాడెడిచోటఁ గేకులు పురివిచ్చి కేరలుచోటఁ
నల్లిబిల్లిగ లతలల్లి యొప్పెడిచోటఁ బుష్పపరాగంబు వొలయుచోటఁ
బిల్లవాయువులు సంప్రీతిఁ జేసెడిచోట శారికల్ సురతముల్ సలుపుచోటఁ

తే.గీ. బూలఁబిందెలఁ దులఁదూఁగి నేలకంటు
గుజ్జులేనునుమామిడి గులుకుచోట
సపరివారమ్ముగాఁ బుష్పశరుని నిలిపి
యతని వామాంకమున రతి ననువుపఱచి. ౧౧౩

క. ఆవాహనాదివిధుల ము
దావహముగ మదనదేవునర్చించి సఖుల్
ప్రావుంగోయిలి గొని యా
దేవుని మదినిల్పికొని నుతించిరి భక్తిన్. ౧౧౪

సీ. మదనాయ తారుణ్యసదనాయ శుభ్రాంశువదనాయ దేవ తుభ్యం నమోస్తు
మారాయ వైరాగ్యచోరాయ భృతకీరవారాయ దేవ తుభ్యం నమోస్తు

కామాయ సహచరత్సోమాయ విరహిణీవామాయ దేవ తుభ్యం నమోస్తు
తరుణాయ సౌందర్యవరణాయ శంబరహరణాయ దేవ తుభ్యం నమోస్తు

తే.గీ. పంకరుహసాయకాయ తుభ్యం నమోస్తు
పద్మజాదినుతాయ తుభ్యం నమోస్తు
పరమపుణ్యకథాయ తుభ్యం నమోస్తు
భార్గవీనందనాయ తుభ్యం నమోస్తు. ౧౧౫

చ. నలు దమయంతితోఁ గలిపినావు సుదర్శనుతోడఁ బేర్మి శ్రీ
లలువొలయంగ నాశశికలాలలితాంగినిఁ గూర్చినావు నీ
విలఁగల యెల్లదంపతుల కేలికవై జగదాదిహేతువై
చెలఁగెడివాఁడ వీసతికి శ్రీహరి పొందొడఁగూర్పఁజాలవే. ౧౧౬

చ. అని నుతియించి యావనితలందమఁ గందళితాంతరంగయై
యనుఁగు సఖీమణిం గలసి యంతిపురమ్మున నాపె డించి యా
జనుగొని యిండ్లకేగిరి వెసన్; జలజాప్తుఁడు నంతఁ దీక్ష్ణస
ర్తనుఁడయి మధ్యమాంబరపదమ్మున డంబుగనొప్పె నిచ్చలున్. ౧౧౭

తే. గీ. అవనిపతి భోజనాదికృత్యములు దీర్చి
కవులు మంత్రులు పండితుల్ గలసికొలువఁ
దరుణశరదిందుముఖులు చామరలువీవ
నిండుకొలువుండెఁ గన్నులపండువలర. ౧౧౮

ఉ. నారదుఁడాడినట్టి వచనమ్ములు మంత్రులతోడఁ జెప్పి మే
లారసి పుత్రికామణికి నాయదునందనుపై విరాళియున్
బాలు పెటింగి చారులను బంచెఁ దగన్ శుభలేఖ లిచ్చి శ్రీ
స్ఫారధరాతలేశ్వరుల సంఘములన్ బిలుపంగ నత్తఱిన్. ౧౧౯

## ఆశ్వాసాంతపద్యములు.

క. శ్రీశారదాకటాక్షా
వేశ సమావేశ సంప్రవృద్ధఖ్యాతీ!
దేశాయిదేశముఖము
ఖ్యాశాసిత బిరుదశాలి! యాత్తగుణాళీ! ౧౨౦

చ. హితమితభాషితాపరిచితీతరహృద్గతభావవేత్తృతే
ప్సితసఫలీకృతిప్రతినివేశితగౌరవబుద్ధినిష్కళం
కితచరితా ! కవిత్వరసకేవలతత్పర ! సత్పరాయణా !
అతిపరిపక్వచిత్త ! పరమాద్భుతవృత్త ! మహాగుణోత్తరా! ౧౨౧

స్రగ్విణి, తాటికొండాఖ్యసద్గ్రామధామా ! నిరా
ఘాటసామర్థ్యయుక్తా ! మహాశాంత ! యు
త్పాటితక్రోధ ! సంప్రాప్తబోధా ! యస
త్పాటవీచ్ఛేదనాయత్తచిత్తాంచితా! ౧౨౨

గద్య

ఇది శ్రీ...తిరుపతివేంకటీయ లక్షణాపరిణయంబను మహా ప్రబంధమునందు
ద్వితీయాశ్వాసము

—:o:—

శ్రీరస్తు.

శ్రీమత్పరదేవతాయై నమః

# లక్ష్మణా పరిణయము

## తృతీయాశ్వాసము



శ్రీరామచంద్రపదప
ద్మారాధననియతహృదయ! హరిహరగుణయు
శ్రీరుచిర! నిరుపమదయా
ర్ద్రా! రక్షితపండితేంద్ర! రామనరేంద్రా! ౧

తే. గీ. అవధరింపు మనంతరం బట్లు నంద
నందనుఁడు చిల్క చెప్పిన యందచంద
ములు మనమ్మున నాటి యమ్ముద్దుగుమ్మ
కన్నులకుఁ గట్టినట్లుగాఁ గళవళించు. ౨

ఉ. అంతకుమున్న విన్న చెలు వగ్గలమై తలకెక్క రుక్మిణీ
కాంతున కంతకంతకును గంతునిదంతి పచించినట్టి య
య్యింతి విలాసముల్ మరుని కేవుఘటించి తదన్యకాంతలం
దెంతయు సేవగింపు లగియింపఁగఁజేసె నదేమివింతయో. 3

సీ. రుక్మిణితోఁ బొత్తు రుచియింపదాయెఁగా దాయగాఁబోఁచె సుదంతచింత
సాత్రాజితి యటన్న సంతుష్టమాయెఁగా నాయగాఁబోఁచ జాంబవతి సేర్మి
రాధికాసతి చెల్మి రహిలేకపోయెఁగా పాయఁగాఁబోఁచ నాభదప్ర పేర్మి
నీలపాం దడవిపెన్నెల పోలికాయెఁగా కాయఁగాఁబోఁచె నర్కునతమమత

తే. గీ. వన్నెగల గొల్లకన్నెల చిన్నెలన్ని
యెన్నికకు రాక మునుమున్న వన్నెదఱిఁగె

చిన్నిచిన్నారి చిన్నెలు వెన్నుదన్న
లక్షణామయుఁడయ్యెఁ బద్మేక్షణుండు. ౪

సీ. సంశయంబందె భీష్మకరాజనందన సత్యభామ కోకింప శంకవొడమె
రాధకు మునుపోలె రసమెసంగకపోయె భద్రకు నీరసభావ మొదవె
కళలుజాఱుట తప్పెఁ గాళింది కెంతయు ననుమానము సుదంత కినుమడించె
జాంబవతికిఁ బూర్వసారస్య మెరుపాయె నీళకు మునుపటిబాళి తఱఁగె

తే. గీ. లక్షణాధీనుఁడైన పద్మాక్షుపొందు
సుందరులకందఱకుఁ బ్రోత్సాహంపమాయెఁ;
గాంతులమువమ్ము లన్యసంగతము లైనఁ
దెలివిగల ప్రోషచెలులకుఁ దెలియఁబడవె.? ౫

మ. తపనుఁ బరస్పరమ్ముగల తామసముల్ విడనాడి యంపకుల్
గుమిగొని కృష్ణుచర్యలను గొంతనడిన్ దలపోసి యంత న
క్కమలదళాక్షు చిత్తమధికమ్ముగ లక్షణయందుఁ జిక్కుటల్
క్రమముగఁ గింపటంతిగఁ పగన్ దెలియంగఁ పలోదరీమణుల్, ౬

క. "మన ననుభవింపఁగా మిగి
లిన సౌఖ్యం బనుభవించు లే" యంచు నొకొ
ర్తను; "దానికేమి యదియును
మనవంటిదె పొమ్మ"టంచు మఱియొక తె యనున్. ౭

తే. "చాలమటంచు నింక నొక సారసగంధిని గూడ నెంచెనో!
యాలలితాంగి యందమున కందఱ కెక్కుడటంచుఁ దోఁచెనో!
స్త్రీలు పదాఱువేలుగల చెల్వునకేమని యాసచేసెనో
యాలలనాశిరోమణి, బళా! కలరే; మనవంటి వెఱ్ఱులున్! ౮

క. తరుణి కొక పురుషునందుం
దిరముగ మదినిల్చుఁగాని తొయ్యలయందున్
దఱచుగఁ బురుషుల కొకచో
గుఱినిల్చుట కాన మేమొకో? తరళాక్షీ. ౯

క. మనచంద మెచ్చటను మే
దినిఁ గనవినరాదు వింత తెరువిది లోక

మ్మనఁ బురుషులిట్టివారలు
వినఁబడిరె? పురాణములను వేదములందున్. ౧౦

చ. ఇతరమృగాక్షులందుఁ గలనేని మదింజొరనీక సంతతం
బతివయొకర్తగా నియమమందెడి సుందరుఁడైన పూరుషుల్
వెతకిన నెందు నేనిఁ బ్రకటింపఁగలరేమొకొ యంచు సంశయా
హతమగు నామనం, బటులనబ్బిన గుణ్యతపస్యా మన్యసే.” ౧౧

క. అని పలువిధములఁ గృష్ణుని
వనజాననలెల్ల వారివారిమదికిఁ దోఁ
చినభంగి నాడికొని; రం
గన లన్యస్వాంతుఁ గాంతుఁ గని యోరుతురే. ౧౨

సీ. చిలుకపోయినతోవ్రి పలుమాఱుఁ దిలకించుఁ దిలకించి నిట్టూర్పు వెలికివిడుచు,
విడిచి యించుకసేపు తడబాటు మదిఁదాల్చుఁ దాల్చి కందమ్ము లంతలుగఁ జేయుఁ
జేసి లోలోన విశ్వాసమ్ము సంధించు సంధించి యచ్చోన చందమెంచు,
నెంచి ముచ్చటలాడ నించుక గమకించు గమకించి తనలోనఁ గళవళించుఁ,

తే.గీ. గళవళించి యపత్రపఁ గాంచి మించు;
మించి యోజించు; యోజించి మేలు గాంచుఁ
గాంచి చింతించు; చింతించి కంతు నెంచు;
నెంచి “దయయుంచు” మని పలవించు శౌరి. ౧౩

సీ. తా బృహత్సేనుఁడై తనరువాఁడయ్యు బృహత్సేనసుతకునై యాసచేయుఁ
దా బహులక్షణాధారుఁడయ్యును నొక్క లక్షణాతరుణీవిలాస మెంచుఁ,
దా బయోధరపయోధరహారియయ్యు నత్తలునీపయోధరమ్ములకుఁ దలకుఁ,
దా దావఘోరాగ్నిఁ ద్రావువాఁడయ్యు నయ్యంగనావిరహాగ్ని కటమటించుఁ

తే.గీ. దా ననంగునిఁ గన్నట్టి తండ్రియయ్యు
నయ్యనంగుని శిక్షింప నడరుగాంచుఁ
దా జగన్మోహనుండయ్యుఁ దద్గతైక
మోహినీ మోహవార్నిధి మునిఁగి తేలు. ౧౪

క. ఈగతిఁ గృష్ణుండెంతయు
వేఁగుచు నుద్యానమునకు వెడలి యచట నా

వాగమవీక్షాకలనో
ద్యోగమ్మునఁ బొద్దువుచ్చుచుండెఁ దనంతన్.

ఉ. అంతట నేగుదెంచిరి స్వయంవరలేఖలు గొంచుఁ జాతు ల
క్కాంతునిఁ గన్నతండ్రి కెనకమ్మున విన్నపమాచరింపఁ, గం
సాంతకుఁ డాదరమ్మున స్వయంవర లేఖ పఠించి లోన నొ
క్కింత దిటమ్ముపూని చనియెన్ వనమేడకు నిశ్చితాత్ముఁడై. ౧౬

తే.గీ. లక్షణాచంద్రముఖియు విలక్షణార్తి
నలసిసొలసి "స్వయంవరమగుట యెప్డు,
కృష్ణసందర్శనంబగు టెప్డు, నా మ
నోవ్యథలు తీఱు టెప్డు" యనుచుఁ గడంగి. ౧౭

ఉ. ద్వారకయున్న దిక్కునకుఁ దద్దయు దృష్టినిగుడ్చుచున్ సఖీ
వారము తత్పురీపథమువంకకు నంపుచు మాటిమాటికిన్
మారుని దూఱుచున్ మలయమందసమీరకుమారుఁ గేరుచున్
వారిజనాభునిన్ హృదయవారిజమందుఁ బసందు చేయుచున్. ౧౮

తే.గీ. అవధిదినములు పలుమారు నరసికొనుచు
గణనచేయుచుఁ గాలదైర్ఘ్యమ్మునకు స
సూయచెందుచుఁ గుందుచు నాయశోది
కాతనయుఁగూర్చి కాలమ్ము గడపునంత. ౧౯

ఉ. వచ్చిరి రాజపుత్రు లనివారణవారణులై తురంగరం
గచ్చతురంగులై జయదఖండరథోద్ధతులై నిరస్తవి
ద్యుచ్చలనాసిభాసురకరోద్ధురసారసనాదిసాదిభా
స్వచ్చతురంతయానవిలసత్పరివారజనానుయాతులై. ౨౦

ఉ. అంగజతేజుఁ డుజ్జ్వలితహారకిరీటమణీవిభూషణా
భంగురకాయుఁ డాయతకృపారసబంధురమానసుండు వ
చ్చెం గమలాక్షుఁ డుత్సుకత చెన్నలరార రథాధిరూఢుఁడై
మంగళసంగతంబయిన మద్రధరాధిపురాజధానికిన్. ౨౧

ఉ. నెచ్చెలు లేగియంత ధరణీపరపుత్రికఁగాంచి "వచ్చె వి
వ్వచ్చుని బావ" యంచుఁ దెలుపన్ వలపంకురమంది యంతలో

హెచ్చి మనోవికారము లనేకములన్ సృజియించె నేమనన్
వచ్చును, బచ్చవింటిదొర వైఖరు లాఁగఁగ నేరిశక్యమా! ౨౨

చ. ఒకతె వచించు నానెనుక నొక్కతె సెప్పు ననంతరంబు వే
ఱొకతెయు మీఁద నొక్కతెయు నొక్కతె చెప్పినమాట వేఱొక
ర్తుక మదినెంచ కిట్లుపలురూపులఁ జెప్పిరి మద్రరాజక
న్యకకు మురారిరాక; సుభమానెడ వార్తల పౌనరుక్త్యముల్. ౨౩

సీ. హరివచ్చెనని చెప్పె ననుఁగు నెచ్చెలియొర్తు సరసిజాక్షుండనె నంతనొకతె
పద్మనాభుండనెఁ బడఁతిమిన్న యొకర్తు వనమాలియానెఁ జంద్రవదనయొకతె
బర్హభూషణుఁడనెఁ బద్మనేత్రి యొకర్తు చక్రహస్తుండనెఁ జానయొకతె
వేణుభాసురుఁడనె నెలఁది యింకొక్కర్తు కౌస్తుభాన్వితుఁడనెఁ గాంతయొకతె

తే. గీ. కలికియొక్కతె శ్రీవత్సకలితుఁ డనియె
నతివయొక్కతె పీతాంబరాఢ్యుఁ డనియె
యదుకుమారకుఁ డనె నొక్కయంచయాన
కృష్ణుఁ డనిచెప్పె నొక్కకీరవాణి. ౨౪

తే. గీ. ఎచటఁజూచిన రాజన్యు లెచట దృష్టి
నించినను గుఱ్ఱములు గజానీకములును
నెచటఁ గనుఁగొన్న రథము లిట్లెల్లయెడల
దంతురంబయ్యె మద్రపురాంతరంబు. ౨౫

క. అంత బృహత్సేనధరా
కాంతుం డెల్లరకుఁ దగినగౌరవములతో
నెంతయు సన్మానించి య
నంతరమున మత్స్యయంత్ర మాసాదించెన్. ౨౬

ఉ. పిమ్మట రాజులెల్లఁ బృథివీపతి పిల్వఁగఁ బంపమత్స్యయం
త్రమ్ము సమీపమందుఁ గల రచ్చనెలర్చెడి చంద్రకాంత పీ
ఠమ్ములఁ దారతమ్యము గడల్కొన నూల్కొని రంబుజాక్షుఁడున్
సమ్మతినెక్కె నొక్కవిలసన్మణిపీఠ మహార్యచర్యుఁడై. ౨౭

ఉ. చూచెడివారు, యంత్రమిది చోద్యమటంచుఁ దలంచువారు, "నా
ఠాచపువిద్దెకుం దగినరచ్చ యిదే" యనువారు, "వారిలోఁ

జూచుచు దీనిఁగొట్టవలెఁ జూచినఁ గా" దనువారు, "వహ్వారే
రాచకొమార్త నేలఁగల రాజెవఁడో" యనువారు భూపతుల్. ౨౮

మ. వయసొక్కంత యతీతమై నృపతులన్ వాలాయ మీక్షించి తే
వయసున్ రాజకుమారు లందఱును నవ్వన్ జొచ్చి రాశ్చర్యమా
వయసుల్ డస్సినమీఁదఁ గన్నియలపై వాంఛల్ పిసాళించువా
రి యయోగ్యస్థితు లేరికేనియును బూరించున్ రసాభాసముల్. ౨౯

ఉ. నందకుమారు రాకకతనం దెలివొందిన మోముతోఁ గన
త్సుందరమందహాసకలతోఁ దులఁదూఁగుచు గండపాళి నిం
పొందళుకొత్తుచున్ విరహపుం దెలిచాయలతోడ లక్షణా
చందనగంధి వచ్చె సరసంపుగతిన్ మితభూషితస్థితిన్. ౩౦

ఉ. గాదిలి రాచకన్నియ నెగాదిగఁ జూచుచు రాకుమారు "లీ
మాదిరి నుంపరీమణి విమానచరప్రమదాళులందుఁ గా
కోదరరాజసంభవతలోదరులందును లే" దటంచు నా
మోదము సందియమ్మును బ్రమోదమునుం గని రందఱుం దగన్. ౩౧

ఉ. అంత నృపాలకుం డొకఁడు హస్తమునన్ ధనువున్ ధరించి య
త్యంతము నేర్పుగల్గినటు లాకసమందలి మత్స్యయంత్రి మొ
క్కంతగ నీటఁజూచి శరమేసెను బారెడు హెచ్చుతగ్గుగా
"నెంతటి వింటి విద్య" యని యెల్లనృపుల్ దనుఁజూచి నవ్వఁగన్. ౩౨

ఉ. ఇంచుక డస్సిపోవ నొకఁడేసె; మఱొక్కఁడు లక్ష్యమెద్దియో
యెంచక బాణముం జెఱిచె; నేమనవచ్చు! నొకండు లక్షణా
చంచలనేత్రిపై మనము జాఱినవాఁడగుటన్ మఱొక్కచో
నించె శరంబు, నందఱును నివ్వెఱఁగంది తనుం గనుంగొనన్. ౩౩

శా. అంతన్ గంతునిఁగన్నతండ్రి సురకాంతానందసంధాయియై
ప్రాంతస్థావనిపాలకుల్ శిరములన్ వంపన్ సరోజాంబుద
భ్రాంతిం జెల్వుచు బంగరుంబటము పైపైజాఱ సందీపితా
శాంతుండై యువతీలలామఁ దునిమె మత్స్యాకారమున్ యంత్రమున్. ౩౪

ఉ. తుత్రించినయంతమాత్రమున దుందుభు లాకసమందు మ్రోసె వా
యించి రనేకవాద్యముల నిచ్చట, నచ్చట నచ్చరల్ ప్రశం

సించిరి లక్షణాసతియుఁ జెచ్చెరవచ్చి మధూకమాల నుం
కించి తగిల్చె సిగ్గిలుచుఁ గృష్ణునికంఠమునందుఁ బొందుగన్. ౩౭

వ. ఇట్లు లక్షణ కృష్ణువరించుటయు నచ్చటి రాజులందఱును

ఉ. గొల్లఁడు రాచకన్నెను దగుల్కొనిపోవఁగ రాజులార! మీ
యుల్లములందు సిగ్గువడ కూరక పోయెదరేల? రండు భీ
తిల్లుట రాచపాడియె? మదించిన వీనిమదం బడంచి యీ
పల్లవపాణికిం దగినవానికిఁ బెండ్లియొనర్తమం చొగిన్. ౩౮

చ. తపతపమీఱఁ గొందఱు కటారులుదీసిరి; కొంతమంది క
న్గవ నెఱసంజచాయ లొలుకన్ ధనువుల్ శరముల్ ధరించి "త
క్కువగనలేక గొల్లనికిఁ గూఁతు నొసంగుదురయ్య! యేటిరా
జ" యనుచు మద్రభూపతిని సారెకు దూఱఁగడంగి రెంతయున్. ౩౯

వ. ఇట్లు రాజులందఱును నొక్కపెట్ట హరిపైఁ గవియుటయు

సీ. బవరమ్ము వచ్చె దైవమ! యంచు లక్షణాసారసాక్షికి గుండె జల్లుమనఁగ
రాజవైరంబు సంప్రాప్తించెనని మద్రధరణీశునకుఁ గాళ్లు తడఁబడంగ
మీనయంత్రము ద్రుంచలేనిరాజుల కేటి పౌరుషంబని పౌరవరులు దూఱ
నీరాజమణు లెంతయో సుమానసు లంచుఁ జదల గీర్వాణు లాశ్చర్యమంద

తే.గీ. పట్టుపుట్టంబు నడుమునఁ బిట్టుచుట్టి
హరిణతతిమీఁద దుముకు సింహంబుపగిదిఁ
జక్రి యొకకేల ధరియించి సరసిజాక్షుఁ
డవనిపాలురపై నిర్భయముగ నుఱికె. ౪౦

వ. ఇట్లుఱికి సంవర్తసమయ ధారాధరమ్ము వడువున శరాసారమ్ములం బఱపి చీకాకు
గావించిన

ఉ. ఆనృప వీరులందఱు స్వయంవరవైఖరు లెంచికొంచు మా
లోనఁ జలమ్ము లజ్జయును లోలతయున్ దలపంపునింప ము
న్మానినమార్గముంగొని త్వరోద్ధురులై చని; రంత సాబృహ
త్సేనుఁడు కృష్ణుఁ దోడికొని సేనలు గొల్వఁగ నేగెఁ గోటకున్. ౪౧

తే. గీ. అంతలక్ష్మణకును జలజాక్షునకును
మంగళస్నాన మొనరించి రంగనాజ
నములు మంగళవాద్యముల్ గొమరుమిగుల
వేదఘోషమ్ము లందంద విస్తరిల్ల. ౭౩

మ. తలయంటెన్ జలజాక్షియొక్కతె లలత్తైలమ్ము కంసారికిన్
నలుగుం బెట్టె మఱొక్కతేమ హరికి స్నానంపుఁ గాలాగురున్
జలకంబార్చె నిఁకొక్కచాన హిమవాస్సారమ్మునన్ జక్రికిన్
జెలి వేఱొక్కతె నన్ గురుల్ దగ విదిర్చెన్ గొఱలన్ దువ్వుచున్. ౭౪

తే. గీ. మఱిపెములనొప్ప నవ్వధూవరుల నుచిత
భూషణాంబరముల నింపువుట్టఁ దగ న
లంకరించి యథోచితలక్షణముల
వేదిఁ గైసేయఁజేసిరి పేరటాండ్రు. ౭౫

క. శ్రుతిహితముగ నతులితముగ
ధృతకౌతుకస్వాంతులగుచు ద్విజులు శుభసమ
న్వితగతిఁ బెండ్లియొనర్చిరి
సతీపతులకిర్వురకు నెసక మెసఁగంగన్. ౭౬

శా. కట్టెన్ గేలు నెమర్చ మానసము పొంగన్ గోర్కు లాకాశమున్
ముట్టన్ మంగళసూత్రి మంగజకళాపూర్ణుండు కృష్ణుండు మేల్
రెట్టింపన్ దగు లక్షణాగళమునన్ లీలామహావాద్యముల్
ధట్టింపన్ దదుదారదివ్యతరసౌందర్యమ్ము నీక్షించుచున్. ౭౭

ఉ. "నాతి చరామి" యన్న వచనార్థ మెఱుంగునొ, లేదొ! యమ్మురా
రాతి పఠించి యచ్చెలిశిరమ్మున హస్తము నెట్టె భిట్టుపేరి
మాతిశయమ్మునన్ గురుపరాస్తమతిన్, బదియాఱువేలపై
చేతులఁ దక్కు భార్యలఁ ద్యజింపఁ దలంచెనొ లక్షణార్థమై! ౭౮

తే. గీ. మఱిపె మొక్కింత లోనఁ దత్తఱ మొకింత
సందియ మొకింతయును సంతస మ్మొకింత
గలసి యొకవింత పుట్టింపఁ జెలియమిన్న
వల్లవీలోలుపైఁ దలఁబ్రాలువోసె. ౭౯

సీ. మంగళం లక్ష్మణామానినీకమనాయ మంగళం త్రైలోక్యమండనాయ
మంగళం పల్లవీమానసాధారాయ మంగళం యదువంశమానితాయ
మంగళం గోగోపమండలత్రాణాయ మంగళం మునిసంభావితాయ
మంగళం సత్యభామాపదానుచరాయ మంగళం రాధికామన్మథాయ

తే. గీ. మంగళం మంగళం గోపపుంగవాయ
మంగళం మంగళం సర్వమంగళాయ
మంగళం మంగళం మృదుమానసాయ
యనుచు నారతులెత్తిరి వనజముఖులు. ౫౦

తే. గీ. శ్రుతిహితమ్ముగ విప్రులు శ్రుతులు సెప్పఁ
బుణ్యసతులెల్ల మంగళమ్ములను బాడ
వెలవెలందులు నాట్యముల్ విస్తరింప
లక్షణను పెండ్లియాడెఁ బద్మేక్షణుండు. ౫౧

తే. గీ. ప్రమదమొప్పంగ నైదుదినములు నేగ
నంత నగరోత్సవమ్ము చేయంగఁ దలఁచి
మించు సదలంకృతులను భూషించిరెలమి
లక్షణాతరుణీసరోజేక్షణులను. ౫౨

సీ. మల్లెమొగ్గలువెట్టి మణిసరమ్ములుచుట్టి జడకు సింగారమ్ము గడలుకొల్పి
రతనంపునత్తు వజ్రపుబులాకీ పొత్తుగలిప నాసకు వింత చెలువుగొలిపి
పలుహారములచేతఁ బచ్చికస్తురిపూఁత గుబ్బచన్నులకు మేల్ గుస్తరించి
దొడ్డచీర లగించి యొడ్డాణముఁ బిగించి లేఁత వెన్నడుమున కాఁతయొసఁగి

తే. గీ. పసపు పూసియుఁ బారాణియొసఁగి పదస
రసిజములకుఁ బసందగు పస ఘటించి
పలుచనగుగతి బాహులఁ గలప మలఁది
లక్షణ నలంకరించిరి లక్షణముగ. ౫౩

సీ. పలుఫలాహారముల్ పలుపపన్నీరు మేలత్తరుల్ చిత్తరుల్ పాళినాలయు
నెత్తంపుఁబలకవీణియ తమ్మలంపుఁజిల్కలు పూలబంతులు మెలపుఁదొలుప
చిటిచాఁప చెలువునించెడు పట్టుదిండియల్ బంగారుకలశముల్ పసనెసంగ
ముత్యాలపీఁట బల్ చక్కని కుర్చీలు సేడ్లు గులాబులు చెలువుమలప

తే.గీ. సిగ్గునను మ్రగ్గుచున్న యచ్చెలియఁ గృష్ణు
దరికి రాఁదీసి యొకప్రోడ దనపుఁ గలికి
పలుకులం దెంతయును నేర్పు దొలకరింప
నింపులు జనింప వత్సతో నిట్టులనియె. ౬౧

సీ. పర్వాసమ్ములుగావు పడఁతికక్షోజమ్ము లలరుగుత్తులుసుమీ యద్రిధరణ!
కాలసర్పముగాదు కలికికీలుజడ యళికులమాలసుమి కాళీయదమన!
కరికరమ్ములుగావు కలికిసుందొడ లంటి స్తంభముల్ సుమ్ము కంసకరిహరణ!
చక్రముల్ గావు మాజలజాక్షి పిఱుఁదులు సైకతమ్ములు సుమీ చక్రహస్త!

తే.గీ. మోవి సుమ్మిది పిల్లనగ్రోవి గాదు
రాతనయ సుమ్ము చల్లముచ్చెత గాదు
తెలుపుమర్యాద గావునఁ దెలుపుచుంటి
మెలుఁగవాఁ? రుక్మిణీసతీహృదయలోల! ౬౨

వ. వేఱొక కీరవాణి లక్షణకు మెల్లన నిట్లనియె.

సీ. నూటికొక్కటికైన మాటకుత్తరము నీవలెఁగాని యూరకోవలదు సుమ్ము
కెమ్మోవియానసుంకించిన నొయ్యనీవలెఁగాని డాఁచుకోవలదు సుమ్ము
పుక్కిటవిడెమీయఁబోయిన నందుకోవలెఁగాని వెలిఁజేయవలదు సుమ్ము
కాఁగలించుకొనంగ గమకింప నెదురొత్తవలెఁగాని వెనుదీయవలదు సుమ్ము

తే.గీ. చిత్తమున కనుగుణముగఁ జెలఁగవలయుఁ
గాని యొక్కెడనైన నొక్కత్రుటికన్నఁ
బెనఁగులాడఁగవలదుసు మ్మనుఁగుకాఁ డ
నంగ దైవమ్మసుమ్ము సన్నత లతాంగి. ౬౩

తే.గీ. ఇటులఁ దగుభంగులన్నియు నెఱుఁగఁజేసి
"యాతఁడున్నాఁడు, నీవుంటి వతివమిన్న!"
యని పయికిఁజెప్పి యొక్కొకపని నెపమునఁ
జనిరి చెలికత్తెలందఱా స్థలమువిడిచి. ౬౪

శా. చేలంబెన్ జెరచేలువట్టె మెయి సోఁకించెణ్ మెయిణ్ గంధముణ్
గీలించెన్ గుచసీమ మంజులగతిన్ గేలంచె గండస్థలిణ్
లాలించెన్ దగఁగౌఁగిలించె మధురాలాపములన్ దేల్చెఁ గే
ళీలోలుండయి మించె శౌరి కడుబాళిన్ లక్షణాభామతోన్. ౬౫

మ. అకృతప్రీత్యయ మప్రియుక్తవచనం బప్రాప్తితాలింగనం
బకనద్బంధ మచుంబితాధర మసంప్రాప్తావకాశం బదృ
శ్యకటాక్షంబగు లక్షణానవరతం బానందముం గూర్చె శౌ
రికి, ముగ్ధారతసౌఖ్యసంపదలు వర్ణింపంగ రా వేరికిన్. ౬౬

*సీ. ఎందఱీడ్చిన సెజ్జయిల్లు చేరనిబోటి చేరి వాకిలి యోరఁజేయ నేర్చె
నెంతవేఁడిన మొగంబెత్త నేరనిచాన యెత్తి చిఱునగవు పల్లొత్త నేర్చె
నిందమంచును విడెమ్మీయ నేరనిలేమ యిచ్చి వాతెఱ యాననీయ నేర్చె
చెయివట్టిలాగిన సెజ్జయంటనిగోల యంటి తోఁ బన్నుంట యదియు నేర్చె

తే. గీ. ముట్టినంతన ప్రాన్పడు ముద్దరాలు
ప్రాన్పడక వీలొసఁగ నేర్చె రతికొకింత
యౌర! యేరీతిమాఱెఁ జేతోంతరంబు
నాతికన్నెరికమ్ము రెండవదినమున. ౬౭

తే. గీ. ఎఱిఁగియు నెఱుంగకుండెడి సురతసుఖము
నొసఁగియు నొసంగకుండెడి యోష్ఠరసము
పలికియును బలుకకయుండు పలుకు తళుకు
కన్నియలకూటముల నెన్నఁగాఁ దరంబె! ౬౮

క. ఈగతి నాగజగమనా
భోగమయుండగుచు మద్రిపురమునఁ గృష్ణుం
డాఁగె నొక కొంతకాలము
భోగం బెఱుఁగంగనీదు పురుషార్థమ్ముల్. ౬౯

తే. గీ. ముగ్ధయై కొంతకాలంబు మురువుసూపె
మధ్యయై కొంతకాలంబు మది గరంచె
ప్రౌఢయై కొంతకాలమ్ము ప్రమదమొసఁగె
లక్షణాచంద్రముఖి సరోజేక్షణునకు. ౭౦

ఉ. ఆ యదునందనుం డిటులు హాయిగ నాయలివేణిఁ గూడి ని
త్యాయితసౌఖ్యముల్ గొనెడి యాసమయమ్మున నైన రాధికా
తోయజనేత్ర యాదెగల తొల్లిఁటి ప్రేతలచెల్వు లెంచు; నే
చాయల నేరికి న్మఱవ శక్యమె, తొల్లిఁటినాఁటి కూటముల్; ౭౧

* ఈసీసము, మిత్రమగు, ఆదిపూడి ప్రభాకర కవిచే రచింపఁబడినది.

ఉ. శ్రీయవతారమై పొలుపుఁజెందెడి రుక్మిణియుండ సత్యభా
మాయతనేత్రి యుండఁ దగులాటపు నెచ్చెలు లుండ రాధికా
తోయజనేత్రి సంగతులఁ దోయజలోచనుఁ డెంచి మించి యో
హో! యనిసొక్కు; నొక్కయెడ నొక్కనిమేషము మాట్లు చిక్కఁడున్.

తే.గీ. ఇటుల జలజాక్షునకు "బొంది యిచటఁ, బ్రాణ
మచట" ననునట్టి సామెత యనువుపడఁగ
నంత నేతెంచెఁ బిగ శరదాగమంబు
కలితకాదంబినీకాంతినలిత మగుచు ౭౩

సీ. తెలుపెక్కె మేఘముల్ బలుపెక్కె ఋక్షముల్ తగ్గఁ జక్కఁదారావితానములపుఁ
బొలుపొందెఁ జంద్రుండు తెలివొందె దిక్కులు కాశసూనములు ప్రకాశమొందెఁ
బసమీఱెఁ బద్మముల్ పసఁదేఱె నీరముల్ మల్లియల్ గుబ్బించి విల్లివిరిసెఁ
జెలరేఁగె విహగముల్ తులఁదూఁగె సస్యముల్ గాలికిఁ బ్రాగ్దిశాగమన మెసఁగ

తే.గీ. నెండ మెండయ్యెఁ గొండలు పండువయ్యెఁ
జలి మొలకలెత్తెఁ దూఁబ్రపగ్గములు మొత్త
నేఱులు కృశించెఁ దిన్నియల్ తారసించె
సురతరుచి హెచ్చె దివికి భూసురత హెచ్చె. ౭౪

తే.గీ. అట్టి శరదాగమమ్మునం బంటికంత
కధిక మగుచు విరాళి రాధాంగనాశి
రోమణీచర్య లెంచి కూరములు పెంచి
కృష్ణు నుంకించి తాల్మి జంకించె బళిరె. ౭౫

ఉ. "ఎందఱునైనఁ జూచితి నిఁ కెంపఱునైననుఁ జూడ నుంటి నో
సుందరి! నీదుచందమును సొంపును నింపు వలంపు నింపు నే
మందు నవారవిందవదనా! పద నాయెడ నాటఁబోసె నె
మ్మందగు దాన నెంతకయినన్ బయినన్ దయ నంపె చూపునే. ౭౬

చ. మన గిలిగింతలున్ మనదు మర్మములున్ మన లాలుమాటలున్
మన పొలయల్కలున్ మన మనమ్ములనుండెడి వింతకోర్కెలున్
మనమన నర్మవాక్యములు మన్ననలున్ మరియాటలున్ మన
మ్మున నెపుడైనఁ గాని తలపోయుదువే? సరసీరుహాననా! ౭౭

ఉ. పద్దికమీఱ నాఁడు తగ నైఖరి గా మితభూషితాంగి వై
యద్దమరేయివేళ దళమైతగు వెన్నెలలోన నీవు నా
యొద్దకు వచ్చి కౌఁగిలిడి యొక్కటియే కద ముద్దువెట్టి, తా
ముద్దుబుణమ్ము దీర్చుటకు మూఁడుయుగమ్ములు పట్టు నెచ్చెలీ! ౭౮

సీ. అర్థక్షణం బేని యంతరాయము లేని పింపవింతల కౌఁగిలింతలార!
గుఱు తెఱుంగక పొంగు ప్రమకమ్మున పెనంగు హద్దుపద్దులులేని ముద్దులార!
తడఁబాటు పఱిడాసి యొడలు నీరుగఁజేసి పొగరుచూపెడి గుబ్బపోటులార!
లేనిలప్పులు చుట్టి పోనికూరిమిఁబట్టి తపతపఁ దగు చపేటమ్ములార!

తే. గీ. తియ్యఁదియ్యని కెమ్మోవి తేనెలార!
నిరుపమానపు దొంతర నిద్రలార!
తమి నెఱుంగని పురుషాయితమ్ములార!
రాధికా కృష్ణులను విడరాదు సుండు. ౭౯

తే. గీ. ఒడలెఱుంగని పేర్మిఁ బైఁబడెడి పడఁతి
పలుకుపలుకునకుం దేనెలొలుకు కలికి
గిల్లినను పాలుగాఱెడి పల్లవోష్ఠి
పొందు గలవాఁడె పో పుణ్యపురుషుఁ డిలను. ౮౦

ఉ. ముద్దుల చేష్టలన్ మఱచిపోతి; సుతారపుఁ బూరుషాయితం
బెద్దడియాయె; సోయగపుహేలల కేమి, జగమ్మునన్ మఱే
ముద్దియ కుండ కుండు; వలపున్ మొలపింపఁగఁజేయుశక్తి నీ
యొద్దన పుట్టె వేఱొక తలోదరి నీసరిఁజేయ నేర్తునే.

ఉ. నేరు పెఱుంగనట్టి నను నీవకదా! కడుఁ బెద్దఁజేసి యా
యా రతిరీతులందలి యొయారములన్ గడిదేర్చి యెంతయున్
బారగుఁజేసి యేలితివి పద్మదళాక్షిరో! నిన్నుఁ బాయఁగా
నేరుచు బల్ కృతఘ్నుఁడను నేరము లెన్నకు మిట్టి పాపయిన్. ౮౨

సీ. నాఁడు గా! నిరుపమానందంపు టందంపుఁ జందంపుఁ బొందికల్ పొందుపడుట
నాఁడు గా! మిగుల విన్నాణంపు నాణెంపు రాణంది రాణించు రస మెసఁగుట
నాఁడుఁ గా! యమునాకనత్తటీన్యత్తటాత్యుత్కటస్ఫుటకేళు లొటపుగనుట
నాఁడు గా! రుచిరబృందావనాసేవనాభావనాభావనాధాటి గనుట

తే. గీ. నాఁడుగా, ఘనవేణుగానముల సొగసు!
నాఁడుగా, క్రీడగావించు ప్రొద్దుతనము!
నాఁడుగా, వేఁడఁగా బాడి నను ఁనుపుట!
నాఁడు గల చిన్నె లన్నియు నేఁడు గలవె!" ౭౩

చ. అని పలుమారు నెమ్మనమునందుఁ దలంచున కాని లక్ష్మణా
వనజముఖీలలామ విడువం గమకింపఁగలేఁడు శౌరి, యే
మనఁదగుఁ? బల్వెలందులకు నాసలు చేసెడివారి చిత్తవ
ర్తన, తరణిద్వయార్పితపదద్వయిచందము గాక యుండునే. ౭౪

తే. గీ. ఇటులు మది రెండు దెఱఁగులై యేటుగట్టు
చుండినను లక్ష్మణ యెఱుంగకుండఁ గృష్ణుఁ
డనయమును వింతవింతలఁ దనుపుచుండె
నెంతప్రొద్దయుఁ గాకున్న నింద లేల! ౭౫

క. పయనంబని కృష్ణుం డ
మ్మెయి మామ కెఱుంగఁజేయ మెలతకు బనుపకు
దయ వెన్కఁదీయ నృపుఁ డెం
తయు నాలస్యంబు చేసె ధర్మమ కాదే! ౭౬

సీ. పోవచ్చునంచుఁ జెప్పుచుఁ గొన్నినాళ్లు తందరయేమటంచుఁ గొన్నాళ్లుజరిపి
శుభముహూర్తమ్ములఁ జూచుచుఁ గొన్నాళ్లనంతరంబనుచుఁ గొన్నాళ్లుజరిపి
నేఁడు గాదంచు మన్నించుచుఁ గొన్నాళ్లు నాఁడంచుఁజెప్పి కొన్నాళ్లుజరిపి
విందులపై మిషపెట్టుచుఁ గొన్నాళ్లు తెల్లవారనని కొన్నాళ్లుజరిపి ;

తే. గీ. పసపునకుఁ గుంకుమకుఁ గొంత పసతియొసఁగి
మంచి సుముహూర్తమున బహుమతులొసంగి
కూఁతు నత్తింటి కంపించెఁ గువలయేశుఁ;
డంపుదురె ? యంపు మన్నంత నత్తవారు. ౭౭

తే. గీ. సరసిజాక్షుఁడు లక్ష్మణాసహితుఁడగుచు
నరుగు నంతటఁ బురకాంత లతనిఁజూడ
నేగుదెంచి కనుంగొని రెలమి సప్త
భూమికోన్నతసౌధాగ్రములను నిలిచి. ౭౮

చ. "మదనునిఁ గన్నవాఁ డనెడిమాట నిజం" బనె నొక్కనాతి, "నా
రదనుతుఁడంట నిక్కమనరాదె" యటంచనె నొక్కలేమ, "వేల్
యదుకుల మింతపుణ్యదశ నందెఁగదా?" యనె నొక్కసాధ్వి, "యె
ట్లు దగిరి గొల్లలేమ లతిలోకుఁ డితం" డనె నొక్కచానయున్. ౫౯

శా. "గొల్లల్ గొల్లలటన్న గొల్లలటె యాగొల్లల్! తదీయాంగనల్
ఫుల్లాంభోరుహలోచనల్ మృదురదస్ఫూర్తుల్ కవత్కాంతివి
ద్యుల్లేఖల్ కరిరాజమందగతు లిందుభ్రాజదాస్యల్ సుతా
రల్లీలావతు లేల వేయుపలుకుల్ రంభోర్వశీమేనకల్. ౬౦

క. మనవీటన్ జల్లమ్మెడి
వనితలమా టట్లులుంచు వారసతులు నా
వనితల దాస్యమ్మునకై
నను జాల" రటంచు నొక్కనాతి వచించెన్. ౬౧

తే. గీ. ఇట్లు పరిపరివిధముల నెంచికొనుచుఁ
బురసతులు సూడ లక్షణాతరుణిఁ గూడి
ద్వారకకు నేగెఁ గృష్ణుఁ, డాతని యువతులు
తమ్ము వదలుటఁజేసి చిత్తములు గలఁగ. ౬౨

ఉ. ఎన్నఁడువచ్చుఁ గృష్ణుఁ, డిఁక నెన్నఁడు చూడఁగఁగల్గు, వేడ్కమై
నెన్నఁడు కౌఁగిలించుకొను, నెన్నఁడు ముద్దిడు, నెన్నఁడేలు, నిం
కెన్నఁడు తాపమాఱు, మన మెన్నఁడు తిన్నఁబడున్, మనోరథం
బెన్నఁడు తీరునంచు మది నెన్నఁగరాని వియోగవేదనన్. ౬౩

సీ. కృష్ణసంగతులు నీకించుకేని యెఱుంగరావుగా? యని సత్య రాధ నడిగె
జలజాక్షుఁడిప్పుడెచ్చటనుండెనో యెఱుంగఁబడెనె? నీ కని రాధ భద్ర నడిగె
మఱచెనో మనలనెల్లరఁ గృష్ణుఁడంచుఁ దాపముమీఱ నీలతో భద్ర పలికె
గర్గశృంగఖ్యాతి గనుపట్టె నని నీల పతి చందమెంచె జాంబవతితోడ

తే. గీ. రుక్మిణీదేవి కెఱుక యీరూఢివర్త
మాన మనుచు సుదంత జాంబవతి కనియె
నిటులు పలువిధములను వారెల్లఁ దల్ల
డించి పలవించసాగిరి మించుచేర్మి. ౬౪

ఉ. అందఱకన్న గాథ పడునార్తి వచింపఁ దరంబుగాదు కృ
ష్ణుం దలపోసి మండిపడు నోయగ మెంచి తలంకు నాలెకుఁ
గుందు "దయావిహీను నెటుకూడితి నే" నని మాటిమాటికిన్
నిందయొనర్చుఁ; గూర్మి పరనీరజనేత్రిల కెక్కుడౌఁగదా! ౯౫

చ. "రతియననెట్టిదో యెఱుఁగరాని తనున్ మదనాగమాంతపం
డితునిఁగఁ జేయు టెల్ల నొకనీరజనేత్రికు నొప్పఁజెప్ప నం
చతఁడు మదిం దలంచెనొ? దయాళునిఁగా నెదనమ్మితిన్ గృత
ఘ్నుత లెఱుఁగంగవచ్చునె? కనంబడు నంతటిదాఁక నేరికిన్. ౯౬

ఉ. కప్పుకొనంగ నాపయఁటఁగాని మఱొక్కటినొల్లఁ డెప్పరేఁ
జెప్పినమాట నాకెఱుఁగఁజేయక నిద్దురవోఁడొకప్పుడున్
గప్పురపీడె మొక్కఁడయి కైకొనఁడామురిపెమ్ము లన్నియున్
దప్పెనొ? యెల్లకాలమొక తాగ్రిటను బోదురె జారపూరుషుల్! ౯౭

ఉ. వల్లభు నొల్ల కన్యయమువారికి లోఁగక లోకు లాడు నా
యల్లరిమాట లోర్చుకొని యన్నిఁటికిం దెగ తెంపు చేసి యీ
కల్లరి సౌఖ్యమే సతముగాఁ దలపోసి పతిన్ వరించు నా
పాల్లకపాణికిన్ జెడుట యబ్రమె? పున్నెముఁ బూనిపొత్తునే. ౯౮

సీ. రాకాశరచ్చంద్రరాజమానానూనచంద్రికాఫలితనృత్యమ్ములాగ
వికసత్కుసుమగుచ్ఛవిహారమాణాలిగుంజన్మధువ్రతనికుంజమ్ములాగ
వివిధశృంగారభావితహంసతూలికాతల్పవత్కేళిసౌధమ్ములాగ
మలయమారుతపోతవలనానుకలనావితతయమునాసైకతమ్ములాగ

తే.గీ. మా వినోదంపుఁ జెయ్యులు మంతనములు
కష్టసుఖములు మీరెఱుంగనివికావు
మీరలైనను నాదుపేర్మినిగణించి
వెసకి వేవేగఁ గృష్ణు రప్పింప లేరె." ౯౯

క. అని పలువిధములఁ దలఁచుచు
వనజానన యుండె; నంత వనజాక్షుఁడు రా
ధ నెపుడు గనుఁగొందునొ యం
చును నచ్చెన్ దన్ను గొల్లసుదతులు చూడన్. ౧౦౦

చ. అదె! ప్రియుఁడేగుదెంచె; జలజాక్షుఁడువచ్చె; మనోహరుండు నా
కదె! కనుపట్టెనంచు వనజాననలందఱుఁ జెప్పికొంచు నీ
రదరుచిభాసురన్ హరిఁ గరమ్మనుజూచిరి వాచినట్లు, నె
మ్మదు లతివేలహర్షగరిమన్ భరమూని వశంబుతప్పఁగన్. ౧౦౧

ఉ. వచ్చినకృష్ణుఁజూచి వృషభమ్ములు నాలుగు గోపబాలురున్
హెచ్చినవేడ్క నూరికడకేగిరి ద్వారకయున్ బ్రమోదముల్
పిచ్చిలు నట్లుతోఁచె నిటు వేణువిశారదుఁ డేగుదెంచుచో
నిచ్చలు రాధపైఁ బరుగులెత్తఁగఁ దత్తర మావహింపఁగన్. ౧౦౨

చ. గడియకొ, లేక యొక్క యరగంటకొ కంటఁబడున్ బ్రియంబు చొ
ప్పడఁ దగఁ గౌఁగిలించుకొను బల్ వలపూరఁగ ముద్దుపెట్టు నె
క్కుడు తమకమ్మునన్ మరునికూటములన్ గరఁగించు నింకఁ దుం
గుడుకును మాను మయ్యదియ తొయ్యలి కేళిగృహంబు చిత్రమా. ౧౦౩

క. ఆరాధకేళిసదనము
తారసమగుకొలఁది నిట్లు దనుజహరునకున్
దూరంబగుఁ దత్తర, మది
ధారుణి ననుభూతమగు విధం బనరాదే. ౧౦౪

ఉ. ద్వారము చేరసంత దరిదాపున నారసి రాధికాసఖుల్
చేరుచు లోనికేగి « సఖి కృష్ణుఁడు వచ్చె » నటంచుఁ దెల్ప నం
భోరుహనేత్ర నమ్ర కటుఁబో గమకింపఁ దలంచునంతలో
సారసలోచనుండరిగె సారసగంధి గృహమ్ము చెంతకున్. ౧౦౫

ఉ. ఇంచుక గాంచి రాధ జలజేక్షణుఁ గంటి నటన్న మోపమో
వంచనచేయు నిచ్చయొ స్వభావమొ కృష్ణునిమీఁది కోపమో
యెంచఁగరాదుకాని చనియెన్ జవుజవ్వనఁ గేళికాగృహో
వంచితశయ్యకున్, వడిగఁ దామరసాక్షుఁడు వెంబడింపఁగన్. ౧౦౬

క. ఇటుచని యెఱుఁగనిగతి దు
ప్పటి ముసుఁగిడి శయ్యపైని బవళించిన న
క్కుటిలాలక విధమెఱిఁగిన
విటశేఖరుఁ డరిగె రాధ వెనువెంబడిగన్. ౧౦౭

చ. చనిదరిఁజేరి శౌరి పరిచర్యయొనర్చెనొ "తప్పుసైఁపుమీ"
యని బతిమాలసాగెనొ "దయన్ గనుమీ" యని లేనిదైన్యమున్
గనుపడఁజేసెనో, చరణకంజములంబడి మ్రొక్కెనో, వచిం
ప నలవికాదుగాని యలపద్మదళాక్షియుఁ బక్కున న్నగెన్. ౧౧౦

ఉ. వారివినోదముల్ మఱియు వారిపరస్పరనర్మవాక్యముల్
వారి విలాసపుంబనులు వారలచెయ్వులు వారికూర్మముల్
వారల ముచ్చటల్ మఱియు వారల తీరులు నిర్ణయింప నె
వ్వారికి శక్యమౌఁ? గవులు వర్ణనచేసెడిపాటి వారలే! ౧౧౧

సీ. లక్షణ నీరీతి లాలనచేయుదే? యన, మంచిదానవే! యనియె శౌరి
యాబోటిపై మనంబతికెనే? యీరీతి నన, లేదులేదులేదనియె శౌరి
ఆయింతి కీవింత లన్నియునేర్పితే? యన, వెఱ్ఱివాఁడనే? యనియె శౌరి
ఆనాతి కీప్రీతియమరెనే? నీమీఁద నన, నించుమించుగా ననియె శౌరి

తే. గీ. అలలన యెన్నఁడేని నన్నడిగెనే? య
టన్న, నెఱుఁగునో, యెఱుఁగదో యనియె శౌరి
చెప్పకుందువె? నాతోడఁ జెప్ప వనిన,
నబల! నీకలయిక సాక్షియనియె శౌరి. ౧౧౨

తే. గీ. ఇటులనే తక్కఁగల సతులెల్లఁ దన్నుఁ
గోపగింపఁగ నందఱకోపములను
రసమెసంగెడిగతి నివారణమొనర్చె
రసికజనశేఖరుం డన రాదె శౌరి! ౧౧౩

తే. గీ. అష్టభార్యల నేలుచు ననవరతము
గోపికలకోర్కె దీర్చుచుఁ గోరువారి
కిహపరమ్ముల నొసఁగుచు నెసకమెసఁగఁ
గృష్ణుఁడు చెలంగె వైభవజిష్ణుఁడగుచు. ౧౧౪

క. ఈలక్షణాపరిణయము
పోలంగా వ్రాసి చదువు పుణ్యాత్ములకున్
శ్రీలలనాథవుఁ డొసఁగుత
మేలగునాయువును సిరియు మేటియశమ్మున్. ౧౧౫

## ఆశ్వాసాంతపద్యములు.

క. ఆఘ్రాతానేకాగమ
వాఘ్రదినీస్నానపూతపండితసుకవి
వ్యాఘ్రపరిణుతకవీంద్రప్రస
మాఘ్రాపితకావ్యసార! యలఘువిచారా! ౧౧౩

శా. శ్రీసత్యాదృతశుద్ధచిత్త! పరనారీసోదరీభూత! దు
ష్ప్రాపాహంక్రియ! గోకిరెడ్డికులపారావారరాకాతమి
స్రాపాలా! దయమానదీర్ఘనయనప్రాబల్య! సత్యాదృతా
లాపశ్రీబల! తాటికొండపురపాలా! రామభూపాలకా! ౧౧౪

### మంగళమహాశ్రీవృత్తము.

శ్రీలలితమందిరవిశిష్టశుభజాలయుత సేవకజనోచితదయా! గ
ద్వాలనరపాలవరభావుక! కళాకలితభావుకగుణాకర! కృతీంద్రా!
తాళనగనామపురధన్యజనపాల! జనతావినుతశీల! నుతగోత్రా
పాల! శుభరామనరపాల! జయలోల! కవివారనుత మంగళమహాశ్రీ.

ఇది,

శ్రీకింకరేంద్ర ఘటాపంచానన విద్వత్కవి బాలకళానిధి బాలసరస్వతీ
శతావధాని తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబగు లక్షణా
పరిణయంబను మహాప్రబంధమ్మునందు
సర్వంబును తృతీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీకృష్ణార్పణమస్తు.

## శు ద్ధ ప త్రి క.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 16 | 18 | సరససిజ | సరసిజ |
| 17 | 24 | బంఖుర | బంధుర |
| 20 | 24 | డరుణుఁ | రరుణుఁ |
| 34 | 22 | వతంమా | వతంసమా |
| 35 | 20 | పించయము | పించియము |
| 39 | 16 | కెరలుచోటఁ | కెరలుచోట |
| 48 | 17 | నడుమునఁ | నడుమున |



శ్రీరస్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్రీనివాసవిలాసము

## ప్రథమాశ్వాసము




రమణీమణితోడ వి
హారార్థముగఁ గురుమతిమహాగిరి నిత్య
శ్రీరాజితుఁడగు హరి సీ
తారామనృపాలు నేలుత న్దయమీఱన్.

శా. శ్రీనారీమణికేల నొప్పెసఁగు రాజీవంపుమొగ్గం బర
ధ్యానప్రక్రియఁ దా గ్రహించి వశిసంధానంబు నూహింప స
ధ్యాన న్సిగ్గిలు నవ్వేలంది హృదయం బూహించి లో మెచ్చు ప
ద్మానాభుండు కృపాళుఁడై మనుచు సీతారామభూపాలునిన్. ౨

సీ. నిప్పచ్చరముఁ బాపు నేర్పుగల్గినచాన జగములన్నియుఁ బ్రోవఁజాలుజాణ
గారాపుఁబూవిల్తుఁ గని పెంచిన నెలంత కరివన్నెవాని చొక్కంపుఁగాంత
పూపచందురుతోడఁబుట్టిన వగలాఁడి పురుడు చెప్పఁగరాని పూవుఁబోఁడి
కడలిరారాజు ముక్కారఁపుముద్దుకుమార్త తమ్మిగద్దియ నొప్పునెమ్మెలాఁడి

తే. గీ. పలుకులవెలందియత్తయౌ పడఁతిమిన్న
సరసముక్కరవంశసంజాతసోమ
భూపపుత్త్రు సీతారామభూమిపాలు
నేలుచుఁ బరాక్రమలఁ గూడ నేలుఁగాక. ౩

మ. ఉరమందుంచు టదేమిలెక్క, మొగమం దుంచంగనుంకించు ట
బ్బురమా, యుంచు శరీరము న్సగము తాఁ బూఁబోఁడి కర్పించి త

త్పరుఁడై యొప్పెడు రాజశేఖరుఁడు సీతారామనామాంకభూ
వరునిం దుల్యసుఖోదయం బొసఁగి కాపాడం బ్రయత్నించుతన్. ౪

మ. పతి కైకొన్నభుజంగశేఖరు సంభావించి లోనెంచి బ
ల్కితవుం డీతఁ డటంచు భ్రాంతిపడి చెల్మి న్భర్తయర్ధాంగసం
స్థితిఁ జెన్నొందిన మంచుగొండయనుఁగుంజిన్నారి మేల్పట్టి సం
తత మైశ్వర్య మొసంగి ప్రోచు నల సీతారామభూపాలునిన్. ౫

మ. చెలులే దుర్మతు, లాపయిం జదువువాసిం బేర్చినం బట్టఁగాఁ
దలమే వారల, నంచు నెంచి తనవక్త్రంబందుఁ బూఁబోణికిన్
నిలయం బేర్పడఁజేసి తా జగముల న్నిర్మించునట్టైన న
త్తలునిం బాయనిధాత ప్రోచు నల సీతారామభూపాలునిన్. ౬

మ. రసికు ల్సత్కవు లట్టివారలపయిన్ రాణించుమనీ పేర్మి ఛాం
దసుఁడ న్నేనని మేలమాడు తనభర్తన్ లేఁత నవ్వొప్ప 'ఛాం
దసులే వారలు మీరలే రసికు లాంతర్యమ్మునం జూడుఁ' డం
చు సమాధానముఁ జెప్పు వాణి తగ మన్చు న్సోమభూపాత్మజున్. ౭

తే. గీ. పార్వతీపరమేశ్వరభాగ్యరాశి
కవులపాలిటి రెండవ కల్పనగము
గజవదనుఁ డంతరాయముల్ గసిమసంగి
కృతికృతిపతులను శుభానుగతులఁ జేయు. ౮

తే. గీ. అన్నవస్త్రమ్ము లొసఁగి విద్యలను శిష్యు
లకు ననుదినంబుఁ జెప్పు విలక్షణప్ర
భావు భావుకభావు మాపాలిదేవు
బ్రహ్మగురుపర్యుఁ గొల్తు మహారభక్తి. ౯

తే. గీ. కాళిదాసాదిసంస్కృతకవుల కెరఁగి
నన్నయాద్యాంధ్రకవులకు నతులొనర్చి
కుకవులగువారలకు శతగుణముగాఁగ
మ్రొక్కుకొందుము మాకృతి ముట్టకుఁడని. ౧౦

ఉ. కొండల నోరఁజేసికొని కొంతవడిం బఱతెంచి యంత ను
ద్దండత దారికడ్డమయి తాఁకి హళాహళిసేయు కొండలం

బిండిగఁజేసి శైలు కడువేగమునం జనుదెంచునట్లు భూ
మండలి మాకవిత్వమును మంకుఘటమ్ములఁ జెండి మీఱుతన్. ౧౧

వ. అని శిష్టాచారక్రమమ్మున నిష్టదేవతావందనాదికం బాచరించి. ౧౨

మ. కవులం బండితులన్ విశేషముగ సత్కారమ్ములంజేయ భో
జవిభుంబోలిన రాజొకండెయిన నీ సామాన్యకాలమ్మునం
దవనిం గల్గునొ లేదొ చూతమని యాయాదేశముల్ చూడ నే
గి విలోకించుచునుండఁ బశ్చిమదెశం గృష్ణాసమీపమ్మునన్. ౧౩

సీ. దట్టమ్ములైయొప్పు దర్భాసనమ్ములు భుజశిరమ్ముల వింత పొలుపుదెలుప
ఉదయించుచున్న సూర్యునిబోలు రాగిరేకులు చేతులకు శోభలొసంగఁ
బాలనిగ్గుల నేలఁజాలుడాల్గలమేల్విభూతిరేఖలు మొగమ్మున నెసంగ
గన్నేరుపూవన్నె కల్గిన కట్టుదోవతుల నిర్యాజపింపద నటింప

తే. గీ. 'నాత్మకూరున్నృపాలుని యంతదాత
నహి నహి' యటంచు నుతుల నొనర్చుకొంచు
నాత్మకూరుపురమ్మున కరుగు విప్ర
జనులఁ గని యడుగఁగ నిట్టులనిరి వారు. ౧౪

ఉ. దాత మహానుభావుఁడు బుధప్రతతింగరగించువాఁడు ని
ర్ణేత సమస్తవిద్యలకు నేర్పరి శ్రీకరుఁ డాత్మకూరువి
ఖ్యాతపురాధినేత సుగుణాఢ్యుఁడు భోజునివంటివాఁ డతం
డాతనిఁబోలు భూపతుల నారయ మొక్కఁడునైన భూస్థలిన్. ౧౫

క. అన్నరపాలుఁడు విద్యల నన్నింటిఁబరీక్షచేసి యను ఫాల్గునమున్
మన్నించి యెల్లరకును మహోన్నతి సన్మానమ్ము లొసఁగుచునుండున్ ౧౬

క. అందులకై చనెదము మేమిందఱ మని పలికి వారలేగుటయును మే
ముం దగుగతి వారలవెనుకం దప్పరసరముఁ జేరి కడుముద మెసఁగన్. ౧౭

క. లక్ష్మీనివాసమందిరు లక్ష్మీనాథచరణయుగళలలచ్చిత్తున్
లక్ష్మీసదృశశ్రీమ ల్లక్ష్మీతనయున్ స్వరూపలక్ష్మీతనయున్. ౧౮

శా. ధర్మాధర్మవిచక్షణక్షణకృతిన్ దాక్షిణ్యాగణ్యాకృతిన్
గుర్వత్యద్రిపతిప్రసేవనకృతిం గూలంకపాలంకృతిన్

దుర్మత్యద్రివిదారణామరపతిన్ దోస్స్తంభకుంభస్థలిన్
శర్మాధాయిమహాకవీంద్రవినుతిన్ సాక్షాత్కృతశ్రీపతిన్. ౧౯

క. కృష్ణాగోదాంతర్వర్ధిష్ణుమహీవలయనిలయు రిపుజనవిలయున్
నైష్ఠపదసేవారోచిష్ణుమతిన్ సోమభూపచిరసుకృతతతిన్. ౨౦

క. శ్రీపాకనాటిసత్కులదీపకు నైజాముభూమ్యధీశ్వరనిత్య
ప్రాపకుఁ దోషితసకలవనీపకు సంతాడితావనీపకనికరున్. ౨౧

క. మక్కగకులదీపకు హిమరుక్కలశాంభోధిసితసరోజశరద్వా
ర్మక్కులపటీరహీరన్యక్కారియశస్సనాథు నానరనాథున్. ౨౨

మ. కరుణాసాగరుఁ గుర్మతీశ్వరలలత్కారుణ్యసంప్రాప్తను
స్థిరరాజ్యాతిశయున్ బ్రమోదలహరీదేదీప్యమానాశయున్
హరనీహారశరాధరామరనరాహారోపమోద్యద్యశున్
దరుణీమన్మథు సోమభూపసుతు సీతారామభూపాలకున్. ౨౩

క. కాంచిన నానరపాలుఁ డుదంచద్గౌరవముమీఱఁ దనయాస్థాన
ప్రాంచద్విద్వాంసులలో నెంచి మముం గారవించి యింపెసలారన్. ౨౪

క. మేమొనరించిన గ్రంథము లామూలాగ్రముగ వినుచు నానందరస
వ్యామోహితుఁడై నిత్యశ్రీమీఱఁగఁ గాల మొక్కరీతిఁ గడపుచున్. ౨౫

మ. ఒకనాఁ డంకమునన్ గుమారుఁడును బంధూద్యోగివిద్వత్కవి
ప్రకరంబుల్ దగుచోటులం దగ సుధర్మామధ్యమందున్ జయం
తకుమారుం దొడఁదాల్చి యొప్పు దివిషన్నాథుండునా సంతతా
ధికబాహాసిసభాంతరాళవిలసత్సింహాసనాసీనుఁడై. ౨౬

వ. వెండియు నఖండపాండితీమండనుండగు శ్రీనివాసాచార్యుండును సురపురమహారాజప్రదత్తకవిసార్వభౌమబిరుదవిఖ్యాతుండగు వేంకటకవియును సకలశాస్త్రవిశారదులును దత్తద్దేశాగతులునునగు తక్కువిద్వజ్జనంబులును వైద్యవిద్యాపరధన్వంతరియగు ధన్వంతరిరామాచార్యుండును సంగీతసముద్రుండగు రాఘవాచార్యుండును సుగుణసింధువులగు రాజబంధువులును దుర్మంత్రవిచ్ఛేదకుండును సన్మంత్రోపదేశకుండును సకలకార్యఘటనా ప్రవీణుండును శాంత్యాదిసుగుణభూషితుండును సుకవిజనవిధేయుండును సచివపుంగవుండునునగు బంకటసింగుహాజారును సకలరాజకార్యనిర్వాహకులును సతతానువర్తులును విమలకీర్తులును రాజా

నుగ్రహపాత్రులును నగు పెదరాయన చినరాయనప్రభృతులును దక్షిణయుద్యోగి జనంబులును బలసి కొలువ డెందంబున నమందానందంబు నిండార నిండుపేరోల గంబుండి. ౨౭

మ. మను శ్రీమన్నర దేవతామహిమసంప్రాప్తాశుధారాకవి
త్వమహత్త్వప్రథితప్రబంధరచనాపారీణుల న్బండితో
త్తమసంభావ్యశతావధానుల సమస్తప్రక్రియాప్రౌఢిదు
ర్గముల న్శ్రీపతి వేంకటేశ్వరులఁ జక్కం జూచి పల్కెం గృపన్.

సీ. ఒనరించినారు సర్వోత్కృష్టఫణితిఁ గాళీసహస్రంబు నైలింపభాష
నిర్మించినారు బల్ నియమంబుతో ధాతురత్నాకరంబు గీర్వాణభాష
రచియించినారు సరసమైయెసఁగ శ్రవణానంద మనుకావ్య మాంధ్రభాష
విరచించినారు దేవీభాగవతమును దిక్కన్నశైలిగాఁ దెల్గుభాష

తే. గీ. నింకఁ దక్షిణగ్రంథమ్ము లెన్న నేల
యుభయభాషలయందు నోహో యటంచుఁ
జేరుఁగొన్నారు మీపాటి వారలెవరు
సరసతిరుపతివేంకటేశకవులార. ౨౮

సీ. బుక్కపట్టణవంశ్యబుచ్చయాచార్యతనూభవుం డురుకలావైభవుండు
నాంధ్రాదికవనమ్ములందు నేర్పుగలాఁడు సకలవిద్వజ్జనసమ్మతుండు
శైశవమ్మున నె విశ్వమ్ము మెచ్చఁగ నాల్గుతంత్రము ల్నేర్చిన ధన్యతముఁడు
బాలసరస్వతీభావమ్ము మైసూరుపురిని గైకొన్న బంధురయశుండు

తే.గీ. నస్మదాస్థానవిద్వాంసుఁడైన శ్రీని
వాసపండితుఁడన జగద్వర్ణనీయుఁ
డాయనయు మీకవిత్వమ్ము నాదరించు
నహహ మీచేతఁ గృతిని నే మందవలదె. ౩౦

తే.గీ. దేవతలు మెచ్చురీతి యుధిష్ఠిరాశ్వ
మేధచంపువుఁ జెప్పినమేటి వెంక
టాధ్వరికవిసార్వభౌముఁ డాహా యటంచు
మెచ్చె సురపురరాట్కవి మీకవితకు. ౩౧

తే.గీ. శ్రీకరుండగు నరసదీక్షితుని సుతుఁడు
సుకవియగు పాపశాస్త్రికి సోదరుండు

నస్మదాస్థానమందు ధర్మాధికారి
భారయుత మీరనినఁ గడుగౌరవంబు. ౩౨

మ. స్మయదూరుల్ బలరామకృష్ణనిభు లస్మన్ముఖ్యబంధుల్ ప్రశ
స్తయశుల్ యోగ్యులు రామిరెడ్డియును గృష్ణారెడ్డియున్ మీకవి
త్వయథార్థస్థితి నెంచి మీవలన సద్గ్రంథంబు నొక్కండు మా
కయి చేయింపఁగ నూహఁజేసి రిది మీ రంగీకరింపందగున్.

సీ. భోజుండు తానెంత పుణ్యమ్ముచేసెనో కాళిదాసకవిత్వగరిమ మెఱయ
విక్రమార్కుం డెంత పెట్టిపుట్టెనో యట్టి భట్టికవిత్వసంపదలఁ గాంచ
రాజనరేంద్రుఁ డే పూజజేసెనో నన్నయకవీంద్రునికవిత్వ మందుకొనఁగ
కృష్ణరాయం డెంత కృతకృత్యుఁడో పెద్దనాదులకవనమ్ములందు మెఱయ

తే. గీ. ఆంధ్రమునఁగాని గీర్వాణమందుఁ గాని
కవితఁజెప్పెడి వారలే కఱవు, రసిక
విత్వవిదుఁడన్న నెవ్వఁడో చేయికొకఁడు
కాని కలఁ డట్టివాఁ డొక్క కవివరుండు. ౩౩

సీ. ఎవ్వాని వాగ్ధాటి యెంత చూచిన మేటి పాటవంబున శైలుబండిపోటి
యెవ్వానిపదలీల యెంతచూచినఁ జాల మేలనందగినముత్యాలసూల
యెవ్వానిబల్ యుక్తి యెంతచూచిన రక్తినొప్పారు భాష్యకృద్యుక్తిశక్తి
యెవ్వాని సాహితి యెంతచూచిన మితిగనక చెన్నారు పాల్కుడలికిఁ బ్రతి

తే. గీ. యతఁడు నవదుర్గవంశామృతాంబురాశి
చంద్రుఁ డురుకీర్తిసాంద్రుఁ డతంద్రకవిమృ
గేంద్రుఁ డతిభక్తిపరిచితోపేంద్రుఁ డలరు
కృష్ణకవిసార్వభౌముఁ డుత్కృష్టతముఁడు. ౩౪

ఉ. భావిపురాతనాద్యతనపండితమండలులందుఁ జూడ మా
చేవయు నాచమత్కృతివిశేషము నాకవితానుభావ మా
భావవిభూతి యాసుగుణపద్ధతి యాఋజుశైలి యామహా
కోవిదరీతి యారసము కోటుల లక్షల నర్బుదమ్ములన్. ౩౫

తే. గీ. ఆ సుకవి యాశుకవితామహత్త్వ మొప్ప
కూరుఁ గులదైవతంబయి మమ్ము మన్న

శ్రీనివాసువిలాసమ్ముఁ జెప్పె మున్ను
రసికు లౌననురీతి గీర్వాణభాష. ౩౭

తే. గీ. సంస్కృతంబనఁ బండితసాధ్య మగుట
నెల్లరకుఁ దేటతెల్లమై యింపునింప
దాంధ్రమో దేశభాషయై యలరుకతనఁ
బండితాపండితులకు సంభావ్యమగును. ౩౮

క. దానిఁ దెలిగించి మాకు ననూనానందం బొనర్ప నుంకింపుఁడు మా
యానందమె మీకును బరమానంద మొసంగఁజాలు నఖిలవిధములన్. ౩౯

తే. గీ. తనకు నాల్గునిఘంటుపదములు వచ్చు
ననుచుఁ బదిమందికిని దెలియంగ మాఱు
మూలపదములు గుప్పిన ముచ్చటగునె
ప్రతిపదమ్మున రస ముట్టిపడినఁ గాక. ౪౦

క. వడియును బ్రాసమ్మును బడబడమను శబ్దములుదక్కఁ బరికించిన నొ
క్కెడనైన రసము గురియదు పొడిపొడికృతులందు శబ్దపుంజము లగుటన్.

క. శ్రవణానంద మొనర్చినకవులు తమరు తమరు రసముగాఁ గవనముఁ జె
ప్పవలయునని బోధించుట భువి వెన్నెల చల్లఁజేయు పోలికగాదే. ౪౨

ఉ. ఈకృతి యొందఁబో కవుల కిచ్చితిమింతకుఁ బూర్వమెవ్వరున్
జేకొని మీవలెన్ దెనుఁగుఁ జేసెదమంచు వచింపరైరి మీ
చాకచకిన్ గ్రహించితి నసాధ్యముగా దిది మీకు గ్రంథమున్
గైకొనుఁ డంచు సంస్కృతపు గ్రంథము చేతి కొసంగె నంతటన్. ౪౩

వ. సకర్పూరతాంబూలబహుమానపూర్వకంబుగా గ్రహించి దీనిం దెనిఁగింప నారంభించితిమి. ౪౪

మ. తెనిఁగింపందగినట్టి వెవ్వియనః నెంతేనర్థభూయిష్ఠతన్
గని యొప్పారు పురాణముల్ మఱియుఁ దత్కల్పమ్ములై యొప్పు చ
క్కనికావ్యమ్ములు నాటకమ్ములును వీకన్ శబ్దముల్ గుప్పి కూ
ర్చిన కబ్బం బది తెల్గుసేయఁదర మేని చేయన్ రసంబొప్పునే? ౪౫

ఉ. అందుఁ బురాణముల్ మిగుల నందములై పొలుపొందుఁ గావ్యమా
చందముగా మనమ్మునకు సంతసమీయదు నాటకమ్ములన్

విందులు గావు తెల్గునఁ గవిప్రవరుల్ ప్రసంగించుపట్లు; నే
యందము దేనియం బొదవు నయ్యది దానన యుంచుటొప్పగున్. ౪౬

ఉ. కావ్యము గాని నాటకము గాని మఱొక్కటి గాని తెల్గునన్
శ్రావ్యము గా నెసంగదు, పురాణము తెల్గొనరించినన్ గడున్
శ్రావ్యత గాంచి యొప్పెసఁగి సంస్కృతమున్ గని గేలిసేయు; నీ
కావ్యము శబ్దముఖ్య మటుగాన తెనుంగొనరింపశక్యమే. ౪౭

ఉ. ఈకవి గొప్పవాఁడనుట యెల్లరకున్ విశదంబ కాని శ
బ్దాకలనమ్మునం దితని కాదర మెక్కుడు, శబ్దకీతులం
గైగొనువారికబ్బములఁ గన్పడు వ్యర్థములైన శబ్దముల్
చేకొని తెల్గుసేయ నవి చెప్పినయట్లు వినంగ నేర్చునే. ౪౮

చ. పదములు కొంచె మర్థ మతిపారముగాఁ గనుపట్టు కావ్యముల్
మొదలను గాళిదాసకవిముఖ్యులొనర్చిరి తెల్గొనర్పనె
మ్మది కవి సమ్మదంబిడు శ్రమమ్మునఁ గొందఱు శబ్దసంగతుల్
గదియరచించి రయ్యవి తెగం దెనిఁగింప రసం బెసంగునే. ౪౯

ఉ. కేవలశబ్దముల్ దగ లగించి బిగించిన యట్టి సంస్కృతం
బేవగ విప్పి చెప్పనగు? నేమన గుడ్డలు రైకలోపలం
ద్రోవిడినట్టి శుష్కకుచ పొంకము బైటకుఁ బెట్టినన్ రసం
బావహిలంగ నేర్చునె? మహాకవులార, యనుగ్రహింపుఁడీ! ౫౦

మ. జతుకాష్ఠక్రియనొప్పు సంస్కృతపు శ్లేషల్ దెల్గుగాఁ జేయ మా
మతికిన్ శక్యమటంచుఁ దోఁచ; దిఁకమాటట్టులుండంగ ను
న్నతులై పేరునుగొన్నయట్టి యలశ్రీనాథాదు లిప్పట్టునన్
నతులర్పించిరి నిక్కమియ్యది ప్రమాణంబుల్ తదుద్గ్రంథముల్. ౫౧

ఉ. ఒక్కెడఁ జక్కనౌ పదము నొక్కటిఁ జేర్చిన ముచ్చటౌ మఱిం
కొక్కెడ నున్న దున్నయటు లుంచి రచించిన ముచ్చటౌ మఱిం
కొక్కెడ నున్న దాన సగ ముంచిన మేలగుఁ దెల్గుసేయుచో
మక్కికి మక్కి యన్నటుల మార్చిన కావ్యము శ్రావ్య మెట్లగున్. ౫౨

ఉ. ఒక్కయెడ న్సమానముగ నొక్కొకచోట విశేషరీతిగా
నొక్కెడఁ దగ్గుగా మఱియు నొక్కెడ వేఱొకరీతి దోఁపఁగాఁ

జక్కఁగఁజేసి తెల్లకవిసత్తము లాంధ్రముఁ జేయునప్పు డా
ఫక్కియె మేముఁ బట్టినది పండితులార ! పెనంగఁ బోకుఁడీ. ౫౩

చ. తెనుఁగునఁ గొన్ని సంగతులు తియ్యనవై యలరారు, సంస్కృతం
బున మఱికొన్ని సంగతులు ముద్దులు మూటలుగట్టఁజాలు, నిం
దును మఱియందును న్సొబగుతోఁ దులదూఁగును గొన్ని సంగతుల్
పనిగొని చెప్పనేల యిది పండితవేద్యము కాక యుండునే. ౫౪

చ. ఇదివఱ కప్రయత్నముగ నే మొనరించిన గ్రంథముల్ రసా
స్పదము లటంచుఁ బండితులు పల్కుదు రట్లనె మాకుఁ దోఁచు ని
య్యది యధికప్రయత్నబల మందినదయ్యును దీనికిన్ రసా
భ్యుదయముకల్గునో కలుగదో యని డెందము తందరించెడున్. ౫౫

చ. సరసముగా నెసంగినను సమ్మతమే, యటులుండకున్న నీ
యరసత సంస్కృతంపుఁగవియం దిడఁబోకుఁడు, దాని దెచ్చి మా
శిరమునఁ బెట్టుఁ; డియ్యది రచించును సంస్కృతమందుఁ, దెల్గునం
దరయఁగ నీరసంబగుట కాతఁడు బాధ్యతగాంచ నేర్చునే. ౫౬

క. అల్లితిమి తోఁచుగతిఁ గవితల్లజు లొనరించు గ్రంథతతి కిది సమమా?
'ఢిల్లికిఢిల్లే, పల్లికి పల్లే' యని చెప్పనట్టి పలుకులు వినరే. ౫౭

ఉ. నేరిచినట్లొనర్చితిమి నేరనిదిప్పుడు నేర్తుమే? మఱె
వ్వారలుగాని దీని రసవంతముగాఁ దెనిఁగించిరేని య
వ్వారికి మే మొనర్చెదము వందనము ల్పదివేలు, దీనిలో
నారసి దిద్దువారలకు నట్లనె మే మొనరింతు మంజలుల్. ౫౮

వ. అని పరోపకారాసక్తులును యథార్థబుద్ధులును నిర్మత్సరులునగు పెద్దలం దద్దయుం
గొనియాడి కృతిపతి వంశావతారం బభివర్ణించెదము. ౫౯

## వంశవర్ణనము

సీ. కలుములీనెడు పాలకడలి రాకూతురు నునుఁదొడఁ దాల్చు రతనపుఁదొడవు
పాతకమ్ములు పంచబంగాళముగఁజేయునట్టి గంగాదేవి పుట్టినిల్లు
స్వారాజునకుఁ ద్రిలోకీరాజ్యభారమ్ము పట్టమ్ముగట్టిన పట్టుఁగొమ్మ
ప్రాఁబల్కుకల్కి గారాపుచెయ్యులకు నిదానమైయొప్పు నుద్యానవనము

తే. గీ. సేవ్యమై యొప్పు నలగయాక్షేత్రమను కో
లంకునం దింపుమీఱు మేల్పంకజంబు
బ్రహ్మరుద్రాది దేవతాప్రభుశిరముల
వెలయు మవ్వంపుమకుటంబు విష్ణుపదము. ౬౦

తే. గీ. దాన నాలవజాతి యుద్భవమునందె,
దానిలోన ననేక భేదములు గలవు,
అందు శ్రేష్ఠులు సచ్ఛూద్రు లందులోన
మేటియని చెప్పఁదగుఁ బాకనాటికులము. ౬౧

సీ. సమదశత్రునృపాలసంఘమ్ము కొనగోట మీటనేర్తురు పాకనాటివారు
తుదకు సింగమునైన నెదిరించి బల్లెమ్ము నాటనేర్తురు పాకనాటివారు
హరికైన వెరఁగంది శరణుఁజొచ్చినవారి మాటనేర్తురు పాకనాటివారు
తురగవిద్యాధురంధరతఁ గోటలనైన దాఁటనేర్తురు పాకనాటివారు

తే. గీ. ధాటిఁజెన్నారుదురు పాకనాటివారు
మేటిసిరిమించుదురు పాకనాటివారు
సాటికే కొప్పుదురు పాకనాటివారు
ఏటి కెదురీఁదుదురు పాకనాటివారు. ౬౨

తే. గీ. మేటియగునట్టి యాపాకనాటికులము
నందు ముక్కారకులము పెంపొందుచుండు
సొగసుగల నగలం దెల్ల మిగుల వన్నె
గలిగి యింపెసలారు ముక్కరయుఁబోలె. ౬౩

క. ఖరకరకులమును హిమశీకరకరకులమును బ్రతాపఘనవిమలయశో
గరిమ న్నిరసించుచు ముక్కారకుల మెక్కుడగువృద్ధిగలిగి యెసంగెన్. ౬౪

సీ. బుద్ధిగరిమ మహోవృద్ధిగరిమను వాక్పతితోడ దీటు ముక్కారకులంబు
కీర్తిచేఁ దేజఃప్రపూర్తిచేఁ బుష్పవద్గరిమనొప్పెసఁగు ముక్కారకులంబు
ధైర్యమ్ముచేత నౌదార్యమ్ముచే సురాగము మేరమీఱు ముక్కారకులంబు
భూతిచే నాకృతిస్ఫీతిచే నసమాంబకఖ్యాతి నెసఁగు ముక్కారకులంబు

తే. గీ. అట్టి ముక్కారకులమునం దనఘు లతుల
మతులు రాజన్యకోటీరమాన్యులును మ

హోత్రులును నైన వారలే యవతరింతు
రఁట, తదన్యులు జనియింపరఁట యదేమొ ! ౬౫

తే. గీ. దోసతోఁటయుఁబోలె నెంతో విశేష
వృద్ధిగరిమ నెసంగి ప్రసిద్ధికెక్కు
నక్కులక్రమమందుఁ దా నవతరించె
శ్రీయుతుఁడు తిమ్మరెడ్డిదేశాయి విభుఁడు. ౬౬

మ. మహిమన్ శ్రీశుఁడు, దానమందు శిబి, ధర్మంబందు ధర్ముండు, దు
స్సహతన్ సూర్యుఁడు, సూనృతంబున హరిశ్చంద్రుండు, శేషాహి దు
ర్వహభూభారవహనమ్మునందు, హరి సంపత్తిం దులం దూఁచ ని
మ్మహినాథుల్ గిహినాథుఁ వ్సరియె తిమ్మారెడ్డిదేశాయికిన్. ౬౭

తే. గీ. దిక్కులయశమ్ము చేఁ గడుఁ బిక్కటిల్లి
చక్కఁదనమున మిగులఁ బ్రశస్తి కెక్కి
చొక్కపుసతీత్వమునఁ దా నిక్కయగుచు
నాతనికి భార్యయైన సోమక్క దనరు. ౬౮

క. సోముని యక్కయొ వాణియొ హైమవతియొ రతియొనా మహైశ్వర్యకలా
భూమాకృతుల నెసంగెడి సోమక్కను సాటివచ్చు సుదతులు గలరే! ౬౯

సీ. అప్పులలో మున్గునట్టి గృహమ్ములో వసియించు పంకజావాసయొకతె
గర్భదారిద్ర్యమ్ము గలవారి యిండ్లలోపల నెప్పుడును నొప్పు వాణియొకతె
కొండగుహల భర్తఁగూడి యెల్లప్పుడు కాఁపురం బొనరించు గౌరియొకతె
విటవిటీజనులతో నటియించు పతిఁగూడి సేవచేసెడి రతీదేవియొకతె

తే. గీ నలువురనుగూడి తమకు ననారతంబు
గలుగు నీదోషములు దీర్పఁగాఁదలంచి
సకలసౌభాగ్యసంపద్విశాలయగుచు
వెలయు సోమక్కగా సంభవింపఁబోలు. ౭౦

తే. గీ. ఆతఁ డీతరుణీమణియందుఁ గాంచె
శ్రీయుతుని సోమనాద్రిదేశాయివిభుని
నాతనిచరిత్ర మతిచిత్ర మతిపవిత్ర
మయి జగమ్మున మిగులఁ బ్రఖ్యాతికెక్కె. ౭౧

సీ. తాటియాకులయిండ్లఁ దవిలియుండెడి కవిప్రతతి కెల్లను సౌధవితతులచ్చె
రాగిజారీల కార్యముదీర్చు సోమయాజులకెల్ల బంగారు కలశాలిచ్చెఁ
గాశ్మీరకంబళాల్ గప్పుకొనెడి బుధేశులకెల్ల వన్నెసేల్ జోడులిచ్చె
నీర్కావిదోవతుల్ నియతిఁ గట్టెడి వైదికులకెల్ల మేల్జరీ వలువలిచ్చె

తే.గీ. మానమర్యాదలకుఁ బడి మ్రగ్గు రాజ
బంధువులకెల్ల నిరపాయబహుళసుఖద
సంపదల నీను మేల్ ముఖాసాలు గలిగె
నతఁడు సామాన్యుఁడే సోమనాద్రివిభుఁడు ! ౨౨

క. ఆసోమనాద్రివిభునికిఁ దా సతియై సకలధర్మతత్పరమతియై
భూసురపూజారతియై శ్రీసతియన డీకమాంబ చెలువువహించెన్. ౨౩

చ. పతి కెదురాడ్మికుంపటిగఁ జాల్పడకుండని లక్ష్మి, పల్వురన్
బతులుగఁగోరనట్టి యలపాండవభామిని, చుక్కయై నిశిన్
గుతుకమునన్ బయల్పడుటకుం గమకింపని యయ్యరుంధతీ
సతి యన డీకమాంబ కిఁక సాటియు గీటియుఁ జెప్ప నేటికిన్. ౨౪

చ. ప్రియము నయమ్ము, నొప్పఁ బెదవేంకటరెడ్డియుఁ జిన్న వేంకటా
హ్వయుఁడును వీరికిన్ దనయులై జనియించిరి, వీర లాజిదు
ర్జయులు పరోపకారులు విశాలయశుల్ నయకోవిదుల్ మహో
దయులు దయాస్వభావు లతిధర్మపరుల్ శరణాగతావనుల్. ౨౫

ఉ. తమ్ముఁడు యౌవరాజ్యమును దాల్చి సమస్తవిధమ్ముల న్సహా
యమ్మొనరింప ధర్మపరుఁడై పెదవేంకటరెడ్డి శత్రునా
శమ్ముగ లోకమెల్లను వశమ్ముగఁ బండితకోటికెల్ల స్వా
స్థ్యమ్ముగ నెల్లవారికి సుఖమ్ముగ రాజ్యము నేలె నిమ్ముగన్. ౨౬

ఉ. తమ్ముఁడఁటంచు నీతనినిఁ దక్క మఱొక్కనిఁ జెప్పరాదు పొం
కమ్ముగ నన్నగారిని సుఖమ్ముగనుండఁగఁజేసి శత్రులం
జిమ్మి తదీయరాజ్యములఁ జేకొని యన్నకు నొప్పఁజెప్పు నిం
కిమ్మహి నిట్టివాఁడు గలఁడే ! భళి ! యొక్క కిరీటిదక్కనన్. ౨౭

మ. దయయున్ సత్యము శౌచముం గలిగి విద్యావంతుఁడై సంతతో
దయుఁడై కేవలభక్తియుక్తహృదయుండై యొప్పు నా డీకమా

ప్రియపుత్రుండగు పెద్దవేంకటధరిత్రీభర్త సద్వర్తనా
దియుతన్ వేంకటలక్ష్మమాంబను సుబుద్ధిం బెండ్లియాడెం దగన్. ౭౮

సీ. హరుని యర్ధాంగమై మురువుమీఱ నెసంగు నన్నపూర్ణాదేవి ననుకరించి
హరి కురోభూషణంబై యింపుమీఱు సాక్షాన్మహాలక్ష్మితో సవతుగాంచి
బ్రహ్మదేవుని ధర్మపత్నియై చెలువారు వాణీమహాదేవి వాసిగాంచి
దేవేంద్రునికిఁ గూర్చు దేవేరియై పేర్మి గాంచు శచీదేవి గరిమగాంచి

తే. గీ. భర్త కనుకూలవర్తనఁ బరిఢవిల్లి
సతులలోపల విఖ్యాతి సంతరించి
మిగులసౌభాగ్యగరిమచే నెగడెఁ దగ ల
లద్గుణకదంబ వెంకట లక్ష్మమాంబ ౭౯

తే. గీ. వీరలకు నాత్మజాతుఁడై వీరవరుల
లోనఁ గడునగ్రగణ్యుఁడై లోక మెన్న
ప్రబలవిఖ్యాతి నలరారి బాలకృష్ణ
రెడ్డిదేశాయి మిగుల సుకీర్తి వహించె. ౮౦

సీ. తన నిర్మలయశోమృతప్రవాహమునకుఁ గలశాబ్ధి యొక చిన్న కలశి గాఁగఁ
దనదు పూర్ణవదాన్యతానల్పకల్పగుచ్ఛమున కర్థులు తేఁటిగములు గాఁగఁ
దనదు నిర్దుష్టప్రతాపోజ్జ్వలాగ్నికి నీరేజబంధుండు నెరుసు గాఁగఁ
దన ధైర్యవజ్రియుద్ధమునకుఁ దృప్తశాత్రవవర్గములు పర్వతములు గాఁగ

తే. గీ. నవనిఁ బాలించెఁ గమఠశేషాహిదిగ్గ
జావనీధ్రంబులకు భార మసదుగాఁగ
సత్యభామాప్తి గలిగిన సరసుఁ డగుటఁ
గృష్ణుఁ డో యన నబ్బాలకృష్ణవిభుఁడు. ౮౧

ఉ. ధైర్యము సాహసమ్మును వదాన్యతయున్ సుజనానురక్తి చా
తుర్యము నప్రమత్తతయు దోర్బలదర్పము నుత్తమత్వమున్
శౌర్య మవార్యతేజ మనిశం బగునట్టి యశంబు సంతత
స్థైర్యము బాలకృష్ణవసుధాపతికిన్ సహజమ్ములైతగున్. ౮౨

సీ. పలుగురు తనునవ్వఁ బసులఁ గాచినవాఁడఁ బరికింప నిదియొక పరువుగాదు
పాలీయవచ్చిన పడఁతిఁ జంపినవాఁడఁ బరికింప నిదియొక పరువుగాదు

గొల్లకొంపల పెన్నగొని తిట్లఁబడినాఁడఁ బరికింప నిదియొక పరువుగాదు
గోపాలకుఁడనయ్యు గోవుఁ జంపినవాఁడఁ బరికింప నిదియొక పరువుగాదు

తే. గీ. ఇఁకను గొన్ని యకృత్యమ్ము లేయొనర్చి
యుంటి నీలోపములు దీర్చు టొప్పుఁగాద
యనుచు సుగుణంపుఁ బ్రోవయి యలరు బాల
కృష్ణుఁడై పుట్టెఁగోలు శ్రీకృష్ణమూర్తి. ౨౩

సీ. సురవంద్యుఁడయ్యును నరునికొక్కనికి సారథ్యమ్ము చేసిన రట్టుపోవ
శూరుఁడయ్యును నొక్క సుందరి ప్రాపంది రణ మొనర్చిన యపకీర్తి పోవ
విజితేంద్రియుండయ్యు విధివిరామము లేక జారుఁడైనట్టి నీచత దొలంగ
బహుపతీద్వ్యండయ్యుఁ బసులగాచుచు నలుగురనోళ్ళలోఁ బడ్డ గుఱుతుపోవ

తే. గీ. నొక్కయెడ జన్మమంది వేరొక్కయెడకుఁ
బారిణరక్షకుఁ జనినలోపమ్ము పోవ
సరసముక్కురవంశాబ్ధిచంద్రుఁడగుచుఁ
గృష్ణుఁడిప్పుడు శ్రీబాలకృష్ణుఁడయ్యె. ౨౪

తే. గీ. ఈమహామహుభార్యయై యొసక మెసఁగ
సాధ్వియౌ కృష్ణమాంబ దేశాయి, యామెఁ
జెప్పి చెప్పంగ నింకొక్క చెలియ గలదె?
యిందు నందును మాఱియు నింకెందుఁగాని. ౨౫

ఉ. ఋతువులలో వసంతమును, వృత్తులఁ గైశికి, సూరులన్ బృహ
స్పతి, కృతులందు దైవకృతి, సర్వనిలింపులఁ బాకవైరి, స
ద్గతులను ముక్తి, యెల్ల కవితల్లజులందును గాళిదాసు, స
త్సతులను గృష్ణమాంబయని సన్నుతిజేయుదు రామె నెల్లరున్. ౨౬

సీ. మగనిశరీరంబు సగము సేయని గౌరి చాపలం బెఱుఁగని జలధిపుత్రి
పదిమందినోళ్ళలోఁ బడని సరస్వతి యపరపరునిఁ బెండ్లియాడని గతి
తనయంత మగనిం జెందని రుక్మిణీదేవి సమరంబు చేయని సత్యభామ
కొనవేళ్ళఁ జూపించుకొనని యరుంధతి వనవాస మెఱుఁగని జనకపుత్రి

తే. గీ. కలిభయ మొకింతయైనను గనని భైమి
యైదుగురఁ బెండ్లియాడని యట్టి కృష్ణ

యనఁగఁ జెలువారె జగమున ననుపమప్ర
కృష్టసుగుణావలంబ యా కృష్ణమాంబ. ౪౭

ఆ. బాలకృష్ణవిభుఁడు బడసె నాకృష్ణమా ధర్మపత్నియందుఁ దనయు వినయ
ముఖగుణాలవాలుఁ బూజితకవిజాలు సోమభూమిపాలు సుభగశీలు. ౪౮

సీ. కట్టించినాఁడు చక్కనిరీతిఁ గుర్వర్తిపర్వతమ్మునకు సోపానములను
బెట్టించినాఁ డాత్మపట్టణంబునను నచ్చటనచ్చటను నన్నసత్రములను
మట్టించినాఁడు దుర్మదమెత్తి పైకెత్తివచ్చిన శత్రునృపాలవరుల
రెట్టించినాఁడు పేర్మిన్ గొన్నిబిరుదముల్ రాజ్యమ్ముతోడఁ బూర్వమ్ముకన్న

తే. గీ. నతఁడు రాజాసవాయిబహదరుముఖబి
రుదవిరాజితుఁ డచ్ఛనీరదపటీర
శారదానారదామృతపారదాబ్జ
భాసురయశుండు సోమభూపాలకుండు. ౪౯

శా. తత్తద్దేశనివాసులై తనరు విద్వాంసుల్ కడున్ వేడ్క ద
ళ్కొత్తన్ దన్నును జూడవచ్చుటయుఁ దానూహించి యవ్వారికిన్
వృత్తుల్ పెక్కుగ నిచ్చి కాఁపురములన్ బెట్టించి దట్టంపు సం
పత్తిన్ జెందినదానికిన్ ఫలము సంపాదించెఁ బూర్ణమ్ముగన్. ౫౦

మ. పరమేశోత్సవ మెంతయున్ సొబగెలర్పన్ ఫాల్గునమ్మందు మిం
చురుచిన్ జేయఁగఁజేసి యప్పుడు తనున్ జూడంగ నేతెంచు భూ
సురులన్ విద్యఁ బరీక్షఁజేసి తగ నిచ్చున్ వారికిన్ భూములున్
గరు లశ్వమ్ములు నగ్రహారములు పైఁగప్పించు నేల్జోడులన్. ౫౧

మ. అరయన్ గార్తికమాసమందుఁ గురుమత్యద్రీశుఁడౌ వేంకటే
శ్వరు నంబాపురమందు నుత్సవముచే సంతుష్టుఁగావించి త
త్పరులై వచ్చిన పండితోత్తముల సంభావించు మాద్యత్కరీం
ద్రరయోద్యత్తురగాగ్రహారమణిహారస్వర్ణహారమ్ములన్. ౫౨

శా. తా వేఁటొక్కెడఁ దెచ్చియిచ్చు టదియున్ దానంబె? ముందిచ్చి యా
పై లీలానెడ లాగికొంట యది గొప్పా? మేల్ కళామాత్రిమా
నీవిన్ మెచ్చఁగవచ్చునే? ప్రతిఫలంబీయన్ గొనన్ బాడియే?
సీ! వీరిన్ గడుమెచ్చ, మెచ్చెదఁ గడున్ శ్రీసోమభూపాలునిన్. ౫౩

సీ. శ్రీసుధాంశునిఁబోల్పఁగా సరియౌ సుధాంశుఁడు దాఁ గళంకితాశూన్యుఁడేని
ధర్మజుం డీడనఁదగు ధర్మజుఁడు ద్రోణతనయునియెడ బొంకఁదలఁపఁడేని
భార్గవుం డీడనఁబరఁగు భార్గవునకుఁ గ్రోధాపవాదంబు గూడదేని
అచలేంద్రుఁ డెనయననగు నచలేంద్రున కల వజ్రిభీతి దాఁజెలఁగదేని

తే.గీ. సరసముక్కరవంశాబ్ధిచంద్రుఁడగుచు
నవనిపాలించి మించు సోమావనీశు
విమలయశమునకును సత్యవిలసనమున
కమితదానంబునకును ధైర్యంబునకును. ౬౯

సీ. ఉరుయశస్కరుఁడు యోగ్యుఁడు సింగవరపువెంకటరెడ్డి యేనాతిఁగన్నతండ్రి
సకలసంపత్కరం బకలంకసౌభాగ్యపూర్ణ మేయెలనాఁగపుట్టినిల్లు
నిరుపమానఖ్యాతి నీతిపాతివ్రత్యమహిమ లేవిరిబోణి మందిరములు
వాదాన్యకము దైవభక్తి సౌందర్యప్రసన్నత లేకొమ్మ సహజగుణము

తే. గీ. లుభయకులపావని యనంగ నొప్పి పొల్పె
సంగు నాలక్ష్మమాంబదేశాయి బెండ్లి
యాడె నభినవమన్మథుం డనెడిపేరు
వడసి చెలువారు సోమభూపాలవరుఁడు. ౭౦

క. ఆలక్ష్మమాంబ గుణముల కాలయము సతీత్వమునకు నాకరము కృపా
వాలత కిరవునునయి సుశ్రీలన్ జెన్నారు నల శచీదేవియనన్. ౭౧

సీ. భూదానగోదానములు పెక్కుజేసె నేపడఁతి మహోదయపర్వమందు
శ్రీరంగముఖ్యదక్షిణయాత్ర లెల్ల నేవనిత సేవించె సద్భక్తిగరిమ
ఉత్కృష్టమగురీతి నొనరించె నేనాతి ప్రీతిమై లక్షవర్తివ్రతంబు
వరకాలయతివర్యు భక్తిమై సేవించి మంత్రోపదేశ మేమగువ జెంచె

తే.గీ. ఎన్నియో సువ్రతంబు లింకెన్నియేని
పుణ్యకార్యమ్ము లొనరించి భూమిసురుల
కతులితాన్నప్రదాన మేయమ్మ చేసె
లలిత సుగుణావలంబ యాలక్ష్మమాంబ. ౭౨

క. ఆ రామయందు సోమక్ష్మారమణుఁడు వడసె నొకకుమారమణి నీ
తారామనృపాలునిఁ బెంపారన్ రాజేశ్వరమ్మయను నొకకూఁతున్. ౭౩

క. ఆహూతుల్ దేశాయి శ్రీకలిత నొసంగి పెండ్లిఁజేసెను సోమ
క్ష్మాకాంతుఁడు రాజా దుబ్బాక యుమాపతికి రావుబహదూరునకున్.

క. హితులను బుధతతులను సంశ్రితుల నతులగతుల నేలు శ్రీసోమధరా
పతిసుతుఁ డాతండు పితుశ్శ్రితగుణయని పల్కు పల్కు సత్యముగాఁగన్. ౧౦౦

సీ. తనయుదారత కల్పతరుకామధేన్వాదులకు నీవి మెలఁకువల్ గఱపుచుండఁ
దనప్రతాపము విక్రమవిహోత్రాదులకు హీనతరదశల్ గడపుచుండఁ
దనకీర్తి కుముదబాంధవశారదాభ్రాదులకు శుచిత్వపుగతుల్ బఱపుచుండఁ
దనధీరభావంబు కనకభూమిధరాదులకు నచలస్థితుల్ సలుపుచుండఁ

తే.గీ. దనప్రజాపాలనము పురాతనబహుమహి
విభుల యార్వేరులను మఱపించుచుండ
భూమి నేలుచునున్నాఁడు సోమభూప
పుత్రుఁడైన సీతారామభూవరుండు. ౧౦౧

శా. సప్తాహం బొనరించి విప్రులకు లక్షల్ సొమ్ముగాఁజేసె, సం
తృప్తుంజేసెను శ్రీశుఁ గోటితులసిన్, దివ్యన్మణీమంటప
ప్రాప్తుంజేసెను గుర్మతీశ్వరుని, సోపానమ్ము లక్కొండకున్
వ్యాప్తింజెందఁగఁజేసి పుష్కరిణికిం గట్టించె నూత్నమ్ముగన్. ౧౦౨

చ. ఇదు, నిఁకనొక్కసారి యిదు, నింకొకమా ఱిదు, నింక నొక్కమా
ఱిదు, మునుగొన్నయట్టి జనులే గొనుచుందు రొకింతయే నెఱుం
గఁడనివచింతు ఛాందసు; లఖండవదాన్యుఁడితం డెఱింగియే
యిడు ననుమా టెఱుంగరు భళీ భువి నింతటిదాత లుందురే! ౧౦౩

క. రతనంపు సొమ్ములను గురుపతిపతి కర్పించె భక్తిపరవశుఁడై భూ
పతి సీతారాముండు తరతమత్వం బెఱుఁగుదాతరా! యితఁడు భళీ! ౧౦౪

ఉ. అబ్బురమా మహత్త్వము నుదారత ధీరతచారుతాదులున్
జొబ్బిలు సోమభూవరుని సూనునియందని నిబ్బరంబుగా
దబ్బఱలేని కృష్ణకవి తల్లజుఁ డల్లన నల్లినట్టి యీ
కబ్బమె సాక్ష్యమిచ్చు ననఁగాఁ దినుచో రుచు లెన్న నేటికిన్. ౧౦౫

సీ. పాపమంచనక స్త్రీవధ యొనర్చినవాఁడఁ బరికింప నిదియొక పరువుగాదు
రాజ్యమ్ము విడచి యరణ్యమేగినవాఁడఁ బరికింప నిదియొక పరువుగాదు

అన్యాయముగ వాలి నని వధించినవాఁడఁ బరికింప నిదియొక పరువుగాదు
కోఁతులతోఁ జెల్మి కోరిచేసినవాఁడఁ బరికింప నిదియొక పరువుగాదు

తే. గీ. అనుచు నీలోపములుదీర్ప ననుదినంబు
నాత్మ నెంచి సీతారాముఁ డవనియందుఁ
దివిరి నిడివెళ్లగోత్రవరిష్ఠుఁడగుచుఁ
బుట్టెఁబోలు సీతారామభూపుఁడగుచు. ౧౦౬

సీ. వరయశోనిధి సింగవరపువంశోద్భవుండగు గంగిరెడ్డి యేయతివ తండ్రి
సౌశీల్యవాత్సల్యసౌందర్యగాంభీర్యములకు నేయెలనాఁగ పుట్టినిల్లు
దేవతాభక్తి భూదేవతాసక్తు లే తరుణీశిరోమణి తానకములు
అనిమిత్త జాయమానానూనకరుణాకటాక్షప్రసార మేయమ్మ సొమ్ము

తే. గీ. అమరు దేశాయిబిరుద మేయబల కట్టి
రామలక్ష్మమ తనకు ధర్మసతిగాఁగ
రాయవేంకటకృష్ణమారామభూమి
పాలకులఁ గనె సోమభూపాలసుతుఁడు. ౧౦౭

క. ఆకూఁతుఁ దేశాయి శ్రీకలితం బెండ్లిఁజేసె సీతారామ
క్ష్మాకాంతుఁడు రాజా దుబ్బాకవిభుశ్రీనివాస బహదూరునకున్. ౧౦౮

క. ఆసీతారామసుతుం డాసీతారామనుతుని య ట్లనుపమవి
ద్యాసౌశీల్యగురుయశశ్శ్రీసౌందర్యములు గలిగి చెలఁగుచునుండున్. ౧౦౯

సీ. మాటలాడఁడుగాని మాటలాడినయప్డు విద్యాప్రసంగ మేవేళఁజేయుఁ
జేతులెత్తఁడుగాని చేతులెత్తినయప్డు ధరణీసురులకు వందనమొనర్చుఁ
గోపగించఁడుగాని కోపగించినయప్డు దుష్టజనశ్రేణి దునియఁజూచుఁ
గోర్కెలూనఁడుగాని కోర్కెలూనినయప్డు డర్థికోటుల లేమి లణఁపఁగోరు

తే. గీ. ఇతని రక్షింపవలెఁ గుర్మతీశుఁ డంచుఁ
బెద్ద లాశీర్వదింపఁగా వృద్ధిఁజెంద
వృద్ధిఁజెందుచునున్నాఁడు వృద్ధిఁజెందఁ
గలఁడు శ్రీరామభూపాలకాంతుఁడెపుడు. ౧౧౦

క. చిలుకూరివంశసంభవుఁ డలఘుఁడు శ్రీరామదాసహార్నిశముఁ వి
ద్యలు గఱప వన్నెకెక్కిన సలలితుఁ డారాచగున్న శక్యమెపొగడన్. ౧౧౧

మ. తరుణీమన్మథుఁడై చెలంగు నలసీతారామభూపాలుఁడున్
మరలం గైకొనె రామసాగరపుఁగృష్ణారెడ్డిదేశాయికూఁ
తు రమాభాసుర నుత్తమోత్తమగుణస్తోమాభిరామన్ మనో
హరలావణ్యనిధిన్ సమగ్రకరుణాఢ్యన్ రాజలక్ష్మీసతిన్. ౧౧౨

క. ఆరాజలక్ష్మమను సీతారామనృపాలసంచితధనము్మనకున్
పారావారతనూజాకారను నేరాజసతులు గా రుపమింపన్. ౧౧౩

సీ. ముదుక చీరెలుగట్టు బుధులభార్యలకెల్ల వెలలేనిపట్టుచీరెలు లభించె
నగలెఱుంగని కవీంద్రసతీమణులకెల్ల నొడలెల్ల బంగారు తొడవులాయె
పండ మంచములేక యుండు శ్రోత్రియుల యిల్లాండ్రకుఁ గేళిగృహమ్ములబ్బె
జొన్నయన్నమె సన్నయన్నమా గర్భరిక్తాంగనాతతికి శాల్యన్నమబ్బె

తే. గీ. లక్ష్మికి నిర్లక్ష్యభావ మలరఁగ నెవ్వ
రెవ్వరికి సంపదలనీయ కీసడించు
నట్టివారలకెల్ల భాగ్యము లిడునఁట
లక్ష్మిప్రతి గాదె యీరాజలక్ష్మమాంబ. ౧౧౪

క. సీతారామనృపాలుం డీతరుణీతిలకమందు నిందిరకనయా
కూఁతుంగనె, నాకూఁతున్ సీతారాముండు కరుణచే రక్షించున్.

---

# షష్ఠ్యంతములు

క. ఏతాదృశైశ్వర్యస్ఫీతునకున్ సోమభూపచిరకృతసుకృత
ఖ్యాతునకున్ ముక్కరకుల సీతారామునకుఁ బ్రేయసీరామునకున్. ౧

క. శారదనీరదనారదపారదసమయశునకుం గృపావివశునకున్
ధీరున కల ముక్కర సీతారామున కత్యుదారతారామునకున్. ౨

క. శ్రీమండితాత్మకర్పూరధామునకున్ గోటిసూర్యధామునకు మహో
ద్దామున కభిన్నసీతారామునకున్ ధారుణీధురారామునకున్. ౩

క. అనుపమలక్ష్మ్యంబాచందనవల్లీసుమమునకు మదనరూపునకున్
ఘనముక్కరసీతారామునకున్ స్మితవిజితచంద్రమోధామునకున్. ౪

క. కురుమతిపతిపదసేవాస్థిరమతికి నరేంద్రమకుటదీప్యద్రత్న
స్ఫురదంఘ్రియుగళునకు ముక్కరకులకలశాబ్ధి శీతకరున కురునకున్.

క. ప్రతిపదవ్యుత్పన్నమ్మౌఖసంతతలక్ష్మీనిలయునకు సుసంపద్విద్యా
న్వితునకు శుభగుణవిభ్రాజితునకు రాజితునకు మతిజితగీష్పతికిన్. ౯

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా మే మాంధ్రీకరింపంబూనిన కృష్ణకవిసార్వభౌమ
విరచితంబగు శ్రీనివాసవిలాసంబునకుఁ బ్రారంభం బెట్టిదనిన. ౧౦

## కథాప్రారంభము

మ. తొలికూటమ్మున మెల్లమెల్లన పటూక్తుల్ గొల్పి తన్వ్యాహృతిన్
కలనాపత్రప మాయుమోమిడు రమాకాంతన్ ధృఢాలింగనా
కలితంజేయఁ దదేకచూచుకహతిం గాఁచోలు నీమచ్చనాఁ
జెలువున్నించెడు వేంకటాచలపతిశ్రీవత్స మేలున్ మమున్. ౧

తే. గీ. ఎద్ది తెల్లనికాంతితో నెసక మెసఁగు
మాలియను రక్కసునిఁ బరిమార్చె నెద్ది
అట్టి శంఖచక్రమ్ముల ననపరతముఁ
దాల్చు కురుమతిపతి నన్ను ధన్యుఁజేయు. ౨

క. చిరకాలము రవిబింబాంతరమున నెలకొన్నయట్టి తాపమణఁపఁ జం
దురుబింబంబున నెలకొను తురగముఖున కెంతయున్ వతు ల్పచరింతున్. ౩

తే. గీ. జలదసంతతి దావాగ్నిఁ జల్లఁజేయు
పగిదిఁ బ్రతివాదిపండితపటలి సభల
నెవనివాగ్ధాటిచేత జయింపఁబడియె
నట్టి పరకాలగురువర్యు నాశ్రయింతు. ౪

క. ఎవని యశం బత్యంతపవిమలమై యెల్లదిశల వ్యాపించెనో యా
సువిమలుఁడగు తాతాచార్యవరుఁడు నాతాత జయమునంది చెలఁగుతన్.

సీ. శరదర్కకరవికస్వరవారిరుహాకవన్మధుఝురీమాధురీమానితములు
అంబరాపతదంబుడంబరారంభభృద్దేవధునీవినీతిప్రదములు
షడ్దర్శనీసారసౌరభోదారచాతుర్యధైర్యస్థైర్యదోహదములు
ప్రతివదావదవాదఫక్కికారంభనిర్వాపణప్రక్రియాభావుకములు

తే. గీ. నయిన వాచాభరమ్ముల నఖిలపండి
తుల జయించినయట్టి యతులయశుండు

సార్థకాభిఖ్యుఁడగు సజ్జయార్యవరుఁడు
సిరుల దయచేసి మమ్ము రక్షించుఁగాత. ౬

మ. కవితావాసనలేని మచ్చరులు 'సత్కావ్యమ్ము లెన్నెన్నియో
భువినుండంగ నవీనమైనకృతు లింపున్నింపునే' యంద్రు, వా
రి నచోగుంభము వేదమే ? కవుల వారింపందరంబే? కృతుల్
కవియావాఁడు రచింపఁడే ? యొరుల వక్రిత్వంబు లెక్కించునే ? ౭

తే. గీ. అట్టికవనమ్ము దనకబ్బదనెడి దుఃఖ
మునఁ గుకవి సుకవికవిత గని హసించు,
నందమగుభార్యలేనివాఁ డన్యసుంద
రీమణినిఁ గాంచి నగినంత నేమిపోవు. ౮

క. అతిసరసము లతికఠినము లితరములగు పద్యములును గృతితతులం దా
రతుకుట దోసమె నానాగతి విధికృతసృష్టియందు కనఁబడునుగదా! ౯

తే. గీ. మృదులమగుఁగాక కఠినమై యొసఁగుఁగాక
సరసమగుపద్యము ముదం బొసంగు మఱికి
రసికుఁడగువాని కొకయధరంబె మోద
మిడునె, కుచయుగమది మోదమిడకయున్నె ? ౧౦

తే. గీ. పెక్కుగుణములచే వన్నెకెక్కు కృతుల
నల్పదోషంబు విద్వాంసు లరయఁబోరు
ద్రాక్ష దిను నేర్పుగల్గిన రసికుఁడైన
నుమిసివేయునె తద్బీజమొక్కఁడైన? ౧౧

చ. సరసకవిత్వతత్త్వగతిసారవిదుల్ దలలూఁచి మెచ్చు నా
ధురి నెఱిమీఱు సత్కవిత తొయ్యలులెల్ల శిరంబులందు నా
దరమునఁ దాల్చు మాలిక వృథాగతిఁ గోఁతులచేతఁబడ్డయ
ట్లరసికులైన దుర్మతులయగ్రమునన్ నటియింపకుండుతన్. ౧౨

ఆ. వె. చిన్నిపన్నెలాఁడి చిన్నారిపొన్నారి
గంటలొలయు కాంచికారవమ్ము
పగిది సుకవికవిత పండితహృదయముల్
వినినయంతమాత్రమునఁ గరఁచు. ౧౩

తే. గీ. అప్రయత్నోక్తమైనదియయ్యు సుకవి
కవిత పండితహృదయముల్ గరఁగఁజేయు
సహజలావణ్యనిధియైన చాన నగలు
దాల్పకున్న నొయ్యారంబు తక్కువౌనె ? ౧౪

క. గుణహీనమయ్యు నీకృతి గుణఖనులగు నిష్కపటులకుఁ ముదమిడు, ని
ర్గుణపరిపాటిని శిశువులు గొణిఁగెడిపలుకు లవి మనము కొసరి యొసఁగవే. ౧౫

మ. ధరణీచంద్రముఖీమహేంద్రమణిముక్తాహారదూర్మిచ్ఛటా
సరసాపారజలప్రవాహయుతకృష్ణాగౌతమీమధ్యవ
ర్తిరమావాసవిలాసభాగ్యనగరీదేశత్క్షమాసఖ్యలం
కరణం బొప్పగు నాత్మకూరుపుర మొక్కం డిందిరావాసమై. ౧౬

క. ఆరాజ్యమేలుచుండు ధరారమణవరుండు సత్యరతుఁ డుపమితసీ
తారాముఁడు ముక్కరసీతారామనృపాలుఁ డమితధర్మప్రౌఢిన్. ౧౭

సీ. నిజభుజాయుగసముత్కర్షసంవర్ధితాఖిలధర్మకర్మాంఖిలజనుండు
అతిలోకనిజవిక్రమతపనోరుస్థాయియమునాయమానవియత్తలుండు
కామినీజనమనఃకైరవానందసంధాననిర్వ్యాజచంద్రాయితుండు
కరుణాతరంగరంగత్కటాక్షచ్ఛటాపాలితాఖిలరాజబాంధవుండు

తే.గీ. సకలరాజన్యసంఘాతమకుటతటను
ఘటితరత్నవినూత్నప్రకాశమాలి
కానవీనార్కఘృణిగణకలితదివ్య
పాదకమలుండు సోమభూపాలసుతుఁడు: ౧౮

సీ. మారాహితక్షీరవారాశిహీరామృతైరావతప్రభాచోరకములు
సీరాయుధవిరించిదారతారాశరద్ధారాధరప్రభావారకములు
స్వారాట్కృపాణమందారకర్పూరనీహారాగరాట్ప్రభాదారకములు
హారాగమల్లికాహారసుధాహారచీరాంబరప్రభామారకములు

తే.గీ. సకలదేశాగతబుధేంద్రసముదయావ
నక్రియాబుద్ధమణికంకణవితరణను
కృతపరీపాకజన్మసంగతము లతని
కీర్తులన నద్ధరాపతి కేవలుండె ! ౧౯

శా. ఏతాదృక్షయశమ్ముచే విమలుఁడై యెందుండు చేతస్సము
ద్భూతానందము విన్నవించుటకునై దోతెంచి నానామణి
వ్రాతస్థాపితతన్నృపాలమకుటీప్రాంతప్రదేశమ్మునన్
శ్వేతచ్ఛత్రవిభూతి నొప్పునఁట! తద్విఖ్యాతి సామాన్యమే. ౭౦

చ. నిజభుజవిక్రమజ్వలననిర్జితు మిత్రుని మున్నుమంచు నీ
రజములు వైరిరాణ్మకుటరాజిధృతాంజలులై తను న్నుతిం
పఁ జనినసంగతిం దెలుపు ద్వ్యస్థులమాటల నాలకింప న
క్కజముగ వక్త్రచంద్రుని సగం బటుద్రిప్ప నతం డతంద్రుఁడై. ౭౧

వ. వెండియు న్యక్కృతరిపుచక్రకనద్విక్రమమదఘక్కికశుభముక్కరకులకలశాంబుధి
చంద్రుండును, సుగుణావళిసాంద్రుండును, శ్రీకురుమూర్తిగిరినిలయశ్రీనివాసకరు
ణాకటాక్షవీక్షణలబ్ధాఖండ సామ్రాజ్యనయవినయసౌశీల్యవాత్సల్యముఖగుణగణైక
తానాస్థానాయితకౌసల్యాదశరథసామ్యసీమాసమారూఢలక్ష్మ్యంబాసోమభూపా
లచిరంతనానల్పసుకృతపరిపాకకల్పతరుపరిపూర్ణఫలాయమానుండును, మానాధిక
కవిజనకలితానఘలలితాద్భుత కవితాలతావితానసముస్మేషణస్ఫీతారామాయితుం
డునునగు సీతారామభూపాలవర్యుండు. ౭౨

## సర్వలఘుసీసము.

లలితతురగతతికరికలభవృషభపృథురథమహిపపరిచరణచణమనుజగణము
కనకమయదశకమ్మగతసురుహవసనమరతకఖచితరుచిరుచిరసుకటకగణము
ధళధళదనుపమమణితరళతరసరభతరసరసఘుసృణిమసృణితసుసరవిసరము
సకలఫలసురభిసుమసమనుగతతరులసదుపవననికటకలితసుభవనగణము

తే. గీ. లును నొసఁగు తనవితరణ మనుపదమును
సరసిజగళితమధురసమకవనఘ
ణితులఁ గవులు నుతిసలుప మితహసితవ
దనసితకిరణుఁడగుచు ముదము బొదలఁగ. ౭౩

వ. నిజవదనసితకిరణకిరణాయమానాపాంగభంగీదివసాంగీకృతకనకాంగీజననిచయాంగీ
కృతమంగళతరమృదంగనినదసంగతసంగీతభంగీబహువిధారోహణావరోహణచాతు
రీశ్రవణసముదంచదమందానందసోమరోచిశ్చామరోద్వేజనోద్వేల్లితభుజవల్లికింకరీ
నికరమందస్మితగర్భితధళధళత్కపోలరుచినిచయవిలోకనసంజాతలజ్జావనతవదనం

బులువాఁడగు స్తంభోపాగ్ర కీలితకాలాయసఘటితమూలఘనతరకులాధోదేశాధో ముఖబద్ధముకురనికరంబుల నిగనిగల మిగిలి ద్వాదశాత్ముండగుపంకజబాంధవుండు తపనీయశరీరుండగు భగవంతుండు నాయంప వసియించునను గర్వంబునొందు టకు సహింపక తదధికగౌరవంబు సంపాదింప నుంకించి నానారూపంబులు దాల్చి యంతర్గతస్వర్ణవర్ణభగవత్స్వరూపుఁడై నలుదిక్కులఁ జొక్కులుగొలువఁ దోతెంచిన తొగలవగ కాని ననుకరించు సదీపస్ఫటికమణిఘుటికాఘటితసరవిసర వలయితస్ఫాటికసముద్గకనికరంబును, నంతఃప్రతిఫలితతపనబింబంబును, బుద్బు దనికరవిరాజితమ్మునగు కడలి సడలించు నిందుపేరోలగమ్మున.

సీ. ప్రతిభాలతాఢ్యకల్పాయమానమనోభవమనోహరస్వరూపంబువాఁడు
అతులచాతుర్యధైర్యస్థైర్యవిభ్రాజిరాజనీతిప్రచారంబువాఁడు
అఖిలజనగుణగ్రహణచణసౌజన్యరమ్యపరోపకారంబువాఁడు
తత్తత్కృతిప్రశస్తతరప్రచారనిర్యాతకళంకాంకురంబువాఁడు

తే. గీ. సకలసుకవిచకోరకనికరచంద్రి
కాయితామితవితరణప్రౌఢివాఁడు
మహితవెంకటరెడ్డిసమాఖ్యసచివ
వర్యుఁ డాత్మీయవామపార్శ్వమునఁ జెలఁగ. ౨౫

సీ. కళ్కుబెళ్కుల తెల్గు కయితనెవ్వగలాఁడి జిల్గుకౌఁగిటిలోనఁ జిక్కువాఁడు
తనకన్నఘనులైన జనులఁ గన్గొని యోర్వలేమి యొక్కింతైనలేనివాఁడు
పద్యమ్మునకు నొక్కపదమైన రసవంతమయిన నర్థానికే యలరువాఁడు
తురగవిద్యాధురంధరభావమున మాద్రి తోలిచూలి ననలీల గెలుచువాఁడు

తే. గీ. నైన తిరుమలరాయసమాహ్వయుండు
కుడికెలనఁ జెన్నుమీఱ నల్గడల సుజన
కార్యఘటనాదికృత్యచాతుర్యమతులు
ఘనులు వెంకటరాయాదులును జెలంగ. ౨౬

తే. గీ. అతులమణిమయసింహాసనాంతరమునఁ
గొలువుదీరిచి మర్యాద కొమరుమిగుల
నన్నుఁ బిలిపించి పలికె విన్నాణముగను
మధురమృదులగభీరసరభాషణముల. ౨౭

సీ. అలమహీశూరమహారాజకృష్ణరాట్ప్రభునిసన్మానంబు వడసితీవు
రసతరంగితరంగరాజవిలాసచంపూప్రబంధము కృతిఁ బొందువేళఁ
గర్ణాటభూమ్యలంకరణమా నేగొంది యనుపేరఁ బరఁగు విద్యానగరము
నకు రాజు కృష్ణరాణ్ణరనాథమానితాచ్యుతరాయవంశపయోధికల్ప

తే. గీ. కంబు వీరప్రతాపవిఖ్యాతఃరప
తిబిరుదాంకిత తిరుమలదేవరాయ
నామకుఁడునగు నృపుచేత నాగకనక
మంటపారోహణంబు గైకొంటి వీవు. ౨౮

వ. అదియునుంగాక,

క. బహుళకుకవిజనమిహికామిహిరుఁడవై సుకవిజనులు మేల్ మేలు భళీ
వహవాయన బహువృత్తులు బహుమానము గొంటి వీవు బహుమాన్యుఁడవై. ౨౯

తే. గీ. బహుమతివి సుకవిరాట్సార్వభౌమబిరుద
కలితుఁడవు నిన్ను వర్ణింపఁగలనె ? కురుమ
తిగిరి పతియను మా కులదేవుఁడునగు
శ్రీనివాసువిలాసంబు చెప్పుమయ్య ! ౩౦

క. కురుమతిగిరిపతిచరితము సరసముగాఁ జెప్పి మాకు సంతోషంబుఁ
గల మొనరుపుమని వేఁడినఁ బరమానందానుబంధబంధురమతినై. ౩౧

సీ. పరకాలయతివర్యపాదపంకేజాతకరుణావిశేషంబు గలుగువాఁడు
కవిసార్వభౌమవిఖ్యాతిచే దశదిశావలయమ్మలను బేరువెలయువాఁడు
నవనవోన్మేషవై భవముఁగల్గిన బుద్ధిపాటవంబున గురుప్రతిమవాఁడు
సర్వవిద్యావిశేషప్రచారప్రభావప్రకాశమ్ము జొప్పడినవాఁడు

తే. గీ. నిరుపమానుండు విమలుండు నీతిపరుఁడు
నైన శ్రీవెంకటార్యుఁ డెవ్వానియన్న,
వసుధ నవదుర్గపురము నివాస మెవని
కట్టి శ్రీకృష్ణకవినామమలరు నేను, ౩౨

ఉ. 'వీగినరాత్రిఁ గుర్మతిగిరీంద్రుఁడు నాకలలోనవచ్చి మీ
రేగతిజెప్పినారో యటులే సెలవిచ్చెఁ బ్రబంధ మొక్కఁడిం

పొగతి జెప్పుమంచు, భవదాజ్ఞయు దేవునియాజ్ఞతోడ సం
యోగముఁ జెందె నాసుకృతయోగము మంచిదికాదె భూవరా'. ౩౩

వ. అని వినుతించి హృద్యానవద్యగద్యపద్యాత్మకంబగు నీప్రబంధంబు జెప్పం దొరం
కొంటి. ౩౪

మ. కరుణాసాగర ! కుర్మతీశ్వర! లలత్కల్యాణవాచాపరం
పరలన్ మున్నతిబాలకున్ ధ్రువునిఁ బ్రోవన్ బూనినావంచు నా
తురతన్ సాహసమూని తావకగుణస్తోత్రంబొనర్పంగ నే
దొరఁకొంటిన్ శుభవాక్పరంపర ననాథు న్నన్ను రక్షింపవే. ౩౫

మ. కురుమత్యద్రిశిరోవతంసుఁడగు నాగోవిందుఁ డస్మత్కృతీ
శ్వరుఁడైనన్ మఱికొన్ని వస్తువులసౌభాగ్యంబు వర్ణింతు, నె
వ్వరు రామాయణముఖ్యకావ్యకలనాపారీణు లవ్వారలా
దరమున్ జూపినఁజాలదే ? యొరుల నిందం దందరం గొందు నే. ౩౬

చ. పలుకులకల్కికేల నొక భంగిఁజెలంగు విపంచికాస్వనం
బులఁ గిలికించితంబుల గుబుల్ కొనఁజేయఁగఁ జాలి, శ్రుతులం
గలకలపాటునం బొదలఁగా గమకించుపరాక్రమం పుని
గ్గులుగల కృష్ణసూరిపదగుంభనకున్ జగ ముత్సహింపదే. ౩౭

క. కురుమతియనఁ గుర్మతియనఁ గురుమూర్తియనంగ మఱియుఁ గుర్మూర్తియనన్
కురుపతియనఁగాఁబరఁగెడు ధరణీధరరాజమొకఁడు ధరణిన్ వఱలున్. ౩౮

వ. మఱియుఁ బురాంతకామరవరాదిమాఖిలసురావళిశేగీయమాననిజమహిమంబగు న
గ్గిరివరంబు దానవకులంబువడువునఁ బరికంపితసుపర్వవంశాతిబలమనోహరంబును,
హరుని తెఱంగునఁ బ్రతిక్షణము నగజాననపుష్కరచుంబితవిమలగండాభిరామంబు
ను, రాముని మాడ్కి సమాశ్రితచిత్రకూటకాననజాతంబును, జాతరూపగిరిపగిది
నాశ్రితసుమనశ్శిలాకందరంబును, దరంబుపోలిక ఘనవనమాలికాంతశయవిలసితం
బును, సితకరునివలె మహానీలసహితంబును, హితజనంబుడంబున సుజ్జీవనానూపదే
శరంజితమానవంబును, యవరాశివిధంబునఁ గృష్ణసారమహితతాభివృద్ధంబును,
వృద్ధునిచందంబున బహుతరప్రవాతకంపితపంచశాఖాకలితాగమమ్మునునై కొని
యాడఁ బడుచుండు. ౩౯

సీ. హరిహతద్విరదకుంభాంతరాగళితముక్తామణీసాంద్రకందరతలంబు
కందరప్రాంతసంగతచమరీవాలచాలనవ్యాప్తనిర్ఝరకణంబు
నిర్ఝరకణసంజనితశీతవాతనిర్ధుతరతాయాసాప్సరోగణంబు
అప్సరోముఖచుంబనాలింగనాదిసంభోగసాదరదేవతాగణంబు

తే. గీ. దేవతాకరసంగ్రహానావఘాత
కబరికాస్రస్తనవమల్లికాసుమంబు
మల్లికాసుమగంధసంభ్రమవిలోల
మత్తమధుపారవంబు నమ్మతినగంబు. ౮౦

సీ. మధుపారవవిపంచిమధురస్వరాకర్ణనాకులీకృతహరిణీకులంబు
హరిణీరవిసుతాకర్ణాయమాననితంబవృక్షశాఖావ్యాప్తవీక్షణంబు
వీక్షణాళీజంబువిభ్రాంతవితతహస్తతదలాభాయాసితవటుగణము
వటునిశామనభృశాపహాసద్రమేశసేవాలోలనగరీయువతిచయంబు

తే. గీ. యువతివశగతతరుణపంస్తవవివశిత
తచ్చతురమధురవచనతతిసమనుక
రణచణశుకప్రకరతారరవముఖరిత
సకలదిక్కంబు నమ్మతిక్ష్మాధరంబు. ౮౧

వ. వెండియు నద్ధరణీధరంబు హరీశ్వరాశ్రితశిఖరంబయ్యు నహరీశ్వరాశ్రితశిఖరంబును, వనప్రియద్విజకలితంబయ్యు నవనప్రియద్విజకలితంబును, నగకేసరకుసుమమసృణితంబయ్యు నాగకేసరకుసుమమసృణితంబును, రంకుశశాదనకులేష్టావనీరమ్యంబయ్యు నరంకుశశాదనకులేష్టావనీరమ్యంబును, వైణవరారాజితంబయ్యు నవైణవరారాజితంబును, సప్తపర్ణతరుశోభితంబయ్యు నసంఖ్యాతపర్ణతరుశోభితంబును జంభవిజృంభణప్రదంబయ్యు దేవవల్లభప్రియంబును, ద్విపారిభద్రాంచితంబయ్యు నసంఖ్యాతపారిభద్రాంచితంబును, పటసహస్రకలితప్రాంతంబయ్యు నపటసహస్రకలితప్రాంతమ్మును, ద్విజపావనావనీకలితంబయ్యు బహుజపావనావనీకలితంబును, నిరంతరైకవిష్ణుక్రాంతావనీయుతంబయ్యు సదామహాదేవసమాక్రాంతావనీయుతంబును, తాళీరక్షణనిపుణంబయ్యు నతాళీరక్షణనిపుణంబును నై యొప్పుచుండు.

సీ. ఇనకరకాంతుల నెనసి విస్తృతకాంతిరమ్యంబులగు పద్మరాగమణుల
తోఁ జెలువారెడి శిఖరమ్ములఁ దనర్చి రతసంప్రనాణెంపు రహిఁ జెలంగు

వర్తకుల్ తమకుఁ గావలసినన్నియును వజ్రములఁదగు నాకరమ్ములను ద్రవ్వి
కొనిపోవ, నటమిగిలిన వజ్రములకాంతి నలుదిక్కులను బాఱి యలముకొనఁగఁ

తే. గీ. బడగలను రత్నకాంతులు పరఁగ, నాలు
కలను వెలిగొల్పి భూమిఁ బ్రక్కలుగఁ జేసి
శ్రీనివాసునిఁ గొలువవచ్చి యటఁ జుట్టు
కొనిన శేషాహి నాఁగ నక్కుధర మొప్పు. ౪౩

సీ. పైభాగమున రసప్రభలచేఁ జెన్నారు శారదాభ్రమ్ములు సమితి చెలఁగ
నాసన్నభూమియం దలిపుల్లచంపకప్రసవచయప్రభాపటలి దనర
సలలితంబగురీతి జాలువాఱెడి మేటి సెలయేర్లు నలుదెసల్ గలయఁ బర్వ
హారసమాలింగనవ్యతికరభస్మాంగరాగసంఛన్నగౌరాజితమును

తే. గీ. గనకకుంభోపమము మౌక్తికసరయుతము
నై చెలంగెడి శంకరార్ధాంగి యైన
సర్వమంగళ యున్నతస్తనమనంగ
నొక్కతఱి నద్ధరాధర మొప్పుచుండు. ౪౪

సీ. నానావిధప్రసూనానీతమకరందపానప్రమత్తాళిగానములును
గానశ్రవణధూనమానినీకుచయుగాధీనహస్తశయాన దేవతలును
దేవతానుప్తిసౌఖ్యావహోపవనిలసన్నారికేళాదిసుందరతరులును
తరురాజదుద్యానతలకేకినీనాదకంఠోదితారవాకలనములును

తే. గీ. కలనముల కనుగుణమ్ముగ లలితనటన
ములను సల్పెడి నెమ్మిచెలులును గల్గి
కన్నులకుఁ బండువుగను నాపన్నశరణు
మగను జెలువారుఁ గుర్మ్యార్తినగవరంబు. ౪౫

తే. గీ. గగనగతులందు నటఁ గీటకములు నోటఁ
గఱచు వేణులఁ బడిన రెక్కలను ముత్తి
యము లటందురు, కానున్న నచ్చటచట
నాకసం బడుఁగూన్య మెట్లయ్యెనొక్కొ! ౪౬

తే. గీ. గుహలఁ జరియించుసింగముల్ బహుళభయద
రావములొనర్ప విని కాళ్ళురాక డిల్లి

పడిన యేనుంగుగున్నల దడములనఁగ
గండశిల లన్నగంబునఁ గ్రాలుచుండు. ౪౭

మ. రతనంపుం గనులొంది గౌరవముచే రాణించియు న్భూధర
స్థితిచే మించియు పంచకప్రచురమైత్రిం జెందుటం బ్రోజ్జ్వల
త్సితపత్త్రమ్మున మించు నన్నగము రీతిం దారు యోజించి సు
కృతిభూభృత్ప్రభవంబిది యప్రమాణమని సంభావింత్రు లోకుల్ దగన్. ౪౮

మ. చనుచోఁ జందురు లేడి తన్నగమృగీసంగేచ్ఛచేఁ దాటిపో
యినఁ దత్స్ఫాటికకాంతిరంధ్రమది తా నేర్పాటుగాదయ్యె, మీఁ
దను నయ్యద్రి నతిక్రమించుటయుఁ దద్రింధ్రావలంబద్యుకాం
తి నతండయ్యెఁ గళంకవంతుఁ, డపకీర్తిన్ దోయఁగా శక్యమే. ౪౯

చ. చిరతపముం బొనర్చుటను జేసి హృదబ్జమునందుఁ జిక్కి నీ
హరి, కనులెంత విప్పిన గతాయనుఁడై చను నే మొయంచు న
గ్గిరి మును లక్ష్మి మ్రాలనము గీల్కొనఁ జేసి జపించుచుండు, నె
వ్వరికిని గష్టలబ్ధములు వ్యర్థమొనర్పఁగ బుద్ధిపుట్టునే. ౫౦

వ. మఱియు నగ్గిరివరంబున విచిత్రతరంబులగు గుహాముఖంబుల ననుంగుకాంతలం గూడి విహరించుపాపపూపజవరాంద్రుడు పలుదవటు ప్రియురకు నిబ్బర పుగబ్బిగుబ్బలు రమ్మున హత్తి గౌఁగిలించుకొనం గమకించు నెయ్యంపుకాండ్రచే బలాద్గృహీతైకహస్తలగుచు సిగ్గునం గ్రమ్మగుచు నెట్టకేలకుఁ గేలువదల్చుకొని గుహాంతరమ్ములకుం జని నిజశిర స్థలఘటితధగాయమానమణీఘృణీనివారితాంధకారంబగునయ్యెడకు వచ్చి ప్రియులు సిచయాంచలంబులం గ్రహింప విఫలితాంతఃప్రవేశప్రయాసలగుచుఁ గ్రమ్మరఁ దమకరమ్ములు శిరమ్ములఁ గీలించి మణికాంతిపరంపరల మాటుపరుపనుంకింపుడు స్వకీయ కరతలాంగుళీవిపరప్రసరన్మణీఘృణిచ్ఛటావలయమ్ములం గనుపట్టియుఁ గనుపట్టని మైదీవలం బొల్చినకతమ్మున నిష్ప్రతిబంధకానుభూయమాన ప్రియాంకపాళీ ధురంధరలై చేయునదిలేక సలజ్జాభరస్మితాంకురంబులు వెలుంగ నిజశిరోమణివిధాతయగు విధాతం దిట్టుచు నిరతిశయానుభతసుఖంబు లనుభవించుచుండుర. ౫౧

శా. దూరస్థంబగు శేషభూధరమునందున్నే వసింపన్ ననుం
జేరన్ లేక మదీయభక్తతతి గాసింజెందునంచుం గృపా
పారావారుఁడు వేంకటేశ్వరుఁడు దాఁ బద్మాలయంగూడి పెం
పారన్ గుర్కృతిధారుణీస్థరము సద్భక్షించి మించెన్ వెసన్, ౫౨

సీ. కాచినాఁడెవ్వాఁడు కరిరాజుప్రాణమ్ము కఠిననక్రమును జక్రమునఁ ద్రుంచి
చూచినాఁడెవ్వాఁడు శుభదృష్టి కురుధరాపతియైనభరతుని వరములొసఁగి
ప్రోచినాఁడెవ్వాఁడు పూర్వదైతేయడింభకుని వేవేగఁ గంబమునఁబొడమి
దాఁచినాఁడెవ్వాఁడు ద్రౌపదీమానమ్ము సభలోనఁ బెక్కువస్త్రములొసంగి

తే. గీ. అట్టిహరి తనపేరున కనుగుణమగు
నెడ వసింపఁగ మనమున నిచ్ఛగించి
కురుమతిగిరీంద్రకందరాంతరమునందు
నిందిరాదేవితో వసియింపఁబోలు. ౫౩

క. వారణభీతినివారణకారణతయుఁ బుండరీకకనదక్షియుగ
శ్రీరుచినీలత గల హరి నారసి జను లభయమొందు టబ్రముగాదే! ౫౪

ఉ. శ్రీలనెసంగుకుర్మతిగిరిన్ గుహలోన మురారియన్ మహా
నీలము పుట్టె, నిద్ది గణనీయమొ కాదో యటంచు నెవ్వఁడో
లోలత క్షీరవారినిధిలోఁ బడవైచి పరీక్షజేసెఁగాఁ
బోలును, గాకయుండిన సముద్రమునం దెవఁడుంప నేగెడున్! ౫౫

సీ. కలసి కన్గవనించు కారుకమ్ములతోడ నెవనిమేనిపసారంగు లెదిరిపోరుఁ
దళతళత్తళమించు తమ్మిరేకులసంచు లెవనికన్గవదీవు లీసడించుఁ
దొలిపల్కు చివరపల్కులచేత జడదారు లెవనిపేరులు జపియించుచుండ్రు
నిప్పచ్చరముఁబాపు నేర్పుగల్గినబోటి యెవనిపేరురమునం దెసకమెసఁగు

తే.గీ. నాతఁ డుపకారపరుఁడు దివ్యావతారుఁ
డనఘుఁ డతులుం డనంతుం డఘాపహారి
హరి వసించెను గుర్మతిగిరివరమున
భక్తసంరక్షణైకతత్పరతఁదవిలి. ౫౬

ఉ. ఈగిరికూటమందుఁ జరియించుఘనమ్ములు పిల్లనంతఁ దా
మేగుచు డించివోవఁ దన కేగ సహాయములేక గహ్వరం
బేగతిగా వసింప జను లెల్లరు శ్రీపతియంచుఁబల్కి, రీ
లాగునఁగాకయున్న నెటులన్ హరియించు నితండు తాపముల్? ౫౭

క. హరి తనదక్షిణకరమున ధరియించినచక్రమున్ బుధతతి గని గుహాం
తరగతతిమిర మడఁపఁగ మిహిరు ధరియించె నతఁడనుచు నెంచు నుతించున్. ౫౮

తే.గీ. తరచు కలియుగమందుఁ గాంతలను శిరము
లందుఁదాల్తురు పురుషు లటంచుఁ దెలుప
శ్రీనివాసుండు తనకూర్ధ్వశిఖరమందు
సిరిని వసియింపఁజేసి రంజించుచుండె. ౫౯

చ. సిరి తన పెండ్లివేళ మునిసింహులు భర్తృశిరమ్మునందు నా
దర మెసఁగన్ వసింపుమని తద్దయుఁ బల్కినమంత్రమున్ హృదం
తరమునను౦చి సార్థక మొనర్పఁ దలంచియ కాదె! కుర్మతీ
శ్వరునకు మీఁదిభాగమున వాస మొనర్చుచునుండె నెంతయున్. ౬౦

తే. గీ. విపులమగు వక్షమునఁ గొంతవిడిది తనకు
హరి యొసఁగినంతమాత్రనె సిరి క్రమమ్ము
గా శిరముమీఁద నెలకొనెఁ, గమలనయన
లించుకేనియు మదిసంశయింప రహహ. ౬౧

తే. గీ. అందమైనట్టిభార్యలయందుఁ గడు పు
రాణపురుషుల కత్యాదరంబు గలుగు
ననుచు సూచింపఁ దనశిరమందు శౌరి
యించువిల్కానితల్లి నెక్కించుకొనియె. ౬౨

ఉ. లాతిసరోజనేత్రల విలాసము లెక్కడ! నిందిరావయ
స్స్థితతనూవిలాసముల బింకము లెక్కడ! మున్నుదా జగ
న్మాతృకయయ్యు మేరుపటిమందగు గుబ్బలనొప్పుటన్ గదా
యాతరుణిన్ ధరించె శిరమందు ముకుందుఁ డమందరాగుఁడై. ౬౩

ఉ. శ్రీయును నీళయున్ ధరయుఁ జేసెడికయ్యములన్ నివారణన్
జేయఁగ నేర్పుగల్గియును జీటికిమాటికిఁ బంతగించున
త్తోయజనేత్రలన్ విసువుతో విడనాడఁగఁబోలుఁ, గానిచో
స్వీయపదమ్ము వీడి నివసించునె శ్రీహరి కందరస్థలిన్? ౬౪

మ. హరివక్షోమణి దన్నుఁగాంచి సిరి యన్యభ్రాంతిచేఁ గోపగిం
చి రహిన్ స్వీకృతహస్తుఁడైనయతనిన్ జింతింప కయ్యద్రిపై
కరిగెన్, నేలు దెమల్ప నూర్మికలసొంపారున్ మణుల్ దుల్లెనాఁ
గర మొప్పారుఁ దదంతికస్థలగతాఖండప్రదీపావళుల్. ౬౫

మ. మననాథుండగు శేషభూధ్రమెపుడున్ మన్నించునావిష్ణువి
చ్చ నిటన్ గందరమందు నుండెననుచున్ సస్నేహులై నాగకా
మిను లత్యచ్ఛదశామిషమ్ముగొని పేర్మిన్ దమ్మెరన్ దూగుదీ
పనికాయంబను శీర్షరత్నముల సంభావింతు రశ్రాంతమున్. ౬౬

ఉ. ఇందిర యేకతంబ వసియించుట కేమి కతంబటంచు గో
విందునిగన్గొనంగ శశి వేగిరపెట్టఁగఁ బోయి యచ్చటన్
బొందుగనున్న తారకల పోలిక దీపములొప్పఁ బేర్మిమై
నందఱకు న్నివేశమగునట్టివ పుట్టినయింటిస్నేహముల్. ౬౭

చ. ఇట వసియించునీతఁడని యిచ్చితి రత్నముతోడఁబుత్రికన్
గటకట! యేడకేగెనో? కన్గొనుఁడీయని యబ్ధి పంప న
చ్చటికి కరుదెంచినట్టి మణిసంఘము నాఁజెలువారుదీపపున్
బటలము, లెన్నఁడేని దళమగ్రహముల్ కృతముల్ దలంతురే. ౬౮

క. చిరకాలం బగ్గిరికందరమున వసియించుచున్ ముదమ్మున హరి ని
ర్జరులును నరులు నొసర్చెడి పరమోత్సవములకుఁ దృప్తిఁ బొల్పడియుండెన్. ౬౯

చ. తిరుమలయందుఁ జెన్నలరు దేవుఁడె తానిటఁ బేర్మిఁ గుర్మతీ
శ్వరుఁడయి యుండెనంచును బ్రజల్ కడుభక్తి దలిర్ప మ్రొక్కు ల
క్కురుమతిపర్వతేంద్రమునకున్ జని యర్పణజేతు, రాతఁడున్
వరములనిచ్చి మన్చు ద్విగుణంబుగ సంతసమొప్ప వారలన్. ౭౦

క. హరిచరణాంభోజములు నఖరవిధురేఖికల నేమిగతిఁ జెందెనో రా
తిరియంచు నుదయమున రవి కరముల లాలించుచుండు గారాబమునన్. ౭౧

వ. అంతే.

తే. గీ. దిఙ్ముఖంబుల మేఘముల్ తేజరిల్ల
నీపసర్జముకుళములు నివ్వటిల్ల
విరహిజనులకు తాపముల్ విస్తరిల్ల
మాసరములయ్యె వర్షర్తువాసరములు. ౭౩

క. ధరణిఁ బయోధరముల కంబరమాచ్ఛాదనము సర్వమతమైతగు, నం
బరమునకుఁ బయోధరములు కరమాచ్ఛాదనములగుట గడుఁజిత్రమగున్. ౭౪

ఆ. ఎచట నగ్నియుండు, నచటనే తాపంబు సంభవించు టఖిలసమ్మతంబు
మెఱుపు మేఘమందు, నొఱపు వియోగుల యందు సంభవించు టరుదుగాదె. ౨౫

క. ఘననీలాశ్వములఁ బ్రభంజనుఁడను సాదిపతి కేలఁ జంచలలను చ
క్కని కనకకశలఁ గొని ప్రేరణజేయఁగ ధాగ లంబరమున నొనర్చెన్. ౨౬

ఆ. ఘనము లంబురాశిఁ గలముత్తెములు గొని కరకమిషమునను జగమ్ము ముంప
వాని నన్నిఁటిని జవంబున మ్రింగినకతన భూమి రత్నగర్భయయ్యె. ౨౭

ఆ. జలధిజలముద్రావి జలదముల్ వర్షించు టు విశేషమగును గాని యొకట జలము
ద్రావినట్టి విరహితతిలోచనములు నీరమ్ము నించు టనుచితమ్ముగాదె. ౨౮

క. అబలాపయోధరములఁ గనఁబడు ముఖాగ్రములయందు నైల్యం, బిది చి
త్రిబహుళ మెల్లెడ నైల్యము ప్రబలెన్ వర్షాపయోధరమ్ముల కెలమిన్. ౨౯

తే. గీ. అరుణకిరణాత్త గర్భయై యంబుదాళి
యింద్రగోపమ్ములను గనె నెసక మెసఁగ
నెవఁడు గర్భంబొనర్చెనో యింతి వాని
కనుగుణమ్ముగ పుత్త్రుని గనుట యనదె. ౩౦

తే. గీ. ఇంద్రచాపమ్ము బూని ఘనేంద్రుఁడు శర
సమదయమ్మున భూధరసమితిఁ బొడువ
విరహిజనమానసమ్ములు విదళితంబు
లయ్యెనను టెంతయు విచిత్ర మనఁగరాదె. ౩౧

క. ఘనతరగర్జానినదంబునఁ దగు కాలాభ్రపటలముల జలము పురా
తనవాపీకూపనదీఘనసరసీతతులఁ బూర్తి గావించె వెసన్.

తే. గీ. అనుగతతృణాంకురమ్ముల నలరి గిరులు
పులకితశరీరులగు కాముకులను బోలె ;
భువి పయోధరసంపర్కమున మఱెంతె
కఠినుఁడైనను మోదసంగతుఁడు కాఁడె. ౩౨

తే. గీ. నభమునందు విధుండు ఘనచయసంకు
చితమహస్కతఁగాంచె నా ఋతువునందు
నభమునందు విధుండు ఘనపరిచితమ
హస్కుఁడైయొప్పెఁ గురుమూర్తి యందు భళిరె. ౩౩

తే. గీ. కోటితులసిదళార్చనగొని కురుమతి
పతి యతులమోదగరిమచేఁ బరిఢవిల్లె
విపులసంతర్పణములచే వేనవేలు
బాపనయ్యలు సంతోషభరితులైరి. ౧౨

ఇది శ్రీకింకవీంద్ర ఘంటాపంచానన విద్వత్కవి బాలకళానిధి
బాలసరస్వతీ శతావధాని తిరుపతి వేంకటేశ్వరులచే
నాంధ్రీకృతంబగు శ్రీనివాసవిలాస
మ్మునఁ బ్రథమాశ్వాసము.



శ్రీరస్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్రీనివాసవిలాసము

## ద్వితీయాశ్వాసము



లలి నీబాలకు నేలెద
నలయ కెపుడు నేన నేన యనియెడి లక్ష్మీ
లలనాకుర్మత్యద్రీ
శులపల్కులు సోమభూపసుతు రక్షించున్. ౧

క. కరిరాజగమనలగు నిర్జరదానవసిద్ధమర్త్యచలనేత్రలకున్
మరుమురిపెములన్ గఱపెడి శరదృతు వేతెంచె నంత సంతస మొసఁగన్. ౨

చ. మొదల రజస్సు గాంచి, జలముక్సఖు లంతట నీరువోయ, నా
పిదప శిఖిద్విజోచ్చరితవేదవిధిన్ శుచియై, కృషీవలుల్
గదిసి యొసంగు బీజగతి గాంచి, యొసంగెడిగర్భమంది, భూ
మదవతి గాంచె సస్యశిశుమండలి నెల్లెడ నింపుమీఱఁగన్. ౩

మ. సరసోజ్జృంభితసప్తపర్ణకదళీసౌరభ్యగర్భాపత
ద్మరుదుజ్జృంభణసుందరంబగు శరత్సంపత్తి వ్యాదీనవో
త్కరమున్ దన్వెను శుభ్రతారకను రాకాచంద్రవక్త్రన్ సదం
బరరారాజిపయోధరన్ గనిన నెవ్వాఁడైన నానందియౌ. ౪

తే. గీ ఏడుదళములుగల్గు చెట్లే వికాస
మంద, వంగయు వేయియు నమరుమనము
కుట్మలాకృతి గాంచఁదగు నె యనుచు న
సహనమునఁ దమ్ములుఁ వికాసమునఁ బొలిచె. ౫

కం. శారదనీరదవారము స్ఫారోత్కటరాజశాబచయమునఁ బరఁగెన్
దారలు తన్ముఖవిదళితనీరదపృషన్నికరములన నెగడె న్నిశలన్. ౬

తే. గీ. నయనపథగతి గాంచె మానసనివాస
మైన హంసగణంబు మర్త్యతతికెల్ల
సారసంబులు ఒగ సరసములునగుచుఁ
దనరెనను టెంతయును విచిత్రమ్ముగాదె. ౭

తే. గీ. కలితకాదంబినీసమాఖ్యను దనర్చె
నాకసం బంతదనుక నటంచు నెంచి
మత్సరంబొందినదివోలె మహియు నపుడు
కలితకాదంబినీసమాఖ్యను దనర్చె. ౮

శా. గాలిం దూలిన సప్తపర్ణకదళీకర్పూరరాశిన్ శర
త్కాలాభ్రప్రకరంబటందురు, తదుద్యత్సౌరభీచారుధా
రాళోల్లాళికదంబకంబు సురమార్గంబందురు, కాకున్న నే
లా, లాభించు సితాభ్రనామము, ద్విరేఫాభిఖ్యయున్ గంటికిన్ ? ౯

చ. లలితవనీకదంబముకుళంబుల నీశరదాగమంబు ము
చ్చిలి నిశలందుఁ బైటఁబడఁజేసినఁ దారకలందురుగాని, రి
క్కలయిన నొక్కఁడేని దివిఁ గ్రాలదె వార్షికరాత్రులందు ? దొం
గలు ఘనులైన నేమనరు గాని బయల్పడకుండ శక్యమే. ౧౦

సీ. శ్రీలీలఁదగు వానకాలమ్మునందు మేఘములెల్ల వార్ధిన్ చక్కటికిఁబోయి,
కడుపార నచట ముక్తామణీజాలంబుతోఁగూడ నీరమ్ముద్రాగి, పిదప
నీరమ్ముమాత్రమే నేర్పుమైఁ గురిసి, ముత్యమ్ములు కడుపులో దాఁచికొనినఁ
గడుపులోనున్న చక్కని ముత్యములకాంతి శరదాదిధవళిమ సంభవించె

తే. గీ. గాలిచే లోనిముత్యము ల్గదలి నాల్గు
ప్రక్కలకుఁ బర్వ, వానిని రిక్కలందురు
దానిచేతనకాదె యబ్దములకెలమి
సర్వతోముఖముక్తాప్తి సంఘటిల్లె. ౧౧

తే. గీ. డంబుమీఱెడి శరదాగమంబు మేది
నీతలంబు సదాకాశనిర్మలంబు

సలిపి శ్రీరాజహంసర్క్ష చంక్రమణము
దగ ఘటింపఁగఁజేసెఁ జిత్రమిది కాదె. ౧౨

క. శరదృతుపురుషుండు ఘనాకరముం బెకలించి యుష్ణకరరత్నము నం
బరమను సాన నొఱపి వాసరలక్ష్మీవదనమున కొసఁగెఁ దిలకముగన్. ౧౩

క. ఘనఘూమేగమ్మదవహ్ని ని మెఱుపను పైఁడికణిక నెఱి కరఁగియ యీ
యినకలశ జేసెను శరత్కనకకరుఁడు ; దానఁ గాదె కనఁబడదదియున్. ౧౪

సీ. తామసీముఖమరుద్దళితసప్తచ్ఛదచ్ఛదధూతకర్పూరసంచయంబు
ఖండంబులై నలుగడలఁబర్వినఁగాంచి తారకాగణముగాఁదలచుచుంద్రు
సంధ్యానలప్రభాజ్వలితమ్ములైన తత్ఖండమ్ములవి యుషఃకాలమందు
సాంద్రదీప్తులచే నెసంగఁ దచ్ఛిఖలను బాలార్కరుచులుగాభ్రమియుచుంద్రు

ఆ. అట్లుగాకయున్న నాప్రభాతంబు నంబరమునందెసంగు భసముదయము
నందు నొక్కరిక్కయైనఁ మందునకైనఁ బట్టపగటఁ గానఁబడకయున్నె. ౧౫

తే. గీ. నష్టమైనట్టి శాదముల్ నదులయొడ్డు
నందుఁ బ్రబల గఁజొచ్చె నాయావదులను
దాఁటు నరులఁనుదాఁటింప దాశవరులు
తత్తటమ్ములనుండి రెంతయుముదమున. ౧౬

తే. గీ. హంసపుష్పంబు ఫుల్లపత్రాఢ్యమనగు
రుచినెగడునట్టి సారసనిచయ మొకఁడు
కరముజెలువారె సరసీనికరములందు
ననుభవించె సుఖం బచటచట నొకఁడు. ౧౭

తే. గీ. పొలములం దెల్ల మొలచి యింపునుఘటించు
దూర్వ లమరమణీరుచుల్ దొంగిలించెఁ
గాకయుండిన నల తృణగ్రాహిమణులు
పట్టిపాలార్చనేల దూర్వలనుదవిలి. ౧౮

చ. మనమగఁడైన వారిధి సమంబుగ నందఱఁ జూచుచుండె, వీ
నిని వశఁజేసికోవలయు నేనతివేగమ పోయి యిప్పు డం
చును బలువానలం జని వశన్ బొనరింపఁగలేక తక్కె, పె
ల్చనఁ జనసాగె నేరులు ప్రసన్నతయొప్పఁ బ్రియుం గనుంగొనన్. ౧౯

క. ఘనసమయయామినీముఖమునఁ దటినులు జలధికాంతు మొనసితనుత్వం
బెనసియు నింపునఁ దగె రతమున నలసినముగుద తనిమముదమొసఁగుఁ గదా ౨౦

తే. గీ. అరసిచూడుము వరసారసారసంబు
నెదురుచదివిన ప్రాగ్రీతి వదలదనుచు
నెంచి దంపతులెల్ల యోజించి మించి
యెంతయును సంతసమ్మున నెసఁగి రపుడు. ౨౧

క. కడు నెలిమబ్బులుగలతటిఁ బుడమిం జొప్పడు కురుమతిభూధర మల పా
ల్కడలిం ద్రచ్చెడుతటిఁ బెన్ బుడగలఁ దనరారు కవ్వపుందరిబోలెన్. ౨౨

తే. గీ. తెల్లమబ్బులు దివిఁ గొన్ని నాళ్ళు జెలఁగి
పేరుమాసిన రాఁబోవు కారుకమ్మ
లకును విత్తులు గూర్చి కాలం బవంగఁ
గళ్ళముల మాపములరాను లుల్లసిల్లె. ౨౩

తే. గీ. ఎసఁగఁ దిలరాశి తా నభోవృత్తమగుచుఁ
బూతమగుచును గుంచితముఖమునగుచుఁ
గాంతమగుచును ఖలభువి గానుసింపఁ
దిలకసమమని గ్రహించి రెలమిజనులు. ౨౪

మ. లలి నన్యోన్యముఁ జూచునిచ్చ నిదురల్ రానీక రాగంబు క
న్నులలోఁ జొత్తిల శయ్యలం బొరలుటన్ నున్మ్రుంగురుల్ జాఱ రా
ణులుగావించిరి నూత్నదంపతులు పుణ్యంబైన యభ్యంజనం
బలరారంగఁ జతుర్దశీముఖమునం దత్తింటి కత్యంతమున్. ౨౫

మ. 'అనుసంవత్సర మేగుదెంచు కురుమత్యద్రీణ్మహాం బేగుదెం
చెనో, లేదో' యని చైత్ర మాదిగ నెలల్ చేవ్రేళ్ళన్ సాచి 'యే'
డని భూకామిని లెక్కవెట్టి కపురం బాస్వామి కర్పింపఁబూ
నెనో నాఁ జొప్పడె సప్తపర్ణముల నన్నింటన్ సితాభ్రచ్ఛటల్. ౨౬

సీ. స్వాతితారాభ్యంజనాతినిర్మలములై మేనికాంతులు మిఱుమిట్లుగొలుప
నొకరి నొకళ్ళు చూచుకొనుతలంపునఁ గులుకు చూపులసౌరు మొలకలెత్తఁ
దడియార్చి కొనలందు ముడివైచిన శిరోజముల జారుముడి మేలిచెలువుఁ జూపఁ
గరమూసిగ్గునఁ బరస్పరలోచనాంతప్రసారమ్ము లొకకొంత సంశయింప

తే. గీ. క్రొత్తదంపతు లెల్లరు నత్తవారి
యిండ్లలోపల సంతోషమినుమడింపఁ
జెలఁగి రెంతయు సంతతశ్రీల సొబగు
దనరు దీపావళీమహోత్సవమునాఁడు. ౨౭

సీ. విత్తనంబులు నాటి యుత్తమభూమియంతయుఁ బంటపండి ముదమ్ముగూర్చె
గోవులన్నియు నీని కోమరారు తమతమ తర్ణకమ్ములఁ బాలఁ దనుపుచుండె
వర్షానిలము లేక వఱలు భాస్కరకరకాంతు లత్యంతతీక్ష్ణంబులయ్యెఁ
దమ్మిపూవుల తావిఁజిమ్ము తెమ్మెరలచేఁ గొలఁకులన్నియు మంచికులుకుఁజూపె

తే. గీ. రాత్రియంతయు రత్యుపరతులఁ దనిసి
యుదయమయినను గౌఁగిలి వదలలేక
త్రిదశగణములకైన వారింపరాని
వితతసుఖములఁ గనిరి దంపతులతతులు. ౨౮

ఉ. క్షారజలంబు ద్రావిన రసజ్ఞులసౌ రుడివోవ నెంచి, త
న్నీరములం ద్యజించి, యవనిన్ దగునాలకుఁ బుట్టి, తత్పయః
పూరము గోవులు భారమునఁ బూర్వనివాసముఁ జేరలేని త
ద్వారిధరమ్ములో యనఁగఁ దర్ణకముల్ చెలరేఁగె గంతులన్. ౨౯

తే. గీ. మాలతులయంద వర్షాగమమ్మునందు
సితిమ జెలువారె, నిఁక శరదృతువునందు
జలదజలజాబ్జకాశహంసమ్ములందుఁ
దొగలయందును వేయిరెట్లుగఁ జెలంగె. ౩౦

సీ. వలమానధళధళప్రభమీఱు మురిపెంపుటంబుజావళి దుకూలంబుగాఁగ
వికసత్ప్రసవగుచ్ఛవితతవల్లీవిశేషములు చక్కనికంచుకములుగాఁగ
సంపూర్ణహిమరశ్మిచంద్రికాసారంబు దనరారు మంచిగంధంబుగాఁగఁ
దారకాపఙ్క్తు లుదారమ్ములైన వజ్రాలఁ జెన్నారు హారములుగాఁగ

తే. గీ. సప్తపర్ణపరీమళ సరసకాశ
సూనశోయనీయముల దిశామానవతులు
మమతమీఱఁగ శరదాగమంబుతోడఁ
గ్రీడసల్పిరి మరుని సాక్షిగనొనర్చి. ౩౧

వ. ఇట్లు శరదాగమంబు సమస్తజంతుసంతోషకరంబై చెలంగు నెడ సమస్తరక్షశ్శిక్షణవిచక్షణుండును, మానాధికనిజమహిమరశ్మిప్రతానసమాకృష్టసమస్తధరామండలనరవరుండును, విశ్వంభరుండయ్యు నానేతు హైమాచలాయాతమనుజకృతసపర్యల నువ్వెత్తుగా గ్రహించుటయం దసమర్థుండునుంబోలెఁ గొండొక దివ్యమంగళవిగ్రహంబు ధరియించి కురుమూర్తిధరాధరకందరాంతరాళమ్మున విహారమ్మంగీకరించి భక్తజనకృతసపర్యలం గ్రహించుచు మహావరమ్ము లొసంగువాఁడును, శేషాచలభూషామణియు నైన శ్రీమన్నారాయణు సంవత్సరదివ్యపాదుకాస్వీకరణమహోత్సవసమయంబు సంప్రాప్తంబగుటయు నలుప్రక్కల హృదయాంతరసముద్వేల్లదుల్లోలకల్లోలకుతూహలజలధులగు భక్తనివహములు పరివేష్టింప సుధావిలేపనప్రభాభూషితంబగు నక్కురుమతినగంబు. 3౨

క. వెన్నునకుఁ దానకంబై పన్నగగిరి జగతి యశముపడసెనను ననూ
య, న్నారాయణు నెలవై యున్న తుహినశైలరాజమోయనఁ దనరెన్. 33

వ. మఱియు నంతరాంతరావిరచితమ్ములగు ధాతురాగశిలామయపట్టమ్ముల దట్టమ్ములగుగండశైలమండలంబుల మండితమ్మగు నక్కొండ కొండల నూడు తనసోదరుండగు పుండరీకనయను నుత్సవంబున కనుప నలంకృతావయవతనయమండలసహితంబై వచ్చిన సురగజంబునాఁ దనర్చె.

సీ. నలవైరికరబృందములఁ గేరు చామరద్వయముచే సేవింపఁబడెడువాఁడు
జలజాప్తమిత్రమై చెలువారు పైఁడిగొడుగు మాళి నై సేయ నెగడువాఁడు,
గిరికిఁ గ్రిందను మీఁదఁ జరియించుచును నుత్సవము సేయఁగాఁ బొందుపఱచువాఁడు
నిజపరాక్రమసరసిజమిత్రశిఖయనఁ బైఁడిబెత్తము చేతఁ బట్టువాఁడు

తే. గీ. నైన శ్రీహరిసేనాని యద్భుతంపు
బుద్ధిమెఱయఁగఁ గార్తికశుద్ధపక్షు
ప్రథమదినమున శ్రీశోత్సవంపుఁ బనుల
నలవరింపఁగ గిరిక్రింది కరుగుదెంచె. 3౪

వ. ఇట్లు పఱతెంచి భగవదాజ్ఞానుసారంబుగా భగవంతుండగు నావిష్వక్సేనుండు కురుమూర్తిశైలస్వరూపదర్శననిశ్శంకసమంకురితానందంబును దూరోద్ధూతవినతాఖిలజనతాతంకంబగు భగవద్దివ్యోత్సవంబున కభిముఖుంబునగు భక్తగణంబుం గనుంగొని యిట్లనియె. 3౫

తే. గీ. ఈదినము మొదలుకొని మీరేడుదినము
లాదరాయత్తచిత్తులై యలరవలయుఁ
గురుమతిస్వామియుత్సవం బరుగుదెంచెఁ
గాన జాగ్రత్తనుండుఁడు భక్తవరులార. ౩౭

సీ. మృత్కూటములు ద్రవ్వి యొసఁగఁజేయఁగవలె విషమోపలము లేఱి వేయవలయు
పుష్పోపహారముల్ పొసఁగఁజేయఁగవలెఁ గంటకంబుల నేర్చి కాల్పవలయు
తోరణమ్ములసౌరు మీఱఁ జేయఁగవలె జెండాలచేఁ గొండ నిండవలయు
ధరణియంతయు సరాసరిజేయఁగావలె లలి మంటపముల నింపొలయవలయు

తే. గీ. ననుచు శ్రీహరి సేనానినైన నేన
యానతిచ్చుచున్నాఁడ నఖిలజనుల,
కెవ్వఁడేని మదీయాజ్ఞ కెదురువాఁడొ
వానికై వేత్రమిది పనిబూనియుండె. ౩౮

వ. మఱియు దుందుభులఁ దాడింపవలయు, జయశబ్దమ్ము లుద్ఘోషింపవలయు, రంగవల్లికల సింగారింపవలయుఁ, బర్ణశాలలం గైసేయవలయు, భగవదాగమనమార్గమ్ములు తడిపి బాగుజేయవలయు, నగురువత్తు లంటింపవలయు, సేసలు చల్లవలయు, నుత్సవసంభారమ్ములు సన్నద్ధపఱుపవలయునని చెప్పిమఱియును. ౩౯

సీ. కలవానికన్నఁ జుక్కలరేనికన్న నగ్గలమైనసిరిరూపు లొలయువాఁడు
కురుమూర్తిగిరినాథు కరుణాకటాక్షంపు నిగ్గులకై చేతులొగ్గువాఁడు
అమరావతినిఁ గేరనగు వైభవముమీఱు నాత్మకూర్పర మేలనైనవాఁడు
తనకొల్వు నొనరించు జనులపైఁ గరుణ నిగ్గులుబేఱు శుభదృష్టిఁ జిలుకువాఁడు

తే. గీ. సురలయెడ భూసురులయెడ సరసమయిన
భక్తిగలవాఁడు ముక్కరవంశవర్ధ
మానుఁడైన సీతారామ మానవేంద్రుఁ
డనుపమానగుణవార్ధి నలరువాఁడు. ౪౦

సీ. ఏరాజు ధారుణీభారంబు వహియింపఁ జిల్వరాయనికిఁ బైచేయియయ్యె
నేరాజు వితరణ స్మృతిలోనఁ గర్ణున కవల నేడాకు లెక్కువపరించె
నేరాజు సంగ్రామహారాశిలోన నోలలనాడ గాండీవి తలకుదాఁకె
నేరాజు కవులచే గౌరవంబువహింపఁ గృష్ణరాయలకు దుష్కీర్తివచ్చె

తే. గీ. నతఁడు తనరారు సేహాసమాగతౌమి
తావనీపాలజాలశిరోవిరాజ
మానమాళిపద్భారవిమహితలలిత
పాదకమలుండు సోమభూపాలసుతుఁడు. ౪౧

క. ఆనరపతి కీయుత్సవ మే నెఱిఁగించితి నటంచు నెఱిఁగింపుఁడు మీ,
రేనరిగెదనని విష్వక్సేనుఁడు శ్రీకాంతుదరికిఁ జేరినపిదపన్. ౪౨

వ. భక్తవరు లా యుత్సవోదంత మానరపతికి విన్నవించి తదాజ్ఞావిరచితశ్రీనివాస మహోత్సవసంభారధురంధరులై నిఖిలజనతోషణంబగు మహోత్సవోన్మేషణంబున కెదురుచూచుచున్నంత. ౪౩

తే. గీ. హరికరసతతవసతిచేఁ బొరసిన జడ
తను విడువఁదలఁచి హరిభవనమునుండి
వెడలి చక్రము నరతతి వెలయు కురువు
తిగిరి శిరమునఁ దిరిగెనాదినమునందు. ౪౪

ఉ. నాసిరి దొంగిలించి శరణంబగు శ్రీహరికేల వాసముం
జేసి మదించెఁ, జేకుఱక చేకుఱె నేఁటికి నాదుభాగ్యముం
జేసి యటంచుఁ జక్రమును శిక్షయొనర్ప నహస్కరుండు వేం
చేసినరీతి నొప్పె మణిచిత్రితమైతగు ఛత్ర మత్తఱిన్. ౪౫

చ. నెలనెలతుం గలావితతి నించి ననున్ బ్రదికించుచున్న నె
చ్చెలియని చక్రముం దలఁచి శీతకరుం డరుదెంచెనాఁగఁ జె
న్నలరెనుఛత్ర, మట్లు కుముదాప్తుఁడు రాకయొయున్న నాఁడు మ
ర్త్యులకెటు గానరావు దివిఁ దోయజశాత్రవబింబసంపదల్! ౪౬

శా. తేజశ్చాలిరొకాని దుస్సహకరాప్తిం జూడనీయండు నీ
రేజాప్తుండని లోకులెన్న నపకీర్తిం బాయఁగా నెంచి నీ
రేజాప్తుండు సుదర్శనత్వమును బేర్మిం గాంచె; లోకంబునం
దేజం బెన్నరు దోష మెంతురుగదా తేజస్వులందున్ జనుల్! ౪౭

తే. గీ. హరికరప్రాప్తి లేక సౌఖ్యంబుదక్కి
చక్రములు వంతఁగొనఁగ నీచక్రమొకఁడు

హరికరప్రాప్తి లేకయు నతులగతులఁ
దవిలి చెన్నారుటిది విచిత్రమ్ము గాదె. ౪౮

మ. గురుదుర్గ్రాహబలాతిభారకలనాక్రూరంబులౌటం బర
స్పరముల్ భేదములేక చెన్నలరెడుం జక్రంబు నక్రంబునం
చు రహిన్ లోకులు వల్కు నీచసమతాసామ్యమాహాత్మ్యమ్మునం
గరిరాజున్ బ్రదికింపఁ జక్రమిది వేడ్కం జంపె నానక్రమున్. ౪౯

సీ. పరిచారకులు భక్తిగరిమచే మెల్లమెల్లనఁ జామరలు వీవ లలితమగుచు
రమ్యంబులగు గిరి ప్రాంతమ్ములను గాంచి గాంచి యానందసంకలితమగుచు
వందవందలమంది వచ్చి యిచ్చుసపర్య గొనఁగఁ జంద్రానమాకలితమగుచు
నీరేజబహుళమై నెగడుపుష్కరిణి చెంతలను బునఃపునశ్చలితమగుచుఁ

తే.గీ. గొంతవడి భక్తజనులకు సంతసం బె
సంగ విహరణమొనరించి చక్రమంత
సకలసజ్జనఘనమనశ్చారియైన
కురుమతిశ్రీనివాసుని గుహకుఁజేరె. ౫౦

చ. హరిదివినుండి చక్రరుచిక్కై చనుదెంచి హరింపఁ బైపయిం
దిరిగియుఁ జాలలేక యది నీరజనాభుకరంబుఁ జేర నా
హరివలనన్ భయమ్మున గుహన్ జొరఁజాలక బైట నిల్చి రు
ఘ్మరణములేమి సంకుచితుఁడయ్యెననం దగె ఛత్రమత్తఱిన్. ౫౧

తే.గీ. ఏనుబ్రాణమ్ముతో నుండఁగానె నాదు
శత్రువగు చక్రము గని సచ్చక్రములు మ
హారుచిం గాంచి చెన్నారె నౌరయంచు
మిహిరుఁ డసహనమున నస్తమించె నంత. ౫౨

సీ. కరిరాజు మున్ను నక్రముచేత గాసిఁజెందిన జాలిఁజెంది కాచినఘనుండు
ద్రౌపది మును ధృతరాష్ట్రాత్మజుల బారిబడినఁ బ్రోచిన దయావారిరాశి
కాకంబు మును తనకాంత కెగ్గొనరించి శరణన్నఁబ్రోచిన సత్తముండు
అసురపుత్త్రుని మున్ను కసిదీఱ బాధఁజెందింపఁ గాచిన జగతీకుటుంబి

తే.గీ. యయిన కురుమతిగిరినాథుఁ డాదరమున
గుహవెడలి రక్ష్మనుచు వేఁడుకొనెడి భక్త

లోకవిజ్ఞాపనంబు లంగీకరించి
పల్లకీలోనఁ దనపదాబ్జంబువెట్టె. ౫౩

చ. బిసరుహలోచనుండు సరవిం జిరకాలమునుండి నాయెడన్
వసతియొనర్చి వేడుక నెపమ్మున నన్నుఁ ద్యజించెనంచు మే
ల్పసిఁడిచెరంగులు న్నగలు పైని ధరించి గుహామతల్లియున్
బసగొనివచ్చెనా శిబిక భాసిలె హేమవితానయుక్తమై. ౫౪

తే.గీ. ఉపనిషత్కాంతమాళిపై నొప్పు నీల
మును గొని యెవండొ హేమసంపుటమునందు
దాఁచెనన నీలనీరదధాముఁడైన
శ్రీహరి చెలంగె బంగారు శిబికలోన. ౫౫

క. బంగారు పల్లకీలోనం గాలపయోదసముఁడు నళినాక్షుఁడు స్వ
ర్గంగా హేమసరోజమునంగల భృంగంబునాఁ గనంగానయ్యెన్. ౫౬

క. లలనలకరముల నటనము సలిపెడి వింజామరలు లసత్తన్నుఖవ
జ్రిలలితధారాయితరోచు లనెడుభ్రాంతిం దనర్చెఁ జూచుజనులకున్.

తే. గీ. పసిఁడిగుబ్బలిసామియం దెసక మెసఁగు
జలదము శిఖావళీములకు సంతసం బొ
సంగుగతి పైఁడి శిబికలో రంగుమీఱు
హరి నరులకెల్ల సంతోషగరిమనించె. ౫౮

తే. గీ. మదధినాథకమై తగు సుదినమందుఁ
గురుమతిస్వామియుత్సవం బరుగుదెంచె
నంచు మదినెంచి సన్నెహుఁడగుచు దీప
రూపములు గాంచి యనలుండు రూఢిమెఱసె. ౫౯

ఆ. వె. క్రొత్తరెల్లుఁబువ్వు కొమరుగల్గిన చామ
రములగాలి యంబరమునుదోలఁగఁ
జేయ శిబికనుండి శ్రీహరి దిగె నంత
భక్తకామదానపటిమ మెఱయ. ౬౦

తే. గీ. జగతియను వార్ధియందు భుజములను తరఁ
గలదొంతుపుచేతఁ బైకిఁ దెమలిన ఘుణు ల

నంగ దీపంబుగములు గావంగనయ్యె
నక్కుఱుమతిగిరీశ్వరానగ్రిమంగు. ౬౧

వ. తదనంతరమ్మున.

మ. ఆ నాగస్వామిహయుఁడు భవ్యదశమీవేదిన్ సపర్యాపరి
గ్రహసంతుష్టమనస్కుఁడై ముదము భక్తశ్రేణికిం గూర్చుచున్
గుహకుం జేరెఁ బునఃపునఃకలితదుందుభ్యాదితూర్యధ్వని
ప్రహతంబై ధరణీకటాహ మసమగ్రప్రౌఢి భేదిల్లఁగన్. ౬౨

వ. ఇట్లు ప్రథమదినం బతిక్రమించుటయు మఱునాఁడు,

మ. జలధిం జూతఫలంబటం చొకమణిం జర్చించి చర్చించి చేఁ
బలు దానిం గొనఁ బోయి వాలములతోఁ బల్మాఱు పోరాడఁ దోఁ
కలసమ్మర్దము పైకి మీటు, నది యాకాశంబు గై సేసెనా
బలభిద్దిక్కున సూర్యమండల మదభ్రశ్రీల నొప్పెందగన్. ౬౩

తే. గీ. ఉదయపూజల నర్చకుండొదవఁజేయఁ
గైకొనుచు భక్తులిడు కానుకలనుగొనుచు
సరసగాయకసంగీతసారవివశుఁ
డగుచు గుహలోన విహరించె నచ్యుతుండు. ౬౪

చ. మదహితరోచియైన మురమర్దనచక్రము వచ్చు నింక నం
తదనుకనుండి తచ్ఛిరమునన్ వసియించెద నంచు ఖంబుపైఁ
గదిసి యహస్కరుండు క్షణకాలము జూచియుఁ దన్మహోత్సవం
బెదకు భయంబొనర్పఁ జనియెం జరమాద్రిసమీపభూమికిన్. ౬౫

క. హరి మును మకరాకులపుష్కరిణీసంరక్షణంబుగావింప దయా
కరుఁడై పనిచినచక్రం బరిగెం దత్తటమునకు రయంబున నిపుడున్. ౬౬

తే. గీ. మిత్రమగు రవి పశ్చిమమేదినీధ
రమున కేగఁగ నేనుంట సముచితంబు
గాదనుచుఁ బంకజాక్షుచక్రంబు గుహకుఁ
జనియె భక్తు లొనర్చు పూజలను గొనుచు. ౬౭

తే. గీ. కురుమతీశు చక్రోత్సవం బరసి విఫలి
చిత్తయౌయున్న దినలక్ష్మిచేతినుండి

జాఱిపోయిన మేల్మిబంగారుతాళ్ళ
బంతియోయన భానుబింబంబు మెఱసె. ౬౮

తే. గీ. తపనబింబంబు గని తనతనయుఁడైన
కౌస్తుభ మటంచుఁ జరమాబ్ధి కౌఁగిలించు
కొనియె వీచీకరమ్ములఁ గోర్కె దీరఁ,
దల్లిదండ్రులు తనయవత్సలులు గారె. ౬౯

చ. పడమటికొండపై తరులపైఁ గలచిల్కలు నోట దాడిమీ
ఫలమని భానుబింబమును బ్రక్కలు సేయఁగఁ జిందినట్టి శో
ణ్కలనఁ జెలంగెఁ గావితళుకుం గులుకారెడి మేఘముల్, తదు
జ్జ్వలతరకాంతిఁ దారలు చెనంగెను బండిన గింజలోయనన్. ౭౦

తే.గీ. సోమబాలున కత్యంతసుఖము లొసఁగి
ప్రత్యహము వృద్ధినొసఁగు కుర్మతిన గేంద్రుఁ
డంచు నద్దేవు సేవింపనెంచి యంబ
రమున నాసోమబాలుండు రహిఁ జెనంగె. ౭౧

సీ. జనులందఱును సంతసమున నగ్రమునకుఁ దఱుమఁగాఁ జని యత్యుదారమగుచుఁ
గుర్మతీంద్రుని సేవకొఱకు వచ్చుచుఁ దోఁక బుజువుగా నొనరించి యెదుటఁబడిన
మవ్వంపుఁ జెలి మణిమయమయి యున్నతమయి యెత్తఁబడిన ఫణాంచలమును
దాదృశంబై యొప్పు తనఫణాగ్రమున మద్దాడుచుఁ దనతోఁక నటులసాఁచి

తే.గీ. యున్న యహిపతియన మణినన్నె కలశ
శిరమునఁ దగ రజతకవచితసువంశ
దండమున నొప్పి రజతవితానితమగు
శిబికపై నెక్కెఁ గుర్మతిశ్రీవిభుండు. ౭౨

క. సితరుచి కేఁదగిన కళాతతులన్ హరి యస్తమించుతఱి హరియను నా
దృతిచే దాఁచెననం గుర్మతినాథునియొద్దఁ జామరములు చెలంగెన్. ౭౩

సీ. తననేతయగు ధాత దినమునఁ గుర్మతిగిరిసాధుతిరునాళ్ళు జరుగుచుండె
నని యెంచి నీరజాసనునంచ సత్యలోకమునుండి దిగివచ్చి కాంచువేళఁ
దనరెక్కలను విప్పెననఁ నొప్పు సితతరచ్ఛత్రంబు తనప్రక్క సరసమైన
రుచులచేఁ దనరఁ జందురుం డుదయించి కించిద్దూరగతుఁడయి చెలఁగువేళ

తే.గీ. నుదయగిరి యుండుకీతి నెన్నఁదగు దివ్య
మైన చతురంతయానంబునందుఁ దనరెఁ
గుగుమతి శ్రీనివాసుండు సరసలలిత
దివ్యభూషణరుచి దశదిశల వెలుఁగ. ౭౪

సీ. చిరకాలమునుండి కరుణించి మనకు నిరాబాధమగు సౌధమై చెలంగు
కురుమూర్తిగిరియందు వఱలు రమేశాను దివ్యోత్సవప్రభ తేజరిల్లు
చున్నది, మనమూర కుపలభావము నొంది కానకుండుట మంచి గాదటంచు
గనినుండి వెడలి వికస్వరనూతనదీప్తుల రతనముల్ దీపములయి

తే.గీ. మెల్ల మెల్లన సోపానమేదినీగ
తంబయిన యంధతమసంబు దరలఁజేయ
స్వారిపేంచేసి కుర్మతిస్వామి కొంత
తడవు వేదికపయిని ముదమున నుండె. ౭౫

సీ. అప్సరఃకాంతల యందమ్ముగల వారచంద్రాననలు నాచుసలుపుచుండ
బ్రహ్మాండభాండమ్ము పగులఁజేయఁగఁజాలు భేరీరవమ్ములు బోరుకలఁగ
వారాశివీచికాధీరారవముగల్గు రంగజీవులపాట చెంగలింపఁ
బూజాపురస్కారములతోడ భక్తమానవులెల్ల వేడ్క నుత్సవముజూడఁ

తే, గీ. గొంతకాలము వేదిపైఁగూరుచుండి
సంతసముమీఱఁ గుర్మతిస్వామి యంతఁ
బల్లకీ నెక్కి లోచనపర్వముగను
గుహాకు వేంచేసె జనులకోర్కులు ఫలింప. ౭౬

వ. అంతట రుక్మిణియు సత్యభామయు మొదలగు నెనమండ్రుభార్యలతో నిత్యసుఖం
బు లనుభవించిన కృష్ణునియవతారంబగు శ్రీనివాసుండు మహోత్సవకలితయు
నద్వితీయయు నగు నేను జూచుచుండ దశమీ వేదిక నాశ్రయించెనను నసూయం
బోలె ద్వితీయయుఁ, జపలులగు పురుషులయెదుట నుండఁదగదని తృతీయాగమ
నకారణంబై చనుటయు. ౭౭

చ. ఉరగగిరీంద్రు కార్తికమహోత్సవకాలము వచ్చినరతేఁబోల్
గిరియనుకంబమునుంగొనఁ దగిల్చిన రశ్ములయం దుషోనరుం

దరుణతరపద్మభాలలితమై తగు దీపము వెట్టె నాఁగ భా
స్కరుఁ డుదయాచలంబున నెసంగెను మూఁడవనాఁటిప్రొద్దుటన్.

సీ. నతులొనర్చెడి మహామతుల కళాభ్రాంతమ్ము మేలుగూర్చెడిసామి! మేలుకొనుము
కురువూరి శైలరాడ్గుహాలోన వసియించు లీలజూపెడిసామి! మేలుకొనుము
స్వారాజుఁబోలు సీతారామమేదినీపాలు నేలెడిసామి! మేలుకొనుము
ఎదయందుఁ గలుములు వెదఁజల్లు కడలిరాచూలిఁ దాల్చినసామి! మేలుకొనుము

తే. గీ. అనుచు వైతాళికజనం బుదారమధుర
వచనరచనలఁ గొనియాడ వారిజాక్షుఁ
డనుపమానుఁ డనంతకళ్యాణగుణుఁడు
కురుమతిగిరీశ్వరుఁడు మేలుకొనియెనంత.

చ. తనతలలో జనించిన యుదారమణిం దలపై ధరించి వే
చని గజరాజరక్షకుఁడు శౌరికిఁ గానుకనీఁదలంచెనో
యన నొకవెండికుండ శిరమందు ధరించి సరోజనేత్రుమ
జ్జనమున కేగి తెచ్చెను గజమ్మది పుష్కరిణీజలమ్ములన్. ౮౦

చ. రజనికుమారు నొక్కనిఁ జరాలున నేగుచు డించిపోయె నీ
రజనిమగండు, దీనికిఁ గరం బహితుం డతఁ డేచునంచుఁ దా
గజమును జూచి భ్రాంతిపడి కల్వలరాయఁడు ప్రోవ వచ్చెనా
రజతఘటం బెసంగెఁ గరిరాజుశిరమ్మున మేల్ పహారంగునన్. ౮౧

క. కించిద్వికసితనవకలికాంచత్తులసీదళముల నర్చకతతి గా
వించెను లక్ష్మీలలనోదంచితపదకమలముల కనంతసపర్యల్. ౮౨

చ. చరమధరాధరంబునకు సన్నిధిలో నొకయింతదవ్వునన్
సరసజమిత్రుఁ డుండఁ దిరునాళ్లకు వచ్చినభక్తకోటిపైఁ
గరుణదలిర్పఁగా దితిజకాలుఁడు తత్కృతపాపయామినీ
చరులను ద్రుంపనంపెననఁ జక్రము తద్గృహనుండి వెల్వడెన్. ౮౩

క. ధూతసహస్రారంబు, సమేతసహస్రారమునయి యొసఁగెడిచక్రం
బేతెంచె యథాపూర్వపు రీతి న్వేవేగఁ బుష్కరిణియొడ్డునకున్. ౮౪

క. హరికరసంగతిచేత విధురమై చక్రంబు వితతతోషం బల పు
ష్కరిణికిఁగావించుట యబ్బురమే చూడంగ నిది యపూర్వమె జగతిన్. ౮౫

తే.గీ. శ్రీనివాసకరాబ్జమైత్రిని సమాను
లయ్యుఁ జక్రశతామరసాప్తు లెలమిఁ
దగ నపశ్చిమపశ్చిమనగవరేశ
సన్నిధుల కేగుదెంచు టాశ్చర్య మరయ. ౭౬

చ. హరికరవాసభాసురతనంది చెలంగెడి చక్రరాజముం
గరము పరిత్యజించి ననుఁ గాంతురెయందు నసూయచేత నా
హరిపదవాసమంది యథమాత్మతఁ గాంచిన చక్రిరాజు దా
నరిగెను బశ్చిమాద్రికి; బలాఢ్యులు దుర్బలబాధకుల్గదా! ౭౭

చ. అరియగు చక్రముం గని యహస్కరుఁ డేగిన నేఁగాక, నే
దరమును గాంచనేల తదధస్థితవర్ణమనోహరాకృతిన్
బొరసియునంచుఁ జందురుఁ డపూర్వదిశాతరుణీలలాటభా
సురతరహీరభూషణము సొంపునఁ దా నుదయించె నింపుగన్. ౭౮

చ. కనుఁగొని ధాత యభ్రఫలకమ్మునఁ దా సితపక్షమన్ శలా
కనుగొని యొంతయున్ దనదు కౌశలమొప్ప సుదృగ్వితానమున్
దనుపఁగఁ గామవృత్తము గణక్రమముం గొని పస్తరింప వ్రా
సిన గురురేఖయో యనఁగ శీతకరోజ్జ్వలరేఖ రాజిలెన్. ౭౯

సీ. చతురాననుండు మేచకరుచిఁదగు వియత్పత్రమ్మునం దంధతమసమషిని
గొని వేడ్కమెఱయంగఁ 'గురుమూర్తిగిరినాథసరసనఖరజిత శ్చంద్ర' యనుచు
వ్రాయఁగా, నాద్యక్షరములపై మసి యాఱిపోయెను, జిగురున వ్రాయఁబడిన
క్రావడికిని విసర్గకునుపై మషి యధికమ్ముగాఁ బడి తడిగాఁజెలంగ

తే.గీ. నంత నభ్రికరజము పై నదిమె ననఁగఁ
బ్రిక్కలో రెండు చిన్నితారకలు దనర
బాలసితకరరేఖ యభ్రమ్మునందుఁ
కన్నుఁదోయికి నానందగరిమ నించె. ౮౦

తే.గీ. చిలువరావారుపమునెక్కు శ్రీనివాసుఁ
డనుచు సంతోషదంతురితాంతరంగు
లగుచు నంగజనములైనయమరు లద్రి
శృంగముల నల్లడల నధిష్ఠించి రెలమి. ౮౧

వ. అట్టిసమయమ్మున 'నపారకృపాకరుండగు నక్కురమతిస్వామి మదీయగిరివరశిరో మణియగు శ్రీనివాసు దివ్యోత్సవంబు భవ్యంబగుచుండ గాఢాంధకారబంధు రంబగు పాతాళమ్మున వసింపనేల? యచటికిఁ జని తదీయమహోత్సవరీతిని రీతిగా నవలోకించి భక్తావళీగీయమానంబులగు తదీయదివ్యస్తుతు లాకర్ణించి నయనసహస్రతయ యుగళంబు సఫలంబొనర్తు'నని తుషారగిరినిందాకరమ్ములగు నిజదీప్తి పరంపరలు దశదిశల వెలుఁగ ధరణీతలంబు పగుల్చుకొనివచ్చిన శేషాహి యనఁదగు శేషవాహనమ్మునఁ బరివారజనమ్ము నిజభవనద్వారావనీ తలమ్మునకుఁ దోడ్కొనిరా నది యధిష్ఠించి నిజభగినియగు హిమవత్తనయవాస రమ్మున దివ్యోత్సవసంగతుండైన యల్లుండగు సింధుజాకాంతుండు నిఖిలజగదా నందవాదాన్యకంబు వహియించెనను వాత్సల్యంబునఁ దుంగతరాంతరంగయగు గంగానది యుప్పనంబుగాఁ బంపిన వీచిద్వయంబనఁదగు చామరద్వయం బిరు ప్రక్కలఁ దనర, నిజాధినాథశేషవాహనోత్సవంబు విలోకింప రసాతలమ్ము నుండి వచ్చి విలోలఫణామణీరుచులగుచు నటునిటుఁ దిరుగు దర్వీకరంబులనఁదగు కొఁగడలు ధరించి పరిచారకులు పరివేష్టింప, మున్ను మన్నామకుండగు వసుదే వున కపకారం బొనర్చిన కంసుం జంపిన పురుషోత్తముఁ డితఁడని ప్రశంసించు చందమ్మున సానకదుందుభిబృందమ్ము లమందారవంబు సంధింప భక్తబృందమ్ముల సానందకందళితుల నొనర్చుచు మందమందగిరినిర్ఝరశీకరకోరకితమారుతకిశోరసేవ నపరిముషితవ్యాయామాయాసుఁడగుచు గిరిశిరమ్మునుండి దశమివేదికడకు వచ్చి యచటఁ గొంతదడవు సపర్యలం గ్రహించి మరల గిరిశిరమ్మునకుం జని వదన జితచందిరయుఁ గచనిర్జితేందిందిరయునగు నిందిరాదేవితో జగత్సుందరుం డగుచు నిజమందిరాయితకందరాంతరాళంబు ప్రవేశించుచుటయు.

తే.గీ. ననుఁ గృపారసగరిమఁ బావనముఁజేయు
తోయజాక్షుం డటంచుఁ జతుర్థదినము
వచ్చె, శేషావనీధరవల్లభునకు
క్షుద్రకృప యెక్కుడని మునీశులు వచింత్రు. ౯౩

మ. అరికాంతిన్ గరముల్ దిరస్కృతుఁడనే నైయుండి రాకున్న వా
సరనాథత్వము పోవుఁగావున నవశ్యంబున్ స్వకార్యంబు త
త్పరులౌవారలు వీడరంచు రవి యర్థంబర్థమైయొప్పు బిం
బరుచిన్ గప్పడఁజేసె లజ్జయు మనోవైక్లబ్యముం జొప్పడన్. ౯౪

తే. గీ. గజముఖుని వాసరంబిది గాన దీని
గజవదనుఁ డుత్సవమ్ముచే గారవించు

నసెడి సంతోషమునఁబోలె నపుడు గజము
మజ్జనఘటంబు గొని తెచ్చె మాధవునకు. ౯౫

చ. తన కరులైన ముత్యములు డాల్చెడు నీకరికుంభమంచు నీ
ర్ష్యనుగొని యాకసంబు డిగి చయ్యన దానిఁ బగుల్చునిచ్చ వ
చ్చిన పెనురిక్కయోయనఁగఁ జెన్నలరారెడు వెండికుండ గ్ర
క్కున ధరియించి వచ్చె వరకుంజర మాహరిమజ్జనార్థమై. ౯౬

క. కురుమతిశిఖరాగ్రము భాస్వరభాస్కరకరనికరవిభాభాసురమై
కరమలర హరియు నర్చకకరకృతపూజలను మోదగరిమ వహించెన్. ౯౭

ఉ. శ్రీనిలయోత్సవమ్మ నిటు చెన్నలరార సుమాళిరుద్ధమై
యానగ మొప్పెనంచు జనులెంచ రుషన్ గమలాత్ముఁడంపె నాఁ
గా నరిగెన్ గుహన్ విడిచి గ్రక్కునఁ జక్రవరంబు, సూనృతా
సూనృతవాగ్వివేచనము చొప్పడ నీయదు కోప మక్కటా. ౯౮

చ. మునుపు సమాహితార్థమును బొందమి రోషముఁజెందియున్న యం
జనతనయుండు నేఁడు విలసద్గతినొప్పఁగలాఁడు నన్ను భ్రమిం
గునో మఱియేమొ వండనెడి కోరిక లీరికలెత్తనంచు నొ
య్యనఁ జరమాబ్ధిలో మునిఁగె నంబుజనీపతి భీతిగ్రమ్మఁగన్. ౯౯

తే. గీ. మిత్రుఁడగు భాస్కరుం డస్తమించె వైరి
యైనచంద్రుండు వచ్చునటంచు భీతి
పుష్కరిణినుండి హరికరపుష్కరంబుఁ
జేరి చక్రంబు మోదంబుఁ జెందుటరుదె. ౧౦౦

వ. తదనంతరమ్మున హనుమన్మహోత్సవసూచకంబులును, వర్తులతరపుష్కరఘటిత ధవళాజినంబులును నగు దుందుభులు స్వకీయరూపసౌభాగ్యహరుండగు శీతకరుండు నేఁడు తనుత్వంబెనసియుండెనని సంగరమ్మునకుఁ బిలుచుభంగి నభంగురారవంబులఁ జెలంగ, మున్నంజనాచలకూటమ్మున భవద్వికీర్ణంబగు వరంబునం బొడమినబాలుం డితఁ డితనిం బరిపాలింపుమని యంజనచే సమర్పింపఁబడిన భంగి నున్నవాఁడును, బురస్సముచ్చానవర్తులాపాటలనాసికోష్ఠాధరచుబుకమండలుం డగు కతనఁ దనశైశవంబున నవాప్తమనోరథుండగుటచే నిపుడు తదవమానంబు దలఁచుకొనిబాలభానుం గబళించుభంగినున్నవాఁడును; హరీశ్వరత్వంబుఁ బ్రకటిం

ఘనోయనఁ బింగళతరంబులగు లోచనంబుల మనశ్శిలాపాటలశిఖరప్రరూఢ వైడూర్యద్వయం బగు గిరిం బురణించు వాఁడును, దారాధిపనిగ్రహప్రముదిత హృదయుండనగు నాయెదుట నీ తారాధిపుఁడన నెంతవాఁడని యీసునఁ జంద్రుని గబళించు తఱి నధరప్రాంతవినిర్గతంబులును వికలంబులునగు తచ్ఛకలంబులు నాఁడగు కోఱలును, రమణీయ ప్రవాళదాయాదంబగు వదనంబును జొప్పడుకతన నుభయతోదృశ్యమానశృంగచంద్రరేఖామధ్యభాగపిధాన కృత్సంధ్యాంబుదాలంకృతం బగు గిరి ననుకరించువాఁడును, జలనిధిం దాఁటునెడ నాకసంబున సరభసగతివశంబునం గళమ్మునఁ దగులుకొని యిప్పటికిం జొప్పడు నక్షత్రమాలిక నాఁదగు నక్షత్రమాలికచే మందప్రసరనిర్ఝరరమణీయంబగు ధరణీధరంబు నీసడించువాఁడును, నిజనందనుఁడగు సుగ్రీవుకార్యంబు నిర్వహించెనను వాత్సల్యంబుచే శిరంబు మూర్కొనుచున్న సహస్రకిరణుం డనఁ దగు కిరీటమ్మును గౌఁగిలించుకొనుచున్న యతని కరంబులనఁదగు హారంబులును గలిగి యలరువాఁడును, సమరసమయమ్ముల నిరంతరదురితభరితచరితనిశాచరచరణవ్యతికరంబు నయితము సంభవించెఁ దద్దురితంబు శ్రీనివాసశరదుదితదినకరకరనికరవ్యతికరవిఫుల్లసరసిజతల్లజదౌర్లాలిత్యనిర్లోడనమల్లచరణపల్లవయుగళసంసేవనమ్మునంజేసి పాపెదవనుభంగిఁ బురఃప్రసారితంబులగు కరతలంబుల నాభాగ్యం బింత యొప్పునేయని యభినయించుభంగి నెసంగువాఁడును, గాంచనవసనపరికలితసంవ్యానుండగుకతన నితండు మన్నాథుండు కాఁగలఁడని కుతుకమ్మున సరస్వత్యంశభవయగు నది చేఁ గౌఁగిలింపఁబడినభంగిఁ జెలంగువాఁడును, బశ్చాన్నికుంచితపురఃప్రసారితాకుంచితసవ్యదక్షిణజానువుల నూనుకతన వామభాగం బపురస్కరణీయంబు, దక్షిణభాగంబు పురస్కరణీయంబని తదౌచిత్యానౌచిత్యచాతురిం బ్రకటించు భంగి నొప్పువాఁడును, మామకీనజీవనంబగు సమీరుని కుమారుం డితఁడని వాత్సల్యంబున శరీరపశ్చార్ధంబు నామస్తకంబు పరిమృశించు వాసుకియోయనఁ దగి స్నిగ్ధశాలవాలనిరంకుశోజ్జృంభితోపఘ్నసమాశ్రయకౌతుకోజ్జృంభితానివార్యశౌర్యలతాశంక నంకురింపంజేయు వాలధిమండలమ్మునఁ బ్రకాశించువాఁడును, వలయీభూతవాలాగ్రరాజితమకుటాగ్రమ్మునం బొల్చుకతనఁ గురుమూర్తిశిఖరశేఖరమణియగు శ్రీనివాసు నాశ్రయించిన వారికి భయం బెన్నఁటికిని నెచ్చోటనైన సంభవింపనేరదని చక్రంబు శిరంబునం దిడుకొని ప్రమాణంబొనర్చుభంగిఁ దనర్చువాఁడును, మూర్తిమంతంబగు ప్రతాపరాశినాఁ దగువాఁడును, భగవంతుండును నగు హనుమంతు నధిష్ఠించి మదీయకులతిలకుండగు శ్రీరామునకు సాహాయ్యకం బొనరింపఁ బారావారంబు దాఁటిన మహామహుండితఁడని తదుత్సవంబుఁ జూచుటకు నిజరుచినిగ్రహణవిగ్రహచణంబగు భగవద్విగ్రహంబు విలోకించి జాతావమానయుం బోలె నధప్రసారిణియు నిజతనూజయు నగు కాళిందితోడను దదుద్వహనవత్సలయుం బోలె వెన్నంటివచ్చిన ఛాయతోడను జనుదెంచిన సహ

సత్కిరణుండునాఁదగు నిందనీలమణిమయయష్టివిరాజమానసచ్ఛాయమణిమయాతపత్రంబు శీర్షభాగమ్మునం దనర, మున్ను రామకార్యనిర్వాహత్వరాయత్తచిత్తుండగుట నంతరవస్థానం బనుచితంబని హనుమంతుండు మత్కృతసపర్యలు గ్రహింపక చనియె నాతనియుత్సవంబు నేఁడు సంప్రాప్తంబయ్యెఁగదా యని సాదరుండై రత్నాకరుండు పంపిన మౌక్తికపుంజంబులు నాఁదగు చామరంబులయుఁ బృథులరత్నంబులునాఁ దగు దీపంబులయుఁ గాంతులు యామినీకళింద నందనకు గంగాసరస్వతిసంగమంబు సంపాదింప గిరివరశిఖరంబునుండి దిగి యపారకృపారసబంధురుండగు నాశ్రీనివాసుండు కొంత తడవు దశమీవేదికయందు యథాపూర్వంబుగా నంగీకృతసపర్యుండయి మరల నగ్గిరివరం బధిష్ఠించి బహుసుందరంబగు నిజకందరాంతరాళంబునకు వేంచేయుటయు.

తే. గీ. తెలియనేరక రేఁ జతుర్థీదినమున
విధునిసంసేవనంబు గావించియుంటి,
నేమి యపవాద మూఁదునో యింకఁ నా క
టంచు ఛత్రంబు సంకోచమందె నంత. ౧౦౨

తే. గీ. తారలను నభ్రవార్ధిడిండీరచయము
లవి యుషఃకాలమారుతహతి నడంగెఁ,
గాకయుండినఁ బ్రత్యూషకాలమందు
నొక్కఁడేనియుఁ గనుపడకుండు టెట్లు ౧౦౩

ఇది శ్రీకింకవీంద్ర ఘటాపంచానన విద్వత్కవి బాలకలానిధి
బాలసరస్వతీ శతావధాని తిరుపతి వేంకటేశ్వరులచే
నాంధ్రీకృతంబగు శ్రీనివాసవిలాసమ్మున
ద్వితీయోల్లాసము సంపూర్ణము.

శ్రీరస్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్రీనివాసవిలాసము

## తృతీయాశ్వాసము




చమిఁ దదధినాథసర్పవిభుశిరము
నందెసంగెడి మణియన నర్కమండ
లం బుదయమంది యుదయాచలమునకుఁదగు
నవమణికిరీటభూషణోన్నతి వహించె. ౧

మ. కరికుంభద్వయిఁ జీరవట్టినను లోకంబేలొకో యూరకే
హరియంచు న్వచియించునంచు శశి తత్సార్థక్యసంప్రాప్తికై
పరఁగన్నిల్చెనొనాఁగ సద్రజతకుంభమ్ముల్ దలందాల్చి యు
త్కరుమత్యాలయు మజ్జనమ్మునకునై కుంభీంద్రము ల్పెల్ వెసన్. ౨

మ. హరిఁ బూజించుటకై సురేంద్రమణిదివ్యత్కాంతినొప్పారు పు
ష్కరిణీనీరము పంపఁ బెన్బడగ శీర్షమ్మందునందాల్చి యు
త్కటమై వచ్చు తరంగమోయనఁగ నాగస్వామిశీర్షమ్మునన్
వరచంద్రోజ్జ్వలపూర్ణరౌప్యకలశల్ దాఁదాల్చి తెచ్చె న్వెసన్. ౩

వ. అంతఁ గురుమతిగిరిపతికరుణాకటాక్షసుధాఝరీనిరంతరపరిపూర్ణముక్కరవంశపయఃపారావారరాకాసుధాకరాయితుండును సోమావనీపాలబాలుండును నగు సీతారామభూపాలుండు భక్తజనపరికలితౌపసికసపర్యాచర్యామర్యాదాపర్యాప్తాశ్చర్యుండగుచుఁ గురుమూర్త్యవార్యధుర్యుండగు శ్రీనివాసుండు గుహావిహారం బంగీకరించుటకుమున్న మదీయకులదైవతంబును దేవతాచక్రవర్తియు నగు కురుమూర్తిస్వామి మహోత్సవం బవలోకింప నేతెంచిన జనంబులకు భోజనంబులకు

దగు సత్రంబు ప్రవర్తనీయంబనితలఁచి పురుషోత్తమకైంకర్యమ్మునకుఁ దదుచితుఁడై ప్రేషణీయుండని యూహించెనోయనఁ బురుషోత్తమరామాభిధుండగు నొక యధ్యక్షు నియమించుటయు నతండు. ౪

సీ. తదుపత్యకాప్రాంతతలభాసమానంబు దివ్యవాపీసరోదీపితంబు
నింబజంబీరకదంబాదితరుయుతోపవనంబునైన యంబాపురంబు
నందు సత్రిప్రాంతమం దనేకులు లేఖకులు చుట్టువారఁగఁ గూరుచుండి
ఆరసి నియమింప నంతటఁ దగుభృత్యవర్గమ్ము లెల్ల నవారితముగ

తే. గీ. గోనులను విప్పి బియ్యంబు కొంతవట్టు
రాసులనుజేయ నవి తుషారగిరికిని సు
తులో యనంగను సెంతయుఁ జెలువుమీఱి
కనుఁగొనెడివారి కానందగరిమనించె. ౫

వ. మఱియుఁ బిటకమ్ములచే నెత్తి తత్తద్రవ్యంబుల ననేకభాండంబులం బోయుచు ముద్గదళమ్ములం దెచ్చుచుఁ జణకదళరాసు లపనయించుచు రాజమాషంబు లున్నయించుచు సర్షపమ్ముల నొసంగుచు లవణరాసులం గ్రహించుచు మరిచమ్ముల సంగ్రహించుచు గుడరాసులు స్థాపించుచు మరిచకాటవవికృతమ్ములుగాకుండ గోధూమపిష్టరాసులు దూరమ్మునం బెట్టుచు ద్రవ్యాంతరపూరణమ్మునకై రిక్తవసనప్రసేవికాకదంబంబుల నావల కందిచ్చుచు రిక్తకుతూతతులం దెచ్చి వంచి కొన్నింటి నాజ్యపూరంబుచేతను, మఱికొన్నింటిఁ దైలంబుచేతను నిండించుచు ననేకు లనేకప్రకారమ్ములం జెలంగుచున్నంత. ౬

తే. గీ. మాకు వేగ మొసంగుఁడు, మాకు వేగ
మీయుఁడని కొంద ఱుద్ధతి నేగుదేర
నాకుఁ దందరయున్న దెంతయును నాకు
ముందిడుమటంచు నొక్కఁడు మొత్తివెట్టు. ౭

తే. గీ. అంత నేఁడొక్క భూసురుం డరుగుదెంచి
యెంతకాలము తాళుదు, నేల సమయ
మీరు తరతమభావమ్ము లెఱుఁగ, రేను
భూపుతోఁ జెప్పెదనటంచు భుజములూఁచు. ౮

వందబ్రాహ్మణులకుఁ జాలు పాత్రికుఁ దగినతండులములు దగినవ్యంజ
నలతో మునుమున్న నాకి' మ్మనునొకండు వేఱొకఁడంత నవ్విప్రుఁ జూచి
ందఱకన్న నీయతిశయం బే' మని ప్రతికూలభాషలు పలుకునంత
దటివాఁ 'డౌరౌర ముందును వెన్కయుఁ జూడక పద్ధతి నిట్టులాడ నీకు

తే. గీ. నెవ్వఁ డధికారమిచ్చె, నన్నెవనిఁ గాఁ ద
లంచితివి నోరుమూయింతు' నంచు లేచు
నంత, 'నుభయులు మాన్పులే పంత మేల'
యంచుఁ గొందఱు వారల ననునయింత్రు. ౯

తే. గీ. మరలఁ బ్రేలుచునున్నాఁడు మానఁడీ దు
రాత్మకుఁడు మీరలెల్ల నన్ననునయింప
నూరకుంటిని గాదె వీఁడూరకుండ
నేయని మొదటియతఁ డను నింతలోన. ౧౦

రాజేంద్రుని కీర్తి మేము విని పేర్మింజూడ గోదావరీ
సాంతము నుండి వచ్చితిమి మా దేహమ్ము శుష్కించె క్షు
ధరంబుం గడుఁ జెందియుంటి మశనార్థం బిత్తురో యీయరో
రం డిండని రందుఁ గొందఱు రుషావేశోద్ధతుల్ బ్రాహ్మణుల్. ౧౧

తట వారిం జూచి మీ రెందఱని దాక్షిణాత్యు లడిగిన మే మేఁబదిమందియని
ప్పి మీ రెందఱని యడిగిన దాక్షిణాత్యులును మేము మూఁడువందలమంది యని
ప్పుటయు మొదటివారు 'చూడుఁడిది యసత్యము వీరు ముప్పది మందివచ్చి
రాఁడువందలమందియని చెప్పెద'రని వారిమర్మంబు బైటఁ బెట్టి, దాక్షిణాత్యు
దుర్మార్గులారా! మీరుమాత్రము నిజముగా నేఁబదిమందివచ్చితిరే? యని
హాక్షేపింప గోదావరీతీరస్థు లిట్లనిరి. ౧౨

ందఱు గేహమందు మరికొందఱు పుష్కరిణీతటమ్మునం
ందఱు కర్మతీర్వరునికోవెలలో నరపాలుసన్నిధిన్
ందఱు మూటలున్నకడ కొందఱునుండిరి మిమ్ముఁబోలి మా
వం దనృతప్రచారుఁ డొకఁడైనను నుండఁడు నిక్క మిక్కథల్. ౧౩

ఆ. వె. అనిన దాక్షిణాత్యుఁ లహహా! మీమాటలు
సముచితమును నసత్యసరణులనిన

సయిత మనుటనే యసత్యులు దాక్షిణా
త్యులని మహ్యవారు పలికి నగిరి. ౧౪

తే. గీ. నిక్కమగుఁగాక యన్నృతమైన నెగడుఁగాక
విప్రుల కొసంగుటయె మన విధని సెలవు,
గానవొసఁగుఁడు స్వేచ్ఛాప్రకారముగ న
టంచుఁ గొండొకయధికారి యానతిచ్చె ౧౫

వ. ఇట్లానతిచ్చిన పదేను పదాఱు యిరువది ముప్పదియటంచుఁ గుంచమ్ములు లెక్క
పెట్టుచు భృత్యులు విప్రులకుఁ గొలిచియిచ్చుచుండఁ గొందఱు విప్రులు 'మేము
బ్రాహ్మణులము కుంచమ్ము లనుకూలమ్ముకా నిండింపుఁ'డని భృత్యులం బ్రార్థిం
చుచుండిరి. భృత్యులును 'వేవేగఁ గైకొనుఁడు, గైకొనుఁడింకను వచ్చువార
లనేకులుగల'రని యొసంగుచుండు నెడఁ గొందఱు తండులానయనమ్మున కేమియుం
దెచ్చుకొనలేదని యటునిటుంజూచుచుండ మఱికొందఱు 'మీరు ఛాందసుల
రటుండుం'డని వారి వారించి, తమయుత్తరీయంబులు పఱచి తండులమ్ములఁ
గ్రహించుచుండి, రంతలోన మఱికొందఱు భటరాజులువచ్చి 'మోదకార్థంబగు
సామగ్రి మాకొసంగుటకు రాజాగా రానతిచ్చిరిగావున మాకట్లనుగ్రహింపుఁ'డని
నుతించుచుండ వారింజూచి విప్రు 'లో దుర్మార్గులారా! బ్రాహ్మణులకుం
బోలె మీకును మోదకంబులా! మీతాతముత్తాతల నాఁడెన్నఁడేని మోదకమ్ము
లెఱుంగుదురే? సూపాన్నలాభమాత్రమ్ముననె బ్రతికినవా'రని ధిక్కరించు
చుండి రట్టియెడ. ౧౬

శా. ఆయాపస్తువులన్ గ్రహించుటకునై యందంద వారాంగనల్
డాయంబోవుడుఁ గొంపఱగ్రజవిటుల్ 'దౌదవ్వుల న్నిల్వుఁడే
లా! యీలాగున మీఁదికేగు టిదిమేలా'యంచు వారించున
ట్లాయబ్జాక్షులగుబ్బలన్ దడవి మోదాయత్తులై రెంతయున్. ౧౭

తే. గీ. మఱియుఁ గొందఱిదేమి సమ్మర్దమనుచు
మార్గమేర్పడఁజేసెడి మాడ్కి వార
నళిననేత్రల నాలింగనంబొనర్చి
సంతసించిరి జన్మంబు సఫలమనుచు. ౧౮

చ. 'అసమయమందువచ్చితి రహో మఱిఁ బోలియు మీరుఁగూడ నో
బిసరుహనేత్రలార! యిటఁ బేదరికమ్మున కాటపట్టులై

పసఁజెడఁగొట్టుకొంట తగవా'యని లాలనజేయుభంగి దు
ర్వ్యసనమెసంగఁ దచ్చుబుకపాళి గ్రహించిరి గొందఱగ్రజుల్. ౧౯

ఉ. ఆయతమైన యాసరసిజాక్షులవేణినిఁగాంచి యొక్కగ్రా
మేయకుఁ డెంతయుఙ్ భయముమేకొన 'నల్లదె నల్లత్రాఁచు బా
బో'యని కోఁతిగంతులిడుపోలిక దూరము పాఱిపోయి 'య
మ్మా! యిది నీదు కొప్పుచల'వంచు నుతించెను గంపమానుఁడై. ౨౦

ఉ. మాటలువేయునేల యొకమాటకు మాటలుగోరునట్టిగో
బోటుల కొక్కగవ్వయును బోకడవెట్టక యెంతయుఙ్ నిరా
ఘాటముగాఁ దదీయకుచఘట్టనమాదిగఁ దప్పదంగసం
గాటనమబ్బె నచ్చోటను గాటముగా విటవిప్రకోటికిఙ్. ౨౧

వ. అంతట రాజతురంగంబుల కభ్యాసార్థంబు కుళుద్ధంబులు లేతెమ్మని రాజభటులు నిర్లక్ష్యంబుగఁ దత్తఱపెట్టుచుండ 'నిప్పుడ వచ్చితిమి మమ్మొకించుక చూడుఁ'డని జీర్ణవస్త్రకలితవేషులగు వృషభాజీవులు చర్చరీవాద్యమ్ములు వాయించుచుండ, నంతటనధికారియొకండు కింకరులంబిలిచి 'యిదియిట్లుండుఁ గాక వేశవారముంజూడు' మనిన వాఁడును వల్లెయని భుజమ్ముల జనసంఘమ్ము వెలువరించుచుం బోవుచుండ మరలఁ బిలిచి 'యోరి పిచ్చివాఁడ! యేడకేగెద'వని యడుగుటయు, వాఁడు వేశ్యాజనానయనమ్మునకై వేశవారమ్మునకుం బోయెదనని పలుకుటయు, నధికారి నాసికాగ్రమ్మునఁ గేలుంగీలించి 'యద్దిరే! లోకమ్మున వేశ్యలయెడ మనుజుల కింతటిప్రీతియొప్పునే చాలుఁజాలు రామఠపురకాద్యుపస్కరముంజూడుమని యాజ్ఞాపించిన నెగిరియెగిరిపడుచు వేశ్యాజనానయనమునకుం బరుగెత్తుచుంటివా?' యనిన డిల్లపోవునవ్వానింగాంచి నవ్వువారునునై చెలంగి రట్టియెడ మఱికొందఱు. ౨౨

సీ. ఆర్ద్రకంబడుగ ఘర్మార్ద్రకంబగు జనసంచయంబనుచు భ్రమించువారు
శృంగబేరమ్ము నాకిమ్మన గంగాతటినియొడ్డునకు నేగుమనెడివారు
విశ్వ మిమ్మన నున్నవిప్రులగతియేమి యంతయు నీకీయ ననెడివారు
విశ్వభేషజమన్న నశ్విను లిచ్చెద రమరావతికి నేగుమనెడివారు

తే. గీ. నాగరంబిమ్మనిన నిటనాగరంబ
యఖిల మారణ్యకంబులే దనెడువారు

శుంఠియిమ్మన నింతేల కంఠశోష
పుచ్చుకొ మ్మిచ్చెదనటంచు నిచ్చువారు. ౨౩

తే. గీ. ఇచ్చి 'నీదగుపాండిత్య మిచటఁజూప
వలెనె, మెచ్చలసె యీరీతిఁబల్కితేని
యర్థ మిమ్మఁ బంపుదుముగదా యరుగు మిప్పు
డైన' యని పంపువారలు నైరి, మఱియు. ౨౪

సీ. తండులమ్ములు పూగఖండంబులు గుడంబు చణకముల్ పేటకసర్షపములు
పసుపు బియ్యముపిండి ఫాణితంబును నారికేళఖండమ్ములు ఘృతము రాజ
మాషమ్ము లాదియశేషపదార్థముల్ కొంద అచ్చటివారు కొల్లఁగొనుచు
పడుచు లేచుచు మేను దుడుముకొంచుచు డిల్లపడుచు నెంతయుభీతి పరుగులిడుచు

తే. గీ. నేఁటి కేఁడాదిసరిపడు నివియటంచు
సంతసించుచుఁ దమతమ సదనములను
నిండఁగాఁజేసికొన్నను నిలిచియున్న
తత్తదమితపదార్థముల్ తఱుగవాయె. ౨౫

సీ. చెవులు చిల్లులుపోవఁజేయఁజాలెడు చర్చరీవాద్యరవ మొక్కకేళిఁ దనర
నంతరంగము పరిమోదాబ్ధిముంచెడి మృదంగధ్వాన మొక్కచక్కటిఁ జెలంగఁ
జీకాకుపుట్టింపఁజేసెడి డమరుచ్ఛటాచ్ఛటధ్వని యొక్కటను నెసంగఁ
బండితపామరాపారమోదదమైన వాంశికస్వన మొక్కవంకనొలయ

తే. గీ. మఱియుఁ దాళాదికధ్వాన మహితమగుచు
నధికకోలాహలమ్ముగా నమరునచట
నొకరిమాట లొకళ్ళకుఁ బ్రకటరీతి
వినఁబడకయుండునట్టి యవ్వేళయందు. ౨౬

వ. ఒకటి చేయుమన వేఱొకటి యొనర్చువారును లవణంబిమ్మన గుడంబిచ్చువారును తైలంబిమ్మన నావాలిచ్చితిమే యనువారును రమ్మనిన దూరముగా బోవువారును బొమ్మనిన దగ్గఱకు వచ్చువారును రావాకంబిమ్మనఁ గమఠంబు తటాకంబునఁ గలదనువారును గుడముగుడమన్నఁ జడుండప్పు నీవేయని కలహించువారునైరి మఱియును. ౨౭

[illegible] కొంతున వాటుదాని [illegible]
ఓంత రయొసంగుడ [illegible]
ప్రాంతముఁజేసి చూపఁ 'జనుబంతులు మాకడలేవు పొందు రో
యింతులయిండ్ల'కంచు వచియించుచు నవ్విరి కొందఱయ్యెడన్. ౨౮

వ. ఇట్లనేకు లనేకప్రకారమ్ములఁ జెలంగఁ బంచమి మొదలు సప్తమిపర్యంత మనుప శాంతకోలాహలమ్ముగా నానక్షత్రప్రవేశంబు మహోత్సవవచనమ్ములను సయితము వర్ణింప నశక్యంబయ్యె, వేయేల యయ్యెడ కరుదెంచిన వారిలోన నవమానితుం డుగాని యలాలితుండుగాని యధిక్షిప్తుండుగాని యలబ్ధసామగ్రికుండుగాని య సంపూర్ణమనోరథుండుగాని యసుచితానందుండుగాని లేఁడయ్యె. ౨౯

చ. శరణనువారిఁ బ్రోచుటకు శంకయొకింతయు లేకయొప్పు న
త్కరుణ నెసంగి కుర్మతినగమ్మున భాసిలు శ్రీనివాసు న
బ్బురపుమహోత్సవంబు సురపూజ్యముగానిటులొప్పె, సద్గుణా
కరుఁ డురుకీర్తి దివ్యమతికాంతుఁడునౌ నరపాలుఁ డున్ వినెన్. 30

క. శ్రీరుచిరకురుమతీశ్వరకారుణ్యాకరుఁడు సుకవిగణమిత్రుఁడు సీ
తారామనృపాలుఁడు దానారయ నుంకించె నమ్మహోమహుమహాముల్.

సీ. తనకెరంగెడిభక్తజనుల కెంతయు సంతసం బిచ్చి కాపాడఁజాలువాఁడు
అనుపదమ్మును విబుధానీకములచేత బహువిధమ్ముగ నుతింపఁబడువాఁడు
అహితభావమ్ముచే నాదరింపనివారిఁ బనిఁబూని త్షణములోఁ దునుమువాఁడు
కడునపారంబైన కలుషపాథోరాశి దరియింప నావయై తనరువాఁడు

తే. గీ. ఎదురులేక జగమ్ముల నేలువాఁడు
కురుమతిగిరీంద్రమున నెలకొన్నవాఁడు
హరి ననుంబ్రోచుఁగాకయటంచు మదిని
నతులొనర్చి నుతించె భూనాయకుండు. 3౨

మ. కవినాథార్చితసత్కృతిచ్ఛలలసత్కావ్యైకవాఙ్మత్వమై
భవముం గాంచిన భోజరాజిపుడు దీవ్యత్సత్కవీశావన
ప్రవణత్వమ్మున సోమభూపసుతుఁడై ప్రాదుర్భవించె న్నిజం
బవునంచు న్నుతిఁజేసి రందఱు గుణైకాలంబు నాభూపతిన్. 33

మ. తదుదారత్వముచే జయింపఁబడి తత్కల్పాగ మస్రిమ్ములన్
వదలున్ దా మకరందమన్నెపమునం, గంపించు మున్ట్రు, న్మరు

త్పదము ల్పడదు, భీతిచే నెచటకేఁ బోకుంగ నుంకించునో
యిదియంచుఁ హరి తాల్చె నేత్రముల వేయింటిఁ దదీక్షార్థమై.

సీ. సకలక్షితీశానసమ్మాననార్హుండు వసుమతీఖండధూర్వహనచణుఁడు
శ్రీనివాసోత్సవశ్రీవీక్షణాదరుం డత్యంతవిమలకీర్త్యంచితుండు
ధర్మజ్ఞుఁడైనసీతారామనరపాలశేఖరు నాజ్ఞఁ బూజించుమంత్రి
సత్తము లానరించు శాసనమును శిరంబులఁదాల్చి భటవర్గములు సముత్సు

తే. గీ. కత్వ మొప్పార దివ్యమహత్త్వగరిమ
నెసఁగ భూలోకవైకుంఠమిదియనంగఁ
దనరు కుర్మతిగిరిశ్రీయాత్రకయి బయలు
వెడలి రొక్కపెట్టఁ దగ వేనవేలసంఖ్య. ౨౫

వ. ఇట్లు కదలి కురుమతిగిరిపతినిలయశ్రీనివాససేవాహేవాకభావాతిముదితఖ్యాతావా
మానఘమతి యగు సీతారామావనిపతి దుర్లంఘుంబగు నానతిం జేసి ముచ్యమాన
తురంగమ్ములును, బధ్యమానపల్యాణమ్ములును, న్యస్యమానఖలీనమ్ములును, భూష్య
మాణమదానళంబులును, నుద్ధ్రియమాణ నళికంబులును, ప్రవిశ్యమానకంచుకంబు
లును, ప్రతిముచ్యమానసారసనంబులును, నాముచ్యమాన గ్రైవేయకంబులును,
నుత్క్షిప్యమాణకాక్షేయకంబులును, గృహ్యమాణాసిధేనుకంబులును, సహ్యమాన
శిరస్త్రాణాభరణంబులును, నారుహ్యమాణ రథంబులును, మహ్యమాన ఖేటకం
బులును, నర్త్యమానఘోటకంబులును, సజ్జీక్రియమాణోష్ట్రమ్ములును, నుద్యమాన
రథమ్ములును, నుత్కంప్యమానకుంతమ్ములును, నుద్ధూయమానోత్కంపవసనమ్ము
లును, గ్రియమాణసింహనాదమ్ములును, గార్యమాణకరిగర్జితమ్ములును, జాల్యమాన
కశమ్ములును, వల్గ్యమానాజానేయమ్ములును, నిరుద్ధ్యమానవనాయుజమ్ములును,
నాస్ఫోట్యమానారట్టజమ్ములును, నాఘట్ట్యమాన జయదుందుభిచయమ్ములును
నాచోట్యమానహస్తమ్ములును, నట్యమానకాంభోజమ్ములును, నావేష్ట్యమాన
శీర్షణ్యపటమ్ములును, విచేష్ట్యమానకలభమ్ములును, నున్నట్యమానక్రమేళ
కమ్ములును, ధిక్కృతప్రతిభటకరటిఘటమ్ములును, నుజ్జృంభితప్రతాప చ్ఛటమ్ము
లును, యుద్ధరంగోన్నటమ్ములును, బహుధైర్య స్ఫుటమ్ములును, దుర్వారమదో
త్కటమ్ములును, యశోవిమలితదిక్తటమ్ములును, మదారుణాంతర్గ్రస్ప
టమ్ములును, నత్యుద్భటమ్ములును, జటులమ్ములు నునగు భటపటలమ్ము లన్యోన్యం
బును వచించుకొను నట్టిరమ్ము పో మ్మిమ్ము త్రొగు ముంచుము చేయుము
చెప్పుము రక్షింపుము గుర్తెఱుఁగుము విహరింపుము పరిపాలింపుము ప్రహరింపుము
హరింపు మనుమోదింపుము జయింపుము ధరింపు మెచ్చటికేగెదవు నిలువుము

భూపాలుం డెప్పుడు బయలువెడలు నేమిచేయుచున్నాఁ డెచ్చటనున్నాఁ డెప్పుడు బయలువెడలె నవకాశంబు లే దను నానావిధవచనంబుల ధిక్కృతామరపురమ్మగు నాత్మకూరుపురమ్ము కరమ్ము నిబిడీకృతంబయ్యె.

మ. తను మున్నర్కసుతుండు మెచ్చుటను సీతారాముఁ డంగుష్ఠముల్
దనయంగమ్మునఁ గొన్ని మీటినను దత్కార్యంబొనర్పంగ శ
క్తిని దాఁబొందని యీదురాత్ముఁ డిట కేతేరం గలండే యం
చును దాడించిరి దుందుభిస్వనములు తత్సంకీర్తనాఘ్ఘింపగన్. ౩౭

సీ. మదయుక్తశాత్రవమండలదుర్గమకర్దమభాస్కరవికర్దనంబు
నిర్దయభటవర్గమర్దితఘనతరమర్దలనర్దనమానితంబు
పటుపటహపటలచటులరావసమ్మేళనాంగీకరణవిధానాధికృతము
మేరుమందరముఖ్యధారుణీధరదరీగర్భనిర్భేదనగర్భరంబు

తే. గీ. నైనదుందుభినిధ్వాన మంత వినియె
దుర్మదారాతిసంఘసంభక్షణుండు
వితతకార్ముకనిజసర్వభృత్యసఖుఁడు
నైన శ్రీసోమభూమిపాలాత్మజుండు. ౩౮

వ. తదనంతరమ్మున మారధిక్కారవ్యాపారపారీణాకారుండును సంతోషితనిఖిలజనవారుండును సంశ్రితకామప్రదాతయును సర్వాంగసుందరుండును నగు సీతారామభూపాలుండు సింహాసనంబు డిగి, పరిజనంబు కరావలంబం బొసంగ, లంబమానబాహుండును గరకలితసుకుమారవసనుండును నగు నొక భృత్యుండు సవినయంబుగ దారి దెలుపఁ బ్రీతిపదమ్మునం గన్పట్టువారల నెఱింగియు భటులెఱింగింప నెఱింగినవాఁడునుం బోలె మానాధికగాంభీర్యంబునఁ దద్దర్శనజనితకుతూహలంబు బయల్పడనీక యవ్వారలం దగురీతి మన్నించుచు మత్సనామకుండగు సోమభూపాలునందనుం డితఁ డని తారకామకుటీపరివృతుండై శిరంబు పూర్వకాన మకుటోపరిభాగంబున కేతెంచి సౌకుమార్యసౌందర్యవిలోకనవివశితహృదయుండై కౌఁగిలించుకొన నొక కేలు గ్రిందికి సాచియున్న చంద్రుండు నాఁదగు రజతమయదండహిరణ్మయకలశమౌక్తికగ్రథితపట్టసూత్రప్రాంతజాలకవిభూషితంబగు విశదాతపత్రంబు మకుటోపరిభాగమ్మునం దనరఁ దత్తాదృశసౌందర్యానమానితుం డగు కందర్పుం దప్పనంబుగాఁ బంపిన తురీయబాణంబులగు నవమల్లికాకుసుమపుంజంబులు నాఁదగు చామరంబు లిరుపక్కియలఁ జెలఁగ సజ్జనకుండగు రత్నాకరంబున

జనించిన బహువిధరత్నంబు లాత్మకూపపురభూపాలాంతఃపురమ్మునం గలవు
వానిం దెండని చందురుం డానతీయ నిశాసమయంబుల వేవేగ జాలమార్గంబుల
నచ్చటికింజని మ్రుచ్చిలి బహిఃప్రకాశితంబులైనచో భటులు దండింతురను
భయమ్మున లోనం దాఁచికొనియు, ముకురసదృశస్వచ్ఛకాంతులగుకతన నుదరాం
తరదృశ్యమానాపహృతరత్ననికరంబులై పరికుపితకంచుకిబృందమ్ములచే నిగళితమ్ము
లగు సూక్ష్మతరతారకాపరివృతపృథులతారకాగణంబులు నాఁదగు నంతఃప్రకా
శితదీపకోరకస్ఫటికఘుటికాసరవిసరపరికీర్ణవర్తులస్ఫటికపాత్రికలచే మనోహర
మ్మను జతుఃపంచషడ్దళఘటితంబులగు దర్పణకమలంబులఁ బ్రతిఫలించిన మను
జుల ముఖంబు లనేకంబులు గలుగు కతనఁ జతుర్ముఖ పంచముఖ షణ్ముఖ ప్రము
ఖులందఱు నాయందయుండు, రే నీ నిఖిలలోకోత్తరసంపదంబొలుచుదాన నని
ముకురనికరవిస్మృమరశుచిరుచివ్యాజమ్మున సకలలోకసంపదల నపహసించునది
వోలె నెసంగునదియు, సర్వతఃప్రతిబద్ధవిపులముకురనికరంబుల నలరుకతన నంతఃప్ర
విష్టులగు జనంబులకు మనముసయితము విశ్వరూపులమైతిమొకోయను నాశ్చర్యం
బొనర్పంజాలు ననేకవిహారగృహంబుల నిబిడీకృతంబును, శ్రేణీభూతరత్నఘటి
తంబయ్యు నిశ్రేణీభూతరత్నఘటితంబును, లసద్ద్వారలలనంబయ్యు విలసద్ద్వారల
లనంబునునగు నాస్థానమంటపంబు గడిచి, రామునింబోలె పరశుభవచ్ఛ్రీధరం
బును ధరణీధరచక్రవర్తింబోలె సానుగతకాంతసురమణీబృందంబును బృందార
కేంద్రుంబోలె గారుత్మతపక్షకాంతస్థగితవజ్రింబును వజ్రింబునుం బోలె స్వరూ
పలాలితాభిఖ్యాసుందరంబును సత్పురుషునిం బోలె ననంతరూపదర్శనానందిత
సచ్చిత్తంబునునగు రాజమందిరప్రదేశంబు విలోకించుచుఁ బ్రథమకక్ష్య నతి
క్రమించి పురోవిరాజితంబును 'జనులారా! చూడుఁడతికర్కశతరంబగు నిద్దాని
తోడనే కోమలాంగులయొక్కయు నూరుస్తంభంబులు తులితంబులగుచున్నవి మదీ
యభాగ్యంబింతయొప్పునే' యని సకలజనులకుం బ్రకటించుభంగి వివిధచిత్రశృంగా
రితంబగు శుండాదండంబు మాటిమాటికిఁ గదల్చుచున్నదియుఁ, గరపుష్కరాంచ
లనీరంధ్రనిష్ఠీవ్యమానవిమలజలశీకరనికరంబులం బొల్చు కతనఁ దానును జామ
రాందోళనంబొనర్చు భంగింగాని లేక నిషాదికరకలితనిరంకుశాంకుశఘట్టనవేద
నకుఁ సహింపక నిజజన్మభూమింగూడఁ బరిత్యజించి యెటకేనియుంబోవునిచ్చ
నాసికావివరమార్గంబున బయలువెడలినముత్తియమ్ముల నాత్మజవాత్సల్యమ్మునం జేసి
రాజసమీపమ్మునకు బొండని చిమ్ముచున్న భంగింగాని యొసంగునదియు, వక్త్ర
ఘటితబాలచంద్రశృంగమ్ములునాఁదగు దంతమ్ముల నలరునదియు, నిషాదిహస్తోద
స్తసృణిఘట్టనసమయంబున మందమందధూయమానంబగు శిరమ్మునంబొల్చు
కతన నవయౌవనోద్ధతవనితాఘనతరకుచయుగళతౌల్యంబు మదీయకుంభయుగళం
బులకుఁ జేకుఱంగదాయని యనుమోదించు భంగిఁగన్పట్టుచున్నదియు, శశ్వదాం
దోళ్యమానకర్ణయుగళంబునం బొల్చు కతన నాజన్మశ్రీమంతుండగు **సీతారా**

మభూపాలుండు మనుపరివిద్యమానకనకమంటపనిషేవణం బాచరించిన తఱి కొం
చెమైన రవికరనికరవ్యతికరంబు గలిగినఁ బరిశ్రాంతి నొందుఁగదా యని తన్నివా
రణార్థంబు తాళవృంతచాలనం బభ్యసించు భంగినున్నదియుఁ, జకచకితకనకపరి
స్తోమభూషితపశ్చార్ధంబగు కతన శరత్సమయంబగుటం జేసి నిజపయితను నాథు నా
దర్శనజనితంబగు విరహంబున వికలాంతరంగంబులగు విద్యుల్లతాసముదయంబు
లచేఁ దమవల్లభుండను భ్రమచే నాలింగింపఁబడిన పోల్కెనున్నదియు, వర్తులాగ్ర
లంబమానపుచ్ఛంబగు కతనఁ గటకభాగవల్మీకవినిర్గతవితతఫణాలంబమానకృష్ణఫణి
సుందరంబగు మందరంబుం బురణించుచున్నదియు, సంతోషదంతురితంబును నగు
దంతీంద్రముం గాంచి పంచషంబులగు పదంబు లతిక్రమించి వందిబృందంబు లమం
దారవంబున లలితరాగావళీకలితంబుగా జయజయశబ్దంబు లుచ్చరింప నాశీఃపూర్వ
కంబుగా భూసురప్రదత్తంబులును నక్షతజయంబులునునగు నక్షతచయంబులు కర
కంజంబున మంజులకింజల్కపుంజరుచి సంపాదింప, వినయవినమితోత్తమాంగుం
డగు కతన వదనచంద్రసాన్నిధ్యంబునం జేసి సంకుచితంబును భక్త్యున్నమితంబును
నగు నంజలిపద్మంబున నా భూసురులఁ దగురీతి మన్నించుచు నధ్యక్షుల నీక్షిం
చుచు సైనికుల నాలోకించుచు నిజవిరోధియగు గజరాజు నీక్షించిన భయంబునం
బోలె సంకుచితంబులగు వాహినీసముత్కలదంబుజముకుళంబులు నాఁదగు వాహినీ
సముదంచితాంజలిపుంజంబుల నిజవదనచంద్రికటాక్షచంద్రికాప్రసారంబున గా
ఢముకుళితంబులుగా నొనర్చుచుఁ, బరిజనదత్తకరావలంబుండై దంతీంద్రనికటంబున
కేతెంచి కురుమూర్తి శ్రీనివాసుని మనమ్మునం దలంచుచు, సుగుణసాంద్రుండును
మంత్రిచంద్రుండును శుభచర్యుండునునగు వెంకటరెడ్డిచర్యుం గాంచి నావెను
వెంట నీవ యధిష్ఠింపవలయు నని యానతిచ్చి దంతీంద్రోపరినిబద్ధంబును మరక
తపరిచితశిఖరంబును మహానీలమణిజాలకజాలలాలితంబును సంఘచ్ఛాతకుంభస్తం
భాగ్రగుంభితజంభరిపుమణిరుచిసంభృతాంభోధరకదంబప్రభాడంబరంబును గలిత
రుచిమండలంబును నగు కనకమయమంటపమ్మును రజితనిశ్రేణికామార్గంబున
నధిష్టించె. ౩౯

క. పంకజనయనపదాంబుజ సంకలితమతియును గృతియు సరసుఁడునగు నా
వెంకటరెడ్డి గజంబును బొంకముగా నెక్కె భూమిపుంగవువెన్నై. ౪౦

సీ. బ్రహ్మాండభాండమ్ము పగులఁజేయఁగఁజాలు నట్టి యుద్దండదండాభిఘాత
మున నతిస్ఫీతమ్ముగను భేరికాపటహచయమ్మువలన నత్యద్భుతముగ
బయలుదేరిన మహాధ్వానం బనూనహేషాఘోషయుక్త హస్తప్రశస్త
కరటిఘటానంతగర్జితాశ్వార్జితాతిస్థైర్యవైభవాతిప్రకృష్ట

తే. గీ. మై యఖండోదయంబయి యప్రమేయ
మై యవార్యమై యనంతమై సమస్త
హరిదశేషాంతరంబులయందు నిండి
మెండగుచు గండుమీఱి ప్రచండమయ్యె. ౮౧

సీ. అత్యుజ్జ్వలత్కశాహతికృతిపరివిధానప్రతిపదలసన్నాటకములు
విలసితాత్మీయనిశ్చలబలశాత్రవప్రకరమహామనోత్పాటకములు
సుస్థిరాకారభాసురఖురాహతిపరిపాటీధరాతలాస్ఫోటకములు
నిర్జరేశ్వరమహాదుర్జయోచ్చైశ్శ్రవోధాటీవిశేషచపేటకములు

తే. గీ. అతివిచిత్రప్రకారకగతియుతములు
వివిధతరరత్నభూషణావేష్టితములు
స్ఫుటసటాచ్ఛటాత్యంతభాసురతరములు
నైనఘోటకములు నృత్యమాచరించె. ౮౨

చ. కటుతరదంతకుంతపరిఘట్టనకట్టనముల్ ఘనాభముల్
చటులతరదండకుండలనశౌండతరంబు లతిప్రభాఢ్యముల్
కటుచతురంబు లుద్ధతశుభంబులునౌ తదిభప్రకాండరా
ట్పటలము లెల్లెడం బురినిఁ బర్వి హళాహళిఁజేసె నత్తఱిన్. ౮౩

తే. గీ. శ్రీనివాసునకున్ మ్రొక్కి సేనయన్వ
లఁదుక సాచిన తనభుజలతయనంగఁ
జెలఁగుసిడమును దాల్చి చెన్నలరునొక్క
కుంజరము ముందునడిచె బల్ కుతుకమెసఁగ. ౮౪

వ. దానివెనుక సాదికరకలితకనకకోణాహతిజనితటాంకారప్రశస్తయశఃపటహాయు
గళఘటితపల్యాణంబును జవవిజిత విహంగంబునునగు నొక్క తురంగంబు మదున
గరీజాగ్రదవ్యగ్రహృద్య వాద్యనినదాటోపంబ భూపాలకీర్తిపూర్తిప్రకాశకంబను
సంతసంబునం బోలెఁ గులుకుచు నడిచె. దానివెనుక రక్షోక్షీషంబులును, నీలకం
చుకంబులును, గుంతంబులును ధరించి కళాత్రియవిశారదమతులగు సాదిపతు
లధిష్ఠింప నిర్మితోర్మిగతివిశేషమ్ములును, సతోషమ్ములును,ద్వారాపరాకృతగంధవా
హమ్ములును నగువాహమ్ములును, వాని వెనుక నొక్క గజరాజమ్మును, దానివెనుక
సేనాలలనాధృతశరదుత్ఫుల్లహల్లకతల్లజమాల్యసంశయావహంబులగు పాటలోష్ణీ
షంబులు శిరంబుల మెఱయ నుభయనితంబలంబమానాంచలచంచదరుణపారసస్తా

వనద్ధకటితటమ్ములతోడను, ధవళతరకంచుకాంతరీయకవచమ్ములతోడను, గండమండలయుగలంబమానకచమ్ములతోడను యథాక్రమమ్ముగఁ బంక్తిగట్టినడుచు భటపటలమ్మును, వారివెనుక నొక వారణేంద్రమ్మును, దానివెనుక నిఖిలజనరంజనఘననినదహృద్యహూణవాద్యవాదనచతురికోలాహలాభిరామపాణింధమశ్రేణులును సైణికులును, వారివెనుక నొక మదావళంబును, దానివెనుక సైన్యలక్ష్మీపృథులముక్తాహారాయమాణరాజతఘుటికానీరాజితాగ్రశిరస్త్రశేఖరితులును, పాటలతరవర్ములును, బలాక్రమమైకధర్ములును, నిర్మితపోషకశర్ములును, నిరంతరకృతజయవర్ములును, విచిత్రకర్ములును, వివిధపరికర్ములును, ప్రోక్షిప్తనళకులును, ధృతకరవాళకులును, నసితాంతరీయకంచుకనిచోళితాధఃప్రదేశులును, బహుపత్రికాఖులును నగుపదాతీసులును, వారివెనుక చంద్రమండలపాండురాఖండడిండిమకుండలజర్జరితనిర్ఝరనిర్ఝరగర్జనఘుర్ఘరనిర్దయమర్దితమర్దలపణవగణవరతాళజాలమంగళతుంగశృంగసుముఖగోముఖపటపటాత్కారచటులపటహాచటులనిర్యద్ధ్వనితూర్యకలితహస్తులును, సమాళిమస్తులును, ప్రశస్తులునగు భటులును, వారివెనుక వాద్యమానవాద్యవిశేషనిస్సరట్టుంకారసహచరకంతాకుంతారవులును, ఘటోత్కచసహచరులో, కబంధసనాభులో, అతికాయసచ్ఛాత్రులో, కుంభకర్ణసబ్రహ్మచారులో, నరాంతకసగోత్రులో యనఁదగి సీతారామభూపనామమాత్రశ్రవణజాతప్రహితరభక్తులగుచు విభీషణపాలితంబగు లంకాపురంబు వదలి చనుదెంచిన రాక్షసులో యనఁదగి యొసఁగువారును, బాలకులను కరుణ వరుణునిచే విడుపంబడిన తిమిశిశువులో నాఁదగువారలును, కుతుకంబున నవలంబితమనుజరూపమ్ములగు గజంబులో యనఁదగువారలును, మహాకోపాటోపులును, బలీనులును, నిలీనులయ్యు యూథశతసహస్రమ్ములతో నెదుర్కొను వారును, ప్రతాపవంతులును, వశీకసంతులునగు కాలయవనులును, వారలవెనుక నస్మద్భూపతి సరూపవైభవుండవు, నీవు కావని సంక్రందను శిరస్త్రరశ్మ్యాలనపూర్వకంబుగానిందించుపగిదిఁ గింకరకరనిశ్శంకకంపితములును సకింకిణీరవమ్ములును, నత్యున్నతములును, నానామూలాగ్రరచితరజకవల్లీవేల్లనమ్ములును నగుచు కామినీతనులతానమాశ్లిష్టకాముకాకారంబు ధరించిన శృంగారభల్లపటలమ్ములును, వాని వెనుకఁ బార్శ్వద్వయంబున నిరువురు పురుషు లతిరభసోల్లంఘనదౌర్లాలిత్యంబు నివారించుటకునై ఖలీనంబు నాకర్షించుచున్న కతన నున్నమితనిగాళంబును, న్యుబ్జీభూతవదనంబును నగుచు నిద్దానిచే నాకును నిరోధమాయను నీసున దంతమ్ములచేఁ బిండిఁజేయు తెఱంగున ఖలంఖలధ్వానంబొప్ప ముఖలీనంబగు ఖలీనంబును నములుచున్నదియును, వైష్ణవాగ్రగణ్యుండగు నస్మద్భూపాలుండు శ్రీతిద్వయంబు మన్నించుమనని తెలుపుభంగిఁ దానును శ్రుతిద్వయంబు నెసంగఁజేయు నదియు, నిజాధినాథరూపసౌభాగ్య

సర్వస్వనిర్వాపణధూర్వహుండగు సుగ్రీవపతి వాహనంబై జనింపంగోరి యేతత్తు రగావరోహణసమయంబున మునుమున్న యారాజన్యుని నయనపదవిం బడిన నాయం దధికానురాగుండగుననుం నిచ్చ మూర్ధమధ్యభాగం బధిష్ఠించినదియుఁ బరిచుంబితదాడిమీబీజంబును నగు మదనవాహనకీరము నాఁదగు మరకతరచితపక్ష పరిచుంబితపద్మరాగమణిచంచూపుటాంతరాళంబగు భూషాకీరంబుచే రమణీయంబును, నిజాధీశ్వరు తురంగంబుకన్న నిది యధికతరంబను నౌత్సుక్యంబున వచ్చి ముద్దిడుకొనుచున్న శకటిధనుర్లతనాఁదగు రత్నఖచితంబగు భూషాముఖరజ్జువుచేఁ గమనీయకపోలయుగళలలాటభాగంబును, అతిజవంబుగల నన్నణుమాత్రింబగు మానసంబుతోఁ బండితులు నైతముఁ బోల్చెద రెవె రెట్లు సహింతు నను ననూయంబోలె ననుక్షణంబును పంప్రల్యమానకోమలప్రోథపుటంబగుచు నూత్కారంబులు విడుచుచున్నదియును, మనకిరువురకును నుచ్చైశ్శ్రవస్సాక్షామ్యంబు స్ఫుటతరంబైనను నాకన్న నూర్ధ్వస్థితి నీకేలయని యింద్రతురంగంబును సంగరంబునకుంబిల్చుభంగి శశ్వదుత్క్షిప్యమాణాగ్రపాదద్వయంబును, నిద్దాని పశ్చార్ధంబు వాలియను వాత్సల్యంబున నిర్జరపతి యప్పనంబుగానంపిన హైమాంబుజమాలిక నాఁదగు పృష్ఠభాగభాసమానసౌవర్ణకలశమాలికాగ్రిథిత సువర్ణవధ్రిచే వలయితంబగుచు నంతరపర్యాప్తబహిరుచ్చలత్తేజోధారాసారపుంజమోయనఁ దగు వాలహస్తంబుచే నుదంచితంబును ననవకక్ష్యైక్రతావస్థానంబును నుధాంశుసామంతదీప్తియునగు కతనఁ జారదనిర్మితమోయనఁదగినదియుఁ ననుక్షణపదనాగ్రిసమున్మీలడ్డిండీరఖండపరికీర్ణధరాతలంబగు కతన మదావళిస్పర్ధచేఁ దానును మత్తియమ్ములఁ గ్రక్కుచున్నదియుఁబోలెఁ జూపట్టునదియు, వివిధమణిగణఖచితకనకపల్యాణపరిష్కృతపృష్ఠభాగంబగు కతన విద్యుల్లతాపరిరబ్ధంబగు శారదాభ్రముం బురణించుచున్నదియునగు సుగ్రీవపతి యర్వంబును, దానికి నలుదెసలఁ బజ్కీ-భూతంబులగు తురంగములును, వానివెనుక రత్నఖచితరుచిరకనకమంటపాంతరంబున మహార్ఘమణింబోలెఁ జెలఁగు సీతారామభూపాలుండును, డత్ప్రికాశనతత్పరంబగు సుద్ధనువర్ణంబుపగిది శుద్ధసువర్ణుండును, పశ్చాన్నిషణ్ణుండును. మంత్రిరేణ్యుండును నగు వేంకటరెడ్డియు నధిష్ఠించిన దంతావళసార్వభౌముండును, దానికి నలుప్రిక్కల ననేకగజంబులును, ఆవెనుక సౌశీల్యంబును దయాళుత్వంబును బత్యాజ్ఞాపరిపోషణంబును భగవదాయత్తచిత్తత్వంబును దాక్షిణ్యంబును నౌచిత్యంబును మహౌదార్యంబును మొదలుగాఁగల సుగుణమ్ములకు సంతసించి సరస్వతి యప్పనంబుగానంపిన హంసలునాఁదగు ధవళచ్ఛత్రచామరంబుల విభూషితశిరఃపార్శ్వభాగంబును పరివారశతాందోళికాసంఘపరివృతమ్మునునగు నాందోళిక నారోహించిన భూపాలాంబయగు లక్ష్మాంబయును, నావెనుక నాంధ్రకవితాగంగాతరంగంబనఁదగు తుంగంబగు తురంగం

బంధిష్ఠించి వాజిధౌరుండును నవాజిధీరుండును ప్రవిమలకాయుండును నగు తిరుమలరాయుండును, నాతని వెనుక సమారూఢగంధర్వుండగు వేంకటరాయుండును, నావెనుక నాకాశపదము నాక్రమించుపగిదిఁ దారకల రాల్చుపోలిక నంబోధింబానంబొనర్చుభంగి రిపుచ్ఛలఘూసంబుల నమలుపడువుగఁ బర్వతంబులం జూర్ణంబొనర్చువిధమ్మున దిగ్గజమ్ములం జలింపఁజేయుచందమున హేషారవమ్ములు సలుపుచుఁ బదాగ్రమ్ములెత్తుచు సాదికరాంచద్ప్రగ్రహమ్ముల నాకర్షించుచు నాస్ఫాలితస్కంధభాగులును వామకరతలాకృష్టఖలీనరశ్ములును దృఢతరగృహీతపల్యాణముఖులును వలకాంతనిరహితవామచరణులును నగు సాదిపతులు కశాచలనమాత్రమున నడిపింప నడుచుచున్న యుద్ధరంగాఖేటకమ్ములగు ఘోటకమ్ములును మహాసేనాజనితపారావారభ్రమావతీర్ణసగర్జనపర్జన్యశంకావహచతురరిపుతర్జనస్ఫూర్జద్దూర్జస్వలఘూర్ణమానచక్రనేమిసముదీర్ణవిశృంఖలక్రేంకారసకలవీరజనహృదయానందమ్ములగు స్యందనమ్ములును మదబంధురసింధురోపరివిశృంఖలతాడ్యమానభేరీభాంకారరవమ్ములు దశదిక్తటమ్ము లద్రువఁజేయ మందమందమ్ముగా నవారణంబగు నగరీతోరణంబునుండి బయలు వెడలుటయు. ౮౫

శా. ఉచ్చండమ్ములు హిండమానము లతిప్రోద్దండనాగేంద్రశుం
డోచ్చైచ్ఛ్రఘాతవిభీతముల్ వియదభిప్రోల్లంఘనాఢ్యమ్ములు
ద్యచ్చంచద్విహగేంద్రచిత్రగతు లత్యంతత్వరావిష్టముల్
తచ్చార్వశ్వము లాక్రమించె ధరణిన్ దండోపతండమ్ముగన్. ౮౬

శా. ఉత్క్షిప్తాయుధధాళధళ్యకలనాత్యుద్దీపితాశాంతరుల్
దక్షుల్ రూక్షులునైన సాదిపతు లుద్యన్నాళకారావసం
ధుక్షీభూతవిచిత్రలాస్యకలితానూనాపసర్పక్రియా
విక్షేపాశ్వములన్ ఖలీనఖిలనాప్తిం బట్టి రొక్కుమ్మడిన్, ౮౭

శా. భేరీరావము చేతఁ గొన్ని హరు లుద్వృత్తమ్ములై యుత్క్షిప
ద్ధారాశాగ్రపదాంచితమ్ములయి స్తబ్ధశ్రోత్రయుగ్మమ్ములై
రారాజద్విషమత్సరమ్ములయి యారబ్ధాపసర్పమ్ములై
యారూఢాచరితేరణమ్ములయి నేత్రానందరీతిం దగెన్. ౮౮

చ. కటుతరచండభానుకరకాండమహాపరితాపమున్ సహిం
చుటది మదీయనాథునకుఁ జొప్పడదంచుఁ దలంచి లోన న
క్కటికముఁబూని భూమి దివిఁగట్టిన చాందిని నాఁగ ఘోటక
స్ఫుటఖురఘట్టనోద్ధమగు ధూళిపరాగభరంబు వెల్వడెన్: ౮౯

క. తురగవరఖరఖురాహతిఁ బరాగ మంబరమునందుఁ బరఁగె న్వరము
క్కూరసోమభూపతనయుని వరూధిని ధరించు నాతపత్రంబనఁగన్.

క. నిజనాథాధికవిభవప్రజాధినాథావలోకపరిమిళితమరు
ద్వ్రజసంతోషవిషాదప్రజననశౌండమయి దివి పరాగ మెసంగెన్. ౫౧

చ. లలి నదె నీలకాహళములన్ ధరియించె గజచ్ఛటల్ కర
చ్ఛలమున వ్యత్యయంబుగ నెసంగుట కేమినిమిత్తమో! ప్రమ
త్తులకు వివేకముల్ మదినిఁదోఁచునె, దాన నె యారవంబు కా
హళరవభిన్నమై యెసఁగె నంచుఁ దలంచిరి కొందఱంతయున్. ౫౨

చ. ఖురపరితాడితంబయిన కుంభిని వే బతిమాలునిచ్చలన్
గరమును సాదిపాదచలనంబుల వేగుచుఁగౌఁగిలింతలన్
బొరసినరీతి నెంతయును భుగ్ననిజావయవమ్ములై జవో
ద్ధురగతిఁ గొన్ని గుఱ్ఱములు తుందుడుకొప్పఁ జరించె నయ్యెడన్. ౫౩

చ. హరియిటనుండువాఁడఁట మహోత్తుఁడు గాఁడె యితం డటంచు భూ
ధరములు స్తోత్రపాఠములు తద్దయు సల్పుచు సేవఁజేయ న
క్కూరుమతిసన్నిధానమునకుం జనుదెంచెనొ నాఁగ నేగె ను
చ్చరథము లుచ్చలత్ప్రబలచక్రవిరావభరంబులై తగన్. ౫౪

చ. తగుగతి సాదివర్గము లదల్పఁగఁ బొల్పగుమండలప్రచా
రగతు లొనర్చువేళ నిరుపక్కల నచ్చములైన పుచ్ఛముల్
నెగడఁగఁ గాళనూనచయనిర్మలచామరవీజనంబొన
ర్చుగతిఁ దనర్చె నెంతయును సొంపు జనింపఁగఁ గొన్ని గుఱ్ఱముల్. ౫౫

మ. తతమాద్యద్ఘనగంధసింధురచలత్ప్రోద్దాతపాదాహతి
క్షతభూజాతపరాగసంకలితదిక్కంబై ప్రహేషావిఘూ
ర్ణితతత్తుర్క్షితిపాలసైన్యపరితోనృత్యత్తురంగాళిసం
గతమై సైన్యమెసంగె రంగుగను రంగన్మంగళోపేతమై. ౫౬

మ. బలమాతంగపదాభిఘాతమున సంప్రాపించుకాలుష్య మి
మ్మల మందాకినిలో మునింగి శుచియై షోణాడనుంకించి యయ

ల్లలదుచ్చధ్వజవాయువుల్ తనకు నాలంబంబుగాఁగన్ వియ
త్తలముంజేరెడి భూమినాఁజెలఁగెఁ దత్తత్సైన్యధూళిచ్ఛటల్. ౫౬

చ. ఉరుగతి శ్రీనివాసునిమహోత్సవముం దిలకింపవచ్చి వి
స్ఫురితపరాగపుంజపరిపూరితమైన నభమ్మునందు సం
చరణ మొనర్చుచున్న దివిషచ్చయముం దనియించెఁ దద్ధ్వజో
త్కరము నిజోద్భవత్పవనఖండితభూరిపరాగజాలమై. ౫౭

సీ. తాళారవమ్ము లుద్ధతి మీఱు తురగఖురధ్వానమున విమిశ్రమ్ములయ్యెఁ
గాహళీధ్వానముల్ ఘననాగరాజఘీంకృతుల నెంతయుఁ గూడి నేకీభవించె
శంఖసంఘధ్వానరింఖణం బశ్వహేషావిశేషములతో సంగమించె
గజకంఠనిర్యదుత్కటరావముల్ భేరికారవమ్ములతోడఁ గలిసికొనియె

తే. గీ. ఇన్నియునుగూడి యేకమై యేపుమీఱి
యఖిలదిక్ప్రాంతముల నొప్పునట్టి పర్వ
తగుహలందున వ్యాపించి తత్ప్రతిస్వ
నములతోఁ గూడి కోలాహలముగ నెసఁగె. ౫౮

మ. ఘననిస్సాణరవంబులెల్ల రథచక్రధ్వానమం దైక్యముం
గనుఁడుం దత్క్షణమందు సేనయది రంగద్రంగభూమీసమం
బన నొప్పారెను మీఁద నెంతయును వేగాయత్తమై తత్క్షణం
బున రత్యంతవికీర్ణరూపయగు ఫ్రూవుంబోఁడిఁబోలెం దగన్. ౬౦

మ. మనుజుల్ కుంచితలోచనంబయిన తన్మత్తేభవిక్రీడితం
బును జిత్రంబగు సత్తురంగగతియున్ మోదమ్మునం గాంచి మీఁ
దను నున్నక్రమకశాఢ్యమా కరభముల్ దౌదౌవ్వల న్నవ్వి, రెం
దును సౌందర్యముగల్గువారికడ నన్యుల్మాన్యతం గాంతురే. ౬౧

మ. నను సర్వంసహయంచు స్తోత్రముల నానందింపఁగాఁజేసి తా
డనముంజేసెద రీజనుల్, క్షమయె కట్టా యింతకుం దెచ్చె, నా
కును నీస్తోత్రముచేత నేమి యనుచుం గోపించి భూదేవి త
జ్జనసంఘమ్ములమీఁది కెక్కె ననఁగా సైన్యాగ్రధూళుల్ పగన్. ౬౨

చ. ఇది నృపుసేన వేగముగ నేగెడు దీనిపథమ్ములోపలం
బొదలకుఁడీ మనుష్యులని ముందుగ సూచనఁజేయుభంగి నొ

ప్పిదముగ నుజ్జ్వలప్రమదవేల్లితవహాగజరాజుపై ధ్వజం
బొదవెను మాటిమాటి కనిలోద్ధతికంపితమై యెసంగుచున్. ౬౩

చ. పటుతరకోణతాండనముపై నెసఁగంగ నఖండకేళి ను
త్కటకరటీంద్రసంగసముదంచితదుందుభినిస్వనంబు ప్రా
కటముగఁబర్వ 'నాశివుఁ గాంచితె? నాశివుఁ గాంచితే' యటం
చటమటఁజెంది తల్లులు మహోత్సులతన్ వెనుకంగడంగిరా. ౬౪

తే. గీ. గజరథతురంగములు నలుఁగడలఁదనర
నొప్పునాసేన రథ్యయందొగిఁ బ్రవేశ
కలనఁ దనరారె వియదాపగాఝురంబు
కుల్యయందుఁ బ్రవేశించుకొమరుదోఁప. ౬౫

తే. గీ. రమణ గోమయగోముఖరంగవల్లి
గైరికద్రవరేఖలఁ గ్రాలువీథి
దనరె హరిదంశుకంబు ముక్తాసరములు
శోణమణిసరములుగల సుదతిమాడ్కి. ౬౬

క. భుజనాశాంచలవిలసన్నిజకరపంకజవిగళితనిబిడబిసలతా
వ్రజమోయన నటకాంతావ్రజకల్పితదివ్యరంగవల్లికలొప్పెన్. ౬౭

ఉ. బాలరొ చూడుమా నృపుని బల్ రయమొప్పఁగ రమ్ము నెచ్చెలీ
తాళుమెకింత పల్కవుగదా సుదతీ యిదె వత్తునంచు నీ
లీల విశృంఖలమ్ముగ లలిం దమలోఁ దమరాడుకొంచు న
క్కాలమునం జెలుల్ నృపునిఁ గన్గొన మేడలనెక్కి రందఱున్. ౬౮

సీ. తనచెలికత్తె హస్తము కేలఁగీలించి నిలిచి భూపతిఁజూచె నెలతయొకతె
తనమొగంబు మఱొక్కతన్విమూఁపున మోపి నరపాలు నీక్షించె నాతియొకతె
చాలమేలగునట్టి జాలాంతరమునుండి విభుని నాలోకించె వెలఁదియొకతె
అదియేమి యని సారెనడుగుచు నబ్బురంబుగ రాజుఁ దిలకించె బోటియొకతె

తే. గీ. శ్రీమహితుఁడైనభూపాలశేఖరుం డె
చట నెచట నెచ్చ టెచ్చ టెచ్చటయటంచుఁ
గుతుకమొప్పార వేఱొక్కయతివఁజూచి
పలుకుచు నృపాలుఁగనె నొక్కపడఁతిమిన్న. ౬౯

ఉ. 'కనుఁగొనుమీ నృపాలకునిఁ గన్గొనుమీ నృపుమీఁదనేమి గ
న్గొనెదవు రమ్మ ముందఱ కనుంగు. జెలీ మగవారు లేరు ల
జ్జనుగొననేల భర్తృభయసంగతు లిప్డటె! యత్త లోన ని
న్ననుకొని యేమినేయు' నని నంగనయొక్కతె క్రొత్తకోడలిన్. ౨౦

చ. కనుఁగొన నాకునుండెఁ గుతుకమ్మధికమ్ముగ నత్తగారి తి
ట్లను బడలేక నెమ్మది తడంబడుచున్నది బాల్యమందుఁ దా
మును మనరీతి నిట్లనె సముత్సుకతన్ గనలేదొ, కోడలం
చనినను మచ్చరంబిటుల నత్తల కుండుట కేమిహేతువో. ౨౧

మ. ఇది యొల్లప్పుడునుండుఁ జూడు మిటులేలే బాల నీనెమ్మదిన్
ముదమొప్పారదు మోమువాడె నదియేమోయంచు నూహింతునో
విదితంబయ్యెఁగదే చెలీయనుచుఁ దా వేమారు దత్ఫాలమం
దొదవున్ ముంగురులంటఁద్రోసెను మఱింకొక్కర్తు ప్రేమార్ద్రయై. ౨౨

సీ. ఓముత్తరాల నాకొక్కింత చోటిమ్ము చెలియరో యిచ్చోట నిలువరాదె
ముద్దియరో కొంతమోమెత్తరాదఁటే కనుఁగొంటినేను గన్గొనుమునీవు
అచటరాజున్న నీవిచటఁజూచెదవేమి యిటనీకుఁ జోటుండు నిట్లురమ్ము
ఓయమ్మ చోటు నాకీయవా యొక్కింత నీకెంత కోపమే నీరజాక్షి

తే. గీ. మొగము మటమటలాడింపఁదగదు నీస
మీపమున నుండ నిచటికి మేమువచ్చి
నారమే భారమేల యోనాతిమిన్న
చూతు మేమును నీవును జూడరాదె. ౨౩

చ. ఉవిదరో! గుబ్బలన్ బయఁట నుంచఁగదే యివి నీక పుట్టెనే?
శివశివ యంబరంబు కటిచెంత నమర్చుము వీరలందఱున్
యువతులుగారె నీవలెనెయుండిరె? వామభుజంబు నెత్తఁబో
కు వివశురాల! వామకుచకుంభము బైటికి వచ్చు నచ్చుగన్. ౨౪

ఉ. సారెకుముట్టఁబోకుమని సందడిఁజేసెడి నీవుసంఘమున్
జేరఁగనేల నేమమును జెందితివేని దిదృక్షయేలయం
చీరపినొక్క రొక్కకరి నెంచుచుఁ బౌరసతుల్ విలాసముల్
మీఱ నృపాలకుం గనుచు మేలుగఁజూచిరి రాజసైన్యమున్. ౨౫

ఉ. ముక్కఱ వామకర్ణమున, ముద్దులుగుల్కెడి కాంచి కంఠమం
దొక్కలతాంగి తాల్చి నృపునొప్పుగఁ జూచుచుఁ దన్నుఁ జూచు బల్
చక్కనికోడెకాండ్రను వెసన్ గరఁగించెఁ; దమంబె సోయగం
బెక్కుడుఁగల్గువారు నగ లేగతిఁ దాల్చిన నేమితక్కువౌ? ౨౬

ఉ. ఈతనిఁగన్న దే జనని, యీతఁడు బాలకుఁడయ్యు నిష్ఠ నా
చేతము గొంగిలించె నిఁకఁ జెప్పఁగనున్న దె. ఒవ్వనమ్మునం
దీతనివంటి మంచిమగఁడే దొరకన్ వలె నాకటంచు వి
ఖ్యాతిగ వృద్ధలున్ దరుణకాంతలు నెంచిరి కన్నెమిన్నలున్. ౨౭

తే. గీ. ఎవనిసామ్యముగనఁ దప మెనసి తా ర
మాకుమారుండెదిరియు రమాకుమారుఁ
డయ్యె నీరాజపుంగవుఁ డాతఁడేయని
యాదరమ్మున నొకకోమలాంగి జూచె. ౨౮

తే. గీ. మేడతుదనున్న నెలఁదుక మిన్నబాహు
లతచిగురునుండి పేలముల్ రమణ నృపుశి
రమున జలజలఁబడియె దరదళితవిమ
లములయిన మల్లెమొగ్గల క్రమముదనర. ౨౯

చ. క్షితిపతి గన్నకన్నులనె చెప్పుగ నన్యునిఁ జూడనోప నం
చతివ యొకర్తు పల్కె, నొకయంగన తా నిటుబల్కె 'సత్యమే
యతివరో! రాజుమోముఁ గనినట్టియొయారి మెసంగుకన్నులన్
మెతక మొగంబు గల్గుమగనిన్ గనినంతనె మొట్టబుద్ధియౌ' ౩౦

చ. స్మరుఁ డతిసుందరుండని ప్రజల్వచియింతు రితండ భూమిపైఁ
బరఁగినచో మనోహరత బైటఁబడున్ దదనంగభావమే
కరము యశమ్ము దెచ్చె, నటుగానియెడన్ మనభూమిపాలుముం
దఱ నతఁడేమిలెక్క యని తన్వి యొకర్తనె మన్మథార్తయై. ౩౧

క. కవిమిత్రసోమబాలక భవదుచ్చక్షేత్రమగుచుఁ బరఁగెడికన్యన్
గవిసియుఁ ద్వల్లగ్నాత్యంతవిభవుఁడవగుమని యొకతన్వి వచించెన్. ౩౨

క. ఏతత్సదృశవధూటీస్నితకుచద్వయము కనకచిత్రితచోళం
బై తగెనని కనకపటసమేతోన్నతకుంభములయి మెలఁగెఁ గలభముల్. ౩౩

తే. గీ. సైంధవుండీతఁ డేమనుసైంధవులమ
యితనియార్థవ్యస్థితికి సైతుమే యటంచు
నబ్జుఁ బడలాగుటకుఁబోలె నశ్వతతులు
దగ్రచరణములగుచు నృత్యమ్ముసలిపె. ౭౪

క. ఈరీతి యువతిరమ్యంబై రాజిలు నాత్మపురము నరయుచు మోద
శ్రీరాజితుఁడగుచును సీతారామనృపాలకుండు దరలెఁ వీథిన్. ౭౫

తే. గీ. మఱియు నయ్యాత్మకూర్పురమహిత రాజ
సౌధములయున్నతి వచింపశక్యమగునె ?
గగనచుంబినిజాగ్రజాగ్రన్మణిప్ర
కాండరుచిమండితార్యమమండలములు. ౭౬

శా. ఆరాజావసథాగ్రభూముల గవాక్షాంతర్గతుండైన యా
నీరేజారిని గాంచి యామికులు బల్ నిద్రాలసత్వంబు చే
న్నారన్ ఘంటయటంచు దండమున నత్యంతంబు తాడింపఁ జే
కూరెన్ మండలమధ్యమం దలకిణాంకూరంబు తోరంబుగన్. ౭౭

తే. గీ. ఆపురోపవనాపమ్యమందుఁ దపమొ
నర్చి నవనందనవనమ్మునకుఁ దదాప్తి
యెంత తలక్రిందుఁబడినఁ దానెనఁగదాయె ;
నలవడునె కార్యసిద్ధి నురాశ్రితులకు ? ౭౮

క. ఆపురినాత్మకపురంబని కాఁపుర మొనరించువారు గణియించుట యొ
ప్పే ! పరదేశీయులునుం బాపురె యాత్మకపురమనుట బహుచిత్రమగున్. ౭౯

మ. కొమరుంజుక్కలు తత్పురాంగనలతోఁ గ్రీడింగిలన్ జాలమా
ర్గములన్ హర్మ్యగతంబులై నయెడ నిద్రంబోని భృత్యుల్ మహా
ద్యములై సంకెలలన్ దగుల్ప శశి తద్వక్త్రాత్తభీతిన్ వద
ల్పమిఁ దత్రత్యులచేతఁ దాల్పఁబడు లీలాతారహారాళిగన్. ౮౦

వ. అట్టిపురవీథిన్ దరలి లోకేశుండగు శ్రీకేశవుఁనకు నతియొనర్చి, శ్రీనివాససేవార్థంబు జేగు నాకు వారుణీసమ్ముఖీనంబగు గమనం బనుచితంబని తలంచియో యనఁ బశ్చిమదిశాగమనంబు మాని కుడికెలనికిం దిరిగి వీథిని వదలి హరిదిశాగమనంబుచితంబని కొంతతడవు నడచి సూర్యోత్తరుండగు శ్రీనివాసునిసేవకై యుత్తరదిగాశ్రయణంబ

మంచిదియని యెఱింగినదియుంబోలె నుత్తరాభిముఖంబుగా నడచుచున్న సేన మహోత్సవసేవాకుతుకంబున నుప్పొంగివచ్చిన కృష్ణాభిధానవాహినినా స్వాధిష్ఠితకరిరాజపార్శ్వభాగమ్మునం దనరఁ, గనకరత్నమంటపమ్మునం దధిష్ఠించియున్న సీతారామభూపాలుండు కుడివైపున జలధిపీతంబులగు తోయంబులు జలధియందు దశభాగమ్ములును ధరణియందు స్వల్పభాగంబును సుభిక్షకాలమ్ముననె వర్షించు నీపర్జన్యుండను స్వార్జితదౌర్జన్యంబుఁ బోఁగొట్టుకొనునుంకించి గగనతలంబు డిగివచ్చి సముద్రభ్రాంతిచేఁ దనలోనంబడి యథేష్టంబుగ మధురజలమ్ములాస్వాదించి యచటఁ గొంచెము మాత్రమే వర్షించుచు నధికాంశమును సస్యాభివృద్ధికై భూతలమ్మునందొదవఁజేయు మేఘద్వయమోయననొప్పి, హాలికులు పీనాహోగ్రాభాసమానంబగు త్రికాచకమ్మునుండి డింప గృహీతజలమ్ములగుచు వృషభద్వితయస్కంధావనద్ధయుగమధ్యమ్మునం గట్టఁబడిన రజ్జు వాకర్షించుచుండ వివరాంతరవినిర్గళత్స్వచ్ఛతరజలధారాసారంబులగుచు యంత్రాధోమధ్యభాగవిరచితంబగు కుల్యాముఖమ్మునఁ దజ్జలమ్ములు చిమ్ముతఱి నటునిటు జెలఁగు జలశీకరమ్ములు జీవనప్రదానమ్మున నారామమ్ము బ్రతికించుచుంటివే యని పుష్పాంజలు లొసంగుపోలికం దెలుప, సఖండాదండవేదండతుండంబులఁ బురణించుచున్న మోటలచేఁ జెలువారు రాజవాపికను రాజసంబంధవాత్సల్యంబునఁ బోలెఁ జూచుచు, నాగరికకుచంబులచే జయింపఁబడిన మనము నగాగ్రమ్మునకుం బోవుదమని యెంచియుంబోలె నారంగనగశాఖల నాశ్రయించి యంత నగమ్మును నక్కుచమ్ముల కోడినదియే యను సాధ్వసమ్మునంబోలె ననిలకంపమానమ్ములై క్రిందికిం బడుచున్నవియు, నారామలక్ష్మీక్రీడాకనకతంతుసంతతిదంతురితకందుకంబులఁ బురణించుచున్నవియు నుపవనలక్ష్మీపరికల్పితరసభరితమంగళతుంగభృంగారనిచయమ్ముల ననుకరించుచున్నవియు, హరిద్రాపరిలిప్తకర్ణాటీవక్షోజమ్ముల నీసడించుచున్నవియు, నుద్యద్దినకరబింబదాస్యదానశౌండములునునగు పరిపక్వనారంగఫలమ్ములచేతను, మత్సనామిక యగునొక్కతె యూర్ధ్వభాగమ్మున నెసంగుచుండ సిగ్గులేక దానికెదురుగా నెట్లుందుమను నసూయంగాని, యంశుమత్ఫలాభిఖ్యయు శుభచ్ఛాయయునగు నే నుండ ననుదినమ్ము నీయంశుమంతుం డుదయించినతోడనే సభ్రమరకమలినీసద్మ స్తనకుట్మలంబులఁ గరముల మన్నించుచుండు నీతనిం జూడఁదగదను క్రోధమ్మునంగాని వ్యావర్తితవదనంబులును, రంభ వారవనితయాయెనను లోకాపవాదమ్మువలని యవమానమ్మునంబోలె నధోముఖంబులును గర్వాదుర్విదగ్ధయు నుపరివిహారమాణయు నస్మదభిఖ్యయునగు గణికం జయించి వచ్చెదమమ్మా మమ్ము విడువుమని జననియగు భూమిని యాచించుటకు నవనమితాంజలిపుటమ్ములై నవియుంబోలె నానమ్రఫలభరితశాఖాగ్రకుట్మలమ్ములును, నైకటికనగరవిలసల్లలనాజననిజజ్జైతోరుయుగళస్మరణజనితభయమ్మునఁ బోలె మందో

నిలకంపమానదళకదంబమ్ములును నగు రంభాకదంబమ్ములచేతను, నస్మద్భా
షాలు నాశ్రయించినవారి కుదగ్రఫలసిద్ధి కాఁగలదని సూచించునవియుం బోలె
నత్యున్నతశాఖాంచలప్రదర్శితబహుఫలమ్ములును, మౌక్తికహారగుచ్ఛపరివృత
పద్మరాగకలశఘటితమూలమరకతతులాపీఠమనోహరమ్ములగు నారామలక్ష్మి
దివ్యభవనవజ్రమయస్తంభమ్ములనాఁ దనరారునవియు, లంబమానప్రసూనగుచ్ఛ
పరికీర్ణ పరిపాకారుణఫలోద్భాసిభాగామూలాగ్రపరితతరపత్రశాఖారమణీయ
శిరోభాగమ్ములును, మారుతాందోళనావసరపరస్పరాభిఘట్టనవిశీర్ణపరిపూర్ణఫల
నివహనిరర్గళవినిర్గళత్పృథులరసధారాసారసంశయాపహమ్ములు నగు నారికేళ
ప్రకాండమ్ములచేతను నిబిడితమ్మును, నగరంగస్థానంబయ్యు నాగరంగస్థానం
బును, నముక్తకుసుమాభిరామంబయ్యు నతిముక్తకుసుమాభిరామంబును నగు
నారామంబు విలోకించుచుఁ, గించిద్దూరంబతిక్రమించి యచ్చట భగవంతుండగు
నుమాకాంతునకుఁ గృతనీరాజనపూర్వకమ్ముగా నమస్కరించి యచ్చోటు గదలి
ఆశ్యానంబగుకతనఁ బద్యకర్దమంబగు తటాకకచ్ఛప్రాంతమార్గమ్మున నడచు
చున్నదియు, దృఢగృహీతఖలీనరజ్జువులును, గించిదవనమితపూర్వకాయులునగు
సాదులచే సావధానప్రేరితంబులై ఘుర్ఘురశబ్దంబులు చెలంగఁ దటాకసేతువు
నారోహించు గుఱ్ఱమ్ములచేతను, నస్మదతిభారమ్ము నీసేతువు సైచునో లేదో
యని యూహించినవియుం బోలె మందమందగమనమ్మున నారోహించు వారణ
మ్ములచేతను, నిబిడితంబునగు సేనచే ననుగతుండగుచుఁ బార్శ్వభాగమ్మున నాస
హధర్మిణియగు గంగానదిని సర్వజ్ఞుండయ్యు నీశివుండు పరకీయంగాఁ జలముఁక
తన జటాజూటమ్మున నెట్లు ధరియించెనో యేను బోయి యడుగువాఁడనని
కోపమ్మున వచ్చి తత్పరమేశ్వరు దివ్యభవనంబు నరికట్టియున్న సముద్రుఁడో
యనఁదగినదియు, సేతుకైతవమహావ్యాళిపరిరంభణం బాచరించుకొఱ కతి
చపలాయమానాంతరంగలై శిరోరత్నంబులతోఁ గూడ నహామహమికతోఁ
జనుదెంచు నాగకన్యకలు నాఁదగు ప్రతిబింబితాంబుజబంధుబింబంబులగు తరం
గంబులఁ బరస్పరసంఘట్టనంబున నుత్కీర్యమాణశీకరనికరంబగుకతన నాకును
రత్నాకరసామ్యంబు గలదు, నన్నవమానింపకుమని తనకు ముక్తాంజలు లొసంగు
చున్నదియుఁ బోలె నెసంగుచున్నదియు, మహోత్సవదర్శనకుతూహలంబునం
బోలె పైకినెగురుచు సర్వంబు నీక్షించి యెంతతలక్రిందుఁబడినను నస్మత్తాత
నుండగు మదనుం డీభూపాలుని రూపంబులో శతాంశమ్మునుం బోలఁడని
సూచించుభంగిఁ దలక్రిందుగాఁ బొరలుచు జలమ్ము లతిస్వచ్ఛమ్ములగుకతన
నెంతలోఁతునకుఁ బోయినం గన్పట్టుచు సంచలనచాపలరభసవ్యావర్తితాధః
కాయమ్ములగు కతన మెఱుపులుం బోలెఁ బ్రతిక్షణప్రదర్శితధావళ్యమ్ములగుచు
గగనమునుండి జలరామణీయకంబు నాలోకించు నిర్జరాంగనల లోచనప్రతిబింబం
బులో యనఁ దనరుచుఁ, బరస్పరగృహీతపదార్థంబులం బరస్పరము గ్రసించుచు,

గ్రహించినదానిం జిందరవందరజేయుచు మరల నద్దానిఁ ముఖాగ్రమ్మునం
బొడుచుచు, నతిచాపల్యమ్మునం దిరుగుచు, జఠరాంతరం బనవకాశంబగుకతన
బహిఃపరిస్రుతంబగు ముక్తాఫలమ్ము నాఁదగు బుద్బుద
ముఁ ముఖనిస్వానంబున వెడలం గ్రక్కుచు, భగవంతుం
డగు శ్రీనివాసుండును వస్త్రదపతారం బెత్తినను సంతసంబునంబోలె గంతులిడుచు
డిండీరమండలమ్ముం గాంచి బకవధూటీభ్రాంతిం జేసి పిల్లలతోఁగూడ నధఃప్ర
దేశంబునకుం బోవుచు, దుర్జనులంబోలి స్వజాతిం గబళించుచు, నానాప్రకారం
బులఁ జెలంగు ననుకామీనమ్ములచే మనోహరమ్మును, నాత్మప్రతికూలదం
తావళవిలోకనసాధ్వసంబునంబోలెఁ దరంగభంగసంఘసంఘర్షణప్రేంఖిత
మ్ములగుచుఁ గదలు తామరసంబులచే నత్యంతభాసమానమ్మును, బృహస్పతిం
బోలె శ్రీమద్గురుతాంచితంబును, సంగరరంగముంబోలె సముచ్చలత్పృషత్కం
బును, ఘనాఘనముంబోలె శతహ్రదాంచితంబును, నుషస్సమయముంబోలె
నారక్తసంధ్యంబును, మృగయునింబోలె నుత్పలాసక్తంబును, మృగరాజుంబోలె
నాక్రాంతకుంభికాంతంబును, సకోకనదంబును నగు తటాకరాజముం దిలకించు
చుఁ, గించిద్దూరం బతిక్రమించి, విశ్లథీకృతముఖరజ్జువులును, నుత్తంభితవక్ష
స్కులును నగు తురగారోహకులు మందమందమ్ముగా తటాకవరణమ్మునుండి
యవతరింపఁజేయ డిగు తురంగమ్ములతోడను, నిమ్నస్థలావతరణమునకై సంశ
యించుచు నిషాదికరకలితాంకుశఘట్టనవేదన సయితము గణింపక శిరంబుల
నటు నిటు గదల్చుచు నెట్టకేల కేకైకచరణవిన్యాసపూర్వకంబుగా డిగుకతన
శ్రీనివాససేవాకుతూహలాగతజనకోపపాత్రమ్ములును, గంభీరవేదులును, ఘనో
రమమ్ములును నగు స్తంబేరమమ్ములతోడను, మహోత్సవదిదృక్షాచలితభూపాల
బలభరభుగ్నఫణభుజంగపుంగవసాహాయ్యకమ్మునకై భూధరత్వాభిమానమ్మున
భూమిని పరిక్కలుజేసికొని రసాతలమ్మున కేగు శైలజాలమ్ములు నాఁదగు
న్యుబ్జీభూతపూర్వభాగమ్ముగా డిగు పుష్యరథమ్ములతోడను, దత్తటాకప్రాంత
మ్మతిక్రమించి భగవత్సన్నిధిగమనకుతూహలం బున్నతంబుగాఁ జెలంగ వడివ
డిగా నంబాపురస్థితరాజమందిరసమీపంబునకుం జనునంతలోఁ దురంగమమ్ము
లం దాటించుచుఁ, గ్రమేళకమ్ముల నదల్చుచు, వారణమ్ముల ఘోషింపంజేయుచు,
వాదిత్రమ్ముల మ్రోయంజేయుచు, దుందుభిభాంకారమ్ముల విస్తరింపఁజేయుచు
బిరుదుపద్యమ్ము లుద్ఘోషించుచు, శరీరమ్ముల విఱుచుకొనుచు, సారసనమ్ములఁ
గటితటమ్ములం గీలించుచుఁ, పురస్థితగ్రామీణుల నివారించుచు, సరభస
గమనమ్ము నాజ్ఞాపించుచుఁ, బశ్చాద్దృష్టమాత్రమ్ములగు పర్వతమ్ముల దూరంబు
లుగా నొనర్చుచు, హర్షాతిశయమ్మునం బొదలుచు, నుత్కంపితకేతనంబుగా
నుచ్చాలితచామరంబుగా నున్మద్రితజాలకాతపత్రమ్ముగా నుత్క్షిప్తోత్కంపవన

వమ్ముగా నున్మస్తకఘంటారవమ్ముగా నున్మాలితధూళిపాళికమ్ముగా నుద్దాము హేషాఘోషమ్ముగా నుద్ధూతాలస్యమ్ముగా నజ్ఞాతబహుదూరమార్గాతిక్రమమ్ముగా నుదంచితాందోళికావహనధురీణజనవివిధనాదమ్ముగా ననన్యమానసమ్ములగు తత్సైన్యంబు లన్నియు నంబాపురమధ్యభాగవిలసితంబును నికామకాంతంబునునగు రాజమందిరప్రాంతంబున విడిసె. ౯౧

తే. గీ. బలములన్నియు నిట్లు లంబాపురంబు
నికటమున కేగి మోదవార్నిధి మునింగె,
నెలమి నంబాపురప్రాంత మెవరికేని
యధికతర మైన సంతోషమందఁజేయు. ౯౨

తే. గీ. గుఱ్ఱముల డిగి కొంద, ఱేన్గులను డిగియుఁ
గొంద ఱతిరభసమ్మును జెంది యంత
రక్షివర్గమ్ముతోఁగూడ రాజవర్యు
గజసమీపమ్మునకు వచ్చి కలసికొనిరి. ౯౩

తే. గీ. అంత గజశిక్షకునియాజ్ఞ ననుగుణముగఁ
గుంచితాంఘ్రిక మై యొప్పు కుంజరంబు
నుండి యొకభృత్యునికరంబు నూఁతఁగొనుచు
మంత్రితోఁగూడ డిగియె క్షమావిభుండు. ౯౪

తే. గీ. యోధుల శిరస్సులమ్ముల నొప్పుమీఱు
నంజలుల పుంజములఁజూచి యాదరించి
యత్యనర్ఘమణీరుచు లమరు హర్మ్య
రాజమును జేరె నంత నారాజసుతుఁడు. ౯౫

తే. గీ. ఎంతదూరమ్ము మనరాతు లేగువారొ
యనుచు ననుకొంటి మిచటనే యాఁపినార
లనుచుఁ జుల్కనఁజేసి నవ్వినవిధమున
హరులు హ్రేషలొనర్చుచు నురుఁగుఁగ్రక్కె. ౯౬

తే. గీ. జీనులనుదీసి మీద ఖలీనములను
జారవిడిచి పురస్థలిఁ జేరఁజేయ
హరికిశోరము లంబాపురాంకణమున ము
దంబుచేనొప్పె ననుట యుక్తంబకాదె. ౯౭

తే. గీ. ఇద్దియెంతయు దారుణాకృతి భజించె
ననుచు భృత్యులు కటకభూమ్యంతరమున
శంఖులను గొట్టసాగి రశ్వగజబంధ
నములొనర్చుటకై లగుడముల నూని. ౯౮

మ. ఎసఁగన్ సోలుచుఁ గొన్ని, బంధముల నాకృష్టమ్ములై కొన్నియున్
వసుధన్ మూర్ఛని డెక్కలన్ జొనిపి యుత్పాటించుచుం గొన్నియున్
వెసమై ముట్టెలఁద్రిప్పుకొంచును వడి న్నిట్టూర్పుల న్నించుచుం
బసమై మేయుచు గాత్రముల్ దులుపుచుం బాటిల్లె నాయశ్వముల్.

గద్య.

ఇది శ్రీకింకవీంద్ర ఘటాపంచానన విద్వత్కవిబాలకలానిధి బాలసరస్వతీ శతావధాని తిరుపతి వేంకటేశ్వరులచే నాంధ్రీకృతంబగు శ్రీనివాస విలాసమ్మునం దృతీయోల్లాసము సంపూర్ణము.

శ్రీరస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్రీనివాసవిలాసము



తిరుపతివేంకటీయము

## చతుర్థాశ్వాసము

సీ. కందోయినించుచక్కఁదనమ్ముగల్గి యచ్చొగుపాటుసేయుచిత్తరువు లొకట
బలవైరిమణిభిత్తికలఁ జెలువారు నిద్దపుపెద్దనిల్వుటద్దమ్ము లొకట
దర్పణచ్ఛవిఘనాంతరతటిద్భ్రాంతి నాట్యముసల్పు నీలకంఠమ్ము లొకట
నెమిలికొమ్మల పింఛియముల తెమ్మెర గ్రిమ్మి శ్రమవాయుపండితాగ్రణులు నొకటఁ

తే. గీ. దనర రక్షివిచక్షణాధ్యక్షకాభి
రూపధారికనైష్కికగోపసావి
దల్లవాంశికసంచయమల్లముఖ్య
సుందరంబగు నరపాలమందిరమున. ౧

క. పరిజనకరసరసిజయుగవిరచితబహుచందనోదబిందువ్యజనాం
తరమురుదర్పకసంచితపరమానందానుబంధబంధురమతియై. ౨

వ. ఆసీతారామభూపాలుండు యామమాత్రావశిష్టంబగు దివాభాగమ్మున సకలా
ప్తులుం బరివేష్టింపఁ దల్లికి నమస్కరించి తదనుమతిఁబడసి నిజమందిరాంగణ
నిర్ణిద్రింబగు భద్రగజంబుం బరిజననికరంబు కవరాలంబం బొసంగ నమాత్యశ్రేంగ
వుండగు వెంకటరెడ్డితోఁ గూడ నధిష్ఠించి చనుచెడ. ౩

చ. అరుణనివారువమ్ములు తదద్భుతజైత్రవరూధినీలల
తురగకదంబకంబుగతితో సరిదూఁగ మదిం దలంచి స
త్వరగతి మించెనాఁగ నొకదాఁటున దాఁటెను బశ్చిమావనీ
ధరముసమీపభూమికి సదాగతి దాల్చినరూపులోయనన్. ౪

వ. ఇట్లరుణుండు చరమాద్రిసమీపభూమికిం జేరంబోవుటయు యథాపూర్వమ్ముగఁ జతురంగబలమ్ములు గలిసి కొలువ నానరపాలుండు కురుమతిగిరిపరిసరపుష్కరిణీ తటమ్మునకుం జేరి యచట నిజాజ్ఞాప్రవర్తితంబగు బ్రాహ్మణాన్నసత్రముఖంబున సుఖమ్ముగనున్నంత. ౫

సీ. భుంజానులైనవిప్రులు గోరుశాకాదు లెంచి వేర్వేఱ వడ్డించువారు
వచ్చికూర్చున్న విప్రనిచయంబులకు భుక్తిభాజనంబుల నేరుపఱచువారు
భాజనంబుల నేరుపఱచినంతనె వస్తునికరంబుచేత నిండించువారు
ఆపోశనంబెత్తునంతనే జారీలు వంచి నేతినిగ్రుమ్మరించువారు

ఆ. వె. భక్ష్యలేహ్యచోష్యపానీయములు చేతఁ
బట్టి వేయిసార్లు పంక్తిపంక్తి
కరిగి 'మీకు మీ' కటంచును వడ్డించు
వారలైరి వంటవార లచట. ౬

సీ. నేయిరాల్చవదేమి నీతాతసొమ్మ యంచఱచి యొక్కని చేతఁ జఱచెనొకఁడు
పప్పుతెమ్మనఁ దేకపరువెత్తె దేమి రోగమని యొక్కనిఁ దిట్టఁగడఁగెనొకఁడు
బొత్తరాహులు వీరలనియెఱుంగవెయంచుఁ దెగువ నొక్కనిఁ జేతఁదిగిచెనొకఁడు
బొత్తగాహులకన్న నధముండనే యంచుమించి యొక్కని నిరసించె నొకఁడు

తే.గీ. తెమ్ము తెమ్మని కుయివెట్టి తెచ్చినంత
వలదుపొమ్మనె నొకని నవ్వులకు నొకఁడు
నృపునితోఁజెప్పి నేఁడు నీనిక్క మాని
పించెద నటంచు నొకని వేధించె నొకఁడు. ౭

క. దోన్నెలలోఁగలఘృత మొకచిన్నమ్మను మిగులకుండఁ జెంబున వేవే
గ న్నెలకొలుపుచు లేదని దొన్నెలు బోర్లించె నొకఁడు దుండగమెనయన్.

చ. నను సుగుణాయటంచు స్తవనంబొనరించె నితండు మంచివాఁ
డని మఱికొన్నిభక్ష్యముల నాయవనీసురుభాజనమ్మునం
దునిచెను వేగ నంసయుగ ముబ్బ నిరక్షరకుక్షియైన యా
దనికుఁడొకండు సూదుఁడని తత్పదవాచ్య మెఱుంగకెంతయున్. ౯

క. నవనీతము తెమ్మని యొక యవనీసురుఁ డడుగ నొక్కఁ డన్నం బిదిగో
నవనీతం బని యొసఁగెను నవనీతంబొసఁగె నొకఁడు నవ్వుచు మరలన్. ౧౦

వ. మఱియు నొక్క పాచకుండు నిష్ఠానత్వవిఖ్యాతంబగు తేమనంబిదిగోయని పరివేష్టింపఁ గేవలవైయాకరణుండగు నొక్క ధరాసురుం డీతేమనపదమ్మునకే సూత్రమ్మున నిష్ఠానత్వంబుగలిగె నని ఖసూచియగుచు భోజనమ్ము వదలి పరిశీలించుచున్నంత సరసతరసాహితీసాహితీధురీణులగు కవులెల్ల నాతనిం గాంచి.

ఉ. చూచుటకేమి 'క్షోయణచి' సూత్రముగాదది బుద్ధి కేన కా
ణాచినటందు వర్భకగణంబులకైన సుసాధమైన యీ
వాచక మెన్నఁడేనిఁగనవా ? యమరంబునలేదు పాప మీ
పాచకుఁడైన మేలని యపస్మితముంబొనరించి రెంతయున్. ౧౨

క. ఇవి చూర్ణాపూపిక లీయవి మౌద్గము లివి లవణము లవి దాధికముల్
చవిఁజూడుఁ డంచుఁ బాచకు లవిరళగమనమ్ము సల్పిరటు నిటు పంక్తిన్. ౧౩

మ. సురసాలాళినొసంగుఁడంచు నొకఁ డౌత్సుక్యమ్మునంబల్క ని
ర్జరలోకమ్మున కేగ మానవులకున్ శక్యంబె మేమెట్లు లా
సురసాలమ్మును జూడనోపుదు మటంచున్ బాచకుల్వల్క భూ
సురులున్ మార్జికలంచుఁ దెల్పిరి తగన్ సూదాళికి న్గ్రమ్మఱన్. ౧౪

సీ. మోదకమ్ముల నాసలేదు పొమ్మనువార లాజ్యమ్మునకు దండమనెడువారు
చించ నెప్పటికి వాంఛింపఁబో మనువారు తమకద్దు లోకచేత నిమురువారు
సురభినీరముద్రావి సొమ్మసిల్లెడువారు తక్రపాన మొనర్చి తనియువారు
పద్యము ల్జదివి బొబ్బలు వేయువారును బొబ్బట్లచవి తలపోయువారు

తే.గీ. అన్నవితరణసుకృతము నెన్నువారు
పొట్టఁజూచుచు బ్రహ్మను దిట్టువారు
పాలకుండగు సోమభూపాలసుతుఁడు
పృథివి నేలుతమంచు దీవించువారు. ౧౫

వ. మఱియును జగ్ధార్థకబళులు నజగ్ధకబళులును జర్వితమనోహరులును, భోజనాయాసమ్మున లేవనశక్తులగు వారిం జూచి నవ్వువారును నవ్వువారల నాక్షేపించువారును, తృప్తులయ్యును నాసదీరక భక్ష్యమ్ములవంకఁ జూచువారును నరపతికులాభరణంబగు సీతారామభూపాలుం డనుదినంబిట్టి సంతర్పణం బొనర్చుచుండవలయు మేమునుం దినుచుండవలయు మీకేలయని నవ్వువారిం గాంచి కోపించువారును నగు ధరాసురగోత్తములం గని డెందమ్మున నమందానందంబు

కందళింప నటనుండి వెడలి తద్గిరివరపరిసరతటమ్మున మణికుట్టిమంబగు నొక కనక మంటపాంతరమ్మున రత్నకంబలప్రాంతకల్పితంబగు నొక్క భద్రాసనంబున సుఖాసీనుండై కాంతతరవారకాంతాకలితనర్తనవిలోకమ్మునం గాలక్షేపం బొనర్చుచున్నంత.

చ. తతమగు నంబరీషపరితాప మితఃపర ముద్ధురంబుగాఁ
బ్రతివిపణిం జనించునను పల్కులు విన్నదివో లెనంతఁ గు
ర్మతిగుహనుండి వెల్వడియె మాధవుచక్రి; మవక్రవిక్రమో
ద్యతుల కనుగ్రహంబు శరణాగతులం దధికంబగుంగదా. ౧౬

చ. సరసులకున్ విరోధులగు క్ష్మాపతియేనుఁగులెల్ల నాత్మపు
ష్కరిణిఁ గలంచునో యనుచు సారసలోచనుఁడూహఁజేసి పు
ష్కరిణికిఁ దోడుగమ్మనుచుఁ జక్రమునం పెనొ నాఁగ నుల్లస
త్త్వరగతిమీఱుఁ జక్రపతివచ్చె సరోవరతీరభూమికిన్. ౧౭

చ. అనుదిన మేగు నియ్యది మహోత్వర నెచ్చటికో యటంచు దాఁ
గనుఁగొను వేడుకన్ వెడలు కంజవిలోచను చేతిశంఖమో
యన రజనీమనోహర మహఃప్రతిపక్షిమహామహోదయం
బునఁ దగుఛత్రముందనరెఁ బొల్పుగఁ జక్రముమీఁద నెంతయున్. ౧౮

ఉ. పాములకున్ విరోధియగు పక్షివిభుండిఁకఁ గుర్మతిందుర్చే
వాములిశాఁగలాఁ డతఁడు వచ్చిన మద్ధరజ్జుసర్ప మే
మేమి యవస్థఁజెంది మఱి యేమయిపోవునోకోయటంచుఁ ద
ద్భీ మదినెంచెనా రవియు వేగ మునింగెను బశ్చిమాంబుధిన్. ౨౦

తే. గీ. శంఖచక్రంబులివిరెండు సరసిజాక్షు
చేతులందుండునని జనుల్ చెప్పుచుందు
రిచట నే నొంటిగానుంట యుచితమగునె
యంచుఁ జక్రము గుహలోనికరిగెనంత. ౨౧

తే. గీ. ఎపుడు దుర్మతిసంబంధమెనసియుండు
యుఁగవిగమమందయిన దానినుడుగఁబో ద
టంచు హరిపరిజనము లహంకరించి
మోదిరోయన దుందుభి మొత్తిపెట్టె. ౨౨

క. ఆదట ఖగరాడాగమనాదరసూచకములగుచు సత్యద్భుతభే
రీదంధణనాదంబులు రోదఃకుహరంబు కరమద్రువఁ బిక్కటిలెన్. ౧౭

క. కృతతాత్కాలికపూజారతుఁడై కుర్మతిధరాధరస్వామి దయా
మతి ఖగరాడ్వాహోద్యతమతియై గుహ వెడలె భక్తమండలి పొగడన్. ౧౮

వ. ఇట్లు వెడలి చనుదెంచునెడ గ్వారసన్నద్ధంబును, శిరస్సమాటీకమానగత్నకోటీ ఖచితకోటీరమ్మును, నుత్ఫుల్లపత్రమ్మును, గాంచనాంచితవర్ణమ్మును నగు గరుడవాహనంబు కురుమూర్తిగిరి శ్రీనివాసనివాసం బగుటంజేసి యఖిలకులగిరి శేఖరం బగుఁగావఁ దదనుగ్రహంబువడసి నీవును దాదృశంబగు కీర్తి సంపాదింపు మని హేమాచలంబు పనిచిన సరత్నశృంగపక్షుండగు హేమాద్రితనయుఁడో యనఁ జెలువారె. మఱియును నిఖిలదితిసుతమండలఖండనోద్దండుం డగు పుండరీకనయనుం డుభయపార్శ్వలంబమానమేచకనై జయంతీపటవిరాజమానంబగు నిజవిజయస్తంభాగ్రింబునం దెత్తిన పద్మరాగమణికలశంబునాఁ జెలఁగు నాసామూలసమారబ్ధభ్రూయుగాంతరోజ్జృంభితకుంకుమతిలకంబును, నిఖిలలోకభీకర నాగరాజశిరఃపాటనోచితంబగు సృణియోయన నొప్పు దంభోళికాటవ సమపాటవం బగు చంచూపుటంబును గలదియు, నావంటి ద్విజరాజగునీతని వదనంబునంగూడ ద్విజరాజోదయంబు కలిగెనని జనులు వచించుచుందు రవి నాకంటె నధికశ్రీకంబులో న్యూనశ్రీకంబులో చూచెదనని బాల్యచాపల్యంబునం జూడవచ్చి యాజన్మకఠినశిలమ్ములగు నామధారణమాత్రమును సయిపని తద్రిదమ్ములచే నుభయధాఖండితుండైన బాలచంద్రుని శకలంబులు వికలాంగమ్ములగుటంజేసి పోనేరక సెలవులఁ దగులుకొనియెనోయనఁ దగుకోరలచే శ్వేతాతసీకోరకయుగళభాసురంబగు బంధూకకుసుమగుచ్ఛరాశింబోలునదియు, ద్విజరాజను నను రాగంబున వచ్చి గ్రుచ్చి కవుఁగలించుకొనిన తారావళులు నాఁదగు తారావళులచే నెసంగునదియు, జేజేరాజుకన్న నోజమునం బదిరెట్లు పెద్దయని తెల్పుభంగి బాహుయుగళదశాదశావతార భాసురంబగు కులిశంబునా నహిం గోత్రిపతువిదళనచణంబగు నఖరనికరమ్ముచేఁ జంద్రకాంతిం ద్విగుణమ్ముగాఁజేయు ప్రసారితకరతలమ్ములచే బ్రహ్మాండమండలం బెత్తి యొక్కసారి బంతిభాతిఁ గ్రీడింతునని దెలుపుభంగి నున్నదియు, నికుంచితపాదయుగళంబగు కతన మత్స్యదృశుండగు వలీముఖశిశువున కశక్యంబగు చండభానుమండలనిగిళనంబు నేనొక్కపదమ్మునంజేసెద జనులారా చూడుఁడని యెగురుచున్నభంగి నున్నదియు. మునుపాకశాంతకాలము సురాశ్రయంబు నాకు దూరీకృతంబుగా నొనర్చితి వట్లు కలకాల మనుగ్రహింపుము నిన్నాశ్రయించెదనని వేఁడుకొను సుధయో యనఁదగు సితోత్తరీయమ్ముచేఁ దనరునదియు, రుద్రైక్రకాసక్తంబయ్యు నారాయ

శైకభక్తంబును శ్రుతిద్వయమనోహరాంగంబయ్యు ననంతశ్రుతిమనోహరాంగంబును బన్నగోచ్చాటనపక్షవాతంబయ్యు విపన్నగోచ్చాటనపక్షవాతంబును నిఖిలజగద్విజయాయతనంబును నఖిలతేజంబుల కాధారంబును నఖండనయమ్మున కాగారంబును రెండు రెఱంగుల సుకీర్తి నవలంబించుచున్నదియగు వినతానందకరమ్మునగు నాగరుడవాహనం బధిష్ఠించి మత్సనామకుండును ద్రయీశరీరుండును, భగవదాశ్రితుండును, నగు నీపతగేంద్రున కెంత తేజంబు కలదో చూచెదనని యంబరతలమ్మునుండి యుపరిస్థలమ్మునకు ద్రేలుచు నిజరుచిధిక్కరణచణతత్తాదృశతదీయతేజోవిలోకనసముద్భూతసాధ్వసవిగళత్తేజోధారాసారంబగు భానుమండలంబునాఁ దనరారు కనకదండాగ్రభాసమానకనకాతపత్త్రంబును, సద్దానితోడ మైత్రిం జేయు భంగిఁ దనరారు మణిమకుటంబును దాల్చికతన నిశయందొక్కసారిగా భానుమండలయుగళోదయం బొడఁగూర్చి నిజశక్తిం బ్రకటించువానిభంగి నొప్పుచు, సుధాహరణప్రస్థానసమయంబున ఖగపతిచే సమానీతంబులగుచు నిజావాసభేదకుండగు శతనిం గాంచి భయంబున ముహుర్ముహుః కంపమానంబులగు మౌక్తికపుంజంబులోనాఁ దగు కింకరాందోళితహంసవర్ణకచామరంబు లిరుపక్కియలఁ దనరఁ బక్షిరాజముఖనిష్ఠ్యూతచర్వితానేకదర్వీకరధూర్వహమహత్తరశిరోరత్నంబులోయన జాజ్వల్యమానంబులగు ప్రదీపబృందంబుల యమందప్రభచే గిరిప్రాంతంబులు పల్లవితంబులునాఁ జెలువారుచుండ మందమందమ్ముగా బయలువెడలి భక్తవాత్సల్యంబుం బ్రకటించుభంగి సీతారామాస్థానమంటపకుట్టిమంబునకుం జని సరభసకృతప్రణాముండును, ప్రాంజలిబంధుండును, సగద్గదరవుండును, సానందబాష్పుండును, సపులకాంకురుండును బాలుండయ్యు భగవద్దివ్యముఖారవిందమరందాస్వాదనస్తిమితమధుకరాయమాణలోచనుండగు కతన దూరీకృతచాంచల్యుండును, నగు నాసీతారామభూపాలునిచే సేవింపఁబడి కొంతతడవు దశమీవేదికయం దుపచితపూజాపురస్కారుండగుచు నాకురుమతిగిరీశ్వరుండు నిజావాసగుహాంతరంబుం బ్రవేశించు నంతలో నతిశాంతుండగు నా మహీకాంతుండును యథాపూర్వంబుగా సముచ్ఛలచ్చతురతురగకరిపరరథకులనిబిడీకృతపార్శ్వుండగుచు మంజులంబగు కుంజరేంద్రంబు నధిష్ఠించి నిఖిలజనకదంబాకరంబగు నంబాపురంబుం జేరి బహువిధదర్పణస్ఫారంబగు నిజాగారంబున సుఖమ్ముగఁ గుముదినీవిటకామినియగు నయ్యామినిం గడపె నంత. ౨౫

ఉ. శౌరికి నాగమార్ఘ్యకలశంబిడి సన్నుతిఁ గాంచగాఁ దదా
కారనుమాత్ర వేఱగునగంబను నేనెటు లూరకుండు బం
గారుపయోధరంబొకటి కానుకొసంగెదనంచుఁ దాల్చెనాఁ
గా రుచిమీఱెఁ దూరుపునగమ్మున శీతగతనూర్కబింబమై. ౨౬

మ. తనకాల్వెట్టినమాత్ర లోకముసమస్తంబున్ శుచింజేయు న
బ్జుని దోషాకరుఁ డం ప్రడెబ్బంగక కరంబుల్ సాఁచి కోయం దమఁ బా
యని నిశ్శ్రీకమలిన్యుపగ్రహణసౌఖ్యంబందుచున్నట్టి సూ
ర్యుని దోషాకరుఁడంచుఁబల్కెదము చంద్రుంబల్కఁగాఁబాడియే. ౨౭

తే. గీ. తేజుగలవానియందు వర్తించునట్టి
దుర్గుణంబులు బైటికి దొరలవకట!
కువలయధ్వంసమొనరించు రవియు లోక
బాంధవుండంచు నుతియింపఁబడుటలేదె! ౨౮

చ. రవికిరణప్రభాపటలరంజితమా మహీభృన్నికాయ మె
క్కువ రహిఁగా నిజాధిపతి కుర్మతిభూధరనాథునుత్సవం
బవునని దిక్సరోజముఖులందఱతో నవకుంకుమాంగరా
గవిలసితాంగకంబగుచుఁ గన్గొనవచ్చెననంగ శోభిలెన్. ౨౯

తే. గీ. అగు నితఁడు నన్నుఁబోలి కంజారి, యిర్వు
రకు సుహృద్భావమున్న గౌరవముగల్గు
ననుచుఁ జందురుఁ దలఁదాల్చె ననఁగ రజత
కలశతో శ్రీశుదరికి నాగమ్మ వచ్చె. ౩౦

తే. గీ. లచ్చికుచములతోడఁ బోల్పంగవచ్చు
దీనినను పేర్మి చేఁబోలె.ద్విపసమావృ
తంబయిన కలశగల జలంబుచేత
బాద్యమును గొని హరి మోదభరితుఁడయ్యె. ౩౧

తే. గీ. మెల్ల మెల్లనఁగొందఱు మిగులవేగ
గరిమఁ గొందఱు జనములు గలసిమెలసి
కురుమతిగిరీంద్రకందరాకరుని హరిని
గొలువ నరిగిరి కరముల ఫలము లమర. ౩౨

ఉ. చరమధరంబుసన్నిధికి సారసబాంధవుఁడేగునంతలో
నరపతివారుపంబుల స్వనంబున మించిన దుందుభిధ్వనుల్
కరముఁజెలంగు సైన్యములు గ్రమ్మ మదావళి మెక్కియేగె న
క్కురుమతి శైలనాయకునకుం బ్రణమిల్లి ముదంబులందఁగన్. ౩౩

తే. గీ. నాకుఁగలపేరు ధరియించి నాకు దాస
చర్యలొనరించుచున్న యాచకరాజు
వచ్చెనో లేదో యని చూడవచ్చెనో య
నఁగ వెడలెఁ జక్రరాజంబు నగమునుండి. ౩౪

తే. గీ. మాకుఁ దనదర్శనం బిచ్చి మమ్ము ధన్య
తముల నెన్నఁడొనర్చునో దానవారి
యనుచు మంత్రులు కవులు చుట్టును జెలంగ
మహివరుం డుండె మణిమయమంటపమున. ౩౫

సీ. వలలోఁ బడిన జక్కవలు నాఁగఁ జండోయి దుడుకుమీఱఁగఁ దొంగితొంగిచూడఁ
బడగవిప్పిన నల్లపాము నా వెన్నుపైఁ బైని గీల్జెడ బరాబరులు సేయ
పట్టిపిండినఁ దేనె పట్టునా గానంపుఁ జెలువు వైఖరి తేనె జిందఁజేయఁ
దేనెసోనలు నివేదించుచాడ్పునఁ గాళ్ళగజ్జెలు ఘుళుఘుళ్ళు ఘుళ్ళురనఁగ

తే. గీ. వారకాంతలు మిగులశృంగారగరిమ
నభినయము కొంతదనుక నాట్యమ్ము కొంత
దనుక గానమ్ము మఱికొంత దనుకఁ జూపి
మించి భూపాలకుని గరఁగించి రచట. ౩౬

క. కదలక మానసవికృతిం బొదలక నలకుసుమశరులఁ బోలెడి తనుసం
పదలఁబొదలు నానరపతి వదలక నటియించు వారవనితలఁ జూచెన్. ౩౭

ఉ. తమ్మునకుఙ్ బయోనిధిగతమ్మయి యింపెసలారు రత్నజా
తమ్మును దెచ్చియిచ్చి లసితమ్ముఘటింపఁదలంచియో యనన్
దమ్ములరేనితో నతిదురితమ్ముగ పశ్చిమవారిరాశిపా
తమ్మొనరించెఁ గాశ్యపి; సతమ్ములు గావె సగర్భ్యభావముల్. ౩౮

ఉ. నింగినివీడి వారిధిమునింగినభానుని మీనపాళి నా
రంగఫలభ్రమన్ గదియరాఁ దదపారగభస్తిరాశి కాఁ
కం గడునోష్ఠభాగములు కాలఁగఁబోలును, గాకయున్న దే
నిం గబళింపఁబోయియును నేఁటికి భీతి మెయిం జలించు నే. ౩౯

తే. గీ. సరసియొడ్డునఁజేయుపూజలను గొనుచు
ఝిల్లికారావమంతట బోరుకలఁగ

హరి గుడుసువాలు కుసృతిధరణిధరగు
హాంతరంబున కంత రయమునఁ జనియె. ౮౦

తే. గీ. ఖగుఁడని పతంగుఁడని తన్ను జగములెల్లఁ
బల్కు పల్కులు నిజముగా భాస్కరుండు
పతగభావము గనెననఁ బక్షిరాజు
లచ్చిమగనింటిగుమ్మ మలంకరించె. ౮౧

తే. గీ. కుండలిత్వంబు రెంటికిఁ గొమరుమిగులు
గానఁ బన్నగమును బతంగమును సమము
లనుచుఁ బన్నగతల్పకుండయ్యు శౌరి
చెలఁగుచుఁ బతంగమును నధిష్ఠించె నపుడు. ౮౨

ఉ. ఇనమువిరోధికిం దనయ నేనని నల్లనియేరు గర్వముల్
దవిలిన నా సరస్వతియుఁ దా నిజసాదిసగర్భ్య నెక్కు మా
ధవు మహముల్ గనన్ భువికిఁ దారినసూర్యనకున్ జనించె నాఁ
గ వెలసె ఛత్రముల్ బసిఁడి కామయి శౌరిశిరస్థలంబునన్. ౮౩

వ. ఇట్లు విచిత్రంబగు పత్రరథతురంగమం బారోహించి మించురుచి వహించియున్న యక్కురుమతిగిరి పతిఖగనాథమహామహామహీయస్త్రాజనితఘనతరసంతోష నటనచటులంబులగు మరాళంబులు నాఁ డంగుమీఱు చామరంబులు వీవ సోపానంబులకు మొట్టమొదటినుండి చిట్టచివరవఱకు రెండెసలఁ బసమీఱఁ బక్షిభూతంబులగు భక్తజాతంబుల యుదస్తంబులగు హస్తంబుల శస్త్రంబులగు గంధకబంధుర దీపంబు లంతరాంతఃప్రతిఫలితపరస్పరరేఖాభిరామంబులగుటం జేసి నిజాధినాథ శ్రీనివాససేవార్థంబుగా నిజఖనీజనితమణీగణపరిష్కృతపద్మరాగమణీగుంభితలంబమానైకావళీభూషితంబునాఁ దనరు నక్కురుమతిగిరీంద్రంబు నిర్యత్ననిర్యత్తూర్యత్రికారావమిళితసేవాహేవాకజనకోలాహలదంతురితభేరికారావముఖరితంబులగు గుహాముఖంబుల నుదంచితంబగు ప్రతిధ్వానంబను నెపంబున నిజమహోత్సవంబు నుతించుభంగి నెసంగఁగదలి చనుదెంచు నెడ. ౮౪

శా. దంతిన్ బ్రోచిననాఁటిధాటి చెలువొందన్ వేఁడు మాతోఁడు శ్రీ
మంతంబైన పతత్రినాయకభుజామధ్యస్థలం బెక్కి మా
చెంతం జేరుచునున్నవాఁడని తలం జేదోయి సంధించి య
త్యంతమ్ము న్నుతియించె భక్తతతి తత్ప్రావీణ్యముల్ బాడుచున్. ౮౫

సీ. బత్తి గల్గినవారి నెత్తి పెంచెడిపేర్మి గలుగు దేవర ! నమస్కారమయ్య
పాపరాబువ్వఁజొప్పడుముక్కుగలపక్కిసామిసాహిణి ! నమస్కారమయ్య
పాఁబులుక్కకల్కిపాపటివేల్పురారాతి నగయైనవేల్ప ! దండంబులయ్య
జడదారులమదినెప్పుడు కాఁపురముసేయు నల్లమైసామి! దండంబులయ్య

తే. గీ. మేము నీవార మిదియెల్ల నీమహత్త్వ
మనుచు నానందబాష్పమ్ము లినుమడింపఁ
దలల దోసిలులొగ్గి యెంతయును నమస
రింపసాగిరి వేంకటరెడ్డిముఖులు. ౮౬

చ. గిరిపతి పైకినెక్కి యిరుకేలును నొక్కటిఁజేసి యాదలం
దిరముగ మోడ్చి తద్వదననీరజరమ్యరుచిప్రవాహభా
స్వరఝషదంపతీభవదపారవిశాలవిలోచనప్రభన్
నరపతియున్ నమస్కృతులొనర్చె ఖగేశవిహారిశౌరికిన్. ౮౭

తే. గీ. కౌతుదినమందు మహము చేరంగవచ్చె
నంచు సేనాని నెమిలి యూహించి వచ్చి
పింఛమును విప్పెనోయన వెలసెనపుడు
పింఛమయమగు గొడుగు భూవిభుశిరమున. ౮౮

సీ. రతనముల్ చెక్కించి పతిసేవకై వసుంధర కానుకిచ్చిన మురుదనంగఁ
దపనీయమణిగణస్థగితమైయొసఁగు కాననలక్ష్మిరతతసంపు నత్తనంగ
క్షిప్రాపతన్నిర్ఝరప్రమదాశనద్ధ్వస్తకాంచీకలాపంబనంగ
వేల్పురోవెలఁదుల వీటులదండలనుండి తరలిన పొగడపూదండయనఁగఁ

తే. గీ. గటకవిధముష్టునికియె కర్జమనుచు
భాసమానప్రదీపముల్ పంక్తిగట్టి
వలయరూపమ్ముగాంచి చెన్నలరెఁ గటక
శబ్దవాచ్యమ్ము భూపాలసైన్యమచట. ౮౯

సీ. అలుచేత లోకమ్ము లాడింప జీవమ్ము గ్రమ్మివచ్చిన పైఁడిబొమ్మలనఁగ
జగములెల్ల జయించి జయపత్రమువహింప స్మరుఁడు పంపినమంత్రశక్తులనఁగ
శృంగారరసము జేజేపెద్ద గరఁగించి కరువుగట్టినయంత్రకాంతలనఁగ
వైరాగ్యమును జంపివైవఁగా రతి పంప వచ్చిన మృత్యుదేవతలనఁగ

తే. గీ.. వారకాంతలు చెలులతోఁ వచ్చి రాగ
మాలపించుచుఁ బాడుచు నభినయచ్ఛ
లమున శుకపికరవనిందలనుసలుపుచు
హరియెదుట నాచునలిపి రత్యద్భుతముగ. ౫౦

వ. ఇట్లు మంగళధ్వానపురస్సరంబుగా నూరేగి.

తే. గీ. దీపరేఖలతోఁ నిరుదెసలయందు
వాహినీనామ మది సార్థకపటిమఁ దనరఁ
బజ్జగాఁ బ్రసరించుభూపాలసేన
చేరిగొలువఁగ వేదిఁ గైసేసె శౌరి. ౫౧

వ. ఇట్లు దశమీవేదిక నిషీదనం బాచరించి యర్చకకృతసపర్యలం గటాక్షప్రసారమ్ములం బరిగ్రహించుచు భవద్వదనారవిందసుందరఘృణీలహరీపరాభూతుండగు నస్మద్వల్లభు ననుగ్రహింపవేయని వేఁడు స్వాతియనఁదగు కర్పూరదీపమ్మునఁ గృతనీరాజనుండై కదలి మరల గుహాగృహప్రవేశంబొనర్చె నెడ. ౫౨

ఉ. నాకు వయస్యయైన దివి నావలెఁ గాక సమగ్రిబుత్కర
త్నాకులమంచు రత్నములు హస్తమునంగొని రత్నగర్భ యా
యాకసమందఁజేయ నవి యందక జాఱెననంగనొప్పి బా
ణాకృతిగంధక జ్వలనయంత్రిగళ ద్ఘుటికానికాయముల్. ౫౩

శా. శౌరి శ్రీఁగనవచ్చి చూచియుఁ బునస్స్వస్థానముం జేరుచోఁ
దారాసంతతి తుష్టిభారమునఁ గ్రిందం జాలెనా రాజిలెం
దారామండలగంధకజ్వలనయంత్రప్రోచ్చలద్ఘోరచూ
త్కారధ్వానవియద్గతాగతచలస్వహ్నిస్ఫులింగచ్ఛటల్. ౫౪

సీ. భగవంతుతిరునాళ్ళు భక్తిమైఁ జూచి సంతసముపొందై యున్న తల్లితోడ
మాటమాటకుఁ దేనె పోటురా నుతిసల్పు కలవుదీరిన మహాకవులతోడఁ
జతురుపాయోపాయమతి రాజకార్యముల్ నెఱవేర్పఁగల మంత్రివరులతోడఁ
బులిలైన మీసాలు మెలిపెట్టి పెకలించు చిరుతచేష్టలుగల్గు సేనతోడ

తే. గీ. రాజు కురుమతిధరణీధరమ్ము వదలి
కదలిచనుదెంచె జగదంబ కరుణకలిమి
సకలసంపత్సనాథమై సరసతతికి
బాపురేయనఁ దోఁపు నంబాపురంబు. ౫౫

తే. గీ. సప్తమీపతియైన భాస్కరుఁడు నాఁటి
కురుమతిగిరీశునుత్సవం బరుగు దేఱ
భక్తిమై సేవఁజేయఁగ వచ్చెననఁగ
నుదయగిరిమీఁద రుచిమీఱ నుదయమందె. ౫౬.

క. భగవత్సేవయొనర్చిన జగములరాగంబు లడఁగు జనులకనుచుఁ జె
ప్పఁగనెంచెనో యన నంతట ఖగరాజు ప్రణష్టరాగగరిమఁ గాంచెన్. ౫౭

క. అరుణుం డుదయింపఁ గరాంకురపానముచేసి వనఁగఁ గోఁకలనెల్లన్
సరసిజము లరుణచ్ఛవిఁబొరసి జలజరాగమణుల పొలుపు వహించెన్. ౫౮

చ. సిరిచనుదోయితోడ సరిఁజేయుదు రందఱు కూడియున్న యి
క్కరివరకుంభయుగ్మము నొకండని వన్నన, రొక్కకుంభమున్
బరిగొనినంత నిర్వ్యరసమంబుగఁ జాతురఁటంచు నెంచె నాఁ
గరము కరీంద్రకుంభయుగిఁ గ్రాలె రమాపతితీర్థకుంభమున్. ౫౯

తే. గీ. నాకుఁ గుంభయుగంబు నున్నయదికాని
మలినమైయొప్పునంచు నమ్మత్తగజము
శుచియయినకుంభమొకఁడు దాలిచెననఁగ
రజతకుంభంబు గొనుచుఁ దీర్థంబుదెచ్చె. ౬౦

క. కురుపతిధరణీధరమున మురవైరి యుషస్సపర్య పూజకులెల్లం
గరమాచరించునంతటఁ బరివారముతోడ ధరణిపతియుం దరలెన్. ౬౧

సీ. దుందుభిధ్వని మహీనభోభాగములు నిండె మర్దళారవము సమ్మర్దమయ్యెఁ
గాహళధ్వానంబు కర్ణంబులు పగిల్చెఁ గయినేఁతగనె భద్రగజచయంబు
వారువంబులు వల్గువలనముల్ గావించె ఖేటకమ్ములు మేళగింపు గాంచెఁ
జామరమ్ములు కరాంచలచాలితములయ్యెఁ గటకమెంతయు లసద్గతులమించె

తే. గీ. ధ్వజములెత్తిరి వీథులు తడిపి మల్లె
పూలు చల్లిరి కత్తులు పొసఁగఁజేసి
రఖిలసైనికులకుఁడు నయ్యావనివరుని
యాజ్ఞ తమతమయాదలలందుదాల్చె. ౬౨

తే. గీ. పార్థివాధమ్మునఁ జతురంగబలము గొలువ
నశ్వమందు యశఃపటహములు జెలఁగఁ

జూపరులు సంతసమ్మునఁ జూచుచుండ
భవ్యసంతానశయము నెక్కెఁ బాగ్గ వుండు. ౬౩

చ. ఒడిసి మదీయవంశభవు నొక్కని బాలుని రామనాము నె
క్కుడుతమి లోబిగించుకొనఁగూడునె నీకని వైరవాహితుం
డడుగఁగవచ్చె నాఁగఁ జెలువారెడి ఛత్రము తోడఁగూడ న
య్యొడయనివెన్క నెక్కె కరి నొప్పగ వెంకటరెడ్డి ధీరుఁడై. ౬౪

ఉ. దుందుభిరావముల్ నృపునితోఁ జెలరేఁగుట లాలకించి చే
యందగుకృత్యముల్ మఱచి యందఱు మంచిగతి న్వెలందు లా
నందముతో నృపాలకుఁ గనంజను దెంచుచుఁ జూమనంతలో
నం దగనేగె వేగ మహినాథుఁడు చామరవీజ్యమానుఁడై. ౬౫

తే. గీ. వారువమ్ములు నెక్కఁజెన్నార నృపతి
యంతరానందకలితుఁడై యఖిలబలము
చెలఁగికొలువఁగఁ గురుమూర్తి శిఖరిచెంతఁ
గలసరసుఁ జేరి యచ్చటఁ గరిని డిగియె. ౬౬

ఉ. స్నానముఁజేసి పుండ్రములు చక్కఁగఁదీరిచి భృత్యసత్తముల్
మానుగఁదోడరాఁగ నగమధ్యఁ బితామహుతండ్రి వేంకటే
శానుఁడు నిల్పినట్టి కపిచంద్రుని మారుతపుత్రుఁగాంచి యెం
తేనుతియించి యంతఁ జనియెం గురుమూర్తిగుహాగ్రభూమికిన్. ౬౭

సీ. గోవిందయని పెద్దగోలఁగొల్పెడువారు జలజనేత్ర యటంచుఁ జాటువారు
దేవదేవ యటంచుసేవజేసెడువారు, మురవైరియనుచును మ్రొక్కువారు
శ్రీనివాస యటంచుఁ జెలఁగియాడెడువారు ఫణిశైలపతియంచుఁబల్కువారు
కరిరక్షక యటంచుఁ గరమునోమెడువారు, నిందిరాధనయంచు నెరఁగువారు

తే. గీ. నన్నురక్షింపుమని వేఁడుచున్నవారు
పరిజనరక్షింపుమా యనిపల్కువారు
ప్రోవుమన్నను నొట్టనఁబోవువారు
నైనభక్తులఁగనియె నయ్యవనిభర్త. ౬౮

ఉ. కొందఱు పూలదండలను గొందఱు దివ్యమణిగణప్రభా
సుందరభూషణంబులను సొంపుగఁ దాలిచి శ్రీశుసేవ కా

నందరసమ్ము వైటఁబడె నాఁ జెమటల్ స్ఫురిఁగట్టఁ దొందరన్
ముందఱ నారికేళఫలముల్ గొనియుంచిరి దుస్థలైతగన్. ౭౯

క. జనులహళాహాళిఁ జూచుచుఁ జని సీతారామనృపతిచంద్రుఁడు భగవం
తునికంధరాగ్రభాగంబునకున్ సపరిజనుఁడగుచు ముద మెసఁగఁ బొదలన్. ౮౦

వ. నిజశిరోవిరాజమానసరోజలోచనచరణాంగుష్ఠమ్మునం జనియించి నికటతలపటుతరశ్రీచూర్ణరేఖాంచలహాటకగరానకర్షకంబు తాఁకునం ద్విధాభూతమై యధస్థలలలమ్ముఖ్రికుటీయమునమధ్యభాగమ్మునం గలసి పవనప్రభూతలావణ్యసాగరసంగమంబు గనిన గంగాలహరీయుగంబు నాఁదగు ప్రకాశితశిఖరనాసికామూలమిళితస్వాభోర్ధ్వపుండ్రయుగమ్ము మొగమ్మునం దనర వకుళమాలాసౌరభీసమాస్వాదనవివశీకృతంబగు మధుకరనికరంబనఁదగు సరసీజవీజనరం బురంబునం జెలువార నిరంతరలవణజలనిధిసమాలింగనవైరస్యయగుటం జేసి యిందిరాసుందరీసుందరకరారవిందస్యందమానమకరందమాధుర్యంబును విజ్ఞానప్రదంబును నైతద్విరచితంబును నగు ద్రావిడాగమసాగరంబు కరంబు కరంబులం గౌఁగిలించుకొని సేవించుచున్న గంగానది నాఁదగు శిరోత్తరీయవల్లిక దివ్యదేహంబునం దనర, భగవద్గుణంబులను బంగారువారంబుల నిగమయంత్రింబులం గ్రుచ్చి ధరించిన దివ్యసందంశికాయంత్రికయనఁదగు వ్యాఖ్యానముద్రచే నారాయణపారమ్యంబునకై నఖాగ్రస్థధూళీమాత్రంబైన సంశయంబు లేదని సూచించుభంగి నెసంగుచుఁ బ్రతిహారునకు దక్షిణభాగమున నిష్ణాతుండును జ్ఞానగురుత్త్వప్రదర్శనసముత్తారితానేకభవపన్నగవిపన్నజనుండును ఘనజీతలంబును నక్షపథంబు బనిపింపవచ్చిన ద్యుమణిరెయాయనఁదగువాఁడగుకతన సంసారసాగరతరణియని నుతింపంబడువాఁడును ప్రపన్నజనకూటస్థుండును శఠారియు శఠారినామకుండును నిఖిలవైష్ణవకులాభరణుండును భగవంతుండునునగు వకుళాభరణున కెరఁగి, మఱియు నుభయవిభూతిప్రదానమ్మునం జనియించిన యశోరేఖాయుగళంబనఁదగు సితోర్ధ్వపుండ్రద్వితయమును దురితపిశాచాపసర్పణంబునకై ధరించిన కనకవేత్రంబనఁదగు తిరుచూర్ణరేఖయును నిటలతలంబునం దనర, నిజమచిత్స్వోద్యోతకంబగు శిఖ శిరంబునం జెలఁగ, ఫణిపతిభావంబు మనుజావతారసహితంబయ్యును హృదయంబునం దిముడక వెలుపలికి వచ్చు తరళతరతత్ఫణామణీరుచియనఁదగు కాషాయశాటిక కటితటంబునఁ దనర హృదయస్థపద్మాక్షసూచకంబు నాఁదగు పద్మాక్షమాలిక యురంబునఁ గరంబు మెఱయ, నిజాధీనమోక్షలక్ష్మీకరస్థితకమలకుట్మలమనియు జగదభయరత్నసంపుటంబనియు నెన్నఁదగు నంజలితో విశిష్టాద్వైతమతస్థాపనంబునం బడసిన సధ్వజవిజయస్తంభంబు నాఁదగు సజలపవిత్రదండత్రయంబుతో ధవళతరమృణాలసూత్రవిభ్రాంతిం జెలువు నుపవీతంబుతోఁ దనరు

నుజ్జీవితశ్రీవైష్ణవచయ్యండగు రామానుజాచార్యుం బ్రణుతించి ప్రచురసత్త్వులగు వేంకటరెడ్డిముఖులతో, 'క్షంతవ్యో మేపరాధ' యని ధ్యానించుచు వెల్లిగొను సంతోషబాష్పమ్ముల నతిమందప్రసారితైకైకపదవిన్యాసుండగుచు భగవన్మందిరకందరాభిముఖుండై చనునవసరమ్మున. ౨౧

తే. గీ. బెత్తములు చేతఁబూని 'భూవిభుఁడువచ్చె'
నంచుఘోషించి జనుల వారించుకొనుచుఁ
దనకుఁ గొందఱు భృత్యులు దారిదెలుప
నరిగెఁ గురుమతిపతిగుహాద్వారమునకు. ౨౨

తే. గీ. 'ఇచటనుండుఁడు రాజుగారేగుదెంచి
వారు లోపలఁ జొట్టులేమ చిమ్మొదలను
మానుఁ'డని భటులు జనులను మాన్పుచుండఁ
గురుమతీశ్వరుదరికేగె ధరణివిభుఁడు. ౨౩

క. మితపరివారముతో సంతతము న్విచ్ఛిత్తి లేని నానాదీప
ప్రతతివితతకాంతితిరస్కృత గాఢతమస్కమయిన గిరిగుహాలోనన్. ౨౪

సీ. పదునాల్గులోకముల్ బహునిష్ఠచే నహదిజావమొనర్చ్రనభాగధేయమనఁగ
ముడుపుమూటలుగట్టి మ్రొక్కువారల రోగతతులు పాపు మహౌషధంబనంగ
కురుమతిక్షోణిధ్రగుహలోనఁబుట్టిన లలితమహేంద్రనీలంబనంగ
ముక్కరాన్వయమందుఁ బుట్టుభూపాలకు లార్జించుకొన్న పుణ్యమ్మనంగఁ

తే. గీ. గారుకమ్ముల కెనయు నాకారగరిమ
గలిగి దయచిమ్ము రూపంబుఁ గలిగి చెలఁగు
విశ్వంభరు దివ్యమంగళవిగ్రహంబు
గాంచె వేడుకఁ గన్నుల కఱవుదీఱ. ౨౫

వ. వెండియు సోమబాలపాలనచతురంబగు నిది నన్ను మాత్రము పాలింపదేయని తలపోసి శరణాగతంబగు సోమబాలరేఖయో యనఁదగు నఖరేఖచే మనోరమంబును సంపుటీకృతంబును నగు పాదయుగంబును ఖగనాథోరస్థల మహానీయైకావళీహారాయితంబును, హరిచరణంబు మజ్జన్మశరణంబని గరుసంబుగాంచిన సురతటిని యతిశయంబు సహింపక పాదజాతయగు నద్దానికన్న నుత్కృష్టంబగు వైశిష్ట్యంబు సంపాదింపఁ గటీతటంబునం ద్విజన్మత్వంబుగాంచిన యమునా

నాఁడగునదియునగు నూరుయుగళంబును, దానిం గాళిందీభ్రాంతింజేసి చెలియని
కౌఁగిలించికొనిన సరస్వతి నాఁడగు పీతాంబరంబును, మదీయధరణీధరభూష
ణంబీమహామహుఁ డని సంభ్రమంబునం బరతెంచి కౌఁగిలించుకొనిన శేషాహి
నాఁడగు వజ్రకవచితకటిసూత్రంబును వినిమయకలనంబునందును సామ వ్య
త్యాసంబులేని మధ్యమమునకుఁదగిన భూషణమోనాఁగఁ దాదృశంబై మనోజ
మహారాజమణీవరణసందేహావహంబగు కాంచికచే విరాజమానంబగు మధ్యమం
బును, మత్స్యహజంబగు నీకరంబు వామంబయ్యు భగవద్విజయశంఖాలంకృతం
బగుచు నన్నీసడించుచున్నదను నవమానంబునం బోలెఁ గటీతటంబుం జేరి యధో
ముఖంబగు వామకరంబును, సంసారచక్రచంక్రమణమ్మున ఖిన్నమతులరయి
యేలకృశించెద రయ్యయ్యో యీఁగిరినున్న మదీయచరణయుగళసేవ యొనర్పుఁ
డని సూచించునదియోయన నధఃకృతాగ్రంబుగా జనుల కభయమొసఁగు నభయ
హస్తంబును, చిరకాలము తన బింబాంతరమున నెలకొనియెనను సౌహార్దంబునఁ
బరిరంభణంబాచరించుకొనిన భానునికరనికరమో లేక యురోవిరాజమానలోక
జననీకరారవిందస్యందమానపరాగరేఖయోయను సంశయంబొదవఁజేయు నుత్త
రీయీకృతపీతాంబరంబును, వియత్తలంబు జననియగు తననాభికమలంబు తెలియఁ
బుత్తెంచిన వచ్చి నిజోరఃకృతనివాసంబులై మఱలఁ జనని తారకలో నాఁడగు
నానాభిలంబమానతారానాయకముక్తాస్రజంబులును, నిసర్గతేజంబును ద్రయీశరీ
రంబునుగల నావలెఁ గళంకియగు నీచంద్రుండును భగవన్నయనంబ యగుటంజేసి
మత్సముండనఁదగె నేనిపుడ తదురంబునం జనియించి తదౌత్కృష్ట్యంబు సంపా
దించెదనని జనించిన నభోమణియో యనఁదగు కౌస్తుభమాణిక్యంబును, దనకుం
గల చంద్రోపద్రవంబు తద్భగిని యగు రమకుం దెలిపెదనని యురస్థలం బాశ్ర
యించి యచటఁ గౌస్తుభంబను దీపంబువలన భయంపడి సమీపముననున్న నాభి
గుహం డాఁగఁబోయి యచటను హారీయనాయకమణిం గని సూర్యుండనుకొని
జడిసి పార్శ్వంబునఁ దారావళీభీతంబయి యటుచనలేక కృశించియున్న తమో
రేఖయనఁదగు రోమరేఖయు, బాల్యచాపల్యంబున వనమాల నతిక్రమించి
యచటఁ దమయాధముంగానక డాఁగియున్న తిమిరశిశువనిగాని లేక దిష్టని
గ్రహాలవణిమహాహస్కారతనయాసముద్బద్ధంబగు నుడి యనియుంగాని పలుకంజాల
పుట్టుచున్నయును, నేను చిత్రరూపముగలదాన నే నబ్జరూపంబుగలదాన నీకేల
యహంకృతి నీకేల కోపమని కొంతదనుకం గలహించునవియుంబోలెఁ బ్రత్యేక
మబ్జమిత్రరూపంబు లవలంబించి చెలఁగు శంఖచక్రంబులచే విరాజితంబగు
దోర్దండాంచలంబులును, పార్శ్వద్వయాస్థితలగుచు సవతులగు రమయు, భూమియు
నిజవదనసౌందర్యావలోకనంబునకై కలహింపుచుండ నిరుపురను ననునయించు
టకై యిరుప్రక్కలం గట్టుకొనిన మకురంబులు నాఁడగు కపోలంబులును,

గరిరక్షకా మమ్మనుగ్రహింపుము పిల్లలమని కర్ణంబులందగులుకొని వేడుకొనుచున్న నిజవదనలావణ్యజలనిధిం జనియించిన మకరశిశువులోయనం దగు నింద్రనీలమణిఖచితంబులగు మకరకుండలంబులచే మనోహరంబగు గండయుగళంబును, నిజవదనలావణ్యజలధింబడి విహరించుతఱి నచట నించువిల్కాని రాకపోకలకుం గట్టినగట్టనందగు నాసిక కిరుప్రక్కల రెండునుంబడి యొకదాని నొకండు దూచుకొనమిం జాతంబులగు మీనదంపతులనందగు లోచనయుగంబును, సర్వతోభద్రంబను పేరు తనకుగల్గినను వేదగు తనయాకులకు లోకనాథపదనారవిందమకరందసేవనంబునం దీపి కలిపింతునని పిచుమందంబు మొదటం బరీక్షకై పంపిన పర్ణయుగమునాందగియు, ముఖరుచి యను మడుంగునం గస్తూరీతిలకమను చేంపపిల్లలం గ్రసియింపవచ్చి పరస్పరలిప్సాజనితకోపమునం గలహింప నుద్యమించి మొగంబులు వంచియున్న నీటిపాములో నాందగియును, మేము సద్వంశప్రభవులము మీరు గోత్రభిదుపలంబులరని కర్ణమౌక్తికంబులు పరిహసింపంగ నైంపక నాసావంశంబున జనియించి యెగిరిపైంబడి కర్ణమౌక్తికంబులతోడం గలహింపుటకుం జాలుగట్టి యెదుర్కొను నింద్రనీలంపుమణులు నాందగు కనుబొమ్మలును, మదనవీరస్థాపితత్రిభువనవిజయసూచకాగ్రభాగోద్ధయతోవ్యాలంబిభ్రూపత్రనాసికేతుస్తంభాగ్రసంభత్తద్ధ్వజచిహ్నమీనశాబకంబని గాని లేక కందర్పవీరభ్రూలతాచాపసమారోపితనాసావంశాంకురబాణాగ్రఫలకంబని గాని పలుకంబడి ఫాలబాలచంద్రుం గళంకింగాంజేయు కస్తూరీతిలకంబును, నిరుపమానసౌందర్యంబు ఘనీభవింపంజేయుచుండ నిమ్మహామహు నుత్తమాంగంబు కర్ణాధిష్ఠితం బగుచుండంగం గర్ణజనకుండనగు నే నేతత్సభంబున వసింతు నే యను నసూయచేం దాను నుత్తమాంగవసతి యొనర్చిన సహస్రకిరణుండు నాందగు కిరీటంబుచే నుదితరవిమండలాగ్రచుంబితంబగు ఘనాఘనంబుం బురణించుచున్న నక్కరుమతీశ్వరు నాపాదమస్తకం బవలోకించి తనివి దీరక గద్గదస్వరంబు పావన నానందబాష్పములు గ్రమ్మం బులకాంకురమ్ములు వొడమం గుతూహలం బుప్పతిల నమస్కరింపుచు నుతియింపుచుం గదలని యవయవంబులతోం, బ్రాలని కనుఱెప్పలతోం, జలింపని మనంబుతో, నద్దేవుపాదారవిందంబులు మనంబున నునిచి ధ్యానించుచు దివ్యాభయహస్తసరభసవిగళత్ప్రసాదకుసుమసముదయుండగు కతన భక్తాగ్రగణ్యాత్మకూరుపురభూపతిరాజ్యలక్ష్మీశిరంబునం బుష్పాభిషేకం బొనర్చుపగిదిం గాని లేక తదీయసుఫలబీజావాపం బొనర్చుచున్న భంగిం గాని చూపట్టునప్పరమేశ్వరునకు మరల మ్రొక్కి సబాష్పగద్గదులగు కతన నేమియు ననం నేరక ధ్యానించుచున్న వేంకటరెడ్డి ప్రముఖులతోం గూడ నిట్లని వినుతింపం దొడంగె.

సీ. కురుమూర్తి శైలకందరవిహార మొనర్చు ఫణిశైలనాథ తుభ్యం నమోస్తు
కుర్మతిక్షోణిభృద్గుహాలోన వసియించు హస్తిశైలేశ తుభ్యం నమోస్తు
కురుమతిజ్యాభృద్దరి రమించుచున్న నీలాచలాధీశ తుభ్యం నమోస్తు
కురుపతిక్ష్మాధ్రికందరనున్న శ్రీరంగపట్టణాధీశ తుభ్యం నమోస్తు

తే.గీ. భవ్యకరుణాసముద్ర తుభ్యం నమోస్తు
పద్మభవముఖ్యవినుత తుభ్యం నమోస్తు
పరమపురుష రమేశ తుభ్యం నమోస్తు
భవ్యకరిరాజవరద తుభ్యం నమోస్తు. ౨౧

సీ. చతురంగబల మేకగతి సమగ్రప్రభావంబుగైకొంట నీవలనఁగాదె
కాళిదాసునిఁబోలు కవులిచ్చుకావ్యకన్యలనుగైకొంట నీవలనఁగాదె
నవజాతిమణుల విన్నాణంబుగల కోశములనుగైకొంట నీవలనఁగాదె
ఘనమణిప్రాసాదగణములో ప్పారు సంపత్తిగైకొంట నీవలనఁగాదె

తే.గీ. ప్రాభవముగల్గియుంట నీవలనఁగాదె
బంధువిస్తృతిగనుట నీవలనఁగాదె
బహుళముక్కరవంశభూపాలకులకు
శేషశైలేశ కుర్మతిశ్రీనివాస. ౨౨

తే.గీ. నిన్నుశరణంబువేఁడెద నిన్నుఁదప్ప
నితర దైవములను నెన్న నేనెఱుంగ
నన్ను నెప్పుడు సంరక్షణంబొనర్ప
శీతలంబగు నీదయఁ జిలుకవలయు. ౨౩

తే.గీ. తతమతిని గాక నే నింతదనుకఁ జేసి
యున్న పాపంబులన్నియు నున్నఁజేసి
యింక నే పాపములుచేయనీక మించు
గతి ననుంబ్రోవుమయ్య కుర్మతినగేశ ! ౨౪

తే. గీ. నిన్ను నుతియింపనేరని చిన్నివాని
నన్నుఁ జపలుని రక్షింతువన్న ధైర్య
సాహసంబులు గొనుటకు సాక్షిగాదె
రక్షితకరీంద్ర నీ ధ్రువరక్షణంబు॥

మ. రవితనయాచరభ్రమరరాజవిరాజితదేహ దేవదా
నవనుత శంఖచక్రధర నాకభవాదికపేంద్రనుత్య భూ
భువనధర ప్రసిద్ధకురుమూర్తి గిరీంద్రదరీకుటీరమా
ధవ యమృతోపమామితకథావిమలాసమలాలితాఖిలా. ౭౧

మ. మరుదన్న ప్రభుమాళికోటివిలసన్మాణిక్యచారుప్రభా
కిరణాళీచపలాపలారుణకలాకీలాలదాయాదసం
దరనేత్రద్వయ నూతనద్యుమణిరుగ్దాయాదథామచ్ఛటా
ధర పక్షీశనుతా నతాఖిలజగత్సంరక్షణశ్రీరతా. ౭౨

తే. గీ. రాజశేఖరదేవతారాజరాజ
రాణ్ముఖామరవినుతా! పరాక్రమవిజి
తామరాహిత! భక్తస్థిరానురాగ
రాధితపరాత్పర! వరకుర్మతిగిరీశ! ౭౩

క. మందరగిరిధరకిటివరసుందరవామననృసింహ శుభకరవదనా
నందకహస్త! యశోదానందన! కరిహరణ! నందనందన శౌరీ. ౭౪

ఉ. తారలఁ గేరుగోరులు సుతారముఁజూప రమావసుంధరో
దారసుకంకణారవ మనంత ముదావహమై చెలంగ నా
కారము నీరజంబుల వికారముబై టవుఁ బెట్టుచుండఁ జె
న్నారు భవత్పదద్వయ మనారతమున్ మదిలోఁ దలంచెదన్. ౭౫

సీ. ప్రాఁబల్కుజవరాలిరాణివాసముగన్న మునులు గన్గొనఁజాలుగనివి నీవ
పదితలల్ గలవోఁకుఁ బగసోఁకఁ దెగటార్చి ప్రజలఁ గాచిన మగరాజవీవ
రాచయేన్గుల వేలరాచి వారలనల్ల చెరువుగట్టిన జగాజెట్టివీవ
పదియారువేలయెన్మిదిమంది చెలులపై భుజముసాచిన పెద్ద బోజుంగువీవ

తే. గీ. మంచుమలచూలుపల్కుటాల్ మరులమగల
కొలువుగనునట్టి వేలుపుతలవునీవ
యిపుడుమా పాలివేల్పవై యొసఁగితయ్యొ
గుడుసువాల్గాల్ప! పాపరాగస్ట్రవేల్ప!. ౭౬

చ. అని నుతియించి శ్రీహరికి రాజ్ఞముసం దిడి యర్చకుండు కొం
డనుచు సుమప్రసాద మభయుల్ బొసఁగం దలమీఁదఁ దాల్చి యు

య్యనఘుపదద్వయంబు హృదయంబునఁ దాలిచి భక్తిపారవ
శ్యనియతచిత్తుఁడై నయనసారసముల్ ముకుళించియుండినన్. ౭౭

చ. తనపతి సోమభూపతి ముదంబున శ్రీహరిఁ జేరువేళఁ జె
ప్పినవిధమంతయున్ విడిచిపెట్టక పుణ్యమునందు బుద్ధియున్
జనులయెడం దయామతియు సజ్జనులందుఁ బ్రపత్తియున్ ధనం
తన దగియున్నలక్ష్మియుఁ దన్నుతిసేయఁదొడంగె నత్తఱిన్. ౭౮

మ. మిగులన్ నీవు దయాస్వభావుఁడవు లక్ష్మీపుత్రుఁడో నాఁ బ్రసి
ద్ధగుణోపేతు భవత్కుమారకుని సీతారామభూపాలు బ్రో
వఁగదే శ్రీపతి! పోషకున్న సిరి కోపస్వాంతయౌఁజుమ్మీ; పె
ద్దగఁజా భర్తలకన్నఁ గాంతల కపత్యప్రేమ లోకంబునన్. ౭౯

తే. గీ. జలజలోచన! మున్ను రక్షకకుమార
చంద్రహాసధ్రువాదిరక్షకునినిన్ను
దివిరి మాబాలు నేలుమా దేవ యనుట
నాతి నగుటనుగాని యన్యంబుగాదు. ౮౦

వ. అని నుతియించి పిమ్మట జగన్మాతయగు లక్ష్మినుద్దేశించి.

తే.గీ. సోమునకుఁ దోఁడఁబుట్టిన సుదతివీవు
సోమభూపాలవరునకు సుదతి నేను
గానఁ జుట్టాలమగుమమ్ముఁ గరుణఁజూచి
యిందిరాదేవి మాబాలు నేలుమమ్మ. ౮౧

సీ. వలరాజునందుఁ గల్వలరాజునందుఁ గల్గినకూర్మి వీని రక్షింపుమమ్మ
కలవాని వేల్పుమాకలవాని నిరసించు సిరియిచ్చి వీనిఁ బోషింపుమమ్మ
తులలేమియును నరాతులలేమిగల రాచరికమిచ్చి వీని భరింపుమమ్మ
కనికరం బర్థిరాఁగని కరంబర్థిఁగాఁజేయించి వీనిఁ జైసేయుమమ్మ

తే. గీ. సకలనరపాలవందితచరణుఁడైన
సీతనూజుని కెనఁగు లక్ష్మీతనూజ
నామమది సార్థకముజేసి నామవంబు
మోదరత్నాకరమ్మన మించుమమ్మ. ౮౨

సీ. భయములేదని యొక్కపల్కు పల్కనఁజాలుచ్ఛ బాకారిపెరి తృణప్రాయమనఁగ
అతిభక్తిగలదంచు నాదరించినఁజాలు ధనదునిసిరి యదెంతటిదనంగ

నావాఁడవని పేర్మిచేవఁజూపినఁ జాలుఁ బశుపతిసిరి గడ్డిపరక యనఁగ
మనసుదీరఁగ నొక్కమాఱు చూచినఁజాలుఁ గురురాజుసిరి గోటికోనయనంగ

తే. గీ. విశ్వజనయిత్రి నీకు నాబిడ్డయందు
కరుణగల్గుటకావలెఁగాని నీబ
లంబుగలవాని కేమిలోపంబు తల్లి!
భార్గవీ! నీకుఁ బదివేల వందనములు. ౯౩

వ. అని నుతియించుచున్నంత.

క. ననుఁజూచెను ననుఁజూచెను ననుఁజూచెను నన్నుఁజూచె నాభాగ్యం బే
మని యందఱుఁ దామనుకొనఁగనె నందజ శౌరి కరుణ గలచూపులతోన్. ౯౪

క. నీరాజనంబునకుఁ గర్పూరము వెలిగించి తెచ్చి పూజారియుఁగైఁ
వారమ్మొనరింపుఁడన సీతారామన్నృపాలముఖ్యులు దద్దయుఁభక్తిన్. ౯౫

ఆ. వె. కనుల నద్దుకొనిరి కన్నులు చల్లగాఁ
జేసి ప్రోవుమయ్య శ్రీసతీశ!
సకలలోకరక్షణకలాచతుర! కుర్మ
తిగిరివాస! దేవదేవ! యనుచు. ౯౬

వ. ఇట్లు నీరాజనంబునకు నమస్కరించి.

సీ. భృత్యవర్యులు కొందఱదిదారి యిదిదారియంచు మార్గమ్ము సూచించుచుండ
అడుగడ్డునకు మాధవావతారంబు కన్దోయిఁగట్టినయట్లు తోఁచుచుండఁ
కరితురంగమసటాకలితభూరజ మభ్రమణిహయంబుల రంగు మాన్పుచుండ
'జయమహారాజరాజ్యంశాధి'యని వందిజనులు కైవారంబు సలుపుచుండ

తే. గీ. ధన్యజన్ములైన తల్లితో బాంధవ
ప్రతతితోడ సుకవివితతితోడ
సోమభూమిపాలసుతుఁడు కుర్మతిగిరిం
ద్రమ్ము డిగియెఁ గడుముద మ్మెలర్ప. ౯౭

తే. గీ. ఇట్లు డిగి భక్తజనముల రొసకమెల్లఁ
బరఁగనరయుచు నరిగి యంబాపురంబు
నందలిభవనమున్న కేగునంతలోన
నభ్రమధ్యంబునకు వచ్చె నభ్రమణియు. ౯౮

తే. గీ. భోజనముచేసి యారాజపుంగవుండు
గాయకులగానములు సుహృద్గణముతోడ
వించు హృదయాంబుజము పల్లవింప రమ్య
హర్మ్యతలమున విహరించె నతిశయముగ. ౯౯

గద్య.

ఇది శ్రీకింకవీంద్ర ఘటాపంచానన విద్వత్కవి బాలకళానిధి
బాలసరస్వతీ శతావధాని తిరుపతి వేంకటేశ్వరులచే
నాంధ్రీకృతంబగు శ్రీనివాసవిలాసమ్మనఁ
జతుర్థాశ్వాసము.

---

శ్రీరస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్రీనివాసవిలాసము



తిరుపతి వేంకటీయము

## పంచమాశ్వాసము

తే.గీ. వాయువేగమ్ముగన్గడివారువముల
నెక్కి యిర్వురు సాహిణు లెసక మెసఁగ
నలఘుధరణీశవునకు నంజలిఘటించి
పలికి రిట్లని సంతోషభరితులగుచు. ౧

వ. దేవా! సావధానమనస్కుండవై యాలకింపుము. భవదాజ్ఞాప్రకారంబున నుత్సవాగతజనంబుల నరసివచ్చితి మస్మన్మత్యనుసారంబుగాఁ జూచినంతవట్టు విశేషంబు లెఱింగించెద మెట్లనిన, శ్రీనివాసచరణారవిందసందర్శనంబునకై బృందబృందమ్ములుగా ననేకదేశమ్ములనుండి వచ్చిన వర్ణిజ లోకరిమొగ మొకరెఱుంగనికతనఁ బరదేశభాషాగుల నిందించుచు స్వదేశభాషాదులం బ్రశంసించుకొనుచుండిరి. మఱియును ధవళోత్తరీయప్రావృతమస్తకులును వసనగ్రంధికలితవామకక్షులును బ్రహ్మవర్చసవిగ్రహులునునగు విప్రులనేకులు వచ్చుచుండిరి. మఱియును గొందఱు తాము ముందువచ్చి దిగినచోటు మఱికొంద ఱాక్రమింప నుచ్ఛృంఖలమ్ముగాఁ గలహించుచుండిరి. మఱియు నొక్కబజారునఁ గొందఱు పద్మినీవల్లభకరంబులు పుండరీకంబులం బోలెఁ బటమంటపమ్ముల విస్తరింపఁజేయుచు నవ్యోగు లుద్వృత్తవిపక్షులం బోలె ధాన్యపరిపూరితమ్ములగు గోనులను వృషభమహిషమ్ములనుండి పడఁద్రోయుచుండిరి. కొందఱు తండులమ్ములు రాసిగాఁ జేసికొని 'యోహో జనులారా! ఇటురం డిటురం డంతకన్న నేనెక్కుడుగా నిచ్చెదనని చేతులెత్తి పిలుచుచుండ మఱికొంద ఱంతకన్నను మేమెక్కు డిచ్చెదమని బొబ్బవేయ మరలిపోవు క్రాయికులను మొదటివారంతకన్నను నెక్కుడుగా నిచ్చెదమని పిలుచుచుండిరి. మఱియొకచోట మీకుఁ బృథుకాకృతిం గాంచెదము మమ్ము మర్దింపకుఁడని యాక్రోశించుపగిది సద్యోభర్జితంబులగుకతన నులూఖలాంతరముసలాగ్రఘట్టనంబునఁ జుంకారగతి

బొనరించు వీథిహులను నివియుఁగూడ మనలఁబోలెఁ బృథుకంబులేయను సంతస మ్మునంబోలెఁ జలించుచున్న స్తనంబులంబోల్చు శృంగారవతులు మర్దించు చుండిరి. వేఱొక్కయెడ నాపణికాంగన లీహరిమంథకమ్ములు కఠినస్వభా వంబులను గోపమ్మునంబోలె వేచి విసరుచుండిరి. మఱియొక్కచోటఁ గొంద ఱితఁడుపాకంబీయుఁడని యడుగఁ గొంద ఱాపణికు లాబాల్యాశిక్షితచాటువచనులగు వారిం గాంచి పృథులగుడంబు కావలయునేయని యడుగఁ దద్వచనశ్రవణమాత్ర పలాయమానులగు నవ్వారింగాంచి సహస్తతాళమ్ముగా నపహాసించుచుండిరి. ౨

సీ. ఒకచోట శర్కరనొసఁగుమంచును గొందఱడుగ శర్కరలేనియట్టియొక్క
వర్తకుం 'డిదియేమివైఖరి యిసుము కావలెనే' యటంచునవ్వంగ వారు
'కాదోయి సిత మాకుఁగావలె' ననుటయు, గోధూమపిష్టాళి గొని 'సిత యిదె'
యని చూప వారును 'నారార యిటు మోసపుత్తువే యిప్పని భూపుతోడఁ

తే. గీ. జెప్పెద' మటన్న, నవ్వాఁడు 'సితయొ కాదొ
కనుఁగొనుఁడు ప్రాజ్ఞులరు మీరు కనులులేక
యున్న వేఱొక్కరికిఁజూపు కొన్నఁదెలియు'
ననుచుఁ గలహింపసాగె నోయవనిపాల. 3

సీ. ఒకచోటఁ బణ్యవీథిక నెన్నఁడెఱుఁగని ఛాందసుండైనట్టిత్మ్రనురుండు
వచ్చి హింగువు గోర, వర్తకుండొకఁడు రమ్మనుచు సురామత్తమైన మా దు
కాణమునం దేదికావలెననఁ గర్ణములు మూసికొనుచు విప్రుఁడు కటకట
యనుచు నిష్ఠీవనంబాచరించుచు జందె మును నివీతముఁజేసికొనుచు నెన్నఁ

తే. గీ. డేని రాని బజారునకేల వచ్చి
తిని సురామత్తమఁట యిది, దీనికేమి
నిష్కృతియొ యంచు దాని నిందించుచున్న
నతని నాడింపసాగి రోయవనిపాల ! ౪

వ. మఱియొక్కచోట మహాజనసంఘపారావారతురంగతరంగకౌతుకసమాగతరంగ దుత్తరంగగంగాయమునాసరస్వతీభ్రాంతివల్లి కామతల్లికోపఘ్నా యితక్రియావిక్రయికానీతసముద్వేల్లన్మాంసలతరధవళనీలశోణవర్ణ మాహాత్మ్యోద్యత్కంబులు లక్షల కొలఁదిగ నక్షీణాక్షిక్షణదానదక్షమ్ములై తనరారుచుండె.

సీ. ఒకచోటఁ బటమందిరకలితమ్ములగు సంచులను విప్పుచుఁ గట్టుచును జెలంగు
నట్టి వర్తకు లిచ్చునట్టి మాంజిష్ఠాదివస్తువులఁ గొనుచున్న వారిరొదయు

సౌవర్ణతంతువిస్తారితరాంకవాదికపటపటలమ్ములకునయి తగ
వందలకొలఁదిగా వచ్చెడిజనముల కోలాహలమ్మనుగూడి కొండ

తే.గీ. దరుల వ్యాపించి యటనుండు తపసులకును
గర్ణనిర్భేదన మొనర్పఁగా బయటికి
వచ్చి వారు మహాశ్చర్యమచ్చుపడఁగఁ
దలలనూచుచుఁ జూతు రుత్సవము నధిప. ౬

సీ. కొండనెక్కెడివారు కొండనుదిగువారు దేవున కెరఁగి నుతించువారు
పరుగెత్తువారును బడువారు తమయంత లేచువారును వారిఁజూచువారు
ఘోషించువారు సంతోషించువారు రమ్మనువారు నటనుండుఁడనెడివారు
ఫలములు గొనువారు పంచదారను గొనువారు కీర్తనములఁబాడువారు

తే. గీ. దానములొసంగి సుకృతమ్ముఁబూనువారు
శ్రీనివాసాస్య మెఱుఁగక చెలఁగువారు
నైనజనసంఘములచేత వ్యాప్తమగునుఁ
గొండ కన్నులపండువై యుండెనధిప. ౭

సీ. పటమంటపములు ముప్పదివేలకెక్కుడు వృషభంబులవి వేనవేలసంఖ్య
నళ్వమ్ము లొకలక్షయయిన నుండకపోవు చేలముల్ లెక్కింపఁజాల మేము
రూప్యరాసులను నిరూపింపఁగారాదు భక్ష్యపుంజములఁజెప్పఁగఁదరంబె
తండులరాసులు తండోపతండముల్ రసవస్తువుల లెక్క రాదు చక్క

తే. గీ. నెచటఁజూచిన వర్తకు లెచటదృష్టి
నించినను వస్తుజాతమ్ము లెంచఁదర మె
చనికనినదేవరకును విశదమకాదె
భూమి యీనినయట్లుండె భూపతిలక. ౮

క. కల్లలుగావు నవోదన ముల్లసిలఁగ భాండములు మహోన్నతగతిఁజొ
ప్పిల్లఁగ నద్రిప్రాంతము చుల్లీమయమయ్యె భూప ! సుందరరూపా. ౯

సీ. మార్దంగికధ్వానమాననీయంబులై తాళారవానుబద్ధమ్ములగుచు
వల్లకీనాదసంపత్తిరమ్యమ్ములై తానప్రతానచిత్రమ్ములగుచు
మాననీయానూనగానగమ్యమ్ములై ఘటవాద్యరవసముత్కటములగుచు
ముఖవల్లకీనాదముఖరవయుతములై బహుళవై దేశికస్వనములగుచు

తే. గీ. తత్తదనుగుణరీతిఁ జిత్తమున కతుల
గతుల సంతసమొసఁగుసంగతుల నెఱిఁగి
పాడి యాడంగ నేర్చిన ప్రోఁడలున్న
వేశవాటములవి వేనవేలు భూప! ౧౦

చ. ఎవఁడవు నీవటంచు వచియించెడివా, రెవఁడంచుఁబల్క నీ
కవసరమేమి పొమ్మనుచు నాడెడివారును, దారి యిమ్ము మే
మవలకుఁ బోవఁగావలెనటంచు వచించెడివారు, నాపయిం
గవయకు మద్రి పెద్దదియ కా యటుపొమ్మనువారు భూవరా! ౧౧

చ. నగలివి చూచుచుండుఁడని నమ్మిక చేఁ దమ కిచ్చిపోవ నా
నగలను గొంచు వారు చనిన న్నగలిచ్చినవారు వచ్చి మా
నగలని యేడుపందొడఁగినం గని ముచ్చులఁబట్టి తెచ్చి యా
నగల నొసంగుచుందుము జనమ్ములు నిన్ను నుతింప భూవరా. ౧౨

చ. పనిగొని యట్టులున్ సెనగపప్పు నపూపములున్ సుసంభ్రమం
బునఁ దినువారు కొంద, ఱనుమోదమునన్ సుర త్రావి త్రావి భూ
మినిబడి మాటికిం బొరలి మేనులెఱుంగక కారుమాటలన్
వినఁ గొఱగానిరీతిఁ బలవించెడువారును గొంద ఱోనృపా! ౧౩

సీ. మల్లెపూల్ సిగనిండ నల్లిబిల్లిగఁజుట్టి విడెము పుక్కిటనిండఁ గడలుకొల్పి
తనువెల్ల మంచిగందమ్ముగాఁ గయిసేసి చలువబట్టలు పొల్పెసంగఁదాల్చి
యొకరికే లొకరికే లొకటిగాఁగీలించి సుందరీమణులపైఁ జూపునించి
యన్ని కార్యములు నట్టడవిలో దిగడించి చాంచల్యమును చిత్తసరణిఁబెంచి

తే. గీ. కులకుగుబ్బలజవరాండ్రగుంపులోని
కరిగి యారాటుపోటుల కాగి నిక్క
నీల్గి విహరించుచున్నట్టి సీటుకాండ్ర
వర్ణనముసేయ మేమెంతవార మధిప! ౧౪

చ. కురుమతిపర్వతేంద్రమునకుం బ్రణమిల్లుకతమ్మునం దమోం
కురములు వీడుభంగి మఱికొందఱు ముండితమూర్ధమొప్పఁ బు
ష్కరిణి మునింగి "పాహి మునిసన్నుతదేవ ముకుంద" యంచు సు
స్థిరమతులై భజించుచును జేరిరి కొండకుఁ బార్థివోత్తమా. ౧౫

చ. నరవర యేమిచెప్పుదు మనారతసంఘవిధుక్షితంబు పు
ష్కరిణి తదంబుపాన మవగాహనము న్నిరసించువారి క
క్కురమతి నేత శాస్త్రియొడఁగూర్చు 'నెఱుఁగము పాహి నో' యనం
గరము ననుగ్రహించుఁ గరుణావరుణాలయుఁ డాతఁ డెట్టిడో! ౧౬

ఉ. దేవునిఁ జూచువేడ్కఁ జనుదెంచినవారు సహస్రజిహ్వలం
దేవరవారిపుణ్యము గణింతు, రదేమన నీదృశత్వసం
భావితుఁడైన శేషగిరివాసుఁడు కుర్మతినాయకుండు సం
భావనఁజేసి మిమ్ముఁ బరిపాలనఁజేయుటఁ గాదె భూవరా. ౧౭

చ. పలుకులు వేయు నేల, రవి పశ్చిమదిగ్ధరణీధరావని
స్థలనికటమ్ముఁ జేరెడు లసద్గతి శ్రీపతిపాదుకోత్సవం
బలవడు వేళయయ్యె నెలవంచు సలామొనరించి యేగి రు
జ్జ్వలతురగాధిరూఢులయి సాహిణులాహరిసేవఁజూడఁగన్. ౧౮

చ. సనకసనందనాదిమునిసత్తము లెవ్వని పాదుకాద్వయ
మ్మును బనిఁబూని చేరి భవమున్బెడఁబాయఁగ నెంతు, రట్టిదే
వుని వరపాదుకోత్సవముఁ బొల్పుగఁ జూడఁగ నిచ్చ పిచ్చలిం
ప నృపతి కుర్మతీశ్వరుని పర్వతసన్నిధి కేగ నెంచుడున్. ౧౯

క. కరులును హరులు పదాతులును రథమ్ములు మెఱయఁగా ననూనప్రమదా
కరమై నరపాలకుని చతురంగబల మేగుదెంచెఁ దుందుడుకుమెయిన్. ౨౦

క. లలితమ్ములు సాదికరోచ్చలితమ్ము లురశ్శిరశ్ప్రసారణవిలస
ద్వలితమ్ములు కలితమ్ములు బలితమ్ములునైన కరులు బహుముదమొసఁగెన్. ౨౧

క. ఖురగోపనమా మనకని శిరమున్ దగవంచి చింతచే సూత్కృతులం
బరపు చయాళము విడుచుగతి ధరఁద్రవ్వెఁ గులీనతురగతతులు ఖురములన్. ౨౨

క. అంజనగిరిసమ మరికరిభంజనమున్ మంజులమును భద్రమునగు మే
ల్కుంజరము నెక్కి భూపతి కంజనయను జూచువేడుకం జనె గిరికిన్. ౨౩

తే. గీ. కరివరములు పదాతులును రథములును
గురుమతిగిరీంద్రపతిసేవ కరుగుచున్న
నరపతికి ముందు నడచె సుందరతరముగ
నచ్చుపుచ్చమ్ములైనట్టి హరివరములు. ౨౪

తే. గీ. అగము చనుదెంచుచున్నదో యమ్మ లార
యనుచు గజమును జూచి భ్రాంతి నివహించు
నొక్క గ్రామాంగనను జూచి, యొక నిషాది
వాగ యని పల్కి నగియె విన్నాణముగను. ౨౫

క. సరసిజనయనోత్సవముం బరికింపఁగ వచ్చినట్టి బహువిధజనులం
బరికించుచుఁ బుష్పితగిరిశిఖరనికటమ్మునకుఁ జేరెఁ బార్థివుఁ డంతన్. ౨౬

చ. సలలితరీతి నాట్యములు సల్పుచుఁ బాడుచు నీలలోలదృ
ష్టుల నిగుడించుచు న్నగడు సుందరులౌ వెలయంచయానలం
గలయఁ గనుంగొనెన్ నృపతికాంతుఁడు సుర్మతిసన్నిధిన్ మహో
జ్జ్వలతరమంటపోపరిలసన్మణిపీఠసుఖోపవిష్టుఁడై. ౨౭

వ. ఇట్లు భూపాలప్రముఖులు నిర్భరానందదంతురితాంతరంగులై యట నుండు నెడ.

చ. అల కురుమత్యగేశుమహిమాతిశయం బది యావహింప ని
మ్ముల మతికొంద ఱాడుచును మ్రొక్కుచుఁ జేతులనూచుచున్ గిరి
స్థలమున గండశైలముల సారసలోచనునొద్దఁ బణ్యావీ
థుల మతియచ్చట్చటను దోరముగాఁ దిరుగాడి రెంతయున్. ౨౯

క. ఎఱిఁగియు నెఱుఁగనిగతిఁ గొందఱు బంధుల విడచి రాజు దర్శింపక మై
మఱచియుఁ బలుకక గౌరవ మెఱుఁగక తిరుగాడసాగి రేమనవచ్చున్! ౩౦

సీ. విడిపోయి మాటికి వీపుపైఁ బొరలాడు కురులజార్పుడి వైచుకొనుటమాని
దిగజారి కాళ్ళకుఁ దగులుకొనెడి పైట కులుకుగుబ్బల వైచుకొనుటమాని
చిందరవందరై క్రిందుమీఁదునుబోవు హారమ్ములను జూచు టైనమాని
చెమట యేరై పాఱఁ జెదరి కాలువగట్టు బొట్టును సవరించు పూన్కిమాని

తే. గీ. నర్తనం బభ్యసించుచందంబుదోఁపఁ
గులటలనుబోలి లజ్జనుగోలుపోయి
యధికతరమైనయావేశ మావహింప
నెనసియాడిరి తగుకుటుంబినులుగూడ. ౩౧

వ. ఇట్లు భగవన్మహామహిమావేశంబున నోడలెఱుంగక పొరలాడు జనులం గాంచి యొన
రేని వీరలు విడంబనార్థమ్ముగా నిట్లొనరింతురు గాని యిట్టిభగవన్మహిమ కలుగువా
దబ్బరయని తమలోఁ దమ రనుకొన్నయంతమాత్రన వారును భగవన్మహిమా
వేశంబున. ౩౨

చ. వెనుకటివారికన్నఁ బదివేలమడుంగులు గొప్పగాఁగ న
ర్తనమొనరించుచు న్మదపరాధము సైఁపు మటంచు గండతా
డనమొనరించుకొంచు నకటా యిటులెన్నఁడు చేయమంచు న
య్యనఘుని మ్రొక్కసాగిరి తదద్భుతదివ్యమహత్త్వమెట్టిదో! ౩౩

తే. గీ. కొంద ఱెలుపిడినది మొదలొక్కనిఁగా గంతు
లిడుచుఁ బుష్కరిణిం జేరి, యేదియో మ
ఱచినటుల వెన్కకేగి మరలయు వచ్చి
యుబ్బుచును నొక్కక్షణకాల మూరకొందుఱు. ౩౪

ఉ. పాపములార! మాపయికిఁ బాఱఁగఁబోకుఁ డటంచు మీఁదికిన్
రేపెడుభంగి జేతులను నింగికిసాచుచుఁ గొందఱున్, జగ
ద్వ్యాపకుఁ డీతఁ డీయనఘుఁ డాఁటిన వేలుపు లేఁ డటంచు వే
చూపెడుభంగి శీర్షములు చొప్పడఁ ద్రిప్పుచునుంద్రు కొందఱున్. ౩౫

ఆ. శ్రీనివాసుసేవఁ జేయ నుచ్చైర్గతి యొసఁగు ననెడిభంగి నెగురువారు
శ్రీనివాసునిందఁ జేయ నధోగతి బరఁగు ననెడిభంగిఁ బడెడువారు. ౩౬

తే. గీ. కురుమతిగిరీశునుత్సవం బరయవచ్చి
నట్టిజనముల ద్రేగున కాగలేక
యిల యొడలు కదలింపఁగా నెగిరి పడిన
భంగిఁ గొందఱు పొదలిరి భక్తులపుడు. ౩౭

తే. గీ. శ్రీనివాసుని భక్తులమైనకతన
దండపాణికిసయితము దండపాణు
లమగుదు మనుచుఁ దెల్పెడియట్లు చేత
దండములు పూని రందుఁ గొందఱు జనములు. ౩౮

వ. మఱియు నిశ్వాసశ్వసననిగళమ్మునకై శ్రవణవల్మీకమ్ములనుండి బయలువెడలి గరుడధ్వజమహిమావేశజనితసాధ్వసమ్మునం బోలెఁ గంపించుచున్న కృష్ణాహికన్యకలు వాఁదగు ప్రతిక్షణకంపితభ్రూలతలచే జనులకు భయహర్షంబు లంకురింపంజేయుచు భక్తు లిటునటు దిరుగునంతట నలుదెసల దృష్టి ప్రసరించునంతవఱకు గుంపుగుంపుగా భగవన్మహిమాతిశయమ్మున నెగిరిపడుచున్న జనులచే నిబిడితమ్ముగు కతన తత్కాంతుమహిమ నూహించి యూహించి భావించియు [illegible]

బొదలెనో నాఁ జెలువారుచుండ, నీదృశోత్సవసందర్శనమ్మునఁ దాము నావేశితములో యన భేరీపటహపణవహూణవాద్యకాహళాదులు సింహనాదంబులం బోని సమగ్రధ్వానంబుల నెసంగుచుండఁ దామును నావేశితములో యనఁ జామరోత్కంపపవనపతాకాపటలములు గంధవాహాందోళితంబులై కదలుచుండ, సర్వంసహాయయ్యు జగదీశదివ్యావేశంబు సహింపనేరక మీఁదికెగిరి పోవు వసుమతియో యన ధూళికాపాళికలు ప్రబలుచుండ, మునుముందు కురుమతిగిరిదనుకం బరుగిడి శ్రీనివాసపాదుకాసమాశ్రయణంబుదక్క ధరణీభృదాశ్రయణం బనుచితంబని తలంచియో యన మరలి పాదుకలదనుక పరుగిడివచ్చు నావేశితజనమ్ములచేఁ బరివృతంబును, శ్రీనివాసదివ్యపాదారవిందయుగళీసమర్పణమ్మునకై తదనుగ్రహవర్ధమానమ్మగు వర్ధమానాఖ్యగ్రామమ్మునందు భక్తవరునిచే యథావిధినిర్మితంబును, తచ్ఛిరోధృతంబును, సమగ్రజనభవపాశజడిమవిదళనచణుండగు మదావళవరదుని పదారవిందయుగళంబును నిరంతరభవపాశిసమాఖ్యయును జడాధినాథత్వంబునుగల నన్నుఁబరిపాలించునని నిరంకుశవిశ్వాసమ్మున వరుణుం డర్ఘ్యార్థనోపాయనమ్ముగా నంపిన నిష్కరాశియుగళంబనఁ దద్దిశాభాగానీయమానంబును, జలనిధిసుతాతనులతానితాంతకాంతి నపహరించి ఘనదుర్గంబాశ్రయించి బలరిపుమణిసచ్ఛాయ రమానివాసదివ్యవిగ్రహరుచిప్రాప్తనిగ్రహఖేదబహుళధవళంబగు సద్దానితోఁగూడ నేతత్పాదారవిందయుగళంబుకన్న నన్యశరణంబు లేదని ద్వేధాభూతంబై శరణుజెందిన విద్యుల్లతామండలం బనఁ దగికాని లేక నన్నజస్రవిష్ణుపదాభరణమ్మగాఁ జెప్పుచుందురు తత్పదారవిందం బాశ్రయింపని నాకిది యుచితంబుగాదని నిరంతరతత్పదయుగళోదగ్రభూషణద్వంద్వరూపంబు ధరియించి యిదియేమో కనుఁగొందునని శంకితుఁడై యూర్ధ్వభాగమ్మననుసరించి వచ్చు చంద్రునిచే రమణీయంబగు సహస్రకిరణమండలంబు నాఁదగిగాని, ధవళతరవితానరమణీయోర్ధ్వభాగకాంచనసూత్రకలితంబును, శ్రుతియుగళీమకుటీద్వితయాలంబితమ్మునగు శ్రీనివాసుపాదుకాయుగళంబును విలోకించుచున్న మానవులయు, వసుంధరాధురంధరప్రముఖులయు హృదయంబులు సురకార్యం బాచరించి వచ్చిన జానకీహృదయానందనుండగు దశరథనందను దివ్యపాదుకాయుగళంబు బురస్కరించుకొని యెదుర్కొనుచున్న సాకేతనగరవాసులయు, దానిం జూచుచున్న విభీషణాదులయు హృదయంబులం బోలె నానందబంధురంబులై చెలఁగె; నీ యానందంబు వర్ణింప మహాకవివచనమ్ములకును నసాధ్యంబైయుండు. 38

శా. వ్యాసోద్దాలకశౌనకప్రముఖు లేపాదూద్వయిం జూడఁగా
నాసల్ చెంది తపమ్ముఁజేసి రుదకుంబ్రాపింతురో యట్టి శ్రీ

వాసాంఘ్రిద్వయరక్షల సురవరప్రాప్యమ్ములం గాంచి యెం
తో సంతోసముఁ జెంది రందఱును దత్ స్తోత్రక్రియాధుర్యులై. ౪౦

శా. పాతివ్రత్యముపట్టుఁగొమ్మ కరుణావారాశి బుద్ధిక్షమా
చాతుర్యంబుల కెల్ల సోమధరణీశానార్ధదేహంబు తా
నోతల్లీ! హరిపాదుకా! సదయవై యొక్కింతరక్షింపుమా
సీతారామన్నృపాలునంచు వచియించెం బేర్మి నింగారఁగన్. ౪౧

శా. ఓతల్లీ! హరిపాదరక్షవని నిన్నూహింత్రు లోకంబు లీ
వేతన్మాత్రమకాక మానవసుపర్వేశానముఖ్యామర
వ్రాతంబున్ దయఁ బ్రోచుచుందు వతిచిత్రం బంచుఁ గేల్మోడ్చి యా
సీతారామన్నృపాలకుండు నుతియించెం బేర్మిదైవాఱఁగన్. ౪౨

చ. భరతుని శౌరిపాదయుగబద్ధమనస్కుని రాజ్యమిచ్చి ముగ్
గరుణదలిర్పఁ బ్రోచినపరికారమునన్ మము నేలు సోమభూ
వరసుతు సర్వభూమిపతివంద్యు నొనర్చుచుఁ బ్రోవుమా దయా
భిరతి నటంచుఁ గేల్మొగిచి వెంకటరెడ్డి నుతించె నెంతయున్. ౪౩

తే. గీ. సురమతీశ్వరుపాదపుష్కరనుహృత్త్వ
గరిమ గను ధామనిధిని నిన్ గాంచి జనులు
హృదయగుహఁగల తమమునునీసడింత్రు
చిత్రమని పాదుక నుతించెఁ జెలఁగి యొకఁడు. ౪౪

తే. గీ. అహహ మహదాశ్రయంబు నీ కబ్బుకతనఁ
గాదె బ్రహ్మాదిదేవతాగణుల మకుట
తటము లెక్కుచునుందు నిత్యమునటంచు
శౌరిపాదుక నొక్కఁడు సన్నుతించె. ౪౫

చ. హరి యటులుండుఁగాక మము నారసిఁ బోసఁగ నీవ దిక్కను
స్మరయ జగత్త్రయావనమహామహిమమ్మునఁ బొల్చు శౌరి త
చ్చరణయుగావనమ్మునకుఁ జాలిన మేటివి నీవటంచు న
త్తిరుమలరాయఁ డంజలివిధించి నుతుల్ పచరించెఁ బాదుకన్. ౪౬

కవిరాజవిరాజితము.

అనుదినమున్ హరిపాదయుగమ్మున నంటిచెలంగుచుఁ గంటకబా
ధను నిరసించుట యుక్తమకాని సదా శ్రితుఁ గొల్చెడివారి వ్యథం

బునఁ గలకంటకముల్ హరియించి సమున్నతిఁగంటకముల్ తనువె
ల్లనుబొనఁగించెదు పాదుక! బల్విరలంబిది యంచొకఁ డెంచెనొగిన్.

తే. గీ. అంబ! నీచే సపదరక్షుఁడైన జగద
ధీశ్వరుండు వరదుఁడయి యొసఁగుచుండ
దైత్యులెల్ల విపదరక్షతనుభజింపఁ
బాదుకా! హేతు వేమని పలికెనొకఁడు. ౪౮

తే. గీ. ఇట్లు తన్నెల్లరును నుతియించుచుండఁ
గలితతూర్యస్వనమ్ములు గడలుకొనఁగఁ
బ్రార్థనారక్తులయినట్టిభక్తులెల్లఁ
దోడఁరా గిరికేగెఁ బాదూయుగంబు. ౪౯

క. కురుమతిగిరిపతివరపతిచరణాసక్తుఁడగుభక్తసత్తముఁ డొకఁ డా
హరిపాదుకలను శిరమున ధరియించి రయమునఁ దెచ్చెఁదత్స్థలమునకున్. ౫౦

చ. సనకసనందనాదిమునిసత్తమసేవ్య మనంతకాంతియుం
గనకమయంబునున్ సుజనకామదమున్ వరముక్కరాన్వయా
గ్రిణియగుసోమభూపసుతుఁ గామము లిచ్చి యనుగ్రహించుక
ల్పనగము పాదుకాయుగము పర్వతమం దొగి నిల్పెనాతఁడున్. ౫౧

శా. ఆవేశమ్మును జెందియాడుచు మహోద్యద్రావముల్ సేయుచున్
దేవేశాంఘ్రులనెంచు భక్తజనులెంతే నెల్లెడన్ మీఱఁగా
నావేశమ్మును జెంది వారివలె నాట్యప్రక్రియ న్బొల్చె నా
శ్రీవాసాశ్రియమైనభూమిధరమున్ జెన్నారె విన్నాణమై. ౫౨

క. శక్రాదివినుతమగు హరి చక్రము పుష్కరిణిఁజేరి చయ్యనఁ బూజా
ప్రక్రియలనొప్పఁగా గ్రహచక్రాధిపుఁ డరిగెఁ జరమశైలమ్మునకున్. ౫౩

తే. గీ. అలసుదర్శనముంజూచి యఖిలజనులు
ముందుగా మోదవార్ణిధి మునిఁగి రంత
నరుణుఁడు నపాస్తతాపుఁడై చరమవారి
రాశిలోన మునింగెను రయమెలర్ప. ౫౪

మ. మును మన్నామకు సైంధవుందునుమ నంభోజాప్తునిం గప్పి తా
ననుకూలక్రియ నొప్పెఁజక్రిమిది కట్టాయంచు లోనెంచి దా

నిని గెల్వఁగమకించియోయనఁగ నెంతే నగ్రపాదద్వయ
మ్మును బైకెత్తి చెలంగె సైంధవము కుర్యాత్కీర్తి శుద్వారమ్మునన్. ౫౫

క. అరియను నామంబూనియు నరికర్శనమయి చెలంగు హరిచక్రము సుం
దరమగుకురుమతిగిరికందరమునకుం జేరె భక్తతతి నుతియింపన్. ౫౬

ఉ. యామినియన్వేలంది యుడుహారముల న్మెడఁదాల్చి కౌముదీ
క్షౌమముగట్టి శౌరికి రకమ్మగఁ దాఁ దిలకమ్ము దిద్దఁగా
రామగు నర్ధచంద్రుఁడను రాజతపాత్రిఁ గళంకమున్ గురం
గీమదమూని వచ్చె హరికిం బరిచర్యయొనర్చుట్బ్రమే. ౫౭

క. తాదృగ్రథోగణశత్రూదారోత్సవమునందునొగి దుందుభి నా
నాదిగ్వ్యాప్తనిజధ్వని మోదంబొనరించె జనసముదయంబునకున్. ౫౮

క. మానుగఁగోణాహతినెంతేనిన్ మధ్యస్వరాభివృద్ధింగని యా
యానక మాయుత్సవమున నానాకఖ్యాతమయ్యెనఁట యేమందున్. ౫౯

శా. భేరీభాంకరణమ్మునం జనము లుద్వేలమ్ముగాఁబ్రోవులై
చేర న్వెన్నెలనల్లడల్ దనర నా శ్రీనాథుగుఱ్ఱంబు జ
న్నారెన్ మందరపర్వతేంద్రిచలితం బైయొప్పు క్షీరాబ్ధి స
ద్యోరమ్యంబగుకాంతినొప్పెసఁగు నాయుచ్చైశ్శ్రవంబోయనన్.

మ. తగుడోలాకనమ్మున న్నవళలౌతన్వంగులన్ శ్రీలలం
దగవంచించి జనారవాకలితమా ద్వారమ్మునన్ మాధవుం
డగశతుర్రిండను జన్మవత్సలతచే నంపింప నుచ్చైశ్రవం
బోగిఁ దావచ్చెనొనాఁగ నొప్పెసఁగు నశ్వోత్తంస మెక్కె న్వెసన్. ౬౦

మ. సరవి న్బొల్చె సపద్మరాగకలశచ్ఛత్రంబు పాపాపహ
ర్త్రురమేశానమహోత్సవంబు గన స్వాతీతారతోఁగూడి చం
దురుఁ డేతెంచినభంగి నీలమణులన్ నూల్కొన్నదండంబు త
ద్ధరిసందర్శననిర్గళచ్ఛశికళాంకాంకూరమో నాఁదగెన్. ౬౧

క. హరిహారినిర్మలతరపుచ్ఛరుచిన్ విజితంబులగుచుఁ జామరములు త
ద్ధరికి సపర్యయొనర్చెడి కరణిం జెలువారె లలితకంపితగతులన్. ౬౩

తే. గీ. హరిహయంబయ్యె ధవళమైయలరె దీప
దీప్తినరుణమయి చెలఁగె దేవదేవు
నీలనీరదకాంతిచే నీలమయ్యె
లసితగంధకదీపరుచి సితమయ్యె. ౬౪

తే. గీ. తనకును సనాముఁడైనట్టితార్క్ష్యునెక్కె
నితఁడనుచు వైనవస్యంబు నెనసియున్న
వాజిపతి నతిసంతోషవార్ధి ముంపఁ
జనె నధిష్ఠించి కుమతిక్ష్మాధ్రినేత. ౬౫

తే. గీ. రత్నసానువటన్న పేరన్ దనర్చి
గర్వమునవొప్పు మేరువుగర్వమడఁప
దీపపఙ్క్తులు నల్గడల్ దేజరిల్లఁ
దాదృశంబయ్యె సుర్యామతీ ధరణీధరము. ౬౬

తే. గీ. ఇచటనుండిన నీధరాభృత్తునీజ
నితమణుల కోడితిమటంచు నిందవచ్చు
నవతుజెందఁగవలెనంచు నచ్చయంబు
లటఁ బడినరీతి నొప్పె దీపాళులెల్ల. ౬౭

మ. లలి నస్మత్పతియైనచంద్రుభగినిన్ లక్ష్మీమహాదేవి ని
మ్ముల నెజ్జన్ దగమోసపుచ్చి యెటకేఁబోనున్నవాఁ డీతనిన్
గలయంజూచెద మంచుఁ దారకలు సన్నాహంబుతో నుండెనా
నెలవొందెన్ గిరినుండి క్రిందిదనుకన్ దీపంబు లిర్వంకలన్. ౬౮

తే. గీ. ఎద్దియోకోర్కె దనమది నెనయుకతన
గండశిల పేర్మి దీపమొక్కటి శిరంబు
నందు ధరియించి చెలువారె నాకతమున
నందఱును గండదీపమటంద్రు దాని. ౬౯

తే. గీ. మున్నహల్యను బ్రోచిన పుణ్యమూర్తి
పాదరజమునఁ దనదృషత్వంబుఁబాపు
కొనఁ జిరతపంబుసేయ నెక్కొనియె నంట
దీనికనియెంచిరి శిరస్థదీపశిలను. ౭౦

తే. గీ. అరుణగరుడులు సోదరు, లందు గరుడ
మణి శిలాగర్భుడై మహిమంబుఁగనియె
నని యరుణమణియును వేడ్క నశ్మగర్భ
మయ్యెనన గండదీప మొప్పారెనచట. ౭౧

మ. ప్రతిబృందమ్మున మాధవా యనుచు బాష్పమ్ముల్ లలిన్ గ్రమ్మ భ
క్తతతుల్ సేవయొనర్ప మెల్లన నగాగ్రమ్మున్ దగన్ డిగ్గి భూ
పతి వాసస్థలి కేగె శౌరి; యతఁడున్ భక్తిప్రణామాంజలి
ప్రతిపత్తుల్ దగఁ జూచె నాకురుమతిస్వామిన్ హయారూఢునిన్. ౬౨

చ. అవనిపునాజ్ఞ సేన వలయాకృతిఁ జెంపఁ దదగ్రమందు ర
త్నవితతి రత్నగర్భఁ దమతల్లిని వంచనఁ జేసి యేగు మా
ధవు నరికట్టఁగాఁ దలఁచి తద్దయు మాత్రుదరాంతరంబునుం
డి వెడలి చుట్టువారుకొనుఠీవి నెసంగెను దీపమాలికల్. ౬౩

శా. రాణన్ స్థూణలపేరిబాహువుల నారాచాంగుళుల్ మోడ్చి యా
క్షోణీకామిని రక్తచామరములన్ జోడించి శ్రీకుర్మతి
క్షోణీభృత్పతి వీచెనాఁగ నెసఁగెన్ సాంపారునిర్వంకలన్
శోణశ్రీకమరుద్విలోడితజగజ్జ్యోతిఃప్రదీపద్యుతుల్. ౬౪

క. ఓలి నయస్కాంతంబిది కాలాయసమున్ గ్రహించి ఖ్యాతింగనఁగా
నాలీలనె శోణమణుల్ గ్రాలెననం జెలఁగె నా జగజ్జ్యోతులొగిన్. ౬౫

క. నైకవిధగంధకకృతప్రాకారవిచిత్రవృక్షబహుచక్రకృతం
బై కడు నెసంగె లంకాఖ్యాకము యంత్రంబు సేన కావలిప్రక్కన్. ౬౬

సీ. భుజము లల్లలనాడ ముఖము చిర్నగవూనఁ జెమటచేతను జెక్కు చెమ్మగిల్లఁ
గనులు తల్తళనింపఁ గనుబొమ్మలు చలింపఁ జనులు గందరగోళమనుసరింపఁ
గాంచి ఘల్ఘల్ మ్రోయ గజ్జ లల్లరిసేయఁ జిన్నారితిలకంబు చెదరిజార
నొయ్యార మెసఁగంగఁ బయ్యెదల్ దూలంగ మేనికాంతులు మిరుమిట్లుగొలుప

తే. గీ. నలసట జనింప నిట్టూర్పు లవతరింపఁ
గనుఁగొనెడివారి కానంద మినుమడింప
నెట్టుకొని కుర్మతిస్వామి కట్టెదుటను
మేలమాడిరి వారకామినులు చెలఁగి. ౬౭

మ. జగతీమోహనరూపి మెప్పు తదురోజద్వంద్వముం దాఁకి పె
ల్లుగహారమ్ములు నాట్యమాడె నుగుణాలుల్ గల్గుఁ గాకేమి హృ
ద్యగతుల్ మించిననేమి సన్మణిచయావాప్తిం బ్రవర్తింపవే
మగు, గుబ్బల్గనినంత నేదికిని 'సాహోకారముల్ పుట్టవే. ౬౮

తే. గీ. బుద్ధిమత్తముఁడగు రాజపుంగవాగ్ర
గణ్యుచేఁ గొంతవడి సేవ గాంచి, పిదపఁ
దూర్యఘోషము లెంతయుఁ దోరముగను
జెలఁగఁ గుర్మతిపతియు వేంచేయఁదొడఁగె. ౭౯

క. పుష్కరివరదుండని నను బుష్కరిణియు నాశ్రయింపఁ బూనెడునని తాఁ
బుష్కరిణిఁ బ్రోవనోయనఁ బుష్కరణికి నేగెఁ బురుషపుంగవుఁడంతన్. ౮౦

వ. ఇట్లు పుష్కరిణీతీరమ్మున కరిగి యటఁ గల్పితంబగు ననల్పసపర్యం గ్రహించి
సేన కుత్తరదిక్తటమ్మున ననేకముఖాధ్యయగు లంక గన్పట్టుచున్న దిదియేమో
యని యనుకొనుచున్న జనులకోలాహలంబు విని రోషంబునంబోలె శీఘ్ర
ముగానటనుండి కదలి యుభయపార్శ్వమ్ముల సైన్యంబు శ్రేణీభూతంబై చెలంగ
నేమికతమ్మున నిటకిది వచ్చెనో యనురోషమ్మున గిరిశిఖరంబునుండి సాక్షా
దుత్ప్లుతుండునాఁదగు నరప్రేరితకృత్రిమమారుతతనయు వాలాగ్నిచే నంటింపఁ
బడినదియుఁ, బ్రదీపరూపమణినిబిడితమహాకోలాహలజనకదంబాంబుధిమధ్యభూస్థి
తంబునునగు నాకృత్రిమలంకయం దస్మదధినాధుండగు భగవంతుం డనంతావ
తారుండగుచుండఁ దత్కారాలంకారంబున కేనును ననేకరూపంబు లాశ్ర
యింపఁ దగినదియే యని యనేకధావతీర్ణంబగు సుదర్శనంబునాఁదగి యభ్రపరి
భ్రమణనిరవకాశనిష్ఠీవ్యమాన స్ఫులింగసంఘనిబిడితప్రాంతంబులగు చక్రరూప
యంత్రబృందంబులు కోట్లకొలఁది పరిభ్రమించుచుండ, నొక్కెడ సమున్నత
స్తంభామాలాగ్రపార్శ్వద్వయగుంభితగంధకభరితేంగుదీఫలరేఖా సముదయం
బులు భూమిమొదలుకొని క్రమముగాఁ బ్రజ్వలించుచు నగ్నిస్వస్వోర్ధ్వస్థితంబగు
ఫలంబు నాక్రమించె నింక విడిపొండు విడిపొండు విడిపొండని చెప్పుపగిది
విశరణార్థకఫలధాతులోణ్మధ్యమపురుషైకవచనప్రయోగంబు సేయుచుఁ దాపస
శాఖిజాతంబులైనను గంధపూర్ణంబులైనయెడల విశీర్ణత్వం బలవడకమానదని
బోధించుపగిది విశీర్యమానంబులగుచుండ, నింకొక్కయెడఁ దిర్యగ్గుంభితదారూ
భయపార్శ్వాలంబమానగంధకయంత్రపిటకయుగ్మంబులు గిరిశిఖరంబు దనుకఁ
బ్రజ్వలించుచుండఁ దదధోగళితప్రజ్వలనధవళగంధకఘుటికామాలికాంచితశశ
కాంతులు గగనంబునంజరించుచు,మహోత్సవవిలోకంబున వివశలైన సురకాంతలు
పరస్పరహారావలోకననైసర్గికస్త్రీస్వభావంబునంజేసి హారవినిమయంబొనర్చు
కొనుచున్నతఱి రెండురెండుగా స్థూలవజ్రఘుటికైకావళీహారంబులు ప్రమాదవశంబు
నం జారిపోవ డిగి, వానిని మరల గ్రహింపుమండిరో యనుపగిది క్షణకాలంబు
మాత్రము జూపట్టి నశించుచుండ, వేఱొక్కచోటఁ జక్రాకారయంత్రశతాంత
రాళంబులు పార్శ్వద్వయసముద్దీపితంబులై ప్రత్యేకముగా నేకమార్గంబునం

బయలువెడలి మార్గమధ్యమ్మునఁ బరస్పరసమ్ముఖీనంబులగుకతన నివృత్తములగుచుండ, మఱియొకచోట నభిముఖమ్ములగు కతన మరలుచు నట్లనె చిరకాలము పరిభ్రమించు గంధకయంత్రవిశేషద్వయంబులు సమానబలమల్లయుగ్మమండల చంక్రమణరీతిం జూపుపగిదిఁ బ్రజ్వలించుచుండఁ, గొన్ని నక్షత్రంబులు ముందు వచ్చి మహోత్సవం బాలోకించి నభస్థ్సితంబులగు తక్కిన రిక్కలం గూడఁ బిల్చి కొనివచ్చుకొఱకు సశ్లాఘావచనరభసమ్ముగా నెగురుచున్నవో నాఁదగు యాంత్రికజనదీపితాకాశబాణాఖ్యయంత్రంబులు శీంకారశబ్దపూర్వకమ్ముగా గగనమ్మున కెగయుచుండ, మఱికొన్ని యంత్రంబులు శ్రీనివాససేవాసమాగతజనతాపాతకసముదాయంబులం బటాపంచలై పొండని చెప్పుపగిదిఁ బటపటపటయని పటధాతులోణ్మధ్యమపురుషైకవచనప్రయోగం బొనర్చుచుండ, మఱికొన్ని యంత్రంబు లియ్యవి సకలజనులకుఁ గురుమతిగిరిపతియందు దృఢభక్తి నుంచుఁడని సూచించుచున్నయవి మహాజనకోలాహలమ్మున నెక్కుడగు భేర్యాద్యారవంబు దిఙ్ముఖముఖరితంబగు కతన నల్పప్రాణమ్ములగు దద్వర్ణమ్ములన్నియు వినఁబడక మహాప్రాణంబగు నొక ఘాయనువర్ణము మాత్రము వినఁబడుచున్నదని జనులనుకొనునట్లు ఘాంకారం బొనర్చుచుండ, లాజనికరంబులపగిదియుఁ దెగిపోయిన మౌక్తికహారంబులపగిదియుఁ బద్మరాగశకలంబులపగిదియు నింద్రనీలమ్ములపగిదియు సువర్ణకుసుమమ్ముల పగిదియు యంత్రబృందమ్ములనుండి అగ్నికణంబులు రాలుచుండఁ గొన్ని గంధకదీపమ్ములు సంపూర్ణచంద్రమండలమ్ముల పగిదిఁ జెలువారుచుండ జగదుత్తమోత్తమంబగు నమ్మహోత్సవంబు విలోకించుచు నక్కురుమతిగిరిస్వామి సకలభక్తగణస్తూయమానుండగుచు నద్రిశృంగం బధిష్ఠింప నుంకించుచున్నంతలో నుత్సవావలోకనసంతుష్టాంతరంగయు శుభగుణకదంబయు నిజాంబయు నగు లక్ష్మ్యాంబం బురస్కరించుకొని మంత్రివరుండగు వెంకటరెడ్డితో నరవరుండును కరివరంబధిష్ఠించి పుండరీకదళాయతేక్షణుండును, గరుణావరుణాలయుండును, శరణాగతభరణాదరుండును, నఖిలనిగమాభరణుండు, నిఖిలజగద్విపత్తిహరణుండును, శుభకరస్మరణుండును, ఘనాఘనరుచిసుభగంకరణుండును, గరివరప్రియంకరణుండును, సమగ్రదేవతాప్రమోదస్థూలంకరణుండును, సకలకలికంటకోద్ధరణుండును, నఖండజగదాఢ్యంకరణుండును, ప్రఫుల్లజలజతల్లజసదృశచరణుండును, నిత్యతరుణుండును, భవాంబుధితరణకరణుండును నగు నక్కురుమతి శ్రీనివాసు ధ్యానించుచుఁ, బ్రపన్నులమయిన మాకు నీవే శరణంబగుచు మమ్ము రక్షింపుమనుచు ననేకవాద్యారవంబులు బోరుకలఁగ సమగ్రభూధేనకుటుంబాకరంబగు నంబాపురంబుఁ బ్రవేశించె నిఁక నిచ్చట.

మ. నను వంచించి మహోత్సవంబుగనఁగా న్యాయంబె నీకంచు న
వ్వనజాతాలయ నన్ను నేమనునొ కోపస్వాంతయై యంచు లో
ననుమానింపక కుర్మతీశ్వరుఁడు తానద్రిస్థలం బెక్కి చ
క్కని రోయింతు లొనర్చు నృత్యమును వేడ్కం జూచుచున్నంతలో. ౮౧

చ. మగఁ డొనరించినట్టి యవమానము సైఁపక లక్ష్మి యాతనిం
డగ నవమానముం బరుపఁ దద్దయు లోనఁ దలంచి యొక్కఁడొం
గఁ గడురయమ్మునం బనుపఁగా మఱి వాఁడును సింహనాదమొ
ప్పఁగ నరికట్టె నాత్మపరివారముతో నలకుర్మతీశ్వరున్. ౮౨

తే. గీ. ఆత్మకచచయముం బోలి యతికుటిలము
లైనపుండ్రమ్ము లొప్పెడి యతనిభటులు
మెల్ల మెల్లన నొదుఁగుచు నల్లభుజగ
పర్వతాధీశుఁ బొదివిరి వక్రగతుల. ౮౩

చ. గొడుగును గొట్టి చామర లకుంఠితవిక్రమలీలఁ జిమ్మి యున్
పిడములు పాడుసేసియును శ్రీకరపావనమాల లాగి యె
క్కుడురుష భేరికాదికము గొబ్బునఁ గైకొని వార లెంతయున్
గడబిడఁ జేసి యుత్సవము కంజవిలోచనుఁడున్ దడంబడెన్. ౮౪

శా. భేరీరావము దిక్తటమ్ములను గంభీరమ్ముగా మ్రోయ సిం
హారావమ్ము లెసంగఁ జామరము లొప్పారన్ సితచ్ఛత్రమున్
దారానాథుని పోల్కెఁ జెన్నలరఁ బద్మాగేహసాన్నిధ్యముం
జేరన్ రెండవకుర్మతీశ్వరుఁడు నాఁ జెన్నారుచున్ జోరుఁడున్. ౮౫

ఆ. వె. చిన్ననాఁడు గొల్లకన్నెల వంచించి
వెన్న దిన్నయట్టి వెకలితనము
కట్టికుడిపె నేఁడు కంజాతనేత్రున
కితరచోరగతుల నెన్న నేల, ౮౬

క. అతిఖిన్నుండై కుర్మతిపతి తనగృహమేగు నాయవసరమ్మున శ్రీ
సతియును భూపతితోఁ దనపతి కెదురుగ వచ్చెఁ దొట్రుపడుసరములతోన్. ౮౭

సీ. తన సితచ్ఛత్రంబు తన చామరయుగంబు తనదు బంగారుచక్కనిసరములు
తనరత్నమాలికల్ తన హేమవసనంబు తనయొద్దనుండు దీపనికరములు

తన మదావళీములు తన తురంగమములు తన భేరికాదివాద్యనిచయములు
తనయగ్రమందునృత్యముసల్పి యానందముననించినట్టి రోపూవుబోండ్లు

తే. గీ. సర్వమును భార్గవీధరాసతులయొద్ద
మున్న సంగతిఁగనుఁగొని వెన్నుఁడపుడు
సంతసముకొంత యొక్కింత చింత కొంత
యబ్రిపాటొప్ప నిదియేమి యనితలంచె. ౮౮

క. భూమియు లక్ష్మీదేవియు నామెయిఁగనుచుండ శంకసందక లజ్జా
భామ హరి గౌఁగిలించెను; గామినులకు సాహసంబు గలదెంతైనన్. ౮౯

తే. గీ. సవతులమొగంబుఁ గనుఁగొన్నఁ శౌరి తన్ను
వదలునేమొకో యనుభీతి పొదలుకతన
నో యనఁగ లజ్జ మొగమెత్త నీయదయ్యె
నిందిరానాథుఁడును దలయెత్తఁడయ్యె. ౯౦

చ. ఇది సతమా యటంచు హరి హ్రీసతి నోసరిలంగఁజేసి య
మ్ముదితలవంకఁజూచి కరముల్ ముకుళించి మనమ్ములోపలన్
బెదరుచు మెల్లనన్ బలికెఁ; బెండిలియైన సరోజనేత్రలం
దొదవురసంబు వేఱొక తలోదరులం దొదవంగ నేర్చునే. ౯౧

ఉ. దాసుఁడనై ననాయెడలఁ దప్పులుగల్గిన సైఁపరాదె నేఁ
జేసిన నేరమేమి? దయఁజెల్వెుడిచూపుల నన్నొకింత నే
నేసినదోసమానె? ననుఁజిక్కులఁబెట్టిరి దొంగ లింత వి
శ్వాసము దప్పియుంట తగవా మగువా పగవాఁడనైతినే. ౯౨

వ. అనిన లక్ష్మియిట్లనియె.

శా. నీ చాటూక్తులకేమి నేనెఱుఁగనే నీసంగతుల్ క్రొత్తలే
యీచాతుర్యముఁజూచి సంతసిలువారెవ్వార లిచ్చోటఁ? ని
న్నే చోరుల్గని కొట్టి పుచ్చుకొనిరో యెవ్వారి దండించెదో
కాచంబైనను నేనెఱుంగనుజుమీ కాంతా! భుజంగాగ్రణీ! ౯౩

వ. అనిన కరుణామూర్తిస్వామి యిట్లనియె.

శా. నీసాన్నిధ్యమునందు భాస్కరునివన్నెంజెన్నుగన్నట్టిబల్
వాసింబొల్చెడి భూషణంబు లవిరోల్లన్ లోననూహింపఁగా

నాసామ్మెయగుఁగాని యన్యమగునా నాయంబు నూహింపుమా
హాసశ్రీప్రకటీకృతాత్మగతవామ్యాలంకృతీ! శ్రీసతీ! ౯౪

వ. అనిన శ్రీదేవి యిట్లనియె.

తే. గీ. మామకీనకటాక్షసంబంధభాగ్య
మునలభించెఁగదా లక్ష్మి మున్న దాని
నే హరించితిఁ జాపల్యమేల నీకు
దానినడుగుము పంచాయుధా! ముకుంద! ౯౫

వ. అనిన శ్రీనివాసుం డిట్లనియె.

తే. గీ. అట్టిలక్ష్మివి నీవకాయనితలంచి
యడుగుచుంటిని దయసేయు మబ్జపుత్రి!
వామలోచన! కోపమ్ము వదలు, మేమి
తప్పుగల్గె వృథాపవాదమ్ము గాని. ౯౬

వ. అనిన నిందిర యిట్లనియె.

తే. గీ. తగినయుత్తరములులేని తప్పులందుఁ
బురుషులకుఁ జతురోక్తులు పొసఁగుచుండుఁ
దావకాపరాధముల కంతంబుగలదె
త్రాడుబారెదు ధార్ష్ట్యంబు దవులుకతన. ౯౭

వ. హరియిట్లనియెం.

తే. గీ. లేదు నాయెడ నపరాధలేశమయిన
నెవతె కల్పించిచెప్పెనో యిట్లునీకు
భవదధీనుండ దానుఁడఁ బంకజాక్షి
యే నెచటికేగినాఁడ నిన్నెరుసుఁజేసి. ౯౮

వ. అబ్ధిపుత్రి యిట్లనియె.

క. చనలేదని బొంకెదు భూవనజాక్షిని నన్ను వదలి వడి వేదవధూ
టినిఁగూడఁగఁజనలేదో? వనితల కెఱుఁగంగఁబడవె వల్లభులమతుల్. ౯౯

వ. శ్రీనివాసుండిట్లనియె.

క. వనితా! నిను వదలి యనేకనగమ్యగాఖిలమైనకాంతారమ్ముల్
గననేగితి ఖ్యాతిలెదని నిను విడిచినతప్పు సైఁపు నేమ్రొక్కెదుదుల్. ౧౦౦

వ. పద్మాలయ యిట్లనియె.

తే. గీ. పలుకులిఁక వేయు నేల యో పంకజాక్ష!
యంతయును నాదులోపమే యగుట నిజము
నీకువలపైనయెడ కేగు, నేను ముద్ద
రాల నద్దానిఁబోలు గయ్యాళిగాను. ౧౦౧

వ. కురుమతిపతి యిట్లనియె.

ఆ. వె. నాకు నీవుదక్క నలినాక్షి! వేఱొక్క
పడఁతి లేదు; కష్టవచన రచన
పాలుజేసి రవ్వపాలొనరింతువే
పలుకవేల? ముద్దుపలుకొకండు. ౧౦౨

వ. భార్గవియిట్లనియె.

తే.గీ. నిపుణవాక్యమ్ము లొకకొన్ని నేర్చు కతనఁ
దప్పులొనరించియును నన్నుఁ దనిపెదీవు
నిన్ను నలయింపుటకు నిది పన్నలేదు
కుతుకమిదిసుమ్ము నమ్ము కుర్మతినగేశ. ౧౦౩

వ. జలజాక్షుం డిట్లనియె.

తే.గీ. అందఱునుగూడ నన్ను రమాధివాసుఁ
డంద్రుగద యిట్టినాయం దొకప్పుడైన
నీకు కోపావకాశంబు నెగడు టెట్లు!
సకియరో! నాకు మోదమ్ము సంగఁగదవె. ౧౦౪

క. ఇటు బల్కు పల్కులకు నక్కుటిలాలక కలఁక దేరి కోర్కెదలిర్పన్
దటుకున హరినెనసెను; నొకచిటుకగదా ప్రియులయందుఁ జెలులకుఁ గలఁకల్.

తే.గీ. లక్ష్మి దన్నెనసినంత విలక్షణమగు
కాంతిచెన్నారె నబ్ధిజాకాంతునకును
సుగుణవతియైన భార్యపొందుఁ గనఁడేనిఁ
ద్రిజగదీశునకైనను దేటగలదె? ౧౦౫

తే.గీ. కూర్మితో సిరి తన్నెడ్డుగూడె నపుడె
యొప్పె నఖిలవిభగము దామోదరునకు

శ్రీమహాలక్ష్మి యొక్కింతసేపు మొఱఁగి
యున్న దేవునకును సిరి సున్న గాదె. ౧౦౪

తే.గీ. ఏతరుణి యాగ్రహింప దేవేశ్వరునకు
వైభవంబెల్లఁబోయె నా వైభవంబు
మఱల నే దేవి కరుణింప మట్టుపడియె
నా జగన్మాతఁ బ్రణుతింతు నతులభక్తి. ౧౦౫

క. సుందరదుందుభిరవముల్ మందగఘనరవము నెసఁగ మందముగ జనుల్
బృందములుగట్టి మాధవు కందరమందిరముఁ జేరఁగాఁ జనిరంతన్.

సీ. మదపుటేనుఁగుఁబోలు మందంపుగతివాఁడు తులలేనిమహిమఁ జెన్నలరువాఁడు
పూర్ణచంద్రునివంటి ముఖవిలాసమువాఁడు కారుకమ్ముల నేలు కాంతివాఁడు
దయజిల్కునట్టి హృదయము చొప్పడువాఁడు ప్రతిలేక జగములఁ బరఁగువాఁడు
సుజనులపైఁ జేర్మిఁ జూపు చూపులవాఁడు హెచ్చైన కోరిక లిచ్చువాఁడు

తే.గీ. భక్తులొనరించునతుల నాసక్తిఁగొంచు
వనము వెల్వడి కుర్మతిస్వామి దేవ
దుందుభులు మ్రోయ మోదమ్ము దొలకరింపఁ
దురగమును డిగ్గి కందరాంతరముఁ జేరె. ౧౧౦

తే.గీ. కింకిణులు మ్రోయఁ జామరల్ పంకజాక్షు
లిరుగడల వేయ నాయాసమెల్లఁ బాయఁ
గుర్మతిస్వామి వేంచేసెఁ గోమరుమిగులు
మేలుబంగరు తూఁగుటుయ్యాలకడకు. ౧౧౧

తే.గీ. బాలికల్ చామరాంచితపాణులగుచు
లీలమై వీవ వారాశిబాలతోడ
డోలికాకేళి నవ్వనమాలి సోలి
చాలమేలగు సౌఖ్యాబ్ధి నోలలాడె. ౧౧౨

క. నీలాంబుజవనమాలాలీలాభృదపాంగలమితలీలాకమణీ
మాలలు శుచిచేలలు వెలబాలలు మేలమ్ములాడి పాడిరి ప్రేమలన్. ౧౧౩

క. ఘనతరమగునజ్ఞాభిఖ్యను సార్థకమొనరుపం గరాబ్జమునం గై
కొని ముక్తామణులవిధంబునఁ జల్లిరి సుమములు నెలపూవుంబోఁడుల్. ౧౧౪

క. జలధిసుతాధరసుధతోఁ దులఁదూగఁగఁ దనగుణములతో నెగడఁగ భ
క్తులు పాడునట్టిగీతంబులు విని సంతోషమందెఁ బురుషోత్తముఁడున్. ౧౧౫

తే. గీ. జయవిజయులార! చండప్రచండులార!
ధాత! యోయి విధాత! భద్రా! సుభద్ర!
భక్తులెల్లరు చనెదరు ద్వారమందు
భద్ర మిఁకమీఁదఁ గాలాతిపాతమయ్యె. ౧౧౬

తే. గీ. దివ్యసుమశయ్య శౌరి నిద్రించుచుండు
సార్వభౌముని ననుచరసమితివోలె
నఖిలరక్షకుఁడైన యీయంబుజాక్షుఁ
గావవలెఁజుండి యష్టదిక్పాలులార! ౧౧౭

తే. గీ. వైణికాగ్రణులార! సువైఖరులను
హృద్యముగ మీరు వీణ వాయింపవలయు
నుత్సవపరిశ్రమంబొందియున్న హరికి
పటుమృదంగాదివాద్యముల్ పనికిరావు. ౧౨౦

తే. గీ. ఇటుల వేత్రంబుచేఁబూనియెల్లరకును
దెలియఁగాఁజేసి సూత్రవతీప్రియుండు
శౌరి కిట్లనె 'నల్లదె సజ్జితము గు
శయ్య యద్దాన శయనింపఁజనుము దేవ!

తే. గీ. దానికంగీకరించి మందగతిమీఱఁ
గడలిరాచూలుద్దుకూఁతుతోఁ బుడమితోడఁ
గోటిసూర్యప్రకాశమై కొమరుమిగులు
రతనపున్ సెజ్జఁగూర్చుండె రమణ శౌరి. ౧౨౦

మ. నతు లెంతేఁ బచరించి భక్తజనులంతంబోవ సేవారర
ద్వితయమ్మున్ ఘటియింపుడున్ సొబగుసై దేదీప్యమానోజ్జయ
స్థితి నొప్పారెడు కేళికాగృహమునన్ శ్రీవాసుఁ డాసప్తరా
త్రతతాయాసమునన్ క్షణావధిగ నిద్రాముద్రఁ నొప్పెన్వెసన్.

అ. వె. అంత మేలుకాంచి సంతస మొప్పారఁ
బుడమితోడఁ గలిమిపడఁతితోడ

స్వేష్టభోగగరిమ లెనయుచు విహరించె
నజహరాదినమ్యుఁడైనశౌరి. ౧౨౨

సీ. మిసమిసల్ దేఱు క్రొమ్మించుమించుపసిండి డాలెసంగెడి మేటిచేలములును
అత్యుదారమ్ములై యనవద్యకాంతులై యలరారు ముత్యాలహారములును
నిర్దుష్టనవరత్ననిర్మాణమును గాంచి పొలుపారు బంగారు వలయములును
అత్యుజ్జ్వలమ్ములై యత్యనర్ఘమ్ములై పొరయమీఱెడి చంద్రహారములును

తే. గీ. చాలమేలుజరీయంచుసేలువలును
గోనబుగల నడగల మంచిగుఱ్ఱములును
శ్రీనివాసోత్సవాగతులైన కవుల
కిడియెఁ బేర్మి సీతారామనృపవరుండు. ౧౨౩

ఉ. ఆమఱునాఁడు సన్మతిన గాథిపు సేవను ధన్యులై మహో
ద్దామరయమ్ము మీఱఁగ యథాస్థితిసంగతులై నసైనికుల్
సేమమెలర్పఁ గొల్వ నృపశేఖరుఁ డాత్మపురమ్ముఁ జేరె నెం
తో ముదమొప్పఁ దన్నుఁ బురతోయజనేత్రలు చూచి యుబ్బఁగన్. ౧౨౪

సీ. తిరుమలకెనయైన కురుమూర్తిశైలకందరము వాసమ్ముగాఁ దనరువాని
ప్రావృణ్ణవీనాభ్రపటలకాంతుల గెల్వఁజాలు చక్కని మేని డాలువాని
కలిమిలీనెడిపాలకడలిరాపట్టి యెల్లప్పుడు పక్షమందొప్పువాని
కరుణామృతరసమ్ము దొరఁగి పారెడి విశాలములైనకందమ్ము లమరువాని

తే. గీ. హృదయనీరేజమందుఁ దా నెల్లవేళ
నిలిపి భజియించి తద్దయాకలితుఁడగుచు
రాజ్యమొనరించుచున్నాఁడు రమ్యగతుల
సోమభూపాలసూనుండు సురుచిరుండు. ౧౨౫

తే. గీ. పరమ శ్రీనివాసుని కరుణచేత
భూపమౌళి సీతారామభూమిధవున
కాయురారోగ్యసుఖసంపదాత్మజవిజ
యాదికం బెంతయును వృద్ధినందుఁగాత. ౧౨౬

శా. ఈరీతి న్సతతమ్ము నుత్సవములెంతేనొందుచుం బేర్మి సీ
తారామప్రభు వృద్ధిజేయుటకు నుద్యద్భక్తి చెన్నార స

శ్రీరమ్యంబయి వేంకటాచలసమశ్రీనొప్పు నక్కూర్మాద్రిం
చేరొప్పార వసించె శౌరి యధికప్రీతిం బ్రియాయుక్తుఁడై. ౧౨౭

ఉ. బాలుఁడనయ్య నీకృపకుఁ బాత్రుఁడనై నకతమ్మునన్ సుధీ
జాలము మెచ్చ నెంతయు రసమ్ముగ నీకృతిఁజెప్పి సంతత
శ్రీలనెసంగు నీపదముఁ జేర్చితినయ్య కృపాలవాలల
క్ష్మీలలనామనోహర క్షమించి గ్రహింపఁగదయ్య మ్రొక్కెదన్. ౧౨౮

ఉ. ఇంచుక నేర్పుగల్గిన కవీశ్వరులందు నొకండనైన నా
కెంచెపుబుద్ధియేడఁ! గవికుంజరులెల్ల నుతింపలేని నీ
యంచితసద్గుణవ్రజమహత్త్వమదేడ! యథామతిం బ్రక
ల్పించితి నాదు గ్రంథమును జేకొని మెచ్చిన్ గ్రహియింపుమో హరీ. ౧౨౯

తే. గీ. అర్థమునకైనఁ బదములకైనఁగాని
యించుకేనియు యత్నంబు నేనొనర్ప
నెట్లుచేయించుకొంటివో యిట్టినన్నుఁ
బ్రేరణముఁజేసి యీ కృతి శ్రీనివాస. ౧౩౦

ఉ. లెక్కకు నొక్కఁడన్ సుగుణలేశము నొందక బల్చుతత్కృతిం
జొక్కక మన్ముఖోద్ధమయి చొప్పడు నీకృతి నాదరింపఁగా
నొక్కవచింతు నోపరమనూతనులార, కవీంద్రులార! నా
మ్రొక్కులు గైకొనుండు కృతి మోదమెలర్పఁగఁ జేకొనుండొగిన్. ౧౩౧

క. ప్రాచీన మగు కవనమె సమీచీనమె? నూతనము సమీచీనముగా
దే! చవిచూడుఁడు నూతనమై చెలువలరారు తేనె యతిమధురంబా. ౧౩౨

మ. కవి ప్రాజ్ఞుండగు నేని సొంపుగఁ గృతిం గల్పించి ప్రాచీనమి
క్కవనంబంచు వచింపఁగావలయు నక్కావ్యంబు దోషైకదృ
క్ప్రవరుల్ గాంచి 'పురాతను ల్సుకవుల ప్రాజ్ఞుల్సువీను ల్బళీ
కవనంబిట్టిది లే' దటంద్రు స్వకృతింగా వారలూహింపనిన్. ౧౩౩

ఉ. కొందఱు ప్రాక్కృతిన్ ముదముఁ గొందురు; దానికి నెంతమాత్రము
జ్జెంద నసూయ దాని గుణఁజెందిన నూత్నకృతిన్ గణింపరే
మందును! దానలేని గుణమైనను గాంచెద, రిందుఁగల్గుదా
నిం దిగఁదీతు రక్కట మనీషుల్ కియ్యది సత్వమెట్లగున్? ౧౩౪

తే. గీ. ప్రత్నసూత్నవిచారము ల్పనికిరావు
సుగుణముండిన గ్రహియింపఁదగు సుకవుల
కహహా యిచ్చోటఁగాని ద్వీపాంతరమునఁ
గాని మణి పుట్టి గ్రాహ్యంబుగాకయున్నె. ౧౩౫

చ. కుటిలమనీషులార! కవికుంజరులార! వినుండు మిమ్ము న
క్కట కడుదూఱినాఁడ నిదికర్జముగా దిట మీదుదోష మొ
క్కటియును లేదు మీమదినిఁ గ్రాలెడి యోరువలేమియు న్నదు
ర్ఘటమగు దయ్య మయ్యది వికారపుఁజేష్టలు మీకు నేర్పెడిన్. ౧౩౬

క. కవితారస మెఱుఁగని దుష్కవులు గభీరమగు సుకవిసత్కృతి గుణదో
షవివేకమొనర్పఁగ బుద్ధివిశేషముఁ జెందలేమి తెల్లము జగతిన్. ౧౩౭

ఉ. చాలు నతిప్రసంగ మొకసంగతిఁ జెప్పెదఁ బ్రత్నసూత్నతల్
దాలవు కావ్యమందొదవు చాతురిరూపణఁ జేయ, సద్గుణా
వాలత యొక్కటే కృతి కవంధ్యత నేర్పరుపంగఁ జాలు స
చ్ఛీలురు పక్షపాతమును జెందక దీని గ్రహింపుటొప్పగున్. ౧౩౮

క. కవిసార్వభౌమబిరుద ప్రవరుఁడు శఠమర్షణకులభవకృష్ణుం డే
వవయుల్లాసమ్మును శ్రీనివాసునివిలాసమందు నేర్పుగఁ జెప్పెన్. ౧౩౯

సీ. పరకాలగురువర్యపాదసేవామహామప్రాప్త కావ్యనిర్మాణచణుఁడ
వర్యగ్రదుర్గంబు వాసమైతగువాఁడఁ గవిఘటాసార్వభౌమవిభుండఁ
గృష్ణనాముఁడనై నయేను భవ్యంబైన యీకావ్యరత్నమిం పెసఁగఁ జేసి
శ్రీరాట్సవై బహిరీబహదర్షుబిరుదసీతారామనరవరునకుఁ

తే. గీ. కృతియిడ నతని విద్వాంసులెల్ల నేన్గు
పైని నెక్కించి తూర్యరవములు సెలఁగఁ
గవిఘటాగండభేరుండ గరిమనొసఁగి
వీధినూరేగఁ జేసిరి వేడ్కమెఱయ. ౧౪౦

సీ. ఎవ్వాని మతిలత మవ్వమానిజతాతపూర్ణకృపారసస్ఫూర్తి మొలిచి
గురుతరరంగార్యనరసింహ తాతసద్విమలకృపాస్ఫూర్తి వేరుబాఱి
సజ్జయదేశికాచార్యకృపామృతభరముచే సఫల్లమై పరిఢవిల్లె
నతఁడు కృష్ణాంబికాత్మజగర్భకనకసంపుటరాజమాన వేంకటకృతీంద్ర

తే. గీ. లసదరుణమణిసహజనీలమ్ము దనరు
మహినిఁ శ్రీవత్సగోత్రరామయమనీషి
కెన్న దౌహిత్రుఁడగుచుఁ బ్రపన్నతిలకుఁ
డై వరంగార్యునకు మేనయల్లుఁడగుచు. ౧౪౧

సీ. ఫణిశైలపతికృపాప్రాప్తమహైశ్వర్యపరిచితవైష్ణవభక్తివరుఁడు
వ్యాళపల్లిగ్రామనివాసుండు రంగాంబకును బొజ్జకృష్ణునకును దనయుఁడు
శ్రీనివాసార్యుఁ డెవ్వానిమాతృష్వసేయుఁడు వెంకటార్యఘనుఁడు నెవనికిఁ
దండ్రితండ్రియగు శ్రీధరణీధరారాత్రికాన్వయుండగుకొండమార్యుఁ డెవని

తే. గీ. కిచ్చె శబ్దాగమం బతికృపదలిర్ప
నట్టినానిరుపమితవాక్యప్రపంచ
ములకుఁ దలఁకి కుకవులెల్ల మూలఁబడిరఁ
టన్న నాకీర్తి పలుమాఱు నెన్న నేల. ౧౪౨

సీ. అమలరామానుజార్యమతరక్షకనుతౌ మార్తాండసుఖమహామహితకృతులఁ
దతకుదృష్టిచయసంతతతమస్సంతతు లణఁచుచు నవరవేదాంతదేశి
కాచార్యుఁడన భూమినలరెడి గంగాలహరిమవహరవరప్రౌఢవాగ్వి
భవుఁడు శ్రీకరబుక్కపట్టణవంశసంభవుఁడు శ్రీవాసాఖ్యపండితునకు

తే. గీ. నప్తయగురంగనాథార్యునకుఁదనూజుఁ
డైనశ్రీబుచ్చివెంకటార్యవరుఁడు నుర
పురమహారాజ వేంకటభూపుగురుఁడు
శాబ్దికుఁడు కార్యవేత్త ప్రశస్తినలరు. ౧౪౩

సీ. ఆచార్యదీక్షితాఖ్యాకవంశాంబుధికల్పవృక్షమ్ము దుష్కవికులాగ్ర
గణ్యగర్వహరుండు కలితమోచాఫలోపమితవాచావిభవప్రథితుఁడు
కవితామహత్వరక్షణవిచక్షణనిరుపమవత్సలత్వసంభావితుండు
గద్వాలసంస్థానకవియుఁ బురాణదీక్షితపండితుండు నీక్షితి వెలయుత

తే. గీ. ముకురకులమ్మునఁ బ్రసిద్ధికెక్కుచున్న
భూపమాళి సీతారామభూపుఁడెలమి
మన్ననలుజేయుచున్నొప్పు నీమహితు లిర్వు
రును గణింపఁగ మత్కృతి దనరఁగాఁక. ౧౪౪

తే. గీ. శాలివాహనశకమున శైలదంతి
శైలభూసంఖ్యగలయేండ్లు జనినమీఁదఁ
దనరు రక్తాక్షియందున తపమున సిత
పక్షమున ధాతృతిథిఁ జేయఁబడియె నిదియు. ౧౪౫

తే. గీ. దాతృసంపద జగమునఁ దనరుఁగాత
సరసకవితావిలాసంబు మెఱయుఁగాత
కుర్మతీందోత్సవము వృద్ధిగొనెడుఁగాత
వేంకటాద్రీశ్వరుండును వెలయుఁగాత. ౧౪౬

చ. అరయఁగశాలివాహనశకాబ్దములందున రత్నచంద్రదిక్
స్థిరలుపొసంగ నిక్కరుమతిప్రభుదివ్యచరిత్ర భవ్యమై
పరగఁగ హేమలంబియనువత్సరమందు శతావధానులా
తిరుపతివేంకటేశ్వరులు తెల్గొనరించిరి శాశ్వతంబుగన్. ౧౪౭

ఉ. సన్నుతవాడరేవుకులచంద్రుఁడు వేంకటరత్నమంత్రి మ్రు
ప్టాన్నమువెట్టుచున్ సవినయంబుగ గౌరవరీతిఁజూపుచున్
మన్ననఁజేయఁ దద్భవనమంజులసౌధమునంజరించుచుం
బన్నితి మీప్రబంధమును బండితమండలి కింపునింపఁగన్. ౧౪౮

## గద్య

ఇది శ్రీకింకవీంద్ర ఘటాపంచానన విద్వత్కవి బాలకళానిధి
బాలసరస్వతీ శతావధాని తిరుపతి వేంకటేశ్వరులచే
నాంధ్రీకృతంబగు శ్రీనివాసవిలాసమ్మనఁ
సర్వమును బంచమాశ్వాసము
సంపూర్ణము.

---

## —◆ శ్రీ ని వా స వి లా స ము ◆—

## శుద్ధపత్రము.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 19 | భూస్థలిఁ | భూస్థలిఁ |
| 7 | 15 | తమరు తమరు | తమరు తమకు |
| ,, | 25 | వీకఁ | వీఁకఁ |
| 8 | 9 | గైగొనువారి | గైకొనువారి |
| ,, | 16 | రైక | రైక |
| 9 | 16 | పల్లికి పల్లే | పల్లికిఁ బల్లే |
| ,, | 24 | రాకూతురు | రాకూఁతురు |
| ,, | 27 | గారావుచెయ్వుల | గారావుఁజెయ్వుల |
| 12 | 10 | యనడీకమాంబ | యనఁడీకమాంబ |
| 14 | 10 | బసులగాచుచు | బసులఁగాచుచు |
| ,, | 25 | మగనిం | మగని |
| 22 | 26 | బుద్ధ | బద్ధ |
| 23 | 17 | మహీప | మహీమ |
| ,, | 19 | సరభతర | సరళతర |
| 24 | 1 | యసఘటిత | యసకీలఘటిత |
| ,, | ,, | కులాఢ్యో | తులాఢ్యో |
| 28 | 19 | కనుగుణమ్ముగ | కనుగుణముగ |
| 29 | 16 | యిరుకు | యిఱుకు |
| ,, | 19 | మణీఘృణీ | మణిఘృణి |
| 31 | 1 | తరుచు | తఱచు |
| ,, | 13 | గడుపు | గడుఁ బు |
| 32 | 3 | దూగుడీ | దూఁగుడీ |
| 33 | 6 | వన్నెఁటిని | వన్నెటిని |
| ,, | 16 | సమదయమ్మున | సముదయమ్మున |
| ,, | 23 | భువిపయో | భువిఁబయో |
| 37 | 5 | నెతికరఁగియ | నెతిఁగరఁగియు |
| 38 | 27 | జారుముడి | జాఱుముడి |
| 39 | 18 | జెలువారె | చెలువారె |
| 41 | 12 | పనిబూని | పనిఁబూని |
| 41 | 15 | బాగుజేయ | బాగుఁజేయు |

| | | | |
|---|---|---|---|
| 43 | 9 | గౌనఁగఁదంద్రా | గౌనఁగరభస |
| 44 | 28 | యెఱపుచేత | యొఱపుచేత |
| 48 | 16 | రజని | రజిని |
| 49 | 24 | కన్నుఁదోయి | కన్నుదోయి |
| 51 | 9 | నిటు | లిటు |
| 51 | 16 | నంబుజనీ | నంబుజినీ |
| 52 | 33 | నభపృసారిణి | నభఃప్రసారిణి |
| 55 | 2 | తుఁడై | తుఁడై |
| 56 | 22 | గోదావరి | గోదావరీ |
| 57 | 9 | ననుకూలమ్ముకా | ననుకూలమ్ముగా |
| ,, | 29 | బేదరికమ్ము | బేదఱికమ్ము |
| 60 | 8 | సామగ్రికుండు | సామగ్రీకుండు |
| 61 | 22 | దుందిభి | దుందుభి |
| ,, | 24 | నున్నట్ట్యమాన | నున్నట్యమాన |
| 63 | 16 | గడిచి | గడచి |
| 64 | 25 | నధిష్టించె | నధిష్ఠించె |
| 65 | 2 | యవార్యమై | యవార్యమయి |
| 68 | 2 | రాయుండు | రాయుండు |
| 76 | 13 | ఆశాశ్వ్యనం | ఆశ్యానం |
| 77 | 8 | మీనమ్ములచే | మీనమ్ములగు మీనస్థులచే |
| ,, | 27 | దాటించు | దాఁటించు |
| 78 | 26 | మీద | మీఁద |
| ,, | 27 | జార | జాఱి |
| 82 | 5 | కేమి 'కోయణచి' | కే 'మికోయణచి' |
| ,, | 7 | యమరంబునలేదు | యమరంబున, లేదు |
| ,, | 18 | ల్జదివి | ల్చదివి |
| 87 | 21 | రేనితో | శ్రేనితో |
| 90 | 11 | ఘృణీలహారీ | ఘృణిలహారీ |
| ,, | 25 | చిరుత | చిఱుత |
| 91 | 28 | జెలఁగఁ | చెలఁగఁ |
| 93 | 14 | శిశోత్రియ | సితోత్రియ |
| ,, | 19 | నత్పథం | సత్పథం |
| 94 | 11 | జనులను | జనుల |
| 95 | 32 | నిరుపురను | నిరువురను |



శ్రీరస్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# బుద్ధచరిత్రము

## ప్రథమాశ్వాసము

శా. శ్రీధామం బగు నీలభూధ్రమున సుశ్రీమించు వారాశివీ
చీధావళ్యముమించు దేవళమునం జెన్నారు రూపంబు, లో
కాధారంబు, హలాయుధప్రణయి, నిత్యానంది, శ్రీమజ్జగ
న్నాథస్వామి కృపాళుఁడై మనుచుఁ గృష్ణారాయవిద్వత్ప్రభున్. ౧

మ. 'నటుచందంబున వేషధారియఁట నీనాథుండు లక్ష్మీ! నిజం
బటవే?' యం చుడికించు నెచ్చెలుల 'సర్వాత్మత్వముం జూప న
ట్లటు లౌ' నంచు వచించుచున్నగు సరోజాగార దాఁ గోరి వేం
కటకృష్ణప్రభు నాయువేలధరణీకాంతాగ్రణిం జేరుతన్. ౨

మ. హరినాభీకమలమ్మునం బొడమి విద్యల్నేర్చి విద్వాంసురా
ల్తరుణీరత్నము గాఁగ దేవతలకెల్లం బెద్దయై మించు దే
వర దీర్ఘాయురపారభాగ్యసుతసంపత్కీర్తులం బెంచి భూ
సురునిం బోలవరప్రభుం గరుణఁ బ్రోచుం గృష్ణభూపాలునిన్. ౩

మ. శతలేఖిన్యవధానపద్యరచనాసంజాతభాస్వద్యశో
వితతాశేషవరాంధ్రభూపతిసభావిఖ్యాతనామాస్మదు
న్నతికిం గారణమైనదేవి ఘనవీణాపాణి యవ్వాణి సం
తతము న్వేంకటకృష్ణరాయవిభువాగ్ధామంబుఁ గామించుతన్. ౪

చ. శిరమున గంగ, దేహమున శీతగిరీంద్రకుమారి, ప్రక్క భృం
గిరిటియు, నంకభాగములఁ గేకిహయుండు గజాననుండు, ముం

దర బుధు లిట్లు వెండిమలఁ దత్పరుఁడై కొలువున్న రాజశే
ఖరుఁడు కృపాళుఁడై మనుచుఁగావుతఁ గృష్ణనృపాలకాగ్రణిన్. ౫

మ. సకలోర్వీధరసార్థుఁడైన యచలత్సాధర్తృ చే శుద్ధభి
క్షుకు నాసప్తబుధు ల్ధరాధిపతి యంచుం జెప్పి యిప్పింపఁ గొం
కక యాత్మేశ్వరు నీశ్వరేశ్వరునిగాఁ గావించుకొన్నట్టి య
ద్రికుమారీమణిపుణ్యరేఖ మనుచున్ శ్రీకృష్ణభూపాలునిన్. ౬

మ. కడియెద్దం జనియించి విద్య లెలమిం గాశీపురి న్నేర్చి యె
ప్పెడురీతిం ధవళేశ్వరంబున మహావిద్వాంసులౌ శిష్యు లె
ప్పుడుఁ గొల్వ న్వసియించి సత్రి మొకఁ దప్పుణ్యస్థలిం బెట్టి యె
క్కుడుకీర్తి న్విలసిల్లు బ్రహ్మగురువాక్కు ల్మాకుఁ దోడయ్యెడున్. ౭

మ. నలినాక్షప్రభృతు ల్త్రిమూర్తులు 'గవర్నర్లై,' సుర ల్క్రింద వ
ర్తిలు సుద్యోగిజనంబులై, ఘనమణిద్వీపంబును 'లండనై,'
యలరం దా నొకరాణియై జగము లేయంబామహాదేవి ని
చ్చలుఁ బాలించుఁ గృపాబ్ధి యాజనని కృష్ణారావు మన్నించుతన్. ౮

తే. గీ. కాళిదాసాది సంస్కృతకవుల కెరఁగి
నన్నయాద్యాంధ్రకవులకు నతులొనర్చి
కుకవులగు వారలకు శతగుణముగాఁగ
మ్రొక్కికొందుము మాకృతి ముట్టకుఁడని. ౯

క. తనచేసిన కబ్బముచేతన కాకవి ననుచుఁ దెల్పు ధన్యాత్ముల స
త్యనిధులఁ దలఁచుట కబ్బంబను తోఁటకుఁ జంచ యుంచి నట్లగుఁగాదే. ౧౦

చ. ఒకటియు రెండుఁ బద్యముల కొక్కొక గ్రంథమటంచుఁ బేరుపె
ట్టుకొని మహాకవీంద్రులకు డొంకక 'మాకవనంబు చూడ సా
ర్థక' మనుకొంచు 'మాకు సరిరా రొరు'లంచును దమ్ముఁదామ మె
చ్చుకొనుచుఁ బొంగు వ్యాకరణశుంఠల కంతముఁ గట్టుటొప్పదే? ౧౧

ఉ. ఊరును పేరులేని యొక యుప్పనిచప్పని కావ్య మట్లు సిం
గారపుఁ గైతగాండ్రు పరకావ్యములం గని తప్పు లంచు సం
స్కారములేమిఁ ద్రేలుదురుగాక మహాకవి కేమిలోటు! ల
క్ష్యారహితుల్ స్వశక్తి పరశక్తు లెఱుంగక పొంగు టబ్రమే. ౧౨

వ. అని శిష్టాచారంబు నిర్వర్తించి కృతినాయకవంశావతరణపూర్వకంబుగాఁ గృత్యవతారంబుఁ బ్రశంసించెదను. ౧౩

మ. కల దార్వేలనియోగిశాఖ యొకఁ డక్కాంజాతభూవర్ణమం
దలఘుత్వంబునఁ బోల్చు నయ్యెడ నమాత్యశ్రేణు లుద్యోగులుం
దెలుఁగుంబాస కవీంద్రులు న్మతియు నెందేనిం ధరాపాలురుం
గల రానాఁడును నేఁడును న్మనుల యోగం బిందుఁ గానంబడున్. ౧౪

తే. గీ. కల్మిఁ దనరారు నీశాఖఁ గాశ్యపముని
గోత్రమునయందుఁ గొచ్చర్లకోటవంశ
మలరు విద్దెయు ననమును గలిమి బలిమి
సాజములు దీనఁ గల సత్యసంధులకును. ౧౫

తే. గీ. ఎందఱో పుణ్యపూరుషు లిక్కులమ్ము
నందు జనియించి ప్రఖ్యాతినంది రందు
మిగుల సత్కీర్తి గని కవ్వు త్మైటి యనఁగ
నలరు శ్రీరామచంద్రుఁ డయ్యనఘుఁబోలి. ౧౬

తే. గీ. వియ్యనయుఁ బెద్దిరాజు జగ్గయ్య రామ
రావు నాఁగ జనించి రా రామచంద్ర
మూర్తి కాత్మజు, లిందఱుఁ గీర్తిధనులు
దాతృతాశూరు లధికారధన్యతములు. ౧౭

శా. అందుం జగ్గయ్యగారి నెన్నఁదరమే! యప్పుణ్యుఁడే శ్రీమహా
నందీశుండు వసించు పట్టసగిరిన్ నవ్యస్థితిం గట్టఁజే
సెం దీవ్యచ్ఛివకేశవాలయము లాశ్రీ చూచి తీఱన్వలెం;
బొందుం బున్నెముఁ బూరుషార్థ మటకుం బోనెంచు పుణ్యాత్ములన్. ౧౮

సీ. మొదటినుండియుఁ దుట్టతుదదాఁక నేరాజ్యమునకు గోదావరి మొనసియుండుఁ
బ్రజల పాపము పంచబంగాళముగ వీరభద్రదేశుఁ డేసీమఁ బ్రబలియుండుఁ
గొండకాల్వలవాలు నిండించు పెంజెర్వు లేమండలము ఫలియింపఁజేయు
రత్నగర్భాఖ్య భూరమణి కెచ్చటఁ బ్రతిపదమున సార్థకత్వము వహించు

తే. గీ. నెందుఁ ద్రిదశుల కంటికి విందుజేయు
ఖిలువగల్గిన పాపికొండలు చెలంగు

నట్టిమండల మార్జించె ననఘమూర్తి
మహితగుణశాలి జగ్గయామాత్యపాళి. ౧౯

తే. గీ. అతని కుదయించెఁ గేవల మనఘమూర్తి
ధీరుఁడు నుదారుఁ డబ్ధిగంభీరుఁ డలఘుఁ
డాత్మవిద్యావిశారదుఁ డతని పేరు
రామచంద్రవేంకటకృష్ణరా పటంద్రు. ౨౦

తే. గీ. భద్రకాళీపదద్వయీభక్తి కపన
శక్తి శివసక్తి తనకివి సహజములుగ
నయ్యనఘు నాత్మజుండు మహాయశస్స
నాథుఁడై యొప్పె శ్రీజగన్నాథరావు. ౨౧

మ. అవనిం గౌతమిదక్షిణోర్ధ్వమున స్మిగుల భాగ్యాయత్తమౌ రెడ్డిపా
లవరగ్రామము రాజధానిగఁ జిరాలంకారమై పచ్చు రా
జ్యవిశేషమ్మును నేలె నీయనఘుఁ డుద్యత్ప్రాభవం బొప్ప శ్రీ
లవయశ్శాలిని కామమాంబ సుగుణాలంకార దేవేరిగన్. ౨౨

ఉ. చక్కని చుక్క యయ్యు నిమసంబును దాఁ దనభర్త పక్కఁ గా
ల్ద్రొక్కక రాత్రులం బయలు ద్రొక్క నరుంధతి యందు నామెనుం
గ్రక్కున వేల్పుఁజూపుదురు గాని మహాసతి కామమాంబకు
న్నిక్కము దోస మంచును గణింపరు గా బలు గాకు లేనియున్. ౨౩

సీ. దైవతభక్తి విద్యాసక్తి జనరక్తి యను నివి సహజమ్ములైనవాఁడు
ఆపాదుకాంతదీక్షాపారమైన నాలవవేదమున సిద్ధుఁడైనవాఁడు
ప్రజలకష్టము కంటఁబడెనేని మితిలేని కరుణ చిత్తమునందుఁ గలుగువాఁడు
తనవారు పెఱవారలను భేద మరయక తగురీతి జగమేలఁ దగినవాఁడు

తే. గీ. నయవిదుం డగు నాజగన్నాథమూర్తి
కొలఁదికాలములోన లోకుల యదృష్ట
వైపరీత్యంబునన వీరభద్రు భద్ర
కాళి సేవించి తత్పదైక్యంబు గనియె. ౨౪

సీ. ఎంతమందికి నేని నింగ్లీషు చెప్పించి పెండ్లిండ్లు చేయించెఁ బ్రియ మొలర్పఁ
బటసత్రేత్రిసపర్వతసోపానములు బాగుచేయించి ముదముఁగొలిపెఁ

గోటిపల్లెను నెల్లబాటసారుల కుపయోగించు సత్రంబు నొకటి పెట్టి
నన్ని యిన్ని యనంగ నలవిగాని గతి నెన్నేఁజెర్వులును నూతులెలమినించె

తే. గీ. లక్షవర్తివ్రతం బొది లక్షసుకృత
కార్యము లొనర్చి లోకోపకారబుద్ధి
నాజగన్నాథమూర్తి కర్ధాంగి యైన
కామమాంబిక నెన్నని కవులు గలరె! ౨౫

చ. ప్రతిశివరాత్రికాలమునఁ బట్టసమం దనఘాత్ము లైన వి
ప్రతతుల కెల్ల మెల్లముగ భక్ష్యము లెల్లెడ నొప్పఁ గొల్లగా
మితికి నతిక్రమించుగతి మేదిని యాజ్యము చేత నామన
ట్లతితరభక్తి భక్త మిడు నయ్యమ పున్నెము నెన్న శక్యమే! ౨౬

చ. ప్రతిదిన మాత్మగేహమున బ్రాహ్మణు లెందఱికేని షడ్రస
ప్లుతముగ నన్నదానమును బొంపిరివో నొనరించు టే మహా
వ్రత మని యెంచి తాన ప్రతిపఙ్క్తికి వచ్చు నటంచు విందు మా
సతి కొక యన్నపూర్ణయగు సాటి; యొరు ల్ప్రతి నాఁగఁ జెల్లునే. ౨౭

సీ. గౌతమగోత్రవిఖ్యాతు శ్రీపెద్దాడ వంశజుఁ బెద్దవిద్వాంసుఁ డై ది
గంతవిశ్రాంతమాగతి శ్రీశకుంతలాపరిణయ మనెడి ప్రబంధ మెలమిఁ
జేసిన నాగరాట్ఛేఖరు మున్మనుమని మల్లికార్జును మనుమని ఘనుఁ
దన చెల్లెలగు తిర్పతమ్మకు నకలంక కనఘుఁడౌ నాగరాజాఖ్యునకుఁ ద

తే. గీ. నూజు విద్యలభోజు మనోజతేజుఁ
గలితకవిరాజు యాచకకల్పభూజు
రామచంద్రవేంకటకృష్ణరాడ్బిడౌజు
దత్తుగాఁ గొనెఁ గామాంబ ధవుని యాజ్ఞ. ౨౮

శా. దత్తుం డయ్యును గన్న పుత్రువలె నాతం డా మెయం దెక్కుడౌ
బత్తిం జేర్మియుఁ జూపుచు న్వశమునం బద్ధాదరుండై కళా
వత్తం బాల్యమునంద కైకొని సుధీవర్యు ల్నుతింపన్ లస
ద్వృత్తాఢ్యుం డయి సత్కవిత్వగతి నెంతే వృద్ధిఁ జెందె న్వెసన్. ౨౯

చ. అతిసుకుమారుఁ డయ్యుఁ బ్రభువయ్యు శ్రమంబు గణింపఁ బోక చి
న్నతనమునుండి విద్యల మనం బిడి వేగ ‘బి యే’ పరీక్ష సం

గతముగఁ జేటి యిక్కతన 'గౌర్నరు' చేఁ గడుగౌరవంబు నొం
ది తనరు కృష్ణరాట్ప్రభు నుదీర్ణయశంబు వశంబె యెన్నఁగన్. ౩౦

క. జననీజనకులు మును చేసిన ధర్మమ్ములను వృద్ధిఁ జెందించి తనం
తన కొన్ని ధర్మకార్యము, లనూనముగఁ జేసె నన్యులాతని కెనయే. ౩౧

చ. మరుని జయించు రూపమున, మాధవుఁ బోలుఁ గృపాపరిసక్తి, నా
దరమున మేటి, యోర్పున నుదారగుణంబున నేరు సాటి? ధీ
వరులకుఁ గల్పవాటి పరిపాటి నెలర్చెడు కృష్ణరాయభూ
సురవిభుధాటి కెయ్యెడలఁ జూచిన మేప్రతికోటి కల్గునే! ౩౨

క. నిరతాన్నదానరక్తియు, సరసకవిత్వప్రసక్తి, శాంతి, గుణమహో
త్తరపూర్ణశక్తి సహజస్ఫురణమ్ములు కృష్ణరాయభూమీంద్రునకున్. ౩౩

క. ఇతఁ డతికవితాలోలుపమతి యని వర్ణింప నేల మాటికి నీసం
గతి ప్రీతిమానమున సరస్వతియే ప్రతిదేశ మేగి చాటుచు నుండన్. ౩౪

క. ఇంతకు నెక్కుడువారలు నింతకుఁ దక్కుడగువార లెందఱు లే రీ
ప్రాంతముల జమీందారులు; శాంతమ్మున నింతవారు జనియింప రిఁకన్. ౩౫

చ. కవి యనునంతమాత్రమునఁ గాదొకపద్యము నేనిఁ జక్కఁగా
నవరసభావము ల్వెలఁగ నాణెముగా రచియించి తన్నుఁ జూ
డవలయు నంచు వచ్చినయెడ న్మతి వాని దరిద్రతాభరం
బవలకుఁ ద్రోయఁజాలిన యుదారుఁడు వేంకటకృష్ణుఁ డల్పుఁడే! ౩౬

చ. ఎవరికి నేని నిచ్చుపనియే మనవృత్తి యటంచు నెంచి స
త్కవులను బండితోత్తముల గాయకులం దనియించుఁ గాని పో
లవరవిభుండు రక్షితకలావిదధీశుఁడు కృష్ణరావు మె
చ్చ వడయునంతపాటి బుధపుంగవులుం గలరే జగంబునన్! ౩౭

తే. గీ. మేను బలి యను, నాకర్ణమితిని దెల్పు
నయనయుగళమ్ము, శ్రీకరాననము సెప్పు
రామభావము, శ్రీకృష్ణరాయచంద్రుఁ
డితఁడు వితరణియని వచియింపవలెనె! ౩౮

ఉ. పాఱులయందు విద్యల నపారులు గల్గిరి గాని బల్లమీం
గారులు లేరు, గల్గిన నుదారులు గా, రటులేని దుర్లభా

కారులు కాకపోరు, కవికారుల కీ, రిది యెల్ల మన్మథా
కారుని కృష్ణరాడ్విభునిఁ గారుణికాగ్రణి నాశ్రయించెఁగా. ౩౯

ఉ. శ్రీ రంజిల్లెడు వాడ రేవుకులవార్ధిం బుట్టి శ్రీపావమాం
బారావు న్సతిగాఁగఁ జేకొని జగన్మాన్యంబు గాఁగం జమిం
దా రై యేలెడు వేంకటేశ్వరు నపత్యం బైన గారంపు బం
గారమ్మం గొనెఁ గృష్ణరాయధరణీకాతుండు దేవేరిఁగన్. ౪౦

క. బంగారమ్మ తనకుఁ దనువుం గాఁ దగు కృష్ణరాడ్విభువరేణ్యునకున్
బంగారమ్మ యెలమి నర్ధాంగం బై యొప్పు టొక్క యబ్బుర మగునే. ౪౧

మ. ఘనుఁ డాతం డొకనాఁ డనూన మగువేడ్కం గొల్వు గూర్చుండి మ
మ్మును శ్రీమత్పరదేవతామహిమసంభూతాశుధారాకవి
త్వనితాంతప్రతిభావిశేషరచితాపారప్రబంధానుబం
ధనులన్ దివ్యశతావధానధనులం దర్కించి పల్కెం గృపన్. ౪౨

సీ. తగ నాత్మకూరుసీతారామభూపాలుఁ డేన్గు నెక్కించి యూరేగఁ జేసె
గద్వాలరామభూకాంతుండు గౌరవస్ఫీతికై బంగారు బిరుదు లిచ్చె
నానందగజపతిక్ష్మానేతయును దగిన కవీంద్రులంచు మన్ననయొనర్చె
శ్రీరాజగోపాల కృష్ణయాచనృపాలుఁ డవధాను లంచు గౌరవము చూపెఁ

తే. గీ. జెన్నపురిరాజ్యమందు వసించు రాజ
వరులు మిము గారవింపని వారు గలరె
జగ మెఱిఁగినబ్రాహ్మణునకు జందె మేల!
సరస తిరుపతి వేంకటేశకవులార! ౪౩

వ. అని బహూకరించి మీరచించిన ధాతురత్నాకర కాళీసహస్ర వీథీరూపక శుకరంభాసంవాదాది సంస్కృతభాషాప్రబంధంబులును శ్రవణానంద దేవీభాగవత శ్రీనివాసవిలాస లక్షణాపరిణ యోంగామాహాత్మ్యాదులగు నాంధ్రప్రబంధంబులును ననేకమ్ములు నసాధ్యతరమ్ములునగు శతలేఖిన్యవధానాష్టావధానాది కవితావైచిత్ర్యంబులును మీయశమ్మునకు సాక్ష్య మొసంగు నని మఱియు నిట్లనియె. ౪౪

తే. గీ. ఇద్ధతేజుఁ డైన బుద్ధదేవుచరిత్ర
నశ్వఘోషముఖుల ననుసరించి

యస్మదంతముగ నాంధ్రకావ్య మొనర్పఁ
డనుచు వీడ్య మిచ్చె నాదరమున. ౪౫

క. ఇచ్చినఁ గైకొని మనమునఁ బొచ్చెము గనరానికూర్మి పొసఁగఁగ నెంతే
హెచ్చగు సంతసముం గని సచ్చరితుం డితఁడు కృతికిఁ జాలు నటంచున్. ౪౬

చ. అనువుగఁ గృష్ణరాయలు జయాంకుఁడు మున్నల తుంగభద్రయొ
డ్డునఁ దనరాజ్య మేలుచుఁ గడుం గవిరాజుల నాదరించియుం
దనపరిచారికాతనయతం దిగఁద్రావఁగ నెంచి కృష్ణరా
డ్ఘునుఁ డయి పుట్టె విప్రుఁ డయి గౌతమియొడ్డున నంచు నెంచుచున్. ౪౭

సీ. ఎవని పురాణాగమాతివిభూతి తెల్పుఁ దత్ప్రాపకం బైన బిరుదే పదంబు
ఎవని భాషాభిమానవిభవంబు వచించు నెంచి చేయించు సత్కృతిచయంబు
ఎవని కవీంద్రగౌరవము చాటించు ముద్రాపితప్రాక్కవిగ్రంథపటలి
ఎవని యగణ్యపుణ్యవిశేష మెఱిఁగించు నత్తకోడండ్ర యన్యోన్యమైత్రి

తే. గీ. యతఁడు కొచ్చెర్లకోట వంశాంబురాశి
చంద్రుఁ డురుకీర్తిసాంద్రుఁడు శాంతిపరుఁడు
రామచంద్రవేంకటకృష్ణరామచంద్రుఁ
డనితరప్రతిభాశాలి యనియుఁ దలఁచి. ౪౮

వ. విద్వజ్జనమనశ్చకోరచంద్రాయమానుండును సత్యభాషాహరిశ్చంద్రుండును భోగదేవేంద్రుండును నాశ్రితరక్షణోపేంద్రుండునునగు నాభూసురేంద్రున కభ్యుదయపరంపరాభివృద్ధిగా మారచింపంబూను బుద్ధచరిత్రంబునకుఁ గథాక్రమంబు.

———

## కథాప్రారంభము.

మ. ఇల సాకేతపురాంతికంబునను రోహిణ్యాపగాతీరమం
దలఘుప్రాభవ మైన మంచుమల కత్యంతంబు దా నాపునం
బొలుచు న్వీ డొకఁ డెల్లవిద్యలు యశమ్ము న్సౌఖ్యము న్సంపదా
దులుఁ ద న్నెప్పుడుఁ గొల్వఁగాఁ గపిలవస్తుఖ్యాతి నాధిల్లఁగన్. ౫౦

చ. అమితసితోన్నతంబు లగు హర్మ్యములం గని వెండికొండ నె
త్తము లను భ్రాంతి నొంది జలదంబులు నిచ్చలు విశ్రమించు మన్
బ్రమదమున న్నయంబునఁ బ్రభావమున న్రజతాద్రితోడఁ దు
ల్య మని తలంచు పౌరుల యథార్థమనీషలఁ జేయుఁ దత్పురిన్. ౫౧

ఉ. శోకము గల్గు తన్నగరసౌధములన్ రతనంపుఁగ్రొంజిగిం
జీఁకటివోలె లేమియును జేర భయంపడుచుండు నుత్తమ
శ్లోకులు పౌరు లంచు మదిలో ముదమందుచు నున్నదో యనన్
జోక యొనర్చుఁ దత్పురము చూపఱకు న్నడిరేయి నేనియున్. ౫౨

చ. పణముగ సింహకర్ణములపై రతనంబులు దాపినట్టి తో
రణముల రామణీయక మరంగులరంగులు నేపురంబు తో
రణముల కిండ్లకెంగును సరాసరి లేమి బరిస్ఫురంబుగాఁ
బణమున మీఱుచున్నగతి భాసిలుఁ దత్పురమందు మాడువుల్. ౫౩

మ. తనపై నేస్తము గల్గు తమ్ములకు సంతాపంబు గావింప వా
రని కాంతాముఖచంద్రులం జెనక నిత్యంబుం బతంగుండు త
ద్ఘనసౌధంబుల త్రోవఁ బోవుచుఁ గడుం గాళించియుం జూచి కా
వనిచింతం బడుచుండుఁ బ్రత్యగుదధిం దాఁ గోపరక్తాంగుఁడై. ౫౪

చ. 'శతముఖుఁ డౌనుగాక మనశాక్యనృపాలురతోడఁ దుల్యుఁ డే
గతి నగు? నల్పు లిచ్చిన ప్రకారముగా బిరుదంబు చెల్లునే!
యితనికిఁ గల్గు నా బిరుదమేఁ దుడిపించెద' నంచుఁ దత్పురీ
సతి పయికెత్తు కేలన ధ్వజంబుల పెల్లలరారు నప్పురిన్. ౫౫

తే. గీ. కోటఁ బొడవయి చదలంటు కోటనోడ
హరిపదము ముట్టె నన్నను నగుచు గాని
కడలికైన లోఁతు గల్గు నగడ్త గ్రోడ
హరిపదము ముట్టె ననుట మహాద్భుతంబు. ౫౬

తే. గీ. గజములో యని తలఁప నగజము లగుచు
నాగములె యని తలఁపోయ నగములగుచుఁ
గొండపొడుగుగఁ బురిచుట్టు నిండియుండుఁ
దొండములు గల్గునట్టి జంతుప్రజంబు. ౫౭

తే. గీ. శాక్యపరిపాలకుండు విస్తారయశుఁడు
విక్రమక్రమవంతుఁడు చక్రవర్తి
యేలు నప్పట్టణం బనురేశ్వరుండు
నాఁగ శుద్ధోదనుండు సన్మార్గధనుఁడు ౫౮

తే. గీ. సకలసామంతమూర్ధాభిషవనగలిత
కలితజలబిందుదలదిందుఖండమండి
తోజ్జ్వలాంగుఁడు నైన శుద్ధోదనునకు
ధర్మమునఁ దుల్యుఁ డొక్క పృథాసుతుండు. ౫౯

చ. జవనహయంబు నెక్కి రభసంబును రౌతులు మెచ్చులాడఁగా
నెవఁడు కరాసిచే నలుక నీల్గిన శాత్రవికద్విపేంద్రము
ల్పవిలిన నెత్తులం బలకఁబాఱిన ముత్తెపుఁజేర్లు గ్రక్కుచుం
బువులను దోయిలించుగతి బోరగిలంబడు సంగరస్థలిన్. ౬౦

మ. ఉపరాగంబులు నిష్క్రమించి రవి లోకోన్మోదముం జేయు న
ట్లపకారం బొనరించు శాత్రవులఁ జక్కాడించి శుద్ధోదనుం
డుపకారం బొనరించుచుం బ్రజలపై నుల్లాసముం జూపుచుం
గృప నీలోకము నేలెఁ బెగ్గడల యంగీకారము ల్తోడుగన్. ౬౧

వ. భూభృద్వరుండయ్యు సపక్షపాతుండు, నీశ్వరుండయ్యు సమదృష్టిప్రసారుండును, బరివృత్తదానుండయ్యు మదానుపేతుండును నగు నాశుద్ధోదననృపాలుండు సకల సామంతనృపాలసమర్ప్యమాణమదావళీమదధారావాహినీపంకిలభవనాంగణుండై రాజ్యంబు సేయుచు మాయాదేవియు గౌతమియు నను నిరువురు నెలంతుకలం బెండ్లియాడి సుఖం బుండె. ౬౨

సీ. తానకం బేకాంత దైవభక్తికి సాధుగురుజనాసక్తి కేతరుణి కుదురు
పరిజనపాలింటి కేభామిని జనయిత్రి చుట్టాల కేసాధ్వి పట్టుఁగొమ్మ

పతి కేసరోజాక్షి పంచప్రాణంబులు పరిశుద్ధి కేతల్లి పాలవెల్లి
కరుణానివాస మేకలికి భృత్యుల కెల్లఁ గులకామినులకు నేలలన యొజ్జ

తే. గీ. నిజముగఁ గటికిఁజీఁకటి నియతి గలుగు
కలికికొలముల దేవి వెలుఁగుఁ దెచ్చు
మణి యగుచు వట్టి పతికథ మాయసంటి
వెలఁతుకలు ముజ్జగంబున నిండుసున్న. ౬౩

ఉ. ఆరమణీలలామ యొక యామినియం దొకశీకంపు కేళికా
గారమునందు మంజులతఁ బ్రాలెడు పాన్పున భర్తఁ గూడి స్వే
చ్ఛారతుల న్మెలంగి యొక స్వప్నము గాంచెను నిద్రలోన నం
భోరుహమిత్రమండలము కా ద్వగజామున కొప్పునప్పుడున్. ౬౪

తే. గీ. షట్కిరణయుక్తమైన నక్షత్ర మొకఁడు
పాటలప్రభ దిక్కుల దీటుకొనఁగ
నాకసమునుండి కుడిప్రక్కఁ దాఁకి తనదు
గర్భమునఁ జొచ్చినట్లు లక్కల తెఱంగు. ౬౫

వ. ఇట్లుత్తలోదరి కలగాంచి యల్లన మేల్కని యక్కల నిక్కము తనపతికిఁ జెప్పి
పదపడి బంధుజాతమ్మున కెఱిఁగించిన శుభసూచకం బనుచు నెల్లరు నానందించి
రదియునుం గాక. ౬౬

శా. యావద్భూపరిపాలకుండయిన శాక్యాధీశు రాజ్యంబు తా
నై వర్తించు ప్రజ ల్క్రమక్రమముగా నవ్వార్త యందంద యెం
తేవేడ్కన్ని చావుపుట్టుకల మాయింపించు నిర్వాణభూ
త్యావిర్భావము చెందినట్లు గని రత్యంతప్రమోదస్థితిన్. ౬౭

చ. వెనుకటికన్న నెల్లపృథివీవలయంబును బాడిపంటలం
దనరుట యాదిగాఁ గలుగు తత్తదశేషవిశేషము ల్గనుం
గొనుచు నృపాలురాణి కల కుంభిని కెల్లను మోదదాయి య
య్యె నని యపారమైన సుఖమొందును జెంది రనేకసంఘముల్ ౬౮

చ. పదపడి రాజునానతి సభాస్థలి స్వప్నఫలప్రదర్శకు
ల్మునువ పలరంగ స్వప్నఫలము న్వచియించిరి 'దేవ! యెంతకే

నీ దగిన స్వప్నమీయది గణింపఁగ శక్యమె నీదు భాగ్యసం
పద! జగదేకరత్నము నపత్యముఁ గాంచెదు నిశ్చయంబుగన్. ౧౯

శా. ఆపుణ్యాత్ముఁడు సార్వభౌమపదవిం బ్రాపించి సామంతభూ
మీపాలుర్ దనుఁగొల్వ నెల్లరును మేల్మేలంచు శ్లాఘింప నా
శాపాలేశనిభంగి యీభువనమున్ శాసింపుఁ, గాకేని వి
ద్యాపూర్ణుండయి సర్వలోకులకు నిత్యానంద మిచ్చుం గృపన్.’ ౨౦

క. పదపడి యమ్మానిని దౌహృదలక్షణము న్వహించె హృదయేశుఁడు స
మ్మదమందఁ బ్రథమగర్భం బది భర్తకు మోద మిచ్చుటబ్బం బగునే. ౨౧

ఉ. ఈరుచిరంపువార్త వినునెల్లరు నెమ్మది మోదమంది వి
స్ఫారతఁ గాంచె గర్భ మలసాధ్వికిఁ బానఁ బరీక్షణంబున
న్గోరుకు లీరిక న్గొలిపెఁ గోమలికిన్ మిగు మెల్ల మెల్లనై
యారయ నయ్యెఁ జూచుకములం గడిమెన్నలు పంతకంతకున్. ౨౨

తే. గీ. ఉదరమునయందు భగవంతుఁ డుంటఁ జేసి
యధికశోభ వహించె నయ్యధిపురాణి
వెన్నెలల కన్నె చెన లోక్క హితమ్మైన
వెండిమల నెత్తముల హొచ్చియుండుఁ గాదె. ౨౩

తే. గీ. మించుఁ గడుపున ధరియించు మేఘమాల
పోల్కిఁ దనలోన బోధిసత్త్వుని ధరించి
ధరణి దీనాళి దారిద్ర్యతాపహరము
మాయ ధనవృష్టిఁ గురిపించె మాయ యపుడు. ౨౪

క. పరిపూర్ణగర్భవతియై సరసిజముఖి పుట్టినింటిచాయకు నెంటం
బరివారము రాఁ జను నవసరమున గారి నుపవనముచక్కటి నొకటన్. ౨౫

చ. అనయముఁ బూలఁ బిందెల ఫలావళులం దులఁదూగుచుండు లుం
బినియను చెట్లతోఁపుఁ గడువేడ్క వెలర్పఁగఁ జేరునంతఁ గ్రి
క్కునఁ బ్రసవంపుభంగి యొకకొంత కనంబడ నాపె యాన మొ
య్యన నిలువంగఁ జేసి డిగి యల్లనఁ గొండొక యేగి యొక్కెడన్. ౨౬

వ. నిలువంబడి యొక్కపలాశవృద్ధశాఖ చేతులం బట్టికొని ప్రసవవేదనాపర
వశయై యుండుపట్టున నప్పలాశవృక్షంబు: ౨౭

మ. తనకొమ్మల్ దిగవంచి యెల్లెడలఁ బత్రవ్యాప్తిఁ గావించి సూ
ర్యనిరోధం బొనరించె గొడ్గుగతి నారా! యింత, యాసాధ్వి ని
ల్చినచోట న్నయనీయ మట్లు మొలచె న్నేఁజొంపము ల్పూలు, మీఁ
దను నేఁడొక్కటి వచ్చెదాపునకు నేత్రక్రీతి సంధించుచున్. ౨౮

ఉ. ఇట్టి విచిత్రచర్యలకు నెల్లను నెల్ల సమస్తవిశ్వలం
ఘట్టుఁడు కాఁగలాఁడు పరతత్త్వవిశారదుఁ డార్యసంతతు
లట్టినభాగ్యరేఖ యలకాంతకుఁ బుత్రకుఁడై క్షణంబునం
బుట్టె సమస్తలక్షణసముజ్జ్వలమై తనమూర్తి యొప్పఁగన్. ౨౯

తే. గీ. మొగిలుతెర దాఁటి రవి వచ్చుపగిది మాతృ
కుక్షి వెడలిన యాజగద్రక్షమూర్తి
యొడలి సంచులు వన మెల్లయెడల నిండి
పండు వొనరించె బాలాతపంబుమాడ్కి. ౩౦

క. చందనయూపముతో సరియందముగల శాక్యభూవరార్భకు మీఁద
న్మందారపుష్పవర్షము బృందారకు లెల్లరుఁ గురిపించిరి ప్రేమన్. ౩౧

ఉ. అల్లలనాడె వాతహతమై తరిలాగు ధరిత్రి యంతయుం
జల్లనిగాలి వీచె, రవిచంద్రులు మున్నటికంటె హెచ్చు భా
సిల్లిరి, దిక్కులెల్ల మదముచెన్నున మించెను, బొల్చె వార్ధులున్
మొల్లము పల్లవించె నగము ల్మహనీయుని జన్మవేళలన్. ౩౨

మ. అహహా! యెంతమహానుభావుఁడో కదా యాతండు దిక్పాలకు
ల్మహి కేతెంచి ప్రసూనసమేతముగ ధర్మస్థితస్నై యెక్కుడౌ
రహి నొప్పారెడి యానమం దునిచి గర్వం బింతయు న్లేక తా
ర్వహియింపం దగువారలై నగరికిం బ్రాపించి రప్పట్టునన్. ౩౩

తే. గీ. సురలు మోయు శిలాచికోపరితలమున
జనని యొడికట్టు లోపలఁదనరునిసువు
సంజకెంజాయచాటున జనులచేతఁ
జూడఁబడు బాలశశిరేఖ నాఁడు తోఁచె. ౩౪

వ. ఇట్లు దిక్పాలకానీతం బగుయానంబు కపిలవస్తుపురీపీఠం జనుదెంచుసమయంబున నబ్బురంపడు పౌరు లందఱు నాకస్మికంబగు నిదియంతంబు సాంతంబుగా విని సుందుఁ జని శుద్ధోదనున కెఱింగించిరి. ౩౫

క. కని శుద్ధోదనుఁ డానందనిమగ్నుం డయ్యె దేవతలు మనుజులు నాఁ
గను భేద మించుకయు లేక నియతమోదాతిశయము నందిరి పౌరుల్. ౩౬

ఆ. వె. పుడమి యెంత పెట్టి పుట్టెనే యనియు శు
ద్ధోదనుని దఖండయోగ మనియు
నతనిభార్య కెవ్వరైనను లోచ్చని
యు సురలెల్లఁ బొగడిరెసక మెసఁగ. ౩౭

చ. మును గలనాఁడు పండితు లమోఘవచస్కులు చెప్పినాట లే
దినమున లక్షణాఢ్య మగు తేజము వొల్చెడు పుత్రుచందము
న్మనమున నెంచి యీతఁడు సమస్తనృపాలశిరోవిభూషణం
బనఁదగు రాజచంద్రుఁ డవునా నని సంతస మందెఁ దండ్రియున్. ౩౮

తే. గీ. అంతియే కాని సంసారమపలఁ ద్రోచి
జ్ఞానియై జ్ఞానులకునెల్ల జ్ఞానబోధ
మొలవఁజేయుచు సన్న్యాసమును సహించు
నని యెఱుఁగఁ ; డేరికెఱుక భావ్యర్థగతులు ! ౩౯

సీ. ఐరావణమునైన నక్కుఁ దన్నఁగఁజాలు చేవగల్గు ననేకసామజములును
నుచ్చైశ్శ్రవసముతోనొఅపుఁ జూపెడి చక్కనైన వేగమువొల్చునశ్వతతులు
పవితోడ నెదిరించి బవరం బొనర్పఁగఁ జాలిన యాయుధసముదయములు
చింతామణికి సిగ్గుచేయఁజాలెడి మంచి నిగ్గు గల్గిన రత్ననికరములును

తే. గీ. బునుఁగుఁ గస్తూరియు జవాజియును ననర్ఘ
మైన ముత్యాలహారమ్ము లట్టినేలు
వులు నుపాయనముగ నృపావళులు చూడఁ
దరలి వచ్చిరి తండోపతండములుగ. ౪౦

ఉ. వెండియు నాఁడు సంతసము వెల్లిగొనంగను పౌరులెల్లఁ బూ
ర్ణ్మండన మాచరించి మృదుమంగళనిస్వననృత్తగీతము
ల్మెండుగ నెల్లచోటులను మేకొనఁ గేవలసౌఖ్యమగ్నులై
కొండొకసంగతు ల్తలఁపుగొల్పక వర్తిలి రేకరీతిగన్. ౪౧

చ. చిరమునసుండి తాఁ దపముసేయుచు యోగసమాధినున్న స
త్పురుషుఁడు వృద్ధమూర్తి యసితుం డను నొక్కమహానుభావుఁ డు

ధురగుణుఁ డైన బుద్ధుఁ డొకతొయ్యలికిం జనియించె నంచు నం
బరమున నొక్కవార్త విని పట్టఁగరాని కుతూహలంబునన్. ౯౨

క. అమరగతిఁ గపిలవస్తుపురమునకుఁ జనుదెంచి వేగ రాజన్యుని సౌ
ధము చొచ్చి యచ్చటిప్రజాసముదాయముతోడ రాజసన్నిధి కరిగెన్. ౯౩

ఉ. వచ్చినవానిఁ గాంచి జనవల్లభుఁ డల్లన లేచి మ్రొక్కి లో
మెచ్చుచుఁ బాద్యమిచ్చి మది మెత్తని బత్తియుఁ దత్తఱింప నీ
యిచ్చ యొనర్తుఁ జెప్పఁగదవే' యని చేతులు దోయిలింపఁగా
నచ్చపుఁబేర్మి నిట్లనియె నమ్ముని తేనియ లొల్కుపల్కులన్. ౯౪

ఉ. ఈవినయంబు క్రొత్తయగునే కులపూర్వులపోల్కెఁగాక నీ
కీవి నయంబున న్నృపజల నేలుటయందు సమాను లెవ్వ రో
కోవిదమాన్య! నీవు జనకుండవుగా నుదయించె బుద్ధుఁ డన్
దేవుఁ డ టంచు వింటి విని దేవరఁ జూడఁగ నిట్లు వచ్చితిన్. ౯౫

ఉ. నావుడు రాజచంద్రుఁడు మనంబున నుబ్బుచు లేచి వెంటఁగొం
పోవఁగఁ బోయి కాంచె ముని ముద్దులబాలు దయావిశాలు నీ
రానసితాంగుఁ జక్రకమలాంకితపాదుఁ గళావినోదు దం
తావళవస్తికేశు జనతానుతరూపు నిరస్తపాపునిన్. ౯౬

తే. గీ. గౌరితొడమీఁద నున్న కుమారుపగిదిఁ
దల్లియొడినున్న పాపనిఁ దనియఁ గాంచి
మరలె యతియును గన్నులదొరలునీరు
వంచి ఱెప్పలచే నప్పళించుకొనుచు. ౯౭

తే. గీ. తనయుఁ గని కంట నీ ర్వెట్టుతపసిఁ గాంచి
యేదియో కత మంచు శుద్ధోదనుండు
కాలు చేయి వడంకఁగ గద్గదస్వ
రమ్ముతో నిట్లనియె దైన్యరసము గదుర. ౯౮

క. కడునద్భుతజన్మము గల కొడుకుం గని దేవుఁడనుచుఁ గొనియాడియు నా
కడుపు పగులంగఁ గన్నులఁ గడుకొల్పితి నీ రిదేమికతము మహాత్మా! ౯౯

మ. పలితాత్ముండను ముప్పవాఁడను మృతప్రాయుండ నాకుం జలాం
జలి యిచ్చుం దరియింపఁజేయు నని యుత్సాహంబుతో నున్న యా

హాలపాలెల్లనుగంగలోఁ గలియ దీర్ఘాయుండు కాఁ డేమి, కాఁ
గల కార్యం బెఱిఁగింపఁగావలె నమస్కారంబు గావించెదన్. ౧౦౦

క. కన్నులు తెఱవని పాపఁడు చిన్నారి మెఱుంగు గల్గుచిఱుతఁడు పెంపుం
జెన్ను గను నంచు నున్నాఁడ న్నే మరదృష్టవంతుఁడను గాను గదా ! ౧౦౧

మ. గుణదూరుం డగునో ! సదా ప్రజలబాగుం గోరఁడో ! శత్రుమా
రణభీరుం డగునో ! కరంబుఁ బరదారావిత్తముల్ గోరునో !
పణవీరుం డగునో ! నయంబుగను విద్వాంసుండు గాఁడో !దయా
చణభారుం డగునో ! విరాగమున సంసారంబు వర్జించునో ! ౧౦౨

తే. గీ. అనుచు నశ్శీలమునకు భయంబుఁ జెందు
కపిలవస్తుపురీంద్రునిఁ గాంచి మౌని
'భయముఁ జెందకు మయ్య, నృపాల !" యనుచు
భావిగతిఁ జెప్పఁబోవు నవసరమందు. ౧౦౩

శా. అంతంతం గని యమ్మహామహుని మాయాదేవి లో నెంతయు
న్సంతోషం బిగురొత్త నమ్మని పదాబ్జాతద్వయిన్ వైచె శ్రీ
మంతుండుం గుణవంతుఁడు న్మిగుల ధీమంతుండు నాయుర్యశో
వంతుండు న్సుతుఁడౌ నటంచు; నటువైన న్యోగి దౌదవ్వులన్. ౧౦౪

చ. తొలఁగి భయమ్ము భక్తియును దోరముగాఁ గనుపట్టఁ నవ్వరో !
తెలియఁగలేవు గా శితని తేజము సర్వజనాభివంద్య మి
య్యలఘుఁడు నమ్యుఁ డెల్లరకు నారయ నీతని కెంత పెద్దవా
రలును ననమ్యులంచును గరమ్ములు మోడ్చి నమస్కరించుచున్. ౧౦౫

క. ఆతనిపాదము లుంచిన భూతలమున ధూళి హస్తమునఁ జేకొని య
త్యాతతభక్తి న్శిరమున వేతాలిచె నతఁడు తత్త్వవేత్త్రత నెగడన్. ౧౦౬

చ. ఎనిమిదిసార్లు ధూళి గదియించి శిరమ్మున నంతఁబోక య
య్యనఘుని యంఘ్రులందుఁ జెలువారెడు చిహ్నములెల్లఁ జూచి యిం
తని యనరాని మోదమున నమ్మహనీయు గుఱించి దైవభా
వన దనరంగ నిట్లనె నవార్యములై పులక ల్జనింపఁగన్. ౧౦౭

క. బుద్ధుఁడ వై జగముల కవిరుద్ధం బగుజ్ఞాన మిచ్చి ప్రోచుచును నసం
బద్ధపుమతముల ద్రుంచుచు నిద్ధచరిత నెగడఁ బుట్టితీవు మహాత్మా ! ౧౦౮

క. ఏ నతివృద్ధుఁడ నగుటన్ జ్ఞానము నీవలనఁ బొందఁగా నోఁచఁగ లే
దైనను జగ మెల్లను నిన్నూని తరించుటకు శంకయుండదు దేవా. ౧౦౯

క. తన కప్రాప్యం బైనది గొనవచ్చునె, దాని కేమి? గుణఘని వగు నిం
గనుఁగొనఁ గల్గెను సంతసమును బొందితి నింతకన్నఁ బుణ్యము కలదే. ౧౧౦

వ. అని శుద్ధోదనుదిక్కు మొగం బై యిట్లనియె. ౧౧౧

క. జర తరగలుగా, మరణము ఝురముగ, రోగములు నుఱుఁగుచందముగా దు
స్తరమగు సంసారాబ్ధిం దరియింపంజేయు తరి యితండు నరేంద్రా! ౧౧౨

క. వ్రతములు చక్రంబులుగాఁ, బ్రతిభ జలంబుగ, సమాధి పారంబులుగా
వితతమగు ధర్మనది నీ రితఁడే త్రావించువాఁడు తృష్ణార్తులకున్. ౧౧౩

క. విషమం బగుచును దత్త్వద్విషయావృత మైన తప్పుతెరువునఁ బడు కి
ల్బిషవంతుల కితఁ డకిల్బిష మోక్షపదంబుఁ జూపుఁ బృథ్వీనాథా. ౧౧౪

తే. గీ. విషయశుష్కేంధనమ్ముల విస్తరిల్లు
మోహదావాగ్నిలోఁ బడు మోఱకులకుఁ
బ్రాణదానం బొసంగి కాపాడుకొఱకుఁ
గారుక్రమ్మిన ఘనఘనాఘన మితండు. ౧౧౫

మ. నరపాలైకశిరోవతంస! కడుధన్యం బయ్యె నీపుట్టు; నె
వ్వరు నీకు న్సరి గారు; నీగృహము సౌభాగ్యం బగణ్యంబు; జ్ఞా
నరసాయత్తత నెల్లలోకముల యజ్ఞానంబు వోకార్ప ని
ట్టిరు తా మెచ్చటనో జనింత్రు చిరరూక్షిన్ దేవతాంశంబునన్. ౧౧౬

వ. అని వెండియు. ౧౧౭

చ. నరవర! యొక్క కారణమునన్ భవదీయగృహం బదృష్టప
త్త్ర మనియు న్వచించుట కేదం గడు సందియమందుచుంటి; నె
వ్వరికిని జన్మ మన్నది ప్రపంచమునం గడు దుఃఖదం బటం
చరసినవారికి న్మరణమన్నను జంకు జనింపకుండెడిన్. ౧౧౮

వ. అని మాయాదేవివంకఁ జూచి కనుఁగొనలం జాఱు నీ రత్యధికంబై నరేంద్రు
హృదయంబు పగులం జేయుచు నిట్లనియె. ౧౧౯

శా. ఏతాదృక్షమహానుభావునకు మాతృత్వంబు చేకొన్న స
త్పాతివ్రత్యగుణాభిరామ వగు నీభాము ల్ఖ్యాతిం బొందు శే

లా తప్పున్ ? విను, నేఁటి కేడవదినంబందున్ భవత్కాయసం
పాతంబౌ ; నిఁక సౌఖ్యదుఃఖముల సంబంధంబు నీ కేటికిన్ ? ౧౨౦

మ. అని యయ్యోగి తనంతఁ దాఁ జనియె; మాయాదేవియున్ యోగి చె
ప్పినకాలంబునకున్ మృతిం గని జగద్వేద్యంబుఁగా దేవతాం
గన లెల్లం దనుఁ గొల్వ స్వర్గమున వేడ్కన్మెలఁగానొప్పె; స
త్యనిధుల్ యోగులు సెప్పువాక్యము లవంధ్యమ్ముల్ గదా యేరికిన్ ! ౧౨౧

వ. పదంపడి రాజును గొండొక విచారించి గతంబునకుఁ గర్తవ్యంబు గానక యతనిం బెంచుటకుఁ దన ద్వితీయకళత్రంబగు గౌతమి నేర్పఱచిన నామెయుం దన కన్నకుమారుంబలె నొడియం దిడుకొని నంత. ౧౨౨

క. జ్ఞాని యగునీతఁ డితరుల జ్ఞానం బిడి యిట్లు ప్రోవఁగలఁ డనుగతి న
ద్దాని చనుఁబాలు బాలుని ప్రాణంబులు నిలిపి పెనిచె బలుపు మిగులఁగన్. ౧౨౩

వ. శుద్ధోదనుండును బదియవదినంబున సర్వార్థసిద్ధుండను నామం బొనరించినఁ బౌరు లందఱును నీతనిపుట్టువుకతన సర్వార్థసంసిద్ధి కాఁగలదు గాన నప్పేరు సార్థకం బగు నని సంతసించి రంత. ౧౨౪

సీ. నెల మూఁడువానలు నియతిగా వర్షించెఁ బుడమి సదా సస్యపూర్ణ యయ్యెఁ
గుంభప్లుతిగఁ బాలుఁగురిపించె గోవులు చతురంగబలము విస్తార మయ్యె
నరిరాజులకు భయంకరమయ్యె రాజ్యంబు దుర్మార్గులకుఁ బ్రోలు దూరమయ్యెఁ
గులకామినులయందు గొఱఁడాలు లే దయ్యె జారచోరులబాధ సమసిపోయెఁ

తే. గీ. పాపము నశించె ధర్మంబు పాదుకొనియెఁ
గఱవు కఱవయ్యె లేమికిఁ గలిగె లేమి
కపిలవస్తుపురేంద్రు నగారమందుఁ
బిన్న నెలమాడ్కిఁ బుత్రుండు పెరుఁగుచుండ. ౧౨౫

చ. అడిగిన నీనివాఁడు వ్రతమన్నను జేయనివాఁడు కల్లనా
జడియనివాఁడు బందుగుల సఖ్యము గోరనివాఁడు కొండెము
లాడెడువాఁ డసూయ మదిలోఁ గలవాఁ డొకఁ డైన భోధిస
త్త్వుఁడు గలరాజ్యమం దరయఁబోయినను గనరాఁ డొకప్పుడున్. ౧౨౬

క. పూవుందోఁటలు నూతులు బావులు సత్రములు దేవభవనంబులు పెం
జావడులును గట్టించిరి భూవరతనయుండు వృద్ధిపొందం జనముల్. ౧౨౭

క. ధనముం దాఁపఁడు కామమ్మునకై, ధనమునకు ధర్మముం జేయఁడు, ధ
ర్మనిమిత్తము ప్రాణులపైఁ గనికరముం బాయఁ బోఁ డొకండైనఁ బురిన్.

వ. ఇట్లభ్యుదయోన్ముఖంబై క్రమక్రమంబుగా వర్ధిల్లు కపిలవస్తుపురీంద్రుని రాజ్యంబు పగిది సర్వార్థసిద్ధుండును వృద్ధిఁ బొందుచుండె. ౧౨౯

తే. గీ. అంత నెన్మిదియవయేఁట నవనిపతియుఁ
గొమరునకు విద్యలను గడల్కొనఁగఁజేయ
నెంచి మంత్రులతోడ యోజించెఁ దగిన
దేశికుం డెవ్వఁ డీరలు తెల్పుఁడనుచు. ౧౩౦

ఉ. అంతియె కాని యీతఁడు మహాత్ముఁడు వీనికి నిట్టివిద్య లా
వంతయు జ్ఞానదాయకత నందమి నిక్కము భూతపూర్వమై
యంతయు నిమ్మహామహునియం దలరారు నటం చెఱుంగఁ; డా
సంతతియందు వత్సలత సర్వమును న్మఱపింపఁ జేసెడిన్. ౧౩౧

వ. ఇట్లాడయం డడిగినఁ బ్రెగ్గడ లందఱి ట్లనిరి. ౧౩౨

శా. విద్యావంతులకేమి యెల్లయెడల న్విచ్చేసి యున్నారు; సం
సద్యోషామణిభూషణాయితుఁడు విశ్వామిత్రుఁ డాధీరుఁ
డద్యోగం బొనరింపఁగాఁ దగిన విద్వాంసుండు నీ వాత్మజున్
సద్యం బాతని కొప్పగింపు మణివాసశ్శ్రీల నర్పించుచున్. ౧౩౩

చ. అనవుడు నట్లకాక యని, యానృపుఁ డాబుధుఁ బిల్వఁ బంచి, పు
త్రుని శుభమౌముహూర్తమునఁ దోరపుటుత్సవ మాచరించి, య
య్యనఘున కొప్పగించె మణిహారపరంపర లగ్రహారముల్
ధనమును ధాన్యము న్సముచితంబులు వస్త్రము లిచ్చిపుచ్చుచున్. ౧౩౪

చ. కరమున రత్నపుం బలకఁ గైకొని మేటివిసీతి యొప్ప నా
దరమున నగ్రభాగమునఁ దన్నృపపుత్త్రుఁడు నిల్వ నాసుధీ
వరుఁ 'డిది వ్రాసికొ'మ్మనుచు వ్రాయఁగఁజేయుడుఁ బూర్వమంద తా
నరసినవాఁడువోలె నవియల్లన వ్రాసి పఠించు నంతలోన్. ౧౩౫

ఉ. ఆతఁడు చెప్పకే కొదవయౌ గతి విద్యలనెల్ల నాజగ
న్నేతకుమారుఁ డెక్కుడగు నేర్పలరం గ్రహియించె నెన్నఁగా

బ్రాఁతియె వానిసంఖ్య! యొకభాషయొ, యొక్కొకపుస్తకంబొ! యే
రీతి గణింపవచ్చు! విసరే, మును ప్రాక్తనవిద్య లబ్బుటల్! ౧౩౬

తే. గీ. ఏది చెప్పినఁ దనకన్న నెక్కుడుగను
దిరిగి చెప్పుటఁ జూచి యాదేశికుండు
మనుజమాత్రుండు గాఁడని మదిఁదలంచి
పడియె సాష్టాంగముగను దత్పాదయుగళి. ౧౩౭

వ. అంతం బోక మఱియు నిట్లనియె. ౧౩౮

క. ఏ నీశిష్యుఁడ, నాకు ననూనంబగు మతివిశేష మొదవంగ నీవే
ధీ నెగడఁజేయ నొజ్జవు నా నేర్చిన దించుకయయినను లే దనఘా! ౧౩౯

వ. అని చెప్పి యతండు తద్వృత్తాంతంబు శుద్ధోదనున కెఱింగించి యతనిచే నుపాయనంబుగఁ గాంచనాంబరాగ్రహారాదికంబులు గ్రహించి తన యిచ్చం జనియెఁ; బదంపడి నృపసూనుండు. ౧౪౦

చ. కలల నతండుఁ డయ్యు మదిగర్వము దాల్పక, బల్పరాక్రమం
బలవడియుం గృపాపరతనంది చరించుచు, నశ్వశిక్షయం
దలఘుతఁ గాంచి, స్యందనవిహారములం గడిదేఱి, చాపవి
ద్యలఁ బ్రబలత్వ మూని, వితతప్రతిభం జెలువారె సామునన్. ౧౪౧

వ. ఇట్లు ప్రాగ్జన్మసంస్కారవిశేషంబునం గలిగినవిద్య లన్నియు న్నేర్చి సవయస్కులగు బాలురతోఁగూడ నాడువాఁడు. ౧౪౨

ఉ. వేఁటకు నేగి తద్విపినవీథులఁ గ్రుమ్మరుచు న్మృగాళి నే
పాటియు గాసిపెట్టక యుపాయమునం గ్రహియించి చంపక
మ్మేటి కృపాళుఁడై విడుచు; మించినవేగమునం జరించుటన్
ఘోటక మార్తిఁగూరఁ గృపగొల్పి వృథాగతి నాన్పు నిల్పుచున్. ౧౪౩

క. శోకము బాధయుఁ గన్నీ రాఁకలియును నిబ్బములన యతఁ డెఱుఁగుం; ద
ద్వ్యాకులత యించు కేనియు నాకరుణాకరున కెఱుకయనఁదగ దొకటన్.

వ. ఇట్లు దశహాయనుం డగు నాసర్వార్థసిద్ధుండు కృపైకగుణావలంబియై కాలయాపనం బొనర్చుచు నొకనాఁడు దేవదత్తాదు లగు తనమిత్రులతోఁ గూడి. ౧౪౫

చ ఉపవనసీమలందు సొబగొప్ప విహార మొనర్చుచు న్మనం
బపరిమితప్రమోదమయమై యెలరార హిమాద్రిచెంత నే

గీ. పులుఁగులం గనుంగొనుచుఁ గేళి యొనర్చుచు నున్న యంత వో
మపథమునందు నంచలసమాజ మొకం డొకచక్కిఁ గన్పడెన్. ౧౪౬

ఉ. కాళులతీరు ముక్కులచొకారము ఱెక్కలసొరు సెమ్మదిన్
హేళి యొసంగఁజేయ నృపుఁ డంచలబంతిఁ దదేకదృష్టిగా
లోలుపతం గనుంగొనుచు, లోఁ గడు మెచ్చుచుఁ, బజ్జ నున్న మి
త్రాళికి వానిచిత్రముల నారయఁజేయుచు నున్నవేళలన్. ౧౪౭

తే. గీ. దేవదత్తుం డలుఁగొకండు దీసి వింటి
యందు సంధించి కరుణ యింతయిన లేక
యొక్కయంచను గొట్టె, నాపక్షి ఱెక్క
లాఁగలేక భువిం బడె నాక్షణంబ. ౧౪౮

క. నెత్తురు ఱెక్కలఁ దొరఁగఁగ నత్తెఱఁగున గిలగిల మని యాహంసము పై
కెత్తిన శోకభరంబునఁ గుత్తుక తడియాఱఁ బడుటకు నృపుఁ డెడఁదన్.

క. కడలేని కనికరము గని తొడ నిడుకొని నల్ల నల్లఁదుడుచుచు మేనం
గడులోఁతుగ నాటిన యలుఁ గెడలించిన నంచ మఱియు హెచ్చినయార్తిన్.

క. గిలగిలఁ గొట్టికొనఁగ నయ్యలఘుం 'డిది యేల యిట్టు లార్తిం గను ? న
మ్మలికిం బుచ్చితిఁ గాదే, కలిగెనె వే ఱెద్దియేనిఁగారణ?' మనుచున్. ౧౫౧

క. తనకాయమునం దయ్యలుఁగును గ్రుచ్చియుఁబుచ్చియునుబుగుల్కొను నార్తిన్
దనలో నెఱింగి యనుభవమునకుం దెచ్చుకొని మిగుల మొనసిన కరుణన్.

ఆ. వె. అనఁటిమొవ్వువంటి యయ్యంచ ఱెక్కల
నేర్పుకొలఁదిఁ గేల నిమురుచును వ
నౌషధీరసముల నద్దాని క్షతి కొంత
యుపశమింపఁజేసె నృపసుతుండు. ౧౫౩

వ. ఇట్లు సహజప్రాణిహింసాదూరుండగు సర్వార్థసిద్ధుం డయ్యంచ కిట్లు నైక
విధోపచారంబు లొనర్చుచుండ దానిం గొట్టిన దేవదత్తుని భృత్యుండు చనుదెంచి
'మాదొర యంచను నాచేతి కి' మ్మనుటయు. ౧౫౪

క. నృపసుతుఁడు పల్కెఁ,'బ్రాణవ్యపేత మఱ నేని వాని కగుఁజు మ్మది, ప్రా
ణపరీతమగుట నటు కా; దపమార్గం బేటి క్కైన నర్థం బగునే'! ౧౫౫

వ. అనవుడు భృత్యునిచే నివేదితుండగు దేవదత్తుండును నయ్యెడకు వచ్చి 'నాయంచ
నీవు గైకొను టనుచితం' బన రాకొమరుం డి ట్లనియె. ౧౫౬

ఆ. వె. ఆకసమున నిద్దియల్లన నెగురు నే
శక్తి కతన నట్టిశక్తి మాత్ర
మీవు సంహరించి తిద్దానిజీవంబు
నెడప నైతి నీది యెట్టు లిద్ది ? ౧౫౭

ఆ. వె. దైవవిహితమైన దయ కల్మి నాకు నీ
యంచ బ్రతుకఁజేయునంతపాటి
యవసరంబు గల్గె, నక్కారణమున నా
యదియె యిద్ది యొరుల దగుట యెట్లు ? ౧౫౮

వ. అనవుడు దేవదత్తుండును 'నిట్టియన్యాయోక్తు లాడం బాడిగెనె? మదీయబాణనిహ
తం బగు హంసంబు నాది యనుటకు సందేహ మేమి' యనుచుఁ గలహింపం
దొడంగిన యమ్మిత్రునిమనంబు నొప్పించుటకు నొడంబడని మనంబుతోఁ బలు
కులననునయం బుట్టిపడ నయంబుగా నాభూవరతనయుం డి ట్లనియె. ౧౫౯

క. ఇందులకు నొల్ల వేని గనందగు సభవారు చెప్పు న్యాయంబును జే
రందిన విద్వాంసులు సభయందుందురు పోయి వారి నడుగుట తగదే. ౧౬౦

క. అన, నతఁ డీకొన నిరువురుఁ జని సంస్థానస్థవిబుధసత్తములం బ
ల్వినయమున నడుగ నొకరుం జన రుచితంబైనత్రోవ సందియపడుచున్. ౧౬౧

వ. అట్టియెడ భగవంతుం డగు నొక విద్వాంసుండు నిష్పక్షపాతంబగు మతంబుతో
నిట్లనియె. ౧౬౨

క. ఈనిఖిలజంతువులకును బ్రాణము ముఖ్యంబు. దాని రక్షించిన య
వ్వానిది తదాధిపత్యం, బీనాయము నొప్పవలయు నెల్లరు సభ్యుల్. ౧౬౩

తే. గీ. అంతియే కాని ప్రాణిహింసాచరణము
కరుణలేక యొనర్పఁగఁ గడఁగువాఁడు
తగునె దానికి నాధిపత్యము వహింప
ననుభవవిరుద్ధ మిది ధర్మమగుటయెట్లు ? ౧౬౪

క. ఈసిద్ధార్థుఁడు దీనిఁ గృపాసహితుం డగుచుఁ బ్రోచువాఁడై యలుఁగుం
దీసి తనయొద్ద నిడుకొని గాసి సాదిక మిడుట నితనిఁ గా దనఁ దరమే. ౧౬౫

వ. మఱియు 'మృగయావినోదంబునం బాణహతంబగు ప్రాణి యేదేనియుఁ బ్రాణి యున్నంతదనుక నాహతకునిది గా' దను న్యాయంబు సర్వసమ్మతంబు గావున నీ యంచ సర్వార్థసిద్ధునిదే యని నొడివిన, రాజును విని యానందించి కుమారుని కృపావశత్వమునకును విద్వాంసుని నిష్పక్షపాతబుద్ధికిని మిగుల సంతసించె.

ఆ. వె. నాఁటఁగోలె నెల్ల నరులకు నేప్రాణి
నేని హింసచేయు టెగ్గటంచుఁ
దేటతెల్లముగను దెలియంగ నయ్యె; న
హింసఁబోలు ధర్మమెందుఁ గలదె! ౧౬౭

క. పదపడి యయ్యంచను బూర్వదశకుఁ దాఁదెచ్చి దివికి వదలిన నది స
మ్మద మందుచుఁ జనె; నాతఁడు సదయత నొనరించు నిట్టి సత్కృతు లెపుడున్.

వ. ఇట్లు సకలపౌరస్తూయమానుం డగుచు నాసర్వార్థసిద్ధుండు సమానశీలవయస్కు లగు బాలురతోఁ గూడికొని క్రమక్రమంబుగ వృద్ధిఁ జెందుచున్నంత. ౧౬౯

సీ. ఆజానులంబంబులై కరంబులు గాలె వక్షంబు తులితకవాట మయ్యెఁ
గందోయి కర్ణాంతకమనీయకమ్మయ్యె నారవం బబ్దగంభీర మయ్యె
బలము సింగముతోడితులన కెక్కవయయ్యె ధైర్యంబు మదిలోనఁ దా వొనర్చె
మొగము శ్మశ్రులమయి ముద్దుఁ జూపఁగసాగె ఫాలంబు మిగుల విశాలమయ్యె

తే. గీ. దేహమున నొక్క లవణిమ దీటుకొనియె
జంఘలకుఁ బాటవంబు విస్తారమయ్యె
నతులనుగుణాబ్ధియైన సిద్ధార్థునకును
నిండుజవ్వన మది మేన నిండునంత. ౧౭౦

వ. ఇట్లు సంపూర్ణయౌవనుం డగుచు నాకుమారుండు సంసారదూరంబగు విచారంబునఁ బ్రవర్తించు చున్నంత. ౧౭౧

క. ఋతువులకు రాజు, తతదుర్గతులకు ధనికులకు నొక్కగతి సౌఖ్యమ్మున్
జతకూర్చు జాణ, కుంజవసతుల యదృష్టం బొదవె వసంతం బంతన్. ౧౭౨

సీ. పండుటాకుల నూడ్చి పాదపంబులు నాఁడునాఁటికిఁ జివురుల దీటుకొనియె
నిగనిగ నెగడెడి చిగురులలోనుండి పసరుమొగ్గలు సముత్పత్తిఁ జెందె
నామొగ్గ లంతలో నతిశయించుచు నొకించుక సౌరభమ్మును జూఱగొనియె
నంతలో నఱవిచ్చి యవి పూవులై సమగ్రపరిమళంబునఁ గాలఁగొనఁగ

తే. గీ. బదపడి రజఃప్రసంగంబు పరిఢవిల్లె
నంతఁ దుమ్మెదద్రిమ్మరీం ద్రావరించె
మలయవాయువు లామీఁద నలముకొనియె
నెల్లదెసల సుగంధంబు నెల్లివిరిసె. ౧౭౩

తే. గీ. పట్టణముకన్నఁ బల్లెయుఁ బల్లెకంటె
నుపవనంబును మఱియు నయ్యుపవనంబు
కంటె వనమును మేటిసౌఖ్యంబుఁ గూర్పఁ
గలవియై యొప్పె నామని బలియుకొలఁది. ౧౭౪

చ. నదులతలంబులం దుపవనంబులచాయలయందు దీర్ఘికా
వదనములందు వారినిధిపజ్జలఁ గట్టిన మేడలందుఁ ద
త్తదుచితకార్యభారములఁ దద్దయు లోఁగినవారు సంజ పెం
పొదవినవేళల న్మదము లుప్పతిల న్నివసింతు రొప్పుగన్. ౧౭౫

ఉ. ఎల్లెడ వృక్షజాతముల యేపుననో సరసప్రచారమై
చల్లనిగాలి వీచుటనో షట్పదకోకిలకీరశారికల్
కొల్లలుగాఁగ శ్రావ్యగతిఁగూయుటనో మఱి యేమొ తద్వసం
తోల్లసనంబు సంజలన యున్నత మై కనుపట్టు నెంతయున్. ౧౭౬

సీ. లతలన్నియును బుష్పవతులై నగంబుల నంచితంబుగఁ గౌఁగిలించుకొనియె
మందంబులై మంచిగందంపుఁ దావితో జెలరేఁగి నునుగాడ్పులలముకొనియె
దోరముగ్గినపండ్లు ద్రోటిచేఁ గొఱుకుచుఁ గొదమచిల్కలదండు కూయఁదొడఁగెఁ
బండుటాకులమీఁదఁబడిన పూవులజాలు పండువెన్నెలకంటెఁ బండు వయ్యె

తే. గీ. వాలుమగ లెల్లఁదెల్లనిపూలఁజాల
లీల లొదవఁగఁ జేయు నీరాలలోన
నించువిల్కాని చెయ్వు లగ్గించుకొనుచు
సంతసింపఁగ సాగి రాసమయమందు. ౧౭౭

క. పొగడలుఁ దమాలములు మోదుగులుం దిలకాగములు మధూకంబులుఁ గెం
జిగురుంబూవులతోడ న్నగముల నింపుం దనర్చె వయనంబులకున్. ౧౭౮

సీ. అరయరక్తాశోకకరయుఁ బలాశాంగ్ఘ్రికయును నీలాశోకకచయు నీల
నీరజనయనయు వారిజవదనయుఁ గుందద్విజయు బిల్వకుచయు మంజు

రీకర్ణయును జపాశ్రీకాధరయు నీపవనాన్వితయు సింధువారనఖయుఁ గోకిలాలాపయుఁ గేకికలాపయు సారసస్వనసూపురారావయును

తే. గీ. రమ్యవాసంతికాబద్ధరశనయు మఱి
హంసగమనయుఁ బుత్రదీవాభిధాన
లోమలతయును నగుచు నెంతే మెఱుంగు
సరసులకు నెల్లఁ గూర్చె వసంతలక్ష్మి. ౧౭౯

చ. క్రమముగ శైత్యబాధ తొలఁగం బ్రజ లంచకు మిద్దెమూలలం
బ్రమదలతోఁ బరుంట దిగఁ ద్రావియు మీఁగిలిలాసపొగకు
ట్టిమముల లేఁత గాడ్పులకు డెందము లూరఁగ సన్న సన్న వ
స్త్రములను గప్పుకొంచు నిదురం గొనసాగిరి వేసఁబోకలన్. ౧౮౦

మ. మలయాంగమునఁ జందనాగముల సంపర్కంబునం బుట్టి సం
చలదూర్మిప్రకరంబులై కమలసంసక్తంబులై యొప్పు వా
గుల నయ్యోయెడ సేదఁ దీర్చుకొనుచుం గుంజమ్ములం దూఱుచుం
గలయం బ్రామఁదొడంగె వెన్నెలల సఖ్యం బొంది మన్దమ్మెరల్. ౧౮౧

తే. గీ. సదృశమగు వేఁడి సదృశమా చలియుఁ గలిగి
పవలు నిశియును విషమభావంబుఁ గనక
త్రాసునం దూగుగతి సమత్వంబు దాల్చి
తనరుచునట్టి యవ్వసంతంబునందు. ౧౮౨

వ. శుద్ధోదనుం డవ్వసంతర్తువిశేషంబులం జూపి కుమారుని మనంబు సంసారసక్తంబుగఁ జేయఁ దలంచి రాజమార్గంబు సర్వంబు పంగ్వంధవికలాంగబధిరరహితంబు గావింపించి కుమారుం గాంచి 'తండ్రీ యీవసంతర్తువు మిగులఁ జక్కనిది, దీనం గల విశేషంబు లాశ్చర్యజనకంబులు గావున నీ వొకసారి యీ సమీపపహిమాచలోపాంతంబుల కరిగి చూడుము' అని శిరంబు మూర్కొని మఱియు నిట్లనియె.

తే. గీ. 'తండ్రి నినుఁ బాసి గడియైనఁ దాళఁజాల
వేగ రావలె' నంచుఁ దెప్పించెఁ బనిచెఁ
గింకిణీమేఖలాసమాకీర్ణ మగుచుఁ
గళితశృంగార మైన బంగారుతేరు. ౧౮౩

సీ. కమనీయతపనీయకలితసూత్రంబులై వరుసఁ బూంచిన నారువములతోడఁ
పరిమళప్లవమానపవమానపోతమై చుట్టుముట్టిన పూలకట్టుతోడఁ
కౌశేయపరిధానకంబై విరాజిల్లు ననఁగంటి సింహాసనంబుతోడఁ
జిలుముత్తియములు చేర్చినచేర్లు గట్టి విన్ననువు చేసిన వితానంబుతోడఁ

తే. గీ. వెలయు నొక్కరథంబుఁ దెప్పించి సాది
'దేవదేవ! పరా' కంచుఁ దెలుపఁ దెలుప
జనకునకు మ్రొక్కి యా రాజతనయుఁ డేగె
నంత మిత్రులతోడ వాహ్యాళికొఱకు. ౧౦౫

క. తారాగణంబుతోడం దారానాథుండు మింటఁదరలు విధముగా
నా రాజసుతుఁడు మిత్రులతో రాజపథాంతరమునఁదోతెంచె వెసన్. ౧౦౬

క. సిరికొమరునిజిగి జేజేదొరకొమరుని సొబగు రిక్కదొర చెలువంబున్
దొరయు తమదొరకుమారుని నరయంగా నేగుదెంచి రందఱు కాంతల్. ౧౦౭

మ. తవులం జాఱిన కేశపాశ మొకచేతం దాల్చి డాకేల గ
త్త్యవరోధం బొనరించు కాలినగ లల్లల్లార్చుచు న్వచ్చి ముం
దవనీనాథకుమారు నొక్కసతి జాలాంతఃప్రవిష్టాస్యయై
యవలోకించెఁ గరంబు సాచి నిజకన్యాపాళికిం జూపుచున్. ౧౦౮

సీ. ఒడిఁ గ్రాలుపసిబాలువిడిచి యొక్కడుగున నచ్చి భూపతిఁ జూచె వనితయొకతె
మొలనూలి పైఁడిమువ్వలు జాఱుటైనఁజూడక వచ్చి విభుఁగాంచె సకియయొకతె
పతినియోగించు నానతియును జవదాఁటి పోయి రాజుం గాంచెఁబోలఁతియొకతె
తననిశానైపథ్యమును మార్చుకొనుటయు మఱచి ఱేనిం గాంచె మగువయొకతె

తే. గీ. యత్తగా రొక్కదిక్కున కరయఁబోవ
నామె కను నసుభయ మెద హత్తుకొనఁగఁ
జాను వేఱొక దెస కేగి ధారుణీంద్ర
తనయుఁ దతనయుఁ బొడఁగాంచెఁ దన్వియొకతె. ౧౦౯

ఉ. గోడలు మేడలుం గుడులు గోపురముల్మొదలైన నెక్కి యా
చేడియలెల్ల రిట్లు తమచిత్తము లేలికమీఁద వ్రాలఁగాఁ
జూడఁ దొడంగి రయ్యనఘుఁజూచిన జారిణి యైన నెమ్మదిం
బాడి దొరంగి విక్రియకుఁబాలొనరింప దదేమహాత్త్వమో! ౧౧౦

క. పరిణయ మొనరింపం దగు తరుణవయోధాము లైన తమ తనయుల ముం
పజ నిడుకొని కొందఱుచెలు లరిగిరి భూవరకుమారుఁ డరయు నటంచున్.

మ. 'కమనీయాకృతి యైన పుత్రకుని సౌఖ్యంబుం గనుంగొంగ న
య్యామకుం దుల్యధరాత్మజారమకు మాయాదేవికిం గొంతకా
లము దీర్ఘాయు వొసంగఁడాయెఁ దన కేలా ధాత? చంద్రాలసై
వ' మ టంచుం జరతీనికాయ మొకత్రేపం జూచె నాపోవుచున్. ౧౨

క. జాలాంతర్గతలగు నాలోలాక్షుల మొగము లెల్ల లోలభ్రమరీ
లీలాకరసరసీభవమాలాసౌందర్యమంజిమంబు వహించెన్. ౧౩

వ. ఇట్లు సకలపౌరజనవిలోచననిపీయమానుం డగుచుఁ బుణ్యాంగనలు సేసలు చల్ల వృద్ధబ్రాహ్మణు లాశీర్వదింప నిరుదెస వందిమాగధులు కైవారంబులు చదువ సాదిజనసంచార్యమాణంబు లగు నుత్తమాశ్వంబులు ముందు నడువ రమణీయతరం బగు రాజమార్గంబు గడచి చనుచున్న సమయంబున. ౧౪

సీ. అటితి కాయలు గాయ నవనిదున్నుచుఁ గష్టపడుచుండు కాసరద్వయము నొకటఁ
జెన్నుగా దున్నిన చేలలో విత్తులు నైచుచుండెడు కాఁపువాండ్ర నొకట
ఫలపుష్పవితతులఁ దులఁదూఁగి నేలకు నంటు చున్నట్టి వృక్షాళి నొకట
వాని ఫలమ్ముల భక్షించి సుఖియించు కీరాదికపతత్రివార మొకటఁ

తే. గీ. బట్టి చీమల మ్రింగెడు బల్లిని, మఱి
దాని మ్రింగెడు పాము, నద్దాని మ్రింగు
వైనతేయుని, జిన్న చేఁపలను మ్రింగు
పెద్దచేఁపలఁ దిను పక్షిబృంద మొకట. ౧౫

తే. గీ. వానిఁ బట్టి భక్షించెడి శ్యేనములను
నొకట వే ఱొక్కయెడ మనుష్యులను దిను న
ఘోరులను జూచి యొక్కింతకుతుకమును మ
ఱింత సంతాపమును జెంది నృపసుతుండు. ౧౬

చ. తన మనమందు నెన్నియొ విధంబుల నెంచుచుఁ 'దండ్రి చూపఁ బం
చిన వివియొక్కొ! యిచ్చటి విశేషము' లం చొకయింత నిల్చి, లోఁ

గని 'యొకఁ డన్యజీవమును గాసియుగాఁ గొను బెల్లనంగి హిం
సను నెగడించుచున్న దిది సైఁచితి నే దయగల్గువాఁడనే!' ౧౯౭

వ. అని చింతించుచుఁ గొంతశోకనేల పోయి ముందు నడచినను నిట్టిదుస్థ్యయంబులై
కనుపట్టు ననుభయయంబునం గుందుచు జగంబంతయు హింసాప్రచారం బగుటకు
విచారించుచుఁ బత్రచ్ఛాయం బగు నొక్క నేరేడుచెట్టుక్రిందఁ గూర్చుండి మిత్రులు
పిలిచినను బలుకక ధ్యాననిశ్చలుం డై యుండు నంత. ౧౯౮

ఉ. ఉప్పరవీది నేగు రమగోత్తము లేగుచుఁ బుష్పకంబు దా
నెప్పటియట్ల నయ్యెడల నేగమి కించుక శంకనంది చూ
పప్పురుషార్థ్యుఁ డున్న భువియందు నిగుడ్చుచునున్న యంతలో
నిప్పలుకు ల్వినంబడియె నేరును జెప్పకయే దివంబునన్. ౧౯౯

క. ఈతఁడు పరసంరక్షణకై తా జన్మంబు నెత్తినట్టిఁడు సుగుణా
న్వీతుఁడు మహానుభావుఁడు చేతమ్మునఁ గరుణఁ దక్కఁ జేర్పఁ డితరమున్.

వ. అను నంబరవాణిపల్కు లాలించి వారలా సర్వార్థసిద్ధున కచ్చటి నుండియె నమ
స్కరించి తమయిచ్చం జనిరి; సపదపని నతం డయ్యెడ సంజకాలంబుదనుకఁ గదల
కుండుటయు. ౨౦౧

క. జంబూవృక్షము రవికిరణంబులు పయి సోఁకకుండ నరనాథతనూ
జుం జేర్మిఁ గాచుచుండె; సుఖంబులు తమయంతఁ గల్గుఁ గా జ్ఞానులకున్. ౨౦౨

శా. ధ్యానైకాగ్రమనస్కుఁడై నృపసుతుం డట్లుండఁగాఁ దక్కునృ
త్యానీకం బొకయింత లేప, దివి తానవ్వారితో నిట్లనున్
'వీనిన్ లేపఁగఁబోకుఁ డీతఁడు మహావేత్తృత్వధుర్యుండు తా
నే నేమం బగునంత లేచు' నన నాభృత్యుల్ భయభ్రాంతులై. ౨౦౩

క. జననాథసుతుని లేపక కనుఁగొనుచుండంగ, నతఁడు కమలాప్తుఁడు గ్రుం
కినతోడన ధ్యానసమాప్తిని జేసి పురంబునకును విచ్చేసె నొగిన్. ౨౦౪

—♦ ఆశ్వాసాంతపద్యములు. ♦—

క. ఆంధ్రకవితాదర! నీరంధ్రయశోవిజితరాజరజనీకరశర
త్కంధరసరసీభవభవపురంధ్రీహీరేశ! కృష్ణరాయమహీశా! ౨౦౫

మ. కవితాలోలమతీ ! వికస్వరకృతీ ! కల్యాణభూభృత్పతీ !
యవిగీతప్రకృతీ ! మనోహరగతీ ! యాంధ్రాభిధక్ష్మాచల
త్పవిహస్తానుకృతీ ! ధరాదిబుధవిద్వన్నుత్యనిత్యోన్నతీ !
యవనీమండనకృష్ణరాయసుధాధ్యక్షాకృతిశ్రీపతీ ! ౨౦౮

మా లి ని.

సరసతరవిహారా ! సాధుచేతోబ్జసూరా !
కరవిలసితధీరా ! కామకామాంబాకుమారా !
తరుణవయదుదారా ! ధర్మ్యగోదాతటీరా
జ్యరమణధృతభారా ! జాగరూకప్రచారా. ౨౦౯

గద్య.

ఇది శ్రీ.. తిరుపతి వేంకటేశ్వరప్రణీతం బగు బుద్ధచరిత్రం బను
మహాప్రబంధంబునందుం బ్రథమాశ్వాసము.



శ్రీరస్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# బుద్ధచరిత్రము

## ద్వితీయాశ్వాసము

క. నిటలాక్షచరణసేవాఘటనాదర ! సత్యవాక్యకల్పక ! గోదా
తటనికటరాజ్య ! శ్రీవేంకటకృష్ణారాయ ! విబుధకవిజనగేయా ! ౧

తే. గీ. అవధరింపు మనంతరం బవనిపాల
కాత్మజాతున కష్టాదశాబ్దముల వ
యస్సు నిండుటయును దండ్రి యయ్యవసర
మునకు ననుగుణ మైన రీతి నెదనెంచి. ౨

తే. గీ. సీతునకు వేసవికిని వర్షించుకాల
మునకు నుచితంబులై సుఖంబును ఘటించు
శుభ, సురమ, రామ యనుపేర్ల సొంపునింపు
మాఁడువులఁ గట్టఁబనిచె నాత్మజునికొఱకు. ౩

శా. ఆసౌధమ్ములచుట్టుఁ దోఁటలును వార్యంత్రంబులుం గాల్వలు
న్వ్యాసార్హమ్ములు చప్పరమ్ములును గూపమ్ము ల్తటాకమ్ము లెం
తేసా రొప్పఁగఁ గూర్పఁజేసి మఱి యెన్నేలోఁగిళ్లు ల్గట్టఁగాఁ
జేసెం దత్ప్రతిసౌధరాజమునఁ బల్చిత్రావళు ల్చొప్పడన్. ౪

తే. గీ. గడియ కొకరీతిఁ గ్రీడలఁ జైకొనంగఁ
దగుగతిని సౌధముల నిట్లుతండ్రి కట్టఁ

జేసి కొమరుని నందు నివాసమునకుఁ
బనుచుటయు నాతఁ డా యీ భవనములందు.

ఉ. వాసము సల్పుచు న్విమలవాఃకలితంబు సరోవరంబు మ
బ్బెసరణిం గలంచు నటు లెంతయు మానసము న్విచారము
ల్గాసిలఁజేయ నెయ్యెడ వికాసము దక్కినవాఁడు వోలెఁ దా
నేసుఖముం గ్రహింపమికి నెచ్చినదుఃఖమున న్విభుం డొగిన్. ౭

వ. రాజకార్యవిశారదులగు మంత్రులం బిలిచి కొమరుని విషయపరాఙ్ముఖత్వంబు వారల కెఱింగించి వీనికిం దగిన కఱదలు గఱపఁ గలుదు నుపాయంబును నుడువుఁడని మఱియు నిట్లనియె.

గీ. స్వప్నఫలము పచించు నప్పట్టునందుఁ
బండితులు రెండురీతులఁబలికి రందు
మత్సుతుమనంబు రెండవమార్గమంద
నడచుచున్న దిఁ కేమి యొనర్చువాఁడ. ౮

వ. కావున రాజ్యపాలనాదివ్యాపారంబునం దీతని మనంబు మరగునట్లు చేయుఁ డనిన వృద్ధమంత్రి యొకం డిట్లనియె. ౯

మ. మదిరాక్షీపరిరంభము ల్మఱియు నమ్మానిన్యపాంగంబులున్
హృదయంబు ల్గరఁగించు నేరికిని; మత్తేభేంద్రకుంభస్తను
ల్గదియన్ ధ్యానము జ్ఞానము న్నిలుచునే? కాంతాశిరోజంబున
న్బదము ల్గట్టఁగవచ్చు సంకెలలకుం బద్ధుండు గాఁడేనియున్. ౧౦

శా. హేలావత్యధరామృతంపుఁజవి యింతే నీతని న్సోఁక వే
ళేలా యయ్యెడి మిమ్ము మ మ్మితర మెడ్డేనిన్ స్మృతిం జొన్పనీ
కాలావణ్యరసామృతమ్మున నిమగ్నాత్మ్యుం బొనర్చు న్నృపా!
హాలాపానము గాదె స్త్రీసుఖము వేఱం చెందుఁ గన్పట్టునే. ౧౧

ఉ. మాయలమాటలు న్వగలు మంచితనమ్ములు టక్కులు న్హొయ
ల్పాయక యిల్లు గట్టుకొని పాపముఁ బుణ్య మెఱుంగనీక నా
పాయములై సతీమణుల బంటుగఁ బూరుషుఁ జేయుఁ గావునన్
వేయును నేల పుత్రునకుఁ బెండ్లియొనర్పుము సత్వరంబుగన్. ౧౨

వ. అని వెండియు. ౧౩

చ. ఒకనికి నింపుగానిసతి యొక్కని కన్నుల కందగత్తె వే
ఱొకనికి రంభయే మఱియు నొక్కనికిం గొఱగాకయుండు దీ
నికి మదియే ప్రధాన; మదినీ కొకఁ, డన్యుల కొక్కఁ; డింత యే
టికి మన మెంత యేరిచి ఘటించిన నయ్యది వేఱు తీరగున్. ౧౪

క. అది గాన నితని మన మే మదిరేక్షణయందుఁ దవిలి మరగునొ మన నె
మ్మదికిం దెలియదు; దానికి నిది యొక్కయుపాయ మదియు నెఱిఁగింతు నృపా!

క. అగుఁగాదె శాక్యులకుఁ బండుగు, మన మానాఁడు తగు పదుముఁగన్నెల సో
యగపుగనుల రప్పింపందగు బహుమానముల నొసఁగెద మను నెపమునన్. ౧౬

మ. ధనమం దిచ్చను గాని యుత్సవపు సందర్భమ్ము వీక్షించు కో
ర్కినిగానీ నృపునాజ్ఞ యేగతి నివారింపంగ నౌ నంచుఁ ద
ప్పని యిక్కట్టునఁ గాని వత్తురు కనత్పద్మేక్షణల్; చాకచ
క్యనిరూఢిం దగు దాని నం దొకసతిం గామించు నీపుత్రుఁడున్. ౧౭

వ. ఇట్లు కామించిన నక్కన్యాజనకుండును దనకొమరిత నీకుమారున కిచ్చి పరిణయం బొనర్చు; నిట్టిదంపతుల దాంపత్యంబున కెన్నండును నెడగలుగ దని మఱియు నిట్లనియె. ౧౮

క. చతురబ్ధిపరీతంబగు క్షితి యెల్లను నేలు నృపతిశేఖరునకు నీ
సుతునకు సుత నీ నెంచని మతిహీనులు గలరె శాక్యమనుజాధీశా! ౧౯

క. అన, రా జీకొని చాటించినఁ గన్నెలు మిగులఁ జెన్ను చెన్నారెడి భా
గ్యనిధులు తన్నగరంబునకును వచ్చిరి వేలకొలఁది కుతుకం బలరన్. ౨౦

వ. పదపడి శుద్ధోదనుండును దత్కన్యాజనంబునకు బహుమతు లిచ్చుచుఁ దగిన కన్యను వరియింపు మనియుఁ గన్యాస్వయంవరంబునకై యిది యొక్కయుపాయంబు ఘటించితి ననియుఁ జెప్పి కుమారుం దోడ్కొనివచ్చుటకై యతని కాబాల్యమిత్త్రంబగు పురోహితనందను బనిచిన వాఁడును సంసారంబు కష్టబహుళంబనియు యౌవనంబు జరాదూషితం బనియు మృత్యువనివార్యం బనియు వ్యాధు లనుభవనీయంబు లనియు విచారించుచుఁ బరిణయేచ్ఛం దిగఁద్రావి సన్న్యాసనోన్ముఖంబగు మనంబున నున్మత్తునిపగిది జడునిరీతి నున్న సర్వార్థసిద్ధు నొద్దకుం జని. ౨౧

క. హితమార్గము గఱపుటయు నహితమార్గమునందు నడువనీకుంటయు దు
ష్స్థితి గతియును దుర్వ్యసనావృతియును మరలించుటయు సుహృల్లక్షణముల్.

వ. కావున నీయెడం గలుగుచనవునం జేసి నీకొక విన్నపంబు విన్నవింపఁగ వచ్చితి భవదీయపరిణయంబునకై యొక నెపంబున సకలదేశరాజకన్యకలఁ బిలిపించి యొక పందువుగఁ గావింపనుండి వారికిం దగిన బహుమతులు నీచే నిప్పింపవలయు నని నిన్ను రమ్మనియెంగావున నీతండ్రిమాట వృథసేయక వచ్చి యక్కన్నియలయందు భవదీయమనోగతంబునకుం దగినదాని నొక్కతెం బరిణయంబు గమ్మనిన నతండు సవినయమ్ముగా నప్పురోహితసూతి కిట్లనియె. ౨౩

క. పరిణయ మొల్లక నే నస్థిరమగు సంసార మనెడు తెరువునఁ బడ కాం
తరమగు తత్త్వజ్ఞానాంతరమునఁ జరియింతు నన నతం డిట్లనియెన్. ౨౪

క. తరుణవయస్కుండవు సుందరుఁడవు నృపపుత్త్రకుఁడవు తగువాఁడవు ధీ
వరుఁడవు వంశము నెగడన్ బరిణయ మొనరించుకొనుట పాడి కుమారా. ౨౫

క. కామము పురుషార్థంబులలో మహనీయంబు దానిలోపల గృహిణెం
దేమన్నింతురు గావున నామాటలు వినుము, రాజనయముం గనుమా. ౨౬

క. పరతత్త్వాదరమగు మదిఁ దిరమయ్యును దొంటిమునులు ధీమంతులు న
స్థిరమని యెఱిఁగియు భార్యాపరిగ్రహము మానిరే, తపంబులు చెడెనే ? ౨౭

చ. కొడుకులఁగొమ్మలం బడసి కొండొకకాలము ధాత్రియేలి మే
ల్నడవడిఁ జేసి మీకుల మలంకృతముం బొనరించి తండ్రికిం
గడుముద మేదఁజేయవలెఁగాని నరేంద్రులు చేయరాని యీ
వెడఁగుఁదనంబుఁ బూనఁదగవే, భగవంతుఁడు నైన మెచ్చునే ! ౨౮

చ. అదియునుగాక కామపురుషార్థము దెచ్చు నుపద్రవంబులం
జపములు సంధ్యలు న్నిలువఁజాలవు ; రేఁబవ లేండ్లకేఁడులు
న్నిదురయు నాకువంటకము నేనియు మానిన వారికైనను
నైదరక నిల్చునే తపము నిష్ఠలు గిష్ఠలు స్త్రీలముందఱన్ ? ౨౯

క. ఒకనాఁడు విరాగము పాయకవర్తించినను దత్పదాంతరమున నే
సకల సుగుణంబులకు మారక మగు మది ; దాని నమ్మరాదు కుమారా ! ౩౦

సీ. జడదారిసకితోడ జతగూడె వేవేలు వెలఁదులు గలవాఁడు వేల్పుఱేఁడు
జాబిల్లిపడఁతితో సరసంబుఁ గావించెఁ దపసి లోపాముద్రధర్మభర్త

దైవతగురుని కాంతాలలామముతోడఁ గవగూడె శిష్యుఁడై కలువఱేఁడు
ఔతథ్యఋషిపత్నియగు మరుత్పుత్రితో సావాస మొనరించె దేవగురుఁడు

తే. గీ. దాశపుత్రికతోడఁ బరాశరుండు
పట్టపవలు నదీతటీభాగమందుఁ
దగులుగావించె ; నిన్ని వింతలును దలఁపఁ
గామమును గెల్చువా రీలోకమునఁగలరె !

వ. మఱియు మునివరిష్ఠుండగు వసిష్ఠుం డక్షమాలయను మాతంగకన్యకయందుఁ గపింజలాదుం డను కుమారుం గనియెను. యయాతియను రాజర్షి ముసలియైన పిదపను విశ్వాచి యను నచ్చరమచ్చెకంటితోఁ జైత్రరథంబునం గ్రీడించెఁ; గౌరవుండగు పాండురాజు మృత్యువు నైనఁ దలంపక మాద్రీసాంగత్యంబున కొడంబడియెఁ ; జిరకాలోపార్జితంబగు తపంబు భగ్నం బగుననియైనఁ దలంపక విశ్వామిత్రుండు మేనకామధురాధరంబు చవిచూచెఁ ; గరాలజనకుం డనువాఁ డొకవిప్రకన్య నపహరించి చావునకైన నంగీకరించెఁ గాని దానివదలుట కొడఁబడఁడయ్యె ; నిట్లనేకు లనేకప్రకారంబులం గామపురుషార్థంబునకు లోఁబడినవారు కలరు ; వేయేల, యనుభూతకాంతాసంగమసుఖాతిశయు లగువారి కేనియు నిట్టి ప్రమాదంబులు గలుగుచుండ నననుభూతవిషయోపభోగులగు నీవంటి తరుణవిరాగుల కది యడుగవలయునే ! యనుమిత్రుని జూచి పరశ్శతజన్మసంసిద్ధార్థుం డగు సర్వార్థసిద్ధుం డిట్లనియె. ౩౨

తే. గీ. మైత్రికిం దగుగతి నయమసురమైన
సదుపదేశంబు నాకయి సలిపితీవు
తప్పులన్నియు సైరించి దయదలంచి
మదికి నచ్చించి నాచేయుమనవి వినుము. ౩౩

తే. గీ. ఏను విషయసుఖంబుల నెఱుఁగఁగాని
యెఱుఁగుదు విషయసుఖముల నెఱుఁగువారి
జగ మనిత్య మటన్న సంశయము కతనఁ
దత్సుఖంబుల నామది తగుల దనఘ. ౩౪

చ. ముదిమియుఁ జావు రోగమను మూఁడును బ్రాణులకుండవేని యీ
ముదితల కెల్ల జవ్వనము ముందును నీగతి నుండునేనిఁ గ

ష్టదశలు మాటిమాటికిని సంసరణంబున మూఁడవేని నా
మదికిని నచ్చవే విషయమార్గపు సౌఖ్యము లెల్ల నెచ్చెలీ! ౩౫

క. నీ నుడివినవా రెట్టిరకానీ కామాంధులనియ గణుతింపఁదగున్
మానసము విషయమగ్నంబైన మహత్త్వంబు నిలుచునా? చెలికాఁడా! ౩౬

తే. గీ. పద్మదళమున జలముండుపగిదిఁ గూటు
మంటి యంటని విధమున నుంట మేలు
గా గణింతురు గాని యాకామినులను
మోసపుచ్చుటకాదె, యూమోఁదు చెలిమి? ౩౭

క. కావున ముదిమియుఁ దెవులుం జావును గలయట్టి పాడుసంసారములో
నాఁటివానిఁ ద్రోయుటకై విజ్ఞానంపుఁదెరువుఁ గడ తేర్పకుమీ. ౩౮

వ. అనుచు ననేకప్రకారంబుల సంసారనికారం బొనరించు కుమారుం గని పురో
హితనందనుండు తిరోహితతదుపదేశుండై మరల నిట్లనియె. ౩౯

చ. జనకుని కోరికన్ వృథగఁ జల్పకు మయ్య! వివాహ మీవు మా
నినను భవన్మిషంబున ననేక నరేంద్రకుమారికాచయం
బు నగరి కేగుదేరఁగఁ బ్రభుండు నియోగము సేసెఁ గావున
జ్జని, తగవారికిం బసదనంబు లొసంగఁగదయ్య మిత్రమా! ౪౦

క. కొడుకులు కొడుకు లటంచుం గడుకొను పెనువంతఁ దపము గావించి తుదిం
బడసిన కొడుకులు తండ్రుల నడలం గాఁజేయు టనుచితమగునె కుమారా. ౪౧

ఉ. ఈవు విరాగివై తివనియే మదిఁ గుందుచు నన్నపానము
ల్వోవిడియున్న నీపిత కపూర్వములైన భవత్ప్రసంగము
ల్నే వినిపింతునేని నశనిజ్వలితంబగు కొండమాడ్కిఁ జిం
తావశచిత్తుఁడై మడియుటబ్బురమా పృథివీంద్రపుత్రకా! ౪౨

క. కావున నే నుడివినగతిగా వచ్చి నరేంద్రకన్యకలకు బహుమతు
ల్గావింపుము నావిన్నప మావలకుం ద్రోయవలవదయ్యా, నరేంద్రా! ౪౩

వ. అనుచు ననేకైతిహాసికగాథలు బోధించియు గారవించియు నెట్టకేల కురరీకా
రంబు గావించి నృపకుమారుం దోడ్కొనివచ్చి యేకతంపుం గొల్వుకూటంబునం
దగిన పరివారంబుతో ఘనకనకరత్నచీనిచీనాంబరశ్రేణి యిరుదెసలంగల యొక్క
పజపుగద్దియపై వసియింపఁజేసె నంత. ౪౪

ఉ. చేరెడు కన్నులుం దళుకుఁజెక్కులుఁ గుల్కు పిసాళిగుబ్బ ల
బ్జారిని గేరుమోము కనదంఘ్రులు వింతగుచాయ నీన శృం
గారరసంపు దీవియనఁగా నొక కన్నియ వచ్చెఁ దత్సభా
స్తారులు తేఱిచూడఁగ మితస్థితిభూషణభూషితాంగి యై. ౪౫

మ. చలువంజేసిన మంచుకన్నను గడున్ స్వచ్ఛంపు మేల్ముస్గుఁజెం
గులు పాదమ్ముల జీరువాఱ నును నిగ్గుల్దేఱు నెమ్మోము ప
న్నెలు మైచిన్నెలు శారదాంబుదతతి న్నిర్జీనమై యొప్ప వె
న్నెలనాఁ గొండొక దోఁప నొక్కచెలి తన్నే చూడఁ జొచ్చె న్సభన్. ౪౬

చ. గరగరలాడు నాగర ధగద్ధగితప్రభ లీన మేల్జరీ
హరు వలరారు రైక యొకయందముఁ జూపఁగ సన్నమైన బం
గరుపనిపైఁట యొక్కుడగుకాంతి నెసంగ మణీవిభూషణో
త్కరమయ యై సభాస్థలికిఁ గన్నియ యొక్కతె వచ్చె నచ్చుగన్. ౪౭

మ. 'అధరం బొక్కటిసేయు నెంతకయినన్ హా! వేణి హా! రద్దిరే
మధురంబౌ గమనంబు! మేనిపసకు న్మ్రాకౌనె బంగారు? మే
లుక్కధరంబు ల్గదలించు గుబ్బ'లని కోర్కుల్ మిన్ను ముట్టంగఁ ద
న్ను ధరాపాలసభాసదు ల్దమినిఁ గన్గొ నొర్తు వచ్చెన్ వసన్. ౪౮

సీ. కడియంబు లందెలుగజ్జెగొల్సులు గూడి యడు గడ్గునకు గల్లురంచు మ్రోయ
జీరాడు మేల్జరీచెఱఁగుఁ గుచ్చెళ్లు చక్కఁదనంబు మీగాళ్లకడల రాయ
మడఁచి యొడ్డాణంబుమధ్యఁజేర్చినపైఁటయంచు తెమ్మెరలు దూఁగాడఁజేయఁ
గబరీభరంబుపైఁగడలుకొల్పిన పూవుల దరిఁ దావులకుఁ దుమ్మెదలు గోయ

తే. గీ. విడెముతావియు రగనచ్ఛవియును గలసి
యోష్ఠకాంతికిఁ గొంత చేయూఁతయొసఁగఁ
జూప నెల్లరనుం దనసొగసె చూడఁ
గరిగమన యోర్తు వచ్చె నక్కజముగోడ. ౪౯

తే. గీ. మోహమున నిట్లు రాసుతు మంతు నన్న
పగిది నొక బొడ్డుమల్లెఁ గబరి ధరించి
చెలువు మించెడు నల్లని చీరఁగట్టి
తెలివ సారసగమన యేతెంచె నొకతె. ౫౦

ఉ. నున్నఁగ జెక్కుటద్దముల నూల్కొన దువ్వినకాకపక్షము
ల్సన్నని వంకగా నుదుటఁ జందన మద్దిన చంద్రరేఖయుం
జెన్నుసహింప ముత్యములచేరు శిరంబునఁ దాల్చి వేడుకం
గన్నె యొకర్తు వచ్చెఁ గనకప్రభ మేనఁ దురంగలింపఁగన్. ౫౧

క. కుస్తీ చేసినగతి నతిశస్తమ్మగు మేనిపస పసందుగఁ బైకిం
గస్తూరితావి నింప పయస్స్తనత యగు నొక్కచందిరానన వచ్చెన్. ౫౨

మ. నెనరుం జూపులు హారమధ్యమఘువన్నీలాశ్మరశ్మిచ్ఛటా
ఘనభాస్వజ్జనితాపగం గలసి వేడ్కం బైటపైఁ బర్వ లీ
లనుదాని న్సవరించుకోఁ గదలు కేల్వాయుభ్రమత్తత్రిజా
తనలభ్రాంతి యొనర్ప నొక్కరిత యంత న్వచ్చె బల్మెచ్చుగన్. ౫౩

క. కులుకుచుఁ జూపఱ దృష్టికిఁ దలఁకుచు నృపసుతుని గాంచితద్దయుఁ దనలో
నులుకుచు నొకకన్నియ వన్నెలకుప్ప యనంగ వచ్చినిలిచెన్ బ్రోలన్. ౫౪

వ. ఇట్లు స్వస్వోచితభూషణమ్ములు ధరియించి తత్తద్దేశనరేంద్రకన్యకలు సభామంట
పమ్ము దరియంజొచ్చుటయు నంతకుమున్న శుద్ధోదనుండు వారలకు బహుమా
నంబులొసంగఁ గుమారు నియమించెఁ గావున. ౫౫

శా. ఆ సిద్ధార్థుఁడు తండ్రియానతిని శాంతాకార మేపార మే
లౌ సింహాసనమందు సౌరలర నధ్యాసీనుఁడై, వచ్చు క
న్యాసంఘంబులవంకఁ గన్గొనకయే యద్దాని నొక్కొక్క తెం
దా సత్కారము చేయుఁ జీరలును రత్నాల్మున్నుగా నిచ్చుచున్. ౫౬

ఉ. ఆతనియొద్ద కేగి వినయమ్మున భీతకురంగులో యనం
గాతరరీతి సత్కృతులు గైకొని వెన్కకు నేగు కన్నెలం
జేతము పల్లవింప నృపు చెంత వసించు జను ల్నుతింత్రు గా
నీ తనచిత్త మందయిన నించుక రాసుతుఁ డెంచఁ డొక్కతెన్. ౫౭

వ. ఇట్లు తండోపతండంబులుగా వచ్చి కన్నియలు బహుమానమ్ములు గైకొనునెడ.

సీ. భ్రమరసమూహంబుపఙ్క్తిగట్టినరీతి జడ నడుమల దాఁక సాగియాడఁ
బద్మేషుచాపంబుపై మణుల్దాఁపిన సౌరున మేన భూషలు చెలంగ
నినుము తిన్నియలపై నివము వోల్చినభంగిఁ గటిసీమఁ బావడఁ గళలనీనఁ
జక్రిమ్ములకు నిత్యసంగతికై యుపాయ మొనర్చె నన రైకయుట నెసంగ

తే. గీ. మోమునఁ బతివ్రతాత్వంబు మొలక లెత్త
సభ్యులకు మాతృభావంబు చౌకళింప
ధ్యాననిశ్చలుఁడైన యతని యెదుటకు
వచ్చి నిల్చె యశోధరావారిజాక్షి. ౫౯

ఉ. కన్నియ వంచయాన నవకంజవిలోచనఁ గోమలాంగి న
త్యున్నతపీనవర్తులకుచోజ్జ్వలఁ జంపకగంధి వ్రీడసం
ఛన్నముఖి న్యశోధర లసన్మృదులాధరఁ గాంచె రాసుతుం;
డెన్నఁగ రాదుగా మఱియు నేరికి నేరికి ధాత వ్రాయునో! ౬౦

వ. ఇట్లు పురాకృతసంస్కారవశంబునంజేసి యక్కన్నియయందు బద్ధానురాగుం
డగు నయ్యెడ. ౬౧

చ. వెనుకొను లజ్జ లోఁ నడఁచి, భీతి యొకింతయు లేక, రాజనం
దనునిమనం బెఱింగిన విధంబున, నందఱకంటె నెక్కుడౌ
చన వెసఁగంగఁ 'గానుక లొసంగినఁ గైకొని యేగుదాన' నాఁ
గ, నతఁ డొకింత లోన నగి కానుక లయ్యెడ లేక యుండుటన్. ౬౨

మ. 'వనజాతేక్షణ! కానుక ల్మిగిలె నీవామాక్షులం దేరికీ
యని దీకానుక చూచితే' యనుచు నయ్యబ్జాక్షితో నొక్కభం
గిని మాటాడుచు నెల్లరుం గనుఁగొనం గ్రీవాగతంబైన చ
క్కని మేల్పచ్చలహార మచ్చెలివలగ్నంబందుఁ జుట్టె న్వెసన్. ౬౩

ఉ. పచ్చలహారమిట్లు నరపాలసుతుం డవలగ్నసీమపై
నచ్చపలాక్షి కిం పొదవునట్టులు చుట్టిన యంత నామెకున్
హెచ్చె నృపాలసూతిపయి నింతనరాని మనోరథంబు; చే
రచ్చెరువంది రందఱు నరాధిపుఁడు న్విని సంతసింపఁగన్. ౬౪

వ. ఆబాల్యవిజృంభమాణవిరాగచేతస్కుండగు సర్వార్థసిద్ధుం డక్కన్నియయందు
బద్ధానురాగుం డగుటకుఁ గతం బెట్లంటేని. ౬౫

మ. యమునాతీరమునందు నొక్కెడ సునందాభిఖ్య చెన్నారు నొ
క్కమహాశక్తి వసించు నాదరిని నక్కానం గనద్దేవదా
రుమహీజంబులనీడఁ గ్రీడలు పొనర్చు న్వన్యకన్యాజనం
బమలాత్మ్యం డొక వేఁటకానికొడుకు కత్యంతంబుఁ దోడై తగన్. ౬౬

ఉ. వాఁ డొకనాఁడు మేలు గలవస్తువుల న్మతిఁగొన్ని దెచ్చి త
త్క్రీడల నారితేఱిన సతీతతికిన్ బహుమాన మిచ్చుచున్
వేడుక నందు నొక్కయరవిందదళేక్షణ కిచ్చి డెంద, మ
చ్చేడియఁ బెండ్లిచేసికొని చెల్మి యొసంగఁగ నుండి క్రమ్మఱన్. ౬౭

వ. కొండొక కాలంబు సుఖంబు లనుభవించి తత్సహితమ్ముగఁ గాలమ్మునకులోఁబడి కేదారంబున నప్పు డప్పు డెఱుంగక పడిన బీజంబులును వానకాలంబున మొలచిన పగిదిఁ బూర్వజన్మార్జిత సుఖదుఃఖంబు లుత్తరజన్మంబున కనుస్యూతంబు లగుటఁ దదనుభవంబున కై సర్వార్థసిద్ధుం డయ్యెఁ; దత్సతియుఁ బురాసంభృతాత్యంతసంబంధంబున నిట్లు జనియించె; నియ్యది యియ్యిరువుర యన్యోన్యానురాగంబునకుం గతంబు. ఇది యిట్లుండ. ౬౮

శా. ఆసిద్ధార్థునకు న్యశోధరకు సౌహార్దంబు నన్యోన్య మెం
తే సిద్ధించుట గాంచి కొందఱది పృథ్వీశానుతోఁ దెల్ప 'నే
మీ సిద్ధార్థుఁడు సుప్రబుద్ధసుతపై మే లుంచెనే! యత్న మి
ప్డే సాఫల్యము చెందె సంతసము వేఱిం దింతకుం గల్గునే. ౬౯

క. శ్రమ మెంత చేసినను సాధ్యముగాని పత త్రి పట్టఁదగు వలతానై
యమరిన దిఁకేమి?' యని మోదమునన్ శుద్ధోదనుండు తద్దయు మునిఁగెన్. ౭౦

వ. పిదప నయ్యశోధరతండ్రియగు సుప్రబుద్ధుండు విదితవృత్తాంతుండై సార్వభౌముఁ డగు శుద్ధోదనుని యొద్ద కిట్లు వార్త నంపించె. ౭౧

క. మన శాక్యులలో విలువిద్యను దక్కిన విద్యలను సమధిక ప్రజ్ఞన్
దనరెడు వానికి మత్కన్య నొసంగెద దేవదత్తుఁ డట్టిఁ డగుఁ గదా. ౭౨

క. విలువిద్య నర్జునునితోఁ దులఁదూఁగెడు సామునం దతులుఁ డశ్వములన్
మెలఁకువగ నెక్కుఁ బెఱభూతలనాథులసుతులు దేవదత్తున కెనయే! ౭౩

క. కాన నతనికిం గన్యక నీనెంచెదఁ గాని యన్య మెఱుఁగక నిత్య
ధ్యానాసక్తుండగు నీ సూనునకు నొసంగనొల్లఁజుమ్ము మహాత్మా. ౭౪

క. అనువార్తను విని శుద్ధోదనుఁ డేమియుఁ జెప్పలే కెదంగడుఁ జింతం
గొనుటయు సిద్ధార్థుఁడు తన జనకుని కిట్లనియె ధైర్యసంపన్నుండై. ౭౫

క. జనకా! మత్ప్రియవస్తువుగ నున్న యిచ్చానన్న యొరులకడ కరుగునె? నా
కును నేర్పుగలదు విద్యల మనమున ననుమాన మింక మానుము తండ్రీ ౭౬

తే. గీ. అనుడు నరపతి సంతోషమందెఁ; బిదప
సుప్రబుద్ధుఁడు విద్యల శూరుఁడైన
వాని కిచ్చెద మత్సుత వరగుణాఢ్య
ననుచుఁ జాటించె నెల్లెడ ఘనులు మెచ్చ.

ఉ. అందఱు రాజపుత్రులు స్వయంవరమంటపమందుఁ జేరి రా
ణ్ణందని నిందు విద్యలఁ గనంబడఁజేసి వరింతు మంచు నా
నందముఁ జెందుచుండ జననాథుఁడు యంత్రమొకండు పన్ని 'దీ
నిం దెగఁగొట్టి మత్సుత ననింద్యగుణ న్గ్రహియింపఁగావలెన్.' ౭౮

చ. అనవుడు రాజపుత్రులు తదర్థమున న్విచిత్రప్రయత్ను ల
లయ్యును నటుచేయలేమిఁ దలలొయ్యన వంచిరి; యాతఁడంత నా
నన మలరంగ సింహహనునామకచాపముఁ గేలఁ బూని య
ల్ల నఱికె యంత్రముం దనదులావు నృపాలకు లెల్ల మెచ్చఁగన్. ౭౯

వ. పదపడి సుప్రబుద్ధుం 'డొక్కమ్రాని నొక్కవ్రేటునఁ గత్తిచే నఱుకవలయు' ననుడు
నరేంద్రు లందఱును యథాపూర్వ్వులైరి, కొందఱు నఱికె రంత. ౮౦

తే. గీ. అసికరంబునఁ బూని సిద్ధార్థుఁ డితర
కృత్తమా పాదపముకన్న నెక్కుడైన
లావు గల్గిన యొకచెట్టు నొవ నేయ
నది తెగియుఁ దెగనిపగిది నట్టెయుండె.

చ. అది కని యెల్లవారుఁ 'దెగ దయ్యది యాతనిచేత, నెక్కుడై
పొదలెడి సాము నేర్పుగల పూరుషుఁ డిప్పని సేయనేర్చు' నం
చెద మదమొందుచు న్మిగుల హేళనము ల్పచరింప దేవత
ల్పదపడి తెల్పుచుం గుసుమవర్షము పైఁ గురిపించి రత్తఱిన్. ౮౧

వ. అంత ఖురళియందు నితం డత్యధికుం డని కృతనిశ్చయులై యశ్వారోహ
కత్వంబుఁ బరీక్షింపం దలంచినంత సిద్ధార్థుండు. ౮౨

తే. గీ. కంటకాభిఖ్య నొప్పు నొక్క హరి నెక్కి
యెక్కుడగు గర్వమునఁ గడు నుక్కుమిగులఁ
దక్కుఁగల రాజతనయుల తక్కులడఁచి
జయము గైకొన వారలీర్ష్యకుఁ గడంగి.

వ. ఈగుఱ్ఱం బీతనిది కావున నీపందెము మేమొప్ప మని విన్నవించుచును. ౮౫

తే. గీ. మిగుల నవలక్షణంబుల మేటిదైన
దాని నొకవాజిఁ దెచ్చి, యద్దాని నెక్కి
తనపటిమ చూపెనేని యొప్పనగు ననుడు
నట్లుచేయఁగ సిద్ధార్థుఁ డనుమతించె.

వ. ఇట్లంగీకరించి యతండద్దాని నెక్కుటకు మున్న దాని మంచిచెడ్డలు పరీక్షించు టకై యర్జునుండనువాఁ డయ్యశ్వంబు నెక్కుటయు.

క. అది యెయ్యెడ నిలువక దుర్మదమున నవ్వానిఁ గఱచి మహిఁ బడవైచెన్
గదిసి యొకకొంద ఱయ్యాపదఁ దొలఁగించుటయుఁ గొంతభరమై తోఁచెన్.

మ. అది సిద్ధార్థుఁడు చూచియు న్భయము లేశ మావంతయున్లేక దా
నిఁ దగఁదువ్వుచుఁ గల్లమైన నిడకే సేర్పొప్పఁగా నెక్కి పూ
ర్వదళం బందెము లెల్ల గెల్చె; మిగుల న్వారందఱు న్సన్నుతు
ల్పొదలింపంగను సుప్రబుద్ధుఁడు మహామోదంబుమైఁబొంగఁగన్. ౮౬

చ. 'మతి మను గోరినట్టి కృతిమంతుఁడె నాథుఁడుగా లభించె; నే
నతిసుకృతాత్మ' నంచు ముదమంగుచు వేగ మధూకపుష్పసం
గతమగు మాల కేలఁగొని కామునికిం బయిపెచ్చువచ్చు రా
సుతు గళమందు వైచెను యశోధర యాదరమేమరంబుగన్. ౯౦

తే. గీ. అమరు లతిమోదమునఁ గుసుమములు గురిసి
రచ్చరలు నాటపాటల మెచ్చుగొలిపి
రనిలము సుఖప్రచారమై యతిశయిల్లె
నలయశోధర సిద్ధార్థు ననుమతింప. ౯౧

వ. ఇట్లు యశోధర సర్వార్థసిద్ధుని వరించిన పిదప జీలుఁగు బెండులు రెండు దెచ్చి పాలలోఁ బడవైచి యవి తమంతటఁ జాము కలసికొనుదనుకఁ జూచి సుసంగ తంబుగునంతఁ బెద్దలగు వార లన్వధూవరులం గూర్చి 'మీర లివ్విధమున నెడ తెగని చెలిమి గలిగి యలరుదురు గావుత' మని యాశీర్వచించి పరిణయం బొన ర్చిరి. ఈక్షీరపరీక్షణంబు శాక్యుల వివాహంబునకుం బ్రథమలక్షణం; బిట్లు సల క్షణంబుగా వివాహంబు గావుటయు శుద్ధోదనుండు.

సీ. తేఱిచూచినమాత్రఁ జేరిన మంచునఁ దగుమలల్ చూపట్టఁదగినచోటఁ
గృత్రిమవృక్షసంకీర్ణమౌ క్రీడాకుధరము దాపునఁ బరఁగుచోట
నుత్కృష్టమగు గంగ కుపనదియైన రోహిణి యెడనెడఁ బ్రవహించుచోట
నేకాలము సుమమ్ములెన్నేని బుష్పించు పొదరిండ్లు నద్దినఁ బొదలుచోటఁ

తే. గీ. బండి తమయంత రాలిన ఫలములు గల
వృక్షజాతు లెల్లెడలను వెలయుచోటఁ
బంకజాదిసుమమ్ములఁ బరిఢవిల్లు
నమలములగు తటాకమ్ము లమరుచోట. ౯౩

వ. కన్నులపండువగు గతి నొక్క యారామంబుఁ గల్పింపంజేసి. ౯౪

శా. ఆరామమ్మునఁ గేలికాభవన మాహా! చిత్ర్యంపుఁ గుడ్యంబునం
దారన్ వ్రాసిన బంధచిత్రములు, నాయాచోట్ల మారాగము
ల్ శ్రీ రాణింపఁగఁజేయు కీరముఖపక్షిశ్రేష్ఠముల్, నృత్తగీ
తారూఢిం గడు నాతిఁ దేలఁదగు వేశ్యాలల్ల సంధింపుచున్. ౯౫

క. అందుం గొడుకుం గోడలిఁ బొందుగ వసియింపఁ బనిచె; ముసలితనము, నా ౯౬
నందాభావము, రోగ మనందగు నిమ్మాట లటఁ బనక యుండంగన్.

క. పదిలపఱచి తగిన భటసముదయముఁ గాపుండఁజేసి మొగి సుతుఁ డెందేఁ
గదలకయుండఁగఁ గారాసదనం బేర్పఱచెఁ గేళిసదన మను మిషన్. ౯౭

సీ. లలనయొనర్చు విలాసమ్ములట్టిటుఁ జననీని సంకెలలనఁగరాదు?
కను గానరీక పైకొను ననురాగంబు గాఢాంధకారంబు గాదు టరుదె?
పంజరస్థములైన పక్షులు తనసాటి బందుల దుస్థితిఁ బడయు టరుదె?
చంద్రానిలాంగజుల్ జముదూతలంబోని యడియాలె బంట్రౌతులనుట తప్పె?

తే. గీ. ప్రణయకోపపరాఙ్ముఖిఁ బడఁతిఁ దేర్పఁ
బడెడి పలుపాటు లచ్చటి పనులకంటె
నల్పములె? యెన్నివిధములనైనఁ జూడ
బంధనాగారతుల్యంబు పడుకటిల్లు. ౯౮

క. ఆకేళీసదనమునకుఁ బ్రాకారము లొక్కమూఁడు పచరించి యయా
శ్రీకకవాటదృఢద్వారాకలితమ్ములుగఁ జేయునట్లొనరించెన్. ౯౯

వ. మఱియు నవలివారివలను, నీవలివారివలనుం జనకుండఁ గాపాడుఁడని సేవకులకు నియమించి త్రిలోకసుందరులగు పరశ్శతకుట్టినుల నెప్పగిదినైనఁ గుమారు మనంబు లోఁగొనుఁడని నియోగించె; నిట్లు పిత్రుపదిష్టుండై సర్వార్థసిద్ధుం డక్కేళీగృహంబున యశోధరతో ననవరతసంభోగంబు లనుభవించుచుఁ బరావృత్తాంతంబులన్నియు మఱచి యాపద్వార్త కలనైన నెఱుంగక సుఖాతిశయంబునం బొదలుచుండి యొక్కనాఁడు. ౧౦౦

సీ. వికసితప్రసవగుచ్ఛకదంబసంభ్రమభ్రమదుద్భ్రమరీకభ్రాజితంబు
పల్లవగ్రాససంఫుల్లశీతారావవాచాలకోకిలాభాసురంబు
తుహినపాతంపతత్సుమమరందాసారపంకిలీకృతనవ్యప్రసవరజము
శుకముఖత్రుటితకంచుకపక్వఫలబీజదర్శితాంకురనగాఢస్థలంబు

తే. గీ. కిసలయాంతరపతితార్కకిరణజాల
వర్తులాకారముద్రికావలయితంబు
నైన పూఁదోఁట కొక్కనాఁ డవనిపాల
పుత్రుఁ డరిగె ననుంగుఁబూఁబోఁడితోడ. ౧౦౧

క. చెలువయుఁ జెలువుండును బూవులతోఁటం గ్రీడ సేయఁబోయినఁ గని కా
వలివా రెడసనుటయు నెచ్చెలు లందఱుఁ గోడుసనిరి చెలువం బొలయన్. ౧౦౨

క. సరసిఁ గరిణీవృతం బగు కరిపగిది పరస్సహస్రకాంతలనడుమన్
ధరణీంద్రకుమారుండును గరము ప్రకాశించెఁ బుష్పకానన మందున్. ౧౦౩

క. కడుకొని విరక్తుఁ డగు శాకొడుకుం గడెలోనఁ బుష్పకోదండునికిన్
బడిపిల్లనిగాఁ జేసిరి పడఁతులు చేయింపలేని పనులుం గలవే. ౧౦౪

మ. అటులా కృత్రిమకాననంబున నరేంద్రాదిత్యుఁడుం గాంతలుం
జటులం బైన మనోజరాగమునఁ బుష్పక్రీడ గావించునం
తట శుద్ధోదనపాలితాఖిలధరోదారప్రదేశంబులం
బటహధ్వానము నాల్గుదిక్కు లద్రువ న్వాయించెఁ బూవిల్తుఁడున్. ౧౦౫

వ. ఇట్లు తారాపరివృతుండగు పూర్ణచంద్రునిపగిది నారీపరివృతుండగు రాజచంద్రుండు నిరంతరోత్సాహసంపన్నుండై క్రీడించునెడ. ౧౦౬

క. పదములు తడఁబడెనని యొక ముదిత భుజాలతలు సాఁచి భూవరు నురముం
గదియించెం గాఠిన్యాస్పదవర్తులపీనమిళితవక్షోజములన్. ౧౦౭

క. మొగమున నాసవశ్రీం బగబుగ లాలయఁగ రాజుకర్ణమున నూర్పుచ్చె
న్మృగదృగొక ర్తరుణాగ్రగ 'తగవిను మిది యొక్క యేకతం' బంచు వెసన్.

సీ. సహకారశాఖ హస్తంబులు గీలించి వలుదగుబ్బలు చూపె వనితయొకర్తు
మొలనూలు పెక్కుసొగసులు కదల్చుచుఁ బీనజఘనంబు గనిపించె సఖియొకర్తె
యొకతమ్మి చేతఁబట్టుకొని పద్మాలయపోలెఁ బజ్జకు వచ్చె బాలయొకర్తు
కెఱగాణవోలె వన్నెలుగుల్కఁ బాడుచుఁ దాళంబు వాయించెఁ దన్వియొకర్తె

తే. గీ. యెందఱెందఱు కామినుల్తొందరించి
వను జలింపకయున్న మానవునిచేత
లభినయించుచు నెదుట నాట్యంబు సలిపెఁ
జెమ్మటలు మేన దిగజాఱఁ జెలియయొకతె.

ఉ. రాజకుమారు నొక్కతె సరంబులఁ జేతులుగట్టిపెట్టె; 'నీ
రోజగణింపఁ జిట్టులయయో' యని వాయిబిగించె నొర్తు; 'కాం
తాజనవర్జితుఁడ' వని తా నెకసక్కెము లాడె నొర్తు; 'నీ
వ్యాజము నేనెఱుంగ నదియా?' యని నవ్వె నొకర్తుపక్కనన్. ౧౯౦

వ. ఇట్లనుక్షణోజ్జృంభయిష్యమాణమదనోన్మాదులగు సుందరులు చేయు వికారం బులకుం జొకారంబు గల్గినవాఁడుంబోలె నుండియు నాసర్వార్థసిద్ధుం డొక్క యశోధరయందు మాత్రము బద్ధానురాగుండై కొంతతడవున కుద్యానవిహారంబు చాలించి తెఱపలతోఁగూడ మగిలి నిజసౌధంబునకుఁ జొచ్చిన యుదంతం బంతయుఁ బరిచారకులవలన విని శుద్ధోదనుండు సపౌరరాష్ట్రియప్రజుండు ముదంబునం బొదలుచుండె. ౧౯౧

చ. ఎలమి యశోధరాసరసిజేక్షణయు న్సహజంబులు న్విలా
సలలితభంగులు న్వితతసౌఖ్యకరంబులునైన క్రీడలం
బలుకుల ముద్దుల న్మురువుఁ బాటల తేటల నీటుల న్మదం
బొలయఁగఁ జేయుచుం దనుపుచుండెఁ బ్రియు న్భయభక్తియుక్తయై. ౧౯౨

మ. అతఁ డీరీతి యశోధరాకృతవిలాసాలోలుఁడై యుండి దే
వత లప్డప్డు నిశీథమందుఁ దన స్వప్నంబందుఁ గన్పట్టి వి
జ్ఞతకై యాత్మ గుఱించి చెప్ప పలుకుల్ స్పష్టంబుఁగా నిద్దురన్
బ్రతివారం బొకభంగిగాఁ గలవరింపంబూను నుచ్చైర్గతిన్. ౧౯౩

వ. అట్టియెడ యశోధర యుల్కిపడి యతని లేపి 'యియ్యది యేమి' యని యడిగిన 'నేమియు లేద'ని యూరెను మఱపించుచు మరల నెడనెడ నొలయు వేశ్యా వీణాలాపాదికమ్ముల మైమఱచి మోహమ్మునం బడుచుండు. మఱియు నట్టియెడ దేవత లయ్యెడకు వచ్చి తదేకగోచరులై. ౧౧౪

ఉ. ఎందులకుం జనించితి, మఱేమి యొనర్చుచునుంటి, వీ జగం
బందు నహింస యెల్లెడల వ్యాప్త మొనర్పుము, రాజ్యపాలనం
బందును నిట్టి సౌఖ్యములయందును మున్గక వ్యర్థమైన వే
డ్కం దిగఁద్రావి వైళ ముపకారము లోకులకుం బొనర్పుమా. ౧౧౫

వ. అనుచుఁ బ్రతిపదంబును బోధించుచుండ సిద్ధార్థుం డొక్కనాఁడు ప్రపంచవిశేషమ్ముల నెఱింగి తదుపకృతికి యత్నింపఁ దలఁచి చిత్రయను నొకదాసి నడిగిన, నయ్యది 'మహాత్మా ! యీయవి వచింప నాబోఁటి బోటి కెట్లు సాధ్యం? బా యీవిశేషంబులు దేవర చని కనినఁ దేటతెల్లంబులగు' ననుడు నతం డట్లకాక యని చెన్నఁడను సారథిం బిలిచి. ౧౧౬

క. 'ఊరంతయుఁ గనుఁగొనవలెఁ దేరాయత్తంబొనర్చి తె' మ్మన, నూరీ
కారం బని వాఁ డరిగి మహారాజునకు న్వచించె నది యెల్ల నడిగె. ౧౧౭

తే. గీ. రాజు విని కొడుకున కది రాజ్యకాంక్ష
గాఁ దలంచి పురమ్మధికమ్ముగా న
లంకరింపంగఁ జాటించెఁ బొంకముగ న
లంకరించిరి పౌరు లిలాధవాజ్ఞ. ౧౧౮

తే. గీ. గ్రుడ్డివాండ్రును గుష్ఠరోగులును గుంటి
వాండ్రు రిక్తజనులు శోకవంతులాది
గాఁ గలుగు వార లెయ్యెడఁగాని వీథు
లందుఁ గాన్పింపకుండ రాజానతిచ్చె. ౧౧౯

ఉ. కన్నులపండువౌ గతిఁ దగం బురమిట్టు లలంకరింప, నా
చెన్నఁడుఁ దేరునాయితము చేయఁగ, రాసుతుఁ డంతఁ బట్టనం
బు న్నలువంకలం గనఁగఁ బూర్ణతరోత్సవ మొప్ప నేగి కాం
చె న్నరులందుఁ గల్గెడు విశేషముల న్మది కెక్కునట్లుగన్. ౧౨౦

వ. ఇట్లు కొంతవడి వీక్షించి మరలి స్వస్థానంబున కరిగి సుఖంబుండె; నాఁటి నిశీథమ్మునను శుద్ధోదనునకు స్వప్నమ్మున నిట్లు కనవచ్చె. ౧౨౧

తే. గీ. భానుఁడును నింద్రచాపంబులోనఁ గల్గు
నొకపతాక యనిలమున నొరగి నేలఁ
బడినఁ గొందఱు సన్యాసివరులు దానిఁ
గొని చనిరి తూర్పుదిక్కునకును గడంగి. ౧౨౨

క. దక్షిణఘంటాపథమున నక్షతగతిఁ బదిగజమ్ము లరుగఁగ నంగుం
దక్షతగల తొలియేన్గున్ శిక్షించుచు నెక్కి చనియె సిద్ధార్థుండున్. ౧౨౩

క. హరు లొకనాలుగు గడుసత్వరమున లాగంగఁ జను రథమ్మునఁ దా సు
స్థిరుఁడై సిద్ధార్థుఁడు సుందరమూర్తి ముదమునఁ జనియెఁ దనయంత నెసన్.

తే. గీ. సొబగు చిత్రము లెందు నంచులను దనరు
గనకమయములు మాణిక్యఖచితములును
నగువరము లొప్ప నలరు రథాంగ మొక్కఁ
డొక్కయెడ నొప్పెఁ గన్నులకక్కజముగ. ౧౨౪

తే. గీ. ఒక గిరివరంబునందుఁ బొల్పొందు నొక్క
భేరిక నయోమయంబగు పెద్దకఱ్ఱఁ
గరమునంగొని ఢాంకృతిగడలుకొనఁగ
నట్టె కొట్టుచునుండె సిద్ధార్థుఁ డెలమి.

తే. గీ. పొడవునఁదనర్చునొక్కగోపురపు శిఖర
మందుఁగూర్చుండి పదములు హస్తములును
జాఁచి యొకఁడు రత్నమ్ములుచల్లఁ గ్రింద
నేటికొనుచుండి రొకకొంద ఱివలనవల.

క. ఒకయార్గురుజను లొకచో వికలత్వము మొగములందు వ్రేలాడఁగఁ బం
డ్లుకొటికికొంచు నజస్రాసకలుషితాత్ములయి యేగ సాగి రనదలై. ౧౨౫

వ. ఇట్టి యెడుకలలంగాంచి మేల్కాంచి శుద్ధోదనుండు దనకుం గీడు మూఁడునని శంకించుచుఁ గొల్వుకూటంబునకు వచ్చి సభాసదుల నవలోకించి స్వప్నవృత్తాంతంబు వచించిన నందొక విద్వాంసుండు 'రాజా! నీస్వప్నంబులకు ఫలంబులిట్టివి' యని క్రమంబుగఁ జెప్పందొడంగె. ౧౨౬

తే. గీ. సూర్యబింబమువంటి సంశుద్ధుఁడొకఁడు
పెక్కు మునుబోలి నర్దెస నుక్కుమిగులుఁ
భ్రాక్సితాచార మడఁచి ప్రబలఁగఁజేయు
మంచి యాచారమును భువి నంచితముగ.

తే. గీ. ఆ పదిగజమ్ములన బుద్ధికగు తెరవులు;
మొదటికరి నెక్కియేగు టప్పది తెరవుల
యందు సత్యమార్గమ్మునయందుఁదవిలి
యేగు నొకసిద్ధుఁడనుట యుర్వీశమాళి.

క. అరదమును లాగు నాలుగు హయలం గనుఁగొంటి వధిప! యవి జ్ఞానపు వె
ల్తురుఁజూపు చతుర్వర్గము; పరిపాటిగఁ జూడు దీనిభావంబెల్లన్. ౧౩౨

క. నానాచిత్రియుతము రత్నానీకస్థగితమువగు నలచక్రం బెం
తేనీతిరీతికిఁ బ్రపంచానూనవిశేషములకు వ్యంజక మధిపా. ౧౩౩

తే. గీ. నీకొడుకు భేరిఁగొట్టుచు నీకుఁ గానఁ
బడుట కర్థంబుఁదెల్పెదఁ బార్థివేంద్ర!
లోకములకెల్లఁ దెలియంగ 'నేకమేవ'
యనెడి శ్రుతిని జాటించుట యరయుమెడఁద.

తే. గీ. గోపురము జ్ఞానశాస్త్ర, మగ్గోపురమ్ము
నుండి రత్నములం జిమ్ము టొడ్ల కెల్ల
దాని నుపదేశ మొసఁగు విధమ్ము, రత్న
నికర మేఱుట గ్రహియించు నియతి యధిప. ౧౩౪

క. మొగములు వాడఁగ నార్గురు పొగులుట తమ మతము వోవఁ బూర్వాచారా
నుగతి జగతికిం దెల్పుచు నెగడు గురువు లేడుచుటయని యెఱుఁగు మధిపా.

వ. అని చెప్పిన నప్పలుకుల చందంబు విని యీయేడుస్వప్నంబులకుఁ బర్యవసితా
ర్థంబు తనూజుండు సన్న్యసించుటకా యని కృతనిశ్చయుం డై. ౧౩౬

క. మునుపటికన్నను నెక్కుడు జనులం గాపుంచి పూర్వసదనంబున నం
దను నుండఁజేసె; నెంతుం జనకునకుం బుత్రు విడువ సమ్మతమగునే. ౧౩౭

శా. ఆ సిద్ధార్థుఁడు పూర్వరీతి మఱునాఁ డాచెన్నునిం గూడి ప్రా
లాసం గన్గొనుచు న్మృతింగను జనుం, బ్రాణంబు శేషంబుగా

గాసిం జెందెడు వానిఁ, బెక్కులగు రోగంబు ల్వ్యథం గూర్ప సం
త్రాసం బొందెడు వాని దాఁగని మనెం దాపప్రకోపంబునన్. ౧౩౯

తే. గీ. కెలననున్న చెన్ను నడిగి కీడు మేలు
లాత్మఁబట్టించుకొనుచు నట్లరుగ నరుగ
వేఱొకటఁ జుట్టు బందుగు ల్వెక్కివెక్కి
యేడ్వ వచ్చెడు సబ మొక్కఁ డెదురుపడియె.

తే. గీ. కొమరుఁ డగ్గియుఁ గుండయుఁ గొని నడుపఁగ
వస్త్రి మొక్కంత గన్పట్టి వస్త్రిసంవృ
తంబుగాఁజేసి పాడెపైఁ దగఁబరుండఁ
బెట్టి నల్వురు వహియింప నెడలె శవము.

చ. పదపడి కంకగృధ్రముఖపక్షిసమాకులము న్నివారవా
స్పదము ననేకవాహకశవప్రచురంబును నైన వల్లకా
టి దరిని బెట్టి యాశవము దెప్పరమైచను వహ్నిఁగాల్ప బూ
డిద యగుడు న్నృపాలసుతు డెందముచందము భిన్నభిన్నమై. ౧౪౨

క. వివశంబగుటయుఁ జెన్నుని నవలోకించి 'మనమిట్టులగుదుమె?' యన. వాఁ
డు పలుకు సిద్ధార్థునికిఁ గలవిధం బిప్పగిదిఁ దాఁగలంగెడి మదితోన్. ౧౪౩

తే. గీ. పుట్టుటయుఁ గిట్టుటయు మఱేఁ బుట్టుటయును
దిరిగికిట్టుట యనునది దేహధర్మ;
మేల తప్పింపనగుఁ? జక్రమెట్టు లట్టు
లీప్రపంచమ్ము తిరుగు భూమీశమౌళి. ౧౪౪

వ. అనిన విని యది యంతయు మనంబునకు గోచరంబు చేసికొని యారుద్రభూమి
విడిచి మరలి నగరఘంటాపథంబున వచ్చుచుండ. ౧౪౫

చ. సిరిచెడి బిట్టువంగిన కసేరుకయుం గను లొప్పలుం బర
స్వరము గదించు మైవళులు పాతరలాడు శిరంబు సర్వము
న్నరసిన కర్ణలోమము లణంగిన పిక్కలబల్మి మోమునం
దొరఁగెడి ల్రాల గల్గు ముదితొక్కను గాంచెఁ గుమారుఁ డొక్కడన్. ౧౪౬

క. వడవడ వడఁకుచుఁ బదములు తడఁబడ హస్తమున నొక్క దండము గొని యె
వ్వాఁడు వచ్చుచుండు వీఁ డని యడిగిన నృపసూతి కిట్టులనె సారథియున్. ౧౪౭

ఉ. రూప మడంగు బుద్ధియును రూపఱు దేహబలంబు గ్రుంగు సం
తాపము హెచ్చు నాశలును దామరతంపర లై జనించు వి
ద్యాపటిమంబు తగ్గు విషయంబులుఁ బొల్పఱు దేని ప్రాపునం
దాపరమయ్యె నా జరయనందగు రోగ మొకండు పీనికిన్. ౧౪౮

క. చవి యెఱుఁగమి యింద్రియపాటవమును లేకుంట పండ్లుడుంగుటయును ము
న్నవు విధములు దలఁపఁగ రెండవబాల్యము సుమ్ము ముదిమి యవనీంద్రసుతా.

క. అన విని బుద్ధుఁడు చిత్తంబునఁ గూరిన చింత పేర్మిఁ బొరిఁబొరి నాలో
చన మొనరుచుచుం జనియె సదనమునకుం బనివి పనివి తత్తఱ మొలయన్. ౧౫౦

—♦ ఆశ్వాసాంతపద్యములు. ♦—

క. సంతతరవికాంతియుతానంతధరామండలావనాసక్తమృదు
స్వాంతాంగ్లేయప్రభుసామంతధరాపాలలోకమానితశీలా! ౧౫౧

ఉ. రాజతరంగిణీప్రముఖరమ్యతరాంధ్రవచఃప్రబంధక
ర్తా! జయశీల! ముద్రితపురాతనకర్తృకసత్ప్రబంధపా
లీజనితాతికీర్తిధవళీకృతసర్వదిగంతరాళ! స
త్తేజ! భుజాలసద్వసుమతీ! సుమతీ! వరకృష్ణభూపతీ! ౧౫౨

— ♦ భుజంగప్రయాతము. ♦—

జగద్గీతకీర్తీ! భృశప్రేమమూర్తీ!
నగాధీశధీరా! ఘనత్వప్రచారా!
యగోద్ధర్తృమానా! సదాభ్యస్యమానాం
ప్రగీర్వాణభాషాచరా కృష్ణవేషా. ౧౫౩

గద్య

ఇది శ్రీతిరుపతి వేంకటేశ్వరప్రణీతంబగు బుద్ధచరిత్రం
బను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.





శ్రీరస్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# — బుద్ధచరిత్రము —

## తృతీయాశ్వాసము

క. శ్రీయుత! హయాణకళాధీరాయిత! శాంత్యాదిసుగుణరత్నాకర! కీ
ర్త్యాయత! వేంకటకృష్ణారాయమణీ! సుకవికమలరాజ్యభ్రమణీ! ౧

తే.గీ. అవధరింపుము పిదప సర్వార్థసిద్ధుఁ
డట్లు గృహమున కేతెంచి యంతరంగ
మెంతయు విరక్తిపథమున గంతులిడఁగ
న్యాయముగ నెట్టకేల కారేయి గడపి. ౨

వ. మఱునాఁ డుదయంబునం గతిపయమిత్రసహితుండై యకృత్రిమవనవిహారంబునకు మనంబు ప్రేరేపఁ గింకిణీశతసమాకులంబును దంష్ట్రిఖాద్యమానఖిలీనఖులఖిలారావంబును సన్నద్ధపల్యాబంధంబునగు కంటకంబను వారువంబుఁ జెన్నొందాయితంబు గావించిన దాని నధిష్ఠించి యెడనెడ గిరినదీకుల్యానిర్ఝరరామణీయకంబుఁ గనుంగొనుచుఁ జనువాఁడు. 3

సీ. పంచాస్యనఖముఖాపాద్యమానకరీంద్రదళితకుంభస్థముక్తాఫలంబుఁ
గందరాముఖచగద్గంభీరభీషణకాగవిత్రస్తశార్దూలవిభ్రమంబు
శార్దూలఘోరదంష్ట్రాపిష్యమాణవన్యగవీమహిషాదిమృగకులంబు
నవ్యకాసరశృంగసంఘృష్యమానోదారభూసవిభాగతటగంగసముఖంబు

తే.గీ. వథయభిల్లకుమారవాస్త్రాగ్రవిహిత
వైణవాశుగహన్యమానైణచయముఁ

గ తినహిమఖండమండితగండశిల మ
యిన తుహినభూధరంబుఁ గన్గొనియె నెదుట. ౪

వ. కని తత్పాదంబులం జేరంబడి మందటి దారులు హయాధిరోహణసమీచీనం బులుగా వని వారువంబు నటనుండ నియమించి కాలినడన నెడలి జడియకుండుఁ డని తనచెలికాండ్రకు ధైర్యంబు చెప్పుచుఁ బ్రాలేయహింసాఘోరంబగు నమ్మ హారణ్యంబుం దరియం జొచ్చి సృష్టియందలి వైచిత్ర్యంబున కచ్చెరువడుచుఁ జనిచని ౫

క. ముండితశిరస్కుఁడై యొకదండము కేలఁ గొని యేకతముగా వనమం దుండిన మునిని గనుంగొనియెం డెందమునందు వింత యిం పెసలారన్. ౬

వ. కని 'నీవెవ్వండ వేమికతంబున నిట్టి వేసమాసాదించితి, వేమి చేయుచుంటి' వని యడుగ నుద్భవిష్యమాణమహాప్రబోధోదయుండగు సర్వార్థసిద్ధుంగని యతం డిట్లనియె. ౭

క. నేనొకసన్న్యాసి నరణ్యానిం దపమాచరింప నరుదెంచితి నా ధ్యానము మోక్షము చెందుటకై నావుడు రాజసుతుఁడు క్రమ్మఱఁ బలికెన్. ౮

సీ. తల్లిదండ్రులు నీకుఁ దపమాచరింపఁగ నిందుఁ బొమ్మని యానతిచ్చినారె?
వా రేమియైరి? నీపరిణయంబైన యిల్లాలి నెచ్చట డించితయ్య? యనుచు
నడుగ, 'నయ్యో! వెఱ్ఱిపడుచుఁడ వెందేనిఁ బరిణయం బాడిన బంధముక్తి
నెనయు నే! తలిదండ్రు లెవరైనఁ గొడుకు సన్న్యాసంబుఁ గొనుమని యంపువారె!

తే. గీ. యవని మోక్షేచ్ఛ గలవార లఖిలబంధు
పుత్త్రమిత్త్రకళత్రాంబుపూరితమగు
సంసరణవార్ధిఁ బడకయే చనఁగవలయు
నుగ్రకాంతారములవంక కూరు విడిచి. ౯

వ. కావున నేను మోక్షార్థినై పరిణయపాశంబునం దగులక తల్లిదండ్రుల కన్నొ అంగివచ్చి యీఘోరారణ్యప్రదేశంబునం దిట్టివేసంబునం దపంబు చేసికొను చుంటి' నవవుడు నరేంద్రనందనుం డిట్లనియె. ౧౦

మ. తరుణీపాశమునం దగుల్కొనక సత్యజ్ఞానసంపన్నుఁడై
తరణోపాయమునిఁ బొందఁగావలయు దత్త్వం బింతియేకాని యి

క్ష్మారణిం దండముఁ గావిచేలములు నేకాలంబునం దాల్చుచున్
శిరముం బోడియొనర్పఁ గారణ మొగిం జెప్పంగదే నావుడున్. ౧౨

సీ. 'సాంసారికులతోడి సావాసము ముముక్షుజనులకుఁ దగదు, సాంసారికులకు
సన్న్యాసులగువారి సహవాసమునుగూడ, దటులైన నిరుదగలడఁగు నిజము;
కావున మోక్షేచ్ఛగలవారి కడవియు, సాంసారికుల కెల్ల జనపదంబు
వాసంబుగా నేఱుపఱిచిరి తొల్లింటి పెద్దలు; వేషంబు వేఱుగాఁగ

తే. గీ. బుట్టములఁ గావిరంగును బోడితలయు
యోగులకు నిర్ణయించిరి యుక్తిచేసి
కాని ముక్తికి నిదియొక్క కారణంబు
గాదు, ప్రతిబంధకంబును గాదు తలఁప.'

తే. గీ. అనుచు నెఱిఁగింప మ్రొక్కి వీడ్కొనుచుఁ గదలి
స్నేహితులుగూడ వెంట వచ్చిన కతమున
వన్యకరిరాజు ప్రోలికి వచ్చుపగిది
మరలె నగరునకుఁ దురంగమంబుతోడ. ౧౩

వ. ఇట్లు సర్వార్థసిద్ధుం డానాఁటిపగ లెల్ల నరణ్యంబునం బుచ్చి నగరికిం బ్రవేశించు
నెడ భువనబంధుండును. ౧౪

శా. సిద్ధార్థుం డిఁక నేఁటిరాత్రిమొద లాశింపండు సంసార మ
న్నదజ్ఞానమునం జగం బఖిలమున్నంధింప సన్న్యాసమ
న్నద్ధర్మంబు వహించు నంచుఁ బృథివిం జాటించి యాపై నుద
న్వద్ధామస్తులకు న్వచింపఁ జనెనా వారాశిఁ జేరె న్వడిన్. ౧౫

తే. గీ. ఎల్లినుండియు నితఁడింక నెపుడుఁ గట్టు
నట్టి వస్త్రంబులను గట్ట కిట్టి పుట్ట
ములు ధరించు నటంచుఁ జెప్ప లనిదోఁప
నేయొడలఁ దోఁచె సంజకెంజాయ దెసల. ౧౬

తే. గీ. పంకజాత యగుటఁ దన్నుఁ బాసి యరిగె
రవి ప్రియామయుఁ డని సలిని నగ నిగుడ
మగుడఁ దలయెత్త నేరని మాడ్కి నొప్పె;
నకట! దోసఁ గేరికైన లజ్జావహంబు. ౧౭

తే. గీ. పుష్పవతియైన పద్మిని పొందుచేసి
తనదు తేజంబు క్రమమునఁ దఱఁగిపోవఁ
బశ్చిమసముద్రమున మున్గెఁ బాపమడఁగ
ననఁగ రవి క్రుంకెఁ దద్దిశాభ్యంతరమున. ౧౮

క. ఎల్లెడల మనపతంగుఁడు బల్లిదుఁడై క్రుమ్మరు నెటఁ బట్టువడెనొ యా
పల్లెనుఁ డగుచు నసుగతిఁ గొల్లలుగఁ బతంగకులము గూయఁగఁ దొడఁగెన్. ౧౯

తే. గీ. సూర్యుఁ డనుజ్ఞాన మెందేఁ జొచ్చుటయును
నలమెఁ దమము బ్రహ్మాండమునందుఁ బ్రబలి;
దానిఁ గని సైఁపలేని సుజ్ఞాను లనఁగ
మిగుల వాఁపోవఁ దొడఁగెఁ బక్షిగణ మపుడు. ౨౦

సీ. ముల్లోకముల తేని యిల్లాలు తనయింట వెలిఁగించుకొనిన దివ్వియ యనంగఁ
బాచి కేళీశయ్యపయిఁ గోల్పడిన నిగ్గుగల యొంటితేఁటజాతికమ్మ యనఁగ
నాకాశడోలాంతరాకాశమానకంతుకరవిలాసకందుక మనంగఁ
దెఱగంటివారపట్టి పఱపుటుయ్యెల మంచముపైఁ బైఁగట్టిన ముకుర మనఁగఁ

తే. గీ. జందురుఁ డుదయించెఁ, జక్రము ల్వంచలించెఁ,
జంద్రికాపతత్త్రు లెలమిమై సంచరించె,
సరసకైరవసంతతి సంతసించెఁ,
బద్మినీకాంత తలవంచి పవ్వళించె. ౨౧

తే. గీ. అంబరము తనమణి వోవ నార్తిఁ గూరి
యెన్నియో దివ్వెలను బెట్టి యెందు వెదకి
విసివి పెద్దదీపమ్మును బెట్టె ననఁగఁ
దారలును జంద్రుఁడును గ్రమదశ నెసంగె. ౨౨

వ. మఱియును. ౨౩

సీ. తంజాపురీనీలకంజాతనయనల రెండుచెక్కులు పుల్కరింపఁజేసి
కాంచీపురీదేశఘనసారగంధుల పొలయల్క పెక్కుసారులు హరించి
కర్ణాటకామినీఘనశిరోరుహముల కసమానసైగనిగ్యంబుఁ దెచ్చి
కుంతలప్రాంతకర్ణాంతాయతాక్షుల చెలువపలుకూర్మి హెచ్చింపఁజేసి

తే. గీ. యమితతృష్ణార్దితభుజంగసముదయ
శ్రమదవిధానార్హకుశలసంపదలఁ బొదలి
మలయనిలయపటీరద్రుమవలయనిలయ
మారుతంబులు చెలరేఁగె మాసరముగ. ౨౮

వ. అట్టిసమయంబున సర్వార్థసిద్ధుండు విశ్రమనామకంబగు కేళికోద్యానంబునఁ దొల్లింటిపగిది యశోధరాసహితుండై యనర్ఘమణికుట్టిమంబును ననేకచిత్రాలంకృతంబును గృత్రిమద్రాక్షావల్లీసుమహితోల్లోచభాసురంబును మౌక్తికసరసముజ్జ్వలద్భిత్తివ్రజంబును బహిస్స్థితగాయన్నానాగాయనీజనసంకులంబును గమనీయపరిచారికాబహుళంబునునగు సౌధంబున. ౨౯

సీ. జాలమార్గప్రవిష్టమ్ములౌ వెన్నెల ల్వజ్రభిత్తుల సుధాభ్రాంతిఁ జేయ
నవరత్నరుచిరపాత్రవిశేషభాస్వత్ప్రదీపమ్ము లొండొంటి తేజు మిగులఁ
దులలేక తగు హంసతూలికాతల్పంబు పఱచినయద్దంబుభాతి మెఱయ
నుల్లోచ మయ్యెడ నుండు నలంకారముల కన్నిటికి వింతపొలుపు నెఱప

తే. గీ. నలుదెసల కుడ్యముల నొప్పు నిలువుటద్ద
ముల గుణించి పదార్థసముదయమును బ్ర
వృద్ధముగఁ జూప నెల్లెడ వేడ్క లొదవఁ
జాలు ననవద్యకేళికాసదనసీమ. ౩౦

క. కేళీలోలతఁ గొండొకకాలము వర్తించి తత్సుఖపరవశుండై
లీల మెయి నిద్రవోయెడి వేళకు యామద్వయంబు వెడలం జొచ్చెన్. ౩౧

వ. అయ్యెడ. ౩౨

సీ. కలలోఁ బనిచేటిసంగతుల నృత్యాదుల నెంచి సారె కలవరించు నొకతె
కంకణారావమ్ము గానమ్ముగా నిటునటుఁ గదలుచు నిద్రనందు నొకతె
వీణ మీటుచు రసవివశయై యారీతిఁ గదలక నిద్రింపఁగడఁగె నొకతె
శృంగము ల్స్వకుచసంసంగమ్ముగన లేటి తనప్రక్క నొలయ నిద్రగను నొకతె

తే. గీ. పొలఁతు లిర్వు రొక పొగడపూలమాల
గ్రుచ్చుచుండంగ నందొక్క కోమలాంగి
యలసి యాదండ యుపధానమగు గతిఁ బవ
ళింప నద్దానిపైఁ బవళించె నొకతె. ౩౩

తే. గీ. ఒకతె పెంపుడులేటిపిల్లకు గులాబి
పువ్వు గనిపింప నది కొంతపూవు దినియుఁ
గొంత తినుచు నిదురగొనఁ గువలయాక్షి
తాను దినిపించుచునె నిద్ర తగవహించె. ౩౦

మ. లలన ల్కాందఱు కేళికాసదన ముల్లంఘించి పైపెచ్చు దీ
పలసత్కాంతులు రోహిణీమరుదభిప్రభ్రాంశితాచ్ఛాదనో
జ్జ్వలదాత్మీయయవాలికి న్మిగుల దృశ్యత్వంబు సంధింప వె
న్నెలబైట న్నిదురింప సాగిరి మదాంధీభూతచేతస్కలై. ౩౧

తే.గీ. ఇట్లు లోకరీతిఁ గాక యెన్నెనిగతుల
నతుల నిద్రాభిరాలసలైన యావె
లందు లరవిచ్చుచున్న గులాబిపువ్వు
లనఁగ నెంతయు శోభ నొప్పారి రపుడు. ౩౨

వ. ఇట్లు లక్ష్మీగృహబహిస్థితులగు తత్రజ్జనంబు లెల్ల గాఢనిద్రానుగతులైయుండ
వెండియుఁ దత్సదనద్వారసంగతమ్మును గనకలతాచిత్రితంబును నీలవర్ణమ్మును
జందనకాష్ఠావలంబితంబునగు తెర యొద్ద గంగాగౌతములను పరిచారిక లిరు
వురు పన్నుండియుంష నమేయంబును నిశ్శబ్దంబునగు నయ్యర్ధరాత్రంబున. ౩౩

తే. గీ. ధవునిభుజదండమనె యుపధానముగ ని
దురగొనుచున్న యల యశోధర కల గని
తగని వగ నిగుడఁగ లేచి మగనికేలు
మూఁడుసార్లు ముద్దిడుకొని మొనసి లేపె. ౩౪

క. కన్నీరు కాల్వ గట్టఁగ నన్నెలఁతుక పైఁట గుబ్బలం దిడుకొనుచున్
సన్నపుటెలుఁగున నాథుని మన్నన దనుపార లేపి 'మనవి వినుఁ' డనన్. ౩౫

తే. గీ. ప్రార్థనాపూర్వమైన యప్పడఁతిపలుకు
విని యుపరిపాటుమై లేచి విహ్వలాత్మ
యైన సతిఁ గాంచి పల్కె సిద్ధార్థుఁ 'డబల!
యేమికారణ, మిందుల కెఱుఁగఁ జెప్పుము. ౩౬

క. నావుడుఁ జెప్పఁగ గాసతి భావంబు బెడఁ దెగక మిగుల వగలం బొగలం
గా విభుఁడు పలువితమ్ముల నావెలఁదుక నతునయించె నది చెప్పింపన్. ౩౭

తే. గీ. అటు లనునయించు పతి కిట్లులను మృగాక్షి
"నాథ! చెప్పెడిదేమి, యీనాఁడు నాకు
వేఁకటియొదవె నద్దాని వెర వెఱింగి
మించుముదమున నేను నిద్రించుచుంటి. ౩౮

మ. అకటా! యియ్యది యెట్లు చెప్పనగు నాథా! నిద్రలో నొక్కపా
డుకలం గంటి, న దెట్టి దన్న, నిటులట్టు క్కొమ్ములం జిమ్ముకొం
చొకయాఁబోతు మణిప్రభోజ్జ్వలితమై యొప్పారు చిహ్నంబు విం
తకు వింత న్మృగముం దెలర్ప నెదుటం గన్పట్టె శైలాకృతిన్. ౩౯

తే. గీ. 'విచ్చలవిడిఁ దిరిగెడి యీవృషభరాజుఁ
బట్టలేకున్నఁ బోవు మీభాగ్య' మనుచుఁ
బలికె నంబరవాణి; యప్పలుకు వినియు
నెవ్వరును బట్టలేకుండి రించుకేని. ౪౦

ఉ. ఎమ్మెయిఁ బట్టరాక కడు నేపునఁ బొల్చుచునున్న యమ్మహో
క్షమ్మును హస్తయుగ్మమున గట్టిగఁ బట్టితిఁ, బట్టినంతనే
హుమ్మని యార్చి పర్వతసమున్నతమౌ తనువు న్విదిర్చి పం
తమ్మున నన్ను మీఱి చరణంబుల భూమితలం బదల్చుచున్. ౪౧

క. లెంకల నెల్లరఁ బొడిచి నిరంకుశగతి వరణ మొక్కయంజగఁ బ్రబలా
హంకార మెసఁగ దాఁటి తలం కెల్లర కొదవ నేగె లావు మెఱయఁగన్.

తే.గీ. ఇద్ది యొకకల; యిఁక నొక్కఁ డెట్టు లనిన:
దేవదూతలు నల్వురు తివిరి సపరి
వారముగ నిప్పురమునకు వచ్చి వైజ
యంతిక నొకండు నాటిన యంతలోన. ౪౩

క. రవి యుదయమందె, మఱి వాయువు వీచెన్; వాన నద్దియు న్విరఁబాఱెన్
వివిధగతి నక్కరము లున్నవి దాన" ననంగ సతికి నయ్యనఘుండున్. ౪౪

క. పలుకు నిటు "లబల! విను మిక్కల నిక్కల శుభద, మేడ్వఁగా నగునె?" యనం
గ, లలన ధవునకు నిట్లను బలుకులలో విన్నఁదనము ప్రబలింపంగన్. ౪౫

తే.గీ. "ప్రాణనాథ! మూఁడవకల యవధరింపు,
'కాలము సమీపమయ్యె నింకఁ దడవేల?

యనుచుఁ బలు కొండు వినఁబడె నంతట నుప
ధానముదెస నిగిడ్చితి నేను దృష్టి. ౪౬

తే.గీ. అచట దేవర ధరియించునట్టి వస్త్ర
ములు గనంబడెఁ గాని మిమ్ముఁ గననైతి
మున్ను మీరు నాకిచ్చిన చిన్నిపూల
నడుమునం జూడఁబాముగా నాకుఁ దోఁచె. ౪౭

క. అందెలుఁ గంకణములు జాఱెం, దిలకింపంగ శయ్య పృథివిం బడె, నే
మందు న్మర్యాదాపట మొందె న్శిథిలత్వ, ముత్తెమొక్కం డఱచెన్. ౪౮

తే.గీ. మీఁద గుండెలు జల్లన మేలుకొంటి;
నిట్టి చెనఁటి కలవు ఫలమెన్నిగతుల
మన యిరువురందు నొక్కరికిని మృతియగు
నంచు నెంచి శోకించెదఁ బ్రాణనాథ. ౪౯

మ. అను ప్రాణేశ్వరి పల్కుల న్వినుచు సిద్ధార్థుండు తా నవ్వి, నీ
కును నాకుం దొసఁ గిక్కలం గలుగ, దక్కం బోలుపుత్రుండు నీ
కు నొకం డుద్భవ మందు, నెన్నటికి నీకు న్నాకు సంబంధ ముం
డు నిటుల్మద్వచనంబులన్ హృదయమందు న్విశ్వసింపం దగున్. ౫౦

క. అని యనునయించి మఱి యి ట్లను సిద్ధార్థుండు 'దుఃఖమందు మునుఁగు భూ
జనుల కుపకారములు నా కొనరింపఁగవలసి యున్నవో గజగమనా! ౫౧

క. ఏ నేమార్గంబునకై పోనుంటినొ యట్టిమార్గమున కీవును రాఁ
గా నయ్యెడి శోకింపంగా నేటి' కటంచుఁ బేర్మి గడలుకొనంగన్. ౫౨

ఆ.వె. కౌఁగిలించుకొని మొగమ్మున మొగమిడి
ముద్దుపెట్టుకొని సుముఖిని జేసి
కంటినీరు దుడిచి కాంతకు సిద్ధార్థుఁ
డిట్టులనియె మరల నెసకమెసఁగ. ౫౩

క. 'జ్ఞానోపదేశమును నాచే నెందఱు గాంతు రట్టిశిష్యులలో ని
న్నానింతు నగ్రగణ్యగ నీ నా సంబంధ మెందు నిక్కంబ సుమీ'.

తే.గీ. అని యనేకగతుల నాపె ననునయించి

మరల నిద్రింపఁజేసి యమ్మానఘనుఁడు
తగని యాలోచనమునఁ జిత్తము కలంగ. ౫౫

తే.గీ. ఉండునంత మున్ను నుపదేశ మగుగతి
నమరవరులు పల్కి, రట్టి పల్కు
లపుడు వినఁగనయ్యె; నయ్యెడఁ జంద్రుండు
కర్కటస్థుఁ డగుచుఁ గ్రాలుచుండె. ౫౬

మ. అపు డద్దేవత లాడువాక్యములు సిద్ధార్థుండు యోజించి స్వ
ప్నపుభంగిం దిలకించి లోకులను విజ్ఞానౌషధిం బాపరో
గపథాపాకృతులం బొనర్ప మతి సంకల్పించి పోనెంచి స్నే
హపు సంబంధము ద్రెంపలేక కడు మోహాయత్తుఁడై క్రమ్మఱన్. ౫౭

క. వెనుదీయు మనము జ్ఞానమ్మునకుం దానకము చేసి పూర్ణస్థైర్య
మ్మును జెంది యశోధరవంకను దృష్టినిగిడ్చి మిగులఁ గరుణార్ద్రుండై. ౫౮

తే.గీ. ఆపె యవయవసౌష్ఠవ మరసి యరసి
తనివిఁ జెందఁగలేక నితాంతరాగ
గాఢవిజ్ఞానములు మదిఁ గదిసి పోరఁ
దుదకుఁ బోనెంచి తద్రదచ్ఛదము గాంచి. ౫౯

మ. మృదులం బంచు నెఱింగియు న్నిను సమున్మీలన్మనోజాగ్నిదా
హదశ న్నిర్దయబుద్ధినై ప్రతిపదం బత్యార్తి నొందించు నా
యదయత్వంబు సహించి స్వీయమగు రాగాఢ్యత్వము న్వీడ కో
యధరంబా! సెలవిచ్చి పంపుము కృపాయత్తైకచిత్తంబునన్. ౬౦

తే.గీ. మది నహింసయ పరమధర్మం బటంచు
గుఱు తెఱింగియుఁ నినుఁ గొన గోటిపోటు
లం గలంచితినన్న చలంబు విడిచి
సెల వొసంగుమ యోకుచసీమ! నాకు. ౬౧

తే.గీ. ఎప్పు డేరస ముచితమై యొసఁగు నప్పు
డారసమ్మున నా హృదయమ్ముఁ గరఁచు
నీకు నాకు ఋణము తీఱె నేఁటితోఁ గ
నుంగవా! యానతిమ్ము చనుటకు నాకు. ౬౨

క. అని తత్తదవయవమ్ములఁ గనికర ముట్టిపడ నడిగి, కాంత విడిచి, శ
య్యను డిగ్గి ప్రదక్షిణముం బొనరించె న్మాఁడుసార్లు పూర్వాభిరతిన్. ౬౩

వ. అట్లొనర్చి వెండియు దానింగూర్చి. ౬౪

క. నెయ్యంబునఁ దగు మాపా కయ్యములం బొదవు గాఢకష్టంబులు నీ
వెయ్యెడ నోర్చితి వికనో శయ్యా! నిను వీడెదను వొసంగుము సెలవున్. ౬౫

వ. అని వెండియు.

సీ. అనవరతంబుఁ దియ్యని పల్కులం బల్కి ముదముగొల్పెడి కీరముఖ్యులార!
గాఢాంధకారంబుగలఁచి సంతతదీప్తిఁ బరఁగించు రత్నదీపంబులార!
యనుపదంబును మమ్ము నంతరమ్మున దాల్చి తలతల నిల్పుటద్దమ్ములార!
పరిచారికలభంగిఁ బరిచర్య సల్పుచుఁ బొల్పారు జంత్రంపు బొమ్మలార!

తే,గీ. యరమరలొకింత లేక కాయమున మైత్రి
దనర వాసించు మేల్సుగంధమ్ములార!
తక్కఁగల్గిన యోపదార్థమ్ములార!
పనివి దయయుంచి నన్నింకఁ బంపుఁడమ్మ! ౬౭

వ. అని బయలువెడలి యతండు

మ. ఒకకాలం దేగును, సంశయించును; సముద్యుక్తత్వముం జెందు వే
ఱొకకాం దేగు, యథాస్థితిం గను; నిరుద్యోగమ్ము వాటించు; నె
న్నఁడుఁ దోతెంచుట కిచ్చగించునట! సన్న్యాసార్థియే యౌను గా
కకటా! యెవ్వనికేని శక్యమగునా? యర్థాంగి వర్జించుటల్. ౬౯

వ. పదంపడి యెట్టకేలకు నిద్రించుచున్న కాంతాజనమ్ముల మధ్యమ్మునుండి నిశ్శబ్ద
మ్ముగ నడిచి మందవాయువులు గమనానుకూల్యంబు సూచింప మెల్లనఁ జెన్నని
లేపి కంటకంబు నాయితంబు గావింపుమని కలతెఱంగు వచించిన వాఁడిట్లనియె.

చ. మిసిమి నెసంగు ప్రాయమును మేటిసిరుల్కడలేని రాజ్యము
న్రసికతయుం బసందొసఁగు రాకొమరుండవు సాధ్వియైన నీ
దుసతి నకారణంబ విడి దొంగతనమ్మున రాత్రివేళ వ
న్న వ్యసనము పూననెంచె దకటా! సుఖమానె విరాగ మేరికిన్. ౭౧

చ. స్థలమునఁ బండఁగావలెఁ బ్రసాదమటంచును సాధ్వ లిచ్చు భి
క్షలు గ్రహియింపఁగావలెఁ బొసంగదు వేళకుఁ దిండి తిన్నచో
నిలువఁగరాదు నిల్చినను నిల్చినచోటఁ బరుండరాదు నీ
తల మగునే యతిత్వమును దాల్చుటయు న్నరపాలబాలకా. ౭౨

మ. అడవు ల్బావులతోఁటలే? గుహలు క్రీడాగారవారంబులే?
మహాఁగు ల్బావులె? క్రూరసత్త్వములు నమ్మన్వచ్చు బంధుత్తులే?
నడిప్రాయంపుఁ దలోదరీమణిని నన్యాయంబుగా డించి పో
యెడువాని న్నిను నే మనంగలదు? మేలే ప్రాయమం దిప్పనుల్! ౭౩

చ. కొడుకులఁ గూఁతులం గనియుఁ గొండొకకాలము వారిప్రాపు మే
ల్గుడిచియు వార్ధకం బొదవఁ గోరికలం దిగఁద్రావి రాజ్యముం
గొడుకుల కప్పగించి కయికోఁదగు సన్న్యసనంబుకోస మి
ప్పుడ ప్రయతించె దక్కట! నృపుం గడు దుఃఖపరీతుఁ జేయుచున్. ౭౪

క. అని పలువితముల బోధించిన చెన్నునిమాట విశ్వసింపక తగుభం
గిని వానికి జ్ఞానమ్మం బనుపడఁగాఁజేయ వాఁడు భయభక్తులతోన్. ౭౫

వ. కంటకమ్మను తేనియశ్వమ్ము నాయిత మొనర్చిన నద్దాని నధిష్ఠించి దేవతలు ఖురధ్వానంబున కస్ఫుటత్వంబు సంధింప నవలీలఁ బ్రాకారంబులు దాఁటి శీఘ్రగమనమ్మున నొకమహారణ్యమ్ము చొచ్చి దేవతాప్రభావమ్మునం జేసి వాయువంబుతోడ నడచివచ్చిన చెన్నునిం గాంచి యిట్లనియె.

తే.గీ. గాలి కెనయగు నీకంటకంబుతోడ
నడుగు వెనుకకుం బడకుండ నడిచి వచ్చి
రాజభక్తియు నీదు పరాక్రమంబుఁ
దెల్ల మొనరించి తీవు నాయుల్లమునకు. ౭౬

తే.గీ. రాజ్య మేలఁగఁ దలఁచిన రాజతనయు
మీద భక్తియు విశ్వాస మాదరంబు
భృత్యులకుఁ గల్గుఁ గాని రాజ్యేచ్ఛ లేని
వానిఁ గొల్తురె నీవంటివారు తక్క! ౭౭

వ. మఱియు శోకత్యాగంబునకై చనుచున్న నన్నుం గూర్చి శోకంబు వదలుము; పురుషున కర్థదాయాదులు దొరకుట సుకరంబు గాని ధర్మదాయాదులు దొరకుట దుర్లభంబు, ధర్మంబు సమయ మపేక్షించునది కాదు. అశాశ్వతమగు దేహముల మతిమంతు లాస్థయొనరింపఁ దగదు. కావున నీ వీకంటకంబుతోడఁ బురంబు నకుం బోయి మజ్జనకుండు నన్ను మఱచునట్లు హితోపదేశంబు లొనరింపుము.

క. వగవఁగ వల దని నొడువుము, యుగములు గతియించినను వియోగము మాన్పం
దగువారు గలరె? నిత్యంబుగ మృత్యువు వెంట నంటి మొగియుచు నుండన్. ౬౦

వ. కావున జననమరణరాహిత్యంబునకై సన్న్యసించి యిక్కానలయందుఁ గంద మూలాశనుండనై జీవయాత్ర నడపుదు నని పెక్కుభంగుల నుపదేశించు రాజ కుమారుం గాంచి సంతాపవిక్లబుం డగుచుఁ జెన్నుండి ట్లనియె. ౬౧

తే. గీ. 'నరవరాత్మజు నొకనిఁ గానలకుఁ బంపి
చెప్పవచ్చితివా? యోర! చెనఁటి' యనుచుఁ
జుట్టములు నన్ను బెనువంతఁ దిట్టుకొఱకుఁ
బట్టణమునకు నిపుడేల పంపె దయ్య. ౬౨

క. నామనము నాకు వశముం గామికిఁ జింతింతు ఘోటకముతోడ నినుం
గామించి ఘోరకాననసీమకుఁ బంపం దలంపుసేయునె నాకున్. ౬౩

ఉ. దీపములేక పాడుపడి దీప్తిదొరంగిన యింటిమాడ్కి ను
ద్వ్యాపితచంద్రబింబమయి యాఱడివోయిన మింటిమాడ్కి నీ
పాపును బాసి కీడ్పడిన పాడుతురంగముతోడ నేగతిం
బాపిని బోదు శాక్యపురపాలకుపాలికి రాజబాలకా. ౬౪

సీ. తండ్రి నేగతి వృద్ధుఁ ద్యజియింపఁ గాఁదలంచితివి ధర్మమును నాస్తికుఁడువోలె
వనిత నేగతిఁ బతివ్రత వీడి మఱపుఁగై కొం టుపక్రియ కృతఘ్నుండువోలె
బాంధవం బేరీతిఁ బ్రాపుఁగోరినవారి వదలితి యశము దుర్వ్యసని వోలె
దాది నేపగిది గౌతమిని వర్జించితి నిందువిద్యను బ్రమత్తుండువోలెఁ

తే. గీ. చావుపుట్టువు గల్గు సంసారచక్ర
మునకు భీతిల్లి యివి యన్నియును వదలఁగఁ
దలఁచితివి గాని నీదు పాదములె గతిగ
మనెడు నన్నెట్లు వర్జింప మనసు వుట్టె! ౬౫

క. అనుచుఁ జెనువంతఁ బడు చెన్నుని గని శౌద్ధోదనియు మనోగతి ధైర్య
ప్రణయంబుఁ జేసికొని యిట్లనియెం గుతుకము విరాగ మనుసంధింపన్. ౭౬

వ. పృథగ్గాత్రులగు దేహులయందు నానాభావంబు నియతంబని యెఱింగితేని మద్వి
యోగంబునకు విచారింపకుము. ఎన్ని జన్మంబుల నెం దెందఱితో నిట్టిసంబం
ధంబు లెన్ని యెన్ని వహించితిమో యెఱుంగుదువే, ఏను ముముక్షుమై యి
సన్న్యసించితిఁ గాని యిష్టబంధుద్వేషంబునం గా; దన్యోన్యవివశులగు బాంధ
వుల నెన్నఁటికే నెడఁబాపుటకు మృత్యుదేవత వేచియే యున్నది; నాతోడ
నిన్నుం గొంపోయిన ఫలంబు లేదు. నేను విజ్ఞానం బార్జించిన పిదప నందు
నీకు నొకపాలొసంగువాఁడ నీవీతురంగంబుతోడం గపిలవస్తుపురంబున కరుగుము
విచారింపకు మనికంటకంబుం గాంచి యిట్లనియె.

చ. అడలకు ముష్ణవారి నయ నాంచలపూరిత మూచుఁ జెన్కులం
బడి దిగజాఱ నాల్కుదిగ వంచిపదంబులు నాకఁబోకుఁ గీ
డ్వడకుము నీకు నాకు ఋణబంధము తీఱెను నేఁటి కింక నీ
పడినపరిశ్రమంబు పరిపక్వఫలప్రదమౌ హయీశ్వరా. ౭౭

వ. అనుచు శంఖచక్రగదాదిరేఖావిభ్రాజితం బగుకేలఁ జెన్కుసా ర్లొడలంతయు
నిమిరి నాయపరాధంబు సహింపుము పొమ్మని యానతిచ్చి తనమేని సొమ్ములు
దులిచి వేర్వేఱ నభినుతించుచుఁ జెన్నునిం గని యి ట్లనియె. ౭౮

ఉ. ఈవలయమ్ము లెంతకును హెచ్చు లనం దగదే! ప్రశస్తను
శ్రీ వెలుఁగొందు నీమణులచేరులు గాంచితె, వేయునేల నా
నావిధభూషణంబు లివి నా కిడె మజ్జనకుండు పిన్ననాఁ;
డీవు ధరింపు మీ యిఁక మఱేటికి నా కిట సన్న్యసించితిన్. ౮౦

క. ప్రాణమునకంటె హెచ్చిది దీనిం దీసికొని వేగఁ దెరలిచను మ టం
చానృపనందనుఁ డశ్వముపై నెంతయుఁ బేర్మిఁ జూపి పదపడి యనియెన్. ౮౧

శా. చెన్నా! మజ్జనకుండు నాకయి కడుం జీర్ణించు శోకంబు నా
పన్నేరం డెటులేని శీఘ్రముగ నేవత్తున్ బరిజ్ఞేయమై
యెన్నంగాఁ దగు వస్తువుం దెలిసి నీవీమాటలే తెల్పి త
ద్ఖిన్నస్త్రైజము సంతసంబుఁ గనున ట్లెట్లని సంధింపుమా. ౮౨

వ. అని యనిపిన వాఁడును గరధృతఖలీనం బగు కంటకంబుతోడఁ జనలేక చనలేక
వెనుకఁ జూచుచు రాజపుత్రుని చెయ్యిల కచ్చెరువందుచు వచ్చినత్రోవ
యెఱుంగక కపిలవస్తుపురాభిముఖుండై చనియె. ౯౩

మ. అటు లాచెన్నునిఁ బంపి చేరె నట సిద్ధార్థుండు స్వర్గంబు మా
ఱట నాఁ జెన్నగు బింబిసారుపురికిం బ్రాంతంబునందుం గురు
ట్పటలీపక్వఫలప్రసూననిచయప్రచ్ఛాయధారాలల
త్తటరమ్యాన్నతరత్ననామకకుభృద్దర్యంతరాళస్థలిన్. ౯౪

వ. ఇట్లు ప్రపంచపరమార్థజిజ్ఞాసాకందళితంబగు డెందంబున నమ్మాయాదేవీనంద
నుండు సకలరాజ్యభారంబు పరిత్యజించి యతివేషమ్మున నారత్నగిరి కెలంకులఁ
దిరుగు చున్నంత. ౯౫

తే. గీ. తమమునకుఁ బ్రాణిపోక కాంతలకు జోక
పదనుమాన్పించు నైకపాపపరిపాక
మాకులత్వవిలోలైకఘూకలోక
మేగుదెంచెను నలవోక వేగుఁబోక. ౯౬

చ. తమి యను గోపకాంత భపథంబనుకుండను జ్యోత్స్న పేరి క్షీ
రములను దోడుపెట్టి ఖగరావము కవ్వపుమ్రోఁతగా నిశాం
తమున దధిన్మథించి గళితంబగు వెన్నను ముద్దచేసి త
క్రిమునకు మధ్యఁ జేర్చె ననఁగాఁ దగె వెన్నెల వేగుఁజుక్కయున్. ౯౭

తే. గీ. ఒడ్డు విఱిగి లోనఁబడ్డ గంగావారి
తిరుగఁ బంక మెడలి తేఱునాఁటి
చెలువు గలిగె వెన్నెలలకుఁ బ్రాభాతిక
ప్రభలు మెల్లమెల్ల బలియుకొలఁది. ౯౮

క. మానితమగు వేసమునఁ గళానిధియు నిశీథినీవిలాసినిని దమో
మానం బుడిపి కరంచిన పానుపుపై వలువ యనఁగ భాసిలె నభమున్. ౯౯

ఉ. పడమటికొండ శేటిచెలువ ల్తమమూతులు సాఁచి సాకఁగా
నుడుపతిబింబమందు నెలవుండిన యిత్తి సుఖించెఁ; బ్రాచి య
న్నడఁతుక భాస్కరప్రసవబాధకుఁ దాళక మూల్గుచుండెనా
వెడలెఁ గపోతహుంకృతులు వీనులకుం గడుసొంపు నించుచున్. ౧౦౦

సీ. ఎంతవానికి వచ్చె నెంతదుస్థితి కటా ! యను వెరంగున నెల్లనయ్యె దెసలు
ఇవి రాజసుతులు చేయవలసినపనులు గావు కావంచుఁ గాకంబు లఱచె
జగములం దున్న యజ్ఞాన మింక నశింపఁగల దన్నపగిదిఁ జీఁకట్లు విరిసెఁ
దొలఁగు నీగతి సర్వదుర్మతంబు లటంచు నొడువుపోలికఁ జుక్కలడఁగిపోయె

తే. గీ. దుష్టు లీగతి వాపోవుదు రనురీతి
నెసఁగె సుప్తోద్ధితక్రూర మృగరవంబు
జ్ఞాన ముదయించు నింక నీకరణినసుచు
వింట నుదయించెఁ బిచ్చుక కుంటువేల్పు. ౧౦౧

సీ. భూసురార్ఘ్యప్రదానాసివిచ్ఛిన్నమందేహాసురాసృక్ప్రదీప్తి యనఁగ
నుదయించుచున్న సూర్యుని నెదుర్కొనఁబోవు కమలినీగాఢరాగం బనంగఁ
జక్రవాకీ హృదబ్జమునుండి పైకి వెలలిపాఱు శోకానలం బనంగఁ
బ్రసవవేదన పడు ప్రాచిపై దిగఁదుడ్చి పాఱఁబోసిన రక్తనీరమనఁగ

తే.గీ. నబ్జవైరికి నిసికిఁ బెండ్లైనచోట
జంపతులకైన దేగాటసమయమందు
భూమిపైఁబడినట్టి బుక్కామనంగ
బొలుపువహియించెఁ జక్కఁగాఁ బూర్వసంధ్య. ౧౦౨

చ. కలువలు నిద్రవోవ రతికాంతుఁడు తూపులు మూల వైవఁ జు
క్కలనడఁత్రోవ రక్తతరకాంతులఁ జక్కనగా వలాహకం
బులకుఁ గుసుంభచేలముల పోలిక రా వెలసెం జగంబు క
న్నులకు వచింప నేరని వినోదముగా నునుసంజ తూర్పునన్. ౧౦౩

సీ. హరిహరబ్రహ్మల యాకార మగువేల్పు వేదత్రయీస్వరూపోదయుండు
ఘూకైకదృష్టిసంకోచప్రదకరుండు కోకకాంతల పుణ్యకోరకంబు
పద్మినీకాంతకుఁ బ్రమదమిచ్చు బోజుంగు పండ్రెండురూపులఁ బ్రబలుజాణ
కాలచక్రముఁ ద్రిప్పఁగల నేర్పు గలఱేఁడు గగనలక్ష్మికి వింతగలుగుతొడవు

తే.గీ. ఏకచక్రరథంబునఁ నేగుజోదు
చీఁకటులగొంగ కలువలసిరికి దొంగ
వేవెలుంగులదొర ప్రభవించె లోక
బాంధవుండగు నాసప్తసైంధవుండు. ౧౦౪

చ. తననిసి నేఁచఁబో నిరులు దయ్యముఁ దాన వదల్చి దాని ప
ద్మినివిరులం దళిచ్ఛలము మీఱఁ బగం దగిలించి లేచిపో
యినశశి కోపరక్తి నలినీంద్రకరాహతిఁ గ్రాఁగి నెల్లనై
మునిఁగె నపత్రపం దుదకు మూఁడిన యాపద వార్ధిలోపలన్. ౧౦౫

సీ. నలినకుట్మలశయానమ్ములైన మధువ్రతములు లేచి శుభధ్వనములు సేయఁ
బతులఁ గూడిన జక్కవలు విలాసరసంబుతోఁ గృతజ్ఞతమై నెదుర్కొనంగఁ
జేదోయి నొదలఁజేర్చి భక్తులు శుభస్తుతులు వాడుచు నమస్కృతులు సేయ
వారాంగనానురాగారూఢి పగిది నస్థిరమైన నీరెండ దెసలఁ బ్రాఁక

తే. గీ. నొక్క తేజినిగట్టి రయోద్ధతముగ
నొంటికాల్తేరు పిచ్చుకకుంటు దోల
అస్తభూధరసందర్శనైకదృష్టి
భాస్కరుఁడు మింటితెన్నున బైలువెడలె. ౧౦౬

సీ. పద్మరాగప్రభాపటలిచేఁ బూయంగఁబడిన పోలిక నొప్పెఁ బర్వతములు
అరుణపల్లవచయవ్యాప్తంబులైనట్టి పగిదిఁ బెంపెసలారెఁ బాదపములు
రక్తచందనసమాసక్తనీరంబుల నియతిగాఁ దనరారె నిర్ఝరములు
శోణాంబరగ్రిమ శోభాయమానంబులైన భాతిఁ దనర్చె నఖిల దిశలు

తే.గీ. తపనునారాధనము చేయఁదగినవస్తు
వులను సమకూర్చుకొనియె నీభూపురంధ్రి
యనఁగఁ దనరారె నివి యన్నియును దలంపఁ
బ్రబలి నీరెండఁ దిక్కుల బలియుకోలఁది. ౧౦౭

వ. ఇట్లు జగద్బాంధవుండు సర్వలోచనానందకరంబుగా వెడలుటయు సర్వార్థసిద్ధుండును.

క. దండంబుఁ గావిచేల కమండలువుం దైవమహిమ మార్గంబునయం
దుండం గని తనకై సురతండము పంపె నని వానిఁదాల్చి కడంకన్. ౧౦౮

చ. వెడలిన చిత్రభానురుచివీచిపరంపర మేనిపై వెసం
బడుటకు గాని తద్గిరికిఁ బార్శ్వమునుండియు రాజువీటికై
యడవిఁ గలట్టి యేకపదిసారయుచుం గని వీడు సొచ్చి దో
సెఁడు యవలం గ్రహించె నొకయింటికి యేగి ఘుముద్గకంబుగన్. ౧౦౯

సీ. సరిగంచు నెఱిమించు చల్వవల్వలు దాల్చు లలితుండు కావిశాటులు ధరించెఁ
బైఁడిపాత్రికలందుఁ బరమాన్నము భుజించు రారాజు మాధుకరంబు గుడిచె
దూదిపాన్పులమీఁదఁ దూఁగుటుయ్యేలనూఁగు భోగి తృణాంకురంబుల శయించెఁ
బొలుపారు క్రొత్తపూఁబొదరిండ్ల విహరించు భాగ్యశాలి యరణ్యపటలిఁ దిరిగె

తే. గీ. వెండకన్నును వానకన్నెఱుఁగ కతుల
రత్నసౌధంబులఁ జరించు రాచగున్న
శీతవాతాతపంబులవాతఁ బడుచు
బడుగు జడదారిరాయని పగిదిఁ దిరిగె. ౧౧౧

వ. ఇట్లు సన్న్యాసియై ప్రతిదినంబును రాజగృహపురంబునకుం బోయి యొక్క
గృహంబున యాయావరంబుఁ గొనుచు రత్నగిరిగుహాముఖంబున వసియించు
చున్నంత నటఁ గపిలవస్తుపురంబున. ౧౧౨

తే. గీ. తన్ను వంచించి పతి నిశీథమ్మునందు
నెచటి కేగుటయును నిద్ర నెఱుఁగనట్టి
సతి యశోధర యొప్పటిచందమునను
వేగుఁబోకను మేల్కాంచి వెఱఁగుపడుచు. ౧౧౩

సీ. జగమెల్ల సుప్రకాశము చేయఁగాఁజాలు చంద్రుఁ బాసిన యాకసంబుమాడ్కిఁ
బనివానితనము తోఁపఁగ బిగించిన రతనంబు జాఱిన వలయంబు పగిదిఁ
బ్రతిబింబమును జూపు పటిమంబుగల మించుతళుక్కు గోల్పడిన యద్దంబు భాతి
నెంతైన విలువ చేయింపఁజాలు నీరంబుఁ గోల్పడిన హీరంబు రీతిఁ

తే. గీ. ప్రాణనాథుఁడు లేని తల్పంబు చూచి
'కలలు నిక్కలా ? యంచుఁ దలఁచు నాదు
నేఁడె సిద్ధించె నీనాఁటి పాడుకల
ఫలం'బనుచు నెంచి గుండియ జల్లురనఁగ. ౧౧౪

క. చెలులఁ బిలిచి యడిగిన వారలు 'మేము నెఱుంగ' మనుడు రమణీమణి య
గ్గలమగు శోకభరంబున నలమటఁ గొని మగుడ ధైర్యమంది కడంకన్. ౧౧౫

క. మందురలోనికిఁ జని యందుం దురగము లేక యుంట తోడ్తోడ నతం
డెందేని జనుట యెఱిఁగింపం దారుణదుఃఖభరము పరవశఁజేయన్. ౧౧౬

శా. సంసారంబు పరిత్యజించి యెటకే సన్న్యాసిగాఁబోయె రా
ద్ధాంసంబంచును నిశ్చయించుకొని యాయజ్ఞాక్షి మూర్ఛిల్లె ; ను
త్తంసీభూతములైన పూవు లుపకృత్యం బాత్మలో నెంచి మే
హింసం జెందక యుండఁ దల్పగతిఁజెందె న్నేల నల్ప్రిక్కలన్. ౧౦౭

క. కర్ణాకర్ణికగా నాకర్ణించిరి పౌరులెల్లఁ గలగతి, సతియు
భ్యర్ణమున నుండ నృపసుతపూర్ణశశాంకుండు లేచిపోయె నటంచున్. ౧౦౮

తే. గీ. చంద్రుఁ డస్తావనీభృత్తు చాఁటుపడిన
కాలమున భంగములు గను పాలకడలి
రీతిగా నల్లకల్లోలమై తనర్చెఁ
గపిలవస్తుపురంబు తత్కాలమందు. ౧౦౯

వ. పిదప శుద్ధోదనుండును దదుదంతంబు సేవకముఖంబుగా విని సహామాత్యపురోహి
తుండై కుమారాంతఃపురంబు సొచ్చి యచ్చటి కావలివారల వడిగిన వారును
గుమారబహిర్గమనంబున కచ్చెరువందుచు నిట్లనిరి. ౧౧౦

శా. ద్వారంబుల్ బిగియించి యున్న వెటు లీప్రాకారముల్ దాఁటెనో !
యేరీతి న్మముఁ గన్మొఱంగి చనెనో ! యేమందు మో దేవ ! దౌ
వారంభంబుల కడ్డులే దనుట సత్యంబయ్యె; నాకాశసం
చారంబుం గొని యేగె నంచు మదిలో శంకింతు మర్వీశ్వరా, ౧౧౧

వ. అనవుడు శుద్ధోదనుండును సమానుషకృత్యంబుగాఁ దలఁచుచుఁ బురోహి
తామాత్యుల వంకకుం జూచి 'మీరిరువురుం దగినపరివారంబుతో సకలదేశంబులు
వెదకి కుమారుం దోడ్కొని రండు, మీవచ్చువఱకేనును నన్నపానంబులు విస
ర్జించి యీశ్వరాలయంబునం దగిన బల్యాదిశాంతికక్రియ లొనర్చు చుందు'
ననిన. ౧౧౨

క. వారుం జనిరి నృపాలకుమారాన్వేషంబునకు సమస్తదిశలకున్
ఘోరారణ్యంబులకు సమీరజవంబులగు హరులమీఁదఁ గడంకన్. ౧౧౩

తే. గీ. ఒడ లెఱుంగక మూర్ఛిల్లియున్న యయ్య
శోధరకుఁ దెల్విరా నంత సుదతులెల్ల
నూఱడించిరి మది తాల్మి నోసరించి
పడునవస్థకుఁ దగిన సంభాషణములి: ౧౧౪

సీ. నృపతి యన్నిన యమాత్యపురోహితులు తోడికొని రాకయుందురా యనెడువారు
శాక్యవంశం బింక సరియగుఁ గాఁబోలు నంచు లోలో విలపించువారు
నింత తండ్రియె కాని యితఁడు రేపో నేఁడో మరలివచ్చునటంచుఁ గెరలువారు
నఖిలరాజ్యమువీడి యకట సన్న్యాసి కాఁబోవునే యని మదిఁ బొక్కువారు

తే. గీ. అతిసుకృతవంతుఁడైన శాక్యనరపతికి
రాఁదగినయట్టి దురవస్థ కాదటంచుఁ
జెనఁటిదైవముచేఁత దూషించువారు
నైరి యాబాలగోపాల మఖిలజనులు. ౧౨౫

వ. ఇట్లు కపిలవస్తుపురం బల్లకల్లోలంబుగాఁ గుమారవిరహాయాసంబున నన్నపానాదులు మఱచి చింతించుచున్న దివారాత్రింబు లెఱుఁగఁబడకుండ సప్తదివసంబులు గడచె; నట్లు రాజకుమారునిచే నింటికి ననుపంబడిన యా చెన్నుండు. ౧౨౬

క. మును పోక నిముసంబున కేగిన మార్గము మిగులవంతఁ గీడ్వడుచుం దా
నెనిమిది దినములకు న్నడచెను దురగఖలీన మొక్క చేతం గొనుచున్. ౧౨౭

ఉ. పూరియు ఖానముం దిన కపూర్వముగా సకిలంచుచుం దదా
కారము లోఁ దలంచుచుఁ జొకారము వాసినమోము సారెకు
న్నారెకుఁ దత్తుపోవని దెస న్నిగుడించుచుఁ జేరె సాదితో
వారువ మర్కవర్జితనభంబన నొప్పు పురంబులోనికిన్. ౧౨౮

సీ. కలనైన జంతుహింసలఁ దలంపనివాఁడు వేఁటాడఁ బోవునే విపినములకు ?
నున్నరాజ్యం బేనియును నొల్ల ననువాఁడు వెడలునే రిపురాజ్యవిజయమునకు ?
నందంపు మేడలయందు వర్తిలువాఁడు వసియించునే రిక్తవసతులందుఁ ?
దలిదండ్రులందు మెత్తనిబత్తి గలవాఁడు రాకుండునే యిన్ని రాత్రులకును ?

తే. గీ. అనుచుఁ బలుపలువితముల నాడుకొనుచుఁ
దొలఁగుకన్నీరు పెక్కుకాల్వలుగ సాది
కరధృతఖలీనమగు కంటకంబుఁ జూచి
పౌరులందఱు నొకపెట్టు బారు మనిరి. ౧౨౯

వ. అంత నారాజపుత్రవిరహితంబగు కంటకంబు రాక యొకరి మొకంబున నొకరు విని, ౧౩౦

తే. గీ. వెనుక రాఘవు నడవి కనిపించినట్టి
స్యందనము వెంట సాకేతజనము పగిది

'రాజపుత్రకుఁ డేమాయెరా' యటంచు
నడుగుచును సాది వెనువెంటఁబడిరి జనులు. ౧౩౧

తే. గీ. 'ఏరికేనియు నపకారమెన్నఁడేనిఁ
జేయఁ దలఁపేనిఁ బుట్టని సిద్ధమూర్తి
దేవతాసన్నిభుండు వర్ధిష్ణు వతని
నెచట వసియింపఁజేసితివేమి చెపుమ'. ౧౩౨

మ. అనుచుం దన్నతితంద్రిమై నడుగుపౌరానీకముం జూచి 'హా'
యనుచుం జెన్నఁడు గద్గదస్వరముతోడై మాట తొట్రిల్లఁగా
'మనరాచూలియె కంటకంబు గృహిధర్మంబు న్ననుం గూడ వీ
డెను బాఁ జీమలు తూఱరాని వనవాటిం గ్రూరచిత్తంబునన్'. ౧౩౩

ఉ. నావుడు నెట్టకేలకు మనంబులు క్రుంగఁగ వానిపల్కు ల
ట్టే వినినట్టి పౌరులు పెల్లు మనన్ హృదయంబు వ్రయ్యలై
పోవఁగ మూర్ఛ చెంది పడిపోయిరి; తక్కిన పౌరు లట్లె వా
పోవుచు వానివెంటఁ బడిపోయిరి శూన్యతరేంద్రియంబుగన్. ౧౩౪

ఉ. 'ఎచ్చోటు రాజసూతి వసియించిన దయ్యదియే పురంబు సు,
మ్మెచ్చట రాజసూతి వసియింపని దయ్యదియే వనమ్ము మా,
కెచ్చట నుండెనో యిచటి కేదెస పోయెద' మంచు వేడఁగాఁ
జొచ్చిరి దారికడ్డముగుచు స్మృతిలేనిగతిం దురంగముల్. ౧౩౫

వ. ఇట్లు సముద్రంబు వెల్లివిరిసినగతిఁ దండోపతండంబులుగా నిండినపౌరమండలం బెడమీక యుండు రాజమార్గంబునం బోవుచుండ గవాక్షమార్గంబులు తెఱచి.

తే. గీ. రాఁగలం డనునాస నిరాశగాఁగ
రాజపుత్రుండు లేని వార్యమును జూచి
యట్టె వాపోవు తరుణుల యాననములు
పట్టపగలింటి చంద్రులభాతిఁ దనరె. ౧౩౬

చ. తనయుఁడు రాఁగలండులకు దైవగృహంబున నొక్కదీక్ష గై
కొని తపమాచరించుచు సగోత్రులతోడఁ బురోహితుండు చె
ప్పినగతి శాంతికక్రియలు వేయువిధంబులఁ జేయుచుండె వ
ల్వని పెనువంతతోఁ గపిలవస్తుపురీంద్రుఁడు ఖిన్నచిత్తుఁడై. ౧౩౭

క. తనకేనిం బగ అనిఁ జంపిన వాజిం గొంచు సాది వీటికిఁ జనుదెం
చి వగతిఁ గన్నీ రొలుకుచుఁ జనియెం జెన్నొందు రాజసద్మంబునకున్. ౧౩౯

వ. ఇట్లు రాజగృహంబుం బ్రవేశించి కంటకంబు న్నిజాధిష్ఠానంబునం గట్టిపెట్టించి నంత నదియుం బృష్ఠదేశం బదల్చుచు రాజపుత్రవిరహవేదనాసూచకంబుగ బిట్టు సకిలించినఁ దదారావంబునకుం బంజరస్థంబులగు శుకపికపారావతాదిపక్షిగణం బులయుఁ దక్కిన హయంబులయు హాహారవంబులు విని యంతిపురిపారికలు తమ కాంతుండు చనుదెంచె నని వచ్చి యతిప్రహర్షంబు దుఃఖంబుగాఁ బరిణమింప మూర్ఛిల్లిరి. ౧౪౦

చ. తొలకరి వారివాహములతో యము వెల్వడి యేగుదెంచు చం
చలలతెఱంగునం గృహము చయ్యన వెల్వడి చెల్వ లందఱున్
బిలబిల నేగుదెంచి ధరణీవరసూనుని రామి మోములున్
వెలవెలఁబాఱ మూర్ఛిలిరి వేఁడికిఁ గందినతీవ లట్లుగన్. ౧౪౧

చ. బుడుత నరేంద్రుఁ డిల్వెడలిపోయినగాడిగ సంస్కరింపమిం
జడముడి వీడిపోయియును జందిరరేకలు కన్నుమాసియున్
గడిఁది వెడంద కన్నుఁగవ కాటుక మాసియు నందమైన య
ప్పడఁతుల మోము లన్నియుఁ బ్రభాతసితోత్పలకాంతులం దగెన్. * ౧౪౨

సీ. సహజారుణములైన చరణంబులకుఁ బాసి దొరలు బంగారునూపురము లొకట
నచ్ఛంబులగు చెక్కుటద్దంబులకుఁ బాసి గళితంబులైన కుండలము లొకట
గుత్తంబులైన వక్షోజంబులకుఁ బాసి భ్రష్టంబులైన హారంబు లొకట
నందంబులైనట్టి హస్తంబులకుఁ బాసి స్ఖలితంబులైన కంకణము లొకట

తే. గీ. సైకతంబుల కెనయైనజఘనములకుఁ
బాసి జాఱిన మొలనూలప్రిణము లొకటఁ
బడఁగ విలపింపసాగి రప్పడఁతు లెల్ల
మేల మాఁబోతు విడచిన యాలపగిది. ౧౪౩

మ. జననింబాసిన నాఁటఁగోలెఁ గడువాత్సల్యంబుతో నెత్తి పెం
చిన యా రెండవరాజపత్నియు సితాసిచ్ఛిన్నమైపడ్డ లే
యనఁటింబోలెఁ బడెం గుమారవిరహాయాసంబుచే తేఁగకుం
డనుం గూడికలేని యాపుగతి పిత్సా యంచు వాపోవుచున్. ౧౪౪

తే. గీ. తోలఁకుఁ గన్నీరుగల వెలందుకల యాన
నముల కతమున నా రాచ నగరమపుడు
వానచినుకులు రేకులపైన జాఱు
తమ్మిపూలున్న కొలను చందమునఁ బొలిచె. ౧౪౫

చ. ఎడమఱి చందిరంబులయి వృత్తములై పొలకండగట్టి క
న్నడని నరంబులున్ నగలుబాసిన వ్రేళులు గల్గు చేతులం
దడఁబడ బొమ్మ బాఁదుకొను తామరసాక్షుల రీతిఁజూడఁ జొ
ప్పడెఁ బవమానధూతనిజపల్లవతాడితవల్లికాకృతిన్. ౧౪౬

తే. గీ. మారుతాహతకమలకుట్మలశయాన
చక్రమిథునంబులైన నిర్ఘురిణులట్లు
పరఁగి రిరుగేల బొమ్మలుబాఁదుకొనుచుఁ
గదలు చన్గవకలిగిన కాంతలపుడు. ౧౪౭

వ. ఇట్లంతిపురివారందరు వందురుచుఁ జింతాక్రాంతలై మందిరంబులు విడిచి మం
దురకడ కరుదెంచి కంటకంబుం జెన్నునింగాంచి పరిపరివిధములఁ గుమారుని
వృత్తాంతం బడుగుచున్నంత నాయశోధరయు ౧౪౮

సీ. కుచములమీఁది కుంకుమపూఁత బురదగాఁ గరఁగించి కన్నీరుకాల్వ గట్ట
నిష్కారణక్రోధనిర్వాహకము లైన కొలికికన్నులు నల్లఁగ్రమ్మరింప
వెనుదీయఁగారాని వేఁడినిట్టూర్పుల వలుద చన్నుందోయి వాడుడోఁపఁ
బొంగుపొంగున వచ్చి పొరలు వల్వనివంత గదియించి కంఠగద్గదికఁ జూపఁ

తే. గీ. గంపమునఁ గాలుచేయు గద్గద పడఁక
నిముసమైనను నొకచోట నిలువలేక
కాంత లందఱు విలపించు కడకువచ్చి
కంటకముఁగాంచి యిట్లనెఁ గరుణ మొలుక. ౧౪౯

తే. గీ. ఒడ లెఱుంగని నిద్రలోనున్నవేళఁ
జనియె నాప్రాణనాథుండు నను మొఱంగి;
యీవుఁ జెన్నుండు వచ్చితి, రేలరాఁడు
నాప్రియుఁడు చెప్పుమమ్మ? కంటకముకాన ! ౧౫౦

చ. నడినిశఁ బాన్పుమీఁదఁ గరుణామయుఁడై నిదురించువాని రా
బుడుతను బుద్ధిలే కడవి మోకలపా లొనరించి పచ్చియుం
బుడిబుడియేడ్పు లేడ్చుచును బొంపిరివోవు విచార మున్నత
త్తడివలె నిత్తఱిం బ్రతిపదంబును బొత్తున మోసపుత్తువే. ౧౫౧

క. పతియెడ విశ్వాసముగల మతిగలదానవని నిన్ను మన్నించితి దు
ర్మతి నెచటికిఁ బంపిన సంగతియును నాతోడఁ జెప్పఁగదవే వాజీ. ౧౫౨

క. సకిలింపవు కన్నీరిఁకఁ బ్రకటింపవు నీదుకోర్కె పండెంగద ! నా
యకు నెడపితి వింతటి కంటకమా ? నామీఁద నక్కటా, కంటకమా !

ఆ. వె. తెలివిలేని స్నేహితులు గల్గుటయకంటెఁ
దెలివిగల్గు శత్రువులమ మేలు
మిత్రరూపమైన శత్రువవై శాక్య
వంశ మంతరింప వచ్చితీవు. ౧౫౪

చ. అవిరతబాష్పపాతగమితారుణభావములైన కన్నులున్
రవణము లుజ్జగించి నునురాణనుఁ బాసినమేనుఁ గల్గునీ
యువిదలు నీకతంబున నలోయని యేడ్చుచు భర్తయుండియున్
ధవుఁడు గతించియుండిన యనాథల చందముఁబొంది రర్వమా. ౧౫౫

చ. మగఁటిమి లేని యీ తెలివిమాలిన కృత్యముఁజేసి యిప్పుడి
ప్పగిది నరేంద్రసద్మ మద్రువన్ సకిలించిన నేమిలాభ ? మ
మ్మగల విభూషణంబు ధృతిమంతునిఁ దోడ్కొని పోవువేళ నీ
దగడలు కూలిపోయెనె ? తదా సకిలించిన మేము లేవమే ?. ౧౫౬

క. తెలవలుఁ బరిచారికలందొఱుఁ గూర్కొనవేళ నామనోరథమును నో
ప్పరికించి ముచ్చిలఁగ నేడ్తెఱ నీమది కెట్లు సంఘటిల్లెను బాబా. ౧౫౭

క. అని యిట్లు గుల్లముంగని కనికర ముట్టిపడఁ బల్కఁగాఁ జెన్నొంద
వనితామణితో నిట్లని వినిపించెం గతము వినయవినమితముఖుఁడై. ౧౫౮

ఆ. వె. నేను గంటకమ్ము నిందింపఁగాఁ దగ
మమ్మ! కేవలము నిరాగసులము
ప్రభువు దెసఁ గృతజ్ఞభావంబు గలవార
మఘముఁ జేయనోపమమ్మ ! యెపుడు. ౧౫౯

క. అద్దమరాతిరికడ నాయొద్దకుఁ జనుదెంచి తేజి నొగ్గు మటంచున్
మద్దేవుఁడు పల్కఁగ నే మొద్దుగతిన్ మాఱుపద్ది మొఱ్ఱిడనైతిన్. ౧౬౦

వ. పదంపడి వల దని నాకుం దోఁచిన పల్కులు పల్కినను వినక యమ్మహారాజా
శాసనం బుల్లంఘింపఁ దగ దని యెంచి దైవప్రేరణంజేసి తురంగమం బాయి
తంబుఁ గావించితి, నదియు విశృంఖలంబుగా ఖురంబులం బుడమి నవల్చినను
హేషాస్వనంబుల నాకాశంబుఁ బూరించినను దవానాగంబులు దై పటలంబునం జేసి
యెవ్వరికి నశ్రుతంబులయ్యె నంత నారాజపుత్త్రుండును. ౧౬౧

శా. ఉల్లాసంబునఁ దేజినెక్కి సురలో హా యంచుఁ బైఁ బుష్పముల్
చల్ల, న్నొకచెంతఁ బోవఁగ, ఖురస్వానంబు లేకుండ ను
ద్యల్లీలం ద్రుటిలోనఁ జేరె నొకగాఢారణ్యదేశంబు; నా
తల్లీ! యే మని విన్నవింపఁగలఁ దద్దైవప్రభావమ్ములన్. ౧౬౨

చ. పదపడి మేనఁ గల్గు తనబాహుపురుల్ మొదలైన సొమ్ములన్
విదలిచి నాకొసంగి యడవిం జనుచు న్ననుఁజూచి పల్కె ‘ నే
వదలితి నోరి! యింక గృహవర్తనము, న్నినుఁ, గంటకంబునుం
బదిలముగాఁగఁ బొం’ డనియె, మాటలవెంబడిఁ గన్నొఱంగుచున్. ౧౬౩

వ. అని తదీయ భూషణవ్రాతంబుఁ జైఁజెట్టిన నత్తలోదరు బుత్తలపాటుమాని తత్ప్రి
భావంబున కచ్చెరువందుచు సన్న్యస్తుం డయ్యె నని నిశ్చయించి; రంతఁ జిరకాల
పరిపోషణానుయాత్రప్రేమావేశంబు మరల్పలేక గౌతమి యనురాజపత్ని యిట్లు
విలపింపం దొడంగె. ౧౬౪

ఉ. నీలము లై సమంబు లయి నిగ్గులుదేఱి దళంబులై పృథ
గ్భ్మాలములైన నీకురులకు న్నృపనందన! మంచి గందపుం
దైలము రాచి దువ్వి పువుదండలు దారిచి మేలు సేయఁగాఁ
బోలును గాని యిప్పగిది ముండనముం బొనరింపఁ బోలునే. ౧౬౫

ఉ. మేలికడానిఁ బోలు నును మేని హొరంగు, వెడందఱొమ్ము, మో
కాళ్ళుల కంటు చేతులచొకారము, సింగమువంటి లావునుం,
గీల నడంచు కుత్తుకయు, గిత్తకనుంగవ పంక్తి కన్నులుం
గ్రాలు నరేంద్రసూతి కఁటరా! విధి వ్రాసె వనప్రచారముల్. ౧౬౬

తే. గీ. నీవు పొందంగఁదగిన పుణ్యంబులేమి
వసుధ నిక్కము దురదృష్టవంతురాలు
జగతి నెంతటి పుణ్యంబు సలుపకున్నఁ
బ్రజకు దొరకునె నీవంటి రాజు కొడుక! ౧౬౭

చ. హిమరుచిఁ గేరు గోరులును వృత్తములై తగు వ్రేళ్లు గూఢగు
ల్ఫములును లేఁత కెంజిగురు వంటి మృదుత్వము నిప్పుపూవుతో
సమమగు నాకృతు ల్గలిగి సర్వనరేంద్రనతంబులైన పా
దములు సహించునే యుపలదంతురఘోరవనప్రచారముల్! ౧౬౮

క. కులమును వయసును రూపును బలమును దేజమును బాహుపాటవమును లోఁ
దలఁచిన నీఁదగు నీకుం గలనైనను పిచ్చమెత్తఁగాఁదగు నయ్యా? ౧౬౯

తే. గీ. సర్వశృంగారితంబైన సౌధ మందుఁ
బఱపుగద్దియ మంచంబుపై సుఖించు
రాజసము గల్గునీమే నరణ్యమందుఁ
జలికి వానకు నెండకు సైఁచునయ్యా? ౧౭౦

తే. గీ. అనుచు నెల్గెత్తి బిట్టు రోదనముఁ జేయు
గౌతమిం గని తక్కిన కాంత లెల్లఁ
దుంగిలచ్యవమానమరందబిందు
భరితకుసుమంబు లైనట్టి వ్రతతులైరి. ౧౭౧

తే. గీ. చక్రవాకంబుఁ బాసిన చక్రవాకి
పగిది సారెకు గద్గదస్వరము తోడ
గౌతమీరోదనంబునఁ గడుపు పగిలి
మరల విలపించె నాయశోధరయు మిగుల. ౧౭౨

తే. గీ. అగ్నిసాక్షిగఁ బరిణయమాడినట్టి
ధర్మపత్నిని వదలిన తపము తపమె?
ధర్మమునఁ గామమునఁ దాఁటఁదగ దటంచుఁ
బలుకరే మున్ను పెద్దలు ప్రాణనాథ! ౧౭౩

క. మీవంగడంపుఁ దొల్లిఁటి భూవరులను వినవె? రాజ్యమును విడిచి యర
ణ్యావాసముఁ జేయంగాఁ బోవుతఱిన్ సతులతోడఁ బోయి రనుటయున్. ౧౭౪

శా. శ్రౌతస్మార్తములైన కర్మముల భార్యాయుక్తుఁడై సేస్తు దీ
స్వాతంత్ర్యంబు లొనర్పఁ బాడి యని శాస్త్రంబుల్ విధింపన్ భవ
చ్చేతం బెట్లు ననుం ద్యజించె గుణరాశీ ? నాకు రా మాను నే,
నీతో నుండని యంతమాత్రన భవన్నిష్ఠాతపోలాభముల్ ? ౧౭౫.

చ. తెలిసినవాఁడ వౌదువు, సుధీమణి వౌదువు, ధర్మచింతయుం
గలిగినవాఁడ వౌదువు, మనఃప్రియకృత్యుఁడ వౌదు వైన నా
తలఁపునఁ గల్గుసందియము దాఁపక చెప్పవె ; నీ త్రిలోకమం
దలి విరిఁబోండ్ల చెల్వముఁ గనం జనినాఁడవు ప్రాణనాయకా. ౧౭౬

తే. గీ. అప్సరస్స్త్రీల సౌందర్యమరయ నింద్ర
లోకమేగితి వంచు నాలోచనంబుఁ
బూనఁ దగ ; జేల యన, వారలైన నన్ను
దాదివనితలకంటె సౌందర్యవతులె ? ౧౭౭

క. తపమున కేగితి వనునొక నెపమును నీయెడ విచారణీయంబు చిరా
దుపచితమగు నాయందలి కృపయుం బేర్మియును నేసగింపందగ మే. ౧౭౮

క. త్రిదివోపభోగముల నా మదిఁ గోరఁబోదు సులభమార్గం బగుటన్
బదివేలకుఁ గోరెద నీముదిత నగుట యెన్ని జన్మముల నేని సఖా. ౧౭౯

సీ. తమ్మిపూరేకుచందము గల్గి చెవి దాఁకు వెడఁదకన్నుం దోయి యెడఁగు తోడ
నిండుజాబిల్లి వెన్నెలవంటి చిఱునవ్వుఁ బొలకించు కెమ్మోవి కులుకుతోడఁ
గొదమచందురుఁబోలెఁ గొమరారు నుదురైన చదురు గల్గిన సొగసుదురుతోడఁ
గండుఁదుమ్మెద తెక్కగమి చెల్వమును బిల్వ సాగు నూనూఁగుమీసములతోడఁ

తే. గీ. జక్కఁదనమున కిక్కయై చంద్రబింబ
మునకు సహపాఠియైన నీమొగము నింకఁ
బడయ నేరని పరమనిర్భాగ్యురాలి
తనము నేయునె దయమాలి తమ్మిచూలి ?

ఉ. భాసురశీలునిన్ మగని భావజతుల్యవిలాసరూపవి
న్యాసుని బాసి యీసరణి నాకు ఘటించిన శోకవహ్నికిం
బాసటగాఁగ నామనము ప్రయ్యలు గాక మఱింతఁ గాలఁగాఁ
జేసెను రాతనో, యినుము చేతనొ ? ధాత దయానుపేతుఁడై. ౧౮౦

మ. అనుచున్ మూర్ఛిలు నేడ్చుఁ ద్రేలు వితతాయాసంబునం బొక్కు 'హా
యనుఁ, 'గట్టా మగవారికిం గరుణలేదా ?' యంచు యోజించు, 'న
న్ననదం జేసితె దైవమా ?' యను, 'దయాస్వాంతుండు గాకెంతలో
మనముం ద్రిప్పఁగ నేర్చెనో !' యను, 'మహాత్మా ! పోవరాదా !' యనున్. ౧౫౨

చ. కలికితనంబుఁ బాసి యిటు కంటికి మంటికి నేకధారగాఁ
గలవరమందుచున్న నృపకాంతను గన్గొని చెంతనున్న కాం
తలును మఱింత గద్గదఘనంబుగ నూరడఁ బల్కి రేడ్చుచున్
దొలకరివాన తాఁకుఁగని తూలిన తమ్ములఁ బోలు మోములన్. ౧౫౩

ఉ. ఓదన ముజ్జగించి పగయున్ విషనాడి సుతుండు రాఁగ శు
ద్ధోదనుఁ డెంతయుం జపము హోమము సేయుచు దేవళంబునం
గాదిలిచూలి రాక తన కంటకముం దనసాది నింటికిం
బోఁదరలించె నన్న సతి పొల్పులుచు న్విని నేల మూర్ఛిలెన్. ౧౫౪

వ. ఇట్లు మూర్ఛిల్లి కొంతతడవునకుఁ దెప్పిరిలి యొనర్చుచున్న పూజాపురస్కారం
బులు మఱచి చింతాక్రాంతకాంతాశతయుతంబుగఁ గంటకంబుం జెన్నుండు
నున్నచోటికిం బరివారపరిస్కృతంబుగఁ జని యా చెన్నునివలనఁ గలతెఱం
గెఱింగి దైవవశంబునకుఁ జింతించుచు వంశక్షయంబునకు వందురు చున్నంత
నాకాశవాణివలన యశోధరాగర్భంబున నొక సుతుం డుదయింపఁగలఁ డను
పలుకు జీవితాశం బుట్టింపఁ దత్కాలంబు ప్రతీక్షించుచుఁ గపిలవస్తుపురంబున
నుండె ; నచట రాజగృహపురంబున ౧౫౫

చ. ప్రతిదినమట్లు భిక్షకయి వచ్చు యతీంద్రు మహానుభావయో
గ్యతలను పౌరకామినుల కందఱకుం దగఁ దెల్పు ధ్యానని
ష్ఠత గుఱిచూపు నేత్రములసౌష్ఠవముం భగవద్ఘనాంశర
క్షితనవరోచిరాగమవిశిష్టమనోహరవక్త్రభాగముల్. ౧౫౬

ఉ. శాటికఁ గన్నులద్దుకొని చాఁగిలి మ్రొక్కుఁడటంచుఁ బుత్రులం
బోటులు కొంద ఱంపి యతిపుంగవునిం బ్రణమింపఁజేతు ; రే
నాఁటికిఁ జేటు రాకునికి నారులు కొంద ఱొసంగుచుందు ర
వ్వీటికి వచ్చువేళఁ గనుపెట్టి తమంతటఁ దాము బిచ్చముల్. ౧౫౭

మ. పురకన్యల్ తమ నెట్టిప్రాయపు సురూపుల్ వచ్చి కాంక్షించినన్
జిరకాలంబుననుండి డెందమున్న కాచెల్వంబు సంధింప, గ

ట్టిరు బిచ్చమ్మున కప్పురిం దిరుగు శాటీధారునిం జూచి సుం
దరుఁ డంచుం బలికెఁగాఁ దలంతు రఁట! తత్సౌందర్య మింతింతయే. ౧౫౮

శా. బత్తిం బెంపునఁ బేర్మిఁ గౌరవమునం బల్మాఱుఁ దన్నుం దదా
యత్తత్వంబునఁ బూజసేయు పురకన్యాసంఘముం జూచి త
చ్చిత్తం బేకగతిం జలింపకయ భాసిల్లుం జగద్వంద్యసం
పత్తిం బొందుట కేమియబ్బురము తద్వైరాగ్యధారాలతల్ ? ౧౫౯

క. ప్రత్యహ మీతెఱఁగునఁ దత్రత్యచిరంటీజనైకదత్తయవాగా
సాత్యంతవారితక్షుత్కృత్యుండై మరల రత్నగిరి దరికరుగున్. ౧౬౦

సీ. అశనాయ నిరసించి యాహారములు త్యజించి శరీరము కృశింపఁజేయువారు
రక్తమాంసంబుల రహియించు దేహ మాత్మకు విరోధియటంచుఁ దలఁచువారు
మనమున నెద్దియో మనన చేసెడిభంగిఁ దెలుపు దైన్యంబునఁ గలఁగువారు
మాంసము జ్ఞానసంపత్తికై బాధింపఁ దగిన వస్తువటంచుఁ బొగులువారు

తే. గీ. నైనయోగులఁ గొందఱ నవనిధరద
రీముఖంబుల నుండువారిని మహాత్ము
లైనవారినిఁ గనియె నొకప్పు డచట
నట్టిటుఁ జరించు శుద్ధోదనాత్మజుండు. ౧౬౧

క. అవయవములు కృశియింపం జివికినకీళ్లోలయ రెండుచేతులు జోడిం
చి వినుదెస మొగంబగు యోగివరులఁ గనుఁగొనియె నొండు కెలన నతఁ డొగిన్.

సీ. వ్రేళులు మడఁచి కేల్బిగియింప నఱచేత గోళ్లుఁదూటినవారుకొంద, ఱాయ
సములైన సూదుల నమరు పావాలపై నడుగుల నెలకొల్పి నడుచువారు
కొందఱు, వాఁడిరాళ్లోని ముఖోరూరస్థలముల మోఁదికొని గాయములు సేసి
కొనువారు కొందఱు, గొంతునఁ బాములఁ దగిలించుకొని కేళినెగడువారు

తే. గీ. కొందఱు శ్మశాన మందున్నశవవసనంపుఁ
బేలికల మెడధరియించి పీనుఁగులను
జేతు లరచాఁచి కౌఁగిలించికొనువారు
కొంద ఱెదురైరి యారాజనందనునకు. ౧౬౩

వ. మఱియుం గాయమ్ములఁ గంటకంబులు గ్రుచ్చుకొనువారును శివశివా యని
యఱచువారును దండులమ్ములు జొన్నలు మొదలగు పదార్థమ్ములు చేఁదగు

వనపత్రములతోఁ గలపి నమలువారును నయనమ్ములఁ గంటకంబులఁ బొడిచి కొనువారును నాలుకలు తెగఁగోసికొనువారును గాళ్ళులు బంధించుకొనువారును గర్ణంబులకుం జెవిటితన మాపాదించుకొనువారునైన యోగుల ననేకులఁగాంచి డెందం బాశ్చర్యరసనిమగ్నం బగుడు నికటమ్మునకుం జని యందొకవృద్ధుం గాంచి సర్వార్థసిద్ధుం డిట్లనియె.

మ. బహుకాలమ్ముననుండి యీగిరిదరీభాగంబులందుండి స
న్నహనంబుం బొనరించుచుంటి ఘనవిజ్ఞానాప్తికై మీరు నీ
గుహలో దేహము గాసిపెట్టుటయుఁ గన్గొందు న్మునీంద్రా! మనం
బహహా వొందఁగఁ జేయుచున్నవిట మీయారబ్ధదుష్కృత్యముల్. ౧౯౫

క. మానవదేహము కడుదుఃఖానుభవం బనుభవింపనగునది, మీర
ద్దాని మఱియింత దుఃఖరసానుగత మొనర్పఁ బాడియగునె మహాత్మా. ౧౯౬

క. అని పల్కిన సిద్ధార్థునిఁ గని తన్ముఖరోచిరాప్తిఁగనుఁగొనుచు మహా
త్మునిఁగా నెఱింగి యిట్లనియెను మెల్లన యోగివరుఁడు మృదువచనములన్.

ఉ. "ఇట్టి శరీరము న్మృగుల నీగతిఁ గష్టముపాలు సేయుటం
బట్టి పరంబున న్నరకబాధల నన్ని సహింపవచ్చు నాఁ
డట్టిపవిత్రియాసము ల్మనకు నబ్బఁగఁజేసెడి వేల్పు లబ్బురం
బుట్టిపడంగ నేఁడ మన కొయ్యననిత్తురు పుణ్యలోకముల్. ౧౯౭

క. బాధించినఁ గాయము పడు బాధలు మానవుల పాపపటలం బడఁచున్
బాధ యనుకొనవిఁ బడిన సుఖాధికలోకముల కాత్మయరుగుం బిదపన్. ౧౯౮

తే. గీ. అనుచు మామత సిద్ధాంత మదియె మేము
నాచరించుచు నున్నార" మనఁగ; రాజ
నందనుఁడు కటకటఁబడి నగుచు యోగి
వరున కిట్లనెఁ దత్త్వంబుఁగఁజప నెంచి. ౨౦౦

మ. వెలకుం గొన్నపదార్థ మెయ్యదియు నుర్విం దగ్గిపోకుండ, దీ
రలు స్వర్గమ్మును దేహకష్టమను సద్ద్రవ్యమ్ము చేఁ గొన్నఁ ద
త్ఫల మెల్లన్వ్యయ మైనచో మరల నేతత్ప్రాప్తి చే దుఃఖభా
క్కులు గాకుందురె నశ్వరంబులగు కోర్కుల్గోరఁగాఁ జెల్లునే. ౨౦౧

సీ. యోగీంద్ర ! యెవ్వఁడే నూర్ధ్వలోకంబులు ప్రాపించు మనుజుఁడు పడకమానఁ ;
డిందులకై యేను దృష్టాంత మొక్కటి వాక్రుత్తు నవధారు: వార్ధిలోని
సలిల మంతయును బాష్పస్వరూపమున నూర్ధ్వంబున కేగ మేఘం బటందుఁ
దానినే కద, గాలితాఁకుచే నదియ చెల్లాచెద రగుచు జలముగఁబుడమి

తే. గీ. మీఁదఁబడి యేఱుగట్టుచు మిఱుపల్ల
మేకముగఁజేసి బురదతో నేకభావ
మంది వారాశిలోనిక యరుగు పగిది
నూర్ధ్వగామికి స్వస్థాన మొదవు మరల.

సీ. అన, విని యోగి యిట్లనియె, 'మహాత్మ ! నీవనినసంగతి నిజమానో యేమొ
నేనెఱుంగను ; మాకు నిశ్చయజ్ఞానంబు లేమి నిట్లయితిమి మే; మయినను
గుదికట్టువలె నాత్మకును బైకెగిరిపోవ నీకుండఁ బ్రతిబంధ మెసఁగఁజేయు
నీశరీరము మాకనిష్టంబు ; రాత్రివోయిన వెన్కఁ బవలు వచ్చిన విధమున ;

తే. గీ. రోద చనినమీఁద నిశ్శబ్ద మొదవు పగిది
దేహ మీరీతి మిగుల బాధింతుమేని
గష్ట మెడలి పదపడి సుఖంబ యాత్మ
కొదవు నని మాయభిప్రాయమిది నిజంబు'. ౨౦౩

మ. అని యోగీంద్రుఁడు పల్కుపల్కులను సిద్ధార్థుండు యోజించి యి
ట్లనియె, 'నీమ్రరనినట్టి సౌఖ్యమదియు నాన్యంతం బగున్; లక్షహా
యనము లోఁ వోయినఁ బోవుఁగాక యెపుడే నంతంబు లేకుండు దా
నిని లోకంబునఁ జెందువార్గ లిగి రేనిం జెప్పఁడా యొప్పుగన్'. ౨౦౪

వ. అనుడుఁ, బరమాత్మ యొక్కండు నశ్వరుండు గాఁడనియుఁ దదానందం బొక్కటి
శాశ్వతం బనియుఁ దదితరమ్ములు సాంతమ్ములనియు నొడివిన జడదారి కమ్మ
యాదేవేయుం డి ట్లనియె. ౨౦౫

మ. అకటా, యోగివరేణ్య ! తెల్వియును ధైర్యమ్ము న్బవిత్రత్వముం
బ్రకటత్వంబును గల్గుమీర లిటు స్వప్నప్రాయమై యస్థిరా
త్మకమై యొప్పు సుఖమ్ముఁ గోరి పరతత్త్వజ్ఞానసంపత్తి సా
ధకమై యొప్పు శరీరముం బ్రబలబాధాయుక్తిఁ గారింతురే. ౨౦౬

తే. గీ. ఆత్మయందలి ప్రేమ దేహమ్మునందుఁ
గల యనిష్టత్వ మీరీతిఁగా నొనర్పుఁ
గాని మీ జీవయాత్రకుఁ గారణంబు
దేహ మెడలినఁ దత్త్వంబుఁ దెలియఁగలరె ? ౨౦౭

క. ఈదేహం బీయాత్మకు నేస్తియొ యొక కారణమున నిల్లై యుండె ;
నెమ్మదనిఁక నొక్కయింటం బోరిచి యొనర్చుటకుఁ గూలఁ ద్రోతురె దీనిన్ ౨౦౮

వ. అని యుపదేశించిన యారాజపుత్రున కాయోగు లిట్లనిరి. ౨౦౯

క. ఈమార్గము మంచిదియని యే మవలంబించినార మిదికానియెడన్
నీమదికి న్నచ్చిన మతి యేమార్గంబైనఁ దెల్పు మెఱుక గలిగినన్. ౨౧౦

వ. నీవుం దెలియదేని మిన్నక పొమ్మనిన సిద్ధార్థుం డచ్చోటువాసి మనమ్మున నిట్లు వితర్కించె.

ఉ. ఏలొకో వీరు కష్టముల కిల్లగు దేహ మొగిన్ మఱింత క
ష్టాలకుఁ బాలుచేయుటకు సన్నహనం బొనరించుచుండి యీ
కీలక మింతమాత్రఁ బరికింపరు బాధలువెట్టి దేహముం
గూలఁగఁ ద్రోచియు న్బ్రతుకఁ గోరెద రక్కట బుద్ధిహీనులై. ౨౧౨

సీ. మనుజులసుఖము గన్గొనలేని వేల్పులఁ బేర్మిమై సంతోష పెట్టుకొఱకొ
యిహలోకకష్టమ్ము లెనసి నారకబాధలను సహించుట నేర్చుకొనుటకొఱకొ
తనువు చిక్కినతఱిఁ దప్పించుకొనిపోవు టాత్మకు సుఖమను నాశకొఱకొ
దయలేని తప్పువ్రాఁతల మతగ్రంథంబులందుఁ గృతజ్ఞతఁ జెందుకొఱకొ

తే. గీ. తనువులను రోయుచున్నారు తపసు లకట !
మీకుఁ గలతెల్వి వీరికి లేకపోయె
వృక్షతతులార ! పువులార ! పక్షులార !
రోయుచున్నారె మీరు మీకాయములను. ౨౧౩

చ. పరివిమలచిత్తు లందురు పశుపక్షిమృగాదులకంటె సర్వమా
నవులును, దేహ మేలొకొ వినాశముచేయఁగరా దటంచు యో
గివరులు డెందమందుఁ బరికింపరు పక్షులపాటి యైన నం
చు వికలచిత్తుఁడై తిరుగుచుం గిరిపై వసియించెఁ బ్రాగ్గతిన్. ౨౧౪

చ. వనితయు నచ్చటం గపిలవస్తుపురంబునఁ జూలునిండి ప
ట్టనమునఁ బల్లెలం జను లెడందల సంతసమందుచుండఁగాఁ
దనకు సుతుండు లేనికొఱంతం దిగవ్రావుచు శాక్యవృద్ధు నె
మ్మనమునఁ బొంగ నొక్కనిఁ గుమారునిఁ గాంచె శుభక్రమంబునన్. ౨౧౫

తే, గీ. పెద్దయగు పుత్రుఁ డిప్పుడు పిన్నయయ్యె
నంచు శుద్ధోదనుఁడు పేర్మిఁ బెంచుచుండఁ
బిన్న జాబిల్లి వితమునఁ బెరుఁగుచుండె
రాహులుం డను పేర నారాజసుతుఁడు. ౨౧౬

## —♦ ఆశ్వాసాంతము. ♦—

క. పెద్దాడవంశజాత ! సముద్దామయశస్సమేత ! బుధదారిద్రీ
కుద్దాలీభూతసముద్యద్దయ ! కవిమిత్ర ! తిరుపతంబాపుత్రా ! ౨౧౭

మ. ధరణీదేవకుమార ! భూవర ! సముద్యద్గౌతమీతీరసు
స్థిరరాజ్యాతిశయా ! ప్రమోదలహరీదేదీప్యమానాశయా !
తరుణీసూనశరా ! ప్రవీర! పరకాంతాసోదరా ! కీర్తిభా
స్వర ! కార్తస్వరసన్నిభాపఘన ! కృష్ణారాయభూమీశ్వరా ! ౨౧౮

## —♦ విద్యున్మాలావృత్తము ♦—

విద్యాభ్యాసోపేతశ్రద్ధా
విద్యుత్కాయా వీతాపాయా
సద్యోమిత్రా సాధుస్తోత్రా
హృద్యశ్రీయా కృష్ణారాయా. ౨౧౯

## గద్యము.

ఇది...శ్రీ తిరుపతి వేంకటేశ్వరప్రణీతంబగు బుద్ధచరిత్రంబను మహా
ప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.





శ్రీరస్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# బుద్ధచరిత్రము



## చతుర్థాశ్వాసము

క. కొచ్చెర్లకోటకుల సంపచ్చతుర కవీంద్రచంద్రివాగమృతలల
ద్ధృచ్చాతక ! నిర్మలతరసచ్చరితా ! కృష్ణరాయ ! సాధువిధేయా ! ౧

వ. అవధరింపు మనంతరంబ.

ఉ. రాజగృహాభిధాననగరంబుఁ గరంబు స్వధర్మపద్ధతిం
దేజము తప్పకుండ నవనీపతియై తగు బింబిసారుఁ డెం
తే జనము ల్నుతింప లలి నేలుచునుండెఁ గులీను లైనరా
రాజులమాడ్కి మంత్రులు తిరమ్ముగ సుస్థితి దెల్పుచుండఁగన్. ౩

తే.గీ. రత్నగిరి కందరమ్మున రాజపుత్రుఁ
డొకఁడు రాజ్యమ్ము విడిచి భిక్షుకునిపగిది
నణఁగి యున్నాఁ, డతండు మహానుభావుఁ
డనియెడు వదంతి రాజగృహమునఁ బ్రబలె. ౪

చ. అనద యొకర్తు తన్నగరమందు వసించుచునుండు, దానికిం
దనుజుఁ డొకండు, వాఁ డుపవనంబునఁ గ్రుమ్మరువాఁడు చిల్వకా
టునకు గతాసుఁ డై చనినటు ల్చెలికాండ్రు రయంబ యేగి య
వ్వనితకుఁ దెల్పి; రా పెనువంత మరల్పఁగలేక యెంతయున్. ౫

తే. గీ. కొడుకు పాము కతనఁ గూల నచ్చోటుఁ జేరఁ
బోయి నోరునెత్తి మోఁదుకొనుచు

'నన్ను విడిచిపోతె నాకులాధారంబ
నాతనూజ' యని మనమునఁ బొగిలి. ౭

వ. వెండియు దురంతచింతాభరం బాపలేక యప్పాపనిసబంబుపైఁ బడి యిట్లు విలపించె. ౮

చ. కటకట! యెన్నఁ డేని నొకకష్ట మెఱుంగక నీవు నాకుఁ గ
ల్గుటకు ననేకదైవములఁ గొల్చి జగమ్ములు మెచ్చఁ గంటి నీ
చిటిపొటిమేను గాడఁ గఱచెం బెనుభూతము వోలె నెంత య
క్కటికము లేకపోయెఁ గొడుకా! కడ కెక్కడి కాలసర్పమో. ౯

తే.గీ తోడి బాలురతోఁ గూడి నేఁడు పేర్మిఁ
గేళిమై నున్నవేళ నిన్నేల కఱచె
నట్టనడి పూలతోఁట ఫణాధరంబు?
పాము గాదది నాతొలిబాము గాని.

క. కొడుకు కళేబరము పయింబడి యిటు లెగ్గెత్తి యేడ్చుపడఁతిం గనఁగాఁ
దడఁబాటునఁ జనుదెంచిరి వడివడి నాయిరుగుపొరుగు వాడజనంబుల్. ౧౦

సీ. గొణగొణ నేదియో గొణఁగుచుఁ గేలుసారించి మార్జనుల మంత్రించువారు
విషమువో మందులు విషవస్తువులె యంచు నూటి కల్కము కంటఁగూరువారు
వనపత్రములు దెచ్చి పసరు గిన్నెలఁదీసి ముకుఁజెవుల నొకింతపోయువారు
పురవైద్యశాలకు నరిగి భేషజనీరములు దెచ్చి గళమున నొలుకువారు

తే.గీ. 'నెచటి ప్రాణము! లేచిపోయిన' దటంచు
నొరులకొరులకుఁ బెదవులు విఱిచికొనుచుఁ
దుటదుట స్రవించు కన్నీరు దుడిచికొనుచు
నరుగువారను నైరి తత్పురజనంబు. ౧౧

వ. ఇట్లనేకు లనేకపరికారమ్ముల విషనివర్తనోపాయమ్ము లాలోచించి యొనర్చుచు మృతపుత్రయగు నాయమ్మ నోదార్చుచున్నంత మఱికొందఱు.

క. ఈనగరసమీపారణ్యాని ప్రత్నగిరికందరాంతరమున న
న్యూనానుభావుఁ డొక్క యతీనుం డున్నాఁడతం డతీంద్రియుఁ డెందున్.

క. ఆయనయొద్దకు నీమృతకాయము గొనిపొ మ్మతండు కరుణాభరణుం
డాయువు వొసంగ సమర్థుఁ డుపాయంబిది యనుచుఁ దెలుప నాపెయుఁ గడఁకన్

## కవిరాజ విరాజితము

బుజముపయి మృతపుత్రకళేబరముం దగ బర్వునమోయుచు మే
న్గజగజలాడఁగఁ గన్నుల బాష్పపుఁగాల్వలు భోరునఁగాఱఁగ న
క్కజ మెద నించు వికారమునం 'గొడుకా! కొడుకా! కొడుకా!' యనుచుం
గుజములనీడలకుం జనుచుం జనెఁ గౌరిననంబె దిగుల్పడుచున్. ౧౫

సీ. కుసుమపేశలమైన పసిపాపమూఁపుపై జలజలఁ గన్నీరు జార్చుదాని
'నిట నన్ను విడిచి నీవేగితే హాపుత్రి హాపుత్ర' యంచు బిట్టడలుదాని
'నాపాపఫలము ఫణాధరమై నిన్నుఁ గఱచెరా, కొడుక!' యంచొఱలుదాని
'నపకార మేమి నేనాచరించితి మాలదేవుని?' కనిసారె దిట్టుదాని

తే. గీ. 'నాసుతుని బ్రతికించు పుణ్యప్రచారు
జెప్పఁగదరమ్మ వేగమో చెట్టులార!'
యనుచు నాయానగంబుల నడుగుదానిఁ
గనియె సిద్ధార్థుఁడెంతయుఁ గరుణమొలయ. ౧౬

క. కని 'నీ వెవ్వతె, వేకతమునఁ దనయుం డీల్గె, గహనమునకుం జనుదెం
చిన కారణమే'మని యాడిన నామెయుఁ బెల్లుగ దురటిల్లుచుఁ బలికెన్. ౧౭

క. పసివానిఁ బాము వశమునఁ గసిమసఁగె న్నాకు వీఁడొకండ సుతుం డీ
నిసువుం బ్రతికింపఁగల తపసి కలఁ డిగ్గిరి నటంచుఁ బల్కిరి పౌరుల్. ౧౮

వ. తదర్థంబ నావచ్చుట, యమ్మహాత్మ నెఱింగితివే నానతిమ్మని నందనశోకమ్మున నలందురుచుం దన ముందఱ వ్రాలు నాతిం గాంచి భూతదయాపారీణుండగు నాతం డి ట్లనియె. ౧౯

ఉ. పౌరులు నీకుఁ జెప్పిన తపస్విని నేనచుమీ, మనోహరా
కారు భవత్కుమారుఁ ద్రుటికాలమునం బ్రతికింతుఁ గాని మీ
యూరికిఁ బోయి సర్షపములొయ్యనఁ దె మ్మొకకొన్ని, పుత్రు ని
ద్ధారుణి నుంచు మేను సవిధమ్మున నీవయి కాచుచుండెదన్. ౨౦

వ. మఱియు నొక్కవిశేషంబుఁ గలదు వినుము, జననీజనకపతిపుత్రాదుల మరణమ్మున నెన్నండును నాపన్నలుగాని పౌరులయింటికిం జని యావలు యాచించి తేవలయుఁ జుమీ! యను సర్వార్థసిద్ధుని వచనంబు లమందానందసందోహంబు డెందంబునం దుదయింపం జేయఁ గుమారు నటఁ గుతలశాయిం జేసి మరలి రాజ

గృహమ్మున నొకగృహమ్మున కరిగి కలతెఱంగు నొడివిన నాయింటి ముత్తైదువ తనయోజ్జీవనత్వరాయమానమానసయగు నాపె కిట్లనియె. ౨౧

మ. జననంబు న్మరణంబు జంతువులకు న్స్వాభావిక, మ్మేరి కె
ల్లి నిజం బౌనె? సుఖంబు లెక్కడివి తల్లీ! యేఁటి కేఁడాదిరౌ
నను గాఁచెదు ప్రయోజకు న్సజనమందారంబుఁ జెట్టింతె వా
నిని బుత్రుం బిగ్రమింగి కాయికరణి స్జీవించి యి ట్లుండనే. ౨౨

క. ఆపలకు నేమి భాగ్యము, కావలసినఁ గొను మటన్నఁ, గన్నీరు కుచ
ప్రావారము దడుపఁగఁ జని యాపేక్షఁ గలట్టి గృహిణులందఱ నడిగెన్. ౨౩

సీ. కన్నబిడ్డలనెల్ల గంగపాలొనరించి బ్రతికినపరమనిర్భాగ్యురాండ్రుఁ
దారుణ్యమందె భర్తలు పెద్దనిద్దుర వడసిన దురదృష్టవంతురాండ్రుఁ
జిరకాలమునకు వచ్చినచూలు గోల్పోయి వంతచేఁ గుందు చూలెంతరాండ్రుఁ
బసితనమ్మున మారికసిమసంగిన తల్లిదండ్రుల కడలు స్వతంత్రురాండ్రుఁ

తే.గీ. గాని యెందును నడిగినకరణిఁ దనకు
వలయు సిద్ధార్థము లొసంగువారు పురము
నల్లడలఁ గానరారైరి నాతి కాత్మ
శిశుమరణదుఃఖవార్ధి శుష్కింపఁజేయ. ౨౪

క. తనకై యావల నిమ్మంచు నడిగిన వెలంది పుత్రశోకాగ్ని రవి
ల్చెను బ్రాక్తనపారిహృదయనలకగు ప్తఘనశోకహాతచూర్ణంబున్. ౨౫

క. తన్నగరనికేతనముల కన్నింటికి నరిగి సుతునకౌషధ మని యా
పన్నులు తా మెన్నడుఁ గాకున్న కుటుంబినుల వెదక నొకరును లేమిన్.

వ. ఖిన్నయగుచు రాజపుత్రాధిష్టితంబగు గిరికందరంబునకుం జని కని మ్రొక్కి కడ
చిన వృత్తాంతంబుఁ జెల్పిన నాతం డల్లన నగుచు నమ్మగువ కిట్లనియె.

సీ. మరణంబు సర్వసామాన్యంబు దుఃఖంబు గాంచనివారు లోకమున లేరు
నిజ మిదియనుమాట నీయంత నీకు గోచరముగా నీయుక్తి సలిపినాఁడ
నీదృశదారుణఖేదమ్ములకుఁ గతమెద్దియో తెలియఁగ నెంచి నేను
దిరుగుచునున్నాఁడఁ దెలియుటకై ప్రాణమైనను విడుచు సాహసము కల ద

తే.గీ. టంచు బోధించి పురమున కాపె నంపి
రత్నగిరి సానువులయందు రాజసుతుఁడు

ప్రాగ్గతి వసించుచును నొక్కపరి నజావి
పటలివెంబడిఁ జనెడు గోపకులఁ గాంచె. ౨౮

ఉ. అందొక మేఁకకూన తనయంఘ్రి శిలాహతిఁజేసి గాయముం
జెందినఁ గుంటుచు న్విగతజీవనమాత్రము గాక యుండ, లో
నం దలపోసె నానృపతినందనుఁ డిచ్చిటికూనప్రాణిఁ బ్రో
వం దలకొంట యమ్మునులవంత లడంచుటకంటె మేలుగన్. ౨౯

వ. ఇట్లు తలపోసి యక్కొండచఱియలనుండి డిగి చిఱుతమేఁకదరి కరిగి తనయొగు
భుజంబున నెక్కించుకొని గోపకుల కిట్లనియె. ౩౦

తే. గీ. ప్రొద్దు బారెఁడు గ్రుంకకమున్న మేఁక
మందలను దొడ్డివెట్టుదురెందు గొల్ల,
లకట ! యీవేళ మట్టమధ్యాహ్నమంద
తోలుకొని పోవుటకును హేతువు నుడువుఁడ. ౩౧

వ. నావుడు గోపకు లిట్లనిరి. ౩౨

క, నూటెంటి నేడకమ్ముల నూటెంటిం బస్తముల ననూనప్రీతిన్
మా ఱేఁడు నేఁడు బలి జేజేఱేఁడుల కొసఁగునఁట సనిగ జన్నమునన్. ౩౩

ఉ. కావున మేమె మేఁకలను గ్రన్ననఁ దోడ్కొని పోవుచుంటి, మా
దేవరయానతి న్పృథగ దేవునికైన నొనర్పరాదు, వే
పోవలె నంచు మార్వచనమున్వచియింపక యేగు గొల్లలం
గావి మెఱుంగు కన్గొనలఁ గ్రమ్మఁగ శాక్యకులీనుఁ డిట్లనెన్. ౩౪

క. ఏనును వచ్చెద నిల్వుం డానరపాలకుని పాలికనుచుం గూనం
దాన మెడమీఁద నిడుకొని పైనంబై చనియె గొల్లవాండ్రవ పిఱుందన్. ౩౫

క. చనిచని సాయమ్ముఖమునకు నగరమున కజపటలియు గొఱ్ఱెలపిండుం
దనముందఱ నడువఁగ నొయ్యనఁ జనియెం బౌరులెల్లనచ్చెరువందన్. ౩౬

ఉ. మేఁకలపిండుతోఁ జిఱుతమేఁక నొకండు భుజద్వయాభిధా
నోకహశాఖికాయుగళి నూల్కొనఁజేసి పురంబుఁజేరు తం
ద్రాకృతికి న్యతీంద్రునకు ద్వారనివాసులు దారి యిచ్చి, రా
ఘాకకు నొత్తిగిల్లె శకటంబులు రాజపథంబు చెంతకున్. ౩౭

లయగ్రాహి.—అమ్మని రయమ్మునఁ బురమ్మున కరమ్ముఁ గుపి
త మ్మగువిధమ్మునఁ బథమ్మునఁ జనం బో,
నమ్మికొను కోమటిజనమ్ములు మనమ్ముల ఘు
నమ్మగుచు నచ్చెరువు గ్రమ్మఁగఁ దులాదం
డమ్ములు త్యజించిరి; ముదమ్మలరఁగాఁ గ్రయికు
లు మ్మదిఁ దడంబడుచుఁ దమ్ముఁ దమవారల్
తెమ్మనిన వస్తునికరమ్ములను గైకొని గృ
మ్ములకుఁ బోరు వికలమ్మయినబుద్ధిన్. ౩౮

సీ. సామితక్షితదారుసన్నద్ధమైన చే బాడిత తివియక చూడ నేగెఁ
దక్షు యయ్యతివరుఁ ; దంతువాయుండు మగ్గము పెట్టి తురిలోనఁ గండెలునిచి
తగ నేసికొనుచు నోతప్రోతముల సవరించి వేమమున ఘట్టించుకొనుచు
మగ్గమ్ము విడిచి యమ్మహనీయుఁ గన్గొన నరిగెను ; పశ్యతోహరుఁడు పైఁడి

తే. గీ. తీవ కమ్మచ్చు పటకార్లు దిగవిడిచి య
తీంద్రు సాక్షాత్కరింపఁ బోయెను ; గులాఉఁ
డొక్కకరమున గూట మింకొక్కకేలఁ
బచ్చుపంటియు ధరియించి పరుగు వెట్టె. ౩౯

తే. గీ. ధాన్య మమ్మెడివా రద్భుతమ్ము గాఁగ
నెచటఁబోసినరాసుల నచట డించి
భిక్షుకుని జూడ నేగ నాఁబెయ్య లేగి
పట్టి తినఁజొచ్చె నిష్ప్రతిబంధకముగ. ౪౦

తే. గీ. సుత్తి యెత్తిన తనచేయి సుత్తియెత్తి
నట్టె యుండఁగఁ గమ్మరి యతనిఁ జూచె;
ధనము లెక్కించుకొనుచు నత్తపసిఁ గాంచి
లెక్కమఱచెను వైశ్యకులీనుఁడొకఁడు. ౪౧

క. యతివరునిం జూచుచుఁ బాల్పితికెం గోపాలుఁ డొకఁడు పిచ్చలవిడిఁ ద
న్మతి లోటా నిండిన సంగతి యెఱుఁగనికతన నవియుఁ గాల్వలుగ ట్టెన్.

ఉ. కన్నులు చేరెఁడేసి సుముఖంబు ముఖచ్ఛవి కంతుమేని శ్రీ
కన్నను మిన్నగాఁ గల దఖండ తనూరుచి కేలుదోయి యు

త్యున్నత మంసయుగ్మము సమున్నత మూతనిజాతి యేమొ యుం
చు న్నగరాబ్జగంధు లఱచూడ్కులఁ జూడఁగసాగి రయ్యెడన్. ౪౩

ఉ. పంచశిలీముఖాకృతిఁ బ్రపంచము సర్వము నేలఁజాలు న
భ్యంచిత తేజుఁ డీయనఘుఁ డక్కట గొల్లలు వోలె నెమ్మదిం
గొంచక మేఁకమందలను గొఱ్ఱెలమందలఁ గాచు టేలొకో
యంచుఁ బరస్పరంబుఁ గడునచ్చెరువందిరి కొంద ఱంగనల్, ౪౪

వ. ఇట్లనేకు లనేకప్రకారంబులం గనుంగొన యతీంద్రుం డతిత్వరితగతిం జను
దెంచుటఁ గాంచి కొందఱు బలిదానత్వరాయమాణమానసుండగు బింబిసార
నరపాలు పాలికిం జని యిట్లనిరి. ౪౫

క. ఈ వాలభింపఁదగిన యజావికదంబంబుతోడ యతివరుఁ డొకఁడో
దేవర! వచ్చెడిఁ గంటె భుజావితవికలపదబస్తకాంకుం డగుచున్. ౪౬

సీ. హోమకుండాంతరాహుతఘృతజ్వలితవైశ్వానరజ్వాల లభ్రమున కెగయ
నాలభ్యమాననైకాజమేదోవసారక్తమ్ము లాపగ రహి వహింప
నైకకంఠీరితర్గ్యజుషమంత్రధ్వానపటిమ నజాండకర్పరము పగుల
బలిపీఠికావోఢకులదేవతావిగ్రహచ్ఛవిచ్ఛట దెసలలముకొనఁగ

తే. గీ. సోమపానంబుఁజేసిన సోమయాజి
సంతతులు గూడి స్వస్తివాచనము సలుప
బింబిసారధరాపాలుఁ డింబుమీఱ
వితతబలియాగ మొకటి గావించుచుండె. ౪౭

మ. మఱియు నొకఋత్విజుండు దీర్ఘశృంగంబులుగల యొక పశువృతల నులపమయం
బగు త్రాట నొకయూపంబునకుఁ గట్టి యేతదర్థమ్ములగు నర్ధర్చమ్ములు చదివె. ౪౮

సీ. 'ఇది బింబిసారపృథ్వీశుజన్మమునఁ బ్రధానంబు దీని రక్తమును జూచి
యగ్నికుండమ్మునయందు హోమము సేయఁబడు దీని సంపక్వపలలగంధ
సార మాఘ్రాణించి సంతసమందుఁడో దేవతలార! యీభూవరేంద్రు
పాపమ్ములను దీనిపై వైచితిమి గాన వానితోఁ గూడ వైశ్వానరుండ!

తే.గీ. పశువు నశియింపఁజేయు', మిప్పగిదిఁ బల్కి
నఱకఁబోవుట దవ్వ్యులనరసి వేగ

నరపతి సమీపమున కేగి, 'నఱకనీకు
మయ్య!' యని కేక వైచె సిద్ధార్థుఁడపుడు. ౪౯

వ. ఇట్లొనర్చి సమీపమ్మున కరిగి యప్పశుపాశం బూడ్చి విస్మయమయులై యూరక చూచుచున్న ఋత్విక్కులం గాంచి మృదుమధురమ్ములగు వచనమ్ముల నిట్లనియె.

తే.గీ. ప్రాణహననంబు గడుసులభంబు గాని
ప్రాణ మిచ్చుట మనకు సాధ్యంబుకాదు;
ప్రాణరక్షణకై పాటుపడనివారు,
ప్రాణిపైఁ బ్రేమలేని వారలును గలరె. ౫౦

తే.గీ. జీవములయాత్ర సంపూర్తిచేయకుండఁ
జంపువారికిఁ బాపంబు సంభవించు
జీవహింస యొనర్పెడిచేత సేయు
వారలకుఁ బాపముక్తి చేకూర దెపుడు. ౫౧

సీ. దయఁగోరి వేల్పులఁదనియించు మనుజులెపో దేవతలు జంతువులకు; జంతు
వులపైఁ గరుణ మనుజులు పూనకున్న వారలపైఁగరుణ దేవతలకు రాదు;
ఇలఁగల జీవరాసులు పరస్పరము సంబంధమ్ము గలయవి; పరమనిర్ద
యతఁబూని మీరిప్పుడాలభించెడి పశువ్రాతమ్ము లన్నియుఁ బాలునొసఁగి

తే. గీ. మానవులయంద విశ్వాసమూని యున్న;
వెవ్వఁడేనియు మృతిఁజెంది మృగశరీర
మైనఁ బక్షిశరీరమునైనఁ దాల్చు;
నవియు ధరియించుచుండు మానవత మరల. ౫౩

క. మతిహీను లెవ్వరే నీగతి లంచమువెట్టి తుష్టిగావింతురె దే
వతల, కయోగ్యుల దుర్వ్యాపృతులివి సంతోషమిడునె వీసం బేనిన్? ౫౪

క. తనకావించిన కర్మంబున నింతయు నన్యజంతువులపైఁ బడవే
య నశక్య; మేరికేఁ దగ్గునె తమ కర్మంబు తార కుడుచక యెందున్? ౫౫

తే. గీ. వాఙ్మనఃకాయముల దేహవంతుఁ డెలమిఁ
జెట్టచెయ్ది యొనర్చినఁ జెట్టఫలము,
మంచిచెయ్ది యొనర్చిన మంచిఫలముఁ
జెందుఁ గాని తదితరము చెందఁబోఁడు.

మ. మఱియు న్నైరుప్పుఁ జేర్మియుం గృపయు సన్మానంబునుం జంతుసం
తతిపైఁ జూపక హింస మున్నయిన దుస్తంత్రంబు లెన్నేనియున్
గతకాలంబునఁ జేసికొన్న నవి యక్కష్టాత్ములం బట్టి యా
యతియందు న్వెతఁ గుడ్పు నందు మతయోగ్యగ్రంథము ల్చెప్పవే. ౫౮

తే. గీ. అనుచు నందఱిడెందంబులందుఁ గరుణ
యనుగుణం బుదయింపఁగ ననుగుణముగ
విమలబోధ మొనర్ప బుత్విక్కు లెల్లఁ
దలలు వంచిరి సిగ్గునఁ దపసిఁజూచి. ౫౯

వ. రాజును ముకుళితకరకమలుం డగుచు సాష్టాంగనమస్కారంబు గావించిన నతని దిక్కు మొగంబై యెల్లరకుం దెలియ మరల నిట్లనియె.

సీ. ప్రాణులెల్లను బరస్పరమైత్రి గనవలె మాంసభక్షణమును మానవలయు
బంగారురంగుమైఁబరఁగు చక్కని రాజనాలధాన్యము క్రింద రాలినట్టి
తీయనిఫలములు తేటయౌనీరును శాకముల్మొదలగు సకలవస్తు
వులచేత క్షుద్బాధ తొలఁగింపఁజేసి యీతనువును గాపాడికొనఁగవలయు

తే.గీ. నీగతి నొనర్ప లోకమ్ము బాగుపడు న
టంచు బోధించుచున్న సిద్ధార్థు వచన
యోగమున మనముల సత్త్వముదయమందెఁ,
దెల్వియును వచ్చె నచటి బుత్విజులకెల్ల. ౬౦

వ. ఇట్లు తదుపదేశంబు మనంబులకెక్క యాజకులు పశుహింసాకరమ్ములగు నాయుధమ్ములు పాఱవైచియు హోమకుండంబులు చల్లార్చియుఁ దమయంత నరిగిరి. బింబిసారుండును స్వాంద్రంబగు సంతసంబునం బొదలి జీవహింస చేయఁగూడదనియు మాంసంబు తినరాదనియు భూతదయ ప్రధాన మనియుఁ దనదేశమందలి సకలజానపదమ్ములఁ జాటించియు శిలాఫలకమ్ముల వ్రాయించియు బలియాగమ్ములు మాన్పింపఁ దగువారి నియోగించెఁ; బదంపడి యెల్లయెడల జీవహింసాప్రచారంబు శశవిషాణప్రాయమై, పశుపక్షిమృగాదులు నిర్భయముగ మెలఁగఁదొడఁగె. ౬౧

ఉ. రాజకులంబునం బొడమి, రాజ్య మొనర్చుట మాని, తత్త్వవి
ద్యాజితమైన చిత్తమున ధర్మగతిం జరియించువానిఁగా
నాజటిలాగ్రగణ్యు మొగమందల్కికాంతి యెఱుంగఁజేయ స
త్తేజుఁడు బింబిసారుఁడు నుతించుచు నిట్లనె భక్తిపెంపునన్. ౬౨

చ. యతివర! రాజ్య మేలఁదగినట్టి మహామహిమానుభావసం
గతి గల మీకు బిచ్చమనఁగా నొకవృత్తియె; నాకుఁ బుత్రసం
తతి కలవయ్యెఁ, గూఁతు నొకతం గనియుంటిని; దాని నిచ్చి నా
యతులవిభూతి నిత్తు ముదమందుచు రాజగృహంబు నేలుమీ. ౬౩

వ. అనవుడు బింబిసారుం గాంచి సర్వార్థసిద్ధుం డిట్లనియె.

సీ. రాజేంద్ర! విను, మేను రాజవంశమునంద పొడమినవాఁడఁ బ్రఖ్యాత మైన
సౌఖ్యంబు తొల్లి సంసారంబు సేయుచు ననుభవించినవాఁడ నగుదు నిజము;
మునుపు వల్దని త్యజించిన సౌఖ్యమిపుడేల? సన్న్యసించితిని విజ్ఞానలబ్ధి
మనమున నెంచి, రంభయవచ్చి కామించినను నింద్రపదవి వచ్చినను గొల్లఁ;

తే. గీ. దనువు గృశియింపఁ జేసెడి పనులకతనఁ
గాని శాస్త్రములకతనఁగాని యిచటఁ
గలుగు తాపసజనముల కతనఁ గాని
జ్ఞాన మబ్బ దటంచు నిశ్చయము గలిగె. ౬౪

వ. కావున గయాప్రాంతదేశంబులం గల చల్లని యడవులకుం బోయి జ్ఞానసంపా
దకంబగు యత్నం బొనరింతు; నట్టిజ్ఞానంబు నాకు లభించునాఁ డయ్యది నీకుం
దెల్పి కృతజ్ఞుండ నగుదు నని మఱియును. ౬౫

తే. గీ. పాములకు నైన నే భయంపడను, బిడుగు
లకును భీతిల్ల, చావపావకున కైన
భీతిపడ, గాలి కైనను భీతిఁ జెంద
విషయహంతకమ్ములను బిట్టు వెఱచినట్లు. ౬౬

క. కామము లనిత్యములు మాయామయములు వానిఁ గోరినంతన విద్వ
ద్గ్రామణులకైన నొక మోహామయము ఘటిల్లు సంతతానర్థదమై. ౬౭

శా. ఆశం బోలఁగఁజాలు శాత్రవుఁడు లేఁ డాసాగరాంతం బిలన్
డా శాసించెడివాని చిత్తమునకైనం దృప్తి గానీదు, ల
క్ష్మీశుం గొల్లుగ దంధనంబగు ధనంబే కోరఁగాఁ జేయు, నా
కాశసక్కులె నల్లుఁ దన్మయుని కింకం గల్గునే నిర్వృతుల్. ౬౮

తే. గీ. నేల నాలుగుచెఱఁగులు నేలె, దేవ
తావరేణ్యుని యరగద్దెపై వసించె,

వలసి కురిపించుకొనెఁ బైఁడివానఁ, దృప్తి
దనరనే యట్టివాఁడు మాంధాతకైన! ౭౦

సీ. అమరాధిపతియు వైత్యక్రోధమునఁ దొల్లి యజ్ఞాతవసతి చేయఁగవలసె
మునులచేఁ బల్లకి మోయించిన మదంబునన కొండచిలువయ్యె నహుషనృపతి
స్వర్గంబుఁ జేరి లోభమున నిరాహారి పైఁడిఁగోరి నశించె నేడనృపతి
గురుని వేసంబు శుక్రుఁడు దాల్చి మాత్సర్యమున దేవతలనెల్ల మోసగించె

తే. గీ. గురుని యిల్లాలితోఁగూడి కువలయేశుఁ
డప్రతిష్ఠ వహించెఁ గామాతిరక్తిఁ
గాన నెంతటివారలకేని విషయ
నిగమనము శక్య మగునయ్య మగధనాథ! ౭౧

క. ఆకలము లేటికొని తమ యాఁకలిఁ బోఁగొట్టుకొనుచు నంబరములకై
మోకపొర ల్గట్టెడు మునులే కామముఁ గెల్వఁజాలలేరు నరేంద్రా. ౭౨

వ. మఱియు దుఃఖప్రతీకారనిమిత్తభూతంబులై దగఁదీర్చుటకుఁ దోయంబును నాఁకలిఁబాపుట కన్నంబును శీతాతపవారణంబునకు గృహంబును గుహ్యప్రదేశశైత్యవారణంబునకు వస్త్రంబును నిద్రావినోదార్థంబు తల్పంబును మార్గక్లమాపనోదంబునకు యానంబును స్థానపారిశుద్ధ్యంబునకుఁ బీఠంబును శరీరారోగ్యంబునకు స్నానంబును నిర్ణీతంబులైన; వివి సుఖానుభూతికొఱ కుపయోగించు నరుండు కేవలమూఢుండు. ౭౩

తే. గీ. మంచిగంధము శశియుఁ గ్రీష్మమున సుఖముఁ
గలుగఁజేసియు దుఃఖంబుఁ గలుగఁ జేయు
శిశిరమునఁ గాన నిజము యోజింపఁ గలదు
సుఖము దుఃఖంబు సర్వవస్తువులయందు. ౭౪

తే. గీ. సుఖము దుఃఖమ్ము నా రేకముఖములగుట
రాజ్యదాస్యంబులును సమభోజ్యములగు;
ధరణిపతికిని సుఖము నిత్యంబు గాదు,
దాసునకు దుఃఖమును శాశ్వతంబు గాదు. ౭౫

తే. గీ. ఒక్కపుట్టము కట్టఁ బన్నుండు నొకట
**నొక్కయింటను వసియించు నొకటమింత**

మాత్రమే తినుఁ గాని శ్రమంబ యొక్క
డీజగంబు బేలు రాజాధిరాజునకును. ౪౬

తే. గీ. అనుభవము తుల్యమైనను నవనిపతికిఁ
దుష్టి హెచ్చనరాదు; సంతుష్టి లేదె,
కనకలోష్ఠంబు లొకరూపుగాఁగఁ బుడకు
సర్వసంగంబుఁదలఁచిన సంయములకు? ౪౭

వ. కావున నన్నుఁ గామపురుషార్థంబునకై పురికొల్పక నాయందుంగల మైత్రికిం దగినఫలంబుగ శివమార్గానుసంధానంబునకై హెచ్చరింపుము. కుటుంబకలహంబునం గాని శాత్రవకృతతిరస్కారంబునం గాని దుర్భరాకాన్తిచేతం గాని వనప్రవేశంబుఁ జేసినవాఁడఁ గాను. దైవవశంబునంజేసి కనుదప్పి పాటిన కూరభుజంగంబు బారింబడెడు కుబుద్ధి చందంబున నెవ్వఁడు విసర్జించిన విషయంబులం గ్రమ్మఱఁ గైకొనువాఁ? డని మఱియు. ౪౮

క. అంధు ననంధుఁడు, నిర్ధనునిం ధని, యున్మత్తచిత్తునిం దృఢమతియుక్
సంధింపనిగతి దుర్విషయాంధులతో మైత్రిఁ జేయు ప్రాజ్ఞుఁడు గలఁడే? ౪౯

క. కావున దుర్విషయముల ప్రభావము నాతోడ నుడువవలదింక; మనో
భావములు వృష్టిఘాతలతావలయంబులుగఁ దలఁపఁదగు నరపాలా. ౫౦

వ. అని బహుమానపూర్వకంబుగా నమ్మగధనాథుని వీడ్కొని యరాడుం డను నొకమునీంద్రుం డట కనతిదూరంబున నున్న యాశ్రమమం దున్నవాఁ డని విని యతనివలన విజ్ఞానంబు వడయు నభిలాషం జనినంత. ౫౧

ఉ. వచ్చిన రాజపుత్రుని గృపాపరిపూర్ణవిలోచనాంచలుక్
హెచ్చినభక్తితోడ నెదురేగియు నింటికిఁ దెచ్చి యాసనం
బిచ్చి యనామయం బడిగి యెంతయు నమ్రత పెచ్చుగాఁగ నే
తచ్చరితంబు మాని విదితంబుగఁజేయ నరాడుఁ డిట్లనెక్. ౫౨

ఉ. సంకెల లూడ్చుకొన్న మదసామజముంబలె స్నేహపాశ మా
తంకము లేక కోసికొని దారుణకాననభూమిఁ జేరి ని
ష్పంకవిముక్తి రాజ్యపరిపాలనఁజేయఁదలంచి నైజరా
జాంకము వీడి భిక్షుకుఁడవైతివె మేలు, నరేంద్రబాలకా! ౫౩

క. కడు సుఖములు గుడిచి పదంపడి రాజ్యభరంబు సుతులపై నిడి యొకమీఁం
ద్రడవులకుఁ జనిరి గానీ, విడచిరె నినుఁబోలి రాజ్యవిధి బాల్యమునన్? ౭౪

క. మూన్నాళులయ్యె నేఁటికి నిన్నరయఁగ వచ్చినట్టి నీమంత్రులు 'మీ
యున్న తపోవనమునయం దున్నాఁడా' యంచు నడిగి, యుత్తరదిశకున్ ౭౫

క. పోయిరి; నీచుట్టంబు లలో యని నినుఁగూర్చి వగచుచున్నారఁట; నీ
చేయఁగలముక్తిమార్గోపాయం బేమిటికి? నెత్తిపడుచుఁడ వకటా! ౭౬

క. ఎన్నాళ్లనుండి తపమున నున్నారము మేము, నేఁటికొక కించిత్తుం
గన్నది లేదు; దిఁక నీవా! విన్నాణపుఁబదవిఁగాంచు వీరుఁడ వగుటల్. ౭౭

వ. అని యుపదేశించు నరాడుని వాక్యంబు లాకర్ణించి, 'దేవా! విరక్తుండ నయ్యు నాకిట్లుపదేశించుట న్యాయ్యంబుగాదు; భవాదృశులగు మహానుభావులు జరామరణరోగగ్రస్తంబగు మానవలోకము నుద్ధరింపఁ దలంపవలయుఁగాని శరణార్థు లగునంతేవాసుల నిరాకరింతురే!' యని మఱియును

క. 'ధునిఁ దరియింపఁగ వేపోయిన తఱిఁ దరి దొరకుపగిది, నినునివెలుంగుం
గనువానికిఁ దోడగుఁగతి నినుఁ గనుఁగొఁగలిగె నాకు నేఁడు మునీంద్రా! ౭౮

క. నీయుపదేశము నాకుం జేయందగునేని నేను జెందఁదగుదునే
నాయనువు నొడువు మేగతిఁ బాయు జరామరణరోగభయము యతీంద్రా?' ౮౦

క. అనుఁడు, నరాడమునీంద్రుండును రాజసుతుని వినయపటుత్వంబునకున్
మనమలర నిట్లునొడివెను దన తెలిసిన శాస్త్రనిశ్చితములగు పలుకుల్. ౮౧

వ. ప్రకృతివలన జన్మమృత్యుజరావ్యాధిపీడితంబగు నీప్రపంచం బుత్పన్నం బయ్యె; నది చతుర్వింశతితత్త్వాత్మకంబు; పంచభూతంబులును బంచతన్మాత్రలును బంచకర్మేంద్రియంబులును బంచవాగింద్రియంబులును మనోబుద్ధిచిత్తాహంకారంబులు నుం గలసి చతుర్వింశతి తత్త్వంబు లనంబడు; దీనిం దెలిసి ప్రకృతికిం బరుండై సాక్షీభూతుండగు పురుషునిం గనుఁగొన్నవారికి జరామరణరోగభయంబులు లేవు; విది కపిలమహామునిప్రోక్తంబగు మార్గం; బింక బ్రహ్మమతప్రకారంబు వినిపింతుఁ; బుట్టుటయుఁ బెరుఁగుటయు ముదియుటయుఁ గిట్టుటయుం గలశరీరంబు వ్యక్తం బనియు, నట్లుకాని దవ్యక్తం బనియు ననంబడు. అజ్ఞానంబును నాశయుఁ గర్మంబును సంసారమునకుం గారణంబు; లీమూఁటం దవిలినవాఁ డెన్నండును దత్త్వంబుఁ దెలియనేరఁడు; విప్రత్యయాహంకారసందేహాభిసంప్లవావిశేషానుపాయసం

ర్గాభ్యవపాతంబులను నీయెనిమిదియు నజ్ఞానకారణంబు; లందుఁ గర్తవ్యమన్యథా చేయుటయు, మంతవ్య మన్యథా తలఁచుటయు మొదలగునది విపర్యయంబు; నేను నాది యను నభిమానమహంకారం; బేకపదార్థ మనేకధా తలఁచుట సందేహంబు; భేదాభేదశూన్యంబగు జ్ఞానం బభిసంప్లవంబు; జ్ఞాన్యజ్ఞానిభేదం బెఱుంగమి యవిశేషంబు; నమస్కారవషట్కారప్రోక్షణాభ్యుక్షణాదికకర్మతంత్రం బనుపాయంబు; మనోవాక్కాయబుద్ధుల దురాలోచనంబు సేయుచు విషయసంగంబు లేనిపగిది సంచరించుట సంగంబు; నే నతనివాఁడ, నతఁడు నావాఁ డనుకొనుటభ్యవపాతంబు. తమోమోహమహామోహతామిస్రద్వయరూపంబున నా యజ్ఞానంబు పంచవిధం; బం దలభ్యచింతనంబు తమంబు; జననమరణప్రవాహమున నిత్యత్వభ్రాంతి మోహంబు; స్త్రీవాంఛ మహామోహంబు; క్రోధంబు ప్రథమతామిస్రంబు; విషాదంబు ద్వితీయతామిస్రం; బిట్టియజ్ఞానంబునకు లోపడ కవ్యక్తపదార్థంబు నెఱుంగువానికి జరామరణశూన్యంబగు నక్షరపదంబు లభించు; నిది బ్రాహ్మమతంబని వక్కాణించు నరాడునకుఁ గుమారుం డిట్లనియె. ౯౨

సీ. ఎవ్విధి నెచ్చట నెంతపర్యంతమ్ము జరపంగవలె బ్రహ్మచర్య మనఘ!
ధర్మంబునకుఁ బరస్థాన మెయ్యది యెఱిఁగింపవే మదికి లగింపఁజేసి
యనవుడు, మౌనియిట్లనె, 'మొట్టమొదట గృహంబు వర్జించి సన్న్యాసియగుచు
నింటింటికిని బిచ్చమెత్తుకొం చొకచోట నుండక వనినొండె నూరనొండె

తే. గీ. దొరకినది కొంచు, దాన సంతోషపడుచుఁ,
దనకు వాసంబుగా వివిక్తప్రదేశ
మొకటి దొరకొని, యింద్రియప్రకరమునకుఁ
బట్టువడకుండువాఁడెపో బ్రహ్మచారి. ౯౩

వ. ఇట్టి బ్రహ్మచర్యంబున సంచరించుచు వివేకజన్యంబగు నిదిధ్యాసనంబున సులభంబగు పరబ్రహ్మసాక్షాత్కారంబుఁ జెందుటయ మోక్షంబని కొంద ఱిచ్చగింతురు. అహింసయ ధర్మంబునకుఁ బరస్థానం, బిదియవేదోక్తప్రకారం, బింతకంటె మనుజుండు గ్రహించుట దుస్తరం బని యుపదేశంబొనరించు నరాడుని పల్కులు మనంబునం బట్టి. ౯౪

క. చనిచని యురువేలాకాననమున వసియించెఁ గొన్నినాళులు తనప
త్తనమును వదలినది మొద ల్చనినప్పటి కెన్న నాఱు సంవత్సరముల్. ౯౫

తే. గీ. రాజపుత్రకుఁ డయ్యె నరణ్యమందు
నాఱువత్సరములనుండి యనుభవించు

ఘనపరిశ్రమమున ముఖకాంతి తఱిఁగె,
నంగకబలంబు సుడిగె సిద్ధార్థునకును. ౯౬

వ. ఇట్లతికృశంబగు దేహంబునఁ బరిభ్రమించుటకుం దగనివాఁడై మెల్లమెల్లఁ జనువాఁడు ముందట. ౯౭

సీ. పితరులు తరియింపఁ బిండప్రదాన మార్యులపరంపర చేయుచున్నచోటు
నురుపలయమ్మును నొకకంటకారణ్య మిసుము కొండలతోడ నెసఁగుచోటు
మిన్నంటుపొడవున మించు మోకలముండ్లపొదలు తీవలుఁబ్రాఁకఁగదియుచోటుఁ
బూరికొంపలచేతఁ బొలుపారు సేనాని యను పేరలరు పల్లె దనరుచోటు

తే. గీ. వెలయు నేయేటియొడ్డునఁ, గలయు మోహా
నయు, నిలాజనియను గొప్పనదులు రెండు
నేనదీవార్ఝరంబున, దానిఁ గనియె
ఫల్గునీనామకంబగు భవ్యతటిని. ౯౮

క. కని యాదఃపరికంపితవనజపరాగములు గలదరిఁ బర్విన గాడ్పుల్
తన మేనిచెమటఁ దుడువఁగఁ బనియెను సేనాని యనెడి జనపదమునకున్. ౯౯

క. చని యాలఁగాచుకొను నజ్జనపదచరులైన గోపజనములఁ దగఁ గ
న్గొనె వారియమాయికవృత్తి నితాంతము సంతసము మదికి నొసఁగంగన్.

వ. ఇట్లు సంతసించుచు నటఁ గొండొకతడవు నిలిచి తత్ప్రాంతమ్మున నున్న మహారణ్యంబునకుం బోయి యచ్చట ౧౦౧

సీ. దైవవశమున నొదవు విపత్తి గుఱించి మనుజుల దుఃఖమర్మములగుఱిచి
యడవిజంతువుల మర్యాదచొప్పునఁ దాను దెలిసికోఁదగిన నీతినిగుఱించి
యపరిమితమతసిద్ధాంతమ్ముల గుఱించి సర్గమరణరహస్యములగుఱిచి
చిత్రచిత్రాబ్దప్రచితశక్రచాపతుల్యంబుగ బ్రతుకు కాలమునుగుఱిచి

తే. గీ. మనము యోజింప ధ్యానసమాధి నూని
యొంటిపాటున నేరికిఁ గంటఁబడక
యుండుశౌద్ధోదనికి దాఁటుచుండె మాస
ములకు మాసమ్ము లవ్వనభూములందు.

తే. గీ. దైవవశమునఁ దనకుఁ దాఁదాఁపునందు
మ్రగ్గి రాలినఫలముల భుక్తిఁ గొనుచు

నచుఁబు నుదయాస్తమయములనైన నెఱుఁగ
కట్టె ధ్యానించు నిస్తంద్రుఁడగుచు నొకట. ౧౦౩

వ. నినంతరజిజ్ఞాసావశంబగు చిత్తంబున నాహారంబు మఱచి యున్న సిద్ధార్థుని శరీరంబుమిగులఁ గృశించె, మొగంబునఁ గాంతియుఁ గనుమాసెఁ; బడంపడి యొక నాఁ డశనాయాపరంబున స్మృతిఁదప్పి మృతునింబోలి మూర్ఛనొందిన నొక గోపబాలకుండు తత్పథంబునం బోవుచు నతనిం గనుంగొని పడఁదాఁకినవానిఁగా నెఱింగి. ౧౦౪

క. నగలం బొగులుచు, జంబూనగశాఖలు వఱికి పాఁతి నాలుగుదెసలన్
మొగముపయి నిడరా నొక్క గృహం బాకులను బఱచి కల్పించె వెసన్. ౧౦౫

వ. ఇట్లు సహజభూతదయాపారీణుండగు నాచిఱుతగొల్లం డొకపర్ణకుటీరంబుఁ గల్పించి తాను దాఁకినఁ బాతకం బగు నని యెంచి మేఁకల నతనిపాలికిం దోలికొని పోయి దుగ్ధంబు లమ్మహానుభావునినోటన పిదుకుచుండెఁ; నిట్లు కొండొక కాలంబు చనుడు జంబూనగశాఖలన్నియు నిగిరించి పొదచాడ్పున నల్లిబిల్లిగ నల్లుకొనియెఁ; నతండును దైవంబుగ నతనిం బూజించుచునుండ నొక్కనాఁడు తెలివొంది తననికటమ్మున నున్న గోపబాలునిం జూచి తత్కరస్థితఘటీగతంబులగు దుగ్ధంబు లిమ్మనుఁడు వాఁ డి ట్లనియె.

క. ఈపాలు నేను దాఁకితి గోపాలుఁడఁ గాన నీవు గొనఁగాఁ దగ దో
శాపాయుధపర యను నప్పాపనిఁగని నగుచు భూమిపతిసుతుఁ డనియెన్. ౧౦౬

సీ. నీశరీరమునందు నెత్తురు నాశరీరమునందు మంచిదుగ్ధములు గలవె
నాతల్లిదండ్రులు నన్నుఁ గాంచినరీతి నీ తల్లిదండ్రులు నిన్నుఁ గనరె
నా కున్నరీతిని గాక నీకఖిలావయవముల లోప మెందైనఁ గలదె
నీకంట నుప్పని నీరుండి నాకంటఁ జప్పని రుచిగల జలము గలదె

తే. గీ. మోముపయి బొట్టు,జందెంబు బుజమునందు
వర్తిలెనె జన్మమందె యెవ్వరికిఁగాని
యీావు తాఁకినమాత్రన యేల పాలు
నేఁగొనం దగ దంటివి నిజము చెపుమ. ౧౦౭

చ. అన విని గోపబాలుఁ 'డివియన్నియు నిక్కమ్ము కాని నన్నుఁ బే
ర్మిని గహనస్థలంబునకు మేఁకలఁ గావఁగ నంపునాఁడు మ

జ్జనని వచించె నిప్పగిది, స్వాములు బ్రాహ్మణు లడ్గిరేనిఁ బా
ల్తునివిగ నిమ్ము తాఁకకుము తాఁకిన పీకు మటంచు' నావుడున్. ౧౦౯

వ. సిద్ధార్థుండును సుకృతకర్మంబు లొనర్చువాఁడె ద్విజుండును దుష్కృతమ్ము లొనరించువాఁడె చండాలుండుఁగాక వర్ణభేదంబు గలదే యని వానికి బోధించి తద్దత్తమ్ములగు వజాదుగ్ధంబులు గ్రోలి యచ్చోటు విడచి యొక్కవృక్షచ్ఛాయ నధిష్ఠించి యున్నంత. ౧౧౦

సీ. రదనమ్ములయు వాతెరలయుఁగమ్మలయు నవ్వులయుఁ గాంతులుగండములనుగలసి
యీరెండఁ గాయఁ గ్రొక్కారుకమ్మల పరువము గల్గి బారను బారెఁడైన
కురు లీఁగ దిగజాఱు కరణి నున్నఁగ దువ్వి గడలుకొల్పినకీలుజడలు చొక్క
ములయు దీర్ఘైన తుర్ములయుఁ బైనున్న క్రొన్ననల గంధము దిగంతములఁ బర్వ

తే. గీ. సరము లల్లలనాడఁ గుచములమీఁది
పయ్యెదలు జాఱ రంగు పావడలు మీఱ
గళ్ళుగళ్ళని గజ్జెలు కాళ్ల మ్రోయ
నడుము లసియాడ వారాంగనాజనంబు. ౧౧౧

వ. కొంద అచ్చటికిఁ దాఁపుననున్న యింద్రుని దేవాలయంబున మేళమాడఁగ మృదంగంబు వీణియ చితారు లోనగు సాధనంబులు ధరియించి యాదారిం బోవుచుండ నం దొక్కతె వేఱొక్కతె కిట్లనియె. ౧౧౨

ఉ. కామిని యీచితారు సరిగా శ్రుతిచేయుము చేసి తేని మ
న్నామము వాసిఁజెందఁగలనాట్యము సల్పియుఁ బాటపాడియున్
దామరపూవులంబలె సదస్యులడెందములం బ్రమోదకం
ధామమునందు నాపగిది నాట్యమొనర్పఁగఁజేతు నెంతయున్. ౧౧౩

క. బిగువుగ సారించితివేఁ దెగుఁ దంత్రులు, వదులు చేసి తేనిని సరిగాఁ
దగదు శ్రుతి గాన సమముగఁ దగుగతి సారింపుమీ చితారు లతాంగీ. ౧౧౪

క. అనుపమం బ్రశంస యొనరిచి కొనుచుం దమయంతఁ బాడుకొనుచుం జను కా
మినుల వచనములు సిద్ధార్థుని చెవిఁబడెఁ గాని వారెఱుంగరు తపసిన్. ౧౧౫

వ. అతండును దలయెత్తి యగ్గలికం గనుఁగొని మనమ్మున నిట్లు తలపోసె. ౧౧౬

ఉ. నీచులనుండియుం దగిన నీతులు కొన్ని గ్రహింప వచ్చుఁ దం
త్రీచయముం బిగించె తెగఁదీసినచోఁ శ్రుతివోవ్రభంగిఁ గా
ర్యాచరణంబు దేహమున కబ్బినవేళలఁ దత్త్వచింతయుం
సోఁచునె? యేనెఱుంగ కిటులోరమునా మెయిఁ జిక్కఁజేసితిన్. ౧౧౭

వ. అని తలపోయుచుఁ దదరణ్యస్థంబగు నొకానొక దేవాలయంబునకుం బోయి యట
నిస్తంద్రుఁడై యున్నంత. ౧౧౮

సీ. తన పేర ఫల్గునీతటమునఁ గట్టించుకొనిన సేనానియన్ జనపదమునఁ
గాఁపురముండు నొక్కఁడు ధనవంతుండుఁ బశుపతి ధర్మతత్పరుఁడు బుద్ధి
మంతుండు విబుధసమ్మతుఁడు; వానికి రూపవతియు సాధ్వియు దయావతియు సత్య
సంస్కారాలను మృదుసంభాషిణియు సుజాతయు నగు నొక కళత్రంబు గలదు

తే. గీ. సకలజనములు దాని సుజాతయండ్రు
మాయయను మాటయెఱుఁగ దమ్మగువ తమకుఁ
గాన్పులేనను వంత యొక్కటియుఁ దక్క
నన్యదుఃఖం బెఱుంగ దయ్యబ్జముఖియు. ౧౧౯

వ. ఇట్లు కొడుకులు లేమిం గడుకొను దురంతచింతాశోకంబునఁ గర మ్మలంచుచు
నాసుజాతయు. ౧౨౦

క. రాకారాత్రులయందు సుతైకోదయవాంఛఁజేసి యేకాశీతి
ప్రాకారప్రదక్షిణములు లేఁకపనఁ గావించు విపినదేవతగుడికిన్. ౧౨౧

సీ. ధ్యానంబుఁ గావించి యావాహన మొనర్చి సింహాసనం బధిష్ఠింపఁజేసి
యర్ఘ్యం బొసంగి పాద్యమ్మిచ్చి స్నానంబు జేయించి నెమ్మేను జేలఁ దుడిచి
యజ్ఞోపవీతవస్త్రాదులను నొసంగి కస్తూరియును మంచిగంధ మలఁది
ధూప మాఘ్రాపించి దీపంబుఁ జూపించి పదపడి మది భక్తిఁ బాదుకొలిపి

తే. గీ. వన్యఫలములు వడపప్పు వన్యమాక్షి
కంబు శాల్యోదనంబు శాకములుఁ దెచ్చి
వేడుక నివేదన మొనర్చి పాడి యిట్టు
లనుదినము సేవకావించు నాసుజాత. ౧౨౨

క. కొడు కొక్కఁడేని నాకుం బొడమిన రుచిగల్గు తగినభోజ్యమ్ములు నేఁ
గుడుపం బెట్టెద నీకుం బడిబడి మాయమ్మ పైఁడిపళ్లెరమందున్. ౧౨౩

వ. అని ప్రమ్రొక్కి కొని తదేకతాత్పర్యమునం బూజించు నాసుజాతకు. ౧౨౪

క. నెలతప్పి క్రమంబుగ వేవిళు లొదవెన్ నడుము ప్రబలె వెలవెలనైఁ గ
న్నులు మొగమును జన్మించెనలన్ నలుపొదవెన్ నీరుమోయ నానాఁటి కొగిన్.

వ. ఇట్లుచూ లైనంతరాలు పదినెలలు నిండి యొక్క శుభముహూర్తంబునఁ గుమారుం
గనినంత సేనానినివాసు లందఱును సంతోషసాగరంబునఁ దొప్పదోఁగిరి.

క. సేనానియు డెందమున ననూనానందంబుఁ జెంది నూఱులకొలఁదిన్
దానంబుఁ జేసె గోవుల మానితమర్యాదులైన మహీదేవులకున్.

వ. సుజాతయు నన్నిసువునకు మూఁడవమాసంబు చనుదెంచుటయుఁ దనమ్రొక్కి
కొనిన మ్రొక్కుఁ జెల్లింపఁ దలంచి తత్తత్పదార్థంబులు శిరంబుమీఁద నిడుకొని
యొక్కకేలం గుమారు నెత్తికొని విపినదేవతాలయంబునకుం బోవుచుండఁ దదాల
యాలంకారార్థంబుగ మున్నుసుపంబడిన రాధయను దాసి వచ్చి యచ్చెరువుగ
ని ట్లనియె. ౧౨౭

క. వనదేవత మనపుణ్యమ్మున నట సాక్షాత్కరించె; ముఖసౌష్ఠవ మే
మనవచ్చు, సుజనభావం బెనయించు విలోచనంబు లింతలు తల్లీ. ౧౨౮

క. అనుచుం దత్తఱమునఁ గడు వినతశరీర యగుదాసి వితమంతయు నె
మ్మనము వికసింపఁజేయఁగఁ జనియెం గుడిచెంత కానుజాతయుఁ బేర్మిన్.

వ. చని యటమున్న దేవళం బధిష్ఠించి యున్న సిద్ధార్థుం గాంచి దేవతాభ్రాంతిం
జేసి తత్తత్పదార్థంబు లతనిచెంత డించి నినువుం బానిసచేతి కందిచ్చి సాష్టాంగ
ప్రణిపాతం బొనర్చి యిట్లనియె. ౧౩౧

ఉ. శ్రీకల గేస్తునింటికిఁ బ్రసిద్ధివహింపఁగ వచ్చి వంధ్యనై
వేఁకటి రాక దానఁ బలవించుచు నీకయి మ్రొక్కుకొన్న యీ
నాకు మహోపకారము నొనర్చితి వీవు దయోదయమ్మునన్
గైకొనుమమ్మ నాయిడిన గవ్యఘృతంబును బాయసంబునున్. ౧౩౨

వ. అని వేఁడికొనిన నశనాయావివశుండగు సిద్ధార్థుండు మాఱాడక యవియన్నియు
భుజించి తద్దత్తమ్ములగు పరిమళద్రవ్యంబు లాఘ్రాణించి తత్త్వవిచారార్థం బింత
కమున్న గడపిన దివారాత్రంబు లన్నియు స్వప్నానుభూతంబులపగిదిఁ గన్పట్టు
డు నిరంతరోత్సాహబలసంపన్నుఁ డగుచు, నాసమర్పించిన మ్రొక్కు యథో
క్తముగఁ జెల్లెఁగదా యను నాసుజాత కి ట్లనియె. ౧౩౩

క. ఈ విభుడు నాకొసంగిన యీవస్తువుపై ర దేమి యొకేఁగింపుము నీ
భావించిన విధమే యని నావుడు నిట్లనియె వతివినయమున సతియున్. ౧౩౪

సీ. మా మందఁ గల వంద మంచి గోవుల సుదుగ్ధము లేఁబదింటికిఁ ద్రావఁబోసి
వానిక్షీరమ్ములు పంచవింశతిగోవు లకుఁ బోసి వానిపాల్పదియు రెండు
ధేనువులకుఁ బోసి వాని పాల్గోషడ్డవమునకుఁబోసి యవ్వానిపాలు
పరిమళద్రవ్యసంభారమ్ముతోడఁ గలిసి పైఁడిగిన్నెఁ జొనిపి పదపడి

తే. గీ. సరసచందనపటికాష్ఠములమంటఁ
గ్రాఁగఁగాఁజేసి యందు ముక్తాఫలములు
బోని తెల్లనిబియ్యమ్ము వోసి పంచ
దారతో వండినట్టి యోదనము తల్లి ! ౧౩౫

వ. ఇట్టిదియ మున్ను నా(మెుక్కి కొనినయది; నిక్కంబుగ వనదేవత వైతివేని దాసు
రాలనగు నామెుర్కు లందికొని నన్నుం గృతార్థత్వ మొందింపు మని కలతెఱం
గెఱుంగక భక్తిపరవశయై ప్రార్థించు నాసుజాతం గాంచి యతండు. ౧౩౬

క. ముసిముసినగ వొలయఁగ నన్నినువు శరీరంబుఁ గేల నిమురుచుఁ దలపై
మునుఁగుం దీసి 'చిరంజీవ సుఖీభవ' యంచుఁ బ్రియముపడి దీవించెన్. ౧౩౭

వ. ఇట్లు దీవించి 'తల్లీ! యేను వనదేవతను గాను; శుద్ధోదనుండను నొకరాజకుమా
రుండ ననుచుఁ దనవృత్తాంతం బెల్లఁ దెలిపి వెండియు. ౧౩౮

తే. గీ. క్రమముగా నైకజంతుసారంబుకతన
నీపదార్థంబు రుచ్యమై యెసఁగినట్లు
నైకజన్మంబు లెత్తి యనంతరంబ
జీవుఁడును ముక్తియను ఘనస్థితికి వచ్చు. ౧౩౯

వ. అనుచు నీవలనం దెలియనయ్యె; నిట్లూరకయ జన్మంబు లెత్తుచున్నంతన జన్మసా
ఫల్యంబు గలుగునో, లేక జీవించియుండియు భూతదయ మున్నగు ధర్మంబులు
కలిగియున్నం జాలునో యనియు నీవలనం దేటపడవలసిన యంశంబు లియ్యవి
సావధానంబుగా నానతీయవలయు ననుడు సుజాత యాతని కిట్లనియె. ౧౪౦

తే. గీ. నేను మూర్ఖురాల నీయడిగిన యర్థ
ములకు నుత్తరంబు మొద లెఱుంగ

నాయొఱింగినంత నాచేయునంతయుఁ
దెలియఁజేతుఁ దేటతెల్లముగను. ౧౪౧

తే. గీ. అనుదినము వేగ లేచి, సత్యస్నానమాపు
దేవు నెదలోనఁ బాటించి, తివిరి పతికి
వలయు శుశ్రూష సల్పుచు వస్త్రవిసుల
నిరతమొనరింపఁజేతు దాసులచేత. ౧౪౨

వ. వాపీకూపతటాకమ్ములు త్రవ్వించుటయు శివాలయంబు గట్టించుటయు నగ్రహారంబొసంగుటయు ధననిక్షేపంబును వనప్రతిష్ఠయుఁ గృతిగ్రహణంబును బుత్రప్రాప్తియు ననునవి స్వర్గప్రాప్తిసాధనంబు లని యాగమంబుల నొడువంబడు నట్లగుట మత్పతికి స్వర్గప్రాప్తిసాధనీభూతుండగు నిక్కుమారునిం గాంచుటకు ననేకదేవతారాధనంబులు గావించితి; పరలోకసౌఖ్యంబులకెల్ల కుమారుండు మూలం బని యాగమరాద్ధాంతంబు; దేవతలతోడ సంభాషణాదులు గలిగి మంత్రములు నేర్చిన మహానుభావులకన్న నెక్కుడుగఁ దానియుఁడానఁ గాని కతమ్మున నాకుఁ దత్కృతంబులగు గ్రంథమ్ములయందు విశ్వాస మధికంబు; మంచి చెట్టు లొనరించిన వారికి మంచిచెట్టులు గలుగు నని నాయొఱింగిన తెఱంగు. ౧౪౩

క. యాదృశబీజము నాటినఁ దాదృశవృక్షంబు వొడము తప్పు; కటు లసూ
యాదయలవలనన యసూయాదయ లుదయించు నేరికైనం జగతిన్. ౧౪౪

క. దైవము వ్రాసిన పగిదిం జావున్నదియే సమస్తజంతువులకుఁ దాఁ
గావించు పుణ్యపాపము లేవానికి నేని నూరకేపో వెప్పుడున్. ౧౪౫

వ. ఒక్కయవబీజంబు భూమిపై నాటిన నయ్యది నశించియు ననేకయవబీజమ్ముల నుదయింపంజేసిన పగిది నీ జన్మంబు నశించియు ననేకజన్మంబులకుం గారణంబు గాఁగల; దదియుం గాక జీవించియున్నకొలఁది దుర్భరంబులగు కష్టపరంపరలు తండోపతండంబులుగా వచ్చుచుండెడి నని మఱియును. ౧౪౬

క. పతిమున్ను బొంది విడచినఁ జితిలోఁ బడి యేను మేన్ దృజించి యతనికిన్
గతిఁ గావించెద నుత్తమగతికిం బతులకును సతులె గతులు దలంపన్. ౧౪౭

క. నాకన్న మున్న బిడ్డఁడు చాకుండఁగ వలయుఁగాని చచ్చిన యెడలన్
నాకొదవు దుఃఖవారిధి కేకరణిం దరణిగల్గు సిద్ధచరిత్రా. ౧౪౮

క. కావున నామన మెన్నఁడుఁ జావునకై వెఱవ దనఘ! సరిగా జన్మం
బీనరున దుఃఖ మేది సుఖావిర్భావమున జరగ దయ్యెడు నాకున్. ౧౮౯

క. రిక్తులపై దుర్విషయాసక్తులపైఁ గష్టపడెడు సంసారులపై
నక్తందివంబుఁ గరుణాసిక్తత జాలిపడు నాదుచిత్తం బనఘా. ౧౯౦

క. అపకృతి యొనరించినయును నుపకృతి యొనరించుచుంటియును సత్కృతులం
దపియింమటు గోవగు పుణ్యపరంపర నాయొనర్పుఁ జట్టిది తలఁపన్. ౧౯౧

వ. కావున నాకు వచ్చెడిదంతయు ననుకూలంబుగనె పరిణమించుచున్నదని నొడువు
సుజాతం గాంచి సిద్ధార్థుం డిట్లను. ౧౯౨

క. నీయుపదేశము గడుభద్రాయితమై మదికినచ్చెఁ దల్లీ పెరిమన్
నీయంతవాని నన్నుం జేయుము దీవించి వృద్ధిఁజెందెద నీవున్. ౧౯౩

వ. నావుడు నట్లు దీవించినంత నమ్మాయాదేవీనందనుండును నాయమ్మను వీడ్కొల్పి
యచ్చోటు కదలి శతవిటపసమాకులమ్మును నిరంతరచ్ఛాయావలితంబునగు నొక
వటవిటపి చెంతకుం బోయి తచ్ఛీతలచ్ఛాయ నధిష్ఠించి యున్నంత. ౧౯౪

మ. లతలెల్లన్ వెదచల్లె నొప్పుగతిఁ బూలన్ వన్యసత్త్వంబులా
దృతి నన్యోన్యవిరోధముల్ విడచి మైత్రింబూని సిద్ధార్థస
న్మతికిన్ మెచ్చి మహానుభావుఁ డితఁడే మాన్యుం డటంచుం గడుం
గుతుకం బొప్పఁగ సేవఁజేయఁ దొడఁగెన్ గ్రూరత్వమున్ మానుచున్, ౧౯౫

వ. ఇక్కరణి సిద్ధార్థుం డుండునెడ. ౧౯౬

క. ఆకాశ మెఱ్ఱవడియె, దివాకరుఁ డస్తంగతించెఁ, బక్షులు వృక్షా
నీకములఁజేరెఁ, గ్రమముగఁ జీఁకటియు న్నేల నాల్గు చెఱఁగులు మూసెన్. ౧౯౭

క. తనకున్ లోఁగక భూవరతనయుఁడు నిర్వాణకాంక్షఁ దపియించుచు నుం
డినఁ గన సైఁపని వెడవిల్తునకుం గడుకొనియె బిట్టుదుఃఖం బంతన్. ౧౯౮

వ. ఇట్లు చింతించుచున్న మదనునికడకు విభ్రమదర్పహర్షాభిధానులగు నతని కొడుకు
లును బ్రీతితృష్ణారతులను కూఁతులును వచ్చి నీవికారంబునకుఁ గతంబేమని
యడుగ నాతం డిట్లనియె. ౧౯౯

మ. అకటా! యీముని ధైర్యమూని మన భృత్యానీకముం గెల్చి మా
మకకీర్తిం దఱిగింపఁబూనె; నితఁ డిమ్మాడ్కిం గురుజ్ఞానవ

ర్తకుఁడై లోకమువారి ముక్తితరుణీరాజ్యంబు సేరించినన్
వికలంబై మనవంశమే యడఁగు దానిం గూర్చి చింతించెదన్. ౧౬౦

క. ఈతండు జ్ఞానియయి లోకాతీతుఁడు కాకమున్న యడఁపన్వలయున్
శాతాస్మదీయబాణాపాతంబున నేతదీయపటుధైర్యంబున్. ౧౬౧

వ. అని సాహసిక్యంబుఁ దెచ్చుకొని. ౧౬౨

మ. రతిపార్శ్వంబునఁ, గేల నిక్షుధనువున్, రాజీవముఖ్యాశుగ
ప్రతతుల్ కక్షమునం జెలంగఁ, దరుణీవారంబు కీరంబులున్
శతసంఖ్యంబుగ వెంటరా, సొబగుటంచల్ నెమ్ములున్ నాట్యసం
గతులం జూపఁగ నేగుదెంచె నట కక్కాముండు రామాకృతిన్. ౧౬౩

క. చనుదెంచి ధనువు సజ్యం బొనరించి కరంబునం దొకుగ్రాశుగముం
గొని మునినిం గని యిట్లనియెను నేత్రము లెఱ్ఱఁబాఱె యింతింతలుగన్. ౧౬౪

శా. ఓరీ, క్షత్రియపోత! ముక్తిఁ గనఁబో నుద్యోగమున్ మాని యిం
పారం గోరు మభీష్ట మిచ్చెదను ధర్మాసక్తి వర్జింపుమా
నారాచం బిది మేనిమీఁదఁ బడెనే నాశంబుఁ గావించు నీ
ధీరత్వంబును నైష్ఠికత్వమును ఖ్యాతి న్నీతియున్ జాతియున్, ౧౬౫

ఉ. పుట్టితి వార్యపూజ్యమగు భూవరవంశమునందు ముష్టిఁజే
పట్టుట ఖ్యాతియా! ప్రజల పాలనఁజేయుట ఖ్యాతిగాని; యి
ప్పట్టున నైన నాపలుకు పల్కులు సుంత శ్రవోయుగంబునం
బెట్టుము, పెట్టవేని మదిబీరము ధైర్యముఁ గాచుకొమ్మిఁకన్. ౧౬౬

క. అనుచుం బాణముఁ జాపంబునఁ దొడి కన్యలును సుతులు ముందఱ నల్లా
డ నిభృతలక్ష్యుండై వదలెను బ్రత్యాలీఢపాదలీనుం డగుచున్. ౧౬౭

క. వదలినశరమునకున్ ధృతిఁ జెదరక కీడ్వడక వికృతిఁజెందక లోనం
బదరని శాక్యకుమారుని మది కచ్చెరువంది కుంది మదనుం డంతన్. ౧౬౮

చ. వలిమలరాచబిడ్డయగు పార్వతికై మును శూలిచిత్తముం
గలఁచిన బాణమున్ సరకుగైకొనఁ డక్కట, నేను శంకరుం
గెలిచినవాఁడఁ గానొ! యిది కీడ్వడఁజేసినయమ్మ గాదొ! నా
బలము కృశంబుగాఁ దఱిఁగి పోవ్వడెనో! యని లోఁ దలంకుచున్. ౧౬౯

తే. గీ. కుసుమశరములు సరకుగాఁ గొనఁడితండు
రతియుఁ జాలదు వీని సంరంభమునకుఁ
గాన భూతగణమునకు లోనుజేయ
గెలుతు నని యెంచుఁ దన భూతములను దలఁచె. ౧౭౦

సీ. తలఁచినయంత గదాప్రాసవరశరప్రముఖానేకాయుధపాణు లగుచు
నైకంబులైన యాననములు నైకంబులైన నేత్రములును నైకములగు
రూపులు గల్గువారునునగు భూతభృత్యులు వేనవే ల్వచ్చి యుత్సుకులయి
క్రూరమృగంబులై కొందఱు వడగండ్ల కొండలు గురిపించి కొంతమంది

తే. గీ. కొండచిలువలుగా వచ్చి కొంతమంది
కుంభవృష్టులు గురిపించి కొంతమంది
కుజములఁ బెఱికి వైచుచుఁ గొంతమంది
యేఁచి బాధించి రా శాక్యనృపతనూజు. ౧౭౧

తే. గీ. ఇట్లు భూతగణంబు లనేకగతుల
బాధ సేయఁగ శాక్యనృపాలసుతుఁడు
భయముఁ గాంచక ధైర్యంబు పాటుచెడక
సంచలింపక యుండెఁ గాష్ఠంబుపగిది. ౧౭౨

క. తన చేయు కితవమార్గంబునఁ బడని మునీంద్రు ధైర్యమున కెటు భంగం
బని యెంచు మన్మథునకున్ వినఁబడె నాకస్మికముగ వింటం బలుకుల్. ౧౭౩

శా. ఓరీ, మార! యిఁకేల మానుముర, నీయుద్యోగ మీమౌని యా
చారంబుం దెగఁదీయ నీతలమె? విజ్ఞానంబు నానాభవో
దారంబై ఘటియించె నీతనికి ; సూర్యాచంద్రమోవహ్నులుం
బారావారము లాఱుఁగాని చలియింపం డీతఁ డింతేటికిన్. ౧౭౪

సీ. అజ్ఞాన మనియెడి యంధకారం బేర్చు రత్నప్రదీప మార్పం దలంబె
దుర్బోధమను రవిద్యోతంబుఁ దొలఁగించు పారిజాతంబుఁ గూల్పం దరంబె
కుమతంబులను గ్రావరాజములను బెకలించు భద్రనాగంబుఁ జంపం దరంబె
జీవహింసాదావపావకంబు హరించు పటువారిదంబు రేపం దరంబె

తే. గీ. నీ తలకు మించిపోయినరీతిఁ జేయఁ
బూనుకొంటివి, నీబుద్ధి బూదెగాను!

బాగ్గతంబగుకీర్తియు భంగపఱుపఁ
దగునె, చాలింపు మీపాడుతెగువ మార ! ౧౬౫

శా. అంత న్మారుఁడు, బుద్ధుఁ డీజగమునం దజ్ఞానముఁ మాపి తా
నెంతే జ్ఞానలతఁ నిగుడ్చు, నిఁక నేనేరీతి నిం దెందు వ
ర్తింతుఁ ? జ్ఞానుల కీపరిచారములు విందే ? దీనికి న్మాఱు గా
వింతుం గాక యటంచు శత్రుగణముం బ్రేరేఁపెఁ ; బ్రేరేఁపినఁ. ౧౬౬

క. చెలరేఁగెడి యార్పుల నిమ్ములఁ గామక్రోధలోభమోహాదులు ధీ
లలితుఁడగు బుద్ధునకు నాసలుగొల్పి కలంపఁజొచ్చె స్వస్వోచితిగఁ, ౧౬౭

ఉ. కోరికవుట్టుఁ, గ్రోధ మొనఁగూడు, దురాశ జనించు, లోన నే
పారు మదంబు, కైపొదవు, నంతన పంతము హెచ్చు ; దుస్థితిం
జేరఁగనీని యమ్మహితు చిత్తమునం దిటులైన నన్యు లె
వ్వారు జయింపనేర్తు ? రరివర్గ మెదిర్చి కలంపఁ జొచ్చినఁ. ౧౬౮

క. పదపడి యాతం డిది నెమ్మది నెఱిఁగినవాఁడు గాన మఱపుఁ గనక దు
ర్మదమగు నరివర్గంబుం బెదరించి కలంప నదియు భీతిలి యేగెఁ. ౧౬౯

వ. పిదప నహంకారమ్మను మాయయు సాహసికత్వంబును జిగీషయు గర్వంబును నవిద్యయు లోనుగాఁగల దుర్గుణమ్ములు స్వస్వరూపంబుతో నెదుటం బొడకట్టి బుద్ధిం గాసిపెట్టినను నతండు నిర్వికారుండై యుండె. ౧౭౦

సీ. అంధకారముభంగి నావరించెడి మాయ కిసుమంతయైనఁ జోటీక కలఁచి
పృథ్వీధరముభంగి పెచ్చుపెరుఁగు నహంకారంబునకు లోనుగాక మిగిలి
కారుబెబ్బులికైవడి గదియు గర్వమున కావంత యేనియు లోఁగ కట్టె తఱిమి
కడలి పోలికఁ బొంగుఁగను జిగీషాపిశాచము కంటఁబడక వంచన ఘటించి

తే. గీ. యధికవిజ్ఞప్తి నెసఁగు సిద్ధార్థు నెదుట
నంగనల రంగులును నయ్యనంగ దేవు
సంగతులుఁ గోకిలాలాపభంగులును బె
డంగుఁ గనలేక యూరక డంగువడియె. ౧౭౧

వ. అంత మగనుండును. ౧౭౨

చ. సుచిరకృశాంగియౌ నల యశోధర పుత్రునిఁ గక్షమందుఁ దా
ల్చిచి, 'నను వీడు టొప్పగునె ? లేవు, ననాథ ననాదరింతురే ?

విచికిలగంధు లీవిరహవేదనకుం దగువారె,' యంచు నే
డ్చుచుఁ దను నెంచుభంగి నృపసూనుని కట్టెదుటం గనంబడెన్. ౧౬౩

క. కనుపట్టిన నివియెల్ల మనుని చెయ్వులె యంచు లోనరోయుచు బుద్ధుం
డనుమాన మొకించుకయును గనకుండె; వికారమెట్లు ఘనులకు నొదవున్ !

వ. ఇట్లు మదనోద్యోగంబు విఫలం బగుటయు. ౧౬౫

ఉ. మాయ య దెంతకేని నవమానముగాఁ దన కెంచి మీఁద న
త్యాయతమైన వృష్టి భయదమ్ములు గర్జితముల్ చెలంగఁగా
వాయు వమేయమై విసరఁ, బాదపముల్ ధరఁగూలఁ గల్పనం
జేయుడు నాతఁ డెయ్యెడ వసించునొ యయ్యెడ కెక్క దద్దియున్. ౧౬౬

క. పదపడి దిక్కులు తెల్వొం బొదలెన్ ధర నిర్మలత్వముం గనెఁ గడు మే
లొదవెన్ సత్వములకు దివ్యదృష్టి యుదయించె నంత నయ్యనఘునకున్. ౧౬౭

వ. ఆ దివ్యదృష్టికతన నతని కెదువందలయేఁబది జన్మమ్ములందలి తనవృత్తాంతం బెల్లఁ గన్నులకుం గన్పట్టుటయేకాక పూర్వాపూర్వకృతసుకృతదుష్కృతంబు లుత్తరోత్తరసుఖదుఃఖ కారణంబు లని తెలియంబడియె; నంతఁ బ్రతిమనుజునకు యోగాయోగంబులకుఁ బురాకృతంబ కారణం బని యెఱింగి సంసారంబు కదళీగర్భనిస్సారం బని తలపోయుచు ననంతమ్ములగు లోకంబులును సూర్యాదిగ్రహమండలవిశేషంబులును వానిగతులును వీచీతరంగన్యాయంబునం బొదలు ననియు, వీని కన్నిటికి నొకమహాశక్తి పట్టుఁగొమ్మయై యలరు ననియు, నయ్యది యిచ్ఛామాత్రంబునఁ జీఁకటినుండి వెలుతురును మృతినుండి ప్రాణమ్మును శూన్యత నుండి పూర్ణత్వంబును నరూపంబునుండి రూపంబును గల్పింపఁ జాలు ననియును, నీయర్థంబున కొ నసువారలును గా దనువారలును లే రనియు, నిదియే సర్వోత్కృష్టం బనియు, వికారశూన్యం బనియు, సృష్టిస్థితిలయంబులకుం గారణీభూతం బనియుం దెలిసికొని ప్రతిమనుజుండును బ్రతికినన్నాళ్లు చిన్నపెద్దలను భేదంబును జాతిగుణక్రియాభేదంబును దలఁపక ప్రాణిహింస పర్జించి సర్వసమత్వంబుఁ గాంచిన నుత్తమజన్మంబు లభించి క్రమంబున నిర్వాణమను నుత్తమపదంబు నొందుననియుం గని పెట్టె. ౧౬౮

క. నాలవజామున ధర్మోన్మూలన మొనరించు పాపమున దుఃఖభరం
బేలీలఁ జెలఁగునో తా నాలోకముఁ జూచె నిశ్చలాత్ముం డగుచున్. ౧౬౯

సీ. పెరుఁగుట తఱుఁగుట ప్రీతి యసూయయుఁ గర్తృత దుఃఖంబు గారకత్వ
మాదియగు సంగతు లలవడునంతకు జన్మరాహిత్యంబు జనుఁడు గనఁడు;
మఱియును సుఖదుఃఖమయమగు సంసృతి యనాద్య మని తెలియంగలేని
వారికి ముక్తి చేకూరదు; మాయావిలసనంబు మొదటికిఁ గసిమసంగి

తే. గీ. జీవితేచ్ఛఁ ద్యజించి యాశించు ముక్తి
నెవఁడు వాని కొదవు దివ్యదృష్టి; దానఁ
జేసి యఖిలంబుఁ దెలియు సుస్థితియుఁ గల్గు
నింత నిజమని బుద్ధున కెఱుక వొడమె. ౧౯౦

వ. ఎంతదనుక మనుజుండు మాయా జయింపకుండు నంతదనుక వాంఛామూలం బగు తృష్ణయు భోగమ్మును స్త్రీప్రియాత్వంబును యశోలిప్సయు నధికారశూరతయు జిగీషయు నహమిదం మమేదం అను నహంకారంబును బ్రతుకు పెరువునకై పడుపాట్లును లోనుగాఁగల విషయంబులం బ్రబుంగుడుచు ననయుచుండు. బుద్ధిమంతుండు పరిభ్రమింప, కనంతంబులగు జన్మంబులను పడుగుతో మనోవాక్కాయక్రియలను పేకను గలిపి యల్లఁబడిన జన్మపటంబు శుద్ధం బొనరించుకొని, పూర్వపూర్వవాసనావశంబగు నుత్తరోత్తరజన్మంబులను బొందుచుఁ, దుదకు జన్మసంపూర్తిఁ గావించుకొని, మాయాతీతుండై, శరీరస్కంధమ్ములకు వేఱై, యుపాదానబంధంబులం బట్టువడక, కాలచక్రావర్తంబునందిరుగుడువడక, సుప్తుండు మేల్కను తెఱంగునఁ దెల్విం గాంచి, యనిర్వాచ్యంబును నానంగమయంబును బాపరహితంబును నిర్వికారంబునగు నిర్వాణపదవిఁ బొందు నని కృతనిశ్చయుండై పరమానందంబగు నిర్వాణపదవి యధిష్ఠించి యున్నంత. ౧౯౧

తే. గీ. అరుణుఁ డుదయించె, నాతని కిరణములకుఁ
దారలన్నియు వెలవెలఁ బాఱఁజొచ్చెఁ,
గొండలం దెల్లయెడల నీరెండ ప్రబలెఁ
గమలకుట్మలములకు వికాసమొదవె. ౧౯౨

సీ. పచ్చికపట్లపైఁబడు మంచుబిందువుల్ వజ్రకలపరిభ్రాంతిఁ జేసెఁ
బృథివి నెల్లెడఁ గాంతి విస్తరింపఁగఁ బొచ్చెఁ గెంజాయ మేఘపఙ్క్తిపయి నెగడెఁ
దాళద్రుపత్రముల్ తళతళమీఱు బంగారు చామరములసొరుఁ దాల్చె
హరిణంబు లాదిగా నతిసాధుజంతువుల్ క్రమముగా మేల్కాంచఁగాఁ దొడంగె

తే. గీ. శుకపికాదికసర్వపక్షులును నిదుర
లేచి సూర్యుని వినుతి సల్పెడు విధమునఁ
గూయ మొదలిడె నంత సర్కుండు వొడిచె
దిక్కులం దంతకంతకుఁ దెల్వి హెచ్చె ౧౯౩

క. ఆనాఁటి సుకృత మేమనఁ గానగు, మది నెల్లరకు వికాసము ప్రబలెన్
శ్రీ నెగడి రెల్లవారును జ్ఞానోదయ మతని మదికిఁ గలిగిన కతనన్. ౧౯౪

సీ. వర్తకుల్ మోసంబు వర్జించి తూఁచిరి నన్యులెల్లరు దొంగతనము మాని
రని సేయువారు తా మంతతో విరమించి రాధివంతులబాధ లడఁగఁదొడఁగె,
గటికవాండ్రును గత్తిఁ గడకొత్తి రజ్ఞానులకునెల్ల జ్ఞానవిలసన మొదవె
రోగులెల్లరును నీరోగులై చెన్నారి రెల్లజంతువులకు నెలమి వొడమెఁ

తే. గీ. జచ్చిపోయెడి వారలు నయిత మతని
జ్ఞానలవ మింత సోఁకిన కతననొ య
నంగ విస్మితవదనులై యులరి రది; యి
ది యన నేటికి సర్వంబుఁ దేటపడియె. ౧౯౫

క. ఆకాశమునం దమరులు మాకార్యము ముగిసె ననుచు మతికి సంతో
షైకస్థితి వచియించుచుఁ బ్రాకటముగఁ బూలసోన వర్షించి రొగిన్. ౧౯౬

క. చిరవిరహవేదనాభరపరవశయై పగలఁ బొగులు పావనికి యశో
ధర కానాఁడు హృదబ్జాంతరమున నామోదరసము తానై వొడమెన్. ౧౯౭

మ. పులులున్ లేళ్లను నొక్కచో మసలెఁ, బాముల్ క్రౌర్యముల్ మాని యూ
దలలన్ వంచి చరించెఁ, గొంగలకు మత్స్యంబుల్ భయంబొంద కెం
దు లలత్తుంగతరంగరింగణములందుం గంతులన్ వైచె, నొ
క్కగతిం దోఁచెఁ బ్రపంచ మెల్లరకు వక్రక్రియాశూన్యమై. ౧౯౮

వ. అట్టియెడ సిద్ధార్థుండు బుద్ధుండై.

శా. ఎన్నే జన్మము లెత్తి యెత్తినను నే నెంతేని నీరీతిఁ గా
నన్నేర; న్నిను నేఁటికిం దెలిసికొన్నాఁడన్ భవద్వృత్తినో
యన్నా! మామకజన్మకారణ మమాయాచాకచక్యక్రియా
సన్నంబైన శరీరలబ్ధి కిఁక నేసంధింతు నంతస్స్థితిన్. ౨౦౦

వ. అని యనుకొనుచు నిర్వాణపదారూఢుండై యావటవృక్షంబు క్రిందన ధర్మాసనం బున నాలుగుసప్తాహంబులు గడపి నానాదిగంతసమాగతులగు నంతేవాసిజనంబులకు నిర్వాణసాక్షాత్కారంబు నుడువుచు నాప్రిదేశంబు కదలి సతతసంసేవ్యమానపరస్సహస్రసజనసమాకులుండై యెడనెడ నగరపల్లీవనపర్వతప్రదేశంబులం బోధిసత్వం బుపదేశించుచు విజ్ఞాత లగు నంతేవాసిగణంబుల నుపదేశకులఁగా లాఁతి దేశంబుల కంపుచుం జనిచని. ౨౦౧

క. మన నగరంబున కెన్నఁడు చనుదెంచునొ, తమను నెపుడు సమయించునొకో ?
యని తలఁచు బింబిసారావనిపతిపురి బుద్ధరజనిపతి యుదయించెన్. ౨౦౨

## —♦ ఆశ్వాసాంతపద్యములు ♦—

క. ప్రకృతపురాతనకవిరాజకృతాంధ్రకృతిప్రపంచసారస్యమిళ
త్ప్రికృతీ! సుకృతీ! మదనానుకృతీ! కృతిమార్గసేవినోదితసుకృతీ! ౨౦3

మ. కవిరాజానుమతప్రిచార! లలితాకారా! గుణాపార! సం
దివరాభిష్టుతసైజసార! స్వకథానీతామృతాస్వాదిమా
నవరాణ్మౌళినుతా! నతార్తిజన! ధన్యప్రాభవా! రెడ్డిపో
లవరాధీశ్వర! కృష్ణరాయనరపాలా! సత్యశీలాగ్రిణీ! ౨౦౪

## —♦ సుగంధి ♦—

ధీరధీర! గర్వదూర! ధీవిశాల! శాంతిశూ
రా! రమాకుమారతుల్య! రాజనూయమానవి
ద్యారసప్రసన్నతాంధ్ర తత్కవిత్వకర్తృవా
రా! రసాబుధేంద్ర! కృష్ణరాయభూమిపాలకా. ౨౦౫

ఇది... శ్రీతిరుపతివేంకటేశ్వర ప్రిణీతంబైన బుద్ధచరిత్రంబను
మహాప్రిబంధమ్మునందుఁ జతుర్థాశ్వాసము.





శ్రీరస్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# బుద్ధచరిత్రము

## పంచమాశ్వాసము

క. శాంతరసాపూరితహృదయాంతర! కాంతస్వరూపయశఆనీతా
శాంతకృతాకించనతాకృంతన! కవిరాజగేయ! కృష్ణారాయా! ౧

వ. అవధరింపు మనంతరం బట్లు బుద్ధుండు రాజగృహపురంబుం జేరియుండె; నిచటఁ
గపిలవస్తుపురంబునఁ దండ్రి శుద్ధోదనుండు. ౨

మ. ప్రతిదేశమ్మును జారులం బనిచియుం బైరాగులం గాంచిన
పు తనూజాతుఁడు వారిలోఁ గలసినాఁడో యంచు వీక్షించియుం
బ్రతివారమ్మును యత్న మెంతయయినం బాటించి పాటించి త
త్స్థితి యొక్కింతయుఁ గానరామి మదిఁ జింతించుం దివారాత్రముల్. ౩

వ. వెండియు సిద్ధార్థభార్యయును బరమపతివ్రతామణియునగు యశోధర సారె
సారెకుఁ బ్రాణనాథు గుఱించి విలపించియుఁ దూరాగతులగు సార్థవాహుల నడి
గియు నచ్చటచ్చటికి వార్తలు పంపించియుఁ దరువాత నించుకేనియుఁ దదు
దంతంబు గానరామి నిట్లు చింతించు. ౪

ఉ. ఇంటికి నెంత దవ్వయితో, యేగతి మార్పును జెందినాఁడవో,
కంటికి నింత బర్వయితె కట్టిఁడిమాలవిధాత కక్కటా!
చంటికుమారునైనఁ గనఁజాలు నదృష్టము నోఁచనైతి, వే
వెంటఁ జరించుచుంటివొకో? వేదన నే నెటు లోర్తు నాయకా! ౫

క. బ్రతికియె యుంటివొ? లేదే మృతియేఁ గన్గొనాఁడవో? మతిమాలితివో? నీ
స్థితి దెలియదాయె; నే నేగతిఁ బ్రాణము నిల్పుదానఁ గఠినాత్మకనై. ౬

క. ఈ కపిలవస్తుపురమం దేకచ్ఛత్రాధిపత్య మొనరుచు సన్యా
సాకులత శోకమందుట నీ కెటు తగునయ్య? ధాత నిర్దయుఁడు గదా. ౭

క. మీయయ్యకన్న వెండియు నాయీసుతుకన్న మఱియు నాకన్న నృపా
లా! యెంతపుణ్యగతియో మీయమ్మకు ధాత మున్న మృతిఁ గల్పించెన్.

వ. అని మఱియు దుఃఖావేశంబు సైఁపఁజాలక, ౯

తే.గీ. శాక్యవంశసంభవుఁడగు చక్రవర్తి
ననఘు నేమంచు నెంచి సన్న్యాసిఁ జేసి
యడవి నిడుమలఁ గుడిపించె దకట, ధాత!
యుచిత మనుచితమును నెంత యుండవలదె! ౧౦

క. ఇటుఁ జింతించుచుఁ గడు నక్కటికం బొలయంగఁ గల్పకల్పము గాఁగన్
త్రుటిఁ గడపుచు నొకనాఁ డెక్కటిఁ జనెఁ బూఁదోఁటకు మధుకాలమునందున్.

మ. అలరు ల్వ్రాలెడు నించు పూఁబొదలయం దందంద విశ్రాంతికై
మలయుం, దానును భర్తయు న్మనుపు సన్మానించు వృక్షాళికిం
దలఁకున్, లోనులుకుం, దిటంబు గను, వంతం గాంచు, శంకించు, లోఁ
బలవించుం జెలికాని చెయ్వులకు నప్పద్మాక్షి విభ్రాంతయై. ౧౨

మ. పదము ల్దొట్రిల నెమ్మనం బవియ బాష్పప్రావృతంబై వసం
తదశం జూడఁగనీక కన్నుఁగవ వంతం గూర్ప నెమ్మే న్వడం
కఁ దదాయత్తమనస్కయై యొకట నక్కాంతాలలామంబు గ
ద్గదకంఠంబున నొక్కకాలువదరిం గాలూఁది యాలోలయై. ౧౩

క. మొగమునఁ బడు జడలం దగ నెగఁద్రోయుచుఁ గాంతి దక్కి యెంతయుఁ గృశమై
పొగిలెడి చెక్కిం దాదృశమగు కేలం గీలుకొల్పి యవనతముఖియై. ౧౪

సీ. ఉత్సవం బనుచు శాక్యుల కేఁడు చాటింపఁ బాటించి నన్నేల పంపెఁ దండ్రి?
పంపుఁగా, కందఱు పడఁతులవలెఁ గాక యతనిమానసము నన్నంట నేల?
యంటుఁగా, కాత్మవిద్యాసక్తుఁ డని యెఱింగియు నమ్మహాత్ము నెనయు టిదేల?
యెనసిన నేమి, నన్నెంతేని గారవమ్మునఁ జూచి తుదకిట్లు చనఁగ నేల?

తే. గీ. చనిన వారలు లేరె, యీసరణి వార
లైనఁ దెలియంగ నీతని యట్టివారు
గానఁ గారారు గాని; యేఁ గడచు టెట్లు
లీవియోగాబ్ధి? దుర్యోగ మెట్లు తప్పు? ౧౫

చ. అని పలుమాఱు నెమ్మనమునందుఁ దలంచుచు మిమ్ము మన్ను నో
క్క నియతిగా నఱందురమఁ గాంతుఁడుఁ దానును మున్ను పేర్మి నె
క్కొనఁగ వసించినట్టి సుమకుంజములం గనుఁగొంచు 'నక్కటా'
యనుచుఁ బురాకృతం బనుభవైకవినశ్వర మంచు నెంచుచున్. ౧౭

వ. పశ్చాత్తాపాతిరేకమ్మున మణిమయమ్మును సిద్ధార్థుండు తనకిచ్చినదియు నగు,
మేఖల కేలం గొని పతి లేచిపోయిననాఁటి రాత్రి నుద్దేశించి. ౧౮

మ. అకటా! కృతిమ మింతయే నెఱుఁగ కన్యాసక్తుఁడుం గాక ని
ర్వికలం బైనమనంబుతో ననుఁ గడుం బ్రేమించి నిద్రించు నా
యకుని న్నాదగు పక్క నుండి యెడసేయం జాలి తో రాత్రి! జా
లికి దూరంబగు చేరికేనియును మేలే, చాలు దుశ్శీలినీ. ౧౯

వ. అని నిందించి యంతంబోక కొమరుం డగు రాహులుం గూర్చి ౨౦

మ. కొడుకా! యెంతటి గుర్వుహర్వార్తమున నాకు నీవు గర్భంబునం
బడితో, నాఁటి నిశీథమందు జనకుం బైరాగిఁ గావించి పె
క్కుడుమ ల్పొందఁగఁ జేయుచుంటి వకటా! యేమందు నీచంద, మె
వ్వఁడు తండ్రి న్సుఖపెట్టు వానికిఁ గదా వర్తింపనుఁ బుత్రుం డనన్! ౨౧

చ. అని పలుమాఱుఁ దల్లి వడునార్తి యొకించుకయేని బాల్యవ
ర్తనుఁడగు రాహులుం డెఱుఁగరాని సమీపమునం దెలర్చు పూ
లను దగఁ గోసి తెచ్చి మిగుల వ్వగలం దగులంగఁ జేయఁ గే
ల నిడుచుఁ గేరుచుం దుముకులం గొలుపున్, శిశు వే మెఱింగెడున్. ౨౨

వ. అట్టియెడ వెండియు నయ్యశోధర శోకావేశంబున నలుగడలం దిలకించి. ౨౩

చ. అవని సమస్తముం దిరుగు హంసవతంసములార! మేటి జ
క్కవకవలార! నా యెఱుకఁ గాంచి చరించు పికమ్ములార! కీ
రవరములార! యెం దయిన రానుతు జాడ లెఱుంగవచ్చెనే
నవసరముం గ్రహించి ననునాథనికి న్వచియింపుఁ డోప్పుగన్. ౨౪

మ. నుతుఁ డేడేండ్లవయస్సువాఁ డనియు నింజాడ న్మనంబందు బ
ల్కుతుకంబారఁగ నున్నవాఁ డనియుఁ గోర్కుల్మిన్నుముట్టంగ నీ
సతిరైయె నట్టి యశోధరాతరుణియుం జాలేక ప్రాణావశే
షితరైయె యాగతి నిల్చియున్న దనియు న్నీగ్రఘుంబె పంపందగున్. ౨౫

వ. అని యిట్లు పరిపరివిధంబులం బలవించుచుఁ గొందలమందు నయ్యశోధరపాలికి
నెచ్చెలు లరుదెంచి యిట్లనిరి. ౨౫

తే. గీ. హస్తిపురినుండి యిర్వ్యోడ కరుగుదెంచి
నార లిరువురు వర్తకు, లార్వారిపేర్లు
త్రిపుషభల్లూకులఁట, సర్వదేశములు చ
రించునెడఁ గాంచిరఁట శాక్యనృపతనూజు. ౨౬

వ. వార లిరువురు మన కోట దక్షిణద్వారంబున విడిసియున్నవార, లోదేవి! యంద
మగు సరిగంచు దుప్పట్లును మంచికత్తులును చిత్తలపాత్రములును దంతపుసస్తు
వులును సుగంధద్రవ్యములును జిత్రచిత్రమ్ములగు పక్షులును నమ్మఁదెచ్చి రని
మఱియు నిట్లనిరి. ౨౭

ఉ. దీనికి శేమి గాని విను దేవి! భవత్పతియౌ నృపాత్మజు
న్మానుగఁ జూచి వీరలు నమస్కృతి సల్పితి మంచుఁ జెప్పి, రా
జ్ఞానధనుండు జ్ఞానులకు సైతము జ్ఞానము దెల్పుచుం గృపా
సూనతఁ బూని పూజ్యుఁడయి యున్నవిధమ్మును జెప్పి రచ్చుగన్. ౨౮

క. ప్రకటగతి బుద్ధుఁ డను సార్థక నామము పూని యిద్ధరన్ దానెంతే
నకలంకబుద్ధి లోకోపకృతికిఁ జరియించుచున్నవాఁ డఁట, తల్లీ! ౨౯

క. అని నెండియు నాపెకు నిట్లని 'గోవనజాయతాక్షి! యతఁ డిచ్చటికిం
జనుదెంచు నైన్వళమ్మనియును జెప్పిరి యెంతనిక్కమోయది' యనుడున్. ౩౦

మ. పరమానందపరీతయై మనము డాఁపనా్రమి వేగ న్యశో
ధర 'యావర్తకుల న్నగౌరవవిధుల్ దైవాఱ నాయొద్దకు
న్సరవిం దోడ్కొనిరండు, రాకొమరు సచ్చారిత్ర మాలించి, వం
దురుకర్ణమ్ములకున్ రసాయన మొనర్తుం, జింత లిం కేటికిన్. ౩౧

క. వారలు కోరుకొనిన బంగారము రత్నములు గానుకఁగా నిచ్చెద, మీ
కోరినయవియును మీకుం గారవమున నిచ్చి పుత్తుఁగా చెలులారా.' ౩౨

వ. నావుడు నెచ్చెలు లేగి యాసార్థవాహుల రావించుటయుఁ దెరచాఁటుగ నిల్చి
యుండి యాయశోధగయు. ౩౩

ఉ. ఓయనఘాత్ములార పరమోపకృతిం బొనరించుచుం జగం
బేయెడ నిల్లుగాఁ దిరుగు నీనృపనందను చందమెల్ల నా

యీయెడఁ గాంచి యీయెడకు నమ్మహనీయుఁడు వచ్చునంచు మీ
రే యిటుఁ దెల్పినార లఁట, యీయది సత్యమకా వచింపుఁడీ. ౩౪

వ. నావుడు నందుఁ ద్రిపుషుండనువాఁ డిట్లనియె. ౩౫

శా. తల్లీ! యయ్యమలాత్ముఁ జూచితిమి, తత్పాదద్వయి న్భక్తి సం
ధిల్లన్ మ్రొక్కితి, మగ్గురుం డఖిలపృథ్వీనాథమాళిస్థలో
త్ఫుల్లశ్రీఖచితాంఘ్రుఁడై సుఖముగా బోధ్యాహ్వయమ్ము న్నము
ద్యల్లీలమ్మును నైన మఱ్ఱికడ బుద్ధత్వంబుఁ జెందెం దగన్ ౩౬

వ. అవ్వటవృక్షంబు మగధదేశమ్మున ఫల్గునీనదియొడ్డున గయానికటమ్మున నున్నయ
ది; యమ్మహానుభావుం డెల్లరకు విజ్ఞానంబు తేటతెల్లంబుగ బోధించుచు ననేక
జనానుగమ్యమానుం డగుచు మహోన్నతానందపదవియం దున్నవాఁ; డింతయేల,
గాలివెంట జీర్ణపత్రంబులకేనియు గోపాలునివెంట గోవులమంద కేనియు యుగ
పద్గమనం బలవడకుండుఁ గాని యమ్మహాత్మువెనువెంట నెల్లజనులకు యుగపద్గ
మనం బలవడకుండ దని మఱియును ౩౭

క. తొలకరివానలకు న్మంగల నాతం డిటకు వచ్చుఁ గలకంఠీ! నా
పలుకులు సత్యము లిందుం గలుగ దసత్యంబు నీవు గాసిలకు మిఁకన్. ౩౮

చ. అనుడు యశోధరాబ్జముఖి యంపనిమ్రానిఫలంబు చేతికం
దినగతి సంతసించుచు మది న్మతి కోరుకు లెన్నియేని నిం
పును ఘటియింపఁ దన్మయతఁబొంది పొరింబొరి మూర్ఛచెందె; నం
గనలకు నింతకంటె సుఖకాలము వేఱొకఁ డెందుఁ గల్గునే. ౩౯

వ. ఇట్లు పరవశయై తనంతన తెలిసి వారలఁ గాంచి మేదురం బగు నాదరంబున
నిట్లనియె. ౪౦

క. అనఘాత్ములార! జ్ఞానము జనియించె నతనికి నని వెసం జెప్పితి, రే
యనువున నాసంగతి మీకు నెఱుంగంబడియె నాకుఁ గొంచక చెప్పుఁడా. ౪౧

వ. నావుడు భల్లూకుండను వాఁ డిట్లనియె. ౪౨

చ. ధరణి వడంకె వాయువులు తద్దయు భీతియొసంగ వీచెఁ బె
న్వాఁజదలు వచ్చె, నన్నియును జ్ఞానము నీపతి కబ్బుటోర్వ క
మ్మరుఁ డొనరించు చెయ్వు లని మాకు వినంబడెఁ; దానఁ జేసి మే
మరిగి సమాధినిశ్చలు మహామహుఁ గంటిమి మఱ్ఱిచక్కటిన్, ౪౩

వ. పెండియు నమ్మహనీయుఁడు ప్రభాతమ్మునఁ బూర్వమ్ముకంటె శతగుణమ్ముగ తేజమ్మునఁ బద్మబంధుం డుదయించె; సమస్తజనులహృదయమ్ములు నమందానందకందళితమ్ములయ్యె; నిది యిట్లుండ నాకాశవాణి, 'యోబుద్ధా! నీ తెలిసిన విజ్ఞానంబు జగంబున కుపదేశించి యందఱం గృతార్థులఁ జేయు' మని పల్కెడు బుద్ధుండు నమ్మాటకుఁ జెలునగ వంకురింపఁ దత్తత్త్వుల కిట్లనియె.

చ. వినుఁ డొకమాట దెల్పెద, నవీనులకుం బరిపాకశూన్యులై
తనరెడివారి కెక్కరణిఁ దత్త్వము తేటపడుం? దినేంద్రుఁ గ
న్గొనియును బూలచందమునఁ గుట్మలము ల్వికసించునే? పురా
తనపరిపాకవంతులగు తాత్త్వికులం గరఁగింతుఁ గావునన్. ౭౫

వ. అని కొండొక యుపన్యసించి యచ్చోటు గదలి వారణాసికిం బోయి యచ్చోటఁ గౌండిన్యభద్రకాశ్యపజిద్బసవమహానాము లను నేగురకు శిష్యులకు జననమరణమ్ములు నశింపఁజేయు నుపాయమ్మును, సర్వమ్మునకుఁ బురాకృతం బగుసుకృతదుష్కృతరూప ధర్మంబు గాని వేఱొండు దైవమ్ము లే దనియు, నరకం బన వారు వా రొనర్చికొనెడి బాధయే యనియు, రాగద్వేషాదు లడఁపనేర్చినవారికి నిర్వాణంబు కరతలామలకం బనియు, నహింసయు భూతదయయుఁ గలవారలా నిర్వాణపదవి కధికారులనియు నుపదేశించె; నందుఁ గౌండిన్యుండు చక్కగ సంగ్రహించి ప్రజల కందఱికిఁ దాను నుపదేశం బొనర్ప నెంచి దేశసంచారమ్మునకు వెడలెఁ; దక్కంగల నలువురును గొంతకాలంబునకుఁ గౌండిన్యుని యట్ల విజ్ఞానులై లోకోపకృతికై పాటుపడుచు దేశమ్ములు చరియింప నేగిరి. ౭౬

క. పదపడి యశోదనృపుఁ డేఁబదినల్వురుభృత్యులు దను బలిసికొలువ న
భ్యుదయార్థి యగుచు నేతదుపదేశమును బడసి తత్త్వపారగుఁ డయ్యెన్. ౭౭

వ. శుద్ధసికతాప్రదేశంబునందు జలప్రవాహంబునంజేసి తృణోదయంబగు పగిది బుద్ధుని యుపదేశంబున నారాజభృత్యులకును మనంబుల జ్ఞానాంకురమ్ములు వొడమి ముక్తికారణమ్ము చేకూరెననుసంతసమ్ము బలిసె; నిట్లు జితేంద్రియులైన యాయఱువదిమంది శిష్యులును నానాదేశంబుల కేగి బౌద్ధమతం బిప్పటికి నుపదేశం బొనర్చుచుండి; రేము నమ్మహానుభావువెంటఁ గొంతదూరము చని పూర్వజన్మసంస్కారంబు లేమిఁ దదుపదేశంబు మనంబున కెక్కక యథాపూర్వంబగు సార్థవాహవృత్తిం జరించుచు నిట కరుదెంచితిమి;

తే.గీ. బుద్ధుఁడును బింబిసారుఁ డప్పుడమిఱేని
నరసి బోధింప రాజగృహాభిధాన
నగరమున కేగి యతనికి జ్ఞాన మొసఁగె
నచటివారెల్ల జ్ఞానులై రతనికతన. ౪౯

వ. పిదప బింబిసారుండు గురువరుండగు బుద్ధున కధికంబగు సపర్య యొనర్చె. ౫౦

క. గురుదక్షిణగా ధరణీధరకందరసవిధచలదుదారసుధాం
బురసప్రవర్ధితనగోత్తర మగు వేణువన మొకటి దానముచేసెన్. ౫౧

వ. మఱియు నవ్వనంబున విశాలంబగు శిలాఫలకం బొండు స్థాపించి యం దిట్లు వ్రాయించె. ౫౨

క. "జన్మములకుఁ గారణమును జన్మమ్ములవలనఁ గల్గుసంసృతిదుఃఖం
బున్మూలించు విధంబును సన్మతి బుద్ధుండు తెల్పె సదయత నాకున్." ౫౩

వ. వెండియుఁ బూర్వోక్తంబగువనంబున నొక్కనాఁడు గొప్పకూటంబు గావించి యందు బుద్ధుం డతిధారాళంబగు వాక్ప్రపంచం బనేకులచిత్తంబుల కెక్కునట్లు రసవంతంబుగ నొకయుపన్యాసంబు చేసె. ౫౪

తే॥ గీ॥ ఆయుపన్యాసమును విని యందలి జను
లందుఁ దొంబదివందలమంది బుద్ధు
నివలె సన్యాసులై నీతి నెగడఁజేయ
నేగిరి జగమ్ముఁ గ్రుమ్మర నితనియాన. ౫౫

వ. పూర్వోక్తంబగు నుపన్యాసంబు ముగించుచు నందు సారభూతమ్ములగు వాక్యమ్ములు కొన్ని వచించె నయ్యవి వివరింతు. ౫౬

తే. గీ. ఒగి నసత్కర్మములను జేయునరు లెన్న
టికి విముక్తిని గనరు, యోగ్యకృతు లాచ
రించు వారలు వైళమ కాంచుదురు వి
ముక్తి నీయది ఫలితార్థముగ నెఱుఁగుఁడీ. ౫౭

వ. కావున నెల్లవారును సన్మార్గానులంబకులును జితేంద్రియులునై యుండవలయు నియ్యదియె మోక్షంబునకు ముఖ్యమార్గం బని విరమించెనఁట, అని చెప్పిన యశోధరయుఁ బరమానందభరితయై వారలకుండగు బహుమతు లొసంగి 'యమ్మహానుభావుం డిపు డెచ్చట నున్నవాఁడో యెఱుంగుదురె' నావుడు వార లిట్లనిరి.

తే. గీ. రాజగృహ మను నప్పురరాజమంద
బుద్ధుఁడున్నాఁ, డిచటికి నప్పురమునకును
యోజనము లొక్క యఱువదియుండు మధ్య
శోణనదమును మలలును జూడనగును. ౫౯

వ. అనవుడు నప్పతివ్రతామణియు వాయువేగంబునం బోవు గుఱ్ఱపురౌతులఁ గొందఱం బిలిపించి వారలచేతి కి ట్లొకకమ్మ వ్రాసి యిచ్చి పంపించె. ౬౦

సీ. కుముదిని శశిరాకఁ గోరెడి క్రియ నశోకలతయుఁ బ్రోడయాకలికి కాలి
తాఁకు వాంఛించు విధమ్మున నీరాక చింతించు నామది సంతసం బొ
లయ నిట కొకసారి దయచేసి భవదవలంబితంబైన మతంబు నాకు
నుపదేశ మొనరించి కృపచూపఁదగు మహాత్ముల కనదలఁ బ్రోవఁ దలఁచుకంటెఁ

తే. గీ. గలదె సుకృతంబు? వైళమ కదలి చర్య
నం బొసంగి కుమారుని నన్ను జనకు
నసదృశానందవార్ధి నోలార్చి మరల
నేగు నవసరమేనియు నేగు మనఘ. ౬౧

వ. అట్టుత్తరమ్ము గ్రహించి వార లతిత్వరితగమనంబున రాజగృహపురంబునకుం బోయిరి, శుద్ధోదనుండు నింతకుమున్న పూర్వోక్తులగు వర్తకులవలన నీవార్త నెఱింగి తానుం గొందఱ నంపుచు వారితో ని ట్లనియెను. ౬౨

మ. ఒక యేడేండ్లరిగెన్ ననున్ విడిచి తానొక్కండునుం దేశయా
త్రికుఁడై యేగి, శరీర మింతదనుకం బ్రాణావశేషంబుగా
నొకభంగిన్ ధరియించి యుంటి, నిఁక నే నోపన్ ధరింపంగఁ; దం
డ్రికి శోకం బొదవించు పుత్రకునికంటెం దుష్టు లెవ్వారిలన్. ౬౩

వ. అని యతనికి బోధించి యెట్లయిన నన్నుం జూచునట్లు సంధింపుఁడు మఱియుం బురిలోఁ గలవార లాబాలగోపాలంబుఁ దనరాక కెదురుచూచుచున్నా రని వచింపుఁడు, పొండు నావుడు వారును శీఘ్రగమనంబున నరిగిరి. ౬౪

క. ఈరౌతులు నారౌతులు నా రాజకుమారు నొద్ద కరిగెడి వఱ కా
ధీరుఁడు బుద్ధుఁడు శిష్యుల కారసి బోధించుచుండె నమృతమయముగన్. ౬౫

వ. రౌతులును నదీయమ్మగు బోధామృతప్రవాహమ్మున కలరుచుఁ గర్తవ్యంబు మఱచి యిది వృష్టిసమయం బిది రాత్రిసమయం బని యెఱుంగక ప్రసంగానగతి

మరందాభిలాషమ్మునఁ జిక్కిన తేనెటీఁగల చందంబునఁ దదేకాయత్తచిత్తంబు
నం బొదలుచుఁ దదంతేవాసిగణంబునం గలసిరి. ౬౬

తే. గీ. పిదప శుద్ధోదనుఁడు పుత్రువిధము నరయ
నరిగి రౌతులు రాకుంట కాత్మ నెంచి
తనకు విశ్వాస్యుఁడును గుమారునకు బాల్య
హితుఁడునగు నుదయను బిల్చి యిట్లు పల్కె. ౬౭

క. మును పంపిన రౌతులు పుత్రునివార్తం దేక యెటకుఁ బోలఁగి చనిరో, సా
కనఘా! తెలియఁగరా దయ్యెను, నీ వరిగి యెట్టులైన నిది తేరఁదగున్. ౬౮

వ. అనవుడు నుదయనుండు వైళంబ రాజగృహంబున కరిగి యట బుద్ధుం గని తత్కా
లంబున నతండు శిష్యులంగుఱిచి యుపన్యసించు విధంబు కొండొకవిని తనచిత్తం
బును దన్మయం బగుట కచ్చెరు వంది తత్సమీపమ్మున సన్న్యసించియున్న
వార్తాహరులం గాంచి తాను నతని వాగమృతంబు గ్రోలిన నట్ల యగుదు
నేమో యను భయంబునం గర్ణపుటంబున మధూచ్ఛిష్టంబు గూరుకొని యతని
సమీపంబునకుం బోయి శుద్ధోదనుండును యశోధరయుఁ బల్కిన పల్కు
లన్నియు వచించిన నతండు కరంబులు ముకుళించి సభ్యులు విన ని ట్లనియె. ౬౯

క. జనకుండును నర్ధాంగియు ననుఁ గనుఁగొను తలఁపు మిగిలి నాయనుఁగు న్మి
త్రుని బంపిరి కావున నేఁ జను టుచితము తడ వొనర్పఁ జన దిఁక మీఁదన్. ౭౦

తే. గీ. ముక్తికారణమగు దేహమునకు హేతు
భూతులగు తల్లిదండ్రులచేతములకుఁ
బ్రీతిసల్పుట పెద్దయు నీతిపథము
నాకకా దీయది సమస్తలోకులకును. ౭౧

తే. గీ. ధర్మగతని జరించుచుఁ గర్మఫలము
ననుభవించుచు భూతమ్ములను సమస్త
విధములను దుష్టిచేయు వివేకధనుల
కబ్బు నిర్వాణపదము నిరర్గళముగ. ౭౨

వ. అని యుదయను దిక్కు మొగంబై, 'యే నతిత్వరితగమనంబున వచ్చుచున్నాఁడఁ
బొమ్మని నతండును గపిలవస్తుపురంబునకువచ్చి కడచినవృత్తాంత మెల్ల విన్నవించు
టయుఁ బౌరు లెల్లరు సంతోషదంతురితాంతరంగులై తమ గృహద్వారంబు లలం

కరింపఁజేసిరి. శుద్ధోదనుండును గోటకు దక్షిణద్వారంబున నొక్కవితానంబు గ ట్టించి రంభాస్తంభంబులు నారికేళపత్రంబులు నాటించి నానావిధచిత్రపటమ్ములు సంఘటించి గాయకవందిమాగధగణికాబృందంబు లందంద నుచితముగ మెచ్చు లొనర్ప నియమించి పరమానందంబునఁ గొమరు రాక కెదురుచూచుచుండె; నట్టియెడ యశోధరయు నొకపాలికి నెక్కి యా కాయమానమ్ము దాదాపున ధవునిరాక నిరీక్షించుచుండెఁ; బౌరులును నతఁ డెప్పుడు వచ్చునో యను తమ కంబున నెదురుచూచుచు. ౨౩

క. కొందఱు గోపురములు మఱికొందఱు మాడువులు మఱియుఁ గొందఱరంగుల్
నందడి నెక్కిరి కన నానందసముద్రాంతరమ్మునం దడఁబడుచున్. ౨౪

క. వచ్చెడి పాంథుల నందఱ నచ్చపు భక్తిమెయి 'బుద్ధుఁ డగపడఁడు గదా?
యెచ్చట నేనియు దారి న్వచ్చెడిచో' ననుచుఁ బేర్మివడ్డికిఁ బోఱన్.

క. అడుగుచును, గొంతదనుక న్నడచి కనుంగొనుచు, వచ్చునా యని లోలో
నుడుకుచుఁ బలవించుచుఁ నప్పడఁతి యశోధరయు నట్లపాల్పడి యుండెన్. ౨౫

వ. ఇట్లు కపిలవస్తుపురం బంతయు నాబాలగోపాలంబుగ నిందూదయంబునకు మున్ను గల్లోలితంబగు పాల్కడలి తెఱంగున నల్లకల్లోలంబై యుండె; నచట సర్వార్థసిద్ధుండును రాజగృహంబు వదలి యిరువు రంతేవాసులు దక్కఁ దక్కిన వారిం దనతోడ రావల దని నివారించి కపిలవస్తుపురాభిముఖుండై చనియె నంత.

చ. అమలు డొకండు హస్తమునయం దొక మృణ్మయపాత్రఁ బూని బి
చ్చమునకు నిల్లిలుం జనుచుఁ జక్కఁగఁ బెట్టినవారిఁబోలె బి
చ్చ మిడనివారి నేని నయసంగతిఁ జూచి నమస్కరించుచున్
గ్రమముగ రాఁ గనుంగొనియెఁ గాంతె యశోధర యాదరంబునన్. ౨౬

వ. మఱియు నిరువు రాతనింబోలెఁ గాషాయాంబరధారులై వెంబడి వచ్చుచుండిరి గాని మృణ్మయపాత్ర ధరించి బిచ్చమెత్తుకొను సన్న్యాసి ముఖసౌమ్యంబు మహా నుభావత్వసూచకంబుగాఁ గన్పట్టుటంజేసి యాతనిదర్శన మాచరించినతోడఁ బ్రతి మనుజునకు నితనికి శుశ్రూష చేయవలయు నను నిచ్చ వొడముచుండె. ౨౭

ఉ. ఆతని గాంచినంతన భయమ్మును భక్తియు నొప్పఁ బాదకం
జాతము సోఁక మ్రొక్కి పరిచర్య యొనర్చు మనంబుతోడ 'న
య్యో! తగువస్తు వీతనికి నొక్కటి యిచ్చిననుం గ్రహింపఁ డి
ట్లీతని వెంట నేనిఁ జరియించినఁ బుణ్యము గల్గు' నం చొగిన్. ౨౮

వ. స్త్రీలును బురుషులును నొకరివెంట నొక్క 'రిమ్మహాత్ముం డెవ్వ రొక్కో' యని లోలోఁ బ్రశంసించుకొనుచు నరుగుచుండిరి గాని యితఁడ సర్వార్థసిద్ధుం డని యొకండును గుర్తింపలేఁడయ్యె; నట్లమ్మహానుభావుండును రాజమార్గంబునం బోవుచు రాజద్వారంబు సమీపించునెడ యశోధరయు. ౭౧

సీ. సహకారకిసలయచ్ఛవితోడఁ దలనిండ జడలుగట్టిన కేశజములతోడ
రోహిణీసహితార్కరుచిత ప్తసుమలతాగ్రింబుఁ బోలిన శరీరంబుతోడ
దినకరచ్ఛన్నుఁడై తేజుఁబాసిన పూర్ణచంద్రుఁబోలిన ముఖచ్ఛాయతోడఁ
జిరదృష్టపతిరూపపరిపుష్టవైవర్ణ్యదైన్యసంతోషశ్రేవములతోడఁ

తే.గీ. గూడ నేడేండ్లరోహిలుం 'డేడ కేగె'
దంచుఁ జెలరేఁగుచును జీరయంచు లాగ
నెడఁద నేవేళ భావింపఁబడుచునున్న
జీవితేశ్వరు గుర్తించి చేరఁబోయి. ౭౨

క. హా సిద్ధార్థా! యని కడు నాసమెయిం గనుల నశ్రు లత్యధికతర
శ్రీసృష్టిసేయఁ బదములు కైసేసెఁ మిగుల నెగడు కచభరకాంతిః.

ఆ.వె. అతఁడు లేవనెత్తునంత కమ్మహిళ వి
వశమనస్కయగుచు వగ నిగుడఁగఁ
గౌఁగిలించుకొనియెఁ; గాంతలు కాంతుల
గారవించు టిట్లకాదె యెందు. ౭౩

వ. పదంపడి సిద్ధార్థుండును మొదట నొక్కయంతేవాసినిగాఁ దలంచి తత్కృత్యం బునను దదీయముఖసౌష్ఠవంబునను బ్రియురాలిఁగా గుర్తించి యోదార్చి జ్ఞాన దాయకంబులగు వచనంబులు కొన్ని వలికి యాపె మనంబు కలఁక దేర్చునప్పటికి గుంపుగూడి వెంటవెంట వచ్చుచున్న పురజను లందఱకు నితండ సర్వార్థసిద్ధుం డను చిహ్నంబులు వొడసూపె; నంతట మృదుమధురగంభీరసంభాషణమ్ముల విష యనివర్తనవిషయంబులగు నుడువులు నుడువుచున్న కుమారు నవికారు మారా కారు దవుదవ్వులం గాంచి యాతని వేసంబు మనంబు గలంప శుద్ధోదననృపా లుండు కోపంబు పట్టఁజాలక వారుసం బటు డిగి డగ్గఱకుం జనుదెంచు నయ్యెడ.

క. అనఘాత్ముండగు బుద్ధుండును సంద్రికిఁ బేర్మి బ్రమొక్కుడుం గోపము గ్ర
న్నన మాయమయ్యెఁ; బుద్ధుని గనుఁగొనియుం గోపముండఁగలదే యచటః. ౭౪

తే. గీ. అఖిలరాజాధిరాజపూజ్యప్రభావ
మహితమై యొప్పు తనదు కుమారు మహిమ
మరసి యాశ్చర్యమంది యయ్యనఘుఁ డిట్టు
లనియెఁ బుత్రునితోఁ బేర్మి యనువుపడఁగ. ౭౬

చ. ధర సకలంబు నేలుచు నుదారుఁడవై యశముం గడించి యె
ల్లరు నృపతల్లజు ల్ప్రణుతులం బచరింపఁగఁ జుట్టలెల్ల వ
హ్వారె యనఁగా సుఖింపఁదగు నంతటివానికి నింతవచ్చె; నె
వ్వరి నెటు సేయనేరవు కృపారహితమ్ములు ధాత చెయ్దముల్. ౭౭

సీ. ఆపన్నసత్వయా నర్ధాంగి కోర్కుల నింపుమైఁ దీర్చి మన్నింపవైతి!
పురుడు వోవకమున్న పుత్రు నెమ్మోము వీక్షించుభాగ్యంబు గాంక్షింపవైతి
నాకుమారుగ నిన్ను నమ్మనఁ దలఁచు ప్రజలసమ్మతిని బొందఁజాలవైతి
ముదుసలినై రాజ్యము నొనర్పలేని నాదగు నశక్తతకు లోఁ బొగులవైతి

తే. గీ. యకట యింతటిరాజ్యంబు నడవిపాలు
చేసి సన్న్యాసివైతి కాశ్మీరగర్ద
భము విధమ్మున నీజాతకము వృథావి
శేషభాజన మింకేమి సేయఁగలదు. ౭౮

క. నావుడు బుద్ధుం 'డిది నాకీవేళనె పట్టువడియెనె? పరంపరగా
నే వచ్చుచున్న' దనుటయు, భూవరుఁ డిట్టులను నలుకవొంపిరి పోవన్. ౮౦

క. ఎలమి మహాసమ్మతముఖ్యులు నూర్వురు నృపులు శాక్యకులసంభవు లీ
యిల నేలి రందు నీవలెఁ గలసెనె బైరాగులం దొకండేని సుతా. ౮౧

చ. అనవుడు బుద్ధుఁ డిట్లను, మహాత్మ? మదుక్తి మదీయజన్మప
ర్తనపర మేను మున్నును బరంపరగా నిటు సన్న్యసించుచుం
జనకుని కుందు దీర్చితిని జ్ఞానధనం బిడి పెక్కుసార్లు కా
వున నిపు డట్టిదే ధనము పూర్తిగ నీ కిడువాఁడ శాంతికై. ౮౨

వ. నే నీజన్మంబున విజ్ఞానలబ్ధి వడసి పునరావృత్తిరహితశాశ్వతనిర్వాణపదవీసమా
రూఢుండనై యజ్ఞానులకు విజ్ఞానం బొసంగ జన్మించితిఁ గాని శాక్యరాజ్యం
బేలుటకుఁ గా దనుచుఁ బల్కుచుఁ దండ్రికరంబు వట్టికొని జనసంకులమ్ములగు
వీథులవెంటఁ దిరుగుచు జ్ఞానప్రదమ్ములగు వచనమ్ములు బోధించుచుండ యశోధర

యు రాహులసమేతరై సమీపవర్తిని యగుచు నాదరమేదురంబుగ వక్తవ్యంబు
మఱచి వినుచుండె; నట్టియెడ నంతేవాసు లిరువురియం దొక్కఁ డిట్లనియె. ౯౩

చ. అడుగఁగఁ గొంకుచుంటి నొకయర్థము, దేవర సన్న్యసించియుం
బడఁతిని బిగ్గఁ గౌఁగిటను బట్టుట దోసము కాదె ? జ్ఞాను లీ
యెడఁ గడు సంశయింపరె ? సతీచ్ఛ యతీంద్రుల కొప్పునే, కటా !
కెడఁగుదనం బి దెట్టు లొదవె న్వచియింపుఁ డటన్న నిట్లనున్. ౯౪

ఉ. కోరినమాట మంచిదియె కోరఁగవచ్చును గోరినంతనే
నేరము గల్గునే, వినుము నీదగు మాటకు నుత్తరంబు, ని
ష్కారణ మేరినేనియును గాసిలఁజేయుట పాడిగాదు, చే
కూరునె యింతమాత్రమునకు న్నియతాత్ములకుం గళంకముల్ ! ౯౫

వ. అదియునుం గాక తదాలింగనంబు తత్కార్తృకంబు గాని యస్మదారబ్ధంబు గా;
దిఁక నొక్కవిశేషంబు వచించెద వినుము. ౯౬

ఉ. తాను విముక్తిఁ జెందిన విధమ్మున నొర్లను దేర్ప నెంచు న
వ్వానికి నేరికేనిఁ బరిభావము సూపుట మంచిగాదు స
న్మానము చూపి వారిని గ్రమమ్మున బోధసుధారసప్రసా
రానుభవజ్ఞతావిధురితాత్ములఁ జేయఁదగున్ స్వశక్తిచేన్. ౯౭

వ. ఏను గృహంబు విసర్జించి పోవునాఁ డీమెకు నానేర్చిన విజ్ఞానంబునం బాలొ
సంగుదు నని వాగ్దానంబు చేసినవాఁడ, నీమెయు సంసారవాంఛఁ ద్రుంపలేక
పూర్వసర్వార్థసిద్ధుఁడ నని యనురాగమ్మునం జేసిన పనికి నివారించితి నేని
యం తే వాసిని యగుట తటస్థింపదు. ౯౮

తే. గీ. ఎన్నియోజన్మములకు మున్నేను సింహ
లమ్మనెడి ద్వీపమున జననమ్మునొంది
రాముఁడను పేరనుంటి, నీరమణి యపుడు
లక్ష్మియనుపేర నాకుఁ గళత్రమయ్యె. ౯౯

వ. అయ్యెడ మేమిరువురమును బీదలమై యుండుకతన నెటకేనియుం జని ధనమా
ర్జింతు నని యోజించి దేశంబు గ్రిమ్మరఁ దలంచిన నమ్మగువ యిట్లనె. ౧౦౦

మ. సదయా ! నన్నిట డించిపోవుటకు నిచ్చం జేయఁగాఁబోకు నా
మది యెల్లప్పుడు నీయధీన మిది సంభావింపు మత్యంత క

ష్టదశాపాదకమైన నీదు పరదేశవ్యాప్తి కేమంచు నొ
ప్పెద, దాంపత్యవియోగ మేరి కయినం బ్రీతిం బొసంగించునే. ౧౦౧

క. అని యంగీకృతి చూపని వనితను విడనాడి కడలిపై నొకామా
ర్గనియతిఁ జనిచని పడపడి యనేకకష్టములు గాంచి యట నొక్కయెడన్. ౧౦౨

క. విలువయుఁ జెలువము దళుకునుగల యొక ముత్తియము దొరకఁగా నది కొని యే
నెలమిం దేశంబునకు మరలి చనుదెంచితిని మిగుల రయ మలరారన్. ౧౦౩

వ. అప్పటికిని మదీయదేశం బత్యంతక్షామపీడితంబై యుండినకతన నన్నంబు లేమిఁ గడుఁ గృశించి మద్వశచిత్తయై మూర్ఛవోయి యున్న జాయం గాంచి యేనును దుఃఖాక్రాంతుఁడనై, 'యిప్పుడంతి నెవ్వ రన్నం బిడి బ్రతికింతురో వారల కీముత్యం బిడువాఁడ' ననునంతట నొకండు తనయొద్దనున్న సక్తు వొసంగి యాముత్తెముం గొనియె ; లక్ష్మియు నాపేలపిండి తిని లబ్ధసంజ్ఞయై నన్ను విశ్వాస్యునిఁగ శ్లాఘించె. ఆజన్మము మొదలు ప్రతిజన్మంబునను మేము దంపతులమై జనియించుచుంటిమి. కావున నీమెంగూడ నిర్వాణపదారూఢం జేయుటకు నుపాయంబుగాఁ దదాలింగనంబు నివారింపనైతి నని మఱియు నిట్లనియె. ౧౦౪

క. జ్ఞానం బొరుల కొసంగినఁ దా నెగడుం దీపమువలె ; ద్రవ్యంబిడ న
వ్వానికి లేకుంటయుఁ బెఱవానికిఁ గలుగుటయుఁ దొడరు వ్యయ మగు కతనన్.

క. వెనుకన్ లక్ష్మికి నాచేసిన దానముకంటె నిపుడుచేయు వితరణం
బనఘ శతాంశాధికమగు, ననుపమ మనరాదె జ్ఞాన మన్నిటికంటెన్. ౧౦౬

క. తా నింద్రియనిగ్రహముం బూని యబలలకు నితాంతమును విజ్ఞానం
బొనఁగఁ జేయుట పురుషుల కీనెంచుటకన్న మిగుల మెచ్చనవచ్చున్. ౧౦౭

వ. కావున నియ్యశోధరకు మోక్షసాధనంబగు విజ్ఞానం బుపదేశింతు నని భార్యం
గాంచి తండ్రిదిక్కు మొగంబై యిట్లనియె. ౧౦౮

సీ. వినుఁ డొక్కసంగతి ఘనుఁ డొండె నీచాత్మకుం డొండె నుద్దండపండితుండు
నొండె నెవ్వండేనియును నాలుగంతరమ్ములు దాఁటి యష్టవిధుల కనుగుణ
ముగను జరించుచు మొదల నెనిమిది ధర్మముల నెఱిఁగి తత్త్వమార్గమందు
దశబలంబులు గల్గి తనర నెప్పటికేని జన్మరాహిత్యంబు సంభవించు

తే. గీ. ననుచు బోధించు సిద్ధార్థు హస్తమం దె
సంగు మృత్పాత్ర యాత్మహస్తమునఁ దాల్చి

కోప మెడచేసి శాంతమ్ము కుదురుపఱచి
తాల్చె శుద్ధోదనుఁడుఁ దన తనయు మతము. ౧౦౯

క. అంత యశోధరయును నత్యంతానందమున మోము దైవాఱఁగ న
క్కాంతుని మతమ్ము నమలస్వాంతయగుచుఁ దాల్చి మిగుల శాంతి వహించెన్.

## —♦ ఆశ్వాసాంతపద్యములు. ♦—

క. శ్రీమత్కవితాకాంతావ్యామోహితహితమతానుయాతస్వాంతా!
ధీమణినికరనియంతా! కామందకకుటిలశాస్త్రకలితోదంతా! ౧౧౧

శా. శ్రీరామాకరుణాకరస్వగుణరాశీ! దూరదూరీకృత
క్రూరా! చారుకథానకా! కృతినుతా! కొచ్చర్లకోటాన్వయ
క్షీరాంభోధినిశాకరచ్ఛత్ర! గుణలక్ష్మీభూతదీవ్యద్దయా
పారావార! యుదార! కృష్ణధరణీపాలాగ్రిణీ! ధీమణీ. ౧౧౨

## —♦ పంచచామరము ♦—

ప్రమోదబంధురా సుధీవిపశ్చిదావృతాదరా
ప్రమాదదూర ధీర శ్రీకరా యజాతశాత్రవా
ప్రమగ్రిణీ మహాకవీంద్రపోషకా లలత్తురం
గమాధిరోహణప్రసక్తిగణ్యగుణ్యసంస్తుతా. ౧౧౩

## —♦ గద్యము. ♦—

ఇది...శ్రీ తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబైన బుద్ధచరిత్రంబను మహా
ప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము.



శ్రీరస్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# బుద్ధచరిత్రము

## షష్ఠాశ్వాసము

క. యాచకచయవిబుధద్రుమ ! మోచాఫలవిపులమదవిమోచనచణవా
చాచతుర ! తులితసుమనారాచా ! శ్రీకృష్ణరాయ ! రసపద్ధేయా ! ౧

వ. అవధరింపు మనంతరంబ సతీపితృసమేతంబుగ సన్న్యాసియగు సర్వార్థసిద్ధుండు తన పురంబునందలి విజ్ఞానాధికారంబుగల మనుజుల కందఱికి భిక్షువేషం బాపాదించి తక్కిన పౌరుల కధిపతిగా రాహులునకు శాక్యరాజ్యపట్టాభిషేకం బొనర్చి యచ్చోటుఁ గదలి యనేకాంతేవాసిజనపరివృతుండై.

ఉ. తగుగతి శీతమారుతపదంబయి పాఱెడు రోహనాభిధా
నగకు సమీపమందు సుమపాదపభూషితమై మనోజ్ఞమై
మృగముఖజంతుసంతతిసమేధితమై ఫలభారవిస్ఫుర
న్నగయుతమై యెలర్చెడి వనమ్మున కేగె మనమ్ము పొంగఁగన్. ౩

వ. సాగరమ్మను పురమ్మునకు సమీపమ్మునం దనరు నవ్వనమ్మున హిమవత్పాదనికట శిలాకుట్టిమంబున నొకనాటి సంధ్యాకాలంబున నానందదేవదత్తప్రభృతులగు శాక్యప్రభువులు వెనుకను, యశోధర పాదనికటంబందును, శుద్ధోదనుండు వామపార్శ్వంబునను జెలంగ ధర్మాసనం బుండి తన మతంబు సకలదేశాగతాంతేవాసిజనంబులకుఁ జక్కఁగ బోధింప నారంభించె. ౪

చ. అమృతరసంబు వెల్లివిరియంగ మహాత్ముఁడు బుద్ధుఁ డెల్లలో
కములకు జ్ఞానబోధ మెసకంబునఁ జేయుచునుండ సూర్యుఁ డ
స్తమితుఁడు గాక భూధరనితంబసమీపతలంబు లంద ని
క్కము వసియించుచు న్వినియెఁగాని తలంపఁడు కాలదైర్ఘ్యమున్. ౫

క. పితృదేవతలును దేవత లతిముదమున నాకసంబునందు నిలిచి య
మ్మతిమంతు నుపన్యాసం బితరేచ్ఛాశూన్యబుద్ధి నెనసి విని రొగిన్. ౬

తే. గీ. అతఁడొనరించు నయ్యుపన్యాసము వినఁ
గనొ యనంగఁ దమంబు చక్కటికి రాఁగఁ
దాను నయ్యది వినుచుఁ బోఁదలఁపనిగతి
సంజకెంజాయ కొంత మసలఁ దొడంగె. ౭

తే. గీ. తారకావళి హారవిధమునఁ దనర
నిందుజాబిల్లి తిలకమై నెగడ నీర
దములు తల దువ్వ చెలుల విధమున మెఱయ
సంజయను ప్రౌఢకన్నియ చదల నిలిచె. ౮

క. తనభర్త యైన సూర్యుఁడు చనుచుండం గొంతదవ్వు సారెకుఁ గని సం
జ నిగిడ్చెడు నిట్టూరుపు లనఁగ మలయమారుతమ్ము లలమఁదొడంగెన్. ౯

ఉ. జ్ఞానము నెల్లవారల కొసంగెడి బుద్ధిని బుద్ధుఁ డాత్మభా
షానుగతి న్వచించు వచనావళి యాదట నాలకించు నా
నానరజాతికిం దగవినంబడుచుండె స్వకీయదేశభా
షానియతి న్మహాత్ముల కసాధ్యములుం గలుగంగ నేర్చునే. ౧౦

వ. అయ్యెడ బుద్ధుం డిచ్చిన యుపన్యాసం బనేకాదృశ్యం బగుటం జేసి యిదమిద్ధ మని
యస్మాదృశులకు వివరింప నలవిగా, దైనను దిఙ్మాత్రప్రదర్శన మొనర్చెద మది
యె ట్లన్న, నతండు తనచుట్టునుం బలసికొలుచుచున్న నానాదేశీయులగు ప్రజ
లం గాంచి 'యోయన్నలార సావధానంబుగ మదీయోక్తు లాలింపుఁ డని యి
ట్లనియె, ౧౧

క. ఎయ్యది యమేయమై చను నయ్యది వివరింపఁ దరమె! యది యడుగక [illegible]
ల్నెయ్యమ్మున నా వినిచెడు తియ్యని పల్కులను మీమదిం బెట్టెదగున్. ౧౨

వ. అట్లు వినిరేని యయ్యమేయపదార్థంబు మీయంత మీకుఁ గోచరం బగు. ౧౩

క. తెలియని దేనియు మాకుం దెలియంగాఁ జేయుఁ డనుచుఁ దివిరి యడుగువా
రలును న్వారికిఁ దెల్పం దలకొను వారలును దెలివితక్కువవారల్. ౧౪

తే. గీ. అజుఁడు సృష్టికిఁ బూర్వమం దంధకార
మందుఁ దప మొనరించుచున్నట్లు కొన్ని

గ్రంథములు సెప్పఁగాని యక్కృతల నిజము
తెలియఁగారాదు తెలిసిన ఫలములేదు. ౧౭

క. పొడముట గిట్టుట సుఖములు నిడుమలునుం గాలగతియు నెడతెగక సదా
పొడముచునుంటయు ననునివి కడఁగాంచెడు దనుక మనకుఁ గలుగుచునుండున్.

తే. గీ. నదులు జనియించి పిదప వననిధిఁగలసి
బాష్పరూపమ్ముగాంచి యాపయి ధరాస్థ
లిని బడి యథాస్థితిని గాంచు లీల నెపుడు
జననమరణమ్ములకును విశ్రాంతిలేదు. ౧౮

క. ఇల మొదలుగ నా యీ మండలములు విశ్రాంతి నెయ్యెడం గనక సదా
చలియించు పగిది జన్మమ్ములునుం భ్రమణంబు నెపుడు పొందుచునుండున్.

మ. ఉపవాసంబులు ప్రార్థనల్ జపములున్ హోమంబులున్ వ్యర్థముల్
కృపమై నీయవి తా నెవండు గొను? మీరీ లంచముం జేసి పా
పపథంబుం గడ ద్రొక్క నేర్తురె? కడుం బ్రాపించు నిద్దాన దే
హపరిశ్రాంతి, వృథాపరిశ్రమమునన్ బ్రారబ్ధము ల్వోవునే. ౧౯

క. మన జన్మపరంపరయును ఘనతయు నీచతయుఁ గర్మగతికారణమై
పనుపడుఁ గావున సత్కర్మనియతిఁ జరియించు టొప్పు మనుజుల కెల్లన్. ౨౦

చ. మునుపటి జన్మమందు నృపముఖ్యతఁ గాంచియు నందుఁ బాపపుం
బను లొనరించెనే నతఁడు పొల్పడు నేఁడొక భృత్యమాత్రుఁడై
వెనుకటి జన్మమందొకట భృత్యత గాంచియు నందుఁ బుణ్యపుం
బను లొనరించెనే నతఁడు పార్థివుఁడై జనియించు నిత్తఱిన్. ౨౧

వ. కర్మంబునను జన్మపరంపరకును నానంత్యంబ యేని జన్మం బెల్లరకును వ్యసన కరంబకాని యొండుగాదంట సరిగా, దేమనఁ గర్మం బనివార్యం బయ్యును దనకంటె బలీయంబగు సంకల్పశక్తికి లోసడు; నట్టి సంకల్పంబు సమంజసం బేని నానాఁటి కుత్తమజన్మంబులు దొడరు; న ట్లుత్తమజన్మంబులు కొన్ని గతిం చుడు దివ్యజ్ఞానంబును దివ్యదృష్టియు నుదయించు, దాంనజేసి నిర్వాణపదంబు కరతలామలకంబగు నని వెండియు, ౨౨

క. ఇది వఱకు దారి దెలియమి నెద లోకుల దుఃఖములకు నెంతేఁ బాపా
స్పదముగ నొనరించెడి నాకిది ఘటిదవె నుపాయ మొకఁ డసేతావృతమై.

క. తనచేసిన కర్మమ్ములు తనకుం భోజ్యమ్ము లగుచుఁ దనకౌ, న్మఱి య
న్యుని నీయెడఁ జేరకుఁ డని యనవలపదు తత్త్వవిధము నారయుఁ డింకన్.

సీ. ఆద్యంతములు లేక యజలోకమునకంటెఁ బై నొప్పు నక్షత్రపటలి దాఁటి
వెలుఁగుచుండెడు నొక్కవిమలాత్మయగు శక్తి యది యెల్లవస్తువు లందుఁ దత్త
దనుగుణగుణముల ననుఘటించుచు నెల్లయెడలను వ్యాపించి యెల్లరకును
మంచిమార్గమ్ము నేమఱక సూచించుచు నుచ్చైస్స్థితికిఁ దెచ్చుచుండు నిదియు

తే. గీ. చిన్నిచీమలు మొదలగు చేతనముల
కును ననుఘటించు సంతానమున వనూన
రాగ, మీయదియ పయోధరములు సార్థ
కములుగాఁజేయు నిసువులు గలుగునెడల. ౨౭

క. అవనిన్ రత్నాదిక ముద్భవ మొందుట దందశూకదంష్ట్రల విషము
ద్భవ మొందుటయును నీశక్తివలన నలవడు నటంచుఁ దెలియంగఁ దగున్. ౨౮

వ. మెండియు నిమ్మహాశక్తియ పెరుఁగుటకుం దఱుఁగుటకుం గారణంబగు, జీవితము
ప్రేమము ననుదారములతో మరణము బాధయుననుతురి ప్రారబ్ధాదికర్మపటంబు
నల్లుచుం బోవు, నీయది మనకు గోచరమ్ములగు పదార్థమ్ములందును నగోచరమ్ము
లగు వస్తువులయందును బ్రబలియుండు.

తే.గీ. మనుజుల మనమ్ములును వానిమార్గములును
దలఁపులును నిక్కతనఁ బ్రవర్తనము చెందు
నాచరించును మనకు సహాయ మిద్ది
యించుకయు గోచరముగాక యెల్లవేళ. ౨౯

వ. మఱియు నియ్యది యిట్టిదియని చెప్పుటకు నొక్కరూపంబు గల్పింపంబడెఁగాని
సత్యమ్ముగ దీనికి రూపంబులేదు. సర్వపదార్థంబులందు సంపూర్ణంబుగ నిండి యుం
డునది. దీని విశేషంబు లనంతంబు లిది యిట్లుండ మీకుఁ బ్రథమోపదేశ్యంబగు ను
పదేశంబు వినిపింతు, జన్మంబులందు మనుష్యజన్మంబ యుత్కృష్టంబు మనుష్యజన్మ
మెత్తినవాని నిర్వాణసౌధంబునకుఁ గల సోపానంబు లెక్కవానిఁగా వెలుఁగ
వలయు; నీభవమున భూతదయ యావశ్యకంబు దీని నెవ్వరును దిరస్కరింపఁ
దగ దట్లు పరిభ్రమించినవారలు మరల నధమజన్మంబులం బడుదు రని మెండియును.

క. ఎవరు ఘటాటోపమ్మునఁ దవులక మంచితన మూనఁదలఁతురో యమ్మా
నవులు మనశ్శాంతికి సౌఖ్యవిధికి భాజనము లగుచు వలరుదు రెందున్. ౩౦

క. ఎవరు రహస్యమ్ముగ ద్రోహవిధుల నొనరించి పైకి నవఘులగతి దు
ర్వ్యవసాయప్రక్రియఁ దాము వహింతురో వారి కౌదవు ముప్పున బాధల్.

క. వినుఁ డొక్కటి తెల్పెద, మన మనుకొనియెడి యముఁడు బాధలందింపక యు
న్నను శక్తి సర్వసాక్షిణి తనంత నొడఁగూర్చు కష్టదశ దుష్టులకున్. 32

ఉ. దానికిఁ గోపమున్ క్షమయు దబ్బఱ, నిబ్బరమైన దృష్టి నెం
తేనిఁ బ్రమాదముం గనక యెల్లర కర్మములందు న్యూనతా
న్యూనతలం గ్రహించి నయమొప్పఁగఁ ద్రాసునఁ దూఁచినట్లు లె
వ్వానికి నేది భోగ్యమది వానికిఁ దానొసఁగు న్గ్రమంబునన్. 33

తే.గీ. ఆమె తీర్చెడి తీర్పున కపలఁ గాల
దోష మనుమాట లేదు నిర్దుష్టముగ స
మస్తకాలములందును మసలుచుండు
వినుఁడు మఱియొక్క సంగతి వీను లలర. 34

తే. గీ. ఒరుల నఱకుట పరధనం బొడిచికొంట
యొడ్డ వంచింప దుస్సాక్ష్య మొసఁగుటయుఁ ద
నకు నొనర్చికొనెడు కీళులకట శక్తి
కతనఁ బరమునఁ దన కివి కలుగుకతన. 35

వ. మఱియు నీశక్తి యెల్లప్పుడును న్యాయమార్గంబు వదలదు, శుద్ధప్రేమం బిద్దాని స్వరూప మిక్కతనఁ దుదకు లభియించు ఫలము శాంతియు నిర్వాణంబును గాన నోయన్నలార! యెట్టివిత్తనము చల్లిన నట్టిపంటయె పండునట్లు తనకర్మము నను సరించి యుత్తరజన్మం బలవడుచుండు.

తే.గీ. పనికిమాలిన కలుపు నవ్వాలకుఁ దోసి
మంచివిత్తనములు చల్లు మానవునకు
ఫలము నిరవద్యముగఁ గల్గుభంగిఁ బాప
కృతు లెడపు వారలకుఁ బుణ్యగతి లభించు. 36

సీ. తన పురాకృతదుష్కృతమ్ముల నెఱిఁగి యాయాఫలమ్ములను దానుభవించు
చును నిర్వ్యసనుఁడై యనవద్యుఁడై దయావంతుఁడై యెల్లర నంత లడఁప
యత్న మొనర్చుచు నపకారులకు నైత ముపకారమ యొనర్చుచుండి వాంఛ
మొదలంట మన్ములమగఁ జేసి కాలంబు తగుగతిఁ గడపెడి ధన్యతముఁన

తే.గీ. కాలఁ బ్రాక్కృతపాపకర్మానుభవము
తీఱి సత్కర్మఫల మొకింతేని మిగులు
నిక్కతమ్మున జన్మరాహిత్య మొదవు
దాన నిర్వాణ మనెడి పదమ్ము దొరకు. ౩౮

వ. పుణ్యకర్మంబు మిగిలిన నయ్యది జన్మాంతరమున ననుభవింపక జన్మరాహిత్యం
బెట్లుపడయు నని శంకింప వలవ, దీజన్మంబునఁ దనచేసిన దంతయు సుకృత
కర్మంబగునో దానికి ఫలంబు నిర్వాణపదంబ కాని జన్మాంతరంబు గా; దియది
కర్మసిద్ధాంతం బని వెండియు: ౩౯

ఉ. దారిని బోవు పాంథులకుఁ దద్దయు మేల్బస యొక్కచోటఁ జే
కూరు, నిఁ కొక్కచోట సమకూడు నసౌఖ్యద మైన తా, విదే
తీరుగ జీవుఁ డొందు సుగతి న్మఱి యొండుగతిం దనంత ని
ష్కారణ మబ్బు నంట సరిగా, దది యే మన నాలకింపుఁడీ. ౪౦

క. మును పొనరించిన పాపమ్మును సుకృతమ్మును గణింప మొదలిడ నవి హె
చ్చునొ తదనుసరణమున నే జననంబులు గలుగుచుండు జనులకు నెపుడున్. ౪౧

తే. గీ. పట్టుపురువు దాను బచరించు కాయలోఁ
దగులుకొనెడుభంగిఁ దా నొనర్చు
కర్మజాలమునన కట్టఁగఁబడు జీవుఁ
డింత కొండుహేతు వెందుఁ గలదె. ౪౨

చ. అరయఁగ జమ్మువిత్తు లనిలాహతి దూరము వోయి యొక్కెడం
బురదను బ్రుంగి కాలమునఁ బుట్టువెలర్చెడురీతి జీవుడుం
ధర నొకచోట నెయ్యెడనొ తా జనియించి క్రిమమ్ముగాఁ గనుం
గరమును గర్తృతాగరిమ కారకతాగరిమమ్ము లాదిగన్. ౪౩

తే.గీ. హత్య లోనగు క్రూరకృత్యము లొనర్చు
వార లేతత్ఫలమ్మును వడయుపొంటె
హీనమగు యోని జనియింతు, రింత నిజము
కర్మఫల మేరికేనియుఁ గట్టికుడుపు. ౪౪

ఉ. ఏఱు జనించి కొంతవఱకేగి యటు న్మఱి గానరాక యొం
టే దేహి కొంతదూరమున నేర్పడి పాఱెడుభంగి యోస్య లొ

వారలు మేను వీడియును వచ్చెదు జన్మమునందుఁ బూర్వసం
స్కారవిశేషకారణవశమ్మునఁ జెందుదు రుత్తమత్వముల్. ౪౫

తే. గీ. ఉత్తమభవంబు నొందుచునుండి కొంత
కాలమునకు భవవిరతిఁ గాంచి పొంద
వచ్చు నిర్వాణమును; దుష్టవర్తనులకు
నీచజన్మంబు లెన్నేని నెగడుచుండు. ౪౬

వ. అట్టి నీచజన్మంబు లెత్తెడి వారికి జన్మసంఖ్య హెచ్చును గాని యెన్నటికిఁ దగ్గదు. లోకులు తమకు మంచికర్మంబులయందు శ్రద్ధ దగులనీక నిర్వాణప్రాప్తికి విఘ్నమొనరించు నజ్ఞానాంధకారమునం బడి యీ ప్రపంచసుఖములు శాశ్వతములని తలంచుచు దురవస్థలకుఁ గారణములై కాంతాకనకమూలంబులగు కామక్రోధాదులఁ జిక్కి నవయుదు రని వెండియు, ౪౭

తే. గీ. అమలినమనీషచేఁ దెలియంగఁ దగిన
యట్టి నిర్వాణపదమున కాసచేయు
చున్న నాయన్నలార! యభ్యున్నతిప్ర
దమ్ము లీతత్త్వములు నాల్గుఁ దగ వినుండు. ౪౮

చ. ప్రతివరజీవితమ్ముఁ గడు బాములపాలని నమ్ముఁ, డుద్భవ
స్థితిమొదలెన్నియో కలుగు జీవునకుం దురవస్థ, లెన్నఁ డే
నతితరసౌఖ్య మబ్బినను నయ్యది పక్షివిధమ్మున న్రయో
ద్గతిఁ గనుఁ గాని శాశ్వతముగా దది మీ కనుభూత మౌఁ గదా. ౪౯

తే. గీ. శైశవంబునఁ గొన్ని కష్టములు యౌవ
నమ్మునం దొకకొన్ని కష్టములు నుది
మిని మఱియుఁ గొన్నికష్టము ల్పనుపడు మృతి
సమయమందలి బాధ వశమె వచింప. ౫౦

క. అది గాన జన్మమెత్తినయది మొదలు మరణమునందునంతదనుక దుః
ఖదశయ కన్పడు సుఖమనునది కల్ల యటంచుఁ దెలియనగు నెల్లరకున్. ౫౧

ఉ. అనురాగమ్మునఁ బొల్చు దంపతుల కత్యంతంబు సౌఖ్యంబు గ
ల్గును గానీ యదియు న్నతం బనుచు నాకుం దోఁచు, దే మన్న న

ధ్వనితో శోజములేని భర్తృరదనహార్మివారమేనిం జితా
ఘనవవ్యాహుతి గాంచుచో నిలువళక్యం బౌనె యొండొంటికిన్. ౫౭

క. కదన మొనర్చెడి వీరుల కదనముగా మదము గల్గు, నదియును సతమై
పొదలదు క్షణమునఁ బ్రాణము వదలున్ దేహంబు పక్షివర్గము పాల్గాన్.

చ. నరులును బక్షులుం బశుగణమ్ములు వృక్షవిశేషము ల్మనో
హరగతి నింపుఁ జొప్పడుట నందటికిం ధర మోదధాత్రియై
కరమును సౌఖ్య నీఁగలుగుఁగాని క్షుదర్థము పార్థులం బర
స్పరహననం బనూయయు ననహ్యముల్లై పెనువంతఁ గొల్పెడున్. ౫౮

వ. కావున నెన్నివిధములఁ జూచిన సౌఖ్యంబుకంటె దుఃఖం బధికమ్మని యనుభవ సిద్ధమ్ముగఁ గన్పట్టినను వ్యాధిపీడితుల నొండె వృద్ధుల నొండె 'మీకు జీవనేచ్ఛ కలదా' యని యడిగిన జీవనంబు పోయ మను వాఁడొక్కఁడు నుండఁ; డక్కటా! యీపాడు సంసారమాహాత్మ్యం బిదమిద్ధమని వచింప నలవికాదు. నిసువులు నైతము జీవనంబు కష్టభాజనం బనికదా పుట్టినతోడనె యేడ్చుచుందురు. ఇట్టి జీవనంబు కష్టభాజనం బని నిశ్చయంబు పడసిన వారందఱు రెండవ తత్త్వం బాలింపుఁడు.

తే. గీ. సర్వదుఃఖమ్ములకును దృష్ణయె ప్రధాన
కారణంబు తనంతనకల్గు దుఃఖ
మెయ్యదియు నెందుఁ గానరా దింద్రియమ్ము
లర్థములను మనోవృత్తి నలమఁజేయు. ౫౯

సీ. ఆకాశహర్మ్యంబు లల్లింపఁగాఁ జేయు గగనకుసుమంబులు గలుగఁజేయు
నన్యోన్యవైరంబు నందించు మోహాదులను బ్రతిక్షణము వృద్ధిని బొనర్చు
ద్రోహ మీర్ష్య యనూయ దొలకరింపఁగఁ జేయు స్వప్నమ్ముపోలె నసత్యమైన
మిథ్యాప్రపంచంబు తథ్యం బనెడు భ్రాంతి గలిగించు నీతృష్ణ; కాన దీని

తే. గీ. దొలఁగారాదు దీని సందర్భమునన
భూమి పాపభూయిష్ఠమై పొలుపు దఱుఁగుఁ
గలుపు బలిసినపై నవకాశమెట్లు
మంచివిత్తనమునకు లభించుఁ జెప్పుఁడు. ౬౦

తే. గీ. జీవితాంతంబునం దాత్మ చెడుగులైన
తృష్ణయను చెట్టువిత్తుల నెనయుకతన
మరల జన్మించునట్టి జన్మంబునందుఁ
బ్రబలుఁ దృష్ణాకుజంబు లీపలుకు నిజము. ౫౮

వ. కావున నింద్రియనిగ్రహంబును దృష్ణావశ్యత్వంబును గల యోయన్నలార! మూఁడవ తత్త్వంబు విన్నవించెద. ౫౯

తే.గీ. ఇంద్రియముల జయించియు వృత్తులడఁచి
శాంతి వహియించి మృదులభాషణము చిత్త
శుద్ధి భూతదయయుఁ గల్గనుజనులకుఁ గ్ర
మమ్ముగా జన్మరాహిత్యమమరు నిజము, ౬౦

తే. గీ. స్వచ్ఛముగ వెల్గి దీపంబు చమురుతోడ
న శమియించెడి చందమ్మునఁ గ్రమముగఁ బో
సంగుఁ గర్మరాహిత్యంబు జన్మరహిత
తయును సమకాలమున నింత తథ్య మరయ. ౬౧

వ. మఱియు నింక నాల్గవతత్త్వంబు నిర్వాణమార్గంబు. అయ్యది యెల్లరకు ననులభంబని వెండియు. ౬౨

సీ. చదలంటు నొక్క రసాధరశృంగంబు నెక్కఁగ నుంకించునెడ విశేష
దార్ఢ్యమ్ము గల్గెడి ధన్యులు మార్గ మదెట్టిది యైనను నేగఁగలరు
గాని యశక్తులు కడుదూర మైనను సహియించి మార్గమ్ము చక్కని యది
గాఁ జూచి నడుమను గా లూఁది విశ్రాంతి వడయుచు వారలు వడసినట్టి

తే. గీ. పదము క్రొంచెము వ్యవధిగాఁ బడయుదురు ప్ర
పంచమున నిట్లు నిర్మలభావులును ద
దితరులును గాంచుచుందు రొకింతకాల
పర్యయమ్మున నిర్వాణపదవి నెందు. ౬౩

వ. ఇమ్మార్గంబున విశ్రమించుచు మెల్లమెల్లనఁ బోవువారికిఁ గొన్ని సోపానమ్ములు గల వవి వివరింతు. ౬౪

తే. గీ. నిర్దయ దురాశ కోప మనియెడి దుర్గు
ణమ్ముల నడంచి సర్వభూతమ్ములందుఁ

కరుణగల్గి యెపుడు సుసంకల్పులగుచు
మలయమారుతములభాతి మలయవలయు. ౬౫

తే. గీ. భూపతి వసించు కోటతల్పుల విధమునఁ
దమ పెదవు లెల్లపుడు మూయఁదలఁపవలయు
నెప్పుడేనియుఁ దెఱచిరయేని వచ్చు
పల్కు లన్నియు శాంతిమైఁ బరఁగవలయు. ౬౬

చ. తన యొనరించు కార్యము లుదాత్తములై యలరన్వలెన్ విశే
షనియతి నెందు మంచియొ యసత్కృతివారణమో తదంతర
మ్మున మెలఁగన్వలె, న్పటికపూసల పేరున నుండు వెండితీ
వను బురణించుచున్ గృపయ భాసిలఁగావలె నెందుఁ జూచినన్. ౬౭

క. వేరిచికొనఁగోరెడి సాధారణు లన్యాయ్యకృతులఁ దవులక జనన
ప్రారంభకారణము కర్మారంభము నెఱిఁగి నడచు టభిమత మెందున్. ౬౮

వ. ఇయ్యవి నాలుగు నాలుగు మెట్లు, పారిశుద్ధ్యంబును సచ్చింతయు నేకాంతత్వం
బును సదానందంబును నను నీనాలుగును బూర్వోక్త సోపానంబులతుం బైనుండు
సోపానంబులు. ౬౯

తే. గీ. ఆత్మపరిశుద్ధి గనక యూర్ధ్వాభిగామి
గాఁ జన, దదేమనఁగ వెనుకఁ జిరకాల
మనుభవించిన సంసారమునకు మనము
క్రాంతుఁ జేసినయేని విఘ్నంబు దొడరు. ౭౦

సీ. దారపుత్రాదుల దయగల్గుటయు నాటపాటల ననురక్తి బరఁగుటయును
మనమున కతిసుఖమనుఘటించుట యెల్లవారల కిది యనుభవము, యీ తె
ఱఁగున భూతమ్ములఁ గ్రమముగ సమదృష్టిఁ గాంచి హృదయము పక్వంబొనర్చి
సత్యమ్ము దెలియ సత్సంకల్పమున యత్న మాచరింపఁగవలె నట్లు కొన్ని

తే. గీ. జన్మములు వోవఁ బోవ నిస్సంశయముగ
మనము నిర్మలమును విషయనిగళగళి
తమ్మునై యుత్థితిం గని తత్వసిద్ధిఁ
గాంచుఁ బదపడి నిర్వాణగమన మెదవు. ౭౧

తే. గీ. తత్త్వసిద్ధిని బొందు పిదప మనంబు
త్రిదుపాఱుచు విషయనిగ్రహ మొనర్చు
నేసహాయమ్ము గనక తా నెత్తు స్వచ్ఛ
మైన జన్మము జీవుఁ డాపై ననువుగ. ౭౨

క. పదపడి యీజన్మంబునఁ బొదలున్ భూతదయ పిదప బుద్ధులనెడు నే
రొదవెడు వీరలు క్రమముగఁ దుదియగు నిర్వాణపదవి దొరకొందు రొగిన్. ౭౩

తే. గీ. శత్రులను జంపి విజయమ్ము సంతరించు
యోధు చందంబున నసూయయును నహంకృ
తియును నజ్ఞానకామసంశయములును జ
యించి యమ్మూఁడు మెట్టుల నెక్కవలయు, ౭౪

తే. గీ. ఆద్యసోపానములు నాల్గు నల్లనల్ల
నిట్లు తరియించి పై జీవితేచ్ఛ స్వర్గ
వాంఛ యాత్మస్తుతియుఁ బొరపాటు గర్వ
మనెడు దుర్వృత్తులను వీడనగుఁ గ్రమమున. ౭౫

చ. అటుపయి పొందు దేవతలకన్నఁ బ్రశస్తతఁగాంచి యొట్టిసం
కటములఁ జిక్క, కా ప్రళయకాలమునందును హానిఁజెందఁ, కె
ప్పటి కొకరీతి నొప్పెసఁగుఁ బైపదముం గనుఁ; గర్మసూత్రసం
ఘటితము దేహగేహము నిఁకం గొనఁగాఁ బనిలేదు వానికిన్. ౭౬

క. నేనను శబ్దంబున కొక తా నే వాచ్యంబు గాక తక్కు సకలముం
గాఁ నను భేదం బెందును బూనక చరియించు హేతువున వాని కొగిన్. ౭౭

వ. మఱియుం గొందఱు నిర్వాణమ్మన నాత్మ నశియించు ననియుఁ గొందఱు నిర్వాణమందును నాత్మ జీవించి యుండు ననియుం జెప్పుచుందు, రిది సరిగా దే. పునఃజన్మరాహిత్యమ్ము నొడఁగూర్చునట్టియుఁ గాలావధిశూన్యం బగునట్టియు నానందమయమగు నట్టియు నిర్వాణమను సౌఖ్యపదవి యిట్టి దని వచింపఁగ రాదు. కావున జ్ఞానమార్గం బవలంబించితిరయేని యది తనయంత గోచరమగు నని వెండియు. ౭౮

గీ. మన కసూయవంటి ఘనదుఃఖకారణం,
బరిగణింబు శంకలొ నధికదుఃఖ

హేతు, వింద్రియముల కెక్కుడు మోసగాం
డ్రెందు లే రటంచు నెఱుఁగు టొప్పు. ౬౦

క. ఒక్కొక్క పాపహేతువుఁ జక్కఁగఁ దనకాలఁ ద్రొక్కఁజాలు నతఁడహో
యొక్కొక్క మెట్టువంతున నెక్కంగా నేర్చు మెట్టులెల్లఁ గ్రమమునన్. ౬౧

ఆ.వె. జ్ఞానమార్గమందు సమరీతిఁగఁ బ్రవేశ
మొప్పనేని దృష్ణ యబ్బఁజేయు
దాహమెల్ల నడఁగుఁ దన్మార్గమున నిష్ట
సుమచయంబువంటి సుఖము దొరకు. ౬౨

తే.గీ. కర్మమోక్షసిద్ధాంతాఖ్యుఖునికి నజ్రి
పుంగనులు పాటిరా, విది పోలువునందు
నట్టి దిట్టిది యని చెప్పనలవికాదు
దీనఁ గల్గు నానందం బుదీర్ణమెందు. ౬౩

వ. పూర్వోక్త జ్ఞానమార్గానుసరణంబునకు నాచెప్పఁబోవు నీయైదుసూత్రంబు
శ్లోకంబులు. ౬౪

క. ప్రతిజంతువు మీవలెనే మితిలేని భయంబు లెత్తి మేటిదళను బొం
ది తరించుఁ గానఁ గరుణాన్వితులై యేప్రాణినేని హింసింపఁకుఁడీ. ౬౫

చ. కలిగినపట్టు నొల్ల కొసఁగందగు, వార లొసంగిరేని వి
చ్చలవిడిఁ గైకొనంగగు, వెసం గడునాసను నేరి ద్రవ్యముం
బలమున నొండె మోసములు పన్నుచు నొండె హరింపరాదు, చం
చలమగు దేహముం జెనుపఁ జక్కని ధర్మము వమ్మొనర్తురే. ౬౬

తే. గీ. కూటసాక్ష్యం బొసంగుట కూడ, దేరి
నేనియుఁ బరోక్షమందు నిందించు టొప్పు,
దనృతమాడుట తగదు, సత్యమ్ము చిత్త
శుద్ధిఁ దెలియంగఁ జేసెడి సూటిగాడె. ౬౭

తే. గీ. మతినిఁ జెడఁగొట్టు గంజాయి మద్యరసము
దరికి రానీకుఁ; డెందు శుద్ధమగు దేహ,
మనుమలినమనంబు గలవారి కధ్వరంబు
లనవసరములు గానఁ దత్త్యాగ మొప్పు. ౬౮

క. పరదారగమనము మొదలు దురితమ్ములు సలుప కెపుడు దూరవిచార
స్థిరుఁడై యన్యాయమ్మునఁ జోరపడక చరించు టొప్పు సుగతికిఁ దెరువై. ౭౭

సీ. అని యిట్లు బుద్ధుండు జననీజనకదారపుత్రభృత్యాదిసమూహమందు
నడచు తెఱంగుఁ, దనవలె నువ్వెత్తుగా సంసారపు సుఖంబు చాగ మొనరు
పఁగ లేనివారు నిర్వాణమ్ము క్రమముగా నుత్కృష్టసంచార యుక్తిఁజేసి
కనియెడి తెఱఁగును, దన జీవితము నరుఁ డెవ్విధమ్మునఁ బుచ్చ నెసఁగు సుకృత

తే. గీ. మత్తెఱంగును గరుణార్ద్రుఁడగుచుఁ దెలిపి
మఱియు నిట్లను, సుపకృతి యొరులకు నొన
రించు వారికి విను వొక యించుకేనిఁ
గలుగ దాయాస మింతయుఁ గడలు కొనదు. ౭౮

ఉ. తాదృశులైన వారలకుఁ దద్దయునుం గురుభక్తి భూతస
మ్మోదకమైన చిత్తము సమున్నతమై తగు నోర్పు నిప్పు డెం
తేఁ దనివారె నేనిఁ బయినేర్పడు జన్మ మపారయోగ్యతా
పాదకమై యితోధికకృపాయితమై పొలుపొందు నిచ్చలున్. ౮౦

వ. అని యనేకవిధమ్ముల బోధించి యానాఁటి కాసభఁ జాలించెఁ; బదంపడి యొక
నాఁటి యుదయంబున సింగళకుఁడను నొక గేస్తు స్నాన మాచరించి యార్ద్ర
వస్త్రధారియై దిక్కులకు సాష్టాంగనమస్కారంబు లొనర్చుచు రక్తమ్ములును
శ్వేతమ్ములునగు కొన్ని యక్షతలు తత్తద్దిశల నెడచల్లుచుఁ గన్పట్టుటయు నతనిం
గాంచి, 'యిదియేమి యిట్లొనర్చెదు' నావుడు, 'మహాత్మా మా పెద్దలునింగినుండి
యు భువినుండియుఁ దెసలనుండియుఁ దొడరు నరిష్టంబులు వారించుకొఱకై
ప్రత్యూషఃకాలమున నిట్లొనరింపవలయు నని నా కానతిచ్చి రన, బుద్ధుం డల్లన
నగి యిట్లను, 'నాహా యిట్లూరక నక్షతలు చల్లుకతన నరిష్టపరిహారంబు గానేరదు
సర్వజంతువులకును ద్రోహంబు లేక దయగలిగి తత్సూచకమ్ములగు కార్యంబుల
వర్తింపవలయునని మీ పెద్దల యభిప్రాయ'మని యిట్లు చెప్పం దొడంగె. ౮౧

తే. గీ. ప్రాచి నక్షతలను జల్లవలయు ననుట
తేజ ముదయించుటకుఁ దూర్పుదిక్కువోలె
నీకు జన్మకారణ మయి నెగడు తల్లిఁ
దండ్రి నెప్పుడుఁ బూజింపఁదలఁపు మనుట. ౮౨

తే. గీ. శమను దిక్కున నీగతిఁ జల్లు మనుట
తగు మలయమారుతము నిచ్చు దక్షిణదిశ
పగిది విజ్ఞాన మొసఁగుచు సుగతికిఁ దెరు
వైన గురువును బూజింపు మనుట సూవె.

చ. సరసిజమిత్రు రాకఁ గని చంద్రదళంబగు రాగమూను న
ప్వరుణుని దిక్కునం దనుట వాసి మెయిం దివసావసానమం
దరయుచు నిన్నెదుర్కొని దయంబునఁ గౌఁగిటఁజేర్చు నెచ్చెలిం
గర మనురాగయుక్తిఁ గనఁగాఁ దగునంచు వచించు టొప్పఁగన్. ౯౬

క. ఉత్తరదిక్కున నక్షత లిత్తెఱఁగునఁ జల్లు మనుట యెంతే విజ్ఞా
నోత్తర మది యగుగతి దయ హత్తింపఁగవలయు ననుట యందఱియెడలన్.

తే. గీ. భూమియందున నక్షతల్ వోయు మనుట
తద్గతాశేషజీవులఁ దనుపు మనుట,
నింగిపైఁ జల్లుమనుట యడంగి యున్న
తస్థితినిఁబొందఁ గోరఁగాఁ దలఁపు మనుట. ౯౭

వ. అని యిట్లుపదేశించి బుద్ధుండును నిదిగృహస్థధర్మం బనియుం జెప్పి కాషాయ
ధారులు వర్తింపఁదగు కీతులుం దగు ఫంగిం దెలిపిన నా సంఘుంబు వారెల్లరును
సదాచారంబు వదలి; కిల్లసేకుల దురాచారంబులు మాన్పించి జగం బంతయును
సదాచారప్రవర్తకంబుఁ గావించె.

ఉ. ఈగతిఁ బుద్ధుఁ డీజగతికెల్ల మతంబు హితంబుగాఁగ వి
ద్యాగరిమన్ వచించుటయు నందఱు నింద్రియశాత్రవాళికిన్
లోఁగక మోదవారినిధిలోఁ దలమున్కలుగాఁగ మున్గి యా
యాగతు లెల్ల నెమ్మదికి నంటుగతిం జరియించి రొప్పఁగన్. ౯౮

వ. సర్వము నెఱింగినవాఁ డగుటచే సర్వజ్ఞుం డనియుఁ బునరావృత్తిరహితంబగు
నిర్వాణపదం బధిష్ఠించిన వాఁడగుట సుగతుండనియు నహింసాధర్మంబులకు రా
జగుటచే ధర్మరా జనియు దేని నపేక్షించి తనపురంబు వదలెనో దానిం గైకొని
మరల వచ్చినవాఁ డగుటఁ దథాగతుండనియు ధైర్యము మాహాత్మ్యము యశము
సిరియు జ్ఞానము వైరాగ్యము నను షడ్వర్గము గలవాఁడగుట భగవంతుండనియు
స్కంధమార క్లేశమార మృత్యుమార దేవపుత్రమారు లను మారచతుష్టయశేత

యగుట మారజిత్తనియుఁ దపంబున లోకంబు జయించినవాఁడగుట లోకజిత్తనియు సంసారవిజయి యగుట జినుండనియు దివ్యదృష్టియు దివ్యశ్రోత్రము పూర్వజన్మస్మృతియుఁ బరచిత్తవిజ్ఞానంబును నప్రత్యక్షవిషయజ్ఞానంబును వియద్గమనాదిలాఘవంబు నను నా అభిజ్ఞలు గలవాఁ డగుటచే షడభిజ్ఞుం డనియు బుద్ధియు ధ్యానమును క్షాంతియు వీర్యంబును జ్ఞానంబును గృపయును శీలంబును బలంబును దానంబు నుపేక్షయు నను పదిబలంబులు గలవాఁ డగుటచే దశబలుఁ డనియు బోధిసత్త్వసంపన్నుండగుటచే బుద్ధుం డనియు సర్వార్థసిద్ధి గలవాఁడగుటచే సిద్ధార్థుండనియుఁ బలుకంబడు నమ్మాయాదేవీ నందనుండు తనతండ్రికి బోధించిన దినము మొదలు పంచషవత్సరంబులు తదేకదీక్షగ సర్వభాషలయందు సమస్తజాతులకు సకలదేశములఁ దనమతంబు బోధించి వ్యాపింపంజేసినఁ బంచాశత్కోటిసంఖ్యాకంబగు జనం బమ్మతం బవలంబించిరి. ౯౯

క. ఆమత మిప్పటికిని నెంతే మెయి నెక్కుడగు భంగి నెసఁగుటకుఁ గతం
బేమెయిఁ జూచిన భూతదయామతి యందలరుట యని యారయుటొప్పన్.

మ. అలుకన్ లోఁగొని శంకరార్యు లతిజీర్ణావస్థ నొందించినన్
బలిమిం జెన్నగు నేమతంబు భువిఁ దత్ప్రాచుర్య మింతింతనాఁ
దలమే! సర్వమతావలంబులగు మర్త్యశ్రేణితో నెంతయుం
దులఁదూఁచన్ మిలు నూపఁగాఁ గలరు బౌద్ధుల్ నేఁటి కింతేటికిన్. ౧౦౦

తే. గీ. బుద్ధునకుఁ గల యెక్కుడు భూతదయను
గూర్చి మా నేర్చుగతి నిట్లు గొంతదనుక
వ్రాసినారము తద్గుణవైభవంబు
సారెసారెకుఁ బ్రేరణం బారఁజేయ. ౧౦౧

## —♦ ఆశ్వాసాంతపద్యములు ♦—

క. గోదాతీరస్థితరాజ్యా! దానీయజనశరణ! శాంత్యాభరణా!
భూదేవపక్ష! ధృఢసత్త్వా! దక్షా! కృష్ణరాయ వసుధాధ్యక్షా.

ఉ. హైమదలాభవర్ణ! వసుధామరవర్ణకృతావతారశ్రీ
రామ! సుహృత్సమేతనిజధామ! శుభాకృతిసోమ! సౌమతీ
రామ! వదాన్యతావిజితరామ! దయాతతభూమ! పాపహృ
న్నామకకృష్ణరాయనరనాథమణీ! కృతినాయకాగ్రణీ!

—• స్ర గ్ధ ర •—

శ్రీమల్లోకైకచర్చ్యస్వర్ణకోట క్షితివిభుధకుల క్షీరవారాశిచంద్రా
ధామోదారా జగన్నాథ నృపకుముద శీతద్యుతిద్యోతరాజ
త్కామాంబాదత్తపుత్రా కలితగుణగణా గణ్యపుణ్యప్రచారా
శ్రీమత్పైడాడవంశ శిరసకవితా! శ్రీయుతా! కృష్ణరాయా! ౧౦౫

—• గ ద్య ము. •—

ఇది తిరుపతివేంకటేశ్వర ప్రణీతంబైన బుద్ధచరిత్రంబను
మహాప్రబంధంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము
సమస్తసన్మంగళావిభవంతు.



# —♦ బుద్ధచరిత్ర ♦—

## శుద్ధపత్రము.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 5 | వింధరా | విద్యాధరా |
| ,, | 19 | జగ్గయ్య | జగ్గయ |
| 4 | 18 | బలుగాకు | పలుగాకు |
| ,, | 27 | మొలగ్ప | మెలర్ప |
| 5 | 3 | వర్తివతం | వర్తిప్రతం |
| 6 | 13 | దక్కుడగు | దక్కువగు |
| ౯ | 1 | దంతముగ | దంకితముగ |
| 10 | 9 | షవన | షవణ |
| 12 | 10 | సాధ్వీకిఁ | సాధ్వీకి |
| 13 | 6 | ధట్టుఁడు | దట్టుఁడు |
| 19 | 15 | డాధీరుఁ | డాధీరుఁడే |
| 25 | 11 | మలయాంగబు | మలయాగంబు |
| ,, | 18 | చునట్టి | చున్నట్టి |
| 36 | 10 | రైక | రైఅక |
| 39 | 7 | చినిపగిది | చినవగిది |
| 40 | 10 | లయ్యాను | యయ్యాను |
| 44 | 4 | సఖియ | సకియ |
| 47 | 2 | మిగులుఁ | మిగులు ; |
| ,, | 3 | భ్రాక్స్వితా | ప్రాక్స్వితా |
| 48 | 17 | పుట్టుటయుఁ | పుట్టుటయు |
| ,, | 18 | కిట్టుట | గిట్టుట |
| 54 | 15 | ముల గు | ములు గు |

| | | | |
|---|---|---|---|
| 54 | 23 | గడఁగె | గడఁగు |
| 55 | 5 | పైపెచ్చు | పైవచ్చు |
| 58 | 4 | గట్టిపల్కు | ఇట్టిపల్కు |
| 60 | 9 | ప్రాపు | ప్రోపు |
| ,, | 15 | నధిష్టించి | నధిష్ఠించి |
| 62 | 7 | నెన్నఁటి | నెన్నటి |
| 65 | 28 | సముద్గకంబుగన్ | సముద్గకంబునన్ |
| 66 | 3 | నూఁగు | లూఁగు |
| 68 | 14 | సకిలంచు | సకిలించు |
| 70 | 6 | పారికలు | పాలికలు |
| ,, | 24 | విడచిన | విడిచిన |
| ,, | 26 | సితాసి | శితాసి |
| 78 | 1 | గలపి | గలిపి |
| 80 | 4 | దత్వంబు | దత్త్వంబు |
| 85 | 2 | త్వరాయమాన | త్వరాయమాణ |
| 87 | 8 | మ్ములకు | హమ్ములకు |
| 89 | 17 | బాలు | బాల |
| 93 | 5 | లోష్ఠఁబు | లోష్టంబు |
| 94 | 1 | యెక | యెకి |
| 95 | 11 | లోపడ | లోఁబడ |
| ,, | 28 | చనినప్పటి | చనె నప్పటి |
| 96 | 14 | బనియెను | జనియెను |
| 98 | 9 | జడలు | జడల |
| 99 | 2 | బిగించె | ఓగించి |
| 108 | 11 | మమేదం అను | మమేదమ్మను |
| 109 | 8 | రాధివంతు | రాధిమంతు |
| 111 | 10 | యుఁదూ | యుదూ |

| | | | |
|---|---|---|---|
| 119 | 22 | ధర్మగతని | ధర్మగతిని |
| 120 | 18 | మృణ్మయ | మృన్మయ |
| ,, | 23 | | |
| 123 | 2 | లిరుపురి | లిరుపుర |
| 126 | 12 | నోకనాటి | నోకనాఁటి |
| 127 | 12 | నిట్టారుపు | నిట్టూరుపు |
| 128 | 6 | గాంవి | గాంచి |
| 128 | 25 | ఙాంన | గానం |
| 131 | 1 | ప్రాికృత | బ్రాకృత |
| 131 | 13 | నవి | సెవి |
| ,, | 24 | వడయు | బడయు |
| 132 | 21 | కష్టములు | కష్టమ్ములు |
| 133 | 2 | వన్యా | వహ్న్యా |
| ,, | 3 | మదము | ముదము |
| 135 | 27 | మెదవు | మొదవు |
| 136 | 23 | దేమనః | దేమన, |
| 138 | 14 | కృపాయిత | కృపాయుత |
| ,, | 22 | నక్షత | యక్షత |
| 141 | 2 | విభుధ | విబుధ |

**72 వ పుట 20 వ పంక్తి ఇట్లు మార్చుకొనవలెను.**

మొగమున ముల్లునాటెనె? ప్రబోధమొనర్చకపోతి మమ్ములన్

శ్రీ మత్పరదేవతాయైనమః

# ఏలా మాహాత్మ్యము

## ప్రథమాశ్వాసము




మరునల్కఁ బాప నడిఁజేయి శశిన్ గనుఁ గప్పి యాపెకుం
దామరమేడఁ దుమ్మెదవిధమ్మునఁ జొచ్చి క్షమింపుమంచు నా
రామపదమ్ములం బడి కరంచు లసద్రసరాజవల్లభ
స్వామి దయాళుఁడై మనుచు సజ్జనగేయుని సర్వరాయనిన్. ౧

ఉ. పొందుగ గబ్బిగుబ్బలకుఁ బూసిన కస్తురిపూఁతగా నుపేం
ద్రుం దలపోసి నెచ్చెలులు "తొయ్యలి భర్తకు మున్న లేచు టీ
చందమకా" యటంచు నెకసక్కెము లాడఁగ లోన నవ్వువా
ర్నందని సర్వరాయని నిరంతరమున్ దయఁజూచుఁగావుతన్. ౨

శా. క్షీరాంభోనిధిమధ్యభాగవిపుల శ్రీయుఙ్మణీద్వీపక
ల్పారామాంతరచంద్రికాధవళపర్యంకం బధిష్ఠించి సు
స్త్రీరూపామరశక్తిసేవ్య యగుచుం జెన్నారు శ్రీదేవి స
ర్వారాయాభిధు నెల్లవేళ సుఖసంపన్నాథునిం జేయుతన్. ౩

మ. "సతి నక్కుం గదియించి మోయఁదగునే సంసారి హామోహరుం
డతిలోలుం" డని గేలిసేయుపతి గర్వాటోపముం జూచి యే
గతి నేవేళనొ దేహమందు సగమున్ గైకొన్న బల్ జాణ పా
ర్వతి భ్రాతృద్వితయీసమేతు నలసర్వారాయనిం బ్రోవుతన్. ౪

మ. "వలరాజున్ హరియించియుం దుడకుఁ బాపం బాఁపఁగా లేక య
వ్వలలోఁ జిక్కితి నేనకాదె" యను నాపార్వతేయగోత్రాత్మజన్
గిలిగింత న్నగఁజేసి "యౌ" ననుచు నంగీకారమున్ జూపు గు
బ్బలిరాయుం డలరాజశేఖరుఁడు సర్వారాయనిం బ్రోవుతన్. ౫

మ. చతురాస్యుండు కలాకరుండు జగదాశ్చర్యప్రభావుండు సం
స్కృతభాషోదయుఁ డుత్తమాభినుతకీర్తిప్రాభవోపేతుఁ డ
ర్పితభక్తోచ్ఛ్రియుఁ డార్ద్రచిత్తుఁడు గురుశ్రీకుండునౌ బ్రహ్మ పం
డితుఁ డెల్లప్పుడు సర్వరాయనికిఁ బాటించున్ జిరాయుష్యమున్. ౬

మ. "అనయమ్మున్ దనయత్తగా రొసఁగు నాయైశ్వర్యమున్ శోభిలం
గనుజేయన్ సమకట్టె దెయ్యేడల వాక్కంజాక్షి" యన్ దుర్యశం
బును వీడంగఁదలంచె నెవ్వనియెడన్ బుణ్యాత్ముఁడీసర్వరా
ఘ్నుఁ డద్దేవికిఁ బ్రీతి గొల్పుతఁ గవిట్సత్కారపారీణుఁడై. ౭

తే. గీ. కాళిదాసాది సంస్కృతకవుల కెరఁగి
నన్నయాద్యాంధ్రకవులకు నతులొనర్చి
సుకవులగువారలకు శతగుణముగాఁగ
మ్రొక్కికొందుము "మాకృతి ముట్టకుఁ" డని ౮

వ. అనిశిష్టాచారానుసరణంబుగ నిష్టదేవతాభివందనాదికంబాచరించి యుండునెడ.

క. వీరవరగ్రామణి శే దారము లారామములును దగువాఁడు మహో
దారుఁడు తోఁటకులుఁడు సర్వారాయఁడు పేర్మి మమ్ము రావించి యనెన్ ౧౦

ఉ. తిరుపతి వేంకటేశ్వర సుధీమణులార ! కవీంద్రులార ! దు
ష్కరము శతావధాన మెసకమ్మునఁ జేయుటకుం గవిత్వమున్
సరసముగా రచించుటకుఁ జాలినవారలు మీకుఁ దక్క నొం
డొరులకు సంస్కృతాంధ్రకవితోచితపద్ధతి గల్గియుండెనే ? ౧౧

క. వ్యాకరణము తెలిసినఁ గవితాకల్పనలేదు సుకవితావిదుఁడైనన్
వ్యాకరణము రా దీరెం డీకాలమునందు మీక యొసఁగెఁ దలంపన్. ౧౨

క. శ్రవణానందము నిజముగ నవు వేంకటరత్నమంత్రి కంకితముగ మీ
కవ మును రచియించినయా కవనమ్మొక్కింత వినిన కవయిత్రలకహో. ౧౩

తే. గీ. ఆత్మకూరు నృపాలున కంకితముగ
శ్రీనివాస విలాసంబు చెప్పికాదె
నాఁడు జోడుమహాల్పీలతోడఁ బవలు
నాగమండప మెక్కి యూరేగినారు ! ౧౪

వ. ఇదియునుంగాక. ౧౫

క. గద్వాలపురములోపల విద్వాంసుల నెఱిఁగి రామవిభుమన్ననఁ జే
తద్వాచకాత్మరాశీమద్వరకలధౌతబిరుదమాన్యతఁ గనరే ! ౧౬

క. వేదసమానము ప్రఖ్యాపాదక మఘనాశకంబు భాగవతం బ
ష్టాదశపురాణములలో నైదవయది తెల్గుసేయు టబ్బురముగదా. ౧౭

చ. మఱియు ననేకభూపవరమన్ననమైఁ దగు వృత్తులందె బం
గరుబిరుదమ్ములం బడసి కానుకలం గ్రహియించినార లో
తిరుపతివేంకటేశ్వరసుధీమణులార, కవీంద్రులార ! చా
తురి నెఱిమీఱు మీకవిత తొల్లిటివారలఁ బోలు టబ్బురమే ! ౧౮

వ. అని పెద్దయుం బొద్దు ప్రశంసించి. ౧౯

క. ఏలానదివేలాభువి నీలీలల నిఖిలసుఖము లెనసెడి నా క
య్యేలమహత్త్వమ్మును వినఁగా లోలత మించె సుకవికల్పితకృతిగన్. ౨౦

క. ఏలానదిలోఁ బెఱనదు లేలా తులఁదూగుఁ ? దొక్క యింతజలమ్మున్
దాలో దాఁపక జలనిధి పాలుం గానీక పంటపైరుల కిచ్చున్. ౨౧

ఉ. కావున నన్నదీమహిమ గానొకచిన్నికృతిన్ రచించి యం
దేవియు నేనిఁ బుణ్యకథ లేటిచి కూర్చి మదంకితమ్ముగాఁ
బావన నన్నుఁ జేయఁగలభారము మీయది యంచుఁ గప్పిపుం
దావి నెసంగు వీటి కలధౌతపుఁ బల్లెరమందుఁ బెట్టినన్. ౨౨

వ. ఏమును దదీయవినయసౌజన్యాదిగుణమ్ముల కలరి విద్వత్తామాన్యమ్ములగు వచనం
బులకు సంతసించి యార్ద్రాంతఃకరణుల మగుచుఁ దదంకితమ్ముగఁ దత్కథాకథ
నమ్మున కంగీకరించి కృతిపతివంశం బభివర్ణింప నారంభించితిమి. ౨౩

ఆ.వె. గయుని తలకుఁ దొడవు, కలుముల జవరాలి
తొడవుఁదొడవు, వేల్పుదొరకు సిరియు
మేలుఁగూర్పు దాత, మిన్నేఱు జన్మించి
నట్టిచోటు వెలయు హరిపదంబు. ౨౪

క. తాదృశమగు హరిపదమునఁ బ్రాదుర్భావమ్మునొంది ప్రబలెన్ శాఖా
భేదముల నొక్కవర్ణం బాదెన్ సచ్ఛూద్రు లాద్యు లందుఁ దలంపన్. ౨౫

తే.గీ. అవనిఁ బెద్దాపురమ్మున కర్ధయోజ
నముగలుగు మేర వీరపర మనునూరఁ
బాఁడిపంటయు సిరియు సంపదయుఁ జగువు
కొదవలేకుండు రంబొక్క కుదుటివారు. ౨౬

క. ఆకాశపువాండ్రఁ దోఁట లనేకముగా నాటి జగతి నిర్మలయశమున్
జైకొనిన వారి నందఱు నాకతమునఁ దోఁటవారటందురు జనముల్. ౨౭

క. మానితధనుండు మర్యాదానిధి భూవరహితుండు దాత ఘనుఁడు వి
జ్ఞాని యుదయించె వెంకన నానాఁటికిఁ దత్కులమ్మునం దతయశుఁడై. ౨౮

క. కృషివృత్తిగ నాతండొక ఋషిగతి సత్యంబుఁ దప్ప కెంతయు నతకి
ల్బిషహరులగు భూసురులే వృషవాహనులనుచు మది జపించుచుఁ బేర్మిన్. ౨౯

క. సంతానార్థంబుగ నొక, యింతిన్ సీతాభిధాన నెంతయు సాధు
స్వాంతన్ జైకొనె సీతా కాంతన్ శ్రీరామమూర్తి కైకొనినగతిన్. ౩౦

శా. తాదృక్కోఁటకులాబ్ధిచంద్రున కనేతాదృగ్యశోరాశికిన్
భూదేవాదృతదత్తచిత్తునకు నన్యూనక్షమాకారుణీ
యాదోనాథుఁడు వేంకనాంఘ్రిజున, కయ్యాజ్ఞాక్షికిం బుట్టెఁ దా
యాదుం డొక్కరుఁ డాత్మవంశమున కుద్యత్కీర్తి సంధింపఁగన్. ౩౧

వ. అట్టి కుమారరత్నంబున కాదంపతులు వృద్ధానుమతంబున సర్వారాయం డను
నామం బిడిరి.

క. సర్వారాయఁడు సర్వాంతర్వాణిహితుండు చనవు దగఁ బెద్దాపు
ర్యుర్వీపతి నికటమ్మున సర్వప్రాభవము తాన నవరించె నొగిన్. ౩౩

క. శ్రీరుచిఁ దగు వేంకమయను నారిన్ బరిణయము చెంది నానాఁటికి స
ర్వారాయఁ డతఁడు గనె నింపారఁగ నొకతనయు వేంకటాచలనామున్. ౩౪

క. విద్వాంసుల కాతఁడు సం విద్వర్యుఁడై యొసఁగె ధరణి బెల్లుగ విభ్రా
జద్వర్తన యగు వెంకమ నుద్వాహము చేసికొనియె నొగి శుభలీలన్. ౩౫

క. ఆయమయం బాతఁడు విప్రు లాయుర్భాగ్యముల నొప్ప ననఘుల సర్వా
రాయని, నచ్యుతరాముఁ, శేయగుణుఁ బద్మనాభునిన్ గనె ముగురన్. ౩౬

సీ. తనతోడ వైరంబు గొనినవారి నేల గాచినాఁడు ఘనమ్ము దాఁచినాఁడు
ఆశ్రయించినవారి కఖిలసంపదలిచ్చి కాచినాఁడు ప్రతిష్ఠచూపినాఁడు
తనవారి ఘనత నెంతయుఁ బ్రోచి సుఖశోల నూఁచినాఁడు యశంబు దోఁచినాఁడు
మహనీయులకుఁ బెక్కు మాన్యముల నొసంగ నోఁచినాఁ డపకీర్తి త్రోచినాఁడు

తే.గీ. రావు వేంకటనీలాద్రిరాయనృపతి
తరుణి శ్రీభావమాంబిక తనకుఁ దగు ని
యంత్రి గా నెల్లయెడల స్వతంత్రుఁడగుచు
సర్వరాయఁడు ప్రఖ్యాతి సంతరించె. ౩౭

క. పేర్వాసికెక్కి యెల్లెడఁ బర్వఁగఁ, దనయున్న వీరవరమునయందున్
జెర్వొక్కటి త్రవ్వించెఁ సర్వారాయండు ప్రజలు సమ్మదమందన్. ౩౮

మ. కవియై పండితమండలీమృదుమనఃకంజాతకంజాతబాం
ధవుఁడై యచ్యుతరాముఁ డెంతయు దయాదాక్షిణ్యముల్ గల్గి బాం
ధవవిశ్వాసము నొంది యెన్నఁదగు దానాదాయుఁడై మించి వీ
రవరగ్రామము పేరుగాఁ దగుమురా రక్షించె నిర్వైరియై. ౩౯

సీ. ఏనాఁడు చూచిన నానావిపశ్చిత్ప్రసంగసంగత మగారాంగణంబు
ఏవేళఁ గనుఁగొన్న శ్రీవల్లభశుభాభిధానపారాయణంబు నానంబు
ఏకాల మరసిన సాకల్యముగ వనీపకకోటుల కొసంగు పాణియుగము
ఏక్షణం బీక్షింప నిందిరానాథసత్కథల నాకర్ణించు కర్ణయుగము

తే. గీ. గలిగి పండితమండలి "లలితపాండి
తీవిభవమున్నవాఁడవు నీవు శాస్త్రి
నాఁదగుదువోయి" యనుచు విజ్ఞానమహిమ
వొగడఁగ యశస్వి పద్మనాభుండు తనరె. ౪౦

క. ఒకయాత్మబోధమను పుస్తకమున్ గృతిగాంచి యతఁడు దనియించెను న
వ్యాకలంకుని సుబ్రహ్మణ్యకవీంద్రున్ సాహిత్యరసాంబుధిచంద్రున్. ౪౧

ఉ. ఏఁబదిమాటలేల వినుఁ "డేఁబదివేల వరాలమూట వి
ద్యాబలమున్నవారలకు దానము చేసిన మేటిదాత" నాఁ

గా బహుపండితుల్ వొగడఁగా వినినారము మేమకాక యిం
కేఁబదిమందిరైన నుతియింపఁగ నేర్తురె? పద్మనాభునిన్. ౪౨

క. ఆసర్వారాయఁడు కరుణాసౌశీల్యాది లక్షణంబులకున్ గుం
భీసుతసుతయగుచెల్లాంబాసాధ్విన్ బెండ్లియాడె భాసురలీలన్. ౪౩

తే. గీ. ఆసతీరత్నమందు నయ్యనఘమతికి
సంభవించిరి వేంకటాచలము పద్మ
నాభమూర్తియు నరసింహ నాయఁడనఁగ
నాత్మజాతులు కూఁతు రమ్మాయి యనఁగ. ౪౪

క. వరహాలను వెంకయకున్ దరుణీమణియైన యమ్మనకుఁ గూఁతురు ము
ద్దరగడకులభవ నాగమఁ దరుణీరత్నంబుగా నతఁడు వరియించెన్. ౪౫

తే. గీ. పేర్మి నాగమకాంతను బెండ్లియాడి
వేంకటాచలనాథుండు వెలసినట్లు
పేర్మి నాగమకాంతను బెండ్లియాడి
వేంకటాచలనాథుండు వెలయకున్నె. ౪౬

క. తాతయగు వేంకటాచల మేతీరునఁ బేరుగాంచె నేతీరున భూ
దాతయను యశమునించెనొ యాతీరునఁ బ్రబలె వేంకటాచల మితఁడున్. ౪౭

క. ఆరమణియం దతడు సర్వారాయని దాత పేరివరహాలను సు
బ్బారావున్ గనెఁ గూఁతుల నారసె నమ్మన్నయనఁగ నమ్మాయియనన్. ౪౮

క. ఆయ్యేవురపత్యమ్ములు నెయ్యముఁదియ్యమును నెఱప నెఱిఁగాంచిరి యా
యయ్యమలిరువురు పెంచిన యయ్యమ్మాయియను మేనయత్తయు మిగులన్. ౪౯

క. దూలము తిమ్మయకూఁతు సుశీలన్ బ్రహ్మాంబ యనెడి చెలువన్ గవితా
లోలుఁడు సర్వారాయఁడు కేలంగొని సుఖముచెంది కీర్తివహించెన్. ౫౦

క. చక్కనిసాహిత్యము నుతి కెక్కిన వాదాన్యకంబు నెఱుకయుఁ గలఁడై
యొక్కవ సర్వారాయం డక్కుమరులలోనఁ బ్రబలె నతిసయగతులన్. ౫౧

క. నిగమాంతవేత్త కవియునునగు సింహంపూడి కామయాంతర్వాణిన్
దగఁగొల్చి సాహితీపారగుఁడై యలరారె సర్వరాయఁడు పేర్మిన్. ౫౨

క. వరహాలు సహజభావముఁ బొరయఁగ జనియించినట్టి పుణ్యాత్మునకున్
విరతాగర్భశ్రీమత్తరసికులు వచించుటయును దబ్బఁగునే. ౫౩

సీ. విద్వాంసుఁడనుమాట విన్నంతమాత్రన మనమున నానందఘనతఁ జెందుఁ
జెంది యాతఁడు తన్నుఁ జేర నెప్పుడు వచ్చునో యటంచును మది నూరుచుండు
నుండి యాతం డరాక దండకే తెంచిన నెదురుగాఁజను మూర మెంతరేని
చని తోడితెచ్చి వచ్చినవారితో శాస్త్రముల సందియమ్ములు ముచ్చటించు

తే. గీ. ముచ్చటించి మనమ్మున లోచ్చుగాని
సంతసముమీఱ వారల శక్తికొలఁది
సత్కరించి వినయమున సాగనంపు
సర్వరాయండు పినతాత సాటిగాఁడె! ౫౪

తే. గీ. తాతతండ్రులమర్యాద దప్పనీక
సర్వరాయండు సోదరసహితుఁడగుచు
భూసురాశీర్బలమ్మునఁ జేసి వృద్ధిఁ
జెందెఁ జెందుచున్నాఁడు చెందఁగలఁడు. ౫౫

షష్ఠ్యంతములు.

సీ. ఏతాదృశస్థితిభూతివిఖ్యాతివిద్యాతిశయద్యోతితాంతరునకు
నాగమోదరపయస్సాగరచంద్రోదయునకు వాదాన్యకనకఖనికి
ననుజద్వితయమనోవనజభాస్కరునకు వేంకటాచలపుణ్యవిభవమునకు
నేరువాకలగోత్రవారాశిభవునకు దేవతాద్విజభక్తిపావితునకుఁ

తే. గీ. బుండరీకాక్షపాదసంభూతమణికి
భూవరహితున కాచారపావనునకు
సరసకవిరాజపికపుష్పసమయమునకు
సంచితాజన్మభాగ్యవిస్తారునకును. ౫౬

క. వీరవరగ్రామణి కతిధీరున కతిసాహితీకధీశాలికి గం
భీరునకు శాంతునకు సర్వారాయని కనఘుతోఁట వంశభవునకున్. ౫౭

వ. ధనకనకవస్తువాహనపుత్రపౌత్రాదిసర్వాభ్యుదయపరంపరాభివృద్ధిగా మా
యొనర్పంబూనిన యేలామాహాత్మ్యమ్మునకుఁ గథాక్రమంబు: ౫౮

## కథాప్రారంభము.

తే. గీ. నైమిశాఖ్యానెసఁగు నరణ్యమ్మునందు
శౌనకాదిమహామునుల్ శాంతిధనులు
వ్యాసశిష్యుండుఁ బౌరాణికాగ్రణియగు
సూతుఁ గన్గొని హర్షసమేతులగుచు. ౫౯

చ. తెలిపితి దైవతమ్ములగు తీర్థము, లందును గౌతమీనదీ
కలితములైన శాఖలప్రకారము లానతియిచ్చి, తెంకఁ ద
ద్విలసిత మేల నాఁజనునదీమణియై యొకశాఖ కొంతమం
డలము పవిత్రితం గొలిపె నా మునువింటిమి రౌమహర్షణీ. ౬౦

క. ఏవేవి దానఁగలతీర్థావను? లెందుండి యెచటి కానది చనె? నా
యావిధమంతయు నానతి యీవే, మాపాలిదైవమీవే! యనఘా. ౬౧

శా. "ఏలా భుక్తివిధాయినీ" యనుచు మున్నెన్న భీమేశ్వర
శ్రీలామండలవర్ణనాదృతి మతిన్ హెచ్చింపఁగా మాకుఁ ద
త్కాలంబందుఁ దదాపగామహిమ వక్కాణింపుమన్నంత వా
చాలత్వము లేకపోయెను దదిచ్ఛన్నేఁడు తీర్పందగున్. ౬౨

క. అని శౌనకాదిమును లడిగిన సూతుఁడు గురువునకెఱఁగి కడఁకి కలహా
శనమునికీ నజుం డెఱిఁగించినవిధమునఁ దద్విధంబు చెప్పఁదొడంగెన్. ౬౩

శా. కిమ్మీరుండను రక్కసుం డొకఁడు వేగీదండకారణ్యమ
ధ్యమ్మున్ జేరి సుఖమ్ము వీడి కడుముక్తాహారుఁడై యొక్క పా
దమ్మూర్వీస్థలి మోపి చేసె నయుతాబ్దమ్ముల్ తపంబోలిఁ జి
త్తమ్మున్ దాఁ దరుణేందుశేఖరపదాద్వైతమ్ముగాఁ జేయుచున్. ౬౪

క. కులగిరులు గ్రక్కదలె నబ్ధులు ఘూర్ణిల్లెన్ దిగంతములు బీఁటలెన్
దలకడచెన్ జ్వలనము చుక్కలురాలెన్ దత్తపోనుగతమగు వేఁడిన్. ౬౫

సీ. తలమీఁదిగంగ కదలిరాచపసిబిడ్డ యగుచందురుని ముద్దులాడుచుండఁ
జేతిలోఁ దనరారు జింకకొమ్ములు తూఁగి జీరాడుజడలలోఁ జిక్కువడఁగఁ
బులితోలుపై ప్రేలు పుక్కదండలచాలు చిలువరాతలలమణులను నొరయఁ
**గందోయిఁ దొరఁగెడి కరుణామృతపువెల్లి మిసిమినాఁ దెల్లనిమేను మెఱయఁ**

తే.గీ. గొండరాచూలు తనకొక దండగాఁగ
గిబ్బతత్తడిపై నెక్కి కెలన నడచు
భృంగితోఁ గొన్నిముచ్చట లెంచికొనుచు
ననుకృపాకరుఁ బ్రత్యక్షమయ్యె శివుఁడు.

తే.గీ. ఇట్లుచూపట్టినట్టి మహేశ్వరునకు
సాగి సాష్టాంగముగ నమస్కార మాచ
రించి కృపమీఱఁ దన్నాదరించు నతని
యెదుట నిల్చి స్తుతించె నిట్లెనక మెసఁగ.

మ. కరుణాసాగర ! బాలశీతకరరేఖాశాలిజూటాల ! ని
ర్జరగంగాతటినీమనోహరణ ! సూర్యచంద్రవహ్నినే
త్ర ! రమానాథముఖామరప్రణతపాదా ! నీకు జోహారు పా
మరునిన్ బ్రోవుము నన్ను శీతనగజామాతా ! పయోంభోనిధీ ! ౧౮

క. అజగవ్యాశయ ! నగాశయ ! యజగవశయ ! విమతమర్దనాశయ ! నీకున్
ద్రిజగత్పావనధుర్యున కజరామరణునకుఁ బ్రణతి యర్పింతు శివా ! ౧౯

క. దాతవు ముముక్షుజనులకు నేతవు భూతముల కభయనేతవు నగజా
మాతవు మాతవు భూమికిఁ దాతవు మాకెల్ల నీవ తరుణేందుధరా ! ౨౦

సీ. పోతుతత్తడితోడఁ బోరాడి జడదారిబుడుత కాయువొసంగి ప్రోచినావు
బాణాసురుని యింటఁ బడి వానిమొగసాలఁ గాల్బంటుగీతిగాఁ గాచినావు
పాలమున్నీటఁ బొల్పడినవిసము ద్రావి సోఁకుమాఁకల దయఁబ్రోచినావు
నినుఁగిడ్పులో నుండుమని వేఁడు దానవుతమవున నెమ్మెను దాఁచినావు

తే.గీ. నీకు భక్తులయెడఁ గల్గు నిరుపమాన
కరుణ యేదేవతలకైనఁ గలదె శీత
గిరిసుతాకలితాంగ! చందిరసితాంగ!
రాజకలితోత్తమాంగ! ధరాశితాంగ! ౨౧

క. అనివినుతించిన హరుఁ డాతనిఁ గనుఁగొని "నీ యభీష్టపంబగు వరమున్
గొనుమిచ్చెద" నన వాఁ డిట్లనియెన్ మఱిమాఱ ముకుళితాంజలియగుచున్. ౨౨

వ. "దేవా పనసేక్షునారికేళక్రముకరసాలాదికారామమ్ములును ముక్కారుపండు
కేదారమ్ములును నేనధివసించు నీవింధ్యారణ్యభాగమ్మునందు సంపూర్ణమ్ములగు

టకు నిమ్నగత్వమ్మును సాగరసంగతత్వమ్మును లేక సరసజలప్రవాహ యగు
నొక్కధునీలలామఁ బ్రవహింపఁజేయఁ గోరెద" ననుడు మందస్మితసుందరవదనార
విందుండగుచుఁ జందిరశేఖరుం డిట్లనియె. ౨౩

తే.గీ. నీవుకోరినవర మది నీక కాక
జగములకు నెల్ల సంతోషసాధకంబు
గాని యొండు వచించెదఁ గడఁగి దాని
నాలకింపుము సావధానాంతరమున. ౨౪

క. ఏలాముని నాకై యీ లీలం దపమాచరించు లేఖాపగతోఁ
బోలునొక పాపహారిణిఁ, గూలంకషఁ గడలి కిచ్చికోలున కెలమిన్. ౨౫

వ. అతని కా వరంబు ప్రసాదించుతఱి భవదధిష్ఠితప్రదేశంబుమీఁదుగాఁ దీసికొని పో
నానతిచ్చి యే దేని నొకకపటోపాయమ్మున సాగరసంగమం బాఁగెద ననుచుఁ
గిమ్మీరుండు పురవైరి కిట్లనియె. ౨౬

క. దేవా ! యేలామునియును దేవాపగవోని యొక నదీమణి నప్పా
రావారమున కొసంగంగా వలసిన కతము సెప్పఁగావలె నాకున్. ౨౭

క. అనుడు గిరిశుండు నేలామునివరుని తపంబు లోకములకెల్ల వినా
శనకర మగుగతి నున్నది, చనఁగావలె నతనివర మొసంగుటకొఱకున్. ౨౮

వ. అని యానతిచ్చి నీవడిగిన ప్రశ్నమ్మున కిట కనతిదూరమ్మున నీకెదురగు వృద్ధ
మునీంద్రుం డుత్తరంబిచ్చునని యంతర్ధానంబు చెందుడుఁ గిమ్మీరుండు నచ్చోటు
కదలి వృద్ధుం గాంచి కడచినవృత్తాంతమ్ము చెప్పి యడిగిన నతని కతం డిట్లనియె.

సీ. పులికశేరుకమీఁదఁగలతీఁట నేచోటఁ గొమ్ములతో జింక గోఁకుచుండు
నచిరప్రసూతమ్ములైన లేళ్ళేచోటఁ దపసులవీఁపులు దడవుచుండు
మొదవులేఁగలకైనఁ బులియాఁడుది యేచోటఁ జనవుగాఁ బాలిచ్చి సాఁకుచుండు
నేవేళ నీవారతృణరాసు లేచోటఁ జిలుతవేళ్ళలతోడఁ జివుకుచుండు

తే.గీ. లతలు నగములతోడ షడ్ఋతువులందు
నేకరీతిగఁ బుష్పఫలైకతాన
గతులఁదనరారు నేచోట గౌతమముని
యాశ్రమం బది యొప్పారు నశ్రమంబు. ౩౦

చ. అచట వసించు గౌతమమహాముని శిష్యగణమ్ముతో బళి
పరిచితకుటీరభాగమున భాసురవృత్తులు మౌనిసంఘ మి
ద్ద్యచరితు లేచికొల్వఁగ నయమ్ముగ వారల కాగమాంతవా
గ్విరచిరకథామృతమ్మున నకుంఠితమోక్షపదమ్ము చూపుచున్. ౨౧

వ. అటు లమ్మునీంద్రుం డు తదాశ్రమమ్మున సర్వోపనిషదుద్ఘుష్యమాణ బ్రహ్మా
నందపరాయణమానసుం డగుచుఁ గాలంబుగడపుచున్నంత నొక్కనాఁడు
కలహాశనుండు,

శా. కైలాసమ్మున కేగి యచ్చట నుమాకాంతామణిం గాంచి "యో
హైమాలేయాచలకన్యకామణి! కృపాపారీణుఁడై నీమగం
డాలేఖాపగ నుత్తమాంగమున నిన్నర్ధాంగమం దుంచినాఁ
డౌలే" యంచు సపత్ను లిద్దరకుఁ బోరాటంబుఁ గల్పించుడున్. ౨౩

క. కలహాశనమునిఁ గని యక్కులపర్వతరాజపుత్రి కోపన యగుచున్
"దలమీఁదనుండు సవతిని నిల దింపునుపాయ మొకటి యెఱిఁగింపు" మనన్.

వ. అతండును నల్లయని "జయావిజయలను నీనెచ్చెలుల రప్పింపుము, వారు కృత్రి
మగోరూపధారిణు లగుచు గౌతమాశ్రమమ్మునకుం బోయి తత్రత్యనీవార
సస్యభక్షణం బొనర్చినంత భవదభీష్టంబు చేకుఱు" ననుడుఁ బార్వతి చెలులం
బిలిపించి కలతెఱం గెఱింగించిన. ౨౪

సీ. కప్పువోయినయింటఁ గల వాసములేవ బక్క ప్రేవులతోడి ప్రక్కలమర
నీ రెండిపోయి వన్నియ దక్కు పెన్నాయి పోలఁగాఁ దగు వాలమూల మొలయఁ
జిరకాలభుక్తమై చివికినపాలికట్ల భాతిగా నిరోమవాల మెసఁగఁ
బ్రాగందపట్టెలపై నయశ్శంకులబోగడలునా ఖురములు చెలంగ

తే.గీ. గడియ కొకనూఱుసారులు కదలి జాఱు
గోమయస్రుతి యొడలిపై దోమపిండు
ముసరఁ జేయఁగఁ బెంపేదు ముసలియాల
యాకృతి వహించి రంత జయావిజయలు. ౨౫

వ. ఇట్లు భీభత్సమ్ములగు గోరూపమ్ములతోడఁ గౌతమాశ్రమమ్మునకుంజని తదుపత్యమ్మగు
నీవారసస్యమ్మునంబడి చెల్లాచెదరు గావించిన గౌతముండును,

క. హుమ్మని కసరుచు దర్భాగ్రమ్మున నడలింప నదియు కతముగ నొకయా
"వమ్మా" యని యార్చుచుఁ బడమిమ్మ్రొగ్గి గని పడియె మునికమితభయమొదవన్

వ. రెండవయావును బలాయమానయగుచు నిటకుఁ బంచయోజనదూరస్థమ్మగు నేలే
శ్వరమ్మును నేలామున్యాశ్రమమ్మునం బడి మడియుటయు. ౯౯

తే.గీ. నెట్టపంటగ నాశ్రమనికటమునకు
వచ్చిచచ్చిన మొదవును బెచ్చుపెరుఁగు
దుఃఖభరమునఁ గాంచి తుందుడుకుఁ జెంది
నివ్వెఱఁగుపడె నేలామునిప్రవరుఁడు. ౧౦౦

వ. పదంపడియొకశిష్యునిఁబిలిచి "యియ్యదియెందుండియిందేతెంచెనో, యేమికతమ్మున
నిట మృతిఁగనెనో సవిస్తరమ్ముగఁ దెలిసికొ" మ్మని పంచిన వాఁడును గౌతమా
శ్రమంబుదరికిం బోయి యట మృతగోవిషయంబగువిచారమ్మున గ్రుగ్గుఋషితండ
ముం గాంచి కలతెఱఁగెఱిఁగి సమస్తమ్మును దనగురువునకు విన్నవించె. ౧౦౧

క. "ఋషులును గోహత్యాకిల్బిషయుతు గౌతమమునిని వెలింబెట్టుచు నా
వృషహాయశిరస్థనకూలంకషనిలకుం డ" మ్మనిరి యఘు మెడలుపొంటెన్. ౧౦౨

వ. అనవుడు గౌతముండును నేలామున్యంతేవాసికతమున ద్వితీయగవీమరణమ్మును
వినుటంజేసి "తద్గోహత్యాజనితంబగు కలుషం బెవ్వరిది" యని యడుగుడు ఋషు
లిట్లనిరి.

క. "ఎవని వనాంతమ్మున రెండవయావును జచ్చియుండె నతఁడ తదేనో
ర్ణవపతితుఁడు గాఁగలఁ" డనుచు వినిచెఁ దదుదంత మతఁడు సొంపుగవినియెన్

వ. విని "తదఘనిష్కృత్యుపాయం బానతిం" డనుచు నేలామునియు గౌతముం బోలె
ఋషుల నడిగిన వారును నతనికిం బలె నొడివి రిట్లిరువురను గోహత్యాసమా
క్రాంతులగుచు బ్రహ్మాద్రికడకు గౌతముండును వింధ్యగిరికడ నేలామునియు
నరిగి యచట ఘోరమ్ములగు తపమ్ములొనర్చుచుండి రంత, ౧౦౫

క. దేవేంద్రుండు తన్ముని తపోవిభవమ్ములకు దిగులువొంది తనంతన్
భావజుఁ బిలిపించి మనోభావము తెలియంగ వినిచెఁ బదపడి యతఁడున్. ౧౦౬

వ. "ఇంతమాత్రమ్మున కింతచింతయేల" యని యచ్చరలయందుఁ బ్రోడలగు
౧౦౭

ఉ. అచ్చరలార! మీ రతిరయమ్మున బ్రహ్మనగమ్మునందు మై
మచ్చికయైన లేక నియమమ్మున వర్తిలు గౌతముఁ జగం
బచ్చెరువంద వింధ్యనగమందుఁ దపం బొనరించు తాపసిన్
బొచ్చెము కొల్పి యిర్వురను మోసమొనర్పఁ దలంచుఁ బంచినన్. ౯౮

శా. కొంగుల్ జాఱఁగఁ గట్టి యాచిగురుపట్టాకుంబోండ్లు నెమ్మను లు
ప్పొంగన్ భూషణభూషితాంగులగుచున్ భూషామణీపాళి ప్రే
యంగన్ జన్నులు పైటలో నొదిఁగి పైపంచెత్తి దోబూచులా
డంగన్ దగ్గఱి రమ్మునీంద్రులను గాఢప్రేమలో ముంపఁగన్. ౯౯

వ. అం దూర్వశి గౌతమముని యెదుట హావభావోచితమ్ములగు నృత్యమ్ములు సల్పియుఁ గర్ణపేయమ్ములగు గీతమ్ములు పాడియుఁ మరులుగొల్ప నవశయగుచు మరల నమరావతి కరుగుదెంచి తదీయగాఢతపోనిష్ఠాగరిష్ఠత్వంబు దేవేంద్రునకు విన్నవించెఁ; దిలోత్తమయుఁ నేలామునిపాలికిం బోయి, ౧౦౦

ఉ. మ్రాఁకులు మోసులెత్త సెలపాలు చెమర్పఁ బటీరకోటరా
నీకనివాసమైతగు ఫణిప్రకరంబు కరంబు వేడ్కమై
నూకొనఁ గోకిలల్ ప్రతిరవోదయముం బొనరింపఁ బాడె న
వ్యాకులలీలఁ గట్టెదుట నమ్ముని యచ్చెరువంది చూడఁగన్. ౧౦౧

సీ. ఘర్మాంబుబిందుప్రకాండంబు మేనెల్ల ముత్యాలచేరుల సరువు నెఱపఁ
గాళ్ళఁ గజ్జెల మ్రోఁత గళ్ళుగళ్ళని పజ్జఁ గల యంచలకుఁ బ్రోదిగఱపుచుండఁ
జలితాంగుళీదళీకలితాభినయము వాక్యపరంపరకుఁ డీక గాఁ జెలంగఁ
గలితకంకణఝుణత్కారంబు వనదేవతల వీనులకు నమృతంబు వోయఁ

తే. గీ. గులుకు క్రేఁగంటిచూపుల నలుక కొంత
సేపు సింగారమొక కొంతసేపు కొంత
సేపు కరుణము మఱికొంతసేపు హాస్య
మొలుక నాట్యంబు సల్పె నప్పలుగుసాని. ౧౦౨

తే. గీ. హరిహరబ్రహ్మ లెవని దాసానుదాసు
లెవని యావేశ మెట్టిజితేంద్రియులకుఁ
గనులు పారఁగప్పఁజేయు నక్కమలశరుఁ డ
బతిఁగఁ బోనీక కలఁచె నేలామునీంద్రు. ౧౦౩

వ. ఇట్లు కుసుమశరశరవిదళితమానసుండగుచు నమ్మునీంద్రుండు తేఱిచూచి యారామ రామణీయకమ్మున కచ్చెరువంది తపమ్ము సాలించి మనమ్మున నిట్లు వితర్కించె. ౧౦౪

శా. ఔరా! యీచెలి దేవతాతరుణియో, నాగాంగనారత్నమో,
నాకస్త్రీమణియో, పతీరనగరీచార్వంగియో, కిన్నరాం
భోజక్షేత్రయొ, కానవాంగనయొ! సమ్మోహమ్ము మై నన్నుఁగ
న్నారామమ్మున కేగుదెంచెను మదీయమ్మైన పుణ్యమ్మునన్. ౧౦౫

సీ. వికసదిందీవరప్రకరమ్మునకును నోనామాలు చెప్పు నీనాతికనులు
చక్రవాకకులత్రిచక్రమ్మునకును మంత్ర ముపదేశించు నీతరుణిచనులు
పదియాఱునన్నె పసాంబుట్టుబొమ్మకు నైన వెలఁ గట్టునీయిందివెలఁదియొడలు
మదదంతిగమనసామంజస్యమునకైన లెక్కరానీయ దీలేమనడలు

తే. గీ. కోటిచంద్రుల నొకసారి గూన సమర్థ
మైన దీ రామ ముఖకాంతి యతులకేని
మాన్య మీ భామ కంకణామందరవము
శృంగముల బారు మీఱు నీ యింతి యారు. ౧౦౬

ఆ. వె. అంచు లేచి డగ్గ నత్తిలోత్తమను హత్తి
కౌఁగిలించుకొనియె వేగ మునియుఁ
గనుల కింపుగల్గు కాంతఁ గన్గొనినంత
మారుబారిఁ బడనివారు గలరె! ౧౦౭

సీ. ఘనచేలనమ్ముకట్టున శోభిలుభాతిఁ గోమరియు సింహాద్రిగుహాలయందుఁ
గమనీయశోభికలితపద్మరేఖమండమండితసరస్తటులయందు
వికసత్కుసుమపుంజవిలసితశోభాయమానకుసుమితలతానికుంజములయందు
హిమశీకరపరిక్రమమపుట్టి మానినీజాతశీతచ్ఛాయాసీమలందు

తే. గీ. గిరినదీసైకతమ్ముల కేలఁకులందుఁ
జంద్రశాలాయమానరసాధరోన్న
తశిఖరతలములందు నతఁడు సుఖించె
నత్తిలోత్తమతో హత్తి యనుదినంబు. ౧౦౮

వ. అనిన గౌతముం "డింతకుమున్న యడిగితేని ఋషులకట్లు నీకునునొసంగువాఁడ సాగరాధీనమొనరించితిఁ గాన నిఁక నింద్రొకటిందువేని నాకీరా" డనిన నేలా మునియుఁ గోపించి యిట్లనియె.

తే.గీ. పుడమినెల్లడ పూజ్యులై యొడయులైన
కాలమునయందు నీనది కట్టఁబడును
తావకీనాశ్రమంబు చెంతను నటంచు
శాపమునొసంగి తనయంతఁజనియె నతఁడు.

వ. ఇట్లు చని గోదావరికన్న మిన్నయగు నొకతటినిం దెచ్చునిచ్చ మరల వింధ్యాద్రి గహ్వరమ్మున ఘోరమ్మగు తపమ్మున నన్నాఁ డతం డచిరంబున భవదభీప్సితంబు చేకూర్పఁ దదర్థంబ యీశ్వరగమనం బని చెప్పి వృద్ధయతీంద్రుండు యథేచ్ఛం జనుటయుఁ గిమ్మీరుండును దన్నదీప్రవాహ మ్ముక్షీణమనస్కుండగుచుఁ గిమ్మీరపురమ్మున నుండె; నట నీశ్వరుఁడును నచ్చోటు కపలి యేలామునికి సాక్షాత్కరించి యిట్లనియె.

క. ఎందులకై నీవు తపం బుం దగుగతిఁ జేయుచుంటివో యెఱుఁగుదు దీ
నం దీఱు నీదుపాతకముం దరలు నదిన్ గ్రహించిముదమునఁ జనుమా. ౧౨౧

వ. అని చెప్పి జటాకుటీరమునుండి యొకవారిధార ననుగ్రహించి మఱియు నిట్లనియె

తే.గీ. ఎచట వెన్కకుఁజూచిన నచట నాఁగుఁ
గాన వెనుకకుఁ దిరుగక కదలు మినుఁడు
పొడుపుగిరిమీఁదఁ బొడుపకమును పై వేగ
వారినిధిలోనఁ గల్పు మవారణముగ. ౧౨౩

వ. మఱియు నిట నుండి భవదీయాశ్రమంబగు నేలేశ్వరమునకుఁ జని యట నేతదీయ వార్ఘ్యమ్మున నేలేశ్వరు నభిషిక్తుం జేసి యట నుండి కిమ్మీరసీమఁ జొచ్చి పీఠీపురమ్ము చెంతనుండి సముద్రమ్మునకుం గొని పొమ్ము పొమ్మని యానతిచ్చి యంతర్ధానంబు చెందిన నమ్మునియు హరోపదిష్టంబగు మార్గమ్మునఁ గదలి చనుచున్నంత.

క. మును కిమ్మీరాసురునకుఁ దనయిచ్చినవరము పెంపు దలఁచి హరుఁడు చ
య్యనఁ గోడియగుచు నది కూసినగతిఁ బీఠీపురమ్ము చెంతం గూసెన్. ౧౨౪

క. ఏలాముని యారావం బాలించి నిశావసాన మాయె నటంచున్
గాలోచితకృత్యమ్ముల కాలోనన వెనుకఁ జూచె నాశ్చర్యమునన్. ౧౨౬

క. ముని నిలిచిన నయ్యేలా ధ్వనియునునట నిలిచిపోయెఁ దోయధికిం దో
డ్కొని పోయి సంగమింపం జననైతి నటంచు మునియు సంశయపడఁగన్. ౧౨౭

వ. ఇట్లాపగాఘురంబు నిలిచిపోయిన మునియు నిశ్చేష్టితుండగుచుఁ బ్రభాతసూచక
మ్ములగు నిమిత్తమ్ములు మఱెవ్వియుం గానక యిదియెవ్వరిదియో యొకకపటో
పాయంబని తలంచుచు గయపాదాధారంబగు కాసారంబు తీరంబున నటునిటు
తిరుగు చరణాయుధమ్ము గాంచి మెల్లన నిట్లనియె. ౧౨౮

మ. చిరకాలంబు తపమ్ముసల్పి తుద కా శీతాంశుజూటాలు మే
ల్వరమున్ గాంచి ముముక్షుమై నఘహరైలానామకేతన్నదీ
తరుణిన్ వారిధి గూర్ప నేగుతఱి నంతర్విఘ్నముం జేసి పెం
పఱ నాకుం బరమాపకారమొనరింపం బాడియే నీకొగిన్. ౧౨౯

వ. హరుఁ డీధునీలలామంబును నావెంటం బనుచుతఱి వెనుకకుం జూడకు మనియుఁ
బ్రభాతమ్మునకు మున్న సముద్రముం బ్రాపించునదియనియుఁ నానతిచ్చిన నేనును
నతిత్వరితగమనమ్మునఁ జనునెడ భవదీయారావం బాలించి ప్రభాతాశంకి
నగుచు వెనుకకుం జూచినకతన నీనది యిట నిలిచిపోయె. ౧౩౦

క. కొక్కొరకోకో యని నీ విక్కరణి నకాలమంద యిటు గూసి ననున్
ధిక్కారి మొనర్చితి నీ నిక్కపుఁగత సెప్పవేని నిను శపియింతున్. ౧౩౧

క. పారావారములోనన్ జేరనినది ద్విజవరసముచితశుభకర్మ
ప్రారంభమునకుఁ దగ దని నీరసముగ నెంతు రెంతనీరు గలిగినన్. ౧౩౨

క. నిటలాక్షున కుల్లాసము ఘటియించి కళింగదేశగతికై నది నా
క్కటి వెలయించిన దానిం ద్రుటికాలములోనఁ గూల్పఁ దొడఁగితి వకటా. ౧౩౩

వ. అనుచు నిరంతరచింతాక్రాంతుఁడగుచు వందురు నమ్మునీంద్రునకు నిజస్వరూప
మ్మున సాక్షాత్కరించి పురారి యిట్లనియె.

క. మున్నొక దోషాచరపతి నన్నుగుఱిచి తపము చేసినన్ దానికి "నీ
వెన్నికొనువర మొసంగెద నన్నా" యనె నాతఁడిట్టులడిగె వరమ్మున్. ౧౩౪

క. ఏరాక్షసుండ వా కిమ్మీరపురీమండలంబు మేల్ మేలుగ ము
క్కారుం బండఁగఁ జేయఁగ నేఁ బోక్రుం డనుగ్రహింపవే పురవైరీ. ౧౩౬

సీ. కడఁగి మద్దేశంబు కృష్ణుగాఁ జేయు నిమ్నగగాని గ్రంథలంబు
మొండు పాఱఁగఁ జేసి నిండార మున్కాఁడఁ బండఁజేయుము ధరామండలమ్ము
సాగరసంగమ మాఁగఁగాఁ దాన లంతోపిక ముపోటు దవుల క్షేత్ర
వారాములు వృద్ధిఁబొందఁగా నగఁ బనపాగములు రసాలాగములును

తే. గీ. నారికేళక్రముకములు నాగవల్లి
కలును మొదలగు మంచి నగములు లతలు
మిగులఁ జెలువారు కతమున జగతి నెగడి
మీఱఁగాఁ జేయ నయ్య కిమ్మీర సీమ. ౧౩౭

చ. అనుచు వరమ్ముఁ గోరుకొనునంతట నేను సుప్రీయుండు నా
నిని బరితృప్తుఁ జేసి యొకనిమ్నగ నై పేరు నాచరించు నీ
కును వర మిచ్చి రాక్షసుఁడు గొన్న ఫలంబు ఫలింపఁ జేయ నీ
ధునికి సముద్రసంగమము మాటిము చేసితిఁ గుక్కుటంబనై. ౧౩౮

వ. కావునఁ గొండొకవిచారంబు దక్కి మహాజ్ఞం జేసి. ౧౩౯

క. ఈకల్లోలినిఁ బాదగయాకాసారమునఁ గలుపు మచ్చట నే నీ
యాకారముతోనుండు నిరాకులగతిఁ గుక్కుటేశ్వరాంకం బొప్పన్. ౧౪౦

తే. గీ. గౌతమీసాగరమ్ములు కలియుచోట
నభిషవమ్ము లొనర్చినయంత ఫలము
దీన స్నానంబుచేసిన మానవులకుఁ
గల దటంచు వరం బిత్తుఁ గరుణ నీకు. ౧౪౧

క. ఏనరుఁడైనను నిత్యం బీనదియం దేని లేక యీ మడుగునయం
దేనియుఁ గృతాభిషేకుం డైనంత మదీయపదవి యాతని కొసఁగుదున్. ౧౪౨

వ. అదియునుంగాక కొండొకకాలమ్మునకు గౌతమ్యాపనది యగు శబరినుండి వెడలి యొక శాఖ దీనం గలియు దానంజేసియు నియ్యది భుక్తిముక్తిప్రదాయిని యనంబరఁగునని వర మొసంగు ననంగ నంజనుంగాంచి యేలాముడియు నాలీలా కల్పితంబగు కుక్కుటాకారం బప్పాదగయాకాసారతీరమ్మునం బ్రతిష్ఠించి యాశ్రమమ్మునకుం జని సుఖంబుండె నని విరించి నారదునకుఁ జెప్పిన తెఱంగున సూతుండు శౌనకాదులకుఁ జెప్పుటయు.

## ఆశ్వాసాంతపద్యములు.

క. నిరుపమసాహిత్యరసాభరణ ! వితరణప్రవీణ ! పండితకవిరా
డ్వారణాలయచంద్రోదయ ! చరణోద్భవ వంశరత్న ! సఫలితయత్నా. ౧౪౪

చ. వరతరుణీసహోదర ! విభావిభాసిసహోదరాదరా
దరహిమభూధరైణధరతారకతారకభూధరోదర
స్ఫురదురుకీర్తిహార ! పరిపూర్ణతరప్రతిభావిహార ! భూ
సురచరణాబ్జరేణుపరిభూషితహర్మ్యనివాసభాసురా ! ౧౪౫

మాలిని. నయవినయవిహారా ! నాగమాంబాకుమారా !
స్మయనిరతవిమారా ! సాధుసత్యప్రచారా !
నియతసుకృతకృత్యా ! నిత్యసంహృష్టభృత్యా !
ప్రియవిలసితసత్యా ! ప్రీణితార్థిప్రణుత్యా !

గద్య.

ఇది శ్రీ * * * తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
నేలామహాత్మ్యమ్మునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీ మత్సర దేవతాయైనమః

# ఏలా మాహాత్మ్యము

## ద్వితీయాశ్వాసము

క. ధరణీసురపాదాంబుజపరిచర్యానిరత ! పాదభవవర్ణాగ్రే
సర ! సాహిత్యవిశారద ! సరసకవివిధేయ! తోటసర్వారాయా ! ౧

వ. అవధరింపు మనంతరంబు శౌనకాదులు సూతుంగాంచి యిట్లనిరి.

క. ఈయేలానదియొడ్డున నేయేతీర్థములు గలవో యెఱిఁగింపుము మా
కాయాతీర్థమ్ములు మఱి యాయాతీర్థముల ముక్తి నందినవారిన్. ౩

వ. నావుడు సూతుండు బ్రహ్మ నారదునకుం జెప్పినతెఱం గిట్లు సెప్పందొడంగె ౪

సీ. సోమయాగము మొదల్ గా మన్ననలుగన్న జన్నమ్ము లొనరించుచున్నవారు
అతిథు లభ్యాగతు లరుదెంచురే వారికన్నదానము చేయుచున్నవారు
అనృతంబు లేక విద్యల గోష్ఠిచే సర్వకాలంబు సుఖలీలఁ గన్నవారు
కొడుకులు మనుమలు కూఁతులు మొదలుగ బహువృద్ధిగను కుటుంబములవారు

తే.గీ. ఆయువు శతాధికమ్ముగ నలరువారు
భూసురోత్తము లెపుడుఁ గాఁపురము సేయఁ
దనరు నేలానదీయామ్యతటనిఖాత
యూపభాసురమగు శాల్మలీపురంబు. ౫

వ. అప్పురమ్మున. ౬

తే.గీ. సోమయాజి యొకండుండు సుదతితోడ
నతని నామంబు గణపతి యండ్రు భార్య
పేరు నరసాంబ యందు రాపెయును నాయ
నయును సంసక్తు లన్నదానమ్మునందు. ౭

సీ. ఉదయమ్మునన లేచి యుదధిజాతకళత్రు నొండె నిటలవీతిహోత్రు నొండె
ధ్యానించి యేలానదీనిర్మలాంబుప్రవాహంబులోఁ గ్రుంకి వార్చి ప్రాత

హోపాసనమున యథాగమోక్తమ్ముగ నగ్నులఁ బూజించి యంబికామ
హోమనూపాసనమ్మాచరించుచు ధర్మపత్ని పాకమొనర్ప వైశ్వదేవ

తే.గీ. మాచరించియు గృహదేవతార్చనంబు
చేసికొని బలియిడి గృహాజిరమునందు
శ్రీఁ నిదిరించు నతిథుల లేపి వారి
తోడఁ గుడుచు మృష్టాన్న మాదరముండు.

వ. ఇట్లు భుజించి వారికిఁ దాంబూలం బొసంగి దక్షిణ వెట్టి తీర్థయాత్రామాహాత్మ్యక
థనాదికమ్ము లగుసల్లాపంబులఁ గొండొక సేపు గడపి వారును భోజనాయాసజని
తనిద్రాపరవశాత్ము లగుడుఁ దానును గొండొక విశ్రమించి యంత నంతేవాసిజన
ము లేతేర నాసాయంబు సకలశాస్త్రార్థ ప్రసంగమ్ము లొనర్చుచు సంధ్యాకృత్య
మ్ములు దీర్చికొని యగ్నికార్యంబు నిర్వర్తించి సూర్యోఘులం గలసి భుజించుచు
ననుదినం బిట్లు యుక్తక్రియమ్మునఁ గాలము గడపుచున్నంత నొక్కనాఁడు.

ఉ. అయ్యవనీసురోత్తమునియంగన భర్తకు వేడ్కమీఱఁ దా
నొయ్యన శయ్యపైఁ బదములొత్తుచు మెత్తనియొల్గుతోడ సా
హాయ్య మొనర్చు కంకణఝణారవ మైక్యముఁజెంద నిట్లనెన్
దియ్యఁదనం బప్రతిగతి దెల్పెడు పంతము వింతగొల్పఁగన్ ౧౦

క. "సంతానము లేదెను బలువంతన్ జిత్తంబు మిగుల వందును దేవా!
యెంతటిసంపద గల్గిన నింతికి సంతానవాంఛ యెక్కుడు గాదే. ౧౧

సీ. సురభితైలము దెచ్చి శిర సంటి యొడ లెల్లరాసి సున్నియు హరిద్రయును జేర్చి
నట్టిమైపూఁతచే నలఁది నల్గిడి మంచినులివెచ్చనీరోసి జలక మార్చి
తనరుపయ్యంటచేఁ దడి యార్చి చెవిలోనఁ దిరివెట్టి మేల్మికస్తురితిలకము
జాఱుగా నుదుట సింగారించి కన్నులనిండఁ గాటుక వెట్టి నెఱులు దువ్వి

తే.గీ. సరిగఁ జేయుచుఁ గడుపార స్తన్యమిచ్చి
తూఁగుటుయ్యెలనుంచి సంతోష మెసఁగ
నిసువులను నల్ల నూఁచుచు నిద్రవుచ్చు
నువిద లేనోము మును నోఁచిరో మహాత్మ.

సీ. తొలిబామునందు నోములునోఁచనిసతికిఁ గలుగునే తెనయుమొగమ్ము గనుట
ధూళిచేఁ బొరయుపుత్రుని మేను దుడుచుట సుకృతంబుచేయని సుదతి కసనె

[4]

యుద్వాహపీక్షపై నొలయు పుత్రునిం జూడ వఱలునే దురదృష్టవతికి నెందుఁ
గోడండ్రతోఁ గూడి కొడుకు సుఖించు సౌభాగ్యంబు గను నె నిర్భాగ్యురాలు

తే.గీ. కొడుకులను గూఁతులను దనకొడుకు గనిన
వారిఁ దొడమీఁద నిడికొని వార్ధకంబు
నడపనేర్చునె కోటిజన్మములనుండి
యైనఁ బున్నె మార్జింపని యంబుజాక్షి." ౧౩

క. అనుచుం దన సాధ్వీమణి కనుఁగొనలం జాఱు నీరు కాలువయై చ
న్నొనలం బడఁ జింతించినఁ గనుఁగొని యాసోమపీథి కలఁగినమదితోన్. ౧౪

క. "జన్మము లెన్ని యొనర్చిన సన్నుతగతి వ్రతము లెన్ని సల్పినఁ గానీ
పున్నామనరక మేదఁగఁ జన్నే యోసాధ్వి! యకృతసంతానునకున్. ౧౫

ఉ. మానిని! యేలయేడ్చెదు కుమారుని నొక్కని నేని గాంచఁగా
లేని గృహస్థులందఱు మలీమసులై తొలిబాములందు నే
దేనియుఁ జేయలేదనుట తెల్లము నీబలుసంతకంబె నా
లో నిరపత్యతావిధికి లొచ్చినశోకభరంబు కగ్గెనే. ౧౬

సీ. ధనము లేకున్న విన్ననువుగా సంపాదనము చేసి మిగుల నానందమొసఁగు
వయసంత కంత పోవఁగ మూఁడుకాళ్ళ ముసలులైనతతిఁ బరిచర్య సేయు
కను మొఱంగినఁ బ్రేతకార్యమ్ము నెఱవేర్చి పలుగు పైశాచరూపమ్ముఁ బాపు
గయకేగి పుణ్యలోకమ్ము రా విష్ణుపాదంబుపైఁ బిండదానంబు సల్పు

తే. గీ. సుతులు లేకున్నఁ బరలోకగతులు సున్న
యనుచు ఘోషించు ధర్మమ్ము లనుపదంబు
కొడుకులకుఁ గాని సెబ్రసెంచడపుఁజేత
నేసిన యధన్యులకుఁ బుత్రసిద్ధికలదె. ౧౭

సీ. దశరథుం డను రాజు తనయులకై పుత్రకామేష్టి యను నొక క్రతువు చేసె
సత్యసంధుఁడు హరిశ్చంద్రుండు సుతునకై వరుణుని గుఱించి తపంబొనర్చెఁ
బరశక్తి నెదలోనఁ బాటించి వ్యాసుండు సంతుకోసము పురశ్చరణసలిపె
సంతానవాంఛ హెచ్చఁగ మృకండుఁడు మున్ను పశుపతిగుఱించి జపమ్మొనర్చెఁ

తే. గీ. గాన నెంతటివారలకేనిఁ బూర్వ
జన్మకృతపాపపరిపాకజాతనిస్త

నయత పాయునె నీరజనయన ! యింత
వంత నీవంటిదానికి వింతగాదె. ౧౮

క. కావున మనమును దపమున్ గావింతము మనకి ధైర్యగతినిచ్చును ప్రా
గావేశితకర్మక్షతి గావ్రటనై కుముదినీసఖకులకీర్తిపాలా". ౧౯

మ. అని యోదార్చుచు ప్రేమగోష్ఠికి డాయంజేర్చి యా గోమయా
జనికిన్ దోర్లటీగాఢతం దెలుపుచున్ జేలంబు చేబూని క
న్గొనలం గాఱెడు నీరమున్ దుడుచుచున్ శోకంబు వారించెఁ; గా
మిని కేశోకము వోవు భర్త తనునెమ్మిన్ జూచి లాలించినన్ ? ౨౦

క. ఈగతి మృదుసల్లాపవచోగాథల గారవించుచో రాత్రియుఁ దా
నేగె నలయవ్వరియుఁ గల్యాగమము వెలింగె యభిషవాప్లుతమతియై. ౨౧

వ. కాలకృత్యములు దీర్చికొని సాంతేవాసిజనుం డగుచుఁ గదలి. ౨౨

సీ. మలయమారుతపోతచలితశాఖాజాతపతితప్రసవజాలభాసురంబు
చిక్రోడదంతప్రచితనారికేళీక్షతక్షరదిక్షురసోక్షితంబు
శుకముఖక్షతరసచ్యుతరసాలాలోలవలయితగోపాలకలకలంబు
ఫలితపనసభూజపాదజాతఫలప్రసారసౌరభయుగ్దిశాతటంబు

తే.గీ. హలసమాకృష్టతరరసాతలనిపతిత
వికసితప్రసవచ్ఛదప్రకటపుటని
పతదమితహిమజలపృషద్వితతదళిస
మేతరంభానగవన మేలాతటంబు. ౨౩

వ. చేరి తీర్థముఖంబు సొచ్చి కృతాచమనుండై శిఖాబంధంబు బంధించి గ్రుంకులిడి
యఘమర్షణ ఋక్కుల జపించుచుఁ దటమ్ము చేరి పితృప్రీతిగ వాసోదకశిరోజోద
కతర్పణంబులు గావించి శరీరసమ్మార్జనంబు నిర్వర్తించి ౨౪

క. క్రముకప్రసవదళీగత విమలతరాంశుకము దేసి విధివిహితవిధా
నముగ ధరియించి తగుకృత్యములం దీర్చికొని వేగ్గృహమ్మున కరిగెన్. ౨౫

వ. అరిగి జాతవేదారాధనం బొనర్చికొనుచున్నంతః ౨౬

సీ. కాషాయపరిధానకలితకటీభాగ మర్కబింబస్ఫూర్తి నపహసించుఁ
జాలు నరుణశిరోజజటాభరమ్మును గొప్పినబద్ధదండోపరిస్థ
పుటితహస్తం బలాబూశలాటుకకమండలుగతేతరహస్త మళికపట్టి
కాసంగ తైలాపగామృత్తిలకము సర్వాంగీణమగుభూతి యంఘ్రియుగళి

తే. గీ. మంచిపావాలు దయకసమానమైన
నయనయుగళంబు దర్భాసనప్రశస్య
మానకక్షాంతరాలంబమానభస్త్ర
గలుగు జడదారి యొకఁ డింటికడకు వచ్చె. ౨౭

ఉ. వచ్చిన మస్కరీంద్రుఁ డను వార్తను శిష్యులెఱుంగఁ జేయ లో
హెచ్చిన మెప్పుతోడ నెదురేగి తటాలున సోమయాజియుం
దచ్చరణమ్ములం బడి ప్రణామ మొనర్చుచు మద్గృహమ్మునన్
బిచ్చ యనుగ్రహింపఁ గదవే యని వేఁడెను సోమిదమ్మతోన్. ౨౮

వ. ఇట్లు వేఁడి యత్యుచితంబగు సత్కారంబు నెఱవేర్చి కుశాసనోపవిష్టుం జేసి మీ యాడని తీర్థమ్ములును మీ రెఱుంగని నదులును మీ చూడని ప్రదేశమ్ములును లేవు గా యనుచు మృదుమధురసవినయసరససల్లాపమ్ములఁ గాలమ్ము గడపుచున్నంత, ౨౯

సీ. సోమిదమ్మయు వేగ సామి మాయింటి కేతెంచినా రనుచు నెంతే ముదంబు
తో రాత్రినాఁటి పుత్త్రులు లేనిదుఃఖమ్ము మఱచి యేటికిఁ జని మడుపు లుతికి
పస పైదువులకెల్లఁ బంచి తా మొగమునిండఁగఁ బూసికొనుచు స్నానంబుచేసి
టెంకికిఁ జనుదెంచి టెంకాయడొక్కల నంటించి యొక్క క్షణార్ధమునకుఁ

తే.గీ. బాయసాన్నంబు మాషంపువటకములును
మున్నుగాఁ గలిగినభక్ష్యములును నాల్గు
కూరలును నాల్గుపచ్చడుల్ చారు శాలి
కౌదనము సూపమును వేగఁ బ్రోదిఁజేసె. ౩౦

వ. ఇట్లు గావించి పాకసమాప్తిం దెలిపిన నతండును నమ్మస్కరీంద్రునకు నైకవిధోపచారమ్ముల నత్యాచారానుగుణమ్ముగ భోజనమ్ము వెట్టి పిదప భుజించి పాదసంవాహనాదికమ్ములం దానును గులసతియు నతని శుశ్రూషింపఁగావించుచుఁ దదీయముఖోదితపుణ్యకథామృతప్రవాహమ్మున నోలలాడుచు మెల్లమెల్లన నయ్యతి తల్లజున కిట్లనియె. ౩౧

క. "జన్మము లెన్నేఁ జేసితి నెన్నికగల వ్రతము లెన్ని యే నొనరించితిఁ
బున్నామనరకనీరధికి న్నావ లభింపదయ్యె గృహేసగునాఢ్యన్. ౩౩

వ. కావునఁ దదర్థమ్ముగ నేతీర్థమ్ములు సేవింతునో యేనదులఁ గ్రుంకుదునో యేదేవు నారాధింతునో తగినయోజ యోజించి నన్నుం గృతార్థుఁ జేయవే"యనుసోమపీథి కయ్యతి యిట్లనియె.

క. ఏలానది కెన యగు నొక కూలంకష గలదె! కోటికోనుకోట్యాల నీఁ
జాలినది పెరటిలోనె శ్రేష్ఠిలా మందునకు వచ్చు? గృహికులతిలకా. ౩౪

వ. అని పెద్దయుం బ్రొద్దు తత్తటినీమహాత్త్యంబు వాక్రుచ్చి మఱియు నిట్లనియె.

క. ఒకదినమున నొకవేయిగ సికతాలింగములు కోటి చేయించి నదీ
సికతామయదేశమ్ముల సకియును నీవును బ్రతిష్ఠ సల్పుఁడు వానిన్. ౩౫

తే.గీ. కోటిసూర్యప్రకాస్తిఁ జేర్కొనఁగఁదగిన
కొమరుఁ డుదయించునీకిఁకఁ గొన్నియేండ్ల
కిచట స్నానంబు చేసిన నేరికేనిఁ
బుత్రు లుదయింతు రయ్య! యపుత్రికులకు. ౩౬

వ. పదంపడి యీశాల్మలీపురంబు కోటిలింగక్షేత్రం బనఁబరఁగు నని చెప్పి తన యిచ్చం బోయిన, నయ్యాల్మగ లిరువురును దదుపదిష్టప్రకారమ్మున ననుదినం బేలా నదికిం జనుచు దినమ్మున నొకసహస్రమ్ము వంతునఁ గ్రమమ్ముగఁ గోటిలింగమ్ములను బ్రతిష్ఠించునంత. ౩౭

క. శతలక్షపరిమితిగ సైకతశివలింగప్రతిష్ఠ గావించిన య
క్కృతమునఁ దనూజవాంఛాన్వితయగు నా సోమిదమ్మ వేఁకటిఁ దాల్చెన్.

క. నలుపెక్కెఁ గుచాగ్రమ్ములు బలుపెక్కెన్ మధ్యసీమ పాల్పడె నంగ
మ్ముల వైవర్ణ్యము గర్భము బలిసె న్నానాఁట నెలలు పదియు న్నిండెన్. ౪౦

వ. పదంపడి యొక్క శుభముహూర్తమ్మున సోమపీథిని యొక్క కొమారునిఁ గనియె నన విని ఋషు లిట్లనిరి.

క. అర్థియు విద్వాంసుండు సమర్థుండును బుత్రవంతుఁ డపలితమూర్థుం
డర్థిన్ జన్మము సేఁతకు నిర్ధారితుఁ డండ్రు భువి మునిప్రకరమ్ముల్. ౪౧

క. ఈసోమయాజి పుత్రుల కోసము శివలింగములను గోటి ప్రతిష్ఠం
జేసె నని చెప్పితివి మా కాసంశయ మేడఁ జేయ నయ్యా ! సూతా. ౪౩

వ. అనిన సూతుం డిట్లను మహాత్ములారా ! న న్నొక పెద్దఁ జేసి యడిగితిరి గాని య య్యది తమకుం దెలియని యదియే? స్మృతులయందు నొడువంబడిన యగ్న్యాధాతకుం దగిన లక్షణమ్ములందు సమగ్రత్వమ్మును గృష్ణకేశత్వమ్మును బుత్రవత్త్వయు నను నివి శరీరదార్ఢ్యాపాదకమ్ములు గానివేకొండుగాప్రు ధరాసురమాత్రునకు నగ్న్యాధానంబుదౌర్బ్రిస్మ్రాన్యానిష్పత్తికె యావశ్యకంబు గావున నీసోమయాజి యపుత్రకుఁ డయ్యు నాయాక్రతువులొనర్చె; నిటు లేలాసైకతమ్మునఁ గోటిలింగప్రతిష్ఠ గావించి పుత్రసిద్ధి వడసినకతమున నచ్చోటు కోటిలింగక్షేత్రంబనియు నపుత్రగతిక్షేత్రంబనియు నొడువంబడు నని మఱియు నిట్లనియె. ౪౪

సీ. అచటికర్ధక్రోశమగుచోట నమృతపుత్రం బనునొక్క తీర్థంబుగలదు
తదధినాథుం డమృతసుతేశ్వరుం డనుశివుఁ డెల్లవేళ రక్షించు దాని
నమ్మహాదేవున కర్ధాంగియై యట భ్రామరి యనుశక్తి ప్రబలుచుండు
నచట స్నానము చేసి శుచియై మృతసంధ్య యగుసతి యమృతసుతాభిధాను

తే.గీ. నీశ్వరుని మ్రొక్కి భ్రామరి నెదఁ దలంచి
భక్తి గొలిచిన జీవసూత్వము వహించు
నట్లు తత్ఫల మందినయట్టి యొక్క
చెలువ చరితంబు వినిచెదఁ జిత్త మలర. ౪౫

తే.గీ. బ్రహ్మపురమను నొక జనపదము గలదు
బచ్చువాఁడొకఁ డుండు నప్పల్లెయందు
వాని పెండ్లము రూపసి వయసుకత్తె
పాటలాధర పలుగు పెల్లాటకత్తె. ౪౬

ఉ. కాముని యాశుగంబన దుకాణమునం దది గూరుచున్న "సు
తాగ్రమునివీటనైనఁ గనరానిది" యంచు నుతించుచున్ జల
ద్భ్రామకటాక్షపాతముల బ్రచ్చుచుఁ దన్నికటస్థవేదికా
సీమలఁ గాచి యుండుదురు చేరుచుఁ గోరుచుఁ గోడెకాం డ్రొగిన్. ౪౭

చ. మగఁడు సమీపమందుఁ గనుమాయక యుండినవేళ సాధ్విరీ
తిగఁ దలవంచు లాఁతిపయి దృష్టి నిగుడ్పదు మాటలాడ ద

మ్మగఁ డొకకొంత మాటువడ మానిని చంచలలోచనాంతపా
తగతి బొజుంగురాయల యొదల్ వగలన్ వమిఁ జూచు నిచ్చలున్. ౪౮

మ. ఇటులానీతిపిపాసజంత మది నెంతేఁ బిల్లకాలోకనం
పటువై గాటపుటిళ్ల మార్మగల కొంపల్ మాటీయున్ వారి నె
క్కటి నాత్మీయగృహంబు చేర్చియును నక్కామాగమాఖ్యాన మా
దటఁ జేయన్ బ్రియతంచు నత్తనొక వేతాళంబుగాఁ జూచుచున్. ౪౯

శా. పప్పుం బియ్యము నుప్పు మున్నగు ఘనసంభారమ్ములం దెచ్చి పెన్
గుప్పల్ వోయుచు విక్రయించుచును నందున్ వచ్చు లాభంబుతో
నప్పాపాత్మయుఁ దానునుం బ్రదుకు బచ్చాయీ యొడన్ బోవు నాఁ
డప్పాపాత్మిక యింట నుండును విటవ్యాసంగసంసక్తయై. ౫౦

క. తనమగఁడు కష్టపడి తెచ్చిన ద్రవ్యము మాఱుమగలఁ జేర్చుచు వారిన్
దనియించుచు నక్కోమటి వనజానన తిరిగె నిహముఁ బరమున్ వెలిగాన్. ౫౧

తే. గీ. తరుణి యిల్లాల యని లోనఁదలఁచుగాని
తిరుగుఁబోతని యాబచ్చు తెలియఁ డకట
తనదు నోటివాసనయును తనవెలంది
జంకుతనమును దెలియువారలు గలారె ! ౫౨

వ. అంతఁ గొండొకకాలమ్మునకు. ౫౩

మ. ఒకనాఁడమ్మగవాలు మార్మగనితో నుత్సాహమేపారఁ గొం
డికవాఁడంచు సుతుం దలంచి యెద వానిన్ లెక్కగాఁ జూడకే
చకితస్వాంతయుఁ గాక మన్మథరహస్యప్రక్రియం దేలెఁ ; గాం
తకుఁ బూవిల్తుసివమ్ము గ్రమ్ముతఱి నవ్యం బెద్దియుం దోఁచునే. ౫౪

ఉ. పిల్లఁడు చూచుచుండఁ దన పెన్మిటి నేని వెలంది కూడ ది
ట్టల్లరిచేత సేయఁ గనకాంగికి నెమ్మన మెట్టు లొప్పెనో !
తల్లి యొనర్చు నప్పనియుఁ దప్పని యొప్పనియే నెఱుంగ లేఁ
డుల్లమునందుమాత్ర మొకయుమ్మలికం బుదయించె వానికిన్. ౫౫

ఉ. కామముదీర్పఁ యప్పలుగుకామిని కాముకు నంపి తెల్వి రా
నేమియుఁ దోఁచ కీకొమరుఁ డింటన యుండఁగ సిగ్గు మాలితిన్

జీమ చిటుక్కుమన్నఁ బెఱచెల్వ్వనికూటమి మాట దక్క ద
క్కోమటితోడ నిచ్చిఱుతకూళ వచించునొ యేమొ యం చొగిన్. ౫౬

తే. గీ. మనము భయసాగరాంతర్నిమగ్నమగుచు
నతని నొక్క కరాసిక నటితిఁగోసి
ప్రాతివేశినియింటికిఁ బజ్జనొక్క
దరము గావించి యంతరస్థగితుఁ జేసె. ౫౭

తే. గీ. కన్నకొమరుని గాసంత కరుణ లేక
పైసిమాలిన పరమనిర్భాగ్యురాలు
గొంతు తెగఁ గోసి చంపినవింత యింటి
యతఁడు పెంచిన సారమేయంబు చూచె. ౫౮

ఉ. కోమటియున్ నిశాంతమునకుం జనుదెంచు పథమ్మునందల
బ్ధామయమట్ల నాల్క నవయమ్మును సాచుచు మాటిమాటికిన్
గోమటిదాని కృత్యమునకున్ బెగడొందుచు నోరు లేని య
క్కోమలసారమేయము దిగుల్ వడి చూడఁ దొడంగె నాతనిన్. ౫౯

వ. వాఁడును సంభారమ్ము లమ్ముకొని యింటి కరుదెంచుచు మధ్యేపథమ్మున మతి
భ్రష్టుండునుం బోలె ననుదినాగమ్యమానంబగు మార్గంబు వదలి మాఱుదారి
నూరు సేరినంత.

ఉ "బాలుని కేల యీనగలు ? ప్రాణము సైతము దక్కనీని దు
ష్కాలము వచ్చె" నంచుఁ బలుసార్లు వచించుచు మొత్తికొంచు "నీ
పాలికి నీదుసొమ్ములె యపాయము దెచ్చెనురా కుమార ! యే
పాలసునింటి కేగితివొ ? పార్వికశీతకరోపమాననా ! ౬౦

తే. గీ. రాకుమారులకైన నీరామణీయ
కంబులోన శతాంశమ్ముఁ గలుగఁబోదు
మరల నీనగుమొగ మొక్కపరి గనుంగొ
నంగల యదృష్టముండునే నాకుఁ గొడుక ! " ౬౧

తే. గీ. అనుచు నెత్తెత్తి యింట రోదనముసేయు
చున్న పత్నిఁ బ్రమపం జూచి కన్నుఁగొనల

నీర మొకయేఱుగా బచ్చు బారుచునుచు
దాను రోదన మొనరించెఁ దనయుఁ గుఱిచి. ౬౩

వ. ఇట్లు గొంతవడి చింతించుచున్న యయ్యమాయికున కమ్మాయలాడి యిట్లనియె.

ఉ. ప్రొద్దుటఁ జద్దికొంత దిని పోయెను రాతిరికైన రాఁడు నీ
ముద్దులమూట యే తులువ మోసము చేసెనొ సొమ్ముకోసఁ ? మే
సుద్దులురానివాని కిటు చూరలుగా నగ లుంచిపుచ్చ నీ
గొద్దరి యూరిపాంసుని మదకాఁపురముం దుదముట్టె నెత్తురే. ౬౫

తే. గీ. తోడిబాలకు లాటల వాడ రమ్మ
టంచుఁ బిలిచినఁ దిన్నఁగా నన్నమైనఁ
దినక పరువెత్తె వాండ్రును గుర్తింపరైరి
మాయమాటల మనయిల్లు మాయ నయ్యె. ౬౬

వ. అనుచు ననేకభంగుల నిజమ్ముగ విలపించునదియుంబలె దుఃఖించుచు నమ్మగనితోడఁ బ్రతియింటికిఁ బోయి యడుగుచుఁ గృష్ణవేణీతటమ్మునకుం బోయి యచటి కాశవనమ్మున నరయుచుఁ గుమారకా ! యని తద్గుణమ్ము లుగ్గడించుచుఁ బూర్వజన్మ సంచితంబగు పుణ్యవశమ్మునం జేసి. ౬౭

తే. గీ. పతితపావన మను పేరఁ బరఁగునట్టి
కృష్ణవేణీనదీగత క్షేత్రమందు
నొయ్య నొయ్యన నడుచుచు నొడ్డువిరిగి
బోరగిలఁబడి తర్ఝరంబున మునింగె. ౬౮

వ. ఇట్లు పడి మృతిచెందిన కులటం జూచి యక్కిరాటుండు గోరుచుట్టుమీఁది రోకటిపోటు చందమ్మునఁ బెచ్చుపెరుఁగు శోకభరమ్మున వందురుచున్నంత సారమేయంబు చిరకాలంబు తన్మార్గమధ్యమ్మునునుండి బచ్చువాకుంటకు విచారించుచు నింటికిం జనుదెంచి యెచ్చటనుం గానక కృష్ణాతటమ్మున నున్నవాని జనకోలాహలమ్మున గుఱుతెఱింగి చని యర్థసూచకమ్ములగు శిరఃకంపమ్ము లొనరించిన వాఁడును దానివెంటవచ్చి ప్రతివేశినీగృహానికటగర్తాంతరస్థగితంబగు కుమారకళేబరముం గాంచి మరల సంజ్ఞాముఖమ్మునఁ దన్నడిగిన నాసారమేయంబు.

క. తనయింటికిఁ జేరిచి శయ్యను విటపరిభుక్తమైన యంబరమును బా
లుని కంఠము దునిమిన కత్తినిఁ జూపెన్ జనము లెల్లఁ దెలిసి నుతింపన్. ౭౦

క. ఇతని వెలందుక యొక యుపపతితోఁ గ్రీడించె; దాని బాలుండయ్యున్
సుతుఁడు గనె నంచు వాని యతితిఁ గోసెనటంచు నిజమెఱింగిరి జనముల్.

వ. ఇట్లెఱింగి యతనింజూచి యేల శోకించెద విద్యాదియంతయు నీభార్య యొన
ర్చిన దుష్కృత్యంబనుచు నోదార్చుటయు. ౭౨

క. అమ్మాటలెల్ల నమ్మి నమ్మక యావర్తకుండు నాతిపడినక్షే
త్రమ్మునఁ బడి మృతిఁగనె శ్వానమ్మును విశ్వాసమును గనంజేసె నొగిన్.

వ. ఇట్లమ్మువ్వురుఁ బతితపావనక్షేత్రమ్మునంబడి మృతిచెంది రందుఁ గిరాటుండు సార
మేయంబుతోఁ బరమపద మలంకరించె; నక్కులటమాత్ర మేలాతటభూషణమగు
భద్రాద్రిపురమ్మును జనపదమ్మున మాధవశర్మయను నొక్క భూసురాగ్రణి కడు
పునఁ గన్యకామణి యై జనించె నన మును లిట్లనిరి. ౭౪

తే.గీ. పతితపావనతీర్థసంపాతమృతుల
కెల్లఁ బరమపదం బున్న దేని ముగుర
యందు నిర్వురు మోక్షమ్ము చెంది వైశ్య
తరుణి చెందని యానిమిత్తంబు చెపుమ. ౭౫

వ. నావుడు సూతుం డిట్లను; నాగామిసంచితప్రారబ్ధమ్ములు నాఁ గర్మమ్ములు మూఁడు
తెఱంగు లందుఁ దీర్థయాత్రాదికమ్ముల నాగామిసంచితమ్ములు నశించుఁ గాని
ప్రారబ్ధం బనుభవైకనశ్వరంబ యని మఱియును.

క. మును చేసిన దుష్కృత్యమ్మునకుం బారంబు గనక పూర్వముకన్నన్
ఘనమగు భూసురకులమునఁ బునరుదయము చెందెఁ దీర్థపుం బుణ్యమునన్.

వ. ఇటు భూసురయోనిం బుట్టిన యక్కొరాటి కపవిత్రింబగు శ్విత్రింబు పురాకృత
కర్మపరిపాకంబునంజేసి మేనెల్ల నలముకొనె నట్లు దశహాయనంబులు గడచు
టయు.

క. పరిణయమగుటకు నే భూసురుఁడును నొడఁబడకపోయె సుకులీనుఁడు, దు
ష్కర విూ తనూజ కింకన్ బరిణయ మని తండ్రిమదిని వంతయుఁ బ్రబలెన్.

క. ఇహపరముల నెలియఁట యుద్వాహము లేకుంట యదియుఁ దగఁ గా దఁట శ్వి
త్రహతి గలిగె నేనియు దుస్సహ మగుఁగడ దేహ మెంత చక్కని దైనన్.

వ. పదంపడి జామాత్రన్వేషణమ్మునకుఁ బాటుపడుచుఁ బడుచునకు వివాహంబు సేయలేమిం దన కేలానదీప్రవేశంబ శరణంబని విచారించుచు మాధవశర్మ యొక నాఁటియుషఃకాలమ్మునం గుష్ఠరోగగ్రస్తుండును షోడశహాయనుండును నగు నొకధరాసురకుమారునిం గాంచి నీవెందుండి యిందు వచ్చితి వెవ్వరివాఁడ వని యడిగిన నతం డిట్లనియె.

సీ. మాది బ్రహ్మపురంబు మా శాఖ యాజుషి కులము భూమీదేవకులము పేరు
కులశర్మ కౌశికగోత్రంబువాఁడ నాతలిదండ్రు లటుఁ జిన్నతనమునందె
స్మరణీయు లైరి; యామయ మిది ఘటియించెఁ బ్రారబ్ధ మైనకర్మంబుకతన
నన్నోదకమ్ముల గాసించి మీవంటి యాతిథేయులయిండ్ల కరిగి యచట

తే.గీ. వారు పేర్మినొసంగినవంటకంబు
దైవసంప్రాప్తమనుచు దద్దయు భుజించి
భవనముల నొండె రచ్చసావడుల నొండె
నధివసించెద మదుదంతమంత యిదియ.

వ. బ్రాహ్మణుండును దనకన్యక నతని కీఁదలంచి గృహమ్మునకుం దోడ్కొని పోయి పుత్రి నేకతమ్మునఁ బిలిచి యిట్లనియె. ౧౩

క. ఋతుమతియగు కన్యకయున్కి తగదు బ్రాహ్మణులయింట, గృహినగు నాకీ
గతిగఁ బదియేండ్లు దాఁటిన సుతకుం బరిణయములేమి చూచుట తగవే. ౧౪

క. శ్విత్రిణి వటంచు నిను సుచరిత్రులు ధనవంతులే దరిద్రులునే నో
పుత్రి! ధరిత్రీనిర్జరపుత్రులు వరియింప రేమవుదువో తలఁపఁగన్! ౧౫

క. ఇతఁడు న్నీవలెఁగుష్ఠాన్వితుఁ డగుటన్ బరిణయంబు నేరఁడు నాకై
మతిమంతురాల యితనిన్ బతిగా వరియించి వంశపావని వగుమా. ౧౬

వ. మనోవాక్కాయకర్మమ్ముల నితనియెడఁ బతిభక్తి నెఱపితివేని యైహికాముష్మికమ్ములు రెండును నీకు సమకూరు నిదియునుంగాక.

క. పతినొక్కని వరియింపక సతి యతిగతి నుండి సర్వసంగమ్ములు వీ
డి తనరె నని యెచ్చటనున్ గత లెఱుఁగుదుమే పురాణగాథలయందున్ ౧౭

క. బలవంతము లింద్రియములు, పలుగు సుమీ మదనుఁ డెంతవారగు విద్వాం
సులకేని లోఁబడఁడు, కాంతలకుం దల మౌనె, విరతి తల్లీ? యెందున్.

క. పాతివ్రత్యమహత్త్వము చేతఁ జ సావిత్రియనెడి చిన్నది మును దాఁ
బ్రీతయగు నాయకునకుఁ బరేతాధిపునలన నాయు విప్పించెఁ జుమీ. ౯౦

వ. కావున నీసతీత్వమ్ముకతన నితండును నిర్గతరోగుం డగుచు నీ కనుకూలుం డైన వగునని చెప్పిన విని జనకున కక్కుమారి యిట్లనియె, ౯౧

తే.గీ. తగిన మగవానితోఁ బొందు తగునుగాని
తగని మగవానితోఁ బొందు తగదు సతికిఁ
గాన శ్రోత్రిణి నగు నాకుఁ గమలజుండు
కుష్ఠరోగిని బతిగాఁగఁ గూర్పకున్నె! ౯౨

వ. అని యట్లుండె.

ఉ. రెండవబ్రహ్మ వీవని యెఱింగి భవన్మతు నిమ్మహాత్మ నే
నిండుమనమ్ముతోడఁ బరిణేతగ నిక్కము చేసికొందు న
న్యుం డికఁ గాముఁ డైన మది నొల్ల నటంచు వచించె, సోదరీ
మండలి నవ్వ నొవ్వక సమాప్తతదన్యవరాభిలాషయై. ౯౩

క. అనుఁగుసుతపలుకు లన్నియు విని ధరణీసురుఁడు మిగుల వేడుకపడి యా
తనిఁ గనుఁగొని యల్లన నిట్లనియెఁ జ మదిఁ బాదుకొనుభయం బెడలంగఁ జ. ౯౪

క. శ్రోత్రహతావయవయగు సుపుత్రిక గల దొకతె నాకుఁ బూర్వకృతైనః
పాత్రికృతకుష్ఠామయగాత్రిన కిచ్చెదను నీకుఁ గైకొనుము తగఁ జ. ౯౫

క. సుతకు వివాహము సేయక ఋతుమతి యగు దానితోన యేలాతటినీ
పతనము మాకును, దిరిపపు గతి నీకును దప్పు దీనిఁ గరుణింపఁగదే! ౯౬

వ. అని యథార్థమ్ముగఁ బ్రార్థించు బ్రాహ్మణున కప్పరదేశి యిట్లనియె. ౯౭

క. శ్రోత్రిణి యగు మత్పుత్రిక నత్రత్యుఁడవై గ్రహింపు మంటివి మృతిభీ
తిత్రస్తుఁడఁ గుష్ఠామయగాత్రుఁడ నా కేటి పెండ్లికతలు మహాత్మా! ౯౮

ఉ. కాటికిఁ గాళ్లు సాఁచికొని కాలుపురమ్మున నిల్లు గట్టు నా
కేటి వివాహ, మేటిసుఖ? మేటికి నిచ్చిన మేలుఁ గాక, నా
బోటికిఁ గన్యనిత్తురె ? ద్విభూతిరుజావృతమైన మేనితోఁ
గూటికి గుడ్డకుం బరులకొంపకుఁ బోయెడువాని కక్కటా. ౧౦౦

క. మీ యావజ్జీవమ్మును మాయాయతనమ్ము నంద మన్నించుచు నే
యేయెడ నైనను బోషణ చేయుదు నని నంత నొప్పఁ జెల్లునె నాకున్? ౧౦౧

సీ. సంపాదకుఁడు గాక శ్వశురగృహమ్మున వసియించువాఁడు జీవచ్ఛవంబు
వెలఁది ఱంకుతనంబు దెలిసియు దానిఁ జేపట్టువాఁ డొక్క జీవచ్ఛవంబు
సంపాదకుండయ్యు సతికిఁ బెత్తనమిచ్చి వఱలువాఁ డొక్క జీవచ్ఛవంబు
పూవులమ్మినచోటఁ బుల్లలమ్మంగఁ బాల్పడినవాఁ డొక్క జీవచ్ఛవంబు

తే. గీ. రసికులగు భూపతులు గానరాని కాల
మందు సరసంపుఁ గవియయి యలరునట్టి
పండితుం డొక్క జీవచ్ఛవం బటంచు
బుధులు వచియింత్రు గాదె యో భూసురేంద్ర! ౧౦౨

ఉ. అంటిమి యున్నటంచు మరియాదకు లోఁబడి గాని, లేక నా
వంటి కురూపి కామయికిఁ బాతకి కామయుదోషమెల్ల మై
నంటిన పుత్రినిచ్చితి మటంచును గాని భరింత్రు మీర, లే
యంటును సొంటు లేని భవదాలయగామిను లాదరింతురే. ౧౦౩

ఆ. వె. ఎచట నేని బిచ్చమెత్తుచు దొరకినఁ
దినుచు దొరకకున్నఁ దిండి మాని
పొదలు ననద కకట, గుదిగోల నాకేల!
గొంతు నందుఁ గట్టికొనుట చెపుమ. ౧౦౪

వ. అనుచుఁ బ్రత్యాఖ్యానంబొనర్చు ధరాసురకుమారు మాటలకుఁ బ్రత్యుత్తరం
బీఁజాలక పురాకృతపాపపరిపాకమ్మునకై వందురుచు నప్పుడమివేల్పతని కతిథి
సత్కారంబు నెఱపి యానాఁటిరేయిదనుకఁ దనయింట నుండుమనిన
నాతండును వల్లె యని యంగీకరించె; నప్పలుకు లన్నియును నక్కన్నియ
యేకాంతమ్మున విని తనలోఁ దానిట్లు చింతించె.

తే. గీ. కుష్ఠరోగిని సైతము కోరికొనినఁ
గూళవిధి గూర్పలేఁడు గాఁబోలు నాకు
నెన్ని భవములనుండియొ యేమ జేసి
కొనిన పాపమ్ము నేఁటికిఁ గుడువ వలసె.

శా. తల్లిందండ్రియు నానిమిత్తము మనస్తాపమ్మునన్ బొక్కఁగా
నుల్లాసం బొక యింత లేక వితతాయుర్ధాయనై యేను సం
ఫల్లాభం బొడఁగూర్తునే జగతి? కీప్రాణమ్ము లేలానదీ
వేల్లద్వారిఝరంబు పాలుగ ముదావిర్భావముం జెందెదన్. ౧౦౭

క. అని మనమున నిశ్చయముం బొనరుచుకొని రాత్రినచ్చుపొంటెఁ దపింపన్
ఘనతరగర్జరమ్మదనినదంబై మబ్బు మూసె నింగికిఁ దోడ్పై. ౧౦౮

క. జలధార లేన్గుతొండంబులకెక్కుడుగాఁగ నొక్క మొగిఁ గాలాభ్రం
బులు గురిసె జలమయంబుగ నిలాతలము వెల్లివిరిసె నేలయుఁ బొంగెన్. ౧౦౯

సీ. నీరదధారాభినిర్భిన్నభూధరసరిదస్పృక్సమవాఝ్ఝరంబుతోడ
నాకాశవాహిన్యుపాలంభనాట్టహాసస్ఫురత్ఫేనపుంజములతోడఁ
జిరకాలరోధఃప్రచితతాభిమానానుయాతభూజపరిచయమ్ముతోడ
స్వాంబుప్రవాహసంవర్ధితారామభూజసమర్ప్యమాణపుష్పములతోడ

తే. గీ. నుభయతీరస్థజనపదక్షుభితజాన
పదసమారోహితోన్నతవసుమతీవి
రచితపరసౌధభూమికానిచయమగుచు
మింటికిని మంటి కేకమై మించె నేల. ౧౧౦

వ. ఇట్లు జగదుపద్రవకరంబుగ నయ్యాపగాఝరంబు విజృంభించు నంత నన్యుల
కెలుంగఁబడకుండ దానంబడి తత్ప్రవాహవేగమ్మునఁ జనిచని. ౧౧౧

చ. అటకొక క్రోసుదూరమునయం దలరారెడు తద్ధునీమణీ
తటగత మాదితేయరచితం బులిమేశ్వరు నాలయంబు మీఁ
దటఁ దగు పైఁడికుండ దన దాపుగ దానికిఁ గేలు సాఁచి సం
కటపడుచున్ గ్రహించె నల కన్నియ పున్నెము సేఁత పెంపునన్. ౧౧౨

క. అట మూన్నాళ్ళొకగతిఁ దన్నిటలాక్షునియందు మనము నిలుపుచు నవిశం
కటగతి జలముంగ్రోలుచుఁ బటగతమగు బొమ్మరీతిఁ బొల్పడి యుండెన్. ౧౧౩

వ. ఇట్లు మూఁడు దినమ్ము లయ్యుత్తరవాహినీమధురోదకపానతదభిషవతదధినా
థారాధనమ్ములం జేసి. ౧౧౪

క. బంగారుం బురణించుచు సింగారముఁ గుల్కఁజేయు సిరి గలిగి సహా
స్రాంగజసతులకు నెనయగు నంగనయై మిగుల విస్మితాంతర యయ్యెన్.

వ. ఇట్లు దివ్యమంగళం బగు విగ్రహంబు ధరియించి యక్కన్నియ యటనుండ వేలానదియుఁ గ్రమమ్మున జానుదఘ్నప్రవాహమ్ము మిగిలి చెలువారె. ౧౧౬

క. ఆనాఁటన తమ కన్నెం గానక తల్లిదండ్రు లిండ్లు గాలించిరి; యెం
తేనియుఁ గురూపమగు సంతానమ్మును బ్రేమ కాస్పదంబగుఁ గాదే.

వ. ఇట్లు గాలించి యెటనుం గానక యేటం బడిపోయెనని వందురుచున్న దంపతులం గాంచి వేదికాసుపుత్రుండగు ధరాసురకుమారుండు "తనయనాదరణంబు కతంబున నక్కన్నియ కేలాపాతంబు ఘటిల్లె" నని విచారించుచు నవ్వారి నొక్కింత యోదార్చి మఱునాఁ డుదయమ్మున లేచి యేలానదీతరణమ్మునకు సాధనంబు గావక యాయొడ్డునన చనిచని యొక్క రసాలభూరుహచ్ఛాయం బథిశ్రమాపని నీషన్ బ్రక్కకునొరిగి కనుమూయునంతఁ గాలప్రేరితంబై యొకమహాసర్పంబు వానింగఱచినఁ దదీయాయాసవివశీకృతుండగుచు నాయురుపాలంభనావరత్వమ్మున నయ్యేటంబడి తదాలయమ్మున కొక పక్కకుం జేరి యట రెన్నాళ్లుండి తన్మాహాత్మ్యమ్మునం జేసి వినిర్ముక్తకుష్ఠుండగుచు నద్భుతంబువడి యయ్యాలయం బల్లన డిగి యటనుండు జనపదమ్మున కరిగి యొక యాతిథేయున కతిథియై తనవృత్తాంతంబు సవిస్తరం బానతిచ్చిన నాగృహమేధి యిట్లనియె.

సీ. త్రేతాదియందుఁ బ్రతిష్ఠించె నీలింగ ములిమేశ్వరుండను యోగివర్యుఁ
డిచట నర్ధక్రోశ మేలానదియును నుత్తరవాహినీత్వంబుఁ దగ భజించెఁ
గాశికతో సాటిగల తీర్థ మిదియు విశ్వేశ్వరుఁడే యులిమేశ్వరుండు
క్షేత్రోపవాసంబుసేయుచు నులిమేశ్వరస్వామి భక్తి నెరఁగినయేని

తే. గీ. యెట్టియామయ మేనియు నెడలిపోవు
ననుచుఁ బెద్దలు వచియింతు రక్కతమునఁ
బ్రాగ్భవార్జితమైన పాపమున నీకు
సంభవించిన కుష్ఠను నడలె ననఘ. ౧౧౯

వ. అనుచుం దత్తీర్థమహత్త్వంబు సవిస్తరంబుగాఁ జెప్పిన నాధరాసురకుమారుం డును నట సంతుష్టాంతరంగుం డగుచుఁ గొన్నినాళ్లు వసియించె; నిట దేవాలయ శృంగంబున బంగారుం బొమ్మవోని, దశాధికవర్షీయయగు నక్కన్నియం

జూచి పూజారి నిశ్శ్రేణికామార్గమ్మున డింపి "నీవెవ్వరిదాన వెందుండివచ్చితి వేకతమ్మున దేవళంబధిష్ఠించి" తనవుడు నక్కన్నియుఁ గల తెఱం గెఱింగించి నంత నతండు భస్త్రిపురమ్మున కొక్క శస్త్రిం బంపించిన మాధవశర్మయు సంహృష్టాంతరంగుం డగుచు నట కరిగి బంగారు ప్రతిమవోని కూఁతుం జూచి కౌఁగిలించుకొని యిట్లనియె.

క. అమ్మా! వేగమ్మున గేహమ్మున కేతెమ్ము సంచితార్థమ్ముగు పు
ణ్యమ్మున నీదేహమ్ముఘనమ్ముగు రోగమ్మును వృజినమ్మును బాసెన్. ౧౨౧

వ. అని తోడ్కొనిపోయి సుందరాకారున కొక ధరాసురకుమారునకిచ్చి పరిణయం బొనర్పసమకట్టిన నక్కన్నియ యిట్లను. "మున్నొక కుష్ఠరోగియగు ధరణీసుర కుమారకునకు నన్నిఁదలంచినతఱి మన్మనమ్ము తదధీనంబు గావించినదాన నతండు నన్నొల్లమింజేసి యేటఁ బడిపోయినకతమ్మున నులిమేశ్వరుండు నాకు శరణంబయి మరణంబు మ్రాలుగ దివ్యదేహం బనుగ్రహించెఁ; గావున నెప్పటికేనియు యతండ నాకుం బతి" యనిన మాధవశర్మ డిల్లపడి యిట్లనియె. ౧౨౨

క. బంగారుబొమ్మవగు నీకుం గుష్ఠియతండు కేలఁగొన నర్హుండే
నిం గొనుము నాగవల్లికకుం గాదంబరికిఁ బొత్తు కుతుకం బిడునే! ౧౨౩

వ. అను తండ్రిమాటలు విశ్వసింపక యబ్బాలికామాళికారత్నంబు తండ్రి కిట్లనియె.

క. దౌదవ్వుల నుండును నతఁ డేదెసకుం జనఁడు మీర లేగి కడంకన్
దోఁదోడి తెచ్చి పరిణయ మాదట నొనరింపుఁ డతని యనుమతి గొనుచున్

వ. అనిన మాధవశర్మయు నొండాడక తదన్వేషణమ్మునకై కదలి యులిమేశ్వరమ్మను జనపదమ్మునకుం జని యేలాతీర్థమ్మునఁ దానమాడు బాడబు నొక్కనిఁ గని యడిగిన నతం డతని కిట్లనియె. ౧౨౪

క. నేఁటికి నాలవనాఁ డొక పూఁట భవత్సదనమందు భుజియించితి నా
నాఁటి తమి మీ కుమారిక యేటం బడిపోయె ననుచు నేడ్చితి రనఘా! ౧౨౫

వ. అని యభిజ్ఞానంబు సెప్పి మఱియును. ౧౨౬

క. ఏనును స్వస్థత మీకుం గానక యటనుండి కదలి కాననసర్పా
న్నానవిపద్గ్రదేహుఁడనై నదిలోఁ బడితి జీవితాశ వదలుచున్. ౧౨౭

వ. ఆనదీప్రవాహం బొక్క త్రుటికాలమ్మున కీయుమామహేశ్వరు దేవళమ్ముపైఁ బెట్టినఁ దదా
ధారంబు మరల జీవితాశం బుట్టింప నట యెన్నాళ్ళు నాంతక్రియకతాసిద్ధుఁడగు
నుపవాసం బొనర్చుచుఁ దన్నదీజలంబుఁ బ్రాణంబులు నిలుపఁగ నిటనుండిన
కతన నాకామయంబు వదలి యిట్టి రూపంబు ప్రకటించె మీరును ధరిత్రీక్కన్య
కొదంతం బెఱింగితిరే నావుడు భూసురుండు ప్రహృష్టాంతరంగుండగుచు
నక్కుమారున కిట్లనియె.

క. మీవలె మాకన్యకయుఁ జావున కాసించి యేటిచెంగటమునఁ బడి యీ
దేవళమునకుం జేరి శుభావహమగు రూపుఁ గాంచె నా పుణ్యకరుణన్. ౧౩౧

క. మీరిరువురు నుమామహేశ్వరు కారుణ్యము వడసి యొడలి కలుష మెడలి మే
ల్తారుణ్యము గాంచితి రిఁక ధారుణికిన్ మేలుగాదె దంపతులైనన్. ౧౩౨

వ. అని ప్రార్థించి యింటికిం దోడితెచ్చి శుభముహూర్తమ్మున నల్లునిగా నొన
రించుకొనియె; నంతఁ గొండొక కాలమ్మునకు నక్కన్నియ ఋతుమతి యగుడు
గర్భాధానంబుసేసి యద్ధరణీశ్వరకుమారుం డుమామహేశ్వరమ్మునన వసించుచు
సుఖములు గైకొనుచున్నంత నబ్బాలామణియుఁ జూలాలై యొక్కబాలునిం
గనియె. ౧౩౩

క. చేరెఁడు కన్నులు, ముద్దుం గారెడు నెమ్మోము, సొబగుగల యురమున్, బెం
పారు నెఱులును దనరఁగఁ గుమారుఁడు వెన్నప్పము వలె మలయుచు నుండెన్.

వ. ఇట్లు శుక్లపక్షశశిచాడ్పున దినదినప్రవర్ధమానుం డగుచున్నంత. ౧౩౫

క. నాలవసంవత్సర మాబాలునకున్ వచ్చె మరల బ్రాహ్మణసతియున్
జూలాలై పదినెలలకు బాలునొకనిఁ గనియె విమలభాభానునిన్. ౧౩౬

వ. తత్కుమారశీర్షోదయకాలంబునన ప్రథమపుత్రుండాకస్మికంబగు వాతరోగం
బున మృతిఁ జెందెఁ; బిదప ద్వితీయుండును ద్విహాయనుండయి నంత నామె యిం
కొక కుమారుం గనియె; నంత ద్వితీయుండును మృతిజెందె; నిట్లొక్కొక్కని
జన్మదినసం బొక్కొక్కని మరణదివసంబుగ నెనమండ్రు మడిసిరి. పదంపడి
నవమపుత్త్రమారకంబును బెశమపుత్రసంఘాతంబునగు గర్భంబు సంఘటించె. ౧౩౭

క. పదినెలలు నిండు నప్పూర్ణదినమునం బ్రసవవేదనావశయగు నా
సుదతి ప్రసవించెఁ బ్రాణము వదలిన యొక శిసువుఁ బాపపరిపాకమునన్.

వ. తత్క్షణంబ నవమకుమారుండును మృతిచెందిన నిరువుర నేలానదీవేలాసీమకుం గొంపోయి బ్రాహ్మణుండుశోకం బాఁగరామి నిట్లు చింతించె. ౧౩౯

మ. అకటా ! పుత్రులఁ బద్గురన్ గుసుమబాణాకారులన్ నిర్దయా
త్మకుఁడై యేటికి నప్పగించె విధి, యీఁదన్ రాని సంసారదు
ష్కకరాగారమునన్ మునింగితి వృథా, మాయామహత్త్వమ్ము యథా
ర్థకులేనిం దెలియంగలేరు గుణరక్తీభూతచేతస్కులై. ౧౪౦

క. దశసుతులు గల్గియు ననుతదశ సంప్రాప్తించె నింకఁ దనయులకొఱకై
పశువుల గతిఁ "బతిమేకాదశం కృధి" యటన్న చదువు దాఁటందగునే. ౧౪౧

తే.గీ. మఱియు నింకొక తరుణినిఁ బరిణయించి
తనయులను గాంచవలె నని తలఁచికొనినఁ
గాలుపులివలెఁ బెనువార్ధకమ్ము దొడరె
ముసలికిం జిన్నిపెండ్లము మొసలి యనరె !

వ. అనియింటికిం జనుదెంచి బాలెంతరాలగుపత్నికిఁ బుత్రశోకంబు మఱపింప వివిధాగమేతిహాసంబు లుపదేశించుచు నాదినమ్ములు గడపి పిదప నేలాతటినికిం బోయి స్నానం బొనరించి తత్తీరగతుండగు నీశ్వరునకుం బ్రణమిల్లి నుతియించె; బ్రాహ్మణియు నేలానదిం గుఱించి నుతించి యీశ్వరునకు మ్రొక్కుచు నిట్లనియె. ౪౪౩

ఆ.వె. కడుపు పగుల నింత కానుపు గంటి నా
కొకని నేని నిడక యకట ! మంటి
పాలుగా నొనర్పఁ బాఁడియె యందఱ
మహితతేజ ? యో కుమారజనక. ౧౪౪

వ. అనుచు విలపించుచు మనంబు తదేకాయత్తం బొనర్చినంత మహాదేవుండును దయాంతఃకరణుం డగుచు నెదుటఁ బొడసూపెఁ దన్నికటవర్తిని యగు నేలానదియు దివ్యరూపమ్మున నిట్లనియె. ౧౪౫

తే.గీ. నీవు తొలిబామునందు గణించినట్టి
పాతకమ్మున నింతటి పనులు పుట్టె
నవనిఁ బ్రారబ్ధ మనునది యనుభవింప
కేరికైనను దీఱ దోనీరజాక్షి. ౧౦౬

క. ప్రారబ్ధకర్మమునన కుమారులు పదుగురును గూడ మడిసిరి నీ వ
వ్వారలకై వగవకు మ త్కారుణ్యం బొకని నీకుఁ దగ బ్రతికించున్. ౧౪౭

వ. నీవు మరల నిచటికి సార్ధక్రోశమ్మున నున్న క్షేత్రంబునకుం బోయి యచట స్నానంబొనరించి యొక్క శివలింగమ్ముఁ బ్రతిష్ఠించి యార్ద్రవస్త్రమ్ముతోన మృతకుమారగర్తాంకితంబగు నీభూమికే తెంచి తద్వాసోదకం బీగర్తమ్ముపైఁ జిలికిన వాఁడు బ్రదుకు ; నిది మొదలీకలమ్మున నాక్షేత్రం బమృతపుత్రంబనియు నమ్మహాదేవుం డమృతసుతేశ్వరుండనియు నొడువంబడు నచట స్నానంబొనర్చి యద్దేవు నారాధించిన వారెన్నఁడును బుత్రశోకంబు గాంచరనియు నొడివి యయ్యీశ్వరు తోడన యంతర్ధానంబు చెందుటయు. ౧౪౮

క. ఆ విప్రసతియు స్నానము గావించి మహేశు నిల్పి కడు ముదమున నీ
రాపసితం బగు వసనముతో వెడలెన్ బ్రాణనాథుతో వేగమునన్. ౧౪౯

వ. వెడలి మరలఁ జితాభూమి కరిగి పతినిర్దిష్టమ్మగు గర్తమ్మునఁ దద్వాసోదకంబు చిలికిన మారసదృశాకారుండగు నొక్క కుమారుండు బ్రదికె ; నిది యమృతపుత్ర క్షేత్రమాహాత్మ్యం బనిన విని శౌనకాదు లక్కథకున కిట్లనిరి. ౧౫౦

సీ. కోటిలింగక్షేత్రపాటవం బమృతపుత్రక్షేత్రమహిమంబు తదధినాథుఁ
డమృతసుతేశు మహత్త్వంబు వినిపించి యులిమేశ్వరస్వామియునికిపట్టు
నలకేశదిక్ప్రవాహము గల్గుచోటును నగు సర్వరోగాపహాభిధాన
తీర్థ మందలి విశిష్టార్థంబు వినిపించి సలిపితి కర్ణరసాయనంబు

తే.గీ. మఱియుఁ దత్తటినీపూజ్యమానతీర్థ
రాజములమహిమమ్మును బూజనీయు
లగుచు నటముక్తిఁ జెందిన యనఘమతుల
సుచరితలు చెప్పవే యన సూతుఁడనియె.

సీ. శృంగారవల్లభశ్రీశుండు వారాశిపుత్రికతో నుండు పుణ్యభూమి
కల, దటకొక సార్ధగవ్యూతి దూరమ్మునందు నుత్తరతీరమందు మఱియుఁ
దత్పాలకుండు చంద్రప్రతిష్ఠితుఁ డగు శంకరస్వామిభద్రంకరుండు
తిరుపతియందుప్రత క్షేత్రనామము నూటయెనిమిది తిరుపతులను ఘనంబు

తే.గీ. నిరతమాదేవులను గొల్చు నీతిపరున
కాయురారోగ్యపుత్రపౌత్రాభివృద్ధి

గలిగి తామరతంపరగా నెసంగు
సంపదనటింపఁ దుదను మోక్షంబు దొరకు. ౧౫౨

తే.గీ. ఆమయాపహతీర్థ సమక్షమందుఁ
గాంద్రకోటియనెడి పురి కలదు మున్ను
తత్పురము రాజధానిగ ధర్మకేతు
వేలెఁ గిమ్మీరమండల మెసక మెసఁగ. ౧౫౩

వ. ఆధర్మకేతునృపాలుండు చంద్రవంశభవుం డతండు మణిద్వీపాధివాసిని యగు పర
శక్తి నర్చించి తత్ప్రసాదంబున నూకాంబయను శక్తింగొని యాపె సహాయగఁ
గిమ్మీరమండలంబుఁ గైకొనియె నని మఱియును.

తే.గీ. మఱియు నొక్క విశేషంబు మఱచిపోతి
నామయాపహతీర్థమ్మునందు భాను
వారమునఁ గ్రుంకెరేనిఁ దత్ఫలము శతగు
ణం బగు నటంచు మానిజనంబు లంద్రు.

సీ. శృంగారవల్లభక్షేత్రమ్మునకు నాల్గుక్రోసులు గలయెడఁ గుంతిమాధ
వస్వామి, కుక్కుటేశ్వరుఁడును, బురుహూతికాశక్తియును, బాదగయ యనునవి
గలుగుక్షేత్రము పీఠికాపురి యలరారు దానికిసరియగు స్థలము లేదు
పితరులు తరియింపఁ బిండప్రదాన మార్యులపరంపర చేయుచున్నచోటు

తే.గీ. పాదగయయన గయుఁ డనువాని మున్ను
జలజనేత్రుఁడు వరమిచ్చి సమయఁజేయఁ
దల మగధదేశమందుఁ, బాదమ్ము లిచటఁ
గాఁబడియెఁ గాన నిది పాదగయ యటంద్రు. ౧౫౬

వ. కుక్కుటేశ్వరుని యుత్పత్తిప్రకారంబింతకుమున్ను వివరించితి, నింకఁ బురు
హూతికామహాత్త్వంబు వినిచెప ననిన విని ఋషు లిట్లనిరి. ౧౫౭

క. మును గుష్ఠరోగియయిన యవనిసురపుత్రకు చరిత్ర వచియించితి వా
తనికాయామయ మదిప్రబ్బినకారణ మెఱుఁగఁజేయవే యనఘమతీ. ౧౫౮

వ. నావుడు సూతుం డిట్లను వక్ష్యమాణపురుహూతికా మహాత్త్వమ్మును
మీ ప్రశ్నమ్మున కుత్తరమ్మును నొక్కటియ వినుఁడని యిట్లు చెప్పం దొడంగె.

సీ. పుత్రఘాతిని యైన పూఁబోఁడి చరితఁ జెప్పితి మును నద్దానివింటిరి కద
నాఁటిదినం బలనాతితోఁ గ్రీడించినట్టి నాఁడొక్క ధరామరుండు
నదిలోనఁబడి బచ్చునాతి ప్రమగ్గనవిచారమున నతండు దేశములఁ దిరుగఁ
జని మంగళాఖ్య నగరమునకేగి ఘనుఁడైన నారసింహునకు భక్తి

తే.గీ. మ్రొక్కి యటఁ బావకము వోసి ముక్తిమగు
విజయవాటిక కేగి యప్పిటనున్న
కనకదుర్గాంబ కెరఁగి యానెనుక ధరణి
సురవరాగ్రహారమ్ములు చూచికొనుచు. ౧౬౦

వ. క్రమక్రమమ్ముగఁ బురుహూతికాధిష్ఠితమ్మగు పీఠికాపురమ్మున కరుదెంచి యట
నొక సభాపతి భవనమ్మున విడిదిసేసె. ౧౬౧

తే.గీ. ఆసభాపతి కలరారు నమలమతికి
నెకలిగుణములు గలుగు పుత్రకుఁడొకండు
చిన్నతనముననుండి యచ్చోనఁటి చదువు
సంజలను వీడి లంజెలకుం జపించు. ౧౬౨

తే.గీ. వాని కప్పరదేశి కనూనమైన
మైత్రి వాటిల్లెఁ దొంటికర్మంబుకతన
దాన మఱియింత పొంబలె నవ్వానికుమతి
దుర్జనస్నేహ మేరికి దొసఁగొసఁగదె! ౧౬3

మ. ఇటు లా పాపి ఘృతాభిషిక్తమగు బర్హిశ్శుష్మ చందమ్మునన్
విటవర్యాన్ బరదేశి భూమిసురు నేవేళన్ విసర్జింప కె
వ్వటిరీతిన్ నెలయాండ్రయిండ్లకు మదిన్ బ్రార్థించుచున్ గాను ము
న్నటికంటెన్ గడునెచ్చఁబుచ్చు చొగినుండన్ జూచి పౌరుల్ నెసన్.

క. "పరదేశి నవ్వులఁ బంపి కొమరునకుఁ గల్గిన యవస్థ మాన్పింపుము భ
ట్టుకకా!" యని తెల్పినన్ గర మాతని భూసురుండు గనకాద్యష్టిన్ ౧౬౫

ఉ. చూచుచునుండుఁగాని తనసూనుఁడు నాతనితోడఁ బోవఁగా
జూచునొకో యటంచు నొకసుంతయుఁ గోపముసేయఁ డెన్నరే
నీచునిఁగాని యోగ్యకరణిన్ జరియించెడివానిఁగాని పోఁ

శా. ఆమధ్యాహ్నము స్వస్తివాచనము సేయన్ గ్రామమందున్న య
య్యేమాన్యాత్ముఁ యిండ్లకేగి యటఁ దా నార్జించు ద్రవ్యంబు వే
శ్యామానిన్యధరామృతంబులకునై యర్పించుచుండున్ ధరా
యామున్ గాదనఁ డేకపుత్రపసయంబై మించు ప్రేమమ్మునన్. ౧౬౭

ఉ. చిన్నతనమ్మునుండియును జేసెడి చేష్టలు సన్నుతించుచున్
మన్ననఁజూచు తల్లియుఁ గుమారుని కబ్బిన పాడుబుద్ధికిన్
గన్నులనీరు కాల్వలకుఁ గాలునలై చన నేడ్చుఁ గాని యే
యున్నతిఁ దేక మూర్ఖగతి నున్నను మీఁద దటెట్టి పేర్మియో ! ౧౬౮

వ. ఇట్లమ్ముకులపాంసనుం డప్పరదేశింగూడి యిహపరమ్ములకు వెలియగుభంగి సంచరించుచు నచిరంబునుండి తన తండ్రి యార్జించిన ద్రవ్యం బొక వత్సరమ్మునకు వమ్మొనర్చియున్నంత. ౧౬౯

తే.గీ. తనధనముతిన్న గణికలందఱుఁ గృతఘ్ను
లగుచుఁ దమలేమఁజరకుల కప్పగింప
సాగఁ దోలిరి యమ్మదిసాను లటక
తొరగద్గదవాక్కులు బోరుకలఁగ. ౧౭౦

వ. ఇట్లు వృద్ధవేశ్యాపరిభూతు లగుచు నయ్యిరువురు ధనార్జనోపాయంబు గానక తీర్థాటనమిషమ్మున నెటకేనియుం బోఁదలఁచి యొకనిశీథమ్మున నేరికిం దెలియనిగతిఁ గదలి రాజవీథిం జనుచున్నంత. ౧౭౧

సీ. కదళికాసుమపాళికల్పమైన నయనద్వయము రక్తపరిభాపటలి నీనఁ
బైనుండి క్రిందికిఁ బడు మజ్జియాడల పోలిక నిరువదిభుజము లూలయ
నానాభి వ్రేలుచున్నట్టి పుర్కెలదండ రత్నహారముల నొరయుచునుండఁ
దారకాపాళీయుతం బైన మిన్నునాఁ జెలువారు గుపకన్నచీర మెఱయ

తే.గీ. శాకినిలు డాకినిలును పిశాచములును
దోడఁ జనుదెంచు చతులనుతుల నొనర్ప
నుగ్రచ్ఛాయము మీఱ నూరేగుచున్నదానిఁ
గనిరి పురుహూతికానామిక యగుశక్తి. ౧౭౨

మత్తకోకిల. కాంచి యెంతయు జంకులేని వికాసమొప్పఁగ నిర్భరో

సెంచి కేల్గవ సాదరన్ గదియించి నైకటికశ్రేయున్
గాంచి యిట్లని సన్నుతించె నఖండవాగ్ఝరి మించఁగన్, ౧౭౩

ఉ. తల్లి! జగత్త్రయాభరణదక్షకలాక్షకలావిలాస! యు
త్ఫుల్లసముల్లసత్కమల తుల్యముఖీ! ప్రకృతిస్వరూపిణీ!
పల్లవపాణి! నిత్యశుభభాగ్యవిధాయిని! సుస్వరూపసం
వేల్లితదేహ! దివ్యపదపీఠవిభాసిని! మత్తకాశిని! ౧౭౪

వ. ఇట్లు నుతించిన దేవియుఁ గరుణార్ద్రయై యిచు "మీరెవ్వ రెందుండి యేటికేగెద" రని యడిగి కలతెఱంగెఱింగి "యేను మరల నచ్చుదనుక మదీయాలయమ్మున నధివసింపుఁ" డని యానతిచ్చి తనయిచ్చం బోవుటయు వారలును తదాలయమ్మున కరిగి యమ్మహాశక్తి శక్తి నుగ్గడించుకొనుచుండి రంత ౧౭౫

తే.గీ. ఎచట నుండెడిపరివార మచటికేగ
మరలఁ బురహూతికయుఁ దనమందిరమ్ముఁ
జొచ్చి కూర్చున్నయట్టి భూసురులఁ గాంచి
యిట్లనియె మేదురాదర మెసక మెసఁగ.

వ. ఏనూరేగువేళ నెవ్వరేని నాకెదురై మద్భీషణాకారమ్మున కడలి గతాసులగుట నిక్కం బట్లుగాక మీరలు నిర్భయులై యంతఁబోక నన్ను నుతించితిరని వెండియు.

క. కావున వైశమ మీకుం గావలసినవరముఁ గోరఁగాఁ దగు నని యొం
తేవేడ్కఁ బురశక్తి దయాభాసితమనస్కత కెద నద్భుతపడుచున్. ౧౭౬

క. ధనకాంతల కెల్లరకుం దనివిగ ధన మిచ్చి పొందఁ దలఁచుచు వార్ధం
ధనమున్ ధనముం గోరిరి తనతనపాపములు సమయుతటి యందైనన్. ౧౭౭

వ. ఇట్లు కోరుకొన నప్పురుహూతికయు "నేతన్నగరీయామ్యదిశాభాగమ్మున నొక నిక్షేపమ్ముగల దదిమీకు దొరకుఁబొం" డని దానిం గాచు పిశాచికొకకమ్మ లిఖించి యిచ్చిన నదికైకొని పరిహృష్టాంతరంగు లగుచు నచ్చోటు చేరి తద్రక్షకి యగు దయ్యమ్మున కాశక్తియిచ్చినకమ్మ నొసఁగి యానిధినిఁ దత్సమ్మతిం గైకొని యిరువురకుం దెలియఁదగిన యొక గోష్ఠస్థానమ్మునం డాఁచి యెప్పటియట్ల రోవెలందుల పొందుపట్లకుం జనుచుఁ బూర్వాచారంబు నిర్వర్తించుచున్నంత. ౧౭౮

సీ. అప్పుడప్పుడు కొంచె మర్థమిచ్చుచు దయాపరుఁడైన యాధరామరకుమారుఁ
డనుపఁగ వెలయాండ్రు ననుభవింపఁగ రాత్రి ఘటచేటికలతోడఁ గలయునట్టి

పరదేశియును గరువంబు హెచ్చి ధనంబదంతయుఁదాఁ దెచ్చినట్లు నెచ్చఁ
బుచ్చుచు నతనికిఁ బుచ్చినవక్కైన నీయకయుండు నుపాయ మొకటి

తే.గీ. చేయఁ దలఁచియు నూరవసించునట్టి
పాలు లఁడలు నతనికిఁ బట్టు గాఁగ
లా రనుచు నెంచుకొంగుఁ గాలంబుగడపు
చుండె మూషకమార్జాలయుక్తి తవర. ౧౫౧

క. "ధనమెక్కడిదిర! మీ" కనుచునాగరులు తమ్మడిగినచో "సొనులె మా
కనయమ్ము ధనమొసంగుదు" రనుచుఁ జెప్పెదురు వార లవ్వారలకున్.

సీ. కూర్చుండి తిన్నచోఁ గుళ్ళు గోపురము లాగ వటన్న సామెత గాఁగ వార
లాధనం బంతయు నాయూరి నెలయాండ్రిపా లొనరిచి పదంపడి ధనంబు
లేమి లంజెలు నంత మోమోటమియు లేక యిలు వెడలంగఁ ద్రోయింపఁగ స్తి
పడుచు ధనముగడింపఁగఁ గొండొక యుపాయ మేమియుఁగానక యెన్నఁడేని

తే.గీ. గలదు ద్రవ్యంబు దొంగటికమ్మునంద
యంచు యోజించి ధనవంతుఁడైన యొక్క
గేస్తు గృహమేగి తచ్ఛిత్తికి నొకటను సు
రంగముం ద్రవ్వివేగఁ దదంగణంబు. ౧౫౩

వ. చొచ్చి లోనికిం బ్రవేశించి చతుస్సహస్రరూపికా పూర్ణమ్ములగు నాల్గుసంచులు
దొంగిలించి మరలి యమ్మార్గమ్మునన వెలికివచ్చి యథాపూర్వమ్ముగ నాధనమ్ము
డాఁచి యుండునంత. ౧౫౪

క. ఒరులధన మిట్టులు హరింతురె యనుకోపమునఁ బోలెఁ దూరుపు దెసయం
దరుణుండై కనఁబడె నంబరమణి యగు సర్వసాక్షి ప్రభ దైవాఱన్. ౧౫౫

తే.గీ. నాఁటిదినమున నచటికి నాల్గుక్రోసు
లందుఁ జెన్నారు తిరుపతి యనెడి యూరఁ
బరఁగు శ్రీరంగనాథస్వామియుత్స
వంబనుచు నేగి రాయూరివార లెల్ల. ౧౫౬

క. పరదేశితోడ ధరణీ, సురసుతుఁ డిటు వల్కెఁ "గొంతసొమ్ము మనము రో
తరుణుల కొసఁగినచో వా ర్తిరుణాళ్ళకుఁ బోవుదు రఁట తిరుపతి" కనుచున్.

వ. అతండును గొన్నిదినమ్ములదనుక నీధనంబు ముట్టితిమేని యీచౌర్యంబస్మత్కృతమ్ముగాఁ బరిణమించెడినని చెప్పి యాధనంబు ముట్టనీక పదంపడి రేయి నిదుర మానినకతన నిదురించు నవ్వాని నవలోకించి వీని నిప్పుడంజంపితినేని యీ ధనంబెల్ల నాయదియ యగునని తలంచి. ౧౫౯

క. మిత్రఘ్నుఁడు పరదేశి ధరిత్రీసురుఁ దధముఁ డత్యరిత్వము వోఁపన్
జిత్రముగ గృహచ్ఛాదకపత్రముల న్నిప్పువెట్టి పదపడి భీతిన్. ౧౬౦

వ. తిరుపత్యుత్సవంబు కనుఁగొను నెపమ్మునఁజనియె; నంతఁ దద్గృహమ్మును క్షణార్ధమ్మునకుఁ దద్ధరణీసురకుమారుతోడన భస్మంబగుడు నిరుగుపొరుగువా రుత్సవదిదృక్షాగతుండగు సభాపతికి నయ్యుదంతంబుఁ దెల్పి రతండును జయ్యనఁ జనుదెంచి పోయిన యింటికై వందురుఁ గాని కుమారునిమృతి యెఱుంగఁ డిది యిట్లుండ. ౧౬౧

ఆ. ఇంటి కగ్గివెట్టి యేగినపరదేశి చంద మెల్ల నొక్కశస్త్రి చూచి
వెంట నేగి వాని విఱిచి కట్టించె గారాగృహమునఁ గల తెఱంగుఁ దెలిపి.

క. తనయింట నుంచుకొని మే పినకతమున వాఁడె నేఁడు విషమై యంటిం
చెను నిప్పు భూమిసురునింట నటంచున్ జెప్పికొనఁ గడంగిరి పౌరుల్. ౧౬౩

సీ. భూసురోత్తముఁడును బొగులుచు నవ్వార్త దెలిసి యాతనిఁ బట్టి తెచ్చి కలిత
కారాగృహాచారు గావించి రనియును నెఱిఁగి పుత్రునిచంద మెఱుఁగరామి
నచ్చోటి కరిగి 'మదాత్మజాతుం డేఁడ'నని యేడ్వ సాగిన నతఁడు మొగము
వంచి 'యే నెఱుఁగ నవ్వాఁ డలవారకాంతలతోడ స్వామియుత్సవము చూడఁ

తే.గీ. దిరుపతికి నేగెనని యేను నరుగుచుండఁ
బొంచి యీభటుఁ డొక లేనిపోని నింద
మోపి తోడ్తెచ్చెఁ గాని యేమోస మెఱుఁగ'
నంచుఁ గన్నీరు కాల్వగా నట్టెయేడ్చె.

క. కరములఁ గళలం గొని భీకరమగుగతి భటులు పొడువఁగా నొగి నతఁడే
నెఱిఁగనను మాటదక్క నితరవచనము పలుకఁ డెంతధైర్యము గలఁడో. ౧౬౫

తే.గీ. భటుని సాక్ష్యమ్ము కతమునఁ బ్రాడ్వివాకుఁ
డాతతాయితయును నద్ధరామరనుత
ఘాతుకత్వమ్ము నెఱిఁగి యక్కడనె మరణ
దండనమ్ము విధించె నా దుండగునకు.

క. పురుహూతికకుం బ్రతివత్సరమగు నుత్సవమునందుఁ దగ నొక్కరునిన్
నరుని బలియిచ్చుచుండెడి మరియాద యొకండు గలదు మనుజుల కందున్.

క. పురిఁ బ్రాడ్వివాకుఁ డెవ్వరి కురిశిక్ష విధించు వారినొకచో నిడి య
ప్పురుహూతికకున్ బ్రతివత్సరము బలియిత్తు రచటి ధర్మజ్ఞు లొగిన్. ౧౯౯

వ. తదర్థంబ యప్పుర దేశింగాడఁ దాదృశులగువారుగల యొక తమోగృహమ్మున రక్షించుచుండి; రిట్లు కారాగృహమ్మునందుండి యతం "డత్యుత్కటైఃపుణ్యపాపై రిహైవ ఫలమశ్నుతే" యను వచనముం దలపోసికొనుచుఁ బురుహూతికాబలినిమిత్తక ప్రాణత్యాగంబునకుం గొంత సంతసించుచు మనంబున నామె నిట్లని నుతించె.

పద్మనాభవృత్తము.

రాజాధిరాజోత్తమాంగస్ఫురద్రత్నరాశిప్రభాభ్రాజితాంఘ్రిద్వయా! నీ
తేజం బనేకాద్భుతంబై జగంబందు దేదీప్యమానంబు మూఢుండనమ్మ
నీ జన్మమం దించుకేఁ బుణ్యముం జేయ నీ వన్ను నీ వెట్లు రక్షించెదో! దే
వీ! జాగ్రదుగ్రప్రతాపా! మునీట్చిత్తవీథీనివాసా! నమస్తే నమస్తే! ౨౦౦

క. అనుచు నుతించుచుఁ బురుహూతిని హృత్పీఠమున నిల్పి తిన్ననిభక్తిన్
దనియించుచు నతఁడుండఁగఁ జనుదెంచెన్ బలియొసంగు శక్త్యుత్సవమున్.

వ. ఇట్లు జగదేక నేత్రపర్వంబుగఁ బురుహూతికామహోత్సవంబు చనుదెంచె నంతఁ గారాగారనివాసియగు నయ్యపరాధిం బోడి తెచ్చి హరిద్రాకుంకుమాదికంబుల నలంకరించి నింబపత్రంబులు మెడకుంగట్టి యూరేగించి పదంపడి యహరవసానం బగుడు ధూపదీపనైవేద్యంబు లయ్యంబ కర్పించి పౌరులందఱును దదాలయ గర్భాగారంబునం బెట్టి కవాటంబులు ఘటించి తమతమమందులకుం జని రంత

క. తనబలికై నాగరు లిచ్చిన వానిన్ భక్తుఁ గాంచి చేతమ్ము దయా-
ఘనముగఁ బురుహూతికయు నతని కిట్లనె మోమునకున్ స్మితం బొలయంగన్.

భుజంగప్రయాతము. సదాభోగశాలీ! భృతత్యాగశీలీ!
హృదుప్తాబ్జమాలీ! కవీంద్రాబ్జహేలీ!
గదాహస్తనామప్రకాండాదరా! వి
ద్వదీశాదృతిప్రాప్తభాస్వద్యశస్కా. ౯౧౨

గద్య. ఇది శ్రీకింకవీంద్ర ఘటాపంచానన విద్వత్కవి బాలకలానిధి బాలసరస్వతీ

శతావధాని తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబైన

యేలామాహాత్మ్యమ్మునందు సర్వమ్మును

ద్వితీయాశ్వాసము

సమస్త సన్మంగళాని భవంతు.



## —♦ ఏలా మహాత్మ్యము. ♦—

### శుద్ధపత్రము.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౨ | 10 | సూర్య | సూర్యా |
| ౩ | 14 | త్రిజగత్పావన | త్రిజగత్పావన |
| 11 | 26 | తోడఁగాత | తోడగాత |
| 22 | 31 | జేత | జేఁత |
| 24 | 7 | నూన | మాన |
| 33 | 12 | యతంక | వతంస |
| 40 | 13 | నేత్త్రుఁడు | నేత్రుఁడు |
| 45 | 20 | దేఁడ" నని | దేఁడ" నని |
| 47 | 17 | జెప్పు; | జెప్పుఁ |
| 47 | 23 | శారదా ! ప్ర | శారదాప్రి |
| 47 | 25 | కారుణ్యా ! సం | కారుణ్యాసం |

శ్రీమత్పరదేవతాయైనమః

# పాణిగృహీత

## ప్రథమాశ్వాసము




దుం డాప్తుఁడు, గౌరి భార్య, యచలశ్రేష్ఠమ్ము వాసమ్ము, వి
ఘ్నాదుల్ వారెడివాఁడు పుత్త్రుఁడు, శుభం బర్పించు శబ్దమ్ము పే
రై దైవారెడివేల్పు, నిత్యకరుణావ్యాప్తుండు ప్రచ్ఛన్నయున్
దాఁదాత్పర్య మెలర్పఁ బ్రోచు నల సీతారామనామాంకితున్. ౧

చ. గురువగు బ్రహ్మపండితునకు న్నతిసల్పి జగత్ప్రసిద్ధవా
గురులగు సంస్కృతాంధ్రకవియోగుల మ్రొక్కియు నేఁటి మేటులన్
గరము బహూకరించి యిఁకఁ గాకవితాభువనైకరాజ్యభా
స్వరులగు నామమాత్రకవిచంద్రులకున్ బొనరింతు మంజలుల్. ౨

తే. గీ. లజ్జగల్గిన పూర్వకాలమ్మునందుఁ,
గోటి కొక్కఁడు గల్గెఁబో ! కుకవి, నేఁటి
కాలమందేమికర్మమో కవుల నూటఁ
దొంబదులు కుపదమ్మునఁ దూఁగుచుండ్రు.

ఉ. కైత యొకండు గాదిపుడు కాలము సర్వము మాఱె; వ్యర్థపుం
జాతురి హెచ్చె; నల్పమగుసాహితితోఁ బెదపెద్ద పొత్తముల్
చూతురు, తప్పుదిద్దుదురు; శూరత చచ్చెఁ గవీంద్రులందు ; సీ !
మూతులు గట్టివైచికొనఁ బోలదె? సత్కవులైనవారికిన్. ౪

చ. తగుదుమొ లేదొ యంచు మదిఁ దత్తరపా టొకయింత లేక “మీ
దగు కయితమ్ము నూచితిమి యందది యిందిది” యంచుఁ బద్దెముల్
దగులుతు; రందుకోసమె మొదల్ దమ రంపుదు రిక్కవుల్; వృథా
యగుఁగద వీరిసమ్మతు, లహా! తగువారి కివేల, కాల్పనే? ౫

తే. గీ. అన్నిపాత్రమ్ములకు మొదలెన్ని పుటలొ
నిండు నభినందనములతో దండుగకట !
యొక్కఁడేనియు నిజమగునూహ వ్రాయఁ,
డట్లువ్రాసిన నద్దాని నడఁతు రొకట.

తే. గీ. భారతముపై నెవరి యభిప్రాయముండె?
మనుచరిత మొద లేరిసమ్మతులు నిలిపెఁ?
దీపిలేని ఫలమ్ముపైఁ దేనె చిలుక
నేమియగుఁ? దీపిగలదాని కేమిపలయు?

తే. గీ. చేతఁగాని శతవధాని చేతినిండ
'సర్టిఫికెట్లు' కట్టలే, సహజశక్తి
గలుగువారల కవియేల కాల్పనే స్వ
తః ప్రకాశుఁడు గోరునే తనకు దివ్వె?

క. "సంగీతసాహితులు వాగంగనకున్ గుచము" లనుట "హాస్యాస్పద" మం
చుం గన్నులుగా దిద్దెడి శృంగారవిదుల్ కవీంద్రు లిక్కాలమునన్. ౯

ఉ. ఇంతకు నింత మాటె నిఁక నిన్నయనంబులుగాడఁ జుంబనా
క్రాంతము లౌట మోటనుచుఁ గాళ్ళుగ మార్తురొ, వేళ్లటందురో !
తింత్రిణికాఫలమ్ము లనఁ దీఱదె? పూర్వకవీంద్రు లక్కటా,
యింత వివేకముం దెలియరే? యది దిద్దెడిపాటివారమే! ౧౦

క. స్తనశల్యపరీక్షకుఁ బోయిన ఫలముం గలదె! వాని నిటుపోల్చిన యా
య్యనఘుని భావము నెఱిఁగిన జనుఁడేగతి దిద్దు? నది రసం బెటు లిచ్చున్?

తే. గీ. ఇంతమార్దవ మెఱిఁగియు నిహాహా! వీరు
బాలకుల కంచుఁ జేసిన పాఠపుస్త
కమున సుఖరోగములగాథ నిముడఁజేసి
రట నుపాధ్యాయు లెటుచెప్పనగునో? యకట.

ఉ. కంకురుకుంకలైన పలుగాకికలార్థుల కెట్లు పాఠ మీ
అంకపురాణమున్ నయభరప్రవమంచు వచింపనొప్పు? నా

శంక యొనర్చరే? నగరే? "సర్వము నీతికె" యందురేని మీ
వాంఛనిఁ దెల్పు నా రతిరహస్యము పాత్రమువెట్ట రాదొకో! ౧౩

తే. గీ. తగినసామగ్రి కొఱకిక దారి లేదు
దారిగల్గిన సామగ్రి దనరఁబోదు
రెండుఁగల్గిన వారితో నొంటుగల్గు
వారు జీకొన నని నగుఁబాటు నాపై?

ఉ. కొంచెము గొప్ప సంతసము గొల్పినఁ జూపుఁడు చించివేయుఁడే
మంచియు లేనిచో, నివియె మా నమనమ్ము లనుగ్రహించి మ
న్నించుఁడు; కాశినాథబుధనేతవిధాన వృథావివాదముల్
పెంచకుఁ డాగ్రహించకుఁడు "పెప్పెపె" యందురు మే మెరుంగనన్. ౧౫

చ. పరిణతశక్తులైన యల భారతవుం గవు లట్టులుండ ము
ష్కరుఁ డనిపించుకొన్న కవిసామజసింహము రామకృష్ణు వా
గ్విరచనఁగూడఁ జూడుఁడు, ప్రవేశఫలమ్ములు చిన్నచిన్న వ్యా
కరణపుఁ బొత్తముల్ గొణిగి కయ్యముఁ బెంచకుఁడయ్య, వాగ్విదుల్! ౧౬

క. తొలిబాసయందుఁబలె నీ తెలుఁగుంబాస నెలయించుదీపము లేమిన్
విలువ గల కవుల లక్ష్యమ్ములె తా మీభారమెల్ల మోయఁగ వలయున్. ౧౭

క. ఈభాగము మే మల దేవీభాగవతమ్మునంద వివరించితి మీ
క్షోభ యిట మరల నేల? పరాభవ మందకుఁడు, పైకిరాకుఁడు కుకవుల్! ౧౮

ఉ. కాలముఁబట్టి దేశమునుగాంచి ప్రభుత్వమునెంచి దేశభా
షాలలితాంగి మాఱు టది సత్కవిసమ్మత మాట, నన్యదే
శ్యాలును నాంధ్రభాషఁ గలవౌటను నాచితిఁబట్టి మేము క
బ్బాలను వాడుచుంటి మని పండితు లేగతి నొప్పకుందురో! ౧౯

మ. అనఁ గావ్య మ్మిది, యైనను బ్రహసనప్రాయమ్ము; ప్రారంభ మా
దిగ చివర్ బలుచోటులన్ బొసఁగు నెంతేనిన్ రసాభాస, కో
మలవన్ నాయికచేఁత, దుర్విటుల నిర్మర్యాదవాక్యమ్ము లౌ
ప్పగ దానిన్ వెలయించఁ బండితులు తప్పుల్ దీతురే మోక్షదా? ౨౦

తే. గీ. కవితయన్నపు డెవరి వాగ్రచనయట్లొ
చాని కనుకృతిసేయుటే తగిన ఫణితి;
అంతియేకాని యెల్లెడ ననుగుణపు
శైలి గల్పించు టది యేటిచంద మగునొ!

తే. గీ. మాలపల్లె వర్ణించుచో మహీసురులను
జెప్పుగతి దుర్విటులువాడు తప్పకొంత
లెంతమృదువుగా మార్చినఁ గొంతయైనఁ
బచ్చియుండక మాన దప్పట్లె నిజము.

క. అనరాదుగాని యప్పకవిని "గనులుఁ జనులు మొదలు వేయఁదగని"వం
చనియె; నివి భారతాదులఁ గనుఁగొనెనో, లేవొ శతము గన్పడు నకటా. ౨౩

ఉ. తా నొనరించు కట్టునకుఁ దప్పనపాత్తము లెన్నియెన్నియో
మానుగ లక్ష్యసంగతుల మన్ననచేసి యదేమిపాపమో!
మానెను బోతరాజకవిమండను వాగమృతంబు గ్రోలితే,
కైనను దోసముల్ గలవె యయ్యెడఁ జక్కఁగఁ జూచువారికిన్? ౨౪

ఉ. ఆకును రేఫకున్ జెలిమి రాదని పెద్దవివాద పెంచెఁ; దా
నేకళ నుండి వ్రాసెనొ కవీంద్రుఁడు నన్నయ! కల్పమానినా
రే, కవులొక్కరే? నుభయరేఫలెయవ్వి? నణల్, శసల్, లడల్,
గాక యభేదమీయొకటి కా తగకుండుట? మేలు మేల్! బళీ! ౨౫

శా. శ్రీనాథాదుల లేనిలోపములు వర్ణించెన్, దిలాభేద సం
ధానంబున్ దెగఁద్రెంచె దిద్ది, యదిగన్నన్ నప్పరే! శాబ్దికుల్,
తా నేయేయవి లేవనెన్ దనకు నంతర్వాణులౌ సత్కవీ
శానుల్ వాడిరి; విస్తరించుటకు శాస్త్రంబెట్లు వీ లియ్యెడన్.

క. ఎఱిఁగి ప్రయోగించినదో, యెఱుఁగనిదో తెలియవలయు; నిచ్చో నలవ్యా
కరణపు భాష్యములో వ్రాసిరి చీవాట్లిడిరి లక్ష్యసిద్ధి దెలుపుదమన్. ౨౬

క. ఎన్నెన్నిపాత్తములు కవు లెన్నెన్ని విధాలఁ జెప్పి రెన్నెన్ని విశే
షోన్నతు లయ్యెడఁ గన్పడు, నన్నియుఁ దెలియంగ శక్యమా, యొక్కనికిన్?

తే. గీ. వాదిదౌర్బల్యమేకాని లేదు వాద
దుర్బలత్వము, లక్ష్యముల్ దొరకవనుట
బొత్తిగాఁదప్పు, తెలుఁగున బొంకిరిట్లు,
సంస్కృతమ్మున నింతగా సాగదాటు.

ఉ. ఇంతకుఁ బోతరాజకవి యీతఁడు వాఁ డపశబ్దమైత్రి దానిచే
నింత లిఖింపఁగావలసె నిందుకుఁ దిమ్మకవీంద్రుఁ డేమి, సు
స్వాంతులు తక్కు లాక్షణికు లందఱు నేమి, యెదిర్చి యక్కటా
గాంతికిఁ దెచ్చి; రప్పకవి కాదను మాత్రములోనఁ బోయెనే. ౩౦

మ. యతియో ప్రాసయొ తప్పఁ జేరికిని రాదా? దానఁ బాండిత్యవి
స్తృతికిన్ లోపమె? భ్రాంతి పండితులకే, "యేవార్థమప్యవ్యయ"
స్మృతి పూర్వోక్తి దలంపఁ, డెంచఱును దా మీపూర్వపుం బొత్తముల్
మతిమన్ముఖ్యులు దిద్దకే కలిగెఁ బ్రామాణ్యమ్ము, యోజింపుఁడీ. ౩౧

ఉ. వారికి నిచ్చవచ్చుగతి వారును వారును దిద్దరేని యా
భారతమాదిగాఁ దెలుఁగు బాసను సంస్కృతమందు నొక్కటే
దారినిబోవు పాఠములు, దానికిఁ గారణమేమి? యిష్టము
దారిరచనాలయమ్ములను దప్పుల కుప్పలు కొన్ని చొప్పడున్. ౩౨

వ. అని శిష్టాచారచ్ఛలమ్మున నూత్నప్రాయమ్ముగ నించుక చర్చించి యొక్కెడఁ గార్యవశమ్మున బృందావనపురమ్మున కరుగుటయు నయ్యెడ నా బాల్యమిత్రుండును ననాది పవిత్రతర పుచ్ఛావంశసంభూతుండును గానరసకోవిదుండును గవితామాధురీధురీణుండునునగు సీతారామనామకవిప్రధనదతనూజుం డొక్కనాఁడు. 33

ఉ. తానొక 'హార్మనిన్' శ్రుతిసుతారముగాఁ దగుదాని నూని డెం
దానకుఁ బ్రీతి గొల్పుగతిఁ దానముఁ బల్కఁగఁ జేయుచున్ మఱిన్
దానికి వేఱుగానిగతిఁ దంబుర మీటుచుఁ గొంద, జెల్ల "కా
నా" యనుకీర్తిఁ బాడ నది హాయిగ వించు నదేకచిత్తుఁడై. ౩౪

వ. కొండొకసేపు విస్మృతనిఖిలప్రపంచుండనై కాలక్షేపమ్మొనరించి చిఱునవ్వు నవ్వుచు భక్తిపురస్సరమ్ముగా నిట్లనియె. ౩౫

చ. "తిరుపతి వేంకటేశ్వరులు తియ్యనిమాటలతోడ సూరిపా
మరులకు మెచ్చుగాఁ గవిత మంచిగఁ జెప్పెద" రంచు వించు సం
బరపడుచుంటె కాని యొకపాటి ప్రబంధమునైనఁ గైకొనన్
జిరమననుండి యత్నమును జేసియుఁ గానయితిన్ గృతార్థుఁడన్. ౩౬

తే. గీ. ఆత్మకూరున్నృపాలునియట్లు మిమ్ము
నేనుఁగంబారి నెక్కింప నేమొకాని
తక్కుసమ్మాన మొనరింపఁ దగినపాటి
సిరిగలదుసుండు నాకు లచ్చిపతికరుణ. ౩౭

చ. అన విని "నీకొసంగు టొక యబ్బురమే! మఱి విప్రులందు మేల్
ధనమున దాతృతాగరిమఁ దక్కుప్రశంసల నూటనాఁటఁ ద
క్కిన గలరే? నినున్ దొరయు కీర్తిపరుల్; కయికొమ్మవశ్యమున్
మనమున కిష్టమైన కృతి మాన్యతకున్ దగుదాని" నావుడున్. ౩౮

ఉ. ఇప్పటి కెంత లేదనిన నిర్వదికిన్ బయినుండు మీకృతుల్
తప్పకనేయు నాశతవధానపుఁ బద్దెములున్ నృపాళిపై
గుప్పిన పద్యముల్ గలవు కొల్లలు, భాగవతంబు దీనిలో
గొప్పది, దాని నేను మును గోరితి, నీయకపోతి రెందుకో? ౩౯

మ. ఋతువుల్ పర్వతముల్ సముద్రములు నీరేజాకరమ్ముల్ శత
క్రతుముఖ్యామరసంఘముల్ తఱచుగాఁ గబ్బమ్ములం దల్లెడన్
శ్రుతులన్ దన్పుచునుంటఁజేసి యిఁక నేఁ జోద్యమ్ముగా నూత్నపుం
గృతి నిర్మింపఁగఁ గోరెదన్ నయమునన్ శృంగారమున్ మీఱఁగన్. ౪౦

చ. మనుజున కెద్దియో యొకతె మానినియుండుట యొప్పునో? కుల
మ్మున కనుకూలమైన విరిఁబోణియె యంచొక నేమమో? యిటన్
మనమున నెంచిచూడ నెట మంచి యిహమ్ముఁ బరమ్ము వాయదో?
వినవలె దీనికెంతయును వీలగుగాథ రచింపుఁ డొప్పుగన్. ౪౧

వ. అని సకర్పూరతాంబూలమ్ము వెట్టి యంబరాద్యర్పణమ్ముల సంతుష్టిగావించు
టయు నలరి యతని డెందమ్ము చందమ్ము గుఱుతెఱింగియు మఱింత విశదీక
రింపఁదలంచి యతనిన్ గూర్చి. ౪౨

ఉ. పాణిగృహీతి యందుఱు వివాహితయైన సతిన్, దనంతఁ దాఁ
బాణిగ్రహించి యుంచుకొను సానిసతొత్తును శాబ్దికాగ్రణుల్
పాణిగృహీత యందు రొక వర్ణమునందునెకాక యెన్నియో
పాణిగృహీతికిన్ గలవు పాణిగృహీతకునున్ బ్రభేదముల్. ౪౩

ఉ. దున్నయు నేనుఁగున్ సరిగఁ దూఁగునె? యంచయుఁ గొంగ యొందునే
నెన్నఁడుగాని సాటిగనునే? మఱియొక్కఁడి కెక్కు, డక్కటా!
వన్నెయు వాసియున్ సుపథవర్తనమున్ జెలువారు భార్యకున్
మున్నటికంపుఁ బొత్తునకు మూఢు లెఱుంగఁగ లేరహో! విటుల్. ౪౪

వ. అన నతం డిట్లను.

చ. విటులకు బుద్ధివచ్చుగతి వేశ్యలకున్ దలవంపుగా విశం
కటపదగుంభనమ్ములను గాక కడున్ సులభంపుశైలి నొ
క్కటి రచియింపుఁడీ కృతిని గైకొనఁ జిన్నటనాఁటనుండి మి
క్కుటముగ నన్ను నెక్కొలుపుకోరిక లిప్పటి కీరికల్ గనన్. ౪౫

వ. అనుటయు.

ఉ. ఇందుకు గ్రంథజాలము లనేకము లున్నవి; దుష్ప్రవర్తనం
బందుఁ బురాకృతంపు సుకృతాతిశయమ్మునఁ గాలువెట్టకే
డెందము తక్కియుండవలె డెప్పరమై యటుగాక తక్కినన్
విందుమె? యెందు నేనియును వెన్కకుఁ దీయఁగఁ జేయుకబ్బముల్. ౪౬

చ. సుకృతపుబుద్ధి మాలఁబడు, సుందరియే గురువంచుఁ దోఁచు, దు
ష్కృతులె యాగమమ్ములగు, జావళులే నయబోధకమ్ములౌ
నకటకటా! యొకానొకని కగ్గలమై తగు జవ్వనమ్మునం,
దొకనికి బుద్ధిమార్పడక యుండుఁ బురాకృతపుణ్యసంపదన్. ౪౭

వ. అయినను పాటించువార లసదని నీతి బోధింప మానఁదగదుగాన నీ మనోరథంబు చొప్పున నట్లన చెప్పెదమని యంగీకరించి యాచారమ్ము కతనఁ గృతికర్త యగు నతని వంశమ్మొకింత వర్ణించెదము. ౪౮

బ్రహ్మముఖోత్పన్నంబై యెక్కుడు ప్రశస్తి కెక్కు నాదిమవర్ణంబునం దొక యవాంతరశాఖయగు వెలనాటి వంగడమ్మునందు గౌతమసగోత్రమ్మున పుచ్చానామకవంశమ్మున ననేకులు మహామహులు లుద్భవించి యశమును గాంచి మించిరి. అందుఁ గాలక్రమమ్మున విశ్వనాథభొట్లను ధన్యుం డుదయించె, నియ్యనఘునికి విశ్వేశ్వరసోమయాజులు జనించి యఖండపండితుఁడై ప్రశస్తి నందుటయేకాక దంతులూరను నొక యగ్రహారంబు సంపాదించె. ఈమహనీయు కొమరుండు లక్ష్మీనారాయణశాస్త్రి. ఈతనికి వెంకటసోమయాజియు, విశ్వేశ్వరసోమయాజియు, సీతారామసోమయాజియు, లక్ష్మీపతిసోమయాజియు, కామేశ్వరసోమయాజియునను నేగురు సార్థకనాము లుదయించిరి. అందుఁ గనిష్ఠునకు సీతారామశాస్త్రి, రామయ్య, రాజయ్య అను సుతత్రితయ మావిర్భవించె. వీరిలో రామయ్యకుఁ బూర్ణయ్య, లక్ష్మీనారాయణ, కృష్ణయ్య, శ్రీరాములు, విశ్వనాథమనను నేగురు సుతు లుదయించిరి. ఈయైదుగురును సుప్రసిద్ధులేయైనను నిందు ద్వితీయుండగు లక్ష్మీనారాయణాహ్వయుండు స్వార్జితాఖండసంపత్సంపన్నుండును నిరతాన్నదాన నిరతుండును మహావదాన్యుండునునై మిగుల యశమునందె, ఈయన్నదాతయే బెజవాడలో సత్రముంచిన పరోపకారి. ఈతని యన్నదానమహాత్త్వముంగూర్చి యేమి యితరయోగ్యతలను గూర్చియేమి యెంతయైనను వ్రాయవలసియే యుండును. ఈతఁడనపత్యుం డగుకతనఁ దన పిన్నతమ్ముఁడగు శ్రీరామునికుమారుని దత్తుఁగాఁ బిన్నఁటినాఁడ కైకొనియె. ఆతని పేరు సీతారామయ్య, యీయనకుఁ గన్నతల్లి జోగాంబ, పెంపుడుతల్లి లక్ష్మాంబ, ధర్మపత్ని లక్ష్మీదేవి, వీరలందఱును సద్గుణసంపన్నలు. ఈవంశము వేదవేదాంగాది విద్యలకు నాకరమనియుఁ దద్విహితకర్మానుష్ఠానమునకుఁ గుదురనియు నిందలి మహాపురుషుల నామములే కొన్ని సహస్రముఖముల వాక్రుచ్చుటంజేసి యీవిషయమును మరల విస్తరించుట పునరుక్తియని యీజోలికిఁబోక యీయన్వయమునందెల్ల నెక్కుడు త్యాగభోగరాయుఁడని లోకులచే నెన్నఁబడు సీతారామాహ్వయుండీకృతికి నధినేతకావున నా రసికునకు నభ్యుదయపరంపరాభివృద్ధిగా మాయొనర్పఁ బూనిన పాణిగృహీతయను కల్పిత ప్రబంధమ్మునకుఁ గథాక్రమంబు.

—:0:—

# కథారంభము.

—:o:—

ఉ. పత్తన మొక్కఁ డొప్పు “హరిపావనమూర్తి వెలిఁగె లోకసం
పత్తులకెల్ల నొక్కయెడఁ బద్మభవుం డిరవొందఁ జేయఁగాఁ
జిత్తమునన్ దలంచి యిది చేసె నిజ” మ్మని యెల్ల పండితీ
వేత్తలు ప్రస్తుతింప నరవిందసమాఖ్యఁ బరిమళించుచున్. ౪౯

మ. నదికిం దాపట చుట్టుపట్టులను నానందమ్ము పుట్టించు చె
ల్వొదవన్ వృత్తులు తోఁటలొప్పునఁట, వాయుప్రేరణన్ సౌరభా
భ్యుదయం బెప్పటికప్పు డుండునఁట, యే యుద్యోగము న్లేక సౌ
ఖ్యదశన్ జీవనమయ్యెడన్ గలవఁ టన్యం బట్టి దొం డుండునే? ౫౦

ఆ. వె. లచ్చి యెల్లవేళలను సంపుఁ గాఁపుర
మ్ముండుకతన దాని కొదవునట్టి
సేవ సార్థకంబుఁ జెంపునఁదగి నేతి
బీజకార్యకీర్తి నీరసిలక. ౫౧

తే. గీ. వెండికొండల మారిరి వెల్లదీవ
లవిధమున మల్లెప్రూలరాశి వడువునను
సంటలసుధామహోల్లసత్సౌధపటలి
కనులపండువు సేయు నక్కోటకసీమ.

మ. కనకమ్మున్నను లోష్టమన్న సరిగాఁ గన్గొంచు నన్యాంగనన్
జననిం గాఁ దలపోయుచున్ నిగమవిశ్వాసమ్ము పోనీక నె
మ్మన మెల్లప్డు విరాగమంద యిడి ధర్మప్రక్రియన్ బోల్చి తా
మనసూయాపరులౌట నత్రులునుమీ! యాపోలి విప్రోత్తముల్. ౫౨

చ. అరిమదభంజనమ్మునను యాగ్రహ, మాగ్రహ మబ్బినప్పుడున్
శరణమువారిఁ బ్రోచుట యశమ్మను జ్ఞానపు మేలిగుర్తు, సం
సరణ మసారమం చెఱుక, క్షత్రియజాతికిఁ దెట్టిపొమ్ము ల
ప్పురమున, నేల సౌఖ్యమయి పోవు నిహమ్ముఁ బరమ్ము వారికిన్. ౫౩

తే. గీ. సాధుసజ్జన నామముల్ సంతరించి
నట్టి తమపూర్వ పురుషుల యశము చూచి

వ. సంతానము లేకయుండుట యిహలోకానందమునకే కొఱంతఁగలిగించుఁగాని పరమునకించుకయు భంగకము గానేరదు. "అపుత్రస్య గతిర్నాస్తి" యని కేవలకర్మఠులు చెప్పుదురే కాని యద్దాని జ్ఞానులొప్పరు.

తే.గీ. ముక్తినందెడి వానికి ముఖ్యమొక్క-
జ్ఞానమగుఁ గాని యితరము గాదు; దాని
నెనయలేకుండు నొకపాటి హీననరుల
కియ్యదియు నొక్క తెరువని యెఱుఁగు మబల!

సీ. భీష్మున కెందఱుబిడ్డలు పుట్టిరి? శుకయోగి కెందఱు సుతులు పొడమి?
రల యాంజనేయున కాత్మజులెందఱు? గణపతి కేపాటి కాన్పుగలదు?
వైవారలందఱు పడిరె దుర్గతుల? సంతానముగల్గు నెందఱు మనుష్యు
లిపుడు పిశాచాదిహీనజన్మముల నెత్తుటలే దింతదేల? పుత్రుఁ

తే.గీ. డెంతయును యోగ్యుఁడగునేని యిహమునందుఁ
దమకుఁ బరిచర్య సలుపుట దక్కఁ బరము
నందొకింతయుఁ గాఁడు సహాయుఁ డొక్క-
యెడల నగునందువేని నీవిదియు వినుము. ౭౩

వ. పుత్రునివలన ముక్తి కలుగునని చెప్పెడి పురాణములే వారు పదితెఱంగులనియు నందు దత్తుండును బరగతికి సాధనమగుననియు ఘోషించుచున్నయవి కావున

క. సాయన్నకు సుతులెందఱొ శ్రీయుతులున్నారు మొన్న చిన్నసుతుఁడొకం
డాయుర్భాగ్యసమన్వితుఁడై యుద్భవమందె వాని నగుఁ గైకొనఁగన్. ౭౪

వ. ఉదారుండను పేరున నొప్పు వానికిప్పుడు వయస్సు మూఁడు నెలలగుటయుఁ గర్మవశమ్మునఁ దలిదండ్రు లిరువురు గతించుటయు నీవెఱుఁగనిది కాదుగదా! అట్టి శిశువుఁ బోషించుటయె మనకు నిహపరలోకమ్ములకు సాధనంబగునప్పు డవ్వానికి మన సకలసంపత్తునుంగూడ నొసంగుట యెట్టి సుకృతం బొనఁగూర్పనేరదు? మఱియు నొక్క విశేషంబు గల దాకర్ణింపుము.

చ. కనుఁగవతీరు నెమ్మొగము కాంతియుఁ జెక్కులసౌరు నాసయొ
ప్పును నళికంబు చందమును ముద్దులుగుల్కెడి లేఁతనవ్వు పొ
ల్పును వెడఁదైన పేరురము ప్రోడిమియున్ మిసిమిన్ జెలంగు మే
నును గన వానిఁ బ్రాకృతజనుండనఁ బోల దొకించుకేనియున్. ౭౫

ఆ. వె. "ఎచట రూపమబ్బు నచటనె గొనములు
సంభవించు' ననుచు శాస్త్రవిదులు
పల్కుచుందు రింకఁ బనిలేదు యోజింప
దాని స్వీకరింపవలయు ననుచు"

చ. పతిఁగని యిట్లుపల్కె నలపావని "యోయనఘాత్మ! మీర లా
సతియిడినప్పుడే యదియు నాకును సమ్మతమైన నింటిలో
గతికిన దోసముల్ గలవు పీడఁడులై యొకసారికి వాటిచే
సతమును గుందుచున్న మనుజన్ముల నెందఱఁ జూడ మిద్ధరన్. ౭౯

చ. కలిగినవాఁడు యోగ్యుఁడగుఁ గాక యయోగ్యుఁడె యౌనుగాక తా
మలుగరు తల్లిదండ్రు, లతఁ డాడిన చాటుఁగ సాగఁజేతు ర
న్యుల నిసువన్న భేదమొకఁ డుండుటచే మఱియెంతమంచియో
కలిగినమీఁదనైనఁ దమ కానుపునన్ బలెఁ జూడరెవ్వరున్. ౮౦

చ అమలినబుద్ధితోడఁ దను సత్యనురాగము మీఱఁ జూచినన్
గ్రమముగ దత్తువాఁడొకఁడు గన్పడఁ డేనతినేని యేరిలో
పమునను భేదమబ్బుట ధ్రువం, బటుగావున దత్తపుత్త్రశో
కమునకు నగ్గలం బగుటకన్నను వేఱొకవెట్టి యున్నదే. ౮౧

ఉ. వాఁడొకవేళ దత్తనను వానితలోదరి యత్త దేగతిన్
గూడెడిసౌఖ్య? మెట్టులొనఁగూడెడి? సంసరణమ్ము, లేనిచో
లేఁడనువంతయొక్కటియె లేదితరం, బిటులైన సంస్కృతుల్
పాడగుఁ బెల్లుగల్గెడి వివాదలు ప్లీడరు లబ్బి యార్వఁగన్. ౮౨

తే. గీ. ఎందఱు జమీనుదారులు హీనులైరి
యెంద అగ్రహారస్థులు కుందువొంది
రెందఱు ధనాఢ్యులియ్యెడ నింపుచెడిరి
గాన దత్తుని గొనుట దుఃఖంపుఁ జెరువు. ౮౩

మ. కులవిభ్రంశకు లెందు, ముండల ముటాకోరుల్, స్వకర్మస్థితుల్
దెలియన్ జాలని మాటుబాసమొఱగుల్, శిక్షించుచున్నారు ప్ర
త్రులు కాలస్థితిఁబట్టి, యిట్టి వెడఁగుందొకమ్ముతో నేమి? వీ
రలు సేవల్ బొనరింతురో! మఱి గయాశ్రాద్ధమ్ములన్ జేతురో!

ఉ. ఈకలికాలమందు "సుతులే పరసాధన" మంచు నెంచు వా
రేకడు మూర్ఖచిత్తు, లదియేమొకొ యెవ్వని నోటఁజూచినన్
వాకు "మతేల తద్దినము? వైదికకర్మము లెందు?" కంచు నే
సోఁకు; నెవండొ యొక్కరుఁడు చూడఁబడున్ శుచియున్ మహాత్ముఁడున్.

చ. పితరులసద్గతిన్ గుఱిచి పెంపుకొనం దగునెవ్వఁడని చేఁ
టి తులంక పాలకుల్ సలుపు తీవ్రల నేదుత్తరమ్ము పెట్టుటల్
గతిచెడి ఘోరమైన నరకమ్మునఁ గూలుట నిక్కువంబు, సం
తతికిఫలమ్ము వోవుతతి దాపరమయ్యె నిఁకేటి సద్గతుల్" ౧౬

చ. ఆన నతఁ డిట్లుపల్కె "నెప్పుడైనను గొందఱు యోగ్యులన్యరీ
తిని మతికొంద ఉందు టది ధీరహితం బెప్పుడందు నెక్కుడై
కననగు దుష్టపద్ధతులు, కాఁదగు కార్యము కాకతీఱ దె
వ్వని వశమా యుగానుగతి వచ్చెడి చెట్టపనమ్ము నాఁగఁగన్. ౧౭

తే. గీ. ఇంతెసందియమేల? యేనెప్పుడును మన కిప
లమ్మునం జెన్నియేని గరమ్ము లాశిమోఁ
గాని నేఁటి కన్యాస్వర్గ మొక్కఁడును బట్టి
నట్టుపిన నిప్పుడిట్లేఁలయగునె, చెప్పుమ? ౧౮

చ. మనుజుఁడు మంచికార్యమును మానుగఁజేసెడి పట్ల హానిప
చ్చు ననుచు జంకఁగూడ; దొకచో నయినన్ జెడుకార్యమౌని బా
న నగును మే లటంచును మనంబిడ రా "దిది శాస్త్రసోదిరం"
బని మన మాచరింపుదము హాని యిటన్ సముకూర దింతయున్." ౧౯

క. అని పలువిధములఁ బోధించిన నామెయు నొప్పె నంతఁ జిన్నిశిశువుఁ నై
కొని తల్లిదండ్రులై పెంచ్చిన ప్రేమను మీఱఁ బెద్దఁజేసిరి, కడఁకన్. ౨౦

తే. గీ. ఎనిమిదవయేఁడు దాఁటకమును పె యుపన
యనము గావించి బ్రాహ్మణజనములకును
నిత్యముచు గావలసినంత నిగమభాగ
మభ్యసింపఁగఁ జేసి రయ్యాత్మజాతు. ౨౧

తే. గీ. అగ్నికార్యమ్ము సల్పు సంధ్యనొగివార్చు
బడిబిఁజని లౌకిక పుపేర్త్యఁ బఠనసేఁయుఁ

"పెంచుకొన్నను నిటువంటి పిల్లవాఁడు
దొరకఁడె" యంచుఁ దన్ను నెల్లరు నుతింప. ౯౨

క. ఆకారము, నైశ్వర్యము, శ్రీ కలయును నొక్కరూపు చెందఁ గరణిన్
లోకోత్తర గుణగణముల కాకరమై పొల్చు నయ్యువకుం డెందున్. ౯౩

ఉ. పెద్దలయందు భక్తి మఱి పిన్నలయం దనురక్తి నేమమున్
సుద్దులయందు సక్తి వెడసోయగమందు విరక్తి యెంతయున్
హద్దు నతిక్రమించు కృతులందు నశక్తియుఁ గల్గి యెందునున్
ముద్దుసుతారపున్ గొనపు మూలధనంబయి యాతఁ డొప్పెడున్. ౯౪

ఉ. అంత వయస్సువచ్చుటయు నాకృతికిన్ సమమైనదాని ర
వ్వంతయు నేని లోటు నొకయందును లేని సుశీల బంధుతా
క్రాంతఁ గులాభిజాత ననఘుమ్మగు లగ్నమునన్ వివాహమున్
సంతసమొప్పఁ జేసిరి పసందని యెల్లరుఁ జూచి మెచ్చఁగన్. ౯౫

ఉ. నాఁటి సదస్యపున్ దినమునన్ వెల హెచ్చగు నేలుజోడులున్
నూటపదాఱులున్ మఱియు నూతనవస్త్రములున్ వరాలు నే
పాటికలాఢ్యుఁడేనియును బంచె సుధారుచి తండ్రి, ద్రవ్యమున్
గోటులు నేర్చఁగాక బుధకోటికి నీగతి నీయవచ్చునే. ౯౬

ఉ. ఆపయిఁ గొంతకాలమున కాసతికిన్ వయసంకురింప నా
యేపున నిర్వురన్ గలిపి యింపులు సొంపులుఁగుల్క దంపతుల్
గాఁపుర మాచరించుగతి గాంచి కుతూహల మంది "వీరికిన్
బూఁపలు గల్గఁగా వలయుఁబో!" యని నెమ్మది నెంచుచుండఁగన్. ౯౭

మ. తనకుం గాలము చేరువౌటయును నాతం డంత నాత్మీయమా
ఘనపుణ్యమ్మున నాత్మనామధరు లోకంబైన కైలాసమున్
గన నేగన్ దదనంతరంబునను దత్కాలోచితంబుల్ క్రియ
మ్మునఁ గావించి యుదారుఁ డెంతయును సొమ్మున్ వెచ్చఁబెట్టెన్ వెసన్. ౯౮

చ. పిదప నొకింతకాలము వివేకులు మెచ్చెడి సత్ప్రవర్తనం
బొదవఁగఁ "దండ్రికన్న నితఁ డొక్కట లోఁగఁ" డటన్న ఖ్యాతికిన్
గుదురయి తల్లిగారి కనుకూలుఁడునై సతికిం గుతూహలా
స్పదుఁడయి జాగరూకుఁడయి సంస్కృతిఁ జిక్కఁగఁబట్టె నొప్పఁగన్. ౯౯

సీ. అగ్రహారమునుండి యరుదెంచు రైతులఁ గని వారి కష్టసుఖమ్ము లడుగు
నడిగి వారలు సెప్ప నాయాయి సంగతుల్ విని శిస్తులోఁ గొంత విడిచిపెట్టుఁ
బెట్టి యింకను గనిపెట్టఁగావలసినఁ బెట్టుబడికిఁ గొంత విత్తమిచ్చు
నిచ్చి యయ్యెయ్యె పంట వచ్చు కారున నొండొరులను బంపక తాన యాఢి నరుగు

తే. గీ. సరిగి దాదాపు భూము లేమైన నమ్మ
కమునకరుదేరఁ దప్పక క్రియమొనర్చు
నిచ్చు నార్జించుసకలమ్ము "నిపనికన్న
జాగరూకులు లే" రని జనులు మెచ్చ. ౧౦౦

తే. గీ. ఎవ్వరెవరికిఁ దండ్రి యేయేవిధమున
వార్షికములిచ్చుఁదాఁ బ్రతివత్సరంబు
మఱియు నెవ్వరి నేరీతి మనుచు నితఁడు
నంతకెక్కుడుగాఁ జూచు నన్నియెడల. ౧౦౧

మ. వ్యవహారమ్మును జక్కఁబెట్టుకొను, భృత్యవ్రాతమున్ బ్రోచు, న
భ్యవహారమ్మొనరింపఁ డెన్నఁడును దేవార్చావిహీనమ్ముగా
సవముల్ సేసెడివారికిచ్చు, మఱియున్ సత్రమ్ములంగల్గు లో
పవిధుల్ దీర్చుఁ, బురాణమున్ విను మదప్రాగ్భారదూరాత్ముఁడై. ౧౦౨

శా. "ఐశ్వర్యమ్మధికమ్ము గల్గియును గర్వాంధత్వమున్ లేక యీ
విశ్వమ్మెల్ల నుతింపమున్ బ్రవరుఁ డావిర్భూతసత్కీర్తియై
శశ్వత్కర్మవిధాతయై నెగడెఁ దత్స్వామ్యమ్ము దారుండు దా
విశ్వాసమ్మునఁ గైకొనంగలఁడు" నా వేత్తృత్వపర్యాప్తుఁడై. ౧౦౩

చ. మెలఁగెడి యయ్యుదారునకు మేటిగఁ జిన్నతనమ్మునుండి యిం
పులు గులుకంగఁ బాడునెడఁ బూరుషులైన వెలందులైన మి
క్కిలిగను నాదరించు టది కేవలమున్ సహజప్రచారమై
యలవడి యంతకంత కది యంతునుబంతును లేక వర్ధిలెన్. ౧౦౪

సీ. "బెంగుళూరున నుండు భీమసానికి మార్త వీణలో నెంతేని జాణ" యనుచు
"మచిలీపురమునఁ బెమ్మాసానిమనుమరా లభినయమ్మునఁ గడునధిక" యనుచుఁ
"గర్నూలిలోన వెంకాసాని చెలియలు సాహిత్యమున మేటిచతుర" యనుచు
"బళ్ళారిలోనఁ బాపాసాని చదరంగమున జూదమునఁ బేరుగనిన" దనుచు.

శ్రీ మత్పర దేవతాయై నమః

# పాణిగృహీత

## ద్వితీయాశ్వాసము



శ్రీ పుచ్ఛ్రకులదీపక!
కోపాదికదూర! గానకోవిద! సుయశః
పాలక! దాతృత్వగుణ
శ్రీపాత్ర! నిత్యసదయ! సీతారామా!

తే.గీ. ఆ నరేంద్రు మనంతరం బంత సకల
కుసుమసంపత్తులకు మేలికొల్వై యగుచుఁ
బసగలుగు సంపదల సాటి పంట యగును
నల వసంత మెల్లయెడల వసంతాగమమ్ము.

శా. అక్కాలమ్మున నాతఁ డెయ్యదియు కార్యం బుండుటం బట్టి తా
నక్కార్యమ్మును దల్లికిం దెలిపి యా యంగీకృతిం బొంది యె
ప్డక్కాఁ బాయని ముద్దరాలిఁ దనభార్యన్ మేల్మినొప్పించి తా
నొక్కండున్ జనె భాగధేయపుర మత్యుత్సాహపర్యాప్తుఁ డై.

ఉ. ఆపురిలోన నాటకము లాడెడిశాలలు పెక్కులుంటఁ దా
నేపని కేగె నట్టిపని యెల్లను దీరినమీఁద నైనఁ బో
వోపక నాటకమ్ములను నొప్పుగఁ జూచుచు గానపుం జవుల్
శాపురె! యంచు మెచ్చుచును బాడెడివారలఁ గూడియాడుచున్ ౪

మ. తనయూరన్ దనయిల్లు వాకిలియు నాత్మద్రవ్యసంపత్తియున్
దనయిల్లాలిని దల్లినిన్ దనదు భృత్యవ్రాతమున్ జిత్తమం
దున నైనన్ దలపోయ కెల్లపుడు సంతోషప్రపంచంబైన గీ
తనినాదామృతవార్ధిలో మునిఁగి యూఁదన్ జొచ్చె నత్యంతమున్. ౫

విందుమో, కందుమో! వీనివిధము నేఁట
రేపటను, డాఁగునే? లంజెకాఁపురములు."

వ. అనుచుఁ బరిసంగించుకొను చుందురఁట. ఇది యిట్లుండ,

చ. "నిను మదిఁగోరి యుంటి నిదినిక్కము నమ్ము" మటంచు నెన్నియో
తనమదికోరికల్ మృదుపదమ్ములతోడ లిఖించి యంతలో
నన తెలివొంది "యేకాలము నాతికి నియ్యది గొప్పతప్పు, గా
నను జెడఁబుట్టి రిక్కాలమునంగల యంగన లిట్టిపట్టునన్. ౧౨

ఉ. నా కితఁడే పసుండయిన నాకొలపుం గొనముల్ త్యజించి యీ
పోకడలెల్లఁ బోకడచి పూవిలుకాని ఋణమ్ము దీర్చుచున్
రాకలు పోఁకలున్ మఱచి రాణిగఁ దద్గృహమంద యుందు నీ
చాకలి మంగలిన్ దనుపు చావునకున్ దుది గల్గఁజేయుచున్." ౧౩

ఉ. ఈగతి నుల్కనట్టి తరళేక్షణయున్, మది నుల్కి యాతనిన్
లోఁగొను నట్టిమార్గమును లోఁ దలపోయని చారుగాత్రియున్,
సాగ దటంచుఁ జింతిలని చానయు నొక్కతెయేని లేదఁ టే
రాగము లేనిమాను లనురాగము గాంచరె? యొక్కపట్టునన్. ౧౪

ఉ. అం దొకసుందరాంగి జలజాక్షి యనన్ జనువన్నెలాఁడి తా
నెందు స్వవిద్యలందుఁ గడు నెన్నిక గాంచిన యెమ్మెలాఁడి వా
నిం దనవీథి నేగుతఱి నిక్కకనుంగొని లోఁగొనంగ నెం
చెం దననీచజన్మ మది శ్రేష్ఠత కాకరమై చెలంగఁగన్. ౧౫

తే.గీ. ఎంచి తనమదిలోన యోజించి తనకుఁ
దగిన మేటి యుపాయ మొదవమి జాణ
గానఁ దనకెంతయును వశుఁడైనయొక్క
విటునితో మంతనమునఁగా నిటులుపలికె.

ఉ. కన్నెఱికమ్ము గాకనును కామ మొకించుక లేనియప్పుడే
పిన్నతనమ్మునన్ మిగులఁ బెంకెతన మ్మలరారునన్ను లోఁ
గొన్న విటాగ్రగణ్యుఁడవు కోటు లొసంగియు నాఋణమ్ము నీ
వెన్నఁడు దీర్పనేర, విటు లెవ్వరైతె నిన్ను గణించఁరె? జెప్పుమీ. ౧౬

క. నగలా! నాణెములా! యే నగలాఁడికి నైనఁగాని వలపు నిలుచునే?
మగనాలికన్న హీనవె? నగరే నను నాకొలమ్మునం గలకన్నెల్? ౧౮

ఉ. చిన్నటనాఁట నన్నుఁగొని పెంచినతల్లి ఋణమ్ము దీర్చితో!
కన్నెఱికమ్మునాఁడు నొకకాసును గొంకకఁ గట్టినేర్చితో!
పన్నెలుఁ జిన్నెలున్ గలుగ వచ్చెనె భాగ్యము? తేఁకాఁడ! ని
న్నెన్నఁ బనేమి? నాదుమననే కడుమెత్తని వెన్నిభంగులన్. ౧౯

ఉ. తల్లియుఁ దల్లితల్లియును దజ్జనయిత్రియు నెన్నికొంపలో
గుల్లలుచేసి గుట్టు లిడికొన్న ధన మ్మది యెల్ల నల్లముం
బెల్లముగాక నీకతన మెల్లఁగ డొల్లఁగఁజొచ్చె; నింతకున్
దల్లికిఁగాని పోకిళ్ళులఁ దాఁ జను గోచెలి పేరుదెచ్చెనే! ౨౦

శా. "అమ్మా! ఱంకుమగండు వీపుమను దా నావంతయున్ మల్పఁడే
నమ్మంబోకుము రాజునైన నొరు నైనంగాని నీచేతిలో
సొమ్ముం బెట్టిననాఁడు దక్క మొగమున్ జూపెట్టఁడో" యంచు నే
ర్పె మ్మాయల్ చెవి నిల్లు గట్టుకొని పోరన్ దల్లి నిన్నాపఁగన్. ౨౧

ఉ. అయిన నదేమొ నీ వనిన నావల వేలకువేలు వచ్చినన్
గాని వృథాప్రయాస మిటఁ గన్పడినన్ మన మింద చచ్చుఁ, బో
నీ నెల కొక్కరూపికయు నీ విడనెంచ విఁకెన్నినాళ్లు ని
న్నాని చరింతుఁ? దల్లియును నున్నకుటుంబముఁ దిట్టిపోయఁగన్. ౨౨

ఉ. ఈపురిలోని మాకులమునింతులయం దొకవిద్దెఁ గాదుసూ:
రూపమునందు నేరుపున రూఢిగనా కెనయైన చాన నీ
వే పరికింపు మందఱును వేలకువేలు ధనమ్ము గూర్చి రే
నే పదవైతి నీకతన, నీవును రావిఁకఁ గొన్నినాళ్లకున్.

తే.గీ. జనని నానంద మొనరింపఁ జాలనైతిఁ
గొలమువారలలోఁ బెద్దకూళ నైతి
బేలనై సరివారలఁ బోలనైతి
నేల వేయును? నీకె యిల్లాలనైతి.

చ. ఇతరకులమ్మునం బొడమునింతులఁ జిన్నటినాఁడ తెచ్చి పెం
చి తగిన విద్దె బుద్ధియును జెప్పియు నొంటికజాతిపుర్వ్య ఖ్యం

కృతుల నభుల్ స్వజాతి నలరించినభంగిని సానిఁ జేయ నా
సతి తమ కత్తె జెంతయును సానులకున్ దలవంపు నింపుచున్. ౨౭

చ. అనుచు నొకప్పుడున్ వినని యప్పలుకుల్ చెవి సోఁకినంత న
వ్వనితకు రాసుఁడైన విటపల్లభుఁ డల్లన గుండె జల్లనన్
గన లుదయింప నాఁచికొని కా దని యౌ నని పల్కలేక లో
ననుకొనె నిట్లు "ఛీ! పడపుటంగన లిట్టిర యేరికేనియున్. ౨౮

చ. ననుఁ గనికాని భోజన మొకప్పుడు న న్వినికాని యస్వాపున్
విన దొకవేళ్ నైన నను వీడి యెఱుంగదు గర్వ మన్న చూ
టన వినరాదు దీనిహృదయం బిపు డెంతటిదోన మాటె, "రో
వనితల చేర్మి కల్ల" యనువార్త లసత్యము లెట్టులౌ భువిన్?

చ. జనని యొనర్చు బోధములచందము వాఁ దలకెక్కి యుండునా?
తన చెలికత్తియల్ సలుపుతంత్రము లాత్మఁ గలంచి యుండునా?
ననుఁ దలదాఁటు నింక నొకనాయకునిన్ వరియించి యుండునా?
కనికర మింతలేక యిటు కాఱులు ప్రేలుట కేమి హేతువో! ౨౯

చ. తన పసిప్రాయమందు విటు దైవముగాఁ గనునవ్వెలందియే
చనఁ జన మోటువాటి యొకచందమునన్ గనుఁ, జుల్కఁజూచు, లొం
గిన కొలఁదిన్ మఱింత పణఁకించుచు, సేవకుకన్న హీనుఁగాఁ
గను నిది తుచ్ఛజాతులకుఁగాక మఱొక్కటఁ గల్గ నేర్చునే" ౩౦

వ. అని యచ్చెలి నుద్దేశించి.

తే.గీ. అడిగినను వచ్చు ద్రవ్యమ్ము లడుగకున్న
రాకపోవునె? మర్యాద రాదుగాని
మగున! "యేడ్చినదానికి మగఁడువచ్చి
యేకులాడికిన దానికి రాకపోఁడు."

తే.గీ. మొదలఁ దా నెంతచేసినఁ దుదకునొక్క
మాటతో నదియెల్లను మట్టుపడును
వినవె? యీసామెతను నీవు వనజనయన!
"నూఱునోములు అంకెతోఁ దీఱిపోవె" ౩౧

ఉ. ధన మనుమాట వేశ్యయనుదానికిఁ దోడన నీడపోలె సుం
డినయదియే నయంబుగ గడింపవలెన్ సమయమ్ము చూచి, యా
నినయపు డావు పాలిడదె? నీటి నొసంగదె వర్ష కాలమం
దున జలదమ్ము? లింత మదిఁ దోఁచని దానికిఁ జెప్పనేటికిన్? ౩౬

క. అన జలజాక్షియు మోమున నునునగవు వెలుంగ "నో యనుఁగుఁ బోఁడంగా!
నిను ఘన మిమ్మనుటకు వెఱ్ఱినె! యొకఁ డెఱుఁగఁడె? యిది యెఱిఁగింపు మెఱుఁగన్.

వ. ఇట్టిపట్టునఁ గృష్ణునకు నొక గొల్లచేడియ చెప్పిన సమాధానమ్ము గల దాకర్ణింపుము.

మ. జనన మ్మాదిగఁ బొట్టనించితివిగా చౌర్యమ్మె కార్యమ్ముగా!
ధన మొక్కింతయు నీయకే పరిజనతీదాంపత్యముల్ గొన్న నీ
జననంబుల్ పదికోటు లీఋణము దీర్చన్నేర్చునే? యట్టి నీ
కును నేమున్నది? యేమొసంగెద? వహో! గోపాలచూడామణీ." ౩౭

వ. అని యాజలజాక్షి యతనిన్ గొంతబుజ్జగించి మఱియును.

మత్తకోకిల. "గాన మన్ మిషచేతఁ గొందఱఁ గన్నెలన్ వలపించి యా
పైని నాట్యమటంచుఁ గొందఱు బాలలన్ గికురించియున్
సూనబాణకళాప్రవీణతఁ జూపి కొందఱఁ బ్రోడలన్
మానభంగ మొనర్చు నీవును మా కొసంగెడి దేమిటో! ౩౮

ఉ. కావున నిన్ను నేను ధనకాంక్షమెయిన్ జిననాఁటనుండియున్
బూనిలుకానిముచ్చటలఁ బొందఁగలే దిది నిక్కువంబు, నే
నేవిధమైన జన్మ మిది యెంతకు నుండునొ యంతవట్టు నీ
తో విడకుండుటే నిజము తొంబదివిఘ్నము లిందు వచ్చినన్. ౩౯

క. మనచెలిమికి భంగ మ్మెందును గల్గకయుండునట్టి త్రోవను ద్రవ్యం
బును నార్జింపఁగవలె; నేమన, ద్రవ్యము లేమి నెట్టులగుఁ బోషణముల్?

ఆ.వె. "కూరుచుండి తినిన గుబ్బగోపురములు
నాటు"; నెన్నినాళ్లకగును నింట
నున్నద్రవ్య? మింక నొండొక్క సదుపాయ
మెద్దియేనిఁ జూచుటే హితంబు. ౪౦

క. ధన మెంత నీవొసంగినఁగొన, నది యేమంటివేని, నూఁఘమ్మగు వ
ర్తనగల్గు బ్రియునిపై మన మెనసిననగతి నుంచుకొనిన నెనయుదు వింటే.

ఉ. ఎంతధన మ్మొసంగినను నెన్నినగల్ మెయినిండ నైచినన్
గాంతుఁ డొకండు వేఱొకఁడు గావలె నిష్టుఁడు రోవెలంది కీ
యింతుల మర్మకర్మము లొకింత యెఱుంగ రహో! జమీనుదా
ర్లంతిపురమ్ములం బెడుదు రందును షానపు మాత్రపవర్తనల్. ౪౨

తే.గీ. అభినయమటంచునో గానమనియొ వైద్య
మనియొ మఱియెద్దియోనెపు యనువుపఱచి
తనకుఁ బ్రియుఁడగువాని నంతఃపురమున
కశ్రమమ్మున రప్పింతు రబ్జముఖులు. ౪౩

క. అది యేమికర్మమో! తొంబదిలక్ష లొసంగనేని మదనుండేనిన్
గుదురదు మన మికాంతల కద నెఱిఁగినయట్టి విటునియందుం బోలెన్.

మ. ఇదియే నిక్కముగాకయున్న విను మీ వీయూర నేకాదు తొం
బదియూళ్లన్ గనుఁగొమ్ము ద్రవ్యమహితుల్ మాజాతి పూఁబోణులన్
బదిల మ్మాగతి నుంచుకొంటయును నప్పద్మాక్షు లింకొక్కనిన్
గదికిన్ దూతిక నంపి తెచ్చుకొనుటే గన్పట్టు నీ కెల్లెడన్. ౪౫

ఉ. కొందఱువెఱ్ఱు లయ్యెడలఁ గొండొకనూనిసి ద్వారమందుఁ గా
పుం దగుజీత మిచ్చి యిడిపోదురు; వాని కొకింత యిచ్చినన్
జందనగంధికిన్ విటునిఁ జయ్యన వాఁ డొనఁగూర్చుఁ; గొన్నిచో
ట్లం దగ వాఁడె యా విటుఁడు; లంజెలనైజము లెన్న నేటికిన్. ౪౬

ఉ. నమ్మవుగాని నీకు నొకనాఁటి చమత్కృతి చెప్పెదాన మా
యిమ్మున కావలన్ గల మృగేక్షణ నాథుఁడు శయ్య నుండఁగా
నమ్మక చెల్ల! యింకొకని నచ్చటనే రతిఁ దేల్చె; నిప్రివోఁ
డమ్మహితుండు దీపముఁను నాఱదు కాంతల కెంత లిప్పనుల్. ౪౭

చ. ఒక వెలచానలేయనుచు నూహయొనర్పకు స్త్రీలజాతికే
సుకరము మాయ, యందు వెలనుందరు లిందులకై జనించుటన్
బ్రకటనకెక్కనేనియును బాధయు నంతగలేమిఁ జేతు రి
ట్టి కుటిలకృత్యముల్ విటు నటింపఁగఁ జేతురు కీలుబొమ్మగన్. ౪౮

ఉ. నావుడు నాతఁ డిట్టులను నాతిరొ! పిన్నటినాఁటనుండి మా
రోపెలయుల్ పొసరు పలురోఁతలు నేసు నెఱుంగవాఁడ నీ
వేవిధి బోధచేసెదవొ యేర్పడఁ జెప్పఁగ దిక్కు మాగతం
బౌ పల, నద్ది యెట్టిదియునైనఁ బొనర్చెద శంకఁ బాప్పుచున్." ౪౯

క. అన జలజాక్షియు మఱముసఁ దనకోరిక నెల్లనని ముదం బందుచు నే
ర్పున నిట్టులనియె దాని గనన నేమిటి నప్పాప్పి బ్రిపెన్ బరేఁ! ౫౦

చ. "అరసితిఁగాదె! నీ వలపుఁ దాపస, నాతఁడు మేటిసంపదన్
ధరణిపునంతవాఁడఁట! యుదారత నామమె చెప్పఁచుండ నొం
డొరులు వచింపనేల? యతఁ డొక్కఁకనాఁ డొకనాతియింటి కే
గి రహిని గానమున్ వినెనే కీలిని నీవు నెఱుంగ కుందువే. ౫౧

తే. గీ. ఇప్పటికి దేనియందు నయ్యెమ్మె కాని
మది లగింపమి నిక్కవం బదియు నొక్క
నిముసమున నేను లోఁగొందు నీకు నాకుఁ
దగినదిక్కయ్యుమ్మ నాక్షింతు దానఁజేసి. ౫౨

క. కావున నాతనితోఁ జన వేవిధముననైనఁ జేసి యియ్యెడ కతనిన్
గావింపుము తక్కినపని నీ వేమియుఁ జేయవలదు నేనయెఱుఁగుదున్. ౫౩

ఆ. వె. అతనితగులు గాంచి యామీఁద నీమీఁది
పేర్మి విడుతు నంచు భీతి నీకు
లేశమైన వలదు లేఁ బ్రాయమునఁ దగు
లొక్కన్న వాని విడుచుగోల గలదె!

చ. అతఁ డొకవేళ నన్నుఁ దన యంతిపురమ్మున నుండఁజేసి భృ
త్యతతులఁ గాపుపెట్టినను దప్పక నాదగు నేర్పుకల్మి నీ
కుతుకము నెట్టులేని సమకూర్చెద వేయును నేల? వాని "నా
ప్రీతి" ననిపించెదన్ వలపుఁ బెంచి క్రమమ్ముగ నీదురాకకున్." ౫౫

క. అనవుడు నాతఁడు తనదు వదన మించుకఁ జేసికొనియు ధన విూలేమిన్
దన కది యొగితికిన్ నక్కనఁ గక్కదలించు నెంచి కీ లెఱిఁగి యొగిన్. ౫౬

ఆ. వె. అది యకృత్యమగుట వాత్మ నెఱింగియు
దానివలనఁ గలుగు తగులు త్రిప్ప

క. దూరపుఁ గొండలు నునుపను తీరౌ మఱియేమొ యూసతికి నక్షీణయనం
దేరాములు సరిదారని, పేరు గలదు దానికపటుఁ బెద్దగా నపుడుఁ. ౬౬

క. విని వెదకఁ బోవు తీవియ దన కాళ్లకుఁ దగిలిన ట్లతఁడు సంతోష
మ్మును గని "యది యొక్కటెయే చను నీ పురిలోని సానివాళికిఁ దొడవై.

తే.గీ. అందమునకిక్క పరిపూదలందు నిక్క
యక్షిణయపురిదివి వశివయనసమునకిని
గానమునవీణ మేల్కపనానజాణ
సంపదకుమేటి దాని కేచాన సాటి?

క. చిన్నప్పటినుండియు నక్కన్నియ నెఱుఁగుదును నేను కలిక లఁగస్త్రం
జెన్నగు నెమ్మోమున కొక వన్నెయిడుఁ బ్రమదమధుర నవపుర నవల్.

తే.గీ. బాల్యమును మొట్టి మెడఁబట్టి పైటఁగొట్టి
యౌవనము రా భయమ్మున ననఁగఁ జెలికి
చనులు చంకలదూరెను గనులు చెవుల
దూరె నడుము నెటుకేగెనో తోఁచ దహహ!

సీ. మనసువేఱుఁగ నొక్కమాఱు చూచిన గండశిలలుకైనను గుండెజల జనించుఁ
జనవుమీఱఁగ నొక్కసారి ముట్టిన సుక్కుకంబాలకును బులకలు పొసంగుఁ
గులుకుచు నొకసారి పలుకరించినఁ బిచ్చివానికైనను గచ్చు వదలిపోవుఁ
బదనుగా నొకమాఱు భావమ్ము సూచింప బమ్మకైనను బుట్టు రిమ్మ తెవులు

తే.గీ. మురువు మురిసిన ముద్దులు మూటఁగట్టుఁ
బలుకు పలికినఁ దేనెలవాన గురియు
నవ్వు నవ్విన నోట రత్నాలు రాలు
కలితలావణ్యపేటి యక్కాముఘోటి. ౭౦

సీ. బిబ్బోకవతి గబ్బిగుబ్బదోయినిఁ జూపె మతిమాలి బతిమాలు యతికి రతికి
ఉడురాజముఖి కంటఁబడి దానిజడఁజూడ జడదారి పెడదారిఁ జనఁగఁ దిప్పు
కన్నెమిన్న బెడంగు కన్నుసన్నలుగన్నఁ గన్నవాఁడును దాల్మి సున్నఁజేయుఁ
గల్కి ముద్దులుగుల్కు చిల్కపల్కులకుక్కి సల్కరింపఁగఁ జూచుఁ గల్కురైన

తే.గీ. నొంటిపాటునఁ జెలి కడనుండె నేని
దత్తరమ్మున వేదాంతి మెత్తఁబడును

లేనిపోనిపని గల్పించుక యింటిచుట్టును బడి తిరుగాడి చనెడివారు
అంగీకరింప లేదనెడి కోపముచేత గోడకుఁ గాకితాల్ గొట్టువారు

తే.గీ. ఇంటిపై జెడ్డలను జైచి యేగువారు
గొట్టవలెనంచు లోలోన గొణుగువారు
నై తునకు దానిపొందుఁ బామంపలేక
విసివి వదలిరి యాజోలి వీటవిటులు. ౭౯

మ. ఎవనిన్ ధన్యునిఁ జేయనున్నదియొ, తానెవ్వాని తారుణ్యమున్
గవిపర్ణ్యం బొసరింపనున్నదియొ, యే కాంతాశిరోరత్నమున్
సవతాలై యుడికింపనున్నదియొ, యేసారజ్ఞు సంసారసా
రవిహీనత్వము వాపనున్నదియొ! నేరంబోల దూహింపఁగన్." ౮౦

క. అనవుడుఁ "దాదృశగుణగణ ఖనిఁ గనుఁగొనుటయును గొంత గణనీయమె నీ
వెనువెంట నెప్పుడేనియుఁ జనుదెంచెదఁ దెల్పు తగిన సమయ" మ్మనుడున్. ౮౧

క. "కనుఁగొని తెల్పెద" నని యా జనఘంచకుఁ దరిగె; దాని చక్కఁదనము నె
మ్మనమున నాటుకతన నూతసమాంద్య మ్మయ్యెదారు దరి కరుడెంచెన్. ౮౨

క. దానియిలు సేరిన ట్లద్దానిన్ గనుఁగొనినయట్లు దానిచతురతన్
దా నోడినట్లు మనమున దానింగను దానినెంచు దాని నుతించున్. ౮౩

తే. గీ. మునుపు వినినప్పుడే కొంత మొలకగనిన
వాని యనురాగవృత్తి ఖివ్వానికతన
నిపుడు తిరిగియు వింటచే నెదిగి వింత
సరణి నొక్కింత శాఖోపశాఖ లలమె. ౮౪

వ. అట్టియెడ నింతకుమున్న జలజాక్షి గుఱించి ప్రశంసించిన పంచకునకు నొక్కింత
శతుర్వగు మతియొక్క వితుం డిట్లను. ౮౫

తే. గీ. "ఎవనితో నెవ్వఁడేనిఁ దన్నించుకంత
యడుగకున్నప్పు మంచియే యగును గాక
చెట్టయగుఁగాక తనయంతఁ జెప్పఁదొడఁగ
వానికన్నను వేలయెం డైనఁ గలఁడె?

క. అయినను మీ శ్రేయస్సు ప్రధానముగాఁ గోరి మీదుతలఁ బెక్కుంగా
నా నేర్చినంతలో మీ కేనొక సంగతిని జెప్ప నెంచితినిజూఁడీ. ౭౬

క. విటవర్తనలోఁ జిన్నప్పటినుండియుఁ దిరిగి దానఁ బడుపాటుల నొ
క్కటియును దక్కక యెఱిఁగిన పటుమతి నని సన్నెఱుంగవలయును మీరల్.

క. వినవలనేకులు గల రా విధవలలో నధమురాయైన వేశ్యఁ దగులు దు
ర్వ్యసనము గలవాఁడె మొదలిటి విధవ మదీయానుభవము విని చెదఁజూండీ!. ౭౮

క. ప్రేమ మొకించుక లేకయె కామముగల వనితవలెనె కాసునకై తా
నోమునుతునైనఁ గూడెడి సామాన్యం గూడువాని జన్మము ఘనమే! ౮౦

తే. గీ. ఇహపరమ్ములనెఱుఁగని హీనమతులు
కష్టసుఖముల నెఱుఁగని కఠినమతులు
మానమర్యాదలెఱుఁగని మందమతులు
తక్క వెలవెలఁదుల పొందు దలఁపరెందు.

ఉ. దండుగద్రోహమూది నిజధర్మములున్ విడనాడి భోగపున్
ముండలతోడఁ బోవుటకు బుద్ధిని ప్రేరణ చేయుచున్న యా
రండలకొడ్కు దానికి సరాసరిగా ధనమీయకున్న బ్ర
హ్మాండము మున్గిపోయినటు లాపయి నేడ్చును సర్వశూన్యుఁడై.

ఆ. వె. ఉండఁ గొంపలేక, పండఁ బానుపులేక
ముండకిచ్చుటకును ముడుపు లేక
మొండితనముపూని దండివార మటంచు
బండవిటులు దిరుగుచుండఁ గనమె!

శా. వేసారుల్ పచరించినన్ మనము తృప్తిం జెందఁగాఁ బోదు, ప్ర
త్యాసమ్ముల్ ప్రబలించు, బుద్ధి చెడు, నాయాసమ్ము మెండౌను, వి
శ్వాసమ్మున్ జెడిపోవుఁ, గోప మొదవున్, వాంఛల్ తుదల్ ముట్ట; వీ
స్త్రీసాంగత్యముకన్నఁ బాడుపని వేఱేలేదు చర్చింపఁగన్ ౮౪

శా. వైకుంఠమ్మయి శంభులోకమయి దేవజ్యేష్ఠునావాసమై
నాకంబై నరలోకమై నరకమై నానాఁటికిం దోఁచు నీ

రాకాచంద్రముఖీ సమాగమసుఖంబ్రాక్షైతరుల్ వోలె న
శ్లోకుల్ పండితులుంబ్రభమింతు రిది యిత్థంపాప్రియ మూహింపఁగన్. ౯౫

తే. గీ. మొదల సంసారమే కడుమోహమయము
గాన దానికి మొప్ప రఖండమతులు
దానిలో లంజెపలని యంద్రైన సుఖము
చెప్పనా! శత్రువనకును నీచేటు పలుకు.

క. తలిదండ్రులు మోదింతురొ! కులమునను బ్రతిష్ఠగలదొ? కులకామిని లో
వలపుటు గాంచదొ? యేమిటఁ గలుగుఁన్ సౌఖ్యమ్ము లంజెకాఁపురమందుఁన్?

క. తనువుచెడు మానమడఁగుఁన్ ధనముడుగుఁన్ శుచికిఁ దనకు దవ్వగుఁ బాన
మ్మును నబ్బు జూద మెనయుఁన్ ధనకాంతలు నేర్పునట్టి తప్పులు గలవే? ౯౬

క. 'మనతలన పుట్టెనే? యిప్పుడు' అని యొకవేళ మీరు ప్రశ్నింతురు, కై
కొనపలె నటులేనియుఁ దాఁ దనకన్నన్ జిన్నదానిఁ దగియెడిదానిన్.

క. "వచ్చియు రాని కుచమ్ములు వచ్చియు రానట్టి ముద్దుబాలుర పలుకుల్
హెచ్చగు మోదమునిచ్చును" నచ్చును రసికులకు నవియె నవనవగతిమన్.

క. ఒఱఁగిన చనుఁగవ గలిగిన తరుణిం గవగూడుకన్నఁ దఱచై కడుఁ గ్రి
క్కిరిసిన చనుఁగవ గలిగిన తరుణుల పదతాడనము శతగుణము మెఱుఁగౌ.

ఉ. గిల్లినఁ బాలుగారు కలికిన్ గవఁగూడిన సౌఖ్యమబ్బుఁ గా
కెల్ల విటాగ్రగణ్యులును నెత్తరకత్తెల చేసినట్టి యా
యల్లరిబోటిఁ గూడ సుఖ మబ్బునె! మాటలతేట దక్క మీ
యుల్లమునందుఁ జూచికొనుఁ డూరకవాఁగెడివాఁడఁ గాఁజుఁడీ. ౧౦౨

ఉ. పున్నమనాఁటి చందురుని పోఁడిమి మంచిది గా దటంచు నే
నెన్నఁడుగాని తక్కనిక నేమన, వద్ది క్రమక్రమమ్ముగా
నన్నగిలుఁన్; ద్వితీయ నగు చందురుఁ డన్నఁ! గ్రమక్రమమ్ముగా
నున్నతి చెందు భేద మిదియొక్కటి ప్రౌఢమను న్నవోఢమన్. ౧౦౩

తే.గీ. అందులో మీర లెద్దానిపొందు సేయ
నెంచుచుంటిరో యదియు మాకిడుగాదు

దానికిం గూర్చి వాఁడిట్లు దారి వేసె
బోటి యద్ది యిక్ష్వాకులనాఁటి పనుర! ౧౦౪

తే.గీ. ఇపుడు మీతోడఁ జెప్పిన యీపరిబుద్ధుఁ
డెలమి నివ్వన్నెలాఁడికి స[illegible]పుమగఁడు
పేరుగుఱ్ఱిచ్చుంగ నేల? యీయూర దీనిఁ
జూడకున్నట్టివార లెచ్చోట లేరు. ౧౦౫

క. ధనవాంఛ లేకయే యివ్వనితామణి యీఁడు వచ్చువఱకే విటులన్
గని పిల్చి కూడఁజొచ్చెను దన కౌలమున కన్నెలెల్లఁ దను నవ్వంగన్. ౧౦౬

ఆ.వె. "మాఱుమనువు దానిఁ జేరంగఁదీసిన
మొదటిమగని సోదె మొదలుపెట్టె"
నన్నరీతి నిది రసాభాస మందును
నెక్కుడనుచు మీర లెఱుఁగవలయు. ౧౦౭

క. చాతుర్మాస్యములలో యతులే తీరున బోంకెదరొ యదే తీరున వే
శ్యాతరుణులు వయసు గడుపన్ దాఁతురు తలక్రిందుచూడఁదగు నట నిటలన్.

ఆ.వె. తనకుఁ బెద్దయైన తరుణితోఁ గూడుట
యీయమ వణఁగఁజేయు టట్టులుండ
"దాని కేటి వినితగు! లేడకే!" డంచు
నగుదు రెల్లవారు నగడుచేసి. ౧౦౯

తే.గీ. కడఁగి "కడవంత గుమ్మడికాయ కత్తి
పీఁటకగు లోఁకువ" ని యట్టి బోటి నొప్పు
టొప్పిదం బేనియును దీని నొప్పఁబోకుఁ
డింతకన్నను జపలురా లెందు లేదు." ౧౧౦

క. అన నతఁ డిట్లను "నేమములును గలవే! చెప్పవచ్చు లోఁబడియుండి యు
జ్జనములు దొరకరు; వేశ్యా జనులకుఁ గలదోసఁగు లితరజనులకు లేవే? ౧౧౧

తే.గీ. దేనియందైన ననుభూతి దీఱుపిదప
దాని నిరసించువాఁడంత జ్ఞానిగాఁడు
మొట్టమొదటనె నిరసించు నట్టివాని
నెన్నఁగాఁదగు [illegible] నున్న జగతి. ౧౧౨

క. అనిపలికె నాతఁ డంతటఁ గనియె నుదారుఁ డెలుఁగెత్తఁ జర్చించె “నోకం
డనుమోదించిన వస్తువు జనుఁ డింకొకఁ డొప్పఁ డిదియు సహజం బెందున్.

క. చందురుకాంతిం గని లో నెంచటు సంతోష మంద రెవ్వోడలను? దా
మందురె పంకజములు? జగమందెవ్వరికిన్ ముద మొసఁగునది లేదెందున్. ౧౧౪

ఉ. దాని పరిష్కరింపఁ గుఱిచి తప్పియు నాతఁడు సచ్చఁ జెప్ప న
ప్పేనదుసైన నయ్యతివ యేలికొనన్ గమకింప దన్న మా
టే నిజ, మక్కతమ్మునన యీతని కాతరుణీపతంసమం
దూనె ననూయ నిక్కమది; యెక్కఁడు చెప్పెడిబుద్ధి లోప్పనే? ౧౧౫

ఆ.వె. దాని వినినదాది తన్మయంబయి చిత్త
వృత్తి విస్మృతాన్యవృత్తి యయ్యెఁ
గనిన యప్పు డేమి గానున్నదో
బుద్ధి కర్మ మనుసరించుఁ గాదె! యెందు.

సీ. కాంతలతోఁ బొందఁ గారాదు నిక్కమా! యటులైన నేల పెండ్లాడవలయు?
అన్యకాంతలఁ గూడు టనుచితంబందుమా! యటులైన నదియుఁ గా దన్యకాంత
నెలయాండ్రఁ జెల్మి తప్పదమానటందుమా! యటులైన వీండ్రెందు కపనియందు?
సత్కులీనులకు నాచారంబు గా దందుమా! యింతలోన నేమాఁ గులమ్ము?

తే.గీ. కలియుగమ్మున నీరీతి కట్టుబాటు
గాని మున్ను శకుంతల గాదె? వేశ్య
యామెఁ గొన్న దుష్యంతున కందునిందు
నేమి లోపమ్ము గల్గె? నిందేటిశంక?

చ. పలువురు నొక్కచేడియనుఁ బొల్పడు టొప్పదుగాని నేమమున్
వెలసెడి యిట్టియుగ్మలిని వీధిమొగమ్ము గనంగ నీక తాఁ
గులసతిఁబోలె నుంచుకొనఁగూడదె? దీన మ తేమిలోపమౌఁ?
గలిమికి నెందునున్ ఫలముగావె, మహోన్నతభోగభాగ్యముల్?

ఉ. భోగమునందు నిచ్చలను బొందనివా రిల లేరు; దానికిన్
త్యాగము ముఖ్య, మందులకు ద్రవ్యము గావలె; దానిలేమి న
త్యాగమవేత్త లీనుతము నందఁగలేక స్వరీతి నెల్లరన్
భోగవిహీనులన్ సలుపఁ బొత్తము లీక్రియవారిని రీనునన్. ౧౧౬

క. ఒకని ధనహాటుచేఁ బరపికచాంభోజాక్షి యెనయువిధ మది దోసం
బిఁక సకలజనులకును బా నొకగతి ధనమగుట వేశ్య నొందందగదే. ౧౨౦

క. ధననాశన తనునాశన ఘనతానాశనము లిందుఁ గలుగుట ధ్రువమై
నను నెల్లరకును నయ్యావి పనుపడు ననరాదు భాగ్యవశమగుకతనన్.

తే.గీ. ఎందుఁ జేసినయుఁ గందియ వెనయకుండ
మనుజుఁడు పవిత్రతనమ్మును గొనఁగఁజాలయుఁ
గాని దీర్ఘయోజన కొఱగాదు "సంశ
యాత్మనశియించు" నని పెద్ద లండ్రుగాదె.

ఉ. సారవిహీనమైన భవసాగరమందుఁ గురంగలోచనల్
సారము, తెల్వితేటలును జాణతనమ్మును నందుముఖ్య, మీ
తీరు స్వతంత్రలైన సుదతీమణులందుఁ బొసంగు, వాం ఛ్రిహా!
జారిణులంచు మానుకొనఁ జాతురి యింకెటుఁ జూడఁ గల్గెడిన్.

ఆ.వె. దొసఁగు లెన్నియేనిఁ బొసఁగుఁగా కెందును
గలుఁ గానవిద్య కన్న లేదు;
అంగనాజనమ్మునందు రూపాజీవ
కన్న మనము దనుపుకన్నె నున్న.

ఉ. అదియునుఁ గాక వస్తుగుణ మారయ నెంచిన దేనికెందు నె
య్యాది సహజంబొ దానిఁ గనఁబోనటు, వేఱొకచోట నించుమిం
చు దనకు నట్టిసంగతియె చొప్పడినన్ సహజప్రచారమై
యొదవమిఁ దెచ్చిపెట్టినటు లుండకమాన ద దెన్ని భంగులన్. ౧౨౫

క. అనునిఁబోడను రసాలము తో మఱియొక ఋతువునందుఁ దొడరునదియ తా
నానాసురభుల నిడ జేగను హా! సుహి నది మేనమామపోలిక యగుటన్." ౧౨౬

క. ఇటు పలువిధముల యోజిం
పుట కారంభించునంత మొట్టమొదటి య
వ్వెటుఁ దేగుదెంచి "యటకే
గుటరే" పని చెప్పుటయు రగుల్కొనుకోర్కెన్

తే. గీ. అందులకె సిద్ధమైయుంట నతఁడు "షల్లా"
యనియె; నంతట మఱునాఁడు నపుగుడించె
నర్మసఖుతోడఁగూడి యన్నాతిమిన్న
సదనమునకేగె నభినయాసక్తి నతఁడు. ౧౫

గద్య.

ఇది శ్రీ... తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బైన పాణిగృహీతయందు
ద్వితీయాశ్వాసము.



# పాణిగృహీత

## తృతీయాశ్వాసము



స రసతరరుచిరగీత
స్వరసాఁదర! లక్ష్మణాగ్రజన్మగృహీతా!
గురుతరభాగ్యసమేతా!
చిరకీర్తిపార్త్తికామ! సీతారామా!

తే. గీ. [illegible]రింపు మనంతరం బాలతాంగి
యెప్పుడును గనుమాయక యొసక మొసఁగు
తనదు దేహమ్ము గేహమ్ముఁ దదధికమగు
సొంపుగులుక నలంకృతుల్ చేసిపి పిదప. ౨

క. తత్తదుపాంగమ్ముల నత్యుత్తమగతి నలవరించి యొక్కయెడఁ దదా
యత్తమ్మగు చిత్తమ్మున నత్తరుణి గవాక్షనిహితమగు చూపాలయన్. ౩

తే. గీ. ఎదురుచూచుచు నున్నంత నిరవురచటి
కేగి రేగుటయును దరుణేందువదన
దవ్వులన కాంచి కేళీసదనములోని
కంతలోఁ జనె సిగ్గున్న యబలవోలె. ౪

తే. గీ. అయ్యుదారుని నొక యుచితాసనమున
నుండఁగాఁజేసి నర్మసఖుండు లోని
కరిగి "యిదియేమిపాపమో యబల! యతని
దీసికొనివచ్చినప్పు డీతీరు తగునె?" ౫

వ. అన నా టక్కరికరిగమన యతని కిట్లను.

ఉ. దూరమునందు నున్నయెడఁ దోయజనేత్రల కెంతయేని హా
గ్గోరణి యుప్పతిల్లు మదిఁ గొంకొకయించుకయుఁ జనింప దా
ధీరతయుఁ గభీరయుఁ దెంపుసు దెంపును డగ్గరైన య
ప్పూరుషునాము గన్గొనికఁ బోవు వడెంపటి పోవడేనియుఁ. ౬

క. నమ్మెదవో, లేదో! యాతని నెమ్మొగముం గనినయంత నే మదిలో నొ
క్కొమ్మడిగ లజ్జవొడమెఁ జిమ్మిన నవి పదలి చనదు చేపడగలుటన్. ౭

క పసితనమునుండి నన్నుఁ గుసుమశరవిహారములఁ బసుల్కొల్పిన నీ
దు సమీపమ్మున నితరుని దెస మొగమెటు త్రిప్పి నిలువఁ దేఁకువగలుగున్. ౮

క. పలువురు ప్రియురాండ్రొక్కట గలసభఁ బురుషుండు నిలువఁగలఁ డపరసముఁ
దొలఁగింపదు; కామిను లటు నిలుచుటకుఁ దగరు రసము నీరసము నగున్. ౯

వ. అను నక్కలికి ప్రసంగమ్మున కడ్డుగా నతం డిట్లను.

క. "అతఁ డచట నే నిచట నుంట తగదు నే నెఱుఁగనట్టి టక్కరితనమా?
యతివ! యిది, సిగ్గు మీజాతి తరుణులకు నున్న యింత తెల్లం బెన్నన్." ౧౦

తే. గీ. అని యతండడుగుటయు నయ్యతివమిన్న
యల్లనల్లన వారుండునట్టియెడకు
నరిగి యటఁ గంబ మొక్కింత యడ్డుగాఁగఁ
నోరగానిల్చి కాంచుచునుండునంత. ౧౧

క. తనమది నద్దానినిఁ గనుఁగొను వేడ్కపడటంచుఁ గోర్కె గుబ్బతిలఁగఁ జిం
తనసేయు నయ్యుదారుఁడు వనితవేడంగంతఁగాంచి వహ్వారె! యనుచున్. ౧౨

తే. గీ. మెచ్చి "యిచ్చపలాక్షి నామేడనుంచ
నేర్చితినయేని నాకు వన్నెయును వాసి
కలుగు జవ్వన మిది సార్థకత్వమందుఁ
గలిమిగలుగుటకును నుంతగలుగు ఫలము. ౧౩

క. తగు కాంతతోడఁబొందుఁ దగులని మనుజునకునైన ధనధాన్యమ్ముల్
సొగసును జాణతనమ్మును భగవద్వంచితము లధికపాపాస్పదముల్. ౧౪

ఉ. ఈతరుణీమణిన్ గలసి యించుక భేదము లేక యుండఁ దా
నేతరుణుండు కామకల లెప్పుడు చింతనసేయుచున్ అల

గీతవినోదముల్ గనుచుఁ గేవల మోదమయాత్ముఁడై పయః
స్స్ఫతికి సార్థకత్వ మొదవించునొ, వాఁడుగదా! గృతార్థుఁడౌ." ౧౫

క. అని యూహసేయు దానిన్ బునరాలోకన మొనర్చి మఱియు మఱియు న
వ్వనిత కిలసాటి లే దని తనలో నానందమందుఁ దనియు నెడంధన్. ౧౬

తే. గీ. అట్టియెడ నర్మసఖుఁడిట్టు లను "జగాన
నభినయమ్మున నీపాటి యందకత్తె
గానఁగారాదు, గానముఁ గవనశక్తి
దానికిన్ దోడు దీని కేతరుణి లీడు?" ౧౭

క. ఎదుటన్ జెప్పిన నుతియని మది నమ్మదవతికిఁ దోఁచు మాటలిఁకేలా?
గుదిగూర్చె నన్నిసంగతు లిది తావుగ నెంచి ధాత యింపెసలారన్." ౧౮

క. అని జలజాక్షిం గనుఁగొని "ననఁబోఁణిరో! సిగ్గు వారనాతికిఁ దగునే?
కనుఁగొన వచ్చినవారల మన మెక్కున్ మెలఁగకుంట మరియాదటవే? ౧౯

క. సిగ్గుగల వారకాంతయు సిగ్గెడలు కులాంగనయును జెడుదురు; నీవీ
యొగ్గెఱుఁగ నేర విదియొక పెగ్గయనుచు గునిసె దిందుఁ బెంపుగలుగునే. ౨౦

తే. గీ. "సగముచచ్చి యంతయుఁజచ్చి జగతి గాన
హాస్యములు నేర్చికొనవలె" నందు రందు
నభినయమ్మును నట్టిద యదియుఁగల్గి
యింత సిగ్గుండఁజనునె? యో యిగురుఁబోఁణి. ౨౧

క. నీ తెలివితేటలకు సంగీతాభినయప్రసక్తికిన్ గైతకుఁ బ్ర
ఖ్యాతిఁ జెడఁగొట్టెఁగద! లోకాతీతంబైన లజ్జ యలవడి యబలా." ౨౨

క. అనుమాటకుఁ బ్రత్యుత్తరమును జెప్పక యంతకన్న మొగ మించుక వం
చి నగుచు నా జలజాక్షి యభినయపుఁ బాండిత్యమెల్ల వెల్లడి చేసెన్. ౨౩

తే. గీ. తెచ్చి పెట్టిన సిగ్గయ్యు ధీర యగుట
సహజనైఖరిఁ గనఁజేసి చలదపాంగ
వీక్షణమ్ముల నొక్కింత వెల్లిగొలుప
నిండుమరులెక్కి యయ్యుదారుండు పలుకు. ౨౪

తే. గీ. "ఏటికిద్దాని నీవలయించె దింక?
నీవు చెప్పిన దంతయు నిక్కమయ్యె;
'పలుకు లంజెలలోఁ బతివ్రతఁ, కులాంగ
నాజనమ్ముల లంజెయు' నాఁగవినమె. ౨౫

తే. గీ. నీవు చెప్పినయట్లన యీసెలంది
యేదియో కారణమ్మున నిక్కాలమునఁ
బోడమోఁగాఁబోలు వయసునఁ బ్రోడయయ్యు
నింతబిడియ మిక్కాలమున నెందుఁగలదె! ౨౬

తే. గీ. అభినయమ్మది చూచినయట్టులయ్యె;
గాన మీరీతి చక్కనికాంతి గలుగు
పలువరుస గలకలుకుల కోలయు టరుదె!
కవన మీరెంటికన్నను గష్టమగునె?" ౨౭

క. అను నాతనిపలుకులు విని తనపై నవ్వానిమనము తగులుట నిక్కం
బని యెంచి యంతలోఁ దీఱని చింత వహించి యిటు కరమునూహించున్. ౨౮

ఉ. చక్కనివాఁడు మేటి సరసమ్మగు వర్తన మొప్పువాఁడు బల్
టక్కరి గానముఖ్యకలలన్ గడు నేర్పరి ద్రవ్యవంతుఁ డ
మ్మక్క! యితండు నాకుఁ బ్రియుఁడౌట పురాకృతపుణ్య, మైనన్
జిక్కనపూర్వపుంబ్రియుని స్నేహము నేగతి మాననేర్చెదన్? ౨౯

క. ఇతనిన్ గాంచిన దాదిగ మఱి నీరై యంతు లేనిమరులున నెరయై
నత మైన చింతఁబడి విస్మృతసకలం బయ్యె ముందు మెలఁగుట యెట్లో! 30

చ. ఇతని పరించి యెల్లపు డహీనసుఖమ్ముల నందుచున్ రమా
న్నతి కధికార మూనినమనమ్మునఁ డన్ దలపెట్టనేని నన్
మతిఁదలపోసియున్ విసివి మాటికి దూఱియుఁ ద్రోవగాన క
చ్చతురుఁడు కాయమున్ విడి యశ . మ్మెటువంటిది నాకుఁ గూర్చునో. 31

మ. ఎపుడో యేమగునో యటంచు మదిలో నెంచంగ నేలా! యితం
డిపుడే తా మొగ మింత చేసికొని యేదేఁ బెద్దయాపత్తు నె
త్తిపయిన్ వ్రాలినయట్లు చింతగొనుచున్ ధీరత్వముం బూనుటన్
గపటానందము పైకిఁ జొప్పడుగతిన్ గన్పట్టుచున్నాఁడహో. 32

సీ. ఏకర్మ మెఱుఁగని యెలప్రాయమున నేను కసరికొట్టి నొకింత విసువఁడయ్యె
నెఱిఁగియు నెఱుఁగని చిఱుతగుబ్బలనాఁటి పరుసదనానకు నెఱుఁగఁడయ్యె
నెట్టకేలకు నాదుగుట్టు కైకొని వృష్ఠ యాడిపోసినదాని కలుగఁడయ్యె
నాకారణమునఁ దనకుటుంబమునఁ గల్గుకలహమ్ములకు భీతి గాంచఁడయ్యె

తే.గీ. నన్నిటికినోర్చి ననుఁబ్రియుగాలొ లేక
దైవమో యనుబుద్ధి నెదందలంచు
చున్నవాని వృథా ద్రవ్యమన్న కార
ణమున విడనాడు నాకు జన్మమును గలదె? 33

తే.గీ. దౌత్యమంగీకరించె నాతనిఁగరంచె
నంతఁబో కియ్యెడకుఁదెచ్చెఁ జింతగలిగి
యును మదుపకారమునకు దాని నెడఁజేసి
యీను దిగఁద్రిమించె నింతవిశ్వాసి గలఁడె? 34

చ. ఇటుపయి నీతనిన్ మఱవకే యొకభంగిని గారవించి య
క్కుటికము చూపి నేను గలకాలము సౌఖ్యము నందఁజేసినన్
గటకట! తానెదన్ మఱచుఁగాక యిదెల్లను గామియాట, నా
కెటు మఱవంగవచ్చు నిది యెన్నిభవమ్ములకైనఁ జాలదే. 35

చ. "తనప్రియుఁ డైనవాఁడఁ టొకొప్పను నాతనియందు లేపఁ డే
పనియు నొనర్చువాఁడఁట! సెబాసు! ధనమ్మున కాస చెంది య
య్యనఘుని నీచకృత్యమున కొప్పదుఁగా నొనరించె నొక్క రో
వనిత" యటన్న దుర్యశమువాయఁగ నాకు నుపాయ మున్నదే. 36

తే.గీ. పెండిలిని నాడకుండిన నుండెఁగాని
వార కామినియైనను వరు నొకాని
కని వరించి తదనుగతిగా మెలంగ
వలయు ననుకట్టుఁబా టుండవలదె జగతి. 37

ఉ. మాలెతకన్న హీన లగుమానవతుల్ వ్యభిచారవృత్తికిన్
జాలక కట్టుఁబాటునకు జంకుచు నొక్కొకనిన్ వరించుచున్
గాలము పుచ్చుచుండ గణికాజనమంతకు నెంతహీనమో!
కూళతనమ్మునన్ బడుచుకొంటకు రోయ దొకించు కేనియున్. 38

తే.గీ. ఒకఁడు వోయినవీఁద వేఱొకనిఁ గట్టి
కొంట యాచార మొకకొన్ని కొలములందు
నందులోనను జేరదీ యధమకులము
ధాత వంచించె నీజాతి తలిరుఁబోఁడ్ల. ౩౯

క. అని తనమనమునఁ జింతిలు వనితామణి సారెసారెఁ; దారక రిపుపురుఁ
దనపన కనుగుణ మగుకీర్తిని డింపం గాంచు కుసుమః మెలఁపుఁ బశమే?

తే.గీ. మగుడు నీగతి నొండొరు మొగముగనుచు
నెడతెగని చింతయను సంద్రి మీఁదు మంపఁ
దరణి యంతట వారికిఁ దరణియగుట
కో యనఁగఁ బశ్చిమాంబుధి డాయఁజనియె. ౪౦

క. అంత మదారుం డచ్చెలి చెంత న్నిలుపోపలేక చేతోజాత
భ్రాంతికి వశుఁడై చనియెడి చింతన్ లేచుటయు నతని చెలికాఁ డనియెన్.

ఉ. “గానమువింటివో కవనకౌశలమున్ దిలకించివారమో
మానమునందుఁ గల్గు నసమానపుఁజాతురి దక్కఁ బంకజా
తానన యించుకే నభినయంపుఁ బ్రసక్తియుఁ జూపదయ్యె మీ
రీ నలినాక్షిపై నలిగి యిక్కరణిన్ జనుటెట్టు లొప్పగున్.” ౪౩

ఉ. నావుడు నాతఁ డిట్టులను “నాదుమనమ్మునఁ గోప మించు నీ
వేవగ నిశ్చయించి తిది యెక్కడిచాతురి? యింతమాత్రనే
యూపగలాఁడి నమ్మెనె? సఖా! యొకవిద్దియఁ గాదు దీని కే
త్రోవల నే లతాంగి సవతుం గనఁజాలు? సెబాసు! వహ్వారే!

క. కనుఁగొనినమాత్రనే మనమున మోహం బుప్పతిల్లె ముమ్మాటికి ని
క్కనకాంగి కింక శ్రీమమిచ్చిన దానంజేసి మనకుఁ జేటగుఁజుమ్మీ. ౪౫

చ. ఇదిమొద లిత్తలోదరికి నెవ్వరియొద్దను విద్దెచూపు నీ
చదరఁ దొలంగఁజేయ సుమచాపుఁడు యత్న మొనర్చెఁగాక! యి
మ్మృదవతి సిగ్గునం దిటులు మన్ననఁ జేయుచునుండుట చూచి యాత్మసం
పద నెగడింపఁజేయు చెలిప్పున నాతఁ డనుగ్రహింపఁడే. ౪౬

తే.గీ. మరలరావచ్చుఁ గనవచ్చుఁ దత్తరమ దేల?

మఱినయం బెందుకొచ్చు? నెంపడఁగుగాన
మగునె యారంభశూరత జగతినెందు." ౪౬

క. నావుడు నర్మసఖుం డప్పూవుంబోఁడిఁగని పల్కెఁ "బాలఁతిరో నీపైఁ
గావలసినంత కోరిక చే వచ్చినవారి నిట్లు సేయం దగునే? ౪౭

క. సుమగాత్రి! వారి మంచితనమున నీలోటు బాగ గనంబడదయ్యెన్
విమలపుటాకులకున్ వేఁడమె? యెఱుఁగవె? యిదియు సానిచంద మ్మగునే?"

మ. అన నచ్చేడియ భూషణధ్వనుల పొల్పవ్వారిగా నల్లఁ గ్రి
క్కునఁ గేళీభవనమ్ము చెంతఁ జని యాకుల్ పోఁకలున్ దక్కఁగ
ల్గిన మేల్వస్తువులుగూర్చి పళ్లెరమునన్ గీల్కొల్పి యొయ్యారమె
ల్లను రూపై చనుదెంచెనో! యనఁగ మెల్లన్ వచ్చి యచ్చేరువన్. ౫౦

తే.గీ. వినయభయసంభ్రమమ్ములు వెల్లిగొనఁగ
నిలువఁబడునంత నద్దాని నీటొకింత
యడ్డులేమిని గనులార నతఁడుగాంచి
నిలువునీరయి యట్లన నిలువఁబడియె.

తే.గీ. అంత నచ్చెలిమిన్న కరాగ్రకీలి
తమ్ములగు నాగవల్లీదళమ్ము లతని
హస్తమునఁనుంచి పళ్లెర మచట డించి
చని యథాస్థానమున నిల్చెఁ జవులుగులుక. ౫౨

ఉ. అంత నుదారుఁ డొక్కగతి నచ్చెలువీడి తదేకచిత్తుఁడై
యింతివిలాసముల్ మనసు నెమ్మెలు పైదలి మేల్హొరంగులున్
గాంత యొయారముల్ కనులఁగట్టిన యట్లెదుట న్నటింప న
క్కాంతుఁడు లేనిమేళ మటఁ గల్పనసేయఁగఁ జూచుచున్ జనెన్. ౫౩

ఆ.వె. చనుచు నర్మసఖుని గని యిట్లువల్కె "నో
చెలిమికాఁడ! జగతిఁ గలుగు పట్ట
ణముల మాపురమ్మునంగల చోద్యముల్
గానరావు వేరొకంట నెందు. ౫౪

చ. అటఁ గులకామినుల్ పడపుటంగ్గనలున్ మతివేసవేలు పి
క్కటముగు రూపమున్ హొయలు కొల్లలుగాఁ గలవారలుండురి హా

కెట నిటువంటిచానఁ గను టెన్నఁడునున్ లక్షియింపదయ్యె; ని
చ్చట భవదీయసంగతివశమ్మున నింతటి భాగ్య మబ్బెఁగా! ౫౫

క. నాతోడ నీవుసెప్పిన యాతరుణీమణిరొ యిది? సఖా! యది గాదో?
యాలీరెక్కడ? నీవను నాతిరెక్కడ, శశాంక మంతరమున్నదా. ౫౬

ఉ. చూడకచూచు నేర్పు వినుచున్ వినకుండెడి నేర్పులమ్మ నా
టాడకయాడు జాణతన మన్నిటికేమి? యెకించుక లోనఁ బో
రాడుట కమ్మనోభవు విటాళిపయిన్ బురికొల్పుపొల్పు పూఁ
బోఁడికి దేనికిన్ గలుగఁబోలదు దీనికిఁ గలుగా ప్పినన్. ౫౭

తే.గీ. గుబ్బలబెడంగు పిఱుఁదుల గొప్పతనము
మేని తళతళలును మోముమిసమిసలును
గలికకైయొనంతమాత్రన గల్గు నిక్క
తముగ మెచ్చితి నం చెదఁ దలఁతు వేమొ. ౫౮

చ. పలుకులు వేయు నేల? పరభామ లనన్ గను విత్తిచూడ; నే
వెలవెలఁదుల్ సుఖమ్ముగను వీనులుచల్లఁగ నెంతపాడినన్
గలఁగదు మానసం; బిచట గానమటుండ మఱొండటుండఁ బ
ల్కులును వినంగలే దకట! కోరికలీరిక లెత్తసేటికిన్? ౫౯

చ. తరము లవెన్నియో జరిగెఁ దాతలతాతలు వారితాతలున్
మఱియును వారితాతలును మాకొలమం దిటువంటి కోర్కెలన్
మరగరు, దానికేమి, కడు మన్ననకెక్కిన పాండితీధురం
ధరు లటువంటివారి కిఁక నాకతనన్ ద్రిదినస్థితుల్ చెడెన్. ౬౦

తే.గీ. ఏమయినఁ దప్పదింక నీయింతిచెలిమి
యయ్యెదియు నీయధీనమై యలరుకతన
నచిరకాలలభ్యంబని యాత్మ నెంతు?
ననుడు నతఁడిట్టులను సుదారునికిఁ బేర్మి. ౬౧

ఉ. చెప్పితిఁగాదె! మున్ రసికశేఖర! యాలలితాంగి చంద, మ
య్యొప్పును గొంత మీ కనుభవోచిత మయ్యెఁగదా! తనంత న
య్యొప్పులకుప్ప యొప్పికొను టొక్కటిదక్క నుపాయ మింతకున్
జొప్పడ దన్య, మేమయిన సుందరి దెంతము చూచి చెప్పెదన్.

చ. ధనమన లెక్క-శే దొరకటు దానికి లోఁగిన వేలసంఖ్య గే
చ్చును, నదియేనిఁ దజ్జనని చూపునకుం భ్రమగొల్పు నేమొ, యా
వ్వనజముఖీలలామమును వంచనసేయఁగ నేయుపాయముం
బనుపడ, దైన యత్నమును మానఁగరా; దెపు డెట్టు లుండునో! ౬౩

చ. నినుఁ గనుఁగొన్న మాత్రముననే వెలచేడెల లెక్క-యేల? యే
వనజముఖీలలామములు వాంఛ యొనర్పక మాననేర్తు? రై
నను నిటు యత్నమేల యన, నాయనుభూతినిఁబట్టి చూడ ని
క్క-నకనిభాంగి యోగినిగఁ గాలముపుచ్చెదనంచుఁ దోఁచెడిన్. ౬౪

ఉ. కాని సమంజస మ్మనుచుఁ గన్పడ దిప్పటి యూహయున్ సదా
గానమునందురక్తి వెలగల్గు నలంకృతులందు సక్తియున్
మానశరప్రచారములఁ జొప్పడు కబ్బములన్ బ్రసక్తి య
చ్చానకు మెండు, తద్విధము చంచలతం గనఁజేయు నియ్యెడన్. ౬౫

తే.గీ. మునిఁగిపోయినదేమి, యమ్మగుడ తల్లి
తోడ మీమది నున్న సంతోస మెలుఁగఁ
జేసి యామీఁద దానికిఁ జెప్పఁజేసి
యేనునుం జెప్పిచూతు నిం దేటిచింత?" ౬౬

ఉ. నావుడు నుత్సుకత్వ మెదనాట నుదారుఁడు పల్కు- "నెప్పుడో
నీ విటు నేతు నన్ను నెటునే నిలుపోపుదు? నేఁటిరేయి నా
కావగలాఁడి, యాయతిగ, యాచెలి, యాచిగురాకుఁబోఁడి, యా
కావరపుం జనుంగవ జొకాటిపుటిక్క-, వశమ్ము గావలెన్. ౬౭

క. రేపేమొ మనమేమొ యాపూవుంబోణియేమొ యన్యమదేమొ
వే పొమ్మిప్పుడ నాసంతాప మ్మెడఁబాపు మింకఁ దడయకు మిచటన్. ౬౮

తే. గీ. చందురుం డర్ధమదయించెఁ జదల వెన్నె
లయును బర్వఁగఁజొచ్చెఁ దొలంగెఁ దమము
మందమారుత మదె చూడు కుందముల ప
రీమళమ్మును వెదఁజల్లెఁ రేఁగె మరుఁడు. ౬౯

ఉ. తల్లికి నేమిచెప్పెదవొ? దానికి నేమని విన్నవించెదో?
పల్లవపాణి [illegible] గృపన్ గలిగించెదొ? నన్నుఁ దన్మనో

వల్లభుఁ జేయు భారమది పైనిడికొ మ్మెటు నీ వొనర్చినన్
జెల్లు నటం చెఱుంగు, మొకచేడియ వానిఁగ నన్ దలంపుమా. ౨౦

చ. కలదు ధన మ్మనంతముగఁ గంటికి మింటికి నంటుమాడుగుల్
గలవు సమస్తముం గలదుగాని యొకించుక లేనివారిలో
పల నొకరుండ నిఁశ్యబలఁ బాణిగృహీతగఁ జేయనేని, నో
ర్కుల కెనగాని సంపదలు కుంకుమలేని కులాంగనామణుల్. ౨౧

ఉ. ఏ నని తా నటించు నొకయించుక భేదము లేకయుంట న
చ్చానకుఁ జెప్పఁగాఁ దగినసంగతు లేమని బోధసేతు నీ
చే నెఱిఁగింపఁగావలయునే? యదిగాక, పురాకృతంపుఁ బు
ణ్యానఁగదా! లభించితివి నాకొకదూతగ నీవు నెచ్చెలీ." ౨౨

చ. అన "నిదె పోయి వత్తు" నని యాతఁడు వెన్కకు నేగె, మీఁద మె
ల్లన బసకేగి మిక్కిలి యలందురి నెమ్మదితోడ భోజనం
బొనరిచి మిత్రిరాఁకకయి యొక్కెడ నొక్కఁడుఁ గూరుచుండి తాఁ
గనుఁగొనుచున్ దుర్ఘటిన్ యుగముగా గణియించుచు మాగు ధూఱుచున్. ౨౩

ఉ. చెప్పఁగరాని వేదనలచే నలచేడియ తాల్మి నెంచి "నీ
గొప్పపిఱుందులున్ వలపుగొల్పెడి మేల్ పలుచాలు లక్ష్యమున్
దప్పని చూపుకోపులును దామరతంపర లైన లీలలున్
ముప్పిరిగొన్న మోహమున ముంచెఁగదే? జగదేకసుందరీ. ౨౪

ఉ. చందురుబాధకే సయిపఁజాలుదునో, మదనాగ్ని కాఁకకే
కందకయుందునో, ప్రియకాలునిజో దలచల్లగాలికే
వందురకుందునో సకలవాంఛలకున్ గుదురైనయున్నన
శ్చందనవల్లి! నీదయిన సంస్మరణాశయొ మ్మానుకొందునో? ౨౫

మ. అకటా! నే నెటు తాళువాఁడ, నట నీవాకంబపుం జాటునన్
వికచాబ్జమ్ము లిరుంగెలంకులను నావిర్భావమున్ జెంద మి
న్నక వీక్షించుచు లజ్జ కొజ్జ వయి యానందింపఁగాఁ జేయఁ నా
పర్కృతిన్ లోనఁ దలంచినంత మది నీరంబౌఁ గురంగేక్షణా! ౨౬

క. అని తన్మయమగు మనమున ఘనతర మగు రాగ మెదిగి [illegible] నతం
డని [illegible] సూహించు నహో! ౨౭

తే. గీ. అట్టు లొకకొంతసేపు మిన్నరసి యచటఁ
గలికి గోరులసొంపు నచ్చెలియమోము
పెంపు నొకకొంత గని యంతఁ బెదవి విఱిచి
నర్మసఖు నాత్మ నెంచి తన్నాయకుండు. ౭౮

మ. "ఇదిగో! వచ్చెద" నంచు నేగి చనఁడేఁ, డేణాక్షి యేరీతి మ
న్మదమున్ గాంచెనొ? యెట్టియుత్తరము నన్నుంగూర్చి తానంపెనో?
యదనున్ వమ్మొనరింప నెంచదుకదా, హా! దైవమా! యిట్టి క
ష్టదశాపాకము మిత్రుఁడొప్పికొనునే, చాతుర్యమున్ జూపఁడే? ౭౯

ఉ. ఎక్కడిమిత్రుఁ! డేనచటి కేతని సంపుట గొప్పతప్ప "తా
నక్కనకాంగి కేతఁడు ప్రియంపడువాఁ"డని వింటిఁగాదె? సీ!
మక్కువ యెంతచేసె! ననుమాన మొకించుకయేనిఁ గాంచ కా
దిక్కున కట్టివాని వెనుదీయక పంపితి నెంత వెఱ్ఱినో! ౮౦

తే. గీ. తెలివితేటలు గలవాఁడు ధీరుఁడితఁడు
చనినచోఁ గార్యసిద్ధియౌ నని తలంపఁ
గాలిపాలి సామెతయొనఁగూడ దాని
నొగి నధమనాయికన్ జేయుచుండె నేమొ! ౮౧

ఉ. "కుంటెనకాఁ డొకింత కొనగోటను నైనను మీట కెందు వా
ల్గంటిని నాయకున్ గలుపఁగా గమకింపఁ" డటంచు మున్ను నే
వింటిని వేయిసార్లు, విధి! వీఁ డిఁక నచ్చెలిమిన్నతోడ నా
యంటును సొంటునుం దెలుప కాడుచుఁ బాడుచుఁ గూడుచుండెఁ బో! ౮౨

గీ. తనదుచిత్తమ్ము నేనియుఁ దగినసొగసు
గలుగుచెలిమిన్నకడ కంపఁ గదలిరాదు;
అట్టిచోఁ గేవలాన్యుల నంపనగునె?
దౌత్యమునకన్న సతిపొందు తప్పిదంబె? ౮౩

క. పురుషుఁడు పురుషుని దరుణియుఁ దరుణిని బంపంగఁదగదు, తరుణి పురుషునిం
బురుషుండు తరుణి దౌత్యము విరచింపఁగఁ బంపుటయ వివేకము తలఁపన్. ౮౪

మ. అని మిత్రుం గడుదూఱుచున్ మనమునం దాలోచనల్ సేయుచున్
వనితన్ లోఁదలఁపోసి యుల్కిపడుచున్ వైరాగ్యముం గాంచుచున్

దన కై తానటకేగ నూహగొనుచుఁ దర్కించుచున్ దాపముఁ
గనుచుఁ గుందుచు నుండునంత హితుఁడుఁ గన్పట్టె దౌదవ్వులఁ ౮౭

క. కని "యతఁడగునో కాఁడో", యనియును "కార్యమ్ము సఫలమయ్యెనొ లేదో"
యనియును "నిష్కారణ మియ్యనఘాత్ముని దూఱితినాఁడ" ననియును వగచుఁ.

తే. గీ. అంత దగ్గఱకేతెంచి "యనఘ! నీదు
పనుపునఁ జని యాశితపల్లినేత్రఁ
గాంచి మెలమెల్ల నీప్రసంగమున డించి
తెలిసికొంటిని మదినున్న తెఱఁగుకొంత. ౮౮

క. అంగీకృతి సూచింప దనంగీకృతి తెలుపదెందు నతివలు లేరే!
రంగైన మిమ్మువంటి భుజంగుల పిలుపంది యుట్టిచందము కలదే! ౮౯

చ. అయినను నాలతాంగిహృదయం బొకకొంత భవత్సమాగమ
ప్రియమని కొన్ని చెయ్వుల నెఱింగితి; నంతఁ దనంత నెమ్మిఁ ద
ద్దయుఁ గఠినాత్మ యయ్యతివతల్లియు నయ్యెడ కేగుదెంచె నా
శయమొకకొంత దెల్ప నది నమ్మతి గన్పడఁజేసి యిట్లనెన్. ౯౦

ఉ. ఏయెడనైన "నీయతివ యెవ్వరిసాని?" యటన్నచో "ఫలా
నా" యని చెప్పికోఁదగిన నాయకుఁ డబ్బిన మాకుఁ గీర్తియౌ;
"నీయనసాని యెవ్వతయొ, యెట్టిదియో?" యని నప్పుడో "ఫలా
నా" యని చెప్పికోఁదగిన నాయిక గల్గిన మీకుఁ గీర్తియౌ. ౯౧

తే. గీ. ఎట్టులేనియు మర్యాదయే ప్రధాన
మనుచు వర్తింతునేకాని ధనమదెంత
వచ్చినను వేఱురీతుల కిచ్చసేయ
నెఱుఁగరే? మీరు నామనోవృత్తిరీతి. ౯౨

చ. ధనికుఁడు రూపశాలి గుణధన్యుఁడు మాన్యుఁడునుఁ వదాన్యుఁడుఁ
జినవయ సొప్పువాఁడు నెటుచేకుఱుఁ? దాదృశుఁ డెట్టకేలకుఁ
దనకు లభించె మీకృపకతమ్మున, నియ్యెడఁ దక్కఁజెల్లునే?
యనువగువాని మానఁదగునా? మనకెల్లపు డిట్టిఁ డబ్బునే? ౯౩

ఉ. కావున మీరు చెప్పు రసికప్రవరుఁ గని శంకదక్కి నే
నీవిధిఁ జెప్పినట్లు వచియింపుఁడు "సాదుతెనూజపైఁ గడుఁ

భావము మీకుఁ గల్గుటది భాగ్యము కాని సదా కళత్రసం
భావన దీనిఁ జూడఁదగుఁ; బ్రాయము శాశ్వత మౌనె? యేరికిన్. ౯౩

క. విడువవలసివచ్చిన లోఁగడ నిచ్చిన పట్టులుండఁగా దానికి ము
మ్మడు గధికమిచ్చుటకు నిప్పుడ పత్రము వ్రాసి కొనుఁడు పూవుంబోఁడిన్.

క. మోమోట మించుకయు లే కీమసలిది యిట్టులనియె నే యనకుఁ డహో!
కాముకు లెక్కడ? సత్యము లేమాడ్కి? నాకుఁ గొత్తలే! యివియెల్లన్. ౯౪

తే. గీ. మొదల నేర్పాటొకం డిట్టులొదవె నేని
మేమె మీరయి మీరలే మేమనగుచు
నుండఁగావచ్చుఁ; గూడు నే! తిండిపట్ల
మఱియు వ్యవహారపుంబట్ల మాటకుఱుచ. ౯౫

గీ. అందఱంబోలెఁ బలువుర నాశ్రయించి
యొకరికనుఁ బ్రామి యొకరితో వికవికలకుఁ
బోవుటలు నాగృహమ్మున పూవుఁబోండ్లు
నేర రిదిమీకుఁ బదపడి నిక్కమగును. ౯౬

చ. వలపు గలన్ని నాళ్లు మగువా! చెలియా! సకియా! తలోదరీ!
చిలుకలకొల్కి! యంచుఁ గడుఁజేరిక చేసి సమస్తవస్తువుల్
పలుమఱు తెచ్చియిచ్చి యటుపై నది కొండొక తగ్గనేని య
క్కలికి మొగమ్ముచూడ; రిది కాముకధర్మము నేనెఱుంగుదున్. ౯౭

చ. కలసిన కొన్నినాళ్లొకటిగాఁ గనుపట్టెడి మేనులై దినం
బులు చనుమీఁద రెండునయి పోవఁగఁ బోవ మగండు నాలునై
వలపు క్రమమ్ముగా నుడుగుపట్టున సానియవస్థ చూడఁగా
వలయు మఱొక్కఁ డట్టియెడ వచ్చునొ? యిచ్చునొ కామితార్థముల్. ౯౮

చ. వదలినఁ జచ్చిపోదు మనువైఖరి యిర్వురయందు నెందుఁ దా
మొదలఁ గనంబడున్ విడుప మోహముతగ్గియొ, జ్ఞానమబ్బియో
మదవతికన్నఁ బూరుషుని మానస మొండొక చుల్కఁబాఱున
య్యది గనిపెట్టలేని వెలయాండ్రకు నేగతి ముప్పునెగ్గడిన్?

చ. తెగినవిటుండు చేకుఱఁడు తారసమైన ధనమ్ము నీఁడు నో
యగమును నీగియున్ గలుగ నట్టిడరోని యతండు నిర్ధనుం

డగు మన మిచ్చువారు కలవా? ధనమిచ్చెడి వారెకాని, యే
మగువకు నేని సౌఖ్య మనుమానము మా గణికాకులస్త్రనన్. ౧౦౧

తే.గీ. "సానులను జేయుటుడిగి లోకానుగతిని
బెండిలి యొనర్చుకొనరాదె వెల కెలందు"?
లంచుఁ గొందఱు బోధింతు రనియుఁ నంత
మంచితోఁవ యటంచు నా మదికి రాదు. ౧౦౨

శా. తాగుంబోతులు జూదగాండ్రు వనితార్థప్రాపకుల్ సోమరుల్
భోగంపుంగొలమందుఁ బుట్టుపురుషుల్, పూఁబోండ్లు విద్యావతుల్
యోగోద్రేకిను లుత్కలార్హ లెటు లీయోషామణుల్ నీచులన్
భోగింపం దగువార లిట్టులయినన్ బోకున్నె? మర్యాదయున్. ౧౦౩

ఉ. సానిఁగ జేసె నేనియును శాస్త్రిలుఁ బంతులు మంత్రిలున్ ధరే
శానులు వైశ్యరత్నములు సంపద గల్గెడి యెల్లవారు సం
స్థానము గాచు సేవకుల చందమునం దనయిల్లు గాతు, రిం
కేనలినాక్షికిం గలవె? యిట్టి మహోన్నతభోగభాగ్యముల్. ౧౦౪

సీ. "ఏకలెక్టరుకు లేదింత పోర్కనుభంగి నుత్తరమ్ములును బ్రిత్యుత్తరములు
"ఏడాక్టరుకును లేదింత యల్లడి" యన్న చందాన నిలుగాచు సారటులును
"ఏజమీనాకు లే దీచంద" మనుభంగి నూడిగం బొనరించు చేడియలును
"ఏదేవతకును లే వీకాన్క" లనుతేవ ఫలపుష్పముఖవస్తుపటలములును

తే.గీ. తనకొలమ్మునఁ బొడమిన మనుజు నొకనిఁ
గట్టికొని కాఁపురముసేయు కలికి కెట్లు
గలుగ నేర్చును? సానియై వలచి వలపు
గలుగఁజేసెడి కలికిమిన్నలకుఁ దక్క. ౧౦౫

తే.గీ. జగతి "వాణిజ్యకృషికర్మ జనవరేణ్య
సేవనమ్ముల సంపదల్ చేకుఱు" నని
చెప్పుదురుగాని తగినట్టి యొప్పుగలుగు
సానిగడనకు నవి శతాంశములుగావు. ౧౦౬

తే.గీ. నీచ మిదియంచుఁ గొందఱు నీతివిదులు
పల్కుదురు శక్యమే? యట్లు పల్కువారు

సటుప్రవృత్తుల నిట్టి నైచ్యం బొకింత
లేదె? యొక రొండొకరి నెంచలేకపోరు. ౧౦౭

శా. ఉద్యోగం బని ప్లీడరీ యనియు నెంతోమంది శ్లాఘింతు రా
యుద్యోగంబు కువృత్తి, రెండవది తా నొక్కొక్కెడన్ మాపనిన్
హృద్యంబౌ ననిపించు, లాభమది యొందేఁ గల్గు నావృత్తి సం
పాద్యం, బయ్యది పూజ్య పెల్లరకు, నీచానీచతల్ చూచిరే! ౧౦౮

క. ఏకాగ్రైకారము లొకటే కడవాటను స్వవృత్తి నేతద్వ్యక్తిన్
దాఁచు నసత్యమ్మది వేశ్యాకాముకులైన రసికు లారయరు మదిన్. ౧౦౯

క. ఏవృత్తిఁ దలఁచి చూచిన నావృత్తికిఁ దగినకష్ట మందుండెడు వే
శ్యావృత్తికి సెజ్జపయిన్ గావలసినయంత పసిఁడి గలిగెడిఁగాదే? ౧౧౦

తే.గీ. అయిన నే, మిట్టి మేలైనయట్టి వృత్తి
కిప్పు డెన్నెన్నియో సంఘటించె ముప్పు;
లక్కతమ్మునఁ దగినంత యట్టికట్టు
దిట్టములు చేసినన్ గాని దీఱదింక. ౧౧౧

తే.గీ. అనుచు నేమేమియో చెప్పె”నన నుదారుఁ
డాననము వికసింప “నో యనఘ! వృద్ధ
గోరు టది తప్పుగా దిది క్రొత్తయగునె?
యొవరుగోరరు కాఁతుల నిచ్చుపట్ల?

క. వారలు గోరిన నది యొక తీరుగఁ గనుపట్టుఁ దగమతిన్ దలపోయన్
ధీరులకు, నదియు నితరము నారూఢిగ నొక్క విధమయగుఁ దుద కెన్నన్.

ఉ. ఇంతకు నేఁటిరేయి నను వేణవిలోచనతోడఁ గూర్ప నా
యింతి యనుగ్రహించెనో? మఱయ్యదియే నిదిగాక యద్దు నొ
క్కింత వచించెనో? వొడువు మిచ్చుట కెన్నఁడు నెక్కుఁదీయ నే
యింతికి నేనిఁ దప్ప దిది యేటికి నాకదఁ జెప్పఁగావలెన్” ౧౧౪

క. అనవుడు నతఁడిట్లను “వేనును విట్లన చెప్పి తమ్మనోగతిఁ గల వ
ర్గవ రెజేఁగితి నంగీకృతి కనుపట్టెన్ జనుటె తడవుగా మన మింకన్,”

ఆ.వె. అనుచు నయ్యుదారు నచ్చెలిమిన్న తే
శీ గృహమ్మునకుఁ జెలిమిదలిర్ప
వెంటఁ బెట్టుకొనుచు వేఁ డెసికొని చనె
నర్మసఖుఁడు కామశర్మవేది. [illegible]

గద్య.

ఇది శ్రీ... తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బైన పాణిగ్రహీతయందుఁ
దృతీయాశ్వాసము.

# పాణిగృహీత

## చతుర్థాశ్వాసము



గర్భశ్రీగుంఫిత
భోగాంబారామయార్యసుచిరకృతతపో
యోగపరిణామ! లలిత
శ్రీగాంధర్వాభిరామ! సీతారామా!

తే. గీ. ఆవధరింపు మనంతరం బత్తలోద
రీమణి సుదారుఁ గల్పి యాకాముకుండు
చిన్నపోయినమోముతోఁ జెలియ మనము
నందుఁ దలఁచుచుఁ దనయింటి కరిగి పిదప. ౨

మ. అకటా! పిన్నటనాఁటనుండియును నాయానంద మానందమై
వికలత్వమ్మును దాదృశంబయి దయావిర్భూతిమై నెందు భి
న్నకృతుల్ నేరకయున్న నెచ్చెలికి నన్యత్వంబు నేఁ డబ్బి నన్
వెకలిన్ జేసెఁగదా వృథా వెలచెలిన్ బ్రేమించి కామించితిన్. 3

ఉ. నావలనన్ గ్రహించె లలనామణి బాహ్యరతాదిసర్వసం
భావన లక్కటా! యది పెబా! సని యన్యుఁడు మెచ్చనయ్యె; గో
దావరి పుట్టుటొక్కెడ దానిప్రయోజన మింక నొక్కచో
నీవిధి గ్రొత్తదే! యొడఁగి యియ్యెడ నేఁదపియింప నొప్పునే? ౪

శా. నాకన్నన్ గడుశేఁతప్రాయమును విన్నాణమ్మునున్ దేజమున్
శ్రీశూలంకషభోగభాగ్యములు వాసిన్ బొల్పు నవ్వానితో
నేకీభావము నంది యిష్యబల నన్నేమంచుఁ గామించు? నే
నీ కాంతామణి కింక నీర్ష్యపడుచున్ జే యొప్పంగి యుత్తమ్మునన్. ౫

చ. అరమరలేక చిన్నతనమాదిగ నొక్కటియై పరస్పర
స్మరణముదక్క వేఱొకవిచారము దూరముఁజేసి విప్రలం
భరసము వెళ్లఁబుచ్చుచుఁ బ్రపంచమెఱుంగని యట్టియుగ్రముక్
నిరఘముషాలు సేయు నకపేకికి ధాతకిఁ జన్మమున్న దే! ౬

ఉ. సానులు గారె. యీజగతి? జాణలు గారె? మనమ్ము నీరె? యే
సానికి నేబొజుంగునకు సఖ్యము లీగతిగల్గెఁ? గల్గెఁబో!
యీవిధియతిన్ మఱొక్కనికి నింతిని దానయి కూర్చి పొక్కునో?
మానము దక్క డెందు వలమానిని నమ్మిన యొమ్మెకాంద్రకున్. ౭

సీ. కలికి యింతకు వాని కేలన నల్లనదిచ్చి యొయ్యారముగ వీగె మియ్యకున్నె?
యబల యింతకు వాని యక్కుచక్కఁగఁజేరి ముద్దునద్దులుమించ మురియకున్నె?
జెలఁది యింతకు వానితలఁపులూరఁగఁ జెక్కుఁగొట్టి నెట్టన ముద్దు వెట్టకున్నె?
గరిత యింతకు వాని మరుకేళిఁ గరఁగించి గరుసంపు బిరుదంబు గాంచకున్నె?

తే. గీ. ఆలలన లేనిపోని దైనట్టి యలుక
గాంచి యింతకు నాయొమ్మెకానిచేత
ననునయమ్ము లవెన్నియో గొనకయున్నె?
చెనఁటి దైవమ్ము నన్ను వంచించె నకట. ౮

మ. పలికెంబో! చెలినన్నుఁగూర్చి "యొరునిన్ బ్రాణేశుఁ గావింపు" మం
చలుకన్ లోఁగొనియున్ వెలిం దెలియనీ కంగీకృతిన్ జూపి ని
ష్కలుషంబౌ మదినూని వాని నతివన్ గల్పింగ నా కొప్పునే!
తెలియంజాలక మోసపోతి నిట నీతిన్ బూనఁగాఁ జెల్లునే. ౯

చ. వెలచెలిఁగూడు టొక్కయవివేకము కూడినవా రసత్యముం
బలుకమి గొప్పతప్పిదము, పాము నెడన్ ఋజువర్తనమ్ములా
నలుపుట? దేవుఁబట్టి సదృశంబగు వృత్తిరిగూర్చు; టొప్పు హా!
వలపున ముంచి మించి విటు వాతులు గోతు లొనర్తు రక్కటా! ౧౦

తే. గీ. అనిరొఁబో! లంజెయాటఁ దానట్టిమాట
నాదుయోగ్యత యొయ్యోడఁబూదగలిసె!
వేయునేటికి? వెలయాండ్రఁ డాయువారి
కంతకన్నను దుర్వృత్తు లబ్బు నిజముఁ

ఉ. దాసునిరీతి దాని పదతామరసమ్ముల నాశ్రయించుటం
జేసితిగదా, మఱెవ్వరును జేయని దుష్కృతి నేర్పుకత్తె న
న్నాసతి చేయఁజేసె నకటా! యిటు లెప్పుడు చెప్పె నప్పుడే
కోసిన నేమిపాప మగుఁ? గోమలి నాలుక యింతయింతగన్. ౧౨

తే. గీ. నన్నుఁ బిననాఁటనుండియు నమ్మఁ జేసి
తుదకు నీగతి దుర్గతిఁద్రోసి యొరునిఁ
గలసి కులుకుచునున్న యక్కులికి మిన్న
కేల తగులదు? [illegible]యును విహాయసంబె. ౧౩

ఉ. ఇంత యపాత్రురా లగుట యెల్లనెఱింగి యదేమి పాపమో
యింతిపయిన్ మనంబు పరువెత్తెడి, నుత్తలపాటు జెందెడిన్
గాంత దలంచి, యౌర; "విటకాంద్రకు నెక్కుడిమాన" మంచు సి
ద్ధాంతముగా వచించు కవితల్లజు లూరక వాఁగువారలే? ౧౪

ఆ. వె. నిష్కళంకులైన నీటు కాండ్రకు మనం
బీయ, కిచ్చినట్టులే నటింతు
రకట! వారకాంత; లద్దమ్ములో మోము
దెట్టులుండు నిదియు నట్టులుండు. ౧౫

తే.గీ. ముచ్చిబంగారమున కాదిమూర్తియైన
వెలవెలందుల ప్రేమ లోనలముకొన్న
యట్టివిటులకు ద్రవ్యక్షయం బటుండ
బలుపురను నవ్వ టియ్యది తైనికొనరు. ౧౬

తే.గీ. తనువునందలి సారమంతయును నయితము
నల్లనల్లన లాగి వారాంగనాజ
నంబు తమవిటులను, గుబుసంబు భుజగు
లను వెడలఁద్రోయు రిదిగనుఁగొనరు విటులు. ౧౭

చ. కొలమునఁ బుట్టినట్టియొకకోమలిఁ బిన్నటనాఁడ పెండ్లియై
కలిగినయంతలో సుఖముగాఁ దలిదండ్రులు నత్తమామలున్
బలుమఱు దన్ను మెచ్చఁ గులపావనుఁ డన్న యశమ్ము లోకమం
దలరఁ జరించువారికిగదా! నిజమైన సుఖమ్ము [illegible]యున్ ౧౮

కం. అని యాతఁడు పలువిధముల మనమునఁ దలపోయుచుండె మానినియు నుదా
రునిఁ గలసి కులుకుచును నొయ్యన నాలో నితనిఁ దలఁచి యాత్మగతమునన్.

మ. అకటా! నన్నెడఁబాసి యెన్నఁడెఱుఁగం డవ్యాజరాగాశ్రయుం
డొకరిం బోలెడివాఁడు గాఁడతఁడు నన్నుల్లమ్మునం దెంచి యే
మిక తల్ సేయఁగ సాహసించెడినొ? నామేలెల్ల నమ్మయ్యొ; న
మ్మిక నాపై నికనైనను జెడదె? యేమీ, వాని తప్పెట్లగున్? ౨౦

ఉ. వేడుక గాఁడటంచు మది వెక్కస మించుక లేక "యొండొరుం
గూడఁగఁ దెమ్మ"టంచు ననఁగూడునె? విత్తము కారణమ్ముగాఁ;
జూడని చూడ్కిగా మఱి భోజుంగులఁ గూడినఁ గొంతఁ గూడుఁగా
కేడవి యిట్టివర్తనము? లేమని చేసితి? నేరు మెత్తురో? ౨౧

కం. నాకారణమునఁ గులమున కే కానికళంకుగల్గె నిహీహీ! యిటుపై
నాకత విన్నను రోయక యేకాముకు లిచ్చగింతు! రిల వెలచెలులన్. ౨౨

ఉ. ఎంతటి మానహీనులో! మఱెంతటి యోవము లేని వందలో!
యెంతటి బుద్ధిశూన్యలో? మఱెట్టిరొకో? విటకాండ్రు, భోగపుం
గాంత లొనర్చు హేయములు కన్నులనిండఁగ నెవ్వు చూచుచున్
బంత మొకింత పూన రిది బాలికవృత్తిగఁ జూడ రక్కటా! ౨౩

శా. త్రాగుంబోతుల బుద్ధిహీనత గదా! ద్రవ్యమ్ము సారాయికిన్
రాఁగా హేతు, వదెంత కట్టుచెడినన్ రాకుండురే? వారహో!
భోగంపుంగొల మట్లనే విటులదుర్భోగాప్తి దుశ్శీలులై
భీగం బూడ్చినపెట్టెలై యిటు చెడన్ బెంపేది నానాఁటికిన్. ౨౪

కం. ఇక్కరణి నన్యయోజనఁ జిక్కియు నవ్వానిమనము చెయ్వులఁ దనకుం
దక్కించికొనిరొ; విటులకుఁ దక్కిన సంగతులపైని దలఁపుం గలదే? ౨౫

ఉ. పువ్వులవిల్తు పోరఁ గలపోఁడుములెల్లను నొక్క రాత్రికే
యవ్విటుఁ డవ్వేలందియును నాని సుఖించి, ర విట్టి వట్టి తం
చెవ్వగఁ జెల్పనొప్పగు? నదేమిటి, కింత కెఱుంగనట్టి వా
రెవ్వరు? పత్నులున్ బిఱువు లీనుట మందవె? యంతకెక్కుడే? ౨౬

ఆ.వె. కుక్కుటవక్కలంత గొక్కురుకోయనె
నలముఁదొడఁగెఁ జల్లనైనగాలి

చుక్కవాడిచెఁ దక్కురిక్కలు తఱిఁగె
నబ్జారి వెల్లనాయె జాఱె రేయి. ౨౭

ఉ. అంత నుదారుఁ డచ్చెలి యొయారముగాఁ దను సాగనంప న
య్యింతివిలాసముల్ హృదయమెల్లెడ వేళ్లు ఘటింప నంతటన్
ధ్వాంతమడంగియున్ దనయెదం గలధ్వాంత మనంతమై తగన్
జింతమఱొండు లేక యలచేడియ నెంచుచు నింటికిం జనెన్. ౨౮

తే.గీ. సారసమ్ములు వికసింపఁ జక్రవాక
జంపతుల కింపు జనియింప జగములెల్ల
నంధతను బాసి మోదింప హాయిఁ బెంప
రవి యుదయమందెఁ గుముదినీచ్ఛవులు డిందె. ౨౯

చ. అటు లొక కొంతకాల మలయబ్జముఖీమణి పొందు నందుచున్
విటకులశేఖరుండయి వివేక మొకించుక లేక స్వీయమా
కటకము మాటయే తలఁపఁగావక యుండెను; నంతఁ దల్లి య
వ్వటి చరితమ్ముకింత విని పంపెఁ దదానయనార్థ మాప్తులన్. ౩౦

ఉ. పంపిన నెట్టులో చెలియఁ బాయఁగలేక కడఁబాసి "యుత్తరం
బంపుచునుండుమీ?" యనుచు నాదర ముట్టిపడంగఁ బల్కి నై
లింపనివాసముం దొలఁగలేక యలందురు నష్టపుణ్యుకా
ర్య్యంపుటవస్థయెల్లఁ దనదై చనె నీగతిఁ జింతనొందుచున్.

శా. "అయ్యజ్ఞానతఁ గన్నకన్నులనె భార్యన్ జూడ నేతెంచుటల్
నాయజ్ఞానమె రాజుఁగన్న కనులన్ నాథున్ విలోకించినన్
హేయప్రక్రియఁ దోఁపకున్నె? యదిగా కీలోకమం దెన్న నే
స్వీయారత్నము వారకామినులవాసిం జెందఁగా నేర్చునో? ౩౨

మ. అడుగున్ వెన్కకు లాగివేయుటకు నయ్యబ్జాక్షి సాంగత్యమే
కడు సామర్థ్యముఁ జెందియున్నపుడు వెన్కన్ దోడు నీవేల? యో
గొడుగా! యీనుడిగాలిఁ గూడి ననుఁ జిక్కుల్ వెట్టుటల్ మాని ముం
దడుగున్ సాఁగగనిమ్ము, నామనవి నీవాలింపు మిప్పట్టునన్. ౩౩

ఉ. ఈవును గాలియుం గలసి "యేణదృశన్ విడనాడి పోయెదు టో
ప్పే? వల" దంచు నన్నిపుడు వెన్కకుఁ ద్రిప్పఁ దలంచినా రహో!

దైవబలమ్ము చాలదది తల్లిగఁ దా నవతార మంది న
న్నీవిధి లాగుచున్న దిపు డేమియు సేయకు మాతపత్రమా. ౩౫

మ. జడ మీ వయ్యు, జగమ్ము లెక్కఁ దన నుచ్ఛ్వాసమ్మునం బోల్చు న
ట్టిఁడు నీకున్ సహకారి యాట నను బట్టెఁ జేర్చు నుంకించి నా
యడుగుల్ వెన్కమఱల్చె దీ వారుల తాపాగ్నిన్ హరింపన్ గదా
పుడమిం బుట్టితి వాలపత్రమ! నినుం బోలన్ జనన్ జాల్నఁగన్. ౩౬

వ. పదపడి ఘామశకటంబు బారోహించి యాతండు.

ఉ. తల్లిని దుష్టురాలను చెడన్ దలపోయుచుఁ దండ్రి యోగ్యతా
భ్యుల్లసనంబు నూరక యహో! యని మెచ్చుచు సారెసారె క
ప్పల్లవపాణి చెయ్యుల జపం బొనరించుచు నేగె నున్న వా
రెల్లరు నంతరాయమగు నెంతయు శత్రులు కోడికాండ్రుగన్. ౩౭

క. రైలే దేఁగారణమున జాల మ్మొనరించి వెనుక జరిగినచో నా
వ్యాలోలుఁ డదియుఁ దన కనుకూలించెడి జాలి యనుచుఁ గొండొకయెంచున్

ఉ. చిక్కిన మేనితో వగపుచెందెడి డెందముతో స్వతఃప్రభన్
దక్కిన మోముతోఁ దనదుదాపునకున్ జను పుత్రుఁ దల్లి దా
మిక్కిలి గారవించి మునుమించిన దెంచక, పైనొకప్డు పెం
పెక్కినఫక్కి నీతి జనియింపఁ బ్రసంగ మొనర్చె నీగతిన్. ౩౮

చ. మును పెటులైననున్ గృహము మోపిక నీకిఁకఁ గాలిసంకెలో
టను దెలియంగదన్న! కడుఁడక్కరులన్ దరిఁజేరనీకు మ
న్న, నయముచందమున్ దెలిసి నాయనకున్ యశ మబ్బఁజేయు మ
న్న, నెనరుగల్గు మన్న, ద్రవిణంబు వ్యయింపకు మన్న, వమ్ముగన్. ౩౯

ఉ. ఏపని కేడకేనియును నేగిన నయ్యెడ గేహవిస్మృతిన్
గాఁపుర మాచరించు టది గాదు గదన్న, కళత్ర మెంతయుం
దాపము నందు దుష్కృతులఁ దారకుమన్న, యొకింత పూర్వులన్
దాపసచర్యులన్ దలఁచి తద్గతి నిల్పఁగదన్న! మేటివై. ౪౦

ఉ. వచ్చెడి రైతులన్ గని జవా బెవరిత్తురు? సాహుకార్లకు
న్నచ్చెడిరీతిఁ జెప్పఁదగు నాయకు లెవ్వరు? తండ్రినాఁడె తా

నిచ్చినసొమ్ము, పుచ్చుకొను వెవ్వరు? కోరెడివారి కప్పు లి
స్తిమ్ముటలేదొ? యెక్కడికి నేగిన నక్కడ గాఁపురమ్ములా! ౮౧

తే. గీ. ఎన్ని జన్మమ్ములం జేసి? రెన్ని యగ్ర
హారములు తెచ్చి పెండ్లి కన్నమిడిరి
భూము లెందఱ కిచ్చిరి? పూర్వు
లందు గర్వ్యయం బింత లేదు తుడగుడుకు చనునె? ౮౨

తే. గీ. ఎంతదిన్యంబు ముందు నీవింటనుండి
తీసికొనిపోతి? వామీఁదఁ దీఁగెకతన
మరలఁబాకినయది యెంత? యిటుఁగుడే, కు
మార! యిది యెల్ల నెయ్యెడ మణఁగిపోయె. ౮౩

ఉ. ఈగతిఁ జెల్లజేయ మన మెక్కడి లెక్క! ధరాపురందరుల్
భోగులుగారె? యోన్నృపులఁ జూచుటలేదె? యి దిట్టులుంచు మే
లాగు సహింతురా! సకలలక్షణముల్ గలభార్య యుండఁగా
భోగపుఁదొత్తులన్ మరగఁబోయెడి నీకత లాలకించుచున్. ౮౪

ఉ. వత్సరమైనఁగాదు జనవంద్యుఁడు తండ్రి గతించి, నీకు నే
తత్సమయమ్ము నిష్ఠ మెయిఁ దార్చుటమాని యయోగ్యతాళినుల్
మత్తిలి లగ్గిజాతులకుఁ గూడని చీడలు లంజెముండ లం
దుత్సుకతాశరంబు గొనుటొప్పునె? కర్మము కాలిపోవఁగన్. ౮౫

ఉ. వింటివి నీదుపైభవిలు వీనుల సూదులు సూడినట్లు లే
యంటును సొంటు తేలి కల మక్కట! గంగను గల్వ నిన్నుఁగై
కొంటిమె? కొంటె మొప్పెలను గూడుక గాడిదకీతి బోగపుం
గుంటలయింట్లు దూఱెదవె? కూళవె, గోలవె, పేలవే సుతా! ౮౬

శా. అన్నా! నైనఁట బ్రాందియంట విసికీయం టక్కటా! నీకు నీ
విన్నాణం బెటులబ్బెరా? ద్విజకులావిర్భూతియున్ బానమున్
మున్నెచ్చో విన లేదు నీదుతలనే మున్గెన్ మహాపాప, ము
చ్ఛిన్నం బయ్యెఁ గులమ్ము నీకతన ఛీ! ఛీ! గోత్రవిధ్వంసకా! ౮౭

చ. నయము భయమ్ము నెమ్మదికి నాఁటఁగ దల్లి యొనర్చుబోధ యా
మ్మెయి విని మోమువంచి పదుమిక్కిలి యుత్తరమీక "యెన్నఁ డే

త్రిం గేల్మోడ్చి మ్రొక్కి మాధవముఖాదిత్యార్చనల్ సల్పు పూ
తాంగుల్ వేలకువేలు పొల్తు రట నిత్యంబున్ విముక్త్యర్థులై. ౫౪

ఉ. తాదృశమైన యప్పురముధన్యత నెవ్వఁడు సెప్పఁజాలు? బ్ర
హ్మాదులు లోకజాలము లయంబగునప్పుడుఁగూడ దాని గౌ
రీదయితుండు శూల మలరించి తదగ్రమునందు నిల్పు నిం
కేదగు దాని సాటి? నుతియింపఁగఁ జెల్లదె కాశికాపురిన్ ! ౫౫

ఉ. ఆపురిఁజేరి యాతఁ డట నాచరణీయము లైనకృత్యముల్
నే పచరించి దానములు వేలకువేలుగ నిచ్చి భూమిచే
బాపలఁ గొందఱన్ దనిపి పైగయ కేగి యటన్ బితృప్రియా
శాపరిపూర్తిజేసి యట సాఁగి స్వదేశము వోవఁ దెంచుచున్. ౫౬

చ. తిరిగియుఁ గాశి కేగి యట దేవళముల్ మఱికొన్ని చిత్రముల్
పరిపరిగాంచి గంగ నటఁ బట్టఁ బ్రయాగకు నేగి తత్పురి
త్సురసముఁబట్టి యప్పురిని సొంపగు కోటఁ గలట్టి మేటియ
బ్బురములు సూచి యేగెఁ దనపోలికి నాప్తులతోడ వేడుకన్. ౫౭

తే.గీ. జననికభిషేక మొనరించి సతియుఁ దాను
నమ్మహాగంగఁ బూజించి యగణితముగ
విప్రులకు నన్నదానంబు విస్తరించి
తల్లి సంతసమంద నుదారుఁ డంత. ౫౮

శా. సంసారస్థితిఁ జక్కఁబెట్టుకొనుచున్ జాయన్ దగన్ జూచు చా
శంసాపాత్రముగాఁ బ్రవర్తనము మెచ్చన్ జేయుచున్నంత మీ
మాంసన్ జేయక తల్లి యాతనియెడన్ మర్యాద నీక్షించి "ప్ర
ధ్వంసప్రక్రియ తగ్గ" నంచుఁ దలఁచెన్ దత్త్వంబు నూహింపమిన్.

ఉ. "అచ్చెలిఁజూచు టెట్లు? లిఁక నయ్యెడ కేగు నుపాయ మెద్ది? యే
యొచ్చెము చేసినన్ జనని యొప్పెడి?" నంచుఁ దలంచునంతలో
నచ్చపలాక్షి యయ్యెడకు నాత్మపురమ్మును వీడి మున్నె తా
వచ్చుటఁజేసి కమ్మఁ దగవ్రాసి తనంతన యంపె దూతికన్. ౬౦

ఉ. వచ్చిన దూతి చేతి "కిదె వచ్చితి" నంచు లిఖించి యిచ్చి పో
నిచ్చి మనమ్మునన్ బెరుఁగు నిచ్చలు మోమునఁదోఁప నంతలో

హెచ్చెఁగి యుత్సుకత్వమున కెద్దియుఁ బారము గాక యేగెఁ దా
నచ్చపలాక్షిఁ జూడఁగ నుదారుఁడు లోన భయమ్ము గ్రమ్మఁగన్.

ఉ. "ఉత్తరమైన వ్రాయ విది యుక్తమె? నీ" కని యింతి పల్కఁగా
నుత్తరమేమి చెప్పఁడు నహో! మది నెంతటిపేర్మి లేనిచో
నుత్తరశాక్షి తాన యిటకై చనుదెంచునె? యెంతమూఢ మ
ప్పృత్తన! మంబహేతువునఁ బంకిలచిత్తుఁడనైతి నక్కటా! ౬౧

ఉ. అంబయుఁ గాదు హేతువు రహస్యమునం దొకయుత్తరంబు నే
నంబుజనేత్రకున్ బనుప నాపె నివారణచేసెనే? నిమి
త్తం బిట వేఱుకాం దొకస్వతంత్రత లేమియె; కాదు కాదు డెం
దం బదియేమొ! యెప్పనికిఁ దార్చిన నేగదు నాఁటనుండియున్. ౬౨

చ. కలికియె కారణంబిచటఁ గాఁదగు నుత్తరశాక్షి వీడి నే
వెలికరుదెంచు టాదిగ నవీనవిధం బొడఁగూడె; నేమియుం
దలఁపదు చిత్త, మేమిటికతం బని చింత యొనర్పఁ దాను నం
దుల జొరఁబాఱ దిప్పటికిఁ దోఁచె నిజ మ్మిది" యంచు నెంచుచున్. ౬౩

ఉ. నేరము సేయుమానవుఁడు నేతకడన్ జనుపోల్కి మోమునం
దీఱని దైన్యమున్ మఱి మదిన్ గడుభీతియుఁ గొంతలజ్జయున్
వారక తోఁప నచ్చటులవారిజలోచన యున్నచోటికిన్
దారె నుదారుఁ డట్లయగుఁ దన్వులపట్లఁ గృతాపరాధికిన్. ౬౪

క. నలుగడలు గాంచి పదపడి జలజముఖి వసించుగృహముచాయఁ జని యటన్
గలకలికిఁ గాంచినంతన పులకలు గనుపట్టె మేను పొంపిరివోయెన్. ౬౫

చ. తనుఁ గని మాటలాడ దొకదండము వెట్టదు మోము నెత్తద
వ్వనరుహనేత్రి యంచు మది వంత యొకింతయుఁ గాంచ కల్లన
ల్లనఁ బ్రియురాలి దగ్గఱి విలాసగతిన్ జెకు గీఁటి మోము నె
త్తిన శతపత్రనేత్ర యొకతీరున నశ్రులు జాలువాఱఁగన్. ౬౬

ఉ. కొండొకసేపు నేర్పు మెయిఁ గొంటెతనమ్మున మిన్నకుండి "నీ
మిండతనంపుఁ జందమిది మేలుగనున్నది, యిట్టివాఁడనా!
వెండియు రేపె వత్తునని వెళ్లినదే యొకసందు చేసి రా
కుండుట నీకుఁ జెల్లె నిటు లొండొరు లెవ్వరు నేర్తురే బళీ! ౬౭

చ. ఇరువదియేండ్లప్రాయి మదియేగెడునంతకు మిన్నకుండి పై
"నరువదియేండ్లయప్డు చదు" వన్నటు లే నినుఁ గట్టికొంట యి
క్కరణి విచారమందుటకె కాక సుఖమ్మునకా? నిజమ్ముగాఁ
బారుషులనమ్మమానినికిఁ జొక్కుటదక్క మఱొండు గల్గునే. ౬౮

మ. మఱు లేకీకరణమ్ము గాంచకయొ, నమ్మన్నమ్మికల్ చాలకో,
కుతుకంబుల్ నెఱవేఱకో, సిరులు లేకో యేదియో మూఁడియో,
సతికిన్ భర్తకు నర్త దొక్కయెడ నీసఖ్యమ్ము చేకూఱ దు
ర్మతియై దానికి దైవ మెయ్యదియొ సంపాదించుఁ బ్రత్యూహమున్. ౬౯

చ. నినుఁ గనుఁగొంట కిక్కరణి నేనయి వచ్చితి నన్నమాట యే
వనితయు నేని మాకొలము వారలలో వినె నేని నవ్వకుం
డునె! యెటనేని సానుల కిటుల్ చను టొప్పునె? దానికేమి, ప్రీ
తినిగనఁజేసి తిట్లకు నుదెంచు శ్రమమ్మున కోర్చి యొమ్మెయిన్. ౭౦

ఉ. "లంజెగదా!" యటంచు మది లక్ష్యమొకింతయు లేని వీడితే
నిం జనుగాని యొక్కచెలినీతి యొకొక్కకళక్కు నొప్పు "నీ
మంజులవాణి యిట్టి" దనుమాదిరి నిర్ణయ మాచరింప న
క్కంజభవుండు నేరఁ డనఁగా నొకపాటిది బొజుం గెఱుంగునే! ౭౧

చ. వెలచెలియై జనించి కనువేదులు చెందెనపట్ల దానికిన్
గలుగుట యబ్బురంబె పలుకష్టము! లొడ్ల ననంగ నేల? చం
చల మగు నాదు నెమ్మనముచందము నింప యొనర్తుఁగాక యే
లలనలు గాంచిరో సుఖములన్? వలపుల్ తలకెక్కి పిమ్మటన్" ౭౨

చ. అని పలుమాఱు దూఱు చెలియన్ దగుమాటలు సెప్పి కొంత సి
గ్గున కగు చెయ్వులన్ గొలిపి కొంత క్రమమ్ముగ సుప్రసన్నఁగా
నొనరిచి మించు ప్రేమ్మ దళుకొత్త "సఖీ! నినుఁ బాయు టాదిగా
మనమని యేమొకో! పనికిమాలిన దయ్యె నిజమ్ము నమ్ముమీ. ౭౩

ఉ. ఇంతియకాకయున్న నిఁక నేపని నేనియు మాను టొప్పఁగా
కింతిరో! నీకు నుత్తరము నేనియు వ్రాయనె! యంత పందనే
కంతునిసాక్షి నేఁడు నినుఁగాంచితి నెమ్మన మెప్పటట్ల ని
శ్చింతతఁగాంచె నింతయును సిద్ధము నమ్మిన నమ్మకుండినన్, ౭౪

ఉ. వచ్చిన తత్ క్షణంబ మగువా! యలకాశికి నేగినాఁడఁ బై
నచ్చ్యగఁ యాత్రఁజేసికొని యక్కడనుండియు నెన్నవచ్చితిన్
బచ్చనివింటిజోదుకృప వచ్చితి పంతన నీవు, యాత్రికున్
వచ్చెఫలంబు, నిక్కమిది వంచనసేయఁడు దైవమెప్పరిన్. ౭౫

ఉ. ఈఁవును నేనునుం గలసి యియ్యెడ హాయిగ నుండవచ్చు నా
ఖ్యావహ మీపురంబు, మనకన్నియు మంచివెకాని తల్లిగా
రీవిధ మొప్ప, దామె కిది యించుకయున్ దెలియంగరాదు క్రో
పావిలయైనచో మనకు హాని ఘటించుట నిక్క మెమ్మెయిన్. ౭౬

ఉ. కావున నీవు గోప్యగతిగా వసియింపుము నాదునామ మెం
దే వచియింపఁబోకు వచియించినమాత్రిన యేమిగాని యే
యేవిధికైన గోప్యగతియే కడు శ్రేయము, డాఁగునంచునున్
గేనల మెంచఁగూడ దపకీర్తియుఁ గీర్తియు రెండు పట్టివే. ౭౭

ఉ. పేరగుదాన వీవు కడుఁబెంపుగఁట్టిది మాకుటుంబ, మీ
కారణమై రహస్య మది గావలసెన్ మఱియొందురీతియే
నే రెటు సంచరించెదరొ యేరికిఁ గావలె! నింతవీటిలో;
నూరనుగాని యిట్టిపురి నొక్కని కొక్కనిజోలి గల్గునే. ౭౮

క. మీపురము లొక్కపదియగా మా పురి విడఁదీసి కట్ట మానిని! దీనన్
గాఁపురము సేయుగేస్తులు దాపునఁ గలవారిపేరె తామెఱుఁగరునూ! ౭౯

తే.గీ. అట్టిసంగతిలో నిట కధికదూర
ముండు మావీధి, యియ్యెడనుండు నిన్ను
నెవఁడుగుర్తించి మాతల్లికెఱుఁగఁజెప్పు?
నట్లయిన భయమేలన, నదియు వినుము. ౮౦

ఉ. మీపురిలోన నే నెటుపు మిక్కుటపుం బను లట్టు లుంచు మే
యేపను లేను నీపడకయింట నొనర్చితి వాని నన్నిటిన్
దాఁపక చెప్పినారెవరొ, తల్లి కిదెక్కడివింత! జారతా
వ్యాప్తతి తానయై జగముపై కరుగున్ నిజ మింత కోమలీ." ౮౧

క. అనవుడు జలజాక్షియు బగ్గున మండిన వగిదిదోఁపఁ "గులవనితగ న
న్నను జూచెదనను టది యెల్లను బోయెనె? యెంతలోఁ గులటనైతిఁ గటా!

క. జారుఁడను దుర్యశము పరనారుల జేరగతిఁ గూడు నాయకునకు నో
మారమణిఁ గొనిన నీయప కీరితి లేదెపుడు నీదుకృప వింటి నిటుల్.

క. ఏలంటె వచ్చుఁ? దానై వేలకువేల్ మైళులున్న వీటికి నీ కి
ల్లాల ననుకొంటి "గలదే రై" లను మల్లైనఁ దనకు రా నేల? యిటుల్. ౩౫

క. యోగినిగతిఁ గాలమ్మును నే గడపుచునుండ నీవు నేరుపుమై నన్
భోగినిగఁ జేసి చింతాభాగినిగాఁ జేయనుంటి పాడయితిఁ గటా! ౩౬

తే.గీ. మొదల మాతల్లిమాటల మోసపోక
పురుషసాంగత్యమున బుద్ధి పోవనీక
యుండ నాముండ యొక్కనికొప్పఁజెప్పె
వాని నానాఁడ పోఁగొట్టి వ్రతముగొంటి. ౩౭

ఉ. దానికి నంతరాయమయి దాపర మైతివి దానికేమి నా
మాన మెఱుంగకే కడుసుమాళమునన్ దగునిన్నుఁజూచి మా
యానిధిగా గణింప కకటా! తుద కెందుకుఁగాని పందనై
బానిసతొత్తనై చెడితి భారము నీకయితిన్ వృథాగతిన్. ౩౮

ఉ. ఎందుకు సృష్టిచేసెఁ బరమేశ్వరుఁ డీచెడుగుంగొలమ్ము? పై
నరదముఁ జందమున్ గలుగునట్టు లొనర్చఁగ నేల? చేసెఁ బో
పందల కెల్ల విందొనరుపన్ విధియింపఁగ నేల? యూరకే
కుందఁగఁజేసి యిక్కరణిఁ గుత్తుక గోయఁగ నేల? యక్కటా. ౩౯

ఉ. అందముఁ జందముం గనియొ యాదరము న్నిజమంచు నమ్మియో
వందలు వేలు నీయఁదగు వాఁడనియో యొక మాయకానికిన్
డెందము నమ్మి వానికిఁ గడిందిగఁ బ్రాయము ధారవోసి యం
తం దనువీడ నేడ్చెడి యనాథకులమ్మునఁ బుట్టఁ జెల్లునే?

చ. కలుగుట దుర్లభం బొకఁడుకల్గినఁ బెద్దరహస్య మందుకున్
దలరక యొప్పుకొన్నఁ దుదిదాఁకను నెగ్గదు వానిచెల్మి యే
వెలచెలియైన యొక్కయెడఁ బ్రీతియొనర్చుట తప్పిదంబు పం
దలయినఁ దప్పు నొందుగతితన్వులు దీన జనించు టొప్పునే. ౪౦

చ. కలిమిని లేమి నొక్కగతి గారవమున్ బచరించుచున్ దళ
త్తళ గల జవ్వనమ్ము దిగఁ ద్రావిన పిమ్మటనేనిఁ బూర్వపుం
జెలిమి యొకించుకేని యెడసేయని పెన్మిటి గల్గునింతి కం
జలి యొసరింప నొప్పు దివిషత్పతి యుంచిన సానియేనియున్. ౯౧

సీ. తగినసంతానమ్ము దయమంద "నాయనా!" యని పిలిచి లెవ్వాని ననఁగవలయు?
అన్నదమ్ములు గౌరవార్హు లుండిన వారు తల లేమనంచు నెత్తఁగవలయు?
తనుఁ గన్నతండ్రి యుత్తముఁడేని యతని మొగమ్మెమిగతిని దాఁ గాంచవలయు?
ఏదేని శుభకార్య మేతేర నెవనితోఁ గాంక్షమైఁ బీత మెక్కంగవలయు?

తే.గీ. నక్కటా! తాను బాడగు టట్టులుండ
వెనుకముండటివారల వెలికిఁ దార్చు
రోషలందుల పుట్టువుల్ గోఁతగావె
యెఱుఁగనేర రీయర్థమ్ము హీనమతులు. ౯౨

ఉ. అట్టికులమ్మునం దెటులనైన మఱేమి పురాకృతమ్మునన్
బుట్టినదానికిన్ వగపఁ బూనిన లాభము గల్గఁబోదు, తాఁ
గట్టినకర్మముల్ కుడుపుగాంచక తీఱునె? యిప్పుడేని యీ
గుట్టు నెఱింగి యొక్కరునిఁ గూడి దినమ్ములు పుచ్చఁజెల్లదే? ౯౩

ఉ. ఒక్కనిఁగూడి కాఁపురము నొప్పఁగఁజేసెడి చానపొందు లే
ఫక్కిని జారుఁడన్న దురుపద్రవమున్ గలిగించు, వింటి నీ
చక్కనిగాక సర్వజనసమ్మతమై మఱియాలిమందుఁ జే
రెక్కడి నగ్రజాతులకు హీనకులాంగనతోడి కూటముల్. ౯౪

ఉ. కావున నన్ను జారగతిగాఁ గయికొందువయేని నొల్ల "భా
ర్యావిధిఁ జూచుకో" మ్మనుచు నప్పుడచెప్పె మదంబ, దానికి
న్నీవెటు లొప్పికొంటివి? వదినేఁడిటులన్ గికురింతె? మాకొలం
బేపగదైన మాసరణి యేపము సైఁప దదెన్నిభంగులన్." ౯౫

క. అనవుడు సుదారుఁ డచ్చెలి కను "నే లోకోక్తి నంటి, నది నీకింతన్
మనము నలయించెనే! యే మని భార్యఁగ నిన్నుఁ జూడననుకొంటి? చెలీ. ౯౬

ఉ. చక్కఁదనమ్ము లేదొ? గుణసంపద లేదొ? వయస్సు లేదొ? బల్
తక్కులమారిగావొ? వివిధమ్ముగు విద్దెలు నేరవో? నినున్

జిక్కని కౌఁగిటన్ జనవు చేసినపిమ్మట భార్య గిర్వయున్
మక్కువ నౌనె? యేల యనుమానము? మానుము మానినీమణీ. ౯౭

ఉ. నమ్మవుగాని నీవు మదినాటినదాదిగ భార్యఁ జూడఁగా
నెమ్మది సమ్మతిం గనదు నేరము, లూరక తోఁచు దానిపై
నెమ్మెయిఁ బూఁచు నీగుణము లేకద! యింతకు కారణమ్ము, నీ
సొమ్మనుకొమ్ము నన్నును త్రిశుద్ధిగ మాటలు వేయునేటికిన్. ౯౮

గీ. విప్రులకు నాల్గుజాతుల వెలఁదులందుఁ
గలదు స్వాతంత్ర్య మది నేఁటి కలియుగమునఁ
గాదనుచుఁ గొంద ఱడ్డిరిగాని యింత
మాత్రమునఁ బోయెనే? పూర్వమతము సకియ. ౯౯

సీ. బ్రాహ్మణుఁడై పుట్టి పరమచండాలితో సంసారియైన విశ్వాసి యొకఁడు
ముగుర ముఁ జంపినముండమోపిని గట్టికొని గృహస్థయిన సుగుణుఁ డొకండు
ఐకమత్యమున కియ్యది ముప్పనుచుఁ గులాచారముల్ వదలినజాణ యొకఁడు
“పింగాణిచిప్పకు వెండిగిన్నెకు భేదమున్నదే!” యనియెడి యోగ్యుఁ డొకఁడు

తే. గీ. వీరలేకద సభలలోఁ బెద్దలిపుడు!
మనకు మర్యాద వీరలేమని యొనర్ప?
కింతకును పశ్చాత్తపున కెవనితోడ
నేమిపని? వెలి యాతని నేమి సేయు? ౧౦౦

చ. జనని గతించుదాఁక నొకచందమునన్ జననిమ్ము; మీఁద ని
న్నును స్వగృహమ్మునం బెడుచు నూతనబుద్ధి యొకింత లేక నా
జన మదియెల్ల నీకు నుపచారము సల్పెడు నట్లొనర్తు; న
న్ననియెడి వాఁడొకండు గలఁడా! మఱి తల్లి కొకింత జంకెదన్. ౧౦౧

ఉ. దాఁపఁగనేల? విన్ము, మును తండ్రి గతించెడువేళ ద్రవ్యమున్
జూపి మదంబతో “నిది త్రిశుద్ధిగ నీ మరణంపువేళ నీ
వీపసివాని కిమ్మిచట నించుకయేని వ్యయింప కందులో
నోపినమాత్రముం గలిప యుచ్చగతిన్ బొనరింపఁగాఁదగున్. ౧౦౨

తే. గీ. యౌవనము ధనసంపద యాధిపత్య
మవల నవివేక మియ్యవి యడఁచు నొక్క-

టొక్కటిరెయి మానవుని నిదియొకట నన్ని
యును బొసఁగ నేనిఁ జెప్పు నేమందు సాధ్వి! ౧౦౩

చ. నవనవయౌవనుండయిన నందనుఁ డొప్పుగఁ బ్రాఁగి చల్లనా
రి వెలయు పాలసంగి నొకకీర్తికి వచ్చెడు సన్న జాగరూ
క విధిని సర్వముం బయిని గాంచుచు దక్షము చేత నెక్కపై
వ్యవహృతిశాలి యైన యపు డంతయుఁ వానికిఁ జెందఁజేయుమీ." ౧౦౪

చ. అని పలునీతులన్ దెలిపి యాపెను సర్వము నప్పగించెఁ; గా
వున మన కామె సమ్మతిని బూనక చెల్లదు; దానఁ జేసి ని
న్నుని చెద వేఁడుగాఁ, బిదప నోపిక పట్టితి నేని యెల్లరన్
బనిఁ గొనుదాన నై మెలఁగవచ్చును బొచ్చెము లేనితీరునన్. ౧౦౫

చ. అనవుడు నవ్వెలంది యను "నక్కట, యెందుఁ కింతసోద? నీ
జనని శతాబ్దముల్ సుఖవశమ్మున నుండెడుఁ గాక, నీధనం
బును సుఖముండుఁ గాక, నను మోసము చేయక భార్యగాఁగఁ జే
కొను టది చాలు; వచ్చెఁ బదికోటులు దానన నిక్కమింతయున్. ౧౦౬

చ. ధనము గడించియుంచి యది తాము గతించెడివేళ నెవ్వరే
నినిఁ గొనిపోయిరే? జగతి నీతి యనీతియుఁ గీర్తి కీర్తులున్
దనచనువేళ వెంటఁబడుఁ దక్కినదంతయు దూరదూరమై
పనుపడు; దీనికేమి, పదిపాళ్ళులు నీకృప గాంచఁగల్గితిన్. ౧౦౭

ఉ. పిన్నటనాఁటనుండి కడుఁ బెంకెతనమ్మున నుంటి కాని మా
కన్నెలఁబోలె నెల్లరకుఁ గాళ్ళకు మ్రొక్కెడి దానఁ గాను; నా
మున్నరికంబు సాగుటకు మూలమ్మై ననుఁ గొంటివీవు; లే
కున్న మ తేమిలే ధనము, ఉల్లము చల్లఁబడె న్నిజమ్ముగన్. ౧౦౮

ఉ. ఏమనఁ, దెల్పుదాన విను మే మొదలీకొలమందుఁ బుట్టలే;
దేమనుజుండు నన్గనెనొ యెవ్వతె తల్లియొ యే నెఱుంగ న
న్నే మెయిఁ దాను గైకొనెనొ! యియ్యది పెంచియుఁ బెద్దఁజేసె బల్
నేమము లొలి నేర్పెఁ; గులనీతికిఁ దావలమై చెలంగఁగన్.

క. ఆనీతులు నామది కింతేనిం బొలఁబాఱ; వేగతి న్నేర్చును? చి
లైక నెగడె నిపక్షికి భాషానియతి న్నేర్పఁ గులము ధనము ముఖ్యంబై. ౧౧౦

క. సంగీతము సాహిత్యమ్ముం గొమరగు నభినయమ్ము ముగుదల కెల్లన్
సంగతములగుట నాకుఁ బొసంగున్ దగుపాటిపఱిజ్ఞ జగదీశుకృపన్.

ఉ. ఇంతకు నాకొలమ్ము మొద లెయ్యదియో విన నైతిఁ దల్లితోఁ
బంతము పట్టి కోరినను "బ్రాహ్మణకన్య" పటించుఁ బల్కె-; నే
వింత విధమ్మున న్నను వివేకవిహీన మదంబ గాంచి ని
శ్చింత మెయిన్ ద్యజించెనో, యిసీ! పడుపుంగొల మాశ్రయించితిన్.

ఉ. కోపము వచ్చు మీకనుచుఁ గొంకక పల్కెద మీకొలమ్ము సం
దేపగుచున్న దీయధమవృత్తి యదేమనఁ, బెద్దవృద్ధు తా
నేపసిపాపనో ధనమునిచ్చి కొనున్ గనుసంత మృత్యు, వా
పాపిని మమ్ముఁ బోఁటుల నపారము గాఁగని యిట్లొనర్చెడిన్. ౧.3

శా. పోనీ, స్త్రీలు పునర్వివాహమునకున్ బోరామి వాదించు వి
జ్ఞానుల్ పండితు లేమిపాపమొ! ధనాశన్ గూఁతు వృద్ధాత్ముఁడౌ
వానిన్ జేర్చునపాతుర్కఁ 'గూడ' దన; రవ్వాఁడిచ్చు నన్నోదకా
లానం దమ్ము మెయిన్ భుజింతు రిది యన్యాయమ్ము గాకుండునే. ౧౧౪

శా. కన్యావిక్రయ మాఁగలేని యల విజ్ఞానుల్ పఱేమించుఁ దా
మన్యాయమ్ముగ స్త్రీ పునఃపరిణయవ్యాపార మాఁపంగ వే
డ్క న్యోజింతురు! రెండునుం దగనివే కాఁబట్టి యందొక్కటన్
మాన్యత్వమ్ము మఱొక్కటన్ దోఁసగ దేమాడ్కిన్ బొసంగింతురో.

మ. పతితోఁ గొండొకకాలమున్ సుఖములన్ బ్రాపించి పై వాఁడు పో
వుతటిన్ మేటివిరక్తిమై సకలమా భోగమ్ములన్ వీడి బో
డితలన్ దాల్చి యతిస్థితిన్ గనుట పాటింపన్ దగున్ గాని చి
న్నతనమ్మందన నాలుగేఁడులపుడే నా, యిట్టి వైరాగ్యముల్? ౧౧౬

ఉ. అట్టిపయస్సునన్ విధవయై యది యించు కెఱుంగనప్పుడా
బొట్టెను గాంచి కొంద "ఇది పూర్వమునం దిటు పెట్టిపుట్టె" నం
చెట్టులొ పల్కుదుర్; మఱి యదే పయి నొక్కనిఁ గట్టుకొన్న నాఁ
డిట్టులు పల్కరేదె? యపు డెక్కడికేగెఁ బురాకృతం బహో! ౧౧౭

తే.గీ. స్త్రీపునఃపరిణయములు సేయవలయు
నంచుఁ దర్కింపఁగాని యీయబలలైన

బాలవిధవలపట్లనా, పండితులకుఁ
గల్గు పాండిత్యమెల్లఁ బక్కఁగనడంచుట! ౧౧౮

శా. సంజన్ మొక్కరు కాళ్ళునేనిఁ గడుగన్ శౌచం బటుండంగ లో
నం జంకర్ మన మిట్టులుంటి మిది యంతర్వాణు లీక్షించిరే
నిం జాలన్ వెలియౌ నటంచు నొకరేనిన్ వారి వారింప రి
క్కంజాక్షుల్ తమధర్మశాస్త్రములకున్ గన్పట్టి రెప్పట్టునన్. ౧౧౯

ఉ. మాలల నంటుకోని జనమాన్యులు, క్షుద్రులు చేసి తెచ్చు భ
క్ష్యాలు భుజింపనట్టి గుణగణ్యులు, మీకులమందు నేఁడు లే;
రీలలి సంచరించు ఘనులెల్లరుఁ బంక్తికి నప్పురై పతుల్
గూలఁగఁ బెండ్లిచేసికొను కోమలు లెట్టు లనర్హ లౌదురో! ౧౨౦

శా. ఆయాస్కూళ్ళను బండితుల్ గలరుగా! యందెందు విద్యార్థు లే
మీ యేర్పాటుగ నుండిరే? యచట లేరే? దుర్కులున్ మాలలున్
సీ! యీయెల్లర కందు వేదమయినన్ జెప్పంగఁ దామొప్ప వి
ద్యాయత్తుల్ కులవంతులై విధవ పెండ్లాడన్ గులంబూడెనే? ౧౨౧

ఉ. కావున నేను నీపిదపకాలమునందలి విప్రజాతిలోఁ
బావనురాలనై మెలఁగవచ్చును సంశయమేల? భార్యగా
నీవు పరిగ్రహించుటకు, నీతులు జాతులు నానకట్టకున్
గావలెఁ బూర్వమం,దిపుడు కైకొనువారెవ రాపచారముల్?

తే.గీ. ఎవరు పూర్వపుటాచార మెఱుఁగువారో
వారలకు శాస్త్రముత్తరవాది యచటఁ
దక్కువారల కీజోలి తగుల దెవ్వ
రేని నడిగిన నోరెత్త రిట్టులనిన." ౧౨౩

ఉ. నావుడు నవ్వి "మాకొలమునంగల వైఖరు లిట్టులుండుటన్
నీ విటు లంటి తప్పిదమె? నీచులు మాన్యత గాంచఁబట్టి యా
యీవిధు లిట్టు లయ్యె; నిదియే మన పూర్వపుఁగాలమైనచోఁ
బావనపుం గొలమ్ము లిటుపాడయినన్ బుధు లూరకుందురే! ౧౨౪

మ. సరసంబౌగతిఁ బల్కితీవు బలవత్సన్న్యాస మన్నట్లు ని
ష్ఠురమౌ జవ్వనమందుఁ గాంతలకు నెట్టుల్ గూడు వైరాగ్య? మె

వ్వరికో జంకి యొనర్చు నేమములు నిల్వన్నెర్చునే? జన్మమే
బరువైతోఁచెడు భర్తలేనిసతికిన్, బైమాట లింకేటికిన్. ౧౨౫

మ. పతిపోవన్ బలవద్గతిన్ సతిని దప్పక్తాగ్నింగమందుంచి వే
చితి నంటించెడు ఘోరసంస్కృతిని వాసిన్ గట్టిపెట్టించి రా
మతిమంతుల్, తగవార లియ్యబలలన్ "బాల్యమ్మునందే వివా
హితలం జేయఁగరాదటం" చనిన నీహీనస్థితుల్ తగ్గెడిన్. ౧౨౬

మ. "పదిరేఁడుల్ చనుమీఁదఁ జేయఁదగు నాపై రెండు మాటంగరా
దిదివో! స్త్రీలకుఁ బెండ్లికిం దతి" యటం చేర్పాటు గావించుచో
ముదితల్ వృద్ధులఁ బెండ్లియాడుటలు తప్పన్; దానిచేఁ దగ్గుఁ దాం
బదిపాల్లీ దురుపద్రవం, బదియు విద్వత్సమ్మతిన్ గాఁపగున్. ౧౨౭

తే. గీ. ఈడువచ్చినకన్నియ నెవ్వఁడేని
వృద్ధునకు నమ్మఁజూప నెవ్విధినిసాగు?
నక్కటా! యెన్నివృత్తులో యనినిుండఁ
బంద లీవృత్తికతన జీవనముగొందురి. ౧౨౮

తే. గీ. అప్పదీక్షితు లొక్కప్పు డాత్మజాత
కిట్టి దురవస్థగల్గఁ దానెటుకకల్మి
స్త్రీపునఃపరిణయములు సేయఁబూని
యును వెనుకదీసెనఁట తల్లి యొప్పకునికి. ౧౨౯

ఉ. అప్పటికాలమందు నెటులైనను నిప్పటి విప్రజాతికిన్
దప్పని దోఁచ దిప్పని, వృథాగతి వారలగోడు వోసికో
నొప్పుటకన్నఁ బండితుల కొండొకదోసములేదు; పెక్కులౌ
తప్పుల కొప్పి యీయొకటి తాము సహింప రదేమి పాపమో! ౧౩౦

తే. గీ. అరయఁగాలేక మిము నెలయ్యాండ్రటందురి
గాని యీయర్థమది నేఁటికాలమందు
ద్రవ్యమిడి పెండ్లియాడిన ధన్యతముల
భార్యలకు నెల్లఁ జెల్లఁగావచ్చుఁగాదె. ౧౩౧

సాంకర్యమ్మొ తటస్థమౌననుచు విశ్వస్తావివాహమ్ము వి
ద్యాంకుల్ పెద్దలు గాదటం చనిరి సత్యంబే, యిదొక్కండె యీ

పంకంబున్ ఘటియించుచో నిటు లనక్ శాగాం; దనంతక్ జగం
బింకం బా కెడిపట్లు నీనియమ మింకెవ్వాఁడు పాటించెడిక్. ౧౩౨

ఉ. భూతి మొగమ్మునంగలుగు పుణ్యుఁడు ప్రొద్దుట స్నానసంధ్యలక్
జేతము జొన్ప వైదిక ఫుఁ జెయ్వులమానిసి నూటి కొక్కఁడే
నీతఁడిఁ గానరాఁ, డిపు డివేటికిఁ? బూర్వపుగాథ లేల? వి
ద్యాతిశయంబు మాని బుధు లందఱు దీనికి నొప్పరాదొకో. ౧౩౩

శా. వ్యాసాదుల్ బుషులై నిజమ్ము లయి తద్వాక్కుల్ భవిష్యద్గతిక్
బూసక్ గ్రుచ్చినరీతిఁ జెప్ప టదియుక్ బోకుండి యాశార! వీ
రే సారజ్ఞులు? వీరికయ్యెడల లేనేలేదు విశ్వాస, మీ
యీా సక్లే నెటు లుండు? భ్రష్టులగువారే తన్మతోద్ధారకుల్." ౧౩౪

తే. గీ. అనుచు నాయూయిగోష్ఠిని నతఁడు నదియుఁ
గొంతతడవు వాదమ్ము దమంత సల్పి
"మనకు నీగొడవేటికే? ఘనులు దీని
విందు" రని విరమించి పై వేడ్క దనర. ౧౩౫

తే. గీ. తమకు ననుగుణమైన వర్తనలఁ గొంత
తడవు గడపి యామీఁద నుదారుఁ డింటి
కరిగి ప్రతిదిన మీరీతి నతిరహస్య
మైనగతి దానిపొందు దా నందుచుండె.  ౧౩౬

గ ద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బైన పాణిగృహీతయందుఁ
జతుర్థాశ్వాసము.

# పాణిగృహీత

## పంచమాశ్వాసము



సరసాంతఃకరణా! సు
స్థిరగానాభరణ! నిత్యచింతితభగవ
చ్చరణ! కవితాదరణ! సురు
చిరవితరణ! కీర్తికామ సీతారామా!

తే.గీ. అవధరింపు మనంతరం బట్లు కొంత
కాలము రహస్యవర్తన గలుగుమీఁద
వారినోటను మఱియు నవ్వారినోటఁ
దల్లి యెల్లసంగతి విని తల్లడిల్లి. ౨

మ. అకటా! పుట్టినరోగమున్ మొదటనే యంతమ్ము గావించి పు
త్రకు యోగ్యుం బొనరించి నాననుచుఁ జేతంబందు నూహించి యీ
సకలమ్మున్ వెసఁ జేతికిచ్చితి నిసీ! చండాలుఁడై వీఁడు దు
ష్టకృతిన్ మానఁడు సైఁచు టెట్టు లిఁక? నింటన్ వంట లే విప్పసుల్. ౩

తే.గీ. వేదశాస్త్రమ్ములందు వివేకులైన
రాజమణుల మెప్పించి మర్యాద మిగుల
నార్జనముచేసి రీయగ్రహారములను
బూర్వు లివి వీనికతమున బొందిఁగలియు. ౪

వ. అని చింతించి యొక్కనాఁటి భోజనసమయమ్మున కొమరున కిట్లను.

శా. అన్నా! చిన్నతనమ్ము నుండియును సంధ్యావందనాసక్తి నీ
కెన్నంగాఁ గడు నెక్కు డిప్పు డది తా నేమయ్యె? బ్రాహ్మణ్యపుం

జెన్నే ని న్విడుచున్న దేమిగతి? నీచెయ్వుల్ విన న్గొ్రత్తలై
నన్నున్ గాల్చుచునున్న విట్టిపనులున్ న్యాయంబె? నీబోఁటికిన్. ౫

చ. ఎఱిఁగి యెఱుంగకో, మొదట నేపఁగఁ గార్యము సల్పితీవు పైఁ
దిరిగియు శుద్ధిఁబొందితి సతీమణియా కులకాంతయుండ నె
బ్బెతికముగాని యప్పడుపుబిత్తరి నిత్తఱి గుత్తగొందువా?
సిరిగల కొంపకున్ గలిగెఁ జేటిఁక మాటలు వేయునేటికిన్. ౬

ఉ. ఎవ్వరిఁ బంపినా వచటికి న్వచ్చెదుముండకునై తనంతఁ దా
నెవ్వగవచ్చు? "నెయ్యెడల కెందుల కేగెదో?" యంచు నెంచితిన్
అవ్వగదా, దినమ్ము నన రాతిరి చెయ్వులె! నీమనస్తనల్
నవ్వరె యెవ్వరేనియు? వినాయకుఁ జేసినఁ గోఁతి యయ్యెనే! ౭

క. ఏమేమి నగలు నాసొము లామాదిగముండ కిడితి? హాహాహారా!
సీ! మూర్ఖ! నిన్ను నీపయి నేమియొనర్చినను బాప మించుక గలదే?" ౮

క. అని యేమేమో యొద పలికినగతి కనుగుణముగాఁగఁ గెరలి పలికినన్
దనుఁగానియట్లు వినియును విననిగతిన్ జెవి నొకింత పెట్టక యతఁడున్.

ఆ.వె. భయముదీఱ పట్టుపగలును రేయును
దాని యింటనుంటఁ దక్క నన్య
మించుకయును లేక యిల్లాలి మాటయే
తలఁపకున్నఁ దల్లి తల్లడిల్లి. ౧౦

తే.గీ. "అంతకంతకు మొఱడయ్యె నహహా! వీఁడు
భార్యఁజూడఁడు వ్యవహారపరతఁ గాంచఁ
డేమిగతి?" యని యెంచి తా నేమియనక
తగినవారిచేఁ జెప్పింపఁ దలఁచె నపుడు. ౧౧

చ. అరమరలేక యింటివ్యవహారము లన్నియుఁ జక్కఁబెట్టుచున్
జిరమువనుండి స్వీయగృహసీమకు నాశ్రితుఁడైన యోగ్యు నొ
క్కరుఁ గని "పుత్రు నీతిపరుఁగా నొనరింపు" మటన్న నాతఁ డు
ద్ధురమతి యొక్కనాఁ డతనితోఁ దగ మంతనమందు నిట్లనున్. ౧౨

మ. కులవిధ్వంసకమైన కార్యము వివేకుల్ సేయఁగాఁ బోరుగా!
కులమన్నన్, గులమా, ద్విజాతి! యది చేకూరన్ వశంబే? తదు

జ్వాలతఁ బ్రాగ్జనిభాగధేయమున సంపాదించి ప్రాయంపు దు
శ్చ్ఛలముంగాని యధోగతిం బడు టిదే చందంబు? నీబోఁటికిన్. ౧౩

ఉ. సన్నములన్ గొనర్చుటో! విశాలయశమ్ము గణించుటో! సదా
మన్ననకెక్కు పండితుల మన్పుటో! చుట్టల నాదరించుటో!
పిన్నఁదనమ్ము రాదె? సువివేకము పోదె? పురాకృతంపు భా
గ్యోన్నతి మన్నగాదె! యిటు లుంపుడుకత్తెలఁ గూడఁ బాడియే. ౧౪

సీ. ముక్తికామినితోడ ముచ్చటించిరిగాని వెలవెలందులఁ గాంచి కులుకరైరి
ఉపనిషత్కాంతల నుంచుకొనిరిగాని పడుపుతొత్తుల యాసఁ బాఱరైరి
సాహితీసతితోడ సరసమాడిరిగాని కులవిహీనలఁ జేరఁ దలఁప రైరి
కీర్తిభామినులకు మూర్తినిచ్చిరిగాని గుత్తలంజెలపొందు గోరరైరి

తే.గీ. తరతరమ్ములనుండి యిందనుక మీ కొ
లమ్మువారలు నేఁటి కీలలనకతనఁ
గొలమునకు నీకు నిహపరమ్ములకు నొక్క
కట్టఁజెడఁదగినంత యిక్కట్టువచ్చె. ౧౫

తే. గీ. ఇహమునం దట్టులుండ మీయింటిపూర్వు
లహహా! పరమున నేని వారాంగనాజ
నమ్మునకు సేవపడియొ జన్మములు కోర్కె
యించుకయులేక చేయుట యీవు వినవె? ౧౬

ఉ. వైదికజాతిలోఁ బొడమి వారనికమ్మికి నెల్లవై యని
శ్వేదమునమ్ముతో నిటు వివేకము దక్కి కళత్రయౌవన
శ్రీ దిగులొంచఁ బాడు వెలచేడియ నంచెడి నిన్ను బోఁటికిన్
మాదిరి సేయ నీ భువనమండలి నొండొకఁ డుండఁ బోలునే? ౧౭

మ. తిరుగుంబోతులు లేరె! వారిఁ గనియున్ ధీజాడ్యమే లేనిచో
నసఁదెవ్వాఁడిల వారకామినుల సౌందర్యమ్ము నాసించు? నీ
వలెనింత దెట్టైన? నేఁటి నీసహజ కేప్రాజ్ఞుండు లోఁగుందఁ? డో
ప్పరికింపందగునే? కనుంగొనుచు మీప్రాపందు మాబోంట్లకున్. ౧౮

శా. దారిద్ర్యమ్ము జనించు, మై సిరి వృథా దైన్యమ్ముపాలౌ, సదా
చారం బాఱడిపా, యశమ్ము మొదలే సన్న్యాసముం గాంచు, సం

సారం బెంతయు నాఱు, నెల్లెడల నిస్సారత్వమే తోఁచు, నీ
వారస్త్రీసురతప్రశంస దగునే? వర్తిల్లు సంసారికిన్. ౧౯

క. అని యేమేమో తా నేర్చిన విధమున బోధ సేయఁ జెవినిడక యతం
డనయము ననయంపున్ వర్తన మానఁడ వివేలమనము తరన్నే త్రిస్ట్రున్? ౨౦

వ. ఇట్లు పలువురు సెప్పం దొడంగుటయు.

మ. ఇది గాదంచు మనమ్మునం దలఁచి యయ్యేణాక్షితోఁ "గార్యమి
ట్టిది" యంచున్ దగఁ దెల్పి "మంచి" దనుచున్ డెందమ్ము వొంగారఁ జొ
క్కఁ దినం బాపురి వీడి యిర్వురును దుర్గాపట్టణం జేగుడెం
చి దిగుల్ దక్కి యటన్ వసించిరి ఘనశ్రీ మించు సౌధమ్మునన్. ౨౧

ఉ. ఆపురి వీరి పూర్వులకు నాకరమాటను దండ్రి యచ్చోటన్
గాఁపుర మాచరింపఁ దగఁ గట్టెను సౌధము, దానిలోనఁ దా
నీపురుషోత్తముండు వెలయింతి నొకర్తుక నుంచెఁ; జచ్చెఁగా
కాపురుషుండు సైఁపఁగలఁడా? యిది దాఁగనులారఁ గాంచియున్. ౨౨

ఉ. జ్ఞాతులుఁ దక్కు బందుగులుఁ గాంచి "యహో! యిది యేమి వింత! దు
ర్నీతి సహింపఁగా వశమె? నేరుపుమై మరలింత" మంచుఁ బో
నాతఁడు వారి వచ్చుటకె యాజ్ఞ నొసంగఁడు లజ్జ పుట్టకు
న్నే! తగు బంధువర్గ "మిహిహీ!" యని యాగ్రహమునందె నవ్వెనన్. ౨౩

ఉ. నవ్వుదు రెల్లవా రని మనమ్మునఁ దా నెఱుఁగండొ? యెక్కడో
అవ్వకు నాకరంబగుట పాతిజ్ఞతపుం దగదం చెఱుంగఁడో?
యవ్వకుఁగాక భార్యకును నంతకుమున్నె పరుండునై బుధుల్
ప్రువ్వగఁ దిట్ట దుశ్చరిత రోయని యాయన నేమనన్ దగున్. ౨౪

శా. ఆనీటున్ వెడగుంబొజుంగు భవనమ్మం దెల్లెడన్ గాయనీ
గానానూన రసమ్ములా! యభినయత్కాంతా వినోదమ్ములా!
నూనాస్త్రాగమ చర్చలా! మిగుల మెచ్చుంగల్గఁగాఁజేయు లా
స్యానందానుభవమ్ములా! యొలయు నీయావేళ నా కెప్పుడున్. ౨౫

ఉ. తిట్టఁగనిమ్ము తల్లి, సుదతీమణి బోరున నేడ్వనిమ్ము, బల్
అట్టు జనింపనిమ్ము, ధనరాసులు గవ్వలు గాక చెల్లని

వృత్తి యఖండ సౌఖ్యముల నందుచుఁ గష్టమెఱుంగనట్టి యా
పుట్టువుకన్న మిన్నయగు ముక్తి విరక్తి యొసంగ నేర్చునే? ౨౬

శా. ఇచ్చున్ మద్దెలగొట్టువారలకుఁ, దా నిచ్చున్ ఒగన్ బాడుచోఁ
గొచ్చెంబింతయులేని స్నేహితులకున్ బూఁబోండ్లకున్ యిచ్చు; రా
నిచ్చున్ బంత్రికికి నెంతమంది నయినన్, వీక్షింపఁ డావంతయే
నిచ్చున్ "ఖర్చిది యాయమింత" యని, వాఁ డేమింకఁ గానుండెనో? ౨౭

ఉ. తల్లికిఁ జిక్కు దర్పమది దక్క సమస్తము నాలుగేండ్లలోఁ
డొల్లఁగఁజేసి యాపయిఁ గడున్ విలువైన తగు నగ్రహారపుం
బల్లల సిస్తు' చాల కవి బంధకముంచి ఋణమ్ముఁజేసి తాఁ
జెల్లఁగఁజేయుఁ బల్కగలఁ జేతికి నెమ్మిక యింత యుండమిన్. ౨౮

తే. గీ. తనదుపంక్తని నన్నసత్రమ్ము జరుగఁ
గామసత్రమ్ము గణికలకడఁ జెలంగ
నయ్యవారునిఁ గొల్చుచు నెయ్యురెంత
కెంపటో సోమరులు వొల్తురెసక మెసఁగ. ౨౯

ఉ. గాయనగాయనీమణు లనేకానేక వేళను బాయకుండుటన్
జేయని చేరికై యతని చేతికి నాటనెలందివోలెఁ దా
హాయిగ జంత్రిపుం గల యొయయార మెసంగఁ బోసంగి లొంగె నా
తీయఁదనంబు మెచ్చు వెనుదీయక గాయకుఁ డెట్టిఁ డేనియున్. ౩౦

తే.గీ. గాయకుఁడు వచ్చెనేని యక్కలికిదాను
శిష్యభావమ్ము గైకొని జెలిమికలిమి
దానఁగలుగు విశేషముల్ తగినకొలఁది
నార్జనముచేసి కాని యయ్యనఘు విడరు. ౩౧

శా. దాతృత్వమ్మున మించియున్ మిగుల విద్యాసక్తి రాణించియున్
మాతృద్వేషము దారదూరగతియున్ మాన్యేతరుంగా నప
ఖ్యాతుంగాఁ దనుఁజేయ నాతఁ డది లోఁగాంచంగ లేకెప్డు లీ
లాతాత్పర్యపరీతుఁడై కడపుఁ గాలంబెల్ల హేలాగతిన్. ౩౨

క. ఆకలికి వర్తనంబది లోకుల కౌకరీతినైన లో నతనికిఁ వ
ద్వ్యాకులచిత్తుఁడగుట నాపా కలిగించి "యది భార్యయగు" ననిపించెన్.

తే.గీ. "వీనితో నవ్వె మొన్న, నవ్వానితోడ
నొక్కటే శయ్యఁ గూర్చుండె నూరకుంట
తగనె?" యని యెవ్వరేనియుఁ దనకుఁ జెప్ప
వినఁడు విననేని నమ్మఁడవ్విధము సుంత. ౩౪

తే.గీ. గాఁగరా గట్టమాని యఖండనీతి
కాకరంబగు కులకాంత యట్ల నవ్వె
లంది వేషభాషాదుల నంది పైకి
సంచరింపఁ గులాచార సరణు లుడిగి ౩౫

మ. ధనమందిచ్చును గాదుగాని యల కాంతారత్న మప్పప్పు నా
థునిఁ జూడన్ గవిగాయకుల్ చనుడు నందున్ నచ్చువానిన్ దనం
తన యేవేళనొ వశ్యుఁ జేసికొని విత్తం బిచ్చు భర్తన్ జయిం
పనొకో నాఁగను జిత్తమిచ్చి కడు సంభావించు గూఢస్థితిన్. ౩౬

ఉ. ఆచెలి కేమిపాపమొకొ హాయిగఁ బాడెడి వానికన్నునన్
వాచవిగాఁ గవిత్వ మొక వైఖరి నుంత రచించు వానిపైఁ
బూచు మనంబు తాదృశుని పొందునకై మది నూరుచుండు నా
లోచనసేయుఁ దన్మయత లోలవిలోచన సారెసారెకున్. ౩౭

తే.గీ. రాజు సంతసమందిన గ్రామమిచ్చుఁ,
బద్దెమిడుఁ గవి, బచ్చు దావైచు ముష్టి,
యెవని మెచ్చునొ కాంత యయ్యొమ్మ కాని
కి తనుపట్టాభిషేకమ్ము నాచరించు. ౩౮

ఉ. ఈగతి నప్పుడప్పు ప్రియుఁ డెవ్వరి మన్ననసేయుచుండుఁ దా
నాగజయాన వారలకె యాత్మసతీత్వము వెల్లడించు నా
బా గదియెల్ల నల్లరిగఁ బైవినువారలు నవ్వుచుండ్రిహో!
బోగముదాని నుంచుకొనఁ బోలునె? యెంతటి పందకేనియున్. ౩౯

ఉ. పోయినఁ బోవుఁగాక వెలబోటిపయిన్ మరులూన నెన్నఁ జే
నీ యది యంతగాఁ దనకు నెగ్గు ఘటింపదుగాని యొక్క తె
"నాన్న!" యని యుంచుకొన్న వెఱ్ఱినాయనకన్నను హీనుఁ డున్నె? యే
ఊాయి సహింపనేర్చు నది అంతు లొనర్చి యమర్చు నేపముల్! ౪౦

మ. వ్యభిచారంబన వారకామినుల కాపం తేని లజ్జాకరం
బభిమానఘ్నము నంచుఁ జోఁచ, దది గోప్యం బేల కావింతు"
న్న భృతిన్, దెచ్చియొసంగు నాఁకుఁ డదివిన్నన్ జీవనంబూడు నం
చు భయానన్; గులకాంతరీతు లెటువచ్చున్? సాంప్రది నెట్లుంచినన్.

చ. సరసతగల్గువాఁడు గడుసంపద నొల్చెడివాఁడు నూతన
స్మరుఁడన నొప్పువాఁడు మదమత్తుఁడు నా విటుఁ డబ్బియున్ దరి
ద్రిరతికి నాస చేయునఁట తా నెలయా! యిది స్త్రీలజాతికే
పరిచితి గన్నదోస మొకఁ బానిసలన్ వెలిఁజేయనేటికిన్? ౪౨

మ. "ఘనమేలా? సొగసేల? చక్కని కవిత్వం బెవ్వఁడే నేర్చు వా
నిని మెచ్చన్ దగు మాటలాడఁ దగు వానిన్ బిల్చి యవ్వానికిన్
జనవీయన్ దగు వానితోడ విధిగా సఖ్యంబు గూర్పన్ దగున్
వనితాచిత్తహరుండు వాఁ" డనుచు నవ్వామాక్షి లో నెంచెడిన్- ౪౩

ఉ. ఏగతినైన మేటి సుకవీంద్రునిఁ గొల్చి కవిత్వ మల్లు నా
యాగతిఁ జక్కనేర్చుకొను నాస దినమ్మును వృద్ధిఁబొంద నా
బోగముచాన పూనికమెయిఁ బొత్తము లెల్లను జూచుచుండు నా
లోఁ గననయ్యె నాత్మకులలోలవిలోచనలన్ గవిత్వముల్. ౪౪

తే.గీ. రాధికాసాంత్వనమ్మను రచనఁజేసి
పేరుగను ముద్దుపళని తెల్వియును, విజయ
నగరభూపాలుఁ డుంచిననాతి చాటు
పద్యములు గాంచి యాకీర్తి వడయనెంచి. ౪౫

మ. ప్రియునిన్ గాంచి కవిత్వపుం గరిమమున్ వేనోళ్ళ శ్లాఘించి త
ద్దయు నావిద్దియయందు నెమ్మనము శ్రద్ధాబద్ధమై యుంటఁ జె
ప్పియు "వారిం బిలిపించి నాకు నది చెప్పింపన్ వలె" న్నాఁగ నా
దయితుం డాప్రియురాలి కిట్టులను విద్యావిత్త్వ మొప్పారఁగన్. ౪౬

మ. కవనంబన్నను మాటలా? యదియుఁ జక్కన్ జెప్ప శాస్త్రాదికం
బవలోకింపవలెన్ బురాకృతపుఁ బుణ్యంబున్న పైఁగాని యా
చవి శాస్త్రజ్ఞులకేనిఁ గల్గ దడియానన్ బొందఁగాఁ బోకు మే
వివరింపన్ గలనా; యటన్ గలుగు నా భేదమ్ము లెల్లన్ జెలీ? ౪౭

సీ. చదువఁగావలె శబ్దశాస్త్రాదికమ్ములను వీక్షింపఁగావలె విద్యలెల్లఁ
జూడఁగావలె రాజచూడామణులసభల్ పొందఁగావలె మహాభోగములను
దిరుగఁగావలె దేశదేశాలవెంబడిఁ బడవలెఁ బడరానిపాటులెల్ల
వినఁగావలెను బూర్వవిద్వచ్చరిత్రముల్ దర్శింపవలెను ఛందఃప్రశంస

తే. గీ. కవులు కవులన్నమాత్రాన కవులుగారు
ఎంతభారమ్ముగలదో కవీశ్వరులకుఁ
దెలిసికొంటివె? యిదియ విద్దెలకునెల్ల
ఫలము; దీనికి యత్నించు టలఁతియగునె. ౪౮

క. అన నదియిట్లను "నంతటి ఘనమగు కష్టమ్ము దానఁ గలదేనియు నె
క్కొని యిపుడు కవిత సెప్పెడి జనులకు మీచెప్పినట్టి శక్తులు కలవే? ౪౯

తే. గీ. దేవభాషాకవిత్వవిధికి విశేష
శాస్త్రవిజ్ఞాన మది యవసరముగాని
దేశభాషాకవిత్వవిధికి నిదేల?
యెఱుఁగనని చెప్పుటో? నాకు నిదియునెల్ల. ౫౦

చ. మునుపటి నాటకమ్ములును మున్నటి మేటిప్రబంధముల్ తెనుం
గొనరుచు నేఁటికైనరుల కున్నవె? శాస్త్రపరిశ్రమమ్ము ల
య్యనఘుల సత్ప్రబంధముల నందఱు మెచ్చుటలేదె? ధారయుం
డినయెడఁ జెప్పనొప్పగుఁ గడిందిగఁ గబ్బము లెవ్వరేనియున్." ౫౧

ఉ. నావుడు నాతఁడిట్టులను "నాతిరో! నన్నయభట్టుఁ డాది వి
ద్యావిదులెల్ల నాంధ్రమున యందుఁ గవిత్వము చెప్పి రౌఁగదా,
యా విదితాత్ములొక్క తెలుఁగా! తమ రభ్యసనం బొనర్చు, టా
దేవవచఃకలాపములు తెల్లముసేయవె వారిపాండితిన్? ౫౨

తే. గీ. తెలుఁగు తెలుఁగని యద్దాన దిగుటకాని
సంస్కృతమ్మునకన్నఁ గష్టమ్ము హెచ్చు
ఒక్కదానఁ బరిశ్రమమున్నఁ జాలు దాని,
కిద్దానికో! రెంటఁ దగులవలయు. ౫౩

ఉ. ఇప్పటి కైతగాం డ్రహహా! యింగిలిపీ సాకయింత నేర్చి పైఁ
జెప్పెద రాంధ్రపుంగయిత, సీ! యవి పండితు లాదరింతురే?

తప్పులతప్ప లక్కృతులు తంపటపెట్టుట కేని నెవ్వరే
నొప్పిరె? వీరిఁజూచియొకో, యూరక నీకుఁ జనించె వేఁదుఱుల్? ౫౪

ఉ. తప్పని యెవ్వరేని విదితంబొనరించిన నొప్పుకొంటయే
తప్ప నదెందుకో యెఱుఁగు దార్ఢ్యము లేకొక ధార యూఁతగాఁ
జెప్పఁగ నొప్పునే కవిత? చెప్పినచో నది మూసిపెట్టుటే
యొప్పునుగాని పై విడుచుటొప్పునె? లజ్జ గలట్టివారికిన్. ౫౫

చ. మునుపు మహాకవీంద్రులు సముజ్జ్వలశక్తి నొనర్చు కబ్బముల్
వినుతికి నెక్కఁగాని యవివేకుల కూఁతలు తాటియాకులం
దునె నశియించె; నోటఁబడు తుంపురులేనియు నిప్పుడచ్చు వ
చ్చినకతనన్ జగాన విలసిల్లెడి మేటికృతుల్ నశించెడిన్. ౫౬

ఉ. ధార వృథారసమ్మునకు ధారయిడన్ మనసెట్టులొప్పునో
వీరికి! నెక్కుడేనియు వివేకులు గల్గిన వారిఁగొల్చి త
త్సారము గుర్తెఱింగి తగు శాస్త్రము నేనియు నభ్యసించి యా
పై రచియింపరాదొకో! ప్రబంధము, లేటికి వెఱ్ఱి యల్లికల్? ౫౭

తే. గీ. కాలమహిమమ్ముగాని యేకాలమందు
వచనము రచించువారు కననమునందుఁ
చేరుగాంచిరి, యెంతటి పేదతనము
వచ్చెఁ గవితాలతాంగి కివ్వారికతన! ౫౮

క. అపశబ్దమ్ములతో వచనపుఁగవితలు మొదలుపెట్టి నారాయణ! మూ
ర్ఖపు మనుజు లక్కటా! కవితపదమ్ములు విఱుగఁగొట్టెదరు నిర్దయులై. ౫౯

తే. గీ. సంస్కృతాంధ్రమ్ములందు వచనకవనము
మున్ను రచియించువారలు నున్నవార
నర్ఘమగు పాండితియును బద్యకవనమ్ము
గలిగి విద్యావిదుల మెప్పుగాంచువారు. ౬౦

తే. గీ. పాలనుభవించువారు యువాగు వొక్క
యపుడు దాఁచిన రిక్తులంచనరు వారి;
నేరికదా, వారి కదియు యశము ఘటించ
దేమి నది దాఁచువారి కాలీలయెట్లు? ౬౧

చ. ఇపు డిఁకనొక్క కర్మమది యేమన? నేర్చినయంతలోనఁ గ
బ్బపుఁబను లాచరింప నది పండితులౌ కవులొప్పఁజూచి "యీ
కపితము సెప్ప నేల!" యని గాఢముగాఁ దలవాయఁ దిట్టి దా
నిపయి విమర్శనం బొకఁడు నింపుదు రంతకు మమ్మడుంగుగన్. ౬౨

తే. గీ. కుడిచి కూర్చుండి యొక్కచో నడఁగియుండ
లేక నీకేల యీనెత్తి? లేమ! యంత
వలసె నేనియు గానమందలి పరిశ్రి
మమ్ము హెచ్చించి యటఁ బేరుఁగొమ్మ, కొమ్మ." ౬౩

చ. అన నది యిట్లుపల్కు "నిజమాడితి, రైనను గానవిద్యలోఁ
బని యది యెంత చేసినను బాడెడి శక్తియె తక్క నర్థమున్
గనెడి తెఱం గొకింతయును గల్గదు దాని విధమ్ము లేనిచో
జననము వ్యర్థ మయ్యది పొసంగెడి విద్యయె విద్య యెమ్మెయిన్. ౬౪

తే.గీ. అన్ని విద్యలఁ గలుగు సారాంశములును
గవితలో నలరారెడిఁ గాన వచ్చుఁ
గాక, రాకుండుఁ గాక యక్కలకు యత్న
మును బొనర్చెదఁ బ్రాప్తి మెట్లనువుపడునో.

క. పదకవిత మొదల నేర్చితి నది నామది కంతకష్ట మనిపింపద యే
రొాదవింపలేరు వచనము! గదియింపఁగ నెంతుఁ బద్యకవన మ్మింకన్. ౬౫

క. "ముదివిటులు విధవలంజలు పదకవిత" లటంచుఁ దిట్టె బహుళాంధ్రవచో
భ్యుదయుఁడు శ్రీనాథుం డది చదివితి నాపైనిఁ గోర్కె చదికిలఁబడిరెటున్.

తే.గీ. కడుపు చెక్కలుగా నవ్వఁగలుగు నకట!
వేణుగోపాలశతకమ్ము వింటిరికద!
"ద్విపదకావ్యమ్ము ముదిలంజె దిడ్డిగంత"
యనుచుఁబడఁదిట్టె నతని నేయమ్మ గనెనో! ౬౬

ఉ. కావున మీర లొక్క కవికంజభవున్ బిలిపించి యాయనన్
జీవన సేవనాదుల వశీకృతుఁగా నొనరించి నన్ను వి
ద్యావతిగా నొనర్చు టది తప్పదు; మాకులమందు ముందు వి
ద్యావతు లాంధ్రిపుం గవిత లల్లు యశస్వినులుం టెఱుంగరే." ౬౭

చ. అన మనమందు దానిదగు నాస్థకు సంతసమంది "మంచిదే"
యని కడుబుజ్జగించి తగునట్టి కవీంద్రుని రాఁక గోరుచున్
దినములు పుచ్చుచుండ సుదతీమణి యొక్కెడఁ గోరె నాతనిన్
దనపురిఁ దత్సమేతముగఁ దాఁ జనఁగా నతఁడొప్పె నందుకున్. ౨౦

వ. పదపడి యప్పాణిగృహీతతో సపరివారమ్ముగ భాగధేయపురమ్ముచని యయ్యెడ నొక్క చక్కని బాడుగుమాడుగున వసియించి నిరంతరసుఖమ్ముల నోలలాడుచు సంగీతాది వినోదమ్ములఁ దేలు నవసరమ్మున. ౨౧

చ. కన్నడసీమనుండి యొక గర్భదరిద్రుఁడు సుంత కైత దాఁ
బన్నఁగ నేర్చువాఁడు నొకపాటిగ గాన మెఱుంగువాఁడు రూ
పోన్నతి లేనివాఁడు వయసొప్పెడి వాఁ డొక బ్రాహ్మణుండు వ
చ్చె న్నిజశక్తిఁ జూపి సిరిఁ జెంద సుదారునిఁ జూచు వేడుకన్. ౨౨

మ. పదపద్యమ్ములు కొన్ని చెప్పి తనదౌ ప్రావీణ్యముం జూప "నే
మిది నీవున్ గవనమ్ము చెప్పఁగలవా? యెందెందుఁ బాండిత్య ము
న్నది?" యంచున్ శ్రుతపాండితీగరిమ నాయాయావిశేషమ్ములన్
గదలింపన్ వెఱఁగంది యక్కవి రిక్తత్వమ్ము సూచించుచున్. ౨౩

ఉ. "స్కూలున నింగిలీషు నొకకొంత పఠించితిఁ దెల్గు దానితో
లీలగ నభ్యసించితిని లేమి మెయిన్ బయిరెండు సాగమిన్
జాల విచారమంది వెస ఛంద మొకించుక చూచి గానపుం
జా లది పూర్వమే కలిగి సాయ మొనర్పఁ గతల్ రచించితిన్. ౨౪

చ. హరికథలల్లుచున్ గృహమునందలి రిక్తత వాసికొంత నేఁ
దిరిగెడి దేశముల్, తగు సుధీమణి శిక్షయొకింత లేమి సు
స్థిరగతిగాఁ గవిత్వ మది చెప్పఁగఁజాలఁ గటాక్షమునుంచి మ
త్పరిచితమైన యట్టికతఁ బాడఁగ నాజ్ఞయొసంగ వేఁడెదన్." ౨౫

చ. అన జలజాక్షిఁ గాంచి "చెలియా! కనుఁగొంటివె యాతనిన్? గుటుం
బ నియతికై ధనాఢ్యులను వంచనసేయఁ గవిత్వమంచుఁ గై
కొని నెపమెత్తి పద్దెములు కొన్ని రచింపఁగఁ జొచ్చె నేను జె
ప్పినయదియెల్ల సత్యమనిపించుట కీతని రాక యుగ్మలీ! ౨౬

తే. గీ. ఎందులోఁ జేరకుండెడి హీనులెల్లఁ
గవులలోపల నియ్యెడఁ గలియుచుండ్రు
ఎల్ల వర్ణమ్ములునుగూడి యించుకంత
యంతరములేక తురకలయంగుఁ గఁదియు. ౭౭

ఆ. వె. ఇంగిలీషు చదివి యాకవిత్వముసెప్ప
నేల? దానఁ జెప్పనేల రాదు?
ఉభయభ్రష్టు లిట్టులొనరింతు రీనాఁటఁ
గవుల కింక నేటి గౌరవంబు!" ౭౮

చ. అన సదయాంతరంగయయి యచ్చెలి పల్కు "విశేష పాండితిన్
గను కవిచంద్రులిక్కరణిగాఁ జనుదెంతురె యెల్లచోట్ల? కి
య్యనఘుని వాక్యమాధురి సహస్రముసేయఁగఁ జాలు మీకు న
చ్చిన కవి కాకపోయినను జెప్పఁగనేర్చుఁ గవిత్వమొప్పఁగన్. ౭౯

చ. చదివెడి శైలి గానపుఁబసం దనరారుటఁజేసి చక్కఁగా
మదికి ముదం బొసంగఁదగు మంజులమైన పదమ్ములుంటచేఁ
బొదలు రసంబు, నేరుపును బొల్చెడిఁ, దప్పులకేమి? రక్తిసం
పద నడఁగింపనేర్చెనె? చమత్కృతిమత్కృతియందు దోసముల్. ౮౦

తే. గీ. దోషముల్ గల్గఁగాక నిర్దోషమయగుఁ
గాక రసహీనకృతికన్న ఘనరసాస్ప
దంబగు కవిత్వమెందు ముదంబొసంగు
నంకయుతుఁడయ్యు జాబిల్లి హాయినిచ్చు." ౮౧

శా. ఆమాటల్ విని యయ్యుదారుఁడును దా నంగీకృతిం బూని స
ర్వామాత్యాదులలోనఁ జేర్చికొని యాయావేళఁ బాడించు చే
మేమో యశ్లీక లల్లఁజేయుచును నాయేణాక్షియుం దాను ని
త్యామోదమ్మునఁ గాలముం గడపుచున్నంతన్ దుదిన్ వానికిన్. ౮౨

చ. ఎరు సోకయింత లేక చరియించుటచే సలకాంతపై మనం
బరిగి యదెంత దిప్పినను నట్టిటు తా నెనుదీయదయ్యె; న
త్తరుణికి నంతకున్ మును పెఁ దన్మయమయ్యె మనంబు, దాన నా
యిరువుర లోపమేమి యటు నీతనిదే యుపశాధ మెమ్మెయిన్. ౮౩

శా. దానిన్ భార్యగ నుంచుకొన్న యతఁ డంతస్స్థాపితన్ జేయక
వ్వానిన్ దీనిని గోప్యమం చెఱుఁగ కవ్వామాక్షి కేళీగృహం
బేనిన్ జేర్చునె? యిట్టులైన నదిగాదే, సత్సతీరత్నమున్
మానం బూడ్చదె? నిత్యసంగ మది 'యున్మాదంబు గల్పింపదే? ౭౪

ఉ. "స్త్రీలకు గోప్యతాగరిమ చెప్పెడివారలు పెట్టు" లంచు మూ
ర్ఖాళి వచింతు రిప్పు డిటు లంగనలన్ సభ కెక్కనిచ్చి యా
మూలమునన్ జెడన్ మొగము మూసుక యిన్నిక లోనఁ గుందు జ్ఞా
నాలసు లెందఱో యిల స్వయంతచితాగను లుండి రక్కటా. ౭౫

క. మును పూర్వు లెంతయనుభవ మునఁ జేసిరొ! కట్టు బాటు; మూర్ఖులు దానిన్
గననేరక యిహిహీ! యనఁ జనునే? తమకంతకన్న శక్తులు కలవే? ౭౬

మ. కలుదారిన్ జన దంచుఁ జెప్పుటకునై కల్లిచ్చు నాచెట్టునా
కలుగూడన్ గలుషమ్ము లంచుఁ దమవాక్యాల్ శాస్త్రముల్ గా జగం
బులకున్ బోధ యొనర్చినట్టి సుమహాత్ముల్ కద్దు కైలాసమా
ఖిలులన్ బోలఁగఁ జాలరో? వశమొకో ఖండింప నక్కట్టులన్. ౭౭

తే.గీ. తమరు విధిలేక చేసెడి తప్పులన్ని
కడుపున కటం చెఱుంగరే ఘనులు, వాని
నొప్పులని చెప్పనొప్పుట యొక్క తప్పు
పూర్వులను దూఱుటిదియుఁ దప్పుపయితప్పు. ౭౮

తే.గీ. స్త్రీకి స్వాతంత్ర్యముండుట చెల్లదంచుఁ
జెప్పు మను వంతపెట్టిరే! చెడి కాలమ్ము
నెల్ల గంగను గల్పదే? యెఱుఁగనేర
కూరకయ శాస్త్రకర్తల మీఱనగునె? ౭౯

ఉ. భోగముదాని కింత తలపోయఁగ నేటికి? కుక్క గోవునుం
గాఁగ నొనర్ప శక్యమె? యగాధము లేగతి నుంచెనేనియున్
స్త్రీగతు, లందులోఁ గఱకు చేయనివాఁడు ధవుండు గల్గఁ దా
యోగిని వంటిదైనఁ గను నొక్క క్షణమ్మున భోగినీగతిన్. ౮౦

ఉ. ఆగతి నిర్వురున్ మరుని కగ్గలమై మనమంద మ్రగ్గుచున్
సాగమిఁ జొక్కి "ఛింఛుకయు సంధగునే?" యని దేవు వేఁడుచున్

రాగమె రోగమై తగఁ గరమ్ము నలందురుచుండి రంతలో
నాగజయాన సాహసము నంది కృతార్థునిఁ జేసె నాతనిన్. ౯౧

క. సామాన్యయయ్యుఁ బరకీయామాన్యతఁగాంచి వాని నహహో నిశరో
యేమూలనో చరితార్థంగా మన్ననసేయు నతని కనుఁ(బ్రామి యొగిన్. ౯౨

ఉ. నాయకు ప్రక్కలో నిమిడి నాతి యెటుల్ కనిపెట్టునో యతం
డాయతమైన నిద్రగను నయ్యెడ మెల్లనలేచి "రాదుగా?
ప్రేయసి" యంచు లో నొగులు ప్రేముడికాని యురమ్ము చేరు నా
మాయలమారి, యయ్యతివ మానస మేమిట ధాత చేసెనో! ౯౩

ఉ. రూపవిహీనుఁ డవ్విటుఁడు రూపసి, చీఁకటి నెల్లు, స్థండిలం
బే పఱ, పూరకుండుటయె యింపగు పల్కులు, ధూళి గంద, మే
చాఁపయునేని దుప్పటిగఁ జాన కృతార్థతఁ జెందు; నేవముల్
దోఁప వొకించుకేనియును దొయ్యలికిన్ బ్రియుఁ డబ్బుపట్టునన్. ౯౪

మ. తనకై భార్యఁ బరిత్యజించెనఁట! మాతన్ వీఁడి యవ్వాసమై
నను గాదంచును రోసెనంట! యొకఁడై జ్ఞాత్యాప్తబంధువ్రజం
బునకున్ దూరగుఁడై వెలింబడిన చొప్పున్ గాంచె నం టట్టివా
నిని దా నిట్టులొనర్ప న్యాయమగునే? నీచాత్మ కాకుండినన్. ౯౫

ఉ. ఆతనియందుఁ బ్రేమ మొదలంట నశించియొ? కాదు; లేక ద్ర
వ్యాతిగమైన చిత్తమున నాశ జనించియొ? కాదు; రూపసం
ప్రీతియొ? కాదు; కొండొక కవిత్వ మదింతకుఁ దార్చనొక్కొ! దు
ర్జాతికిఁ గల్గు చంద మనరాదె? వికల్పము లిన్నియేటికిన్. ౯౬

మ. మగనిన్ రూపమునన్ ధనమ్మునను సమ్మానాతిరేకమ్మునన్
దగు విద్వత్తను దక్కుభంగులను మందప్రజ్ఞుఁగాఁ జేయు మేల్
సుగుణుల్ లేకయె యొక్కరీతిమెయి నించున్ మించు గాకుండ మే
టిగుటిన్ గొల్చునె సాధ్వి? మానవతు లీతీవుల్ ప్రశంసింతురే? ౯౭

ఉ. "వీఁడగు వీఁడు గాకునికి వేఱొకఁడా" నను నట్టి బుద్ధిఁ దూఁ
గాడెడి యందకత్తెఁ గొని యంతటఁ బోవక పంజరంబునన్
గ్రీడకుఁ గాకి నుంచుగతి గేహమునం దిడ గేహినీగతుల్
ప్రాద్భుణాలమ్ము కొమ్మలకుఁ బట్టునె! తైపయి నవ్వి యున్నవే! ౯౮

మ. తనకున్ బ్రొద్దుట లేచుటాదిగ నిశీథంబైన యందాఁకఁ న
మ్మను జిన్నమ్మలఁ బెద్దయమ్మలను బై మాతృష్వసృస్తోమమున్
దన తోఁబుట్టువులన్ మరల్ గొలిపి విత్తమ్మిచ్చి భోగింపు దు
ర్జనులన్ బుట్టినదానఁ జూమ చెలికిన్ సాధ్వీత్వ మెట్లబ్బునో? ౯౯

ఉ. ఉంచికొనంగ నేల? వెల యూడిగపుం జెలులన్ జనుల్, నయో
దంచితమైన వర్తనకుఁ దార్పఁగ నేల? పయిన్ దధన్యధా
భ్యంచనలైన వారలకు నల్గఁగ నేల? కటా! భుజంగులన్
వంచనఁ జేసె ధాత, యొకపాటి వివేకము గల్గఁజేయమిన్. ౧౦౦

ఉ. ఆ చెలి వానిఁ గూడి యిటు లాడిపోకలు వోవుచున్ బ్రియా
గోచరమైన ఫక్కి నటు కొన్ని దినమ్ములు వుచ్చె; నంత నా
యీ చతురత్వమెల్ల దరి నెయ్యెడలన్ వసియించు నెయ్యురే
చూచి క్రమమ్ముగా "నిజము సు" మ్మిది యంచుఁ బలంచి యొండొరుల్. ౧౦౧

చ. కలసి యొకానొకప్పు "డిది గాదిది యహా" యని యర్చఁ జేసి "యీ
తులువ కిదేమి మూఁడెనొకో? తోఁచదు, శుద్ధదరిద్రు డిక్కటల్
తెలిసినఁ గోపదారి వెనుదీయునె? చంపుట కాలఁ డక్కటా!
కలిగెనొకో? దురాత్మునకుఁ గాలము దగ్గతి యిట్టి దుర్మతుల్. ౧౦౨

ఉ. విప్రులలో జనించియును వీరుఁ డితండు దుపాకులన్ గటా
ర్లప్రతిమానముల్ గృహమునం దెపుడున్ గనుమాయనీయఁ డా
ర్తిపద్రిదమంచు నెంచక పొరిన్ బొరి వేఁటకు నేగి కాన జం
తుప్రకరమ్ముఁ జంపు మన దుండగుఁ డిప్పను వున్ సహించునే?" ౧౦౩

చ. అనవుడు వేఱొకండను "నహా! యతఁ డేమి యొనర్చు, నట్టి చ
క్కని విటుఁ డబ్బి సర్వవిధకామనులున్ దన కున్న యప్పు డే
మని యిది గోరఁ గావలయు నా యధమ్మున్? వరియించినప్డు కా
దని వెనుఁద్రోయువారు గలరా? యిదియాతని దోసమెట్లగున్? ౧౦౪

తే. గీ. అక్కలికి భాగ్యరేఖ దానట్టిదగుట
వెలికిరాకుండెఁగాని యీ వెకలితనపుఁ
బోఁడ యిటువంటి యతిథులఁ గూడ దింత
కంద ఱెరుఁదఱు? నిది పన కేటికార్తి? ౧౦౫

చ. ఇది బయలెక్కలేదే నిజముయేనియు నాతనిఁ జంపనేల? య
మ్మదిత వధింపు టొప్పగును, మూర్ఖుఁడు గానియెడన్ వివేకసం
పదకలిమిన్ జెలిన్ గృహము పాయఁగఁజేయుఁడై మేటితెల్వి, కు
క్క దినకమాననే? తనదు గ్రాసము లేకయు మిన్కు పెంచినన్. ౧౦౬

చ. అనుకొన రాదుగాని పన మాతని దర్వ్యముఁ దిన్చునుండి, యే
మని వరియించె నంతకె సహస్రము చూచిన యిచ్చెలంది? నే
మని సతి వీడి యీతులువ కబ్బురఫ్రుం జనవిచ్చె? వీని ని
వ్వనిత యదెట్లు చేసినను వహ్వా! మెచ్చఁగవచ్చు నెమ్మెయిన్. ౧౦౭

సీ. తను దత్తుఁగాఁ గయికొనినతల్లి "యలోహాలో" యటంచునుదుఃఖమొందుచుండ
తనకుఁ గన్నియ నిచ్చు ననఘులౌ నత్తమామలు లోన మలమలమఱుఁగుచుండ
తనుఁ గట్టికొన్న యుత్తముఁరాలు భార్య సంతతధారవృష్టి నేత్రములఁ గురియ
తనయపత్యపు టాసఁ దలకిందుగాఁ వ్రేలు పితరులెల్ల నిరాశఁ బెట్టు దిట్ట

తే. గీ. నెందుకీ ముదితోత్తుతో నిటకు నటకు
గాలిఁ దిరుగాడు నొకయుఁగాక సారెఁ
బయనము లొనర్చుచును దన వైభవమ్ము
గుఱుతెఱుంగనివీనిఁ జేర్కొనఁగవలయు? ౧౦౮

ఉ. మాడువులెన్ని? పూవులసుమాళముసం దగు తోఁటలెన్ని? పై
నీడువచింపరాఁ దగని వెన్నిసిరుల్? తన కేమివచ్చె న
వ్వీడు విడన్? విడెన్ సరయె, వెక్కటి యాత్మపురమ్ముఁ జేరుటన్
బూడిద! యేటికిప్పరినిఁ బోవలె నర్తన మద్దె కొంపలన్. ౧౦౯

శా. అప్పాల్ సేయుటతప్ప వేఱెఱుఁగఁ డీయార్యేతరుం డెల్లరన్
బప్పంగూడుగ మ్రింగుచుండి రిపు డిప్పాపాత్ము రా లెట్టులేన్
దప్పంగాక యదృష్టమే యిదియు, నీతం డింతలోనైనఁ దా
విప్పు న్నేత్రము, లున్న మట్టుకయినన్ వీక్షించి రక్షించెడిన్." ౧౧౦

చ. అన మఱియొక్కఁ డిట్టులను "నాతని కెవ్వ రెఱుంగఁ జెప్పు వా!
ర్విసఁ డెవరెన్ని చెప్పినను వీడఁడి, యంతటఁ బోక చెప్పు వా
నినె వెలిఁజేయు; నయ్యతివ నేరుప దెట్టిదొ! యింత పెంకెవా
నినిఁ దన దాసుఁ జేసికొని నిక్కడి నీగ్గెడి విఱ్ఱవీఁగెడిన్. ౧౧౧

ఉ. ఎవ్వని నేని లెక్కయిడ దెంతటి వానికి నేని మ్రొక్క దీ
క్రొవ్వడఁ బడవలెన్ మనసుకోరిక దీఱఁగ నంచు నెంతు నేఁ
డివ్వగ చేరుటెన్ దగినదే యిది యైన మ ఱేమి లాభమా?
నవ్వెడఁగుం బొజుం గిది యథార్థమటంచుఁ దలంపఁ డింతయున్" ౧౧౨

చ. అన మఱియొక్కఁ డిట్టులను "నా చెలి జోలికిఁ బోవ నేల? యా
యనకును దానికిన్ గలసె నాక్రియఁ, దప్పు లొనర్చుఁగాక యా
తని కవి యొప్పలేయగు, వృథా మన కేటికిఁ గంఠశోష! యే
మని "తగువార" మంచు నిది యాతనితో వచియింప నేగుటో! ౧౧౩

క. అది వేశ్య, యితఁడు విటుఁ డియ్యది తప్పెట్టులగు? భార్యలైన వనితలే
వదలంగ నేర రీ దుర్మదపుం జైదముల నొరులమా కేమిటికిన్? ౧౧౪

క. మన మేల నిమిత్తత్వము గనవలయున్ దీనఁ బాపగతి దాఁగదు పైఁ
జనుఁ దనకుం దన యది, యయ్యనువునఁ దోడ్పడఁగ రాదె? యంతవలసినన్.

క. "ఏకట్టను నిప్పండిన, నాకట్టరొ కాలు" నన్య మనవసరం బీ
పోకలు తగు యోగ్యులకున్ వాక్రువ్వఁగ రాని వింత వంతేమిటికిన్."

క. అనిమిన్న కుండి రంతటఁ జనియెన్ మఱి కొన్ని నాళ్ళు చయ్యన నక్కా
మినికి వినాశనకాలమ్మును మూఁడెన్ లేనిచో సుబుద్ధి వొడమదే?

వ. ఇట్లు దినదినమ్మును గోరిక లీరికలెత్త నత్తలోదరి చిత్తమ్మున నుత్తలపాటు దక్కి యక్కవి యక్కన కెక్కుడు మక్కువఁ దక్కుచు సొక్కుచు నున్నంత నొక్కనాఁటి రేయి యథాపూర్వమ్ముగ గానాదివినోదమ్ములఁ గాలహరణం బొనరించి నిశీథమ్మగుటయు. ౧౧౫

చ. తన వయితుండుఁ దాను మఱిఁ దక్కిన నెయ్యురుఁ గ్రొత్త భర్తయున్
బెనుగది నందు నందిమిడి వేఱగు శయ్యలఁ బవ్వళించి యుం
డినయపు డెమ్మెకానిపయి డెందము నాఱుడు సాహసించి "యీ
జను లెవరేనిఁ గందు" రని చాన మదిన్ దలపోయ కొప్పగన్.

శా. అందెల్ చప్పుడు సేయ కుండుగతి నొయ్యారమ్ముగా లేచి దీ
ప్తిం దెల్వొందెడి దీపమార్చి గుఱిచేఁ బ్రేమాస్పదుం జూచి "వ
చ్చుం దవ్వంగి" యటంచు మెల్కనిన యా చోరప్రియున్ జేరి యా
నందింపన్ దొడఁగెన్ దదీయమగు డెందం బెంతపాషాణమో! ౧౨౦

ఉ. ఆలలీయొల్లఁ దాఁ గని యుదారుని స్యాలకుఁ డెంతయేని యుక్
బాలకుఁడయ్యు లోనఁ "దన బావకు నవ్వుకు దూర మాటకున్
మూల మిదే" యటంచుఁ దలపోసి "యి దేగతినైనఁ బోయినన్
మేలగు నవ్వు" కంచు మితి మీఱిన రోషముఁ బోషముఁ దగన్. ౧౨౦

ఉ. అల్లన లేచి దీపము గృహమ్మున వెల్గఁగఁ జేయునంత కా
హల్లకపాణి మున్నె తనదౌ శయనీయముఁ జేరి "యింక నే
కల్ల వచించినన్ మఱుఁగు గాదిది వీనికి స్పష్టమాయె, నీఁ
డల్లరి సేయు" నంచు మది నల్లలనాడి దిటమ్ము గాంచియున్. ౧౨౨

వ. ఉపాయమ్మున నప్పిల్లవానిం బిలిచి మంతనమ్మగు నెడకుం దీసికొనిపోయి వెలవెలం బోవుచు దీనమ్మగు చందమ్మున మెల్లన నిట్లనె. ౧౨౩

ఉ. తమ్ముఁడ! నన్ను నవ్వగ నెదం దలపోయుదు, వేను నట్టి చం
దమ్మున నిన్నుఁ జాతు నొక తప్పొనరించితి నెట్లు గడ్పులోఁ
బమ్మిన పేర్మిఁ బెట్టికొని బావ యశమ్మిఁకఁ రక్షచేసెదో,
కమ్మవలెన్ స్వబుద్ధికృతకార్యము గాదిది మోస మయ్యెఁజూ! ౧౨౪

ఉ. ఈవిధి దాఁప నేమిగల? దేనొక నిద్దురవోయి లేచి మీ
బావయటంచు డగ్గఱితిఁ బాపి యతం డెటు లూహ చేసెనో,
భావజు మర్మకర్మముల పాలొనరింపఁగఁ జొచ్చె నింతకున్
జీవము నీదు హస్తమున జిక్కెఁ గృతాగసురాల నెమ్మెయిన్. ౧౨౫

ఉ. పాపపు నిద్రమత్తు పొరఁబా టొనరించెను గాక లేనిచో
"రూపసి" యంచు వానిపయి రోసు జనించి స్వయంవరమ్ముగా
నావగిదిన్ బయిన్ బడితినా! యిపుడేవన నేమి లాభమా?
దీపము కొంపదీసెఁ దన తేజము నంతకె పాయనేటికిన్. ౧౨౬

మ. అది గా కెన్నివిధాలఁ జెప్పినను నీ యామాఁక దానెందు కీ
గదిలోఁ జేర్పవలెన్? వినందు కద! యీకర్మమ్ము నేఁడబ్బె; నాఁ
డుది యంచున్ మగవాఁ డటంచు నొకకట్టుంబాటు లేకున్న సి
గ్గది దక్కుంగలదే? యిఁ కేమనుచు నేఁ బ్రాణమ్ముతో నుండుదున్.

చ. అరమఱ లేమి సిగ్గువిడి యంతయుఁ దెల్పెద నంతలోన నే
నరసితిఁ గొన్ని సంగతుల "నాయన కా[illegible]" రని, యప్పుడేని దు

శ్చరితుఁడు 'పోవని'ష్టునిన సన్మతి చెందఁగ వచ్చినా, "యిదే
దొరకెను సం" దటన్న గతి దుండగుఁ డయ్యె నిఁకేమి సేయుదున్? ౧౨౮

చ. ఎవరిని బట్టినన్ విడువ, రేను వచించితి నేనిఁ గోపముం
దవులు, నొకప్డు చూచితివె, "ధర్మమె భార్యను వీడు?" టంచు నే
మివిలి వచించుచున్ గనిన మిక్కుటపున్ మరియాద, వేఱ చె
ప్పవలయునే? యెఱుంగనివి బావగుణమ్ములు నీకు నున్నవే? ౧౨౯

ఉ. ఎన్ని విధాలఁ జెప్పినను నించుకయున్ విన రేమిసేతు? 'నా
మె న్నను జూచుకన్నఁ గడుమేటిగఁ జూడకయున్న దుర్యశో
భ్యున్నతి మిమ్ముఁ బొందు టటులుండఁగ నెల్లరు నంతకన్నను
న్నన్నను వార' లన్న "నిను నాలుక గోసెద" నంచుఁ బైఁబడున్. ౧౩౦

ఉ. దగ్గఱనుండు నీ పలుఁగుఁద్రాగుఁడుఃబోతు లదేమి చెప్పిరో?
యగ్గికి దోసమబ్బినను నబ్బెడిఁగాక వచింపఁజెల్లునే?
మగ్గిగ్గి గృహమ్ములో నిముడుమానవతీతిలకంబుపట్ల నే
యొగ్గును, నెంతకుం దగరె? హీనులుఁ గొంపలు గూల్చు కూళలున్. ౧౩౧

చ. నిజమగు దోసమున్ గనియు నిందుగృహస్థులు వృద్ధికాము లా
ర్యజనులు చూడకున్న యటు లగ్గడనే మఱతుర్; దురాత్ములో,
పరిజనులకు గీడుసేయుటయ వర్తనమాట నసత్యమేని దా
ని జగతి కెక్కఁజేయుదురు; నీచులఁ జేర్చికొనంగఁ జెల్లునే? ౧౩౨

ఉ. పుట్టెఁడు పేర్మితోఁ బతికి భోజన నాయమ యేద్వ దాగమున్
గట్టిన యామెకన్న ననుఁ గాదనరాదె? యెటుల్ వచించినన్
బట్టినపట్టు వీడ దని బావ నెఱుంగుదు కాదె? యింతకున్
గట్టెఁడి దైస మామె నటు కాఁజేయనెట్టెడి నేమిసేయుదున్! ౧౩౩

ఉ. ఆయమ మేటిదై గృహమునందు సమస్తము చక్కఁబెట్ట నే
హాయిగ నా పెచాటున విహారపు భార్యగ నుండి యిర్వురన్
బాయక కొల్వఁగాఁ దలఁతు; బానిసతొత్తులు భార్యలౌదురే?
వేయికి నుండు నేయనుము వీరపతివ్రత దాన నే మగున్. ౧౩౪

చ. పతిరత యుండెనేనియును వారవధూమణి, దానికెట్టులో
పతిన చెడున్, గుటుంబినికి రావటు దుస్థితు "లేమి" యంటివా?

సతి గల యింటి కెక్కరణి సంఘము చేరదు; చేరనేని యు
న్నతగుణు లుందు రం; దవగుణమ్ముల కుప్పలు ముప్పవర్పరే? ౧౩౫

చ. తనుఁ బతియన్న భ్రాంతి మెయి దగ్గఱఁ జేరిన దుర్జనుండు గా
కునికిఁ బయిం బడంగలఁడె యోగ్యుఁడు? కొండొక నాతి యెట్టిదె
నను దనతల్లిగాఁ గనఁడె? న్యాయము దుర్మతి కేలతోఁచు? నె
వ్వని నననేల? నాదు తలవ్రాఁతకు దుఃఖము నందఁగావలెన్. ౧౩౬

చ. అని తనదైన తెల్వి యది యంతయు నుట్టిపడన్ బతివ్రతాం
గనయును బోలె నీతులను గల్పనసేయుచు నప్పగారిపై
ననుమతి చూపు టాదిగల యావిధమంతయుఁ జూచి వాని నె
మ్మనము గరంగి నీరయి సమంజసమై కృప దానికిట్లనున్. ౧౩౭

ఆ. వె. ఇంత చెప్పనేల? యే నేటి కాయన
తోడఁ జెప్పవాఁడ? దుడుకు చెంద
వలదు, తెల్లవాఱ వచ్చె నిద్రింతము
పోద మదిగొ! చుక్క పొడిచె ననుచు. ౧౩౮

తే. గీ. చేతిలోఁ జేయి వేయించి చెలియుఁ గొంత
యంతరంగమ్ము విశ్వాసమందఁ బోయి
యల్లఁ గనుమూసి నిద్రించునదియపోలె
నభినయించుచునుండె నయ్యవసరమున. ౧౩౯

ఉ. వాఁడును "దీన నేమగునొ యామవిలోచన" కంచు లోన న
ల్లాడుచు "దాఁటుకోఁ గలిగి నంతటిదే చెలి" యంచు మెచ్చుచున్
"గూడిక కంతరాయ మొనఁగూడునొకో" యని చింత నొందుచున్
వేడుకదక్కి "యెప్పుడిఁక వేగునొకో?" యని యెంచుచుండఁగన్. ౧౪౦

క. కాకమ్ము లఱచె, మున్నే "కోకో" యని కోళ్ళు గూసెఁ, గోకమ్ములు సు
శ్రీకలిమి విఱ్ఱవీఁగె, దివాకరుఁ డుదయించెఁ దెల్వి వఱలె జగమ్ముల్. ౧౪౧

గద్య.

ఇది శ్రీ ... తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బైన పాణిగృహీతయందుఁ
బంచమాశ్వాసము.

# పాణిగృహీత

## షష్ఠాశ్వాసము.


కపటహృదయాంతర్ని
త్యకళితపాదస్వరూప! ధాతృత్వశ్రీ
ప్రకటితయశస్క! భాభా
సికలాజాలాభిరామ! సీతారామా!

తే. గీ. అవధరింపు మనంతరం బయ్యుదారుఁ
డింపకేని యెఱుంగమి నెప్పటట్ల
నత్తలోదరితో మాటలాడుఁగాని
యబల యొక్కింత మది సందియమునఁ బలుకు. ౨

మ. తనమర్మంబది గుర్తెఱుంగు ననుచున్ దన్వంగి యబ్బాలునిన్
గన, మాటాడఁ, దదగ్రమందు మసలంగా సందియం బందు; నూ
తనుఁడౌ ప్రేమడికానిమోము గని తంద్రన్ జెందు పేయేల? జీ
వనమే బర్వుగ నెంచు; దుష్కృతి దురభ్యాసంబులట్లౌఁగదా. ౩

వ. అట్టియెడ నుదారుం డచ్చెలిమిన్న చిన్నవోయిన విధమ్మున నున్న తెఱంగునకుఁ
దన కన్నులు బన్నమ్ము గన్నయట్లు చింతించుచు సంతాప మ్మగ్గలమ్ముగ డగ్గఱఁ
జేరి బుజ్జగించి యిట్లను. ౪

క. తెలవాఱిన మొద లెప్పుడు కలికిరొ? గానమ్ము లేక కవితయు కృషిలో
మెలపుచుఁ గలకలలాడెడి తలఁ పేమిటి కీదినమునఁ దావగచెడియెన్?

మ. కవి యేమయ్యెను? గైతయెం దడఁగె? జోకల్ మాటె నే మింతలోఁ?
జవి నానాఁటికి హెచ్చెనో! యుడిగెనో? చంద్రాస్య! పద్యమ్ము లె
య్యెవిహోనిన్ రచియించితే! చదువు మేదీ? చూత మందెందు నౌ
ట్టివిశేషమ్ములు గల్గెనో! వెడఁగుబోటీ! యింత వంతేటికిన్,

ఉ. వచ్చిననాఁటఁగోలె నిటు వామవిలోచన! యొక్కనాఁడునున్
ముచ్చట దక్కి యుండ వరమోమయి యీఁగనియంత వంతలోఁ
జొచ్చినదానిఁబోలె నెటు చూచిన నొక్కవిధాన నుంటి; వే
పొచ్చెములేనిదాని కిటుపోలునె? నీకు వినీలకుంతలా. ౭

క. చెప్పు మది యెట్టిదైనన్ దప్పక తీర్తు ననఁ దరుణి తడవికొనుచుఁ దాఁ
జెప్పఁదగిన దొం డుండమి నప్పటికిన్ బొసఁగుహేతు వది కల్పించెన్.

క. కల్పించి మిగుల నేరుపు జల్పనశక్తియును గల్గుసఖి గానఁ దగన్
బొల్పి యది యక్కతమున దిగుల్పానిన యదియుఁబోలెఁ గోమలి పలుకున్.

ఉ. మాటల కేమి లోపమగు? మానసవైఖరి మాఱెఁ, గానిచోఁ
నేటికి దాఁచి పెట్టితిరి? యేఁ గనకుండఁగ నిన్న జాఁ; బిదే
నాఁటను జూడ లే దొకట నాకును మీకు రహస్య మున్న దే?
చాటొనరింపఁగాఁ దగినసంగతి నా కడుగంగ నేటికిన్?

క మిము నమ్మికాదె? నాచుట్టములకు దవ్వైతి నెంతటక్కరులో? కటా!
క్రమముగ నను వేఱొక టగు క్రమమునఁ జూచెదరు తప్పుగలిగెనె? చెప్పుఁడీ.

క. మీయాజ్ఞ మీఱితినొ? మీకాయాసకరమ్ము లైన యాయాకోర్కుల్
పాయక కోరితినో? నన్నీయెరుసునఁ జూడ నేల? యే లాఁతినొకో?

ఆ.వె. మొదలనుండి నన్ను నెద నిట్లు భావింతు
రేని యింత చింత పూనకుందుఁ;
బూవు లమ్ముచోటఁ బుడక లేగతి నమ్మ
దాన? మీరెఱుఁగని ధర్మమున్నె? ౧౩

క. ఇఁక మిమ్ముఁ గొల్చుస్నేహితు లకటా! నను గారవింతురా? వినరే? నా
యకుఁ డొకటి గొట్టినను మాధుకరపువాఁడొకటి గొట్ట దొరఁకొనకున్నే?

ఉ. కేరిమి దప్పుచోఁ నిచటఁ బెండెలు వట్టుక వ్రేల నేల? యిల్
చేరదునా, యటన్న మది చెల్లదు; పంజరమందుఁ గొన్ని నా
ళ్కీరము దా వసించి పయిలేచి చనంగ స్వజాతి దానిపైఁ
గారవము నూఱుఁగాని తగుగారవమున్ బ్రకటించి యేలునే!

క. కాలమునకుఁ జెలి యంటితిఁ బలుకంతపుబాహ్యకృత్రిమాగ్రవైఖరి మీకుఁ
జూలక నగుబాన నైతిఁ దలఁప్రాతఁకుఁ జింతసేయఁ దగదే? నాకుఁ." ౧౮

క. అని బుడిబుడిదుఃఖమ్ముకనఁ గనుఁగవ నశ్రుప్రవులు గ్రాఁగఁగా గద్గదని
స్వన మొలయ మాట లాడఁగ ననుఘ్నసనిపిసము నాఁప నది విరమించెఁ.

చ. "ఇది యొకహేతు వౌనె చెలి యింతటి ంతపు? దాన నేమి యు
న్నది? యడుగంగ నేల? కనకంతన గేమనుమాఁడఁ? జూడు మ
య్యది యటఁ బెట్టియున్న" దని యాతఁడు తెచ్చి యొసంగునంత న
మ్మదిత పఠింప, దించుకయు హో మటు తీప్పదు వ్యాజమూర్తియై. ౧౯

క. దాని కతఁ డెంతయేనియు లోనొగిలి తపంగనాతిలోలుండగుటన్
"మానిని! విను వినిచెద నీనానేరము సైఁపు" మనుచు నారంభించెన్.

క. శ్రీరస్తు చిరంజీవి యుదారునకుఁ దల్లి శోభనాప్తిగ నా
శీరాదిపూర్వకమ్ముగ మీఱిన ప్రేమమున వ్రాయుమే లేమనినఁ:— ౨౦

మ. కనువారెవ్వరో నీవెఱుంగవు, నినుఁ గన్నట్టులే పెంచి పె
ద్దను గాఁజేసి గృహస్థుగాఁ సలిపి సంతోషాఢ్యుఁగాఁ జూడకే
చనె మీతండ్రి, యభాగ్యురాల నగుచుఁ జాయాప్రిజాదూరు నిఁ
గన జీవించితి నేటి కీబ్రతుకు? పాపిక్రోగ్రమ్ము నింద్వాగ్హమే? ౨౧

క. కడచినదానిని సారెకుఁ దడవిన లాభమ్ము గలదె? దొరకు నీకుఁ
బడదగుయ్యోఁ; బురాకృత మియ్యెడఁ దా నిట్లుండె దాని కెవ్వరు కర్తల్! ౨౨

క. ధనమును వెచ్చించితి వని మనమున దిగులొందఁ గలరె మనుమలు? దీనిన్
దినఁగ, మనమూఁడుపొట్టలు చనకుండునె? చాఁప జిరుగఁ జదరయుఁగాదే!

క. చెప్పితిఁ జెప్పించితి నీ యొప్పమియును దెలిసికొంటి నూఱట గన లే
కిప్పు డీఁక నొకటి వ్రాసెద నప్పా! యిద్దానికైన ననుమతి గొనుమా! ౨౪

ఆ. వె. వయసు కొద్దియైనవాఁడవు గాన నీ
కిష్ట మైనకన్నె నేటి తెచ్చి
కొనుము పెండ్లిచేసి ధనమెల్ల మీ కిచ్చి
సంతసింతు మేను సడియుఁ గాంచి. ౨౫

క. దానిపయి దానిదగు కవితానూనాసక్తియును సహాయముగా "నీ
బానిస తొత్తిటు చేయుటయే నిజ" మని కనలుగదుర నిటు లెడ నెంచెన్.

క. ఎవఁడేనిఁ జెప్పినను నమ్మవశము గా, దించుకయును మాయ యెఱుఁగఁ డ
య్యువిదనె యక్కఁగఁగను వీనివిషయమున దోసమెట్లు నేనూహింతున్ ౩౭

క. అని వచ్చెడికోపమ్మును దనమది మును పాఁచుకొన్న తాత్పర్యము గ్రి
క్కున ద్రిమ్మంగఁ గొన్ని నిముసము లనయము నితికృతివిమూఢు డై మాన్పడియెన్.

ఆ. వె. ఎనిమిదేండ్లనుండి యేకశరీరమై
యున్నవన్నెలాఁడి యొక్కయింత
లోన శత్రు వయ్యె, లోమాఱ వెనుకటి
చిన్నె లెన్నఁబడునె! చేటుదక్క. ౩౮

వ. అట్లు ద్రిమ్మపడి యతం డొక్కింత తడవునకుఁ దెలిసి

తే. గీ. ఎఱుఁగ కుంటిని గాని యీహీనబుద్ధి
యెల్లపుడు నిట్టిదే, దీనియెడల నిట్టి
చపలభావమ్ము గలదని సారె నొక్క
చెప్పఁడే? మొట్టమొదలొక్క స్నేహితుండు. ౩౯

మ. అకటా! పిన్నటినాఁట నుండియును నన్యాసక్తతన్ సుంత గా
నక పేర్మిన్ భయభక్తులన్ గొలుచుధన్యన్ మాన్య నిల్లాలి నా
రక యీతొత్తువలన్ దగుల్కొని విచారమ్మందు మున్నంగఁజే
యు కుచేష్టన్ దగినట్లొనర్చె; నిదియే యుక్తంబు దా నెమ్మెయిన్. ౪౦

చ. ధనమును వమ్ము నర్చితిని, దల్లికి దవ్వయి త్రిగుఁబోతులం
దును నొకపద్దు కైకొని యధోగతికిన్ దగువాఁడ నైతి, నీ
యనుచితకృత్య మంతయును నక్కట! యయ్యది కాదె హేతు? వే
మనుకొన నేమి లాభ మగుఁ? నన్నియు నింతకుఁ దీఱెం బూర్తిగన్. ౪౧

ఆ. వె. ఏ నెఱుంగనైతిఁ గాని యీదుష్టురా
లింత కొంతమంది నిచటఁ జూచి
"ఇంతకన్న బుద్ధిహీనుఁడు లేఁ"డను
యశము నాకు జగతి నొసంగె నొక్క. ౪౨

క. అని పశ్చాత్తాపమ్మును, గని హితులకుఁ జెప్ప రండగర్భ మగుటఁ గా
దని యటునిటునుఁ దోఁపక, తనలోఁ దా నిమిడి యయ్యుదారుం డుండన్.

చ. క్రమముగ శంకఁ దక్కి యలకంజవిలోచన "నాఘ స్యాలకుం
డమలినచిత్తుఁడే" యనుచు నాత్మముదం బొకయింత గాంచుచున్
"రమణుఁడు తన్నుఁ జూచుటకు రా కెటు తక్కెనొ?" యంచుఁ గేళిస
ద్మము విడి వచ్చె నచ్చెలి యుదారుఁడు చింతిలుచున్నచోటికిన్. ౪౪

ఉ. వచ్చెనుగాని రాత్రి యొకవైఖరి స్వప్నము గాంచి యుంటచే
నచ్చపలాక్షి యందుఁగల యాత్మమృతిన్ దలపోసి "నిక్కమా
మెచ్చుటఁ గాని యేమొ విధి యెట్లొనరించునొ" యంచు సంశయం
బిచ్చఁ జరింప నగ్రమున నే యొక భంగిని నిల్చె రిత్తగన్. ౪౫

చ. నిలిచినయంత నచ్చెలికి నేత్రము దాఁ జలియించె దానికిం
దలరక దక్షిణంపునయనంబగుటన్ మఱికొంత సందియం
బొలయఁగ "నూరకే యిటుల నుండుటయున్ గల" దంచు దాని లో
దులుపుచు లేనితోస మలతొయ్యలి దాల్చుచు నట్ల యుండఁగన్. ౪౬

ఉ. ఎవ్వఁడు దేనిగాలి యొకయించుక సోఁకినఁ దుళ్ళి చూచు నిం
కెవ్వఁడు దేనిరాక కెదు రేగి యెడన్ దమిఁ గౌఁగిలించు నిం
కెవ్వఁడు భార మం చెఱుఁగ కెప్పటి కంకమునంద నిల్పు వాఁ
డవ్వగలాఁడి వచ్చుటయ యాత్మ దలంపఁ డుదారుఁ డయ్యెడన్. ౪౭

క. అటు నిలువం బడి చింతా జటిల మ్మగు నతని చిత్తసరణిన్ గల దే
మిటి యొకొ? యిటు లింతటిలో మటుమటు యీతనికిఁ గల్గు మర్మ మదేమో?

క. స్యాలకుఁడు తంపి వెట్టెనొ? బాలకుఁ డతఁ డేటి కట్టి పని యొనరించున్
గూళ లెవరేని వానికి నీల యిడి వచింపఁ జేసి రేమో? మరలన్. ౪౮

ఉ. ఏనొనరించుచేష్ట యది యీచినవాఁ డొకరుండె కాక యీ
వానరసేన కెట్లెఱుఁగ వచ్చు? నెఱుంగక యేమి, పెల్లి దాఁ
గాననికన్నులన్ భయముఁ గంపము నొందుచుఁ బాలు దాఁవ నే
గ్గానరె? కొంపఁ దీయుటకుఁగాఁ బ్రియతించిరొ యేమొ? యీనునన్. ౫౦

చ. ఎటు దొరకున్? ధనాంగనకు నిట్టికొలమ్ము వయస్సు రూప మ
క్కటికమ్ము పేర్మి గూర్మి గలకాముకుఁ, డేటికిఁ బోతి వానితోఁ?

గుటిలుఁడు వానికైత యది గొంతుక గోసె, దరిద్రుఁ డేటి కి
చ్చుటి కరుదెంచెఁ, గాళవిధిచెయ్దము లెవ్వరి నెట్లు సేయవే ?

ఉ. హాయిగఁ బద్దెముల్ చదివినంతట వానికిఁ జిక్కెఁ గాని యా
కోయనికోఁత దాఁ దెలిసికో గమకించెనె ? పాడుబుద్ధి, ఛీ !
ఛీ! యని యాతఁ డింక నెడఁ జేసినఁ "జాలుదు" నంచు జీవమున్
రోయక యెట్టులుండు ? సరిరోయువిడల్ ననుఁ జూచి నవ్వఁగన్. ౫౩

ఉ. 'ఎంతటిభాగ్యమే' యనుచు 'నెంతయదృష్టమె' యంచు 'నెంతబల్
వింతలె' యంచు 'నెంతపారలేనితలంపులె' యంచు ముక్కుపై
నింతులు వేలు పెట్టికొని యెల్లపుడు న్నుతియించు నాప నీ
వంతయె నిక్కమైనను రవంతియుఁ గూడవు జీవనస్థితుల్. ౫౪

తే.గీ. 'మురుగు కాలువజాతిలోఁ బొడముపురుగు
లేడ, సంసారిణులతోఁ జివలేడ ? కుక్క
కిందునే నేయి ?' యని మోము నెదుట నెల్ల
వారు నిందింప బ్రతికినభాగ్యమేమి. ౫౫

చ. పొడమితి నేకొలమ్మునవొ పొందితి మిక్కుటమైనభోగముల్
కడపితిఁ గాల మెల్ల వృథ గాక సుఖమ్ముల కెల్లయై చనన్
దొడిగితిఁ గట్టితిన్ గులముతొయ్యాలెల్ల సెబా సనంగ ని
య్యెడ నిఁక నేమియైన నగు నెంతకు శాశ్వత మీశరీరముల్. ౫౬

ఉ. ఐనను నాత్మహత్య యది యంత శుభప్రద మంచు నెంచమిన్
'నాకెఱజాణచెయ్దముల నాయకుఁ గా దని నమ్మఁ జేసి నా
పై నెప రిట్లు చెప్పిరొ, కృపారహితుల్ కపటాత్ము, లిప్పుడ
క్కాని దురాత్ములన్ వెడలఁగా నొనరించెదఁ గాక' యం చొగిన్. ౫౭

ఉ. చిత్తము గట్టి చేసికొని చిన్నెలెఱింగినజ్జాణ గాన లో
నుత్తలపాటు లేనిచెలియుం బలె దగ్గఱఁ జేరి వెన్కయై
యత్తలిరాకుఁబోఁడి కను లల్లనఁ జేతుల మూసె నంతలోఁ
దత్తఱమంది "యెవ్వ" రని తత్కరకంజసమాగమమ్మునన్. ౫౮

క. మెత్త వడెడి చిత్తమ్మును నొత్తిగిలన్ జేసి, చేతు లొక్కింతన దా
నెత్తి వెలిఁ జిమ్మి "ఛీ! ఛీ! తొత్తా! నను ముట్టఁ బోకు తొలఁగు" మటన్నన్.

ఆ.వె. జిల్లవోయి తనదు డెందమ్ము వఱియుఁడై
కట్టు దప్పఁ "గలలు కల్ల గావు
శకునములును గావసత్యముల్ నిజ" మని
మనసు మరల ధైర్యమునకుఁ జొనిపి. ౬౦

క. "పరకీయచందమునకున్ జోరబడితింగాని సుంతసొమ్మునకై క
క్కూరితిం బడనుగదా? యే తరుణులకున్ లేని విట్టి దశ" లని వగచున్. ౬౧

వ. అని త్రాడువాటి యవ్వారిజాక్షి చురచురఁ జూచుచు.

ఉ. ఎప్పుడు లేనిరీతి యిది యెట్టిది? యింతటితిట్టు తిట్టి, నే
తప్పొనరించితిన్? వెనుక దారి యదెల్లను దప్పె నింతలో
నెప్పలుగుల్ మఱేమి వచియించిరి? నవ్వుల కిట్టు లాడుటో?
చప్పుడు గాక యుండ నను సాగఁగఁ ద్రోలు నుపాయమో కదా! ౬౨

తే. గీ. భార్యఁ బాలింపుమని నిన్న వచ్చియున్న
యుత్తరమ్మునఁ జిగురున నున్న యట్టి
తల్లిమాటను బాటింపఁ దలఁచుటొక్కొ?
యే నెచటికేగుదాన? నిన్నిపుడు విడిచి. ౬౩

తే. గీ. వయసు దార దోసి వచ్చినయప్పటి
నుండి నిన్నుఁ గొల్చి యొకటనైన
భేద మింత లేని పేర్మి మెలంగిన
దాన, నెటకు నిపుడు తలఁగుదాన? ౬౪

తే. గీ. వంటబ్రాహ్మణుతోఁ గాని బట్టలుతుకు
వానితోఁ గాని బంట్రౌతువానితోడఁ
గాని లోకమ్ముతో పాటుగా నొకింత
పలికితినొ, యెందుకింతి విూకులికిపాటు? ౬౫

ఉ. ఇంతకుఁ దప్పులేని నను నిక్కరణిన్ జను నే, తిరస్కృత
స్వాంత నొనర్ప? నొక్కయెడ వచ్చుటయున్ గలుగున్ దొసంగు; ర
వ్వంత విచారణల్ వలయునా? "యదె దున్నకు దూడ పుట్టె" న
న్నంతన "పల్పుదె" మ్మనఁగ నౌనె? భవాదృశుఁ డైన మేటికిన్. ౬౬

చ. అని నిలుపోపరామి నయనాంచలసంచలదశ్రుమాలికల్
పెనఁగొని గద్గదస్వరము పేరి వచస్స్ఫురితి దప్పఁజేయ నా
తనిపదముల్ శిరమ్మునకుఁ దాఁకఁగ నొయ్యన వ్రాలి యేడ్చె న
క్కనకనిభాంగి యాతనికిఁ గంటఁ దడిన్ జనియింపఁ జేయుచున్. ౧౮

క. ఐరిసెడికోపము ఘోరిఁబోరిఁ బురికొనఁగాఁ జేసికొని నపుంసకుగతి ద
త్తఱపాటు దక్కి యించుక తరలి మరలఁ బల్కె నయ్యుదారుఁడు దయతోన్.

క. "ఎక్కడి నీ, వెక్కడి నే, వెక్కడినమ్మికలు ? వలపు లెక్కడ ? కొన్నా
ళ్లక్కఱ పడి తిరిగితి మా మక్కువలన్నియును నాఁటిమాటలు చెలియా ! ౧౯

క. అప్పటినీవును వేఱె, యప్పటి యానేను వేఱె యప్పటికాలం
బిప్పుడు రమ్మన వచ్చునె ? యిప్పటికిన్ దగినరీతు లిప్పుడు వచ్చున్. ౨౦

ఉ. రొక్కము లేక కాదు, నిను రోసియుఁ గాదు, మఱొక్క లేమకున్
దక్కియుఁ గాదు చెప్పెద యథార్థప్రసంగతి చిత్తకార్తిలోఁ
గుక్కలరీతి నొక్క వెలకొమ్మలికై పలుమంది చేరినన్
జిక్కులనేకముల్ గలుగు ఛీ యనిపించి విరక్తి చెందితిన్." ౨౧

క. అని యట నిలువన్ జాలక చని వేఱొక్కెడకుఁ గొంత శాంతించియు న
వ్వనితన్ గుకవిన్ సహితముగనె యిలువెడలింప నెంచి కఱకు వాదమఁగన్.

ఆ. వె. తగినమిత్రు నొకని దగ్గఱఁగాఁ బిల్చి
కార్య మిట్టిది యనఁగా నతండు
సంశయించి పిదపఁ జాన యున్నెడ కేగి
యిట్టులనియెఁ జిన్నయెలుఁగు దోఁప. ౨౩

చ. వెలఁదిరో ! యుగ్రుఁడై యతఁడు వెల్గుచునుండెఁ దటాల్న నియ్యెడం
దొలఁగుము లేనిచోఁ గలుగు దొందర లెట్టివియేని యింకఁ బైఁ
బిలువఁగ వచ్చు, నీవపుడు పేరిమిమై నిట రాను వచ్చు; నిన్
దలఁచిన నీరు గాఁడె ? యిటు తా వృథగా వెడలింప నేటికిన్. ౨౪

క. అని యెన్ని చెప్పినను నవ్వనిత వినదు దానియెడల భయభక్తులతోఁ
జను నాతఁ డేమి సేయు ? నెవనివశమగు ? దాని నచ్చోటు వాయన్ జేయన్.

క. పదపడి లోఁకువ యగుటన్ గదలించెన్ గుకవి; నిల్లుగదలి చనెడియా
త్మదయితు చందమ్మునకున్ మదిఁ దనపళకన్న వెలఁది మలమల మఱుఁగున్.

క. అటు లొక్క రెండుదినములు 'కటకట' యని యెల్లరనఁగఁ గలికి యనశన
స్ఫుటకఠినోపోషణముల నటఁ గదలక యతని కరుణకై కాచునెడన్. ౨౭

తే. గీ. కరుణ యొదవియు నాతఁ డక్కలికి యెఱుఁగ
కుండువిధమున డాఁచి " యిట్లొంటినింట
విడుచుపిమ్మట పలసిన విడిది కిటకు
రమ్మనిన బుద్ధిగానుండు రమణి " యనుచు. ౨౮

క. లోనెంచి దాని నానానూనవిభూషణకదంబ మొకటియుఁ గొన క
మ్మానిని యిలు చేర్పించియు దానిజనని కిట్లువార్త దా నంపించెన్. ౨౯

క. నీకొమిరె దుర్మదంపుం బోకిళ్లకు నాకు రోఁతపుట్టెఁ " జను " మనన్
వే కదలదు రెన్నాళ్లే శోకించుచు లంఘనముల స్రుక్కుచు నుండెన్. ౩౦

తే. గీ. దానియాస్తి యావత్తు నీదగ్గఱ కిపు
డంపితిని నీవు వచ్చి నీయాత్మజాతఁ
దీసికొనిపొమ్ము లేనిచో దీనిని బల
వంతముగ నిల్లు వెడలింప వలసి వచ్చు. ౩౧

క. అనుమాట వినినయంతన చని తా నవ్వేశ్యమాత జామాతను నే
ర్చినరీతి వేఁడికొని యాతని చనవుం గాన కంతఁ దనయన్ గనియెన్. ౩౨

క. మెలమెల్లన బోధించియుఁ జలమున రానొల్ల ననెడిదానన్ బలిమిన్
వెలికిన్ గొని చనె; నది యవ్వలఁ దనయిలు సేరి లోన వగచుచునుండెన్. ౩౩

క. ఇదియంతయు విని " "దైవము బ్రతికించెన్ నన్ను నాదు పట్టయి" యని య
మ్ముదిత యిలుసొచ్చెఁ గవ్యపక్షదుఁ "డదియేమనునో" యనెడిశంకవెనుబడన్

చ. కళవళమందుచున్ వెతలఁ గందుచుఁ గుందుచు నున్నబోటి య
ప్వాల వలపున్ మగండటకు వచ్చినయంతన తేటిచూచి వె
ల్వెల దిగఁద్రావి యాతనిచపలన్ బడి కుల్కఁగ సాగె నద్దిరే!
వెలచెలి కబ్బునవ్విరహవేదన లేఁద నశక్య మెట్లగున్. ౩౪

ఉ. "ఏమిటికై వరించితివొ, యిన్వొడఁగుంగవిఁ దీరెఁగాదె! యా
యామువమెల్ల, నింకయిన నవ్వలి కంపక కొంప కేమటం
చీమెయి దూర్చెదే?" యనుచు వృద్ధ వెసన్ దలనోరు మొత్తుకోఁ
గోమలి లెక్కసేయక యకూటములన్ గరఁగించు నక్కవిన్. ౮౫

ఉ. ఆగతి నిర్భయంపుసుఖ మందుచు నాగజయాన లోన నా
నాగతి "నాప్రియుం డిటకు నాకయి తాఁ దనయంత వచ్చు బ
ల్లోఁగినవాఁ డెటుల్ దలఁపులో ననుఁ బాయఁగలండు? దుర్మతుల్
వాఁగెడికూఁతలన్ విడుచువాఁడె! యతం" డని యెంచు సారెకున్.

చ. అచట నుదారుఁడున్ దరుణికై వగఁ జెందుచు నెప్పుడేనిఁ దా
న చని వెలందిఁ జూచుటకునై మది నెంచియు నట్టులైనచో
"సచివులు భృత్యులున్ మిగులఁ జొకఁగ నెంతు" రటంచుఁ గొంకు "న
వ్విచికిలగంధిసాటి పదివేలను లే" రని లోనఁ జింతిలున్. ౮౭

క. డోలాయమాన మగుమదితో లీలలు దక్కి యతఁడు తొయ్యలి 'ఫోటో'
లాలోకించుచుఁ గుందుచుఁ గాలమ్మును గడుపుచుండెఁ గళవళపడుచున్.

క. ఆరీతియొల్లఁ గని యవ్వారాంగన యిటకు మరల వచ్చుట తగ దం
చారూఢి నతనిమిత్రులు వారించెడిపలను జూచువారయి కడఁకన్. ౮౯

తే.గీ. దానియప్పటివర్తనఁ దథ్యముగ నె
ఱింగి "యిప్పటికేని యారంగులాఁడి
వాని వదలదు నీకు నీవంత యేల?
కావలసెనేనిఁ బట్టియీఁగలము మేము" ౯౦

క. అనుడు "నటులాచరించునె? వనితకుఁ బొరపాటు మొదల వచ్చెనుగా క
ప్పని బుద్ధికృతము గా" దని తనమదిలో నున్న తెఱఁ గతండు వచింపన్.

క. వారును నొకసమయము గని యారామామణికిఁ గవికి నగుచేరిక క
న్నారంగన్ జూపంగ నుదారుని రాగాంకురము మొదటికి నశించెన్.

క. తనతప్పిదమును బ్రియుఁడే కనులారఁగఁ జూచుటయును గాంత యొకవిధం
బున నపుడు బొంకి నమ్మిమి ననరాని దురుక్తులెల్ల ననిపించికొనెన్. ౯౩

చ. పదపడి యింక నాతనికృపన్ గడియించుట దుర్లభం బటం
చెదఁ దలపోసి యాస మొదలే నశియింపఁగ ధైర్యమంతయున్
వదలి "యిఁకేటి బెట్టుసరి! నైఖరి బొత్తిగఁదప్పెనంచు న
మ్ముదిత "యుపాయ మిట్టి" దని మూఁటికి నెంచి కృతప్రయత్నయై. ౯౪

మ. తనకున్ దానయి యొక్కరేయి యతనిన్ దర్శించి దీనాస్యయై
యనుమాన మ్మొకయింత లేక చరణమ్మందున్ శిరంబుంచి, ప్రే
ర్మి ననున్ వేగ గరుణింపఁ దప్పదనుమన్ మేలెంచు మంచున్ వచిం
పనిదయ్యున్ స్ఫురియింపఁ జేసి కరుణన్ బాటింపకున్నంతటన్. ౯౫

ఉ. కుందుచు నింటికేగి దనకుంగల తెల్వి యదెల్ల దైన్యపుం
జందమునంద చేర్చి యొక జాబిటు వ్రాయఁగఁ బూనె, నద్దిరా!
చందనగంధు లెట్టి ఘనసాహస మైన నొనర్చి బొంకి నా
ఘుం ఏమచెయ్వులన్ వెనుకఁ ద్రొక్కఁగఁ జేయుదు రెట్టి కుద్ధునిన్ ౯౬

క. 'యమ్మారాధ్యా' గారికి నమ్మినమీఁదాసి చరణనతముఖియై దం
డమ్ములు సారెకు మ్రొక్కుచు నిమ్మయి వ్రాసికొను మనవు లియ్యవియయ్యున్

చ. ఎనిమిదియేండ్లనుండి మిము నీక్షణమున్ బెడఁబాయనైతిఁ గా
దని తమ రూరికిన్ జనినయప్పుడు కాలము లెక్కపెట్టుచున్
దినములు పుచ్చుదాన నిదె! దేవుని చెయ్దిని నాఱునాళ్లమం
డి నెనరుమాలి మీరు కరుణింపమి నీగతి నుంటి నొంటిగన్.

క. ఇఁక నుండఁజాల నాచేయు కుటిలచేష్ట లవి యెన్నియో మనమున లె
క్కకుఁ దా మెటింగి యోజించి కరుణ నిల్పఁదగు నాదుజీవము తలఁకన్.

క. పేరేల చెప్పవలె నన్ బ్రేరేపించి రిటుమీకుఁ బ్రియము గలుగువా,
రారయ కాదుర్బోధకు ధీరత్వము గోలుపోయితిన్ జెడితి నిటుల్.

క. నాకర్మమ్మునఁ గలపని యేకారణమైన నేమి, యిటు లోకపరిఁ దాఁ
జేకూరె నిక్కమిది పై శోకించితి మొదలఁ దెలివి చొప్పడదయ్యెన్. ౧౦౧

చ. తదుపరి యెంత యేడ్చినను దాఁ "జెయి గాలినమీఁద నాకులన్
వెదకుట వంటి దయ్యె; నను వీఁడిగా గణియించి యిట్టిబె
ట్టిద మగువంతకున్ జొనుపు టే యొకయాటగ నెంచి వారు న
న్నుది ప్రానరింపఁజేసి రెవరైనను గర్మము దాఁటువారమే? ౧౦౨

క. ఈగతి నాతల వ్రాసె వృథాగతి విధి, తలఁపు మిమ్ముఁ దగులమి నోరుప్పై
రాగిల్లి మనఃపూర్వకభోగము గావింప లేదు పొరఁబడి చెడితిన్. ౧౦౩

ఉ. ఏకొలమందుఁ బుట్టినను నిన్నిదినమ్ములనుండి మీగృహం
బేకనివాస మాట నిఁక నిప్పడుపుంగొలపుంగృహమ్మున
న్నాకుఁ బదమ్ము లాఁగవు, ధనమ్మును వద్దు మనమ్ము వద్దు నా
రాఁకకు మాత్రి మొప్పుము కరమ్ములు మోడ్చితి నేడ్చితిన్ సఖా.

చ. కడుపున కింత యన్నమును గట్టుకొనంగను బాత్రిఁత-చీరలే
నిడుఁ డిది చాలు; నాయనువు లెంతకు నీచెడుమేన నుండు న
క్కడదనుకన్ భవచ్చరణకంజములన్ గని పెట్టుకుండు నిల్
దుడిచెదఁ బ్రక్కలన్ బఱతుఁ దొల్తటికర్మము నెంచుచున్ బ్రియా.

ఉ. ఇచ్చక మించు నెంచకుఁ డిఁకెన్నఁడు నన్నును గూడవద్దు పై
రచ్చను వ్రాసి యిచ్చెదను రాగి దుగానియుఁ గోరకుండ, లో
నచ్చదు నాకుఁ దల్లికిని నాథ! యెటుల్ వసియింతు నింట, నా
ముచ్చ టిదొక్కటే, చిగురుముద్దిటు చెల్లఁగఁజేయు మెమ్మెయిన్. ౧౦౬

ఉ. మీ రెటు సేయు మన్న నటు మీఱక చేసెదఁ, గన్నులార మి
మ్మారయు టొక్కటే వలయు నన్యము గోరను మీదుదాసి కీ
చేరిక నిచ్చి పాదములఁ జేర్పుఁడదే పదివేలు; దీని నిం
కేరికిఁ జూపకే పనుపుఁ డించుకవార్త, క్షమింపుఁ డన్నియున్. ౧౦౭

క. ఇచ్చయొ యనిచ్ఛయో మీరిచ్చపలప్వాంత కిపుడ యేర్పఱుపవలెన్
బొచ్చెమ్ము వలవదది మీ యచ్చరములతోడ వ్రాయు టభ్యర్థింతున్. ౧౦౮

క. అని వ్రాసియంపుటయు దానిని గని యాతండు మనము నీరగుటయు మా
నినిఁ దలఁచి తలఁచి తనలో ననుకొను నిక్కరణిఁ బ్రేమ మగ్గల మగుడున్.

మ. అకటా! యంతటిదాని కిక్కరణి దైన్యం బింత వాటిల్లునే?
వికలత్వం బవురా! నృపాంగనగతిన్ వేమంది సేవించుదా
నికి దాస్యం బుచితంబె! యెంతపగపున్ జిత్తమ్మునన్ లేనిచో
సకి యీనీచత కొప్పునే! చెలిరో! పశ్చాత్తాప మిట్లున్నదే?

క. కానిమ్ము నిన్న మరలన్ బూనికమైఁ గొన్న మొగముపొంతన్నె లోకుల్
"ఛీ! నింద్యుఁ" డనుచు నుమియరె? నానేరం బేమి యిచట? నారీమణిరో.

ఉ. నీటును గోటునుఁ దగిననేరుపు నోరుపు వన్నెచిన్నెలున్
దేటయుఁ దెల్వియుఁ గలుగునెయ్యపుఁదొయ్యలు లెంద ఱేని నీ
పాటివెలంది లౌదురె? సెబాసు! బళా! వహవా! వహవ్వ! నీ
మాటలసౌరుతీరు గలమానిని నేను జగానఁ గానఁగా.

చ. గజగజలాడు గాగరలు కంగులు రంగు లెసంగు రైకలున్
హారవును ముర్వనుందగు పయంటలు 'షోడరు' లత్తరుల్ విరుల్
గర మలరారు భూషలును గాక వెలందు లటంచుఁ గల్గిరే?
సరసిరుహాక్షి! మీకొలముచానలలో నినుఁ దక్క నొక్కఁడన్. ౧౧౩

చ. అగుదువు సోయగమ్ముగలయట్టి విలాసిని వైన నేమి, నీ
సొగసును జూపుకోపులును సుందరి! వ్యర్థము లంచుఁ జెప్పఁగాఁ
దగు; నది యేమనన్ వినుము తన్విరో! యోగ్యత లేనియప్పు డ
మ్మగువను బొందువాఁ డనఁగ మాలఁడొ? మాదిగవాఁడొ? గాఁదగున్. ౧౧౪

తే.గీ. ఎంతసౌందర్యముండిన నేమిఫలము
యోగ్యత యొకింతగలుగని యువతిమణికి?
నెన్నివగ లెట్టిహృదయేశుఁ డెట్టితళుకు
లుండినను బొట్టులేకున్న ముండయనరె?

తే.గీ. నిన్ను నిందించుకన్నను నన్ను నేన
నింద యొనరించు టది మంచిచంద మతివ!
కాన నావంటి విశ్వాసహీనుఁ డెందుఁ
గానరాఁడు జగమ్మునఁ గలికిమిన్న.

ఉ. ఎందఱనైనఁ జూచితి నికెందఱనైనను జూడనుంటి నో
సుందరి! నీదుచందమును సొంపును నింపు దలంపు నింపు నే
మందు నవారవిందవదనా! పద నాయెద నాటఁబోకు నీ
కుందగు నందకానిఁ గయికొందువు నా కయి కుందనేటికిన్.

క. అని యచ్చెలి తనయెదుటన్ గనుపట్టినభాతి దోఁపఁగాఁ బల్కెడి యా
తనిచందము గని దూతిక యను, "నయ్యా! నన్నుఁ బంపరా! యిఁకనైనన్".

క. దానఁ దెలివొంది తన యజ్ఞానభరం బగు యొతింగెఁగా! యని లజ్జన్
బొ నొందుచుఁ "జను మిత్తర మే నీ-తే" దని వచింపు దేంటికిఁ దడయన్:

చ. అన నదియేగె, నంతవఱ కా జలజాక్షియుఁ ‘బోయి దూతి రా’
దనుకొను, ‘లేఖ తెచ్చునొకొ ?’ యంచుఁ దపించు నొసంగకుండునే ?’
యని ధృతి గాంచు “వట్టియడియాసలె” యంచు నిరాశ నించు, ‘దే
నిని దిని ప్రాణముల్ విడుతు నే’ ననుకొంచు గణించు మందులన్. ౧౨౦

ఉ. నేర్చియొ నేరకో యిటుల నేనొనరించితిఁ దప్పు, దాన బల్
పేర్చిన యాగ్రహమ్ము మెయిఁ బ్రేమయొకింతయు లేక యింత న
న్నేర్చునె ! భార్యనే, పడపుటింతిని గానె ? యిదెంత దోస మీ
చర్చ యదేల ? యాతనికిఁ జచ్చి యశమ్మునఁగూర్చు టొప్పదే. ౧౨౧

క. అని కృతనిశ్చయయై విషమును సిద్ధము చేసికొని యమోఘ వ్యవసా
యనిబద్ధచిత్తయై యుండు నెడన్ దటి కేగి యయ్యనుంగున్ జెలియున్. ౧౨౨

క. “ప్రత్యుత్తర మీ లే” దన నత్యంతామర్ష ఘూర్ణితాంతరయై “ప్రా
ణత్యాగమె వర మిఁక సంస్తుత్యననుగుణంపుబ్రతుకు చొప్పడనేలా ? ౧౨౩

క. మును వేశ్య లొక్కకొందఱు తనువున్ విటుతోడ వీడి తద్దయుఁ గీర్తిన్
గొని, నేను విటుని యపమతి కని, ప్రాణం బూడ్చి సుచిరయశమున్ గొందున్”

క. అని మరల మనము వెనుఁదీసినఁ దత్తఱపాటు దక్కి చెలి సంక్షేప
మ్మునఁ దనయుద్యమమును నాతని కీగతి వ్రాసెఁ దెగువ దైవారంగన్. ౧౨౫

ఉ. “ఇంతకు మున్ను మీకు లిఖయించిన కమ్మ ప్రకార మేను మీ
చెంత భవత్పదాబ్జములసేవకునై బ్రదుకన్ దలంతు నో
కాంత ! బహూక్తులేల ? యిది కష్టమొ, యిష్టమొ ? నేఁటిరాత్రికే
పంతము మాని తెల్పుటది బాగని యెంచి నమస్కరించితిన్”. ౧౨౬

క. అని వ్రాసి మరల నంపినఁ గనుఁగొని లోలోన నతఁడు కరుణ వొడమియున్
వెనువెంటఁ గోపఁ ముబ్బగఁ దనలో దానిట్లొకింత తల్లడమందున్.

ఉ. చచ్చుట నిక్కమేయగు విశాలవిలోచన, చాక యుండుఁగా
కిచ్చుట కెట్లు రాఁదగు? నిహీ ! యని యెల్లరు నవ్వరే ? సరే,
యచ్చటులాక్షి యీపయిఁ గులాచరణం బొనరించి కాలముం
బుచ్చుటకన్నఁ జచ్చుటయె పో ! కడు మేలగు నెన్నిభంగులన్. ౧౨౮

వ. అని యద్దానిం దలంచుకొని.

ఆ.వె. ఇపుడు చావ నేల ? యింతకు మున్న చ
చ్చితివి ; నీవకాదు చెలియమిన్న !
వీఁడు నట్టివాఁడె, భేదమ్ముగల్గునే ?
మనకు నెన్నఁడేని వనజనయన. ౧౨౯

ఉ. పుట్టిరె, గిట్టిరే ? జనులు పుట్టిన నేమగుఁ ? గిట్ట నేమగున్ ?
గట్టిగువర్తనమ్ము చెడి కాపథవర్తనులైనవారి కె
ప్పట్టున సౌఖ్య ముండ, దధవా యొకపట్టునఁ గల్గఁగాక దా
నిట్టిదయౌ నిసీ ! చెడితి నెమ్మెయి నన్ జెడఁగొట్టితంగనా! ౧౩౦

మ. గృహిణీవర్తనమందు నీకుఁ గలరక్తిన్ గాంచి నీహేతువై
బహుదుశ్శీలము మీకొలమ్ము గుణముం బాటించు నంచెంచితిన్
మహిళారత్నమ ! యన్నియున్ మృషలె నీమాటల్ ; సెబా సింతకున్
బహి వెట్టన్ బడి ప్రాణ మూడ్చు మనుచున్ వ్రాసెన్ విధాత్రుం డహో. ౧౩౧

ఉ. ఏనును జీవ మూడ్చుకొనకే ప్రయతింతునొ, దాన నేమగున్ ?
మానిని ! యాఁడుదాని కది మన్ననఁ దెచ్చెడునట్లు పూరుషుం
డేని నొసంగఁ, డెక్కరణి నిన్ విడియుండుదు ? నేమొగమ్ముతో
నే నినుఁ బూర్వమున్ బలె గణింతు ? ఘటింపవు రెండునుం జెలీ." ౧౩౨

క. అని యత్తుదిజాబునకును దనప్రత్యుత్తరము నిడక తరుణీమణి దూ
లిని నంపుడు దా నచ్చెలి విని యాపై నొడలు వీడ విసమున్ మెసవెన్. ౧౩౩

క. అక్కటతన నత్తలోదరి మిక్కుటమగు నార్తిగూరి మృతి గనుటయు నీ
వెక్కసపువార్త విని మది నెక్కుడు చింతించె నాతఁ డిది యొప్పదొకో. ౧౩౪

ఉ. అయ్యది యెట్టిదైన హృదయంబు సదా తదధీనమాగలిన్
నెయ్యము మై మెలంగు నల నీటునెడంగుబొజుంగు నేఁటి క
త్తొయ్యలి యాత్మహేతువున దుడ్కుమెయిన్ మృతిఁజెంద నెంత గా
దయ్యము నేఁతకై వగచి తాళఁగఁజే కెదఁగుందఁగావలెన్ ! ౧౩౫

క. పగవారల మృతికైనను దగువారల హృదయమునకుఁ దాపము దవులున్
మిగులఁ బ్రియమైన యాసోయగపుంగని కతఁడు శోకమందుట తగదే ?

చ. అరసితిరే ? యుదారు గతి యక్కట ! యెంతకు వచ్చె ! దప్రియమా ?
నురిఁగె, యశంబు గంగఁబడెఁ, జొక్కపుమేని పసందడంగె, దు

ర్భరమగు పాతకం బొకటి పైఁబడె, దుఃఖముతోడిపా టుహా!
గురితపుసంత వారసతితోఁ దగునే? తగులాట మేటికిన్ ? ౧౩౭

వ. పదపడి యయ్యుదారుండును.

ఉ. దానిపైసక్తియెల్ల దిగఁద్రావి స్వకీయపురమ్ముఁ జేరి యా
పైని స్వభార్య దాను నొకసాటి గృహస్థులపోల్కె నుండి, ర
జ్ఞానమదెల్లఁ బోయె, భవసాగర మెందు నసార మంచు లో
లో నెఱిఁగెన్ మఱియయ్యెడల లోలుఁడు గామియు దానఁ జేసుతెన్.

క. ఆపయి వేశ్య లనినఁ దద్వ్యాపృతి గలవార లనిన నత్యధికానూ
యాపరవశుఁడై చూచు స్వాలోపము లన్నియును దలఁచి లో లజ్జించున్.

చ. తనభయ మింత లేమిని యదాయదలో నలయగ్రహారముల్
గనుఁగొని వానిపై ఋణము గల్గుటకున్ మది రోసి వానినె
ల్లను వెసఁ దీర్చి తల్లి తనలక్షణముల్ గని సంతసింప నీ
తిని గనె నెల్లభంగుల నుదగ్రయశం బనిశంబు గ్రమ్మఁగన్. ౧౪౦

గద్య.

ఇది శ్రీకింకవీంద్రఘటాపంచానన విద్వత్కవిబాలకళానిధి
బాలసరస్వతీ శతావధాని తిరుపతి వేంకటేశ్వరులచే
రచియింపఁబడిన పాణిగృహీతయందు
సర్వమును

షష్ఠాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ.

సంపూర్ణము,

# —♦ పాణిగృహీత ♦—

## శుద్ధపత్రము.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 5 | 5 | దాఁబహివెట్టె | దాబహివెట్టె |
| 23 | 27 | మెద్ధియేని | మెడ్డియేని |
| 30 | 13 | దో్రహామాది | ద్రోహామాఁది |
| 40 | 2 | వెఱువఁడయ్యో | వెఱవఁడయ్యో |
| 45 | 13 | రాఁకకయి | రాకకయి |
| 45 | 18 | జగదేకచుందరీ | జగదేకసుందరీ |
| 58 | 27 | నాఁటఁగదల్లి | నాటఁగఁదల్లి |
| 62 | 2 | నరువది | నఱువది |
| 68 | 18 | దోఁసగ | దోసఁగ |
| 76 | 17 | రెుయయూర | యొయూర |
| 78 | 2 | కావింతు" | కావింతు" ర |
| 78 | 3 | న్న భృతిఁ, | న్న, భృతిఁ |
| 86 | 14 | దరిద్రు డి | దరిద్రుఁ డి |
| 90 | 19 | భోరున | భోరన |
| 93 | 10 | జాఁ; | జా; |
| 96 | 23 | దీ కెం | దీ కెఁ |
| 100 | 14 | ఛీ | చీ |
| 107 | 15 | నాసంగఁ | నాసంగ |

శ్రీరస్తు.

శ్రీమత్పరదేవతాయై నమః.

# శ్రీ బొబ్బిలి పట్టాభిషేకము

## ప్రథమాశ్వాసము.

---

క. సిరియును సంపదయును దా
మరతంపరగా నొసంగి మనుతురెపుడు శం
కరమాధవాబ్జజులుఁ ద
త్తరుణులు శ్రీరామకృష్ణధరణీనాథున్.

మ. శుభవర్గోదయమై యనేకనృపతిస్తోమాత్మభూసూత్న్వభూ
ప్రభుతాపాదకమై కరీంద్రతురగేంద్రస్యందనేంద్రప్రభా
రభటీప్రాపకమై కవీశ్వరవచఃప్రఖ్యాతికావాలమై
ప్రభవాబ్దం బలరారె సంతతసుఖప్రస్తావభూయిష్ఠమై.

చ. ప్రతిప్రభవాబ్దమిట్టులె స్వభావశుభాస్పదమై యొసంగి యీ
క్షితి నలరించెనో, యిదియె కేవల మీవల నిట్టిదయ్యెనో
గతము నెఱుంగువారలకుఁ గాక తదన్యుల కస్మదాదిపం
డితులకు నెట్లు వేద్యమగు నేఁటిది సౌఖ్యద మెల్లభంగులన్.

ఉ. గతమునుగూడ నిట్టిదనఁగాఁ దగు; నేమన, బ్రహ్మసృష్టికి
క్షితిఁ బ్రభవాబ్దమే మొదటఁ జెన్నెసలారెడి దయ్యెనేని యీ
గతి నలరారుటే ధ్రువముగాఁ దగు మంగళమాదియందు సం
గతమగు నెందునొప్పుఁగద! కర్జము లార్యులొనర్చు పట్టునన్.

క. ప్రభవాబ్ద మఖిలసస్య
ప్రభవాబ్దం బగుచు మిగులఁ బ్రభ దైవారెన్
బ్రభవపద మఖిలమునకున్
బ్రభవంబను నర్థమునను బ్రథితంబుగదా.

ఉ. అందు వసంతముం దపను నభ్రసమాగమ మంబుజప్రభా
కందము హైమముం గడచెఁ గంజముఖీకబరీభరోత్కరా
నందదమై యనంతరమునం శిశిరర్తువు తారసించెఁ జ
ల్లందన మాష్ణ్యముం సరితులం విభజించినచొప్పు చొప్పడన్.

క. రవి యుత్తరాయణమ్మునఁ
దవిలి మెలంగందొడంగెఁ దత్కాలమరు
ద్భవగుణము రాల్చె నాకుల
నవపల్లవజాలములు గనంబడె లతలన్. ౭

ఉ. పేదకు సాదకుం సుఖము పెంపొదఁగూర్చుచుఁ బ్రాణికోటికిన్
ఖేదము నంతయుం గలుగు కృత్యము గన్పడనీక భూజనా
మోదము పూర్తిగాఁగొని ప్రభుత్వముతా శిశిరర్తువేలె మ
ర్యాదకులోఁగియేలెడి ధరాధిపతిం దలపింపఁజేయుచున్.

మ. భవుకంబై శిశిరర్తు విట్లలరు నప్పట్లం వివాహాదివై
భవముల్ పద్గులు శోభనంబులు క్రియల్ పట్టాభిషేకమ్ములుం
శివవిష్ణ్వాదిమహోత్సవంబు లెలమి జైనార్చె నేయూరిలో
నవలోకించిన సంగతప్రకృతికళ్యాణమ్ముగా నెల్లెడన్. ౯

ఉ. రాణ నిటుల్ ధరావరపురంధ్రిక చెన్నెసలారె నిత్యక
ల్యాణముఁ బచ్చతోరణమునై; చెళపిళ్లకులుండు సత్కవి
ప్రాణము వేంకటేశకవి యాత్మగృహమ్మున నాప్తబాంధవ
శ్రేణిహితుం ద్వితీయసుతుఁ జేయఁదలంచె నవోపనీతుఁగన్.

క. సుతునుపనీతకి బంధు
ప్రతతిం బిలువంగ వారు వా రుండెడియూ
ళ్లతిముదమునఁ జని పిలిచియుఁ
గృతి వేంకటసుకవి యింటి కేతెంచె నొగిన్. ౧౧

మ. "పరమోత్కృష్టముగాఁగ బొబ్బిలిపురిం బట్టాభిషేకంబు మీ
రరుదేరం వలె రాజుగారు భవదీయాశీస్సు వాంఛించుచుం
డిరి; రేమో లిఖియించినాఁడ నని దీనిం మీ రుపేక్షింపకుం
దురుగా" కం చొకకమ్మ యింటికడకు న్నృత్యవచ్చి నిల్చెం తసన్.

చ. అది లిఖియించినట్టి సుగుణాత్మకుఁ డుమ్మిరి రామలింగస
ద్విదితుఁడు రాజచంద్రునకు దేశికుఁ డాంగ్లమునందు, తని య
భ్యుదయము గోరుచుండు పరమోత్తముఁ డీయనతోడ నేఁడు నె
మ్మికిఁగల యూహఁ దెల్పి ధృతిమై లిఖియింపఁగఁజేసెఁ బత్రమున్. ౧౩

ఉ. ఇంటికివచ్చి కమ్మఁ బఠియించి కవీంద్రుఁడు "రాజుగారిలో
గింటను మంత్రియింట నెసఁగెన్ సమకాలమునందె పెండ్లి" యం
చంట కిదేగదా! తగు నుదాహృతి యంపు మటన్ దలంచి రా
వంటయు మంచిగామి వినయమ్మున నిట్లు లిఖించెఁ బత్రికన్.

ఉ. నాయెడ నేఁడుచూపిన ఘనంబగు పేర్మికి స్వస్తిగల్గఁగా
కీయెడ మత్తనూభవునకే నుపనీతియొనర్పఁ జుట్టలన్
బాయని వేడ్కఁ బిల్చితిని పార్థివు రాజ్యమహోత్సవంపు ను
శ్రీయిదియున్ గడున్ దరిగఁజెన్నె నలారెడి నెట్లువచ్చుటల్? ౧౫

ఉ. వచ్చిన వెంటనే సెలవు పార్థివు లిచ్చుట కల్ల; యట్టిచో
వచ్చి యనుజ్ఞఁ గైకొనక వారక వత్తునయేని మిక్కిలి
నొచ్చుకొను న్నృపాలుఁడు మనోగతినంచుఁ దలంతుదీని మీ
యిచ్చగణించి నన్ను క్షమియింపుటకే ఘటియింతు నంజలిన్.

మ. అని వ్రాయంగను రామలింగవిబుధుం డాలేఖ భూనేతకున్
వినిచెన్; తాఁ "డటులేల సందియమహో! వెన్వెంటనే వారి నం
పను యత్నింతముగాక వచ్చునటులన్ వ్రాయుండు" నా రామలిం
గన వ్రాసెన్ జనియెన్ గవీశ్వరుఁడు శిష్యవ్రాతముల్ గొల్వఁగన్.

ఉ. ఏ యిలుచూడ మంగళసమేధితమై మఱి యేవితర్దియున్
గాయనగాయనీజనవికాసితమై మఱి యేప్రతోళియున్
శ్రీయుతమై యెటంగనినఁ జేతము పల్లవితంబుగాఁగ శ్వ
శ్శ్రియసమూలకందమయి చెల్వున బొబ్బిలి వొల్చె నయ్యెడన్

చ. కవివరుఁ డప్పురంబెలమిఁ గన్నులపండువుగాఁగఁ జూచి "భూ
ధవు నెడఁ బ్రోలిమానిసులు తద్దయు రక్తులుగావుటంగదా!
భవుకవిధానిధానముగ. భాసిల్లఁ బ్రోలి నలంకరించి రు
త్సవమున కెల్లవారు" నని సంతసమంది నుతించె భూవరున్. ౧౯

శా, వేదాధ్యేతలు శాస్త్రవేత్తలు జగద్విఖ్యాతులౌ సత్కవుల్
నాదబ్రహ్మము లైనగాయకులు నానాగాయనీరత్నముల్
ప్రోదింగూర్ప మహోత్సవంబులు కడుం బొల్పార నయ్యుత్సవం
బానర్యమ్ముగ నయ్యెఁ జూపకులు 'వహ్వా' యంచు నగ్గింపఁగన్ ౨౦

చ, పలుగతులన్ మనంబలరఁ బార్థివరాజ్యమహమ్ము గాంచి య
క్కలిమికి సంతసించి నృపకాంతుని స్వీయకవిత్వసంపదా
కలితు నొనర్చి యాతఁ డిడు కానుకలన్ గ్రహియించి సమ్మదం
బలరఁగ వేంకటేశకవి యాత్మపురమ్మున కేగెఁ జెచ్చెరన్.

ఉ, అంతట బంధువర్గములు నాప్తజనంబులు శిష్యసంతతుల్
సంతస మొప్ప వచ్చుటయుఁ జయ్యనఁ దా నుపనీతుఁ జేసె న
త్యంతముదమ్ముతోఁ గొమరు; నమ్మహమం దొకనాఁడు బంధుగుల్
స్వాంతమునన్ హళాహళిని జల్పెడికోర్కెని దెల్పి రీగతిన్. ౨౨

క. భవదాత్మజు నుపనయనం
బవలోకించితిమి మోద మందితిమి భవ
త్కవితామృతాప్తికై మా
చెవులూరుచు నున్న వేమి చెప్పుదు మనఘా. ౨౩

శా. గద్వాలాదులలోని ముచ్చటలు వక్కాణింపఁగా వింటి మో
విద్వత్సత్కవి! మొన్న బొబ్బిలికి మీ ర్వచ్చేసినారాఁ గదా !
తద్వార్తల్ విన వేడుకయ్యెడిని స్వాంతమ్మందు మా కంచు వా
రత్యుద్వేగంబు వెలార్ప వెంకనయు నామోదంబు దీపింపఁగన్. ౨౪

చ. వినఁదగునట్టిసత్కథయె పృచ్ఛయొనర్చితి రీరు వేడ్కమై
విని చెదఁగాని దాని సుకవిప్రవరేద్యముగాఁగఁ గావ్యముం
బొనరుపుఁడంచు నల్లపుడె బొబ్బిలి రేఁడు వచించెఁ జేయుచుం
టిని నెలలోపలన్ ముగిసెడిన్ వినవచ్చు ననంతరమ్మునన్. ౨౫

క. ఇఁక నొకమాసత్రితయము
నకుఁ జెండిలీయగును గాదె నాపెద్దకుమా
రకునకు నయ్యెడ మీకో
రికె నెఱవేర్తుం గలాఢ్య ఋతమగు ననుడున్. ౨౬

ఉ. వారలు సంతసించి మది వారక వెంకనపుత్రు పెండిలిన్
గోరుచు "చెప్పుడెప్పు"డనుకొం చుడివోవని వేడ్కనుండి రెం
తే రహిం స్వాధికారమునఁ దెల్చి భువిన్ శిశిరర్తురాజు సా
ధారణమైన గేస్తుబలెఁ దానురిఁగెన్ విగతాయతిస్థితిన్. ౨౮

శా. అంతన్ వచ్చె వసంతమెల్లెడ ననేకానోకహామోదమై
కంతుం డెంతయు వింతవింతరుచులన్ గల్పించి శ్రీపుంజన
స్వాంతమ్ముల్ గఱఁగించి యాత్మప్రభుతన్ సాఁగింపఁగాఁజొచ్చెనే
ప్రాంతమ్మందునఁజూచినన్ శుభములై భాసిల్లె నాశాంతముల్. ౨౯

ఉ. నీలగిరీంద్రసానుగతనిర్మలశీతలశానుభూతికై
వ్రాలెడి కోర్కెలుప్పతిలఁ బశ్చిమఖండనివాసులేగి ర
క్కాలము నాత్మ రాజ్యమునఁ గడ్వఁగలట్టిజమీనుదార్లు వోఁ
గా లలిమై గతానుగతికమ్మయి కన్పడె వారివర్తనల్.

చ. నవనవపుష్పిణుల్ లతలు నవ్యకిసాలయశాలిభూమిరు
ట్ప్రవరములన్ స్వయంవరవివాహవిధిన్ వరియించెఁ దన్మహో
త్సవము మదిం దలంచుకొని స్వైరిణు లాత్మమనోనుకూలురన్
నవనవమై స్వయంగ్రహణసంగతులన్ దనియించి రయ్యెడన్. ౩౦

మ. వివిధంబుల్ ఫలజాతులున్ వివిధముల్ వింతైనపుష్పమ్ములున్
జవి మెచ్చం దగు తేనియల్ పఠిలసచ్చంద్రద్యుతుల్ యామినుల్
చెవికింపైన వనప్రియప్రముఖపక్షిధ్వానముల్ తద్వసం
తవిభూతిన్ వెల్లడించెఁ జందనభూభృత్సంజాతవాతమ్ములున్. ౩౧

మ. విభవాఖ్యం బగువత్సరమ్మున నిటుల్ విశ్వానుకూలమ్ముగాఁ
బ్రభదై వారె వసంతసంగతి దివారాత్రమ్ములన్ శోభన
ప్రభవంబుల్ పలువాద్యముల్ ప్రవిలసద్వారాంగనానృత్యముల్
నభమున్ భూమియు నిండె వైదికులనిర్యాణంపు వేదధ్వనుల్. ౩౨

ఉ. అంతట వేంకటేశకవి యాత్మజు పెండిలి తారసించె నా
స్వాంతము బంధువుల్ మఱియుఁ బండితులున్ గవులేగుదెంచి ర
త్యంతముదమ్ముతో ముహుః ప్రహృష్టివమొప్పెసలారె నొక్కనాఁ
డంతకుఁ బూర్వమున్ బరఁగె యాత్మని గోష్ఠి వారలాదటన్. ౩౩

ఉ. కోరినయంత వెంకనయుఁ గోవిదులన్ గడుగారవించి యో
ధీరవరేణ్యులార ! భవదీయసమాదృతి కెంతయున్ ముదం
బూరెడి నామదిన్ వినుతు నుత్తమనాయకుఁ డైనబొబ్బిలి
శ్రీరమణప్రకాండునభిషేకము నర్మిలి నాలకింపుఁడీ. ౩౪

ఉ. భారతవర్షమొప్పెసఁగుఁ బండితమండలి కాలవాలమై
చారుతరమ్ములౌ నదులు చక్కనిపర్వతపంక్తులున్ మహో
దారము లైనపట్టణవితానములున్ జిరకీర్తినొప్పు కా
సారములున్ నిలింపులకు సైతము కన్నులపండు వౌనటన్. ౩౫

మ. నవవర్షమ్ములలో విశిష్టధనధాన్యశ్రీలతోఁ గర్మభూ
మివిభాగమ్ములతో వివేకులగుభూమీపాలకశ్రేణితోఁ
గవితాధూర్వహులైనపండితులతోఁ గల్పాంతసుస్థాయియై
భవమై భారతవర్షమొప్పెసఁగు గీర్వాణాలయప్రాయమై. ౩౬

మ. ప్రతిగేహమ్మున దేవతార్చనలు శాస్త్రప్రక్రియావాదముల్
కృతహోమానలధూమముల్ నిగమవాక్యోదారులౌదారకుల్
సతతాతిథ్యవిశిష్టభోజనములున్ సంపన్నముల్ గాఁ దృణీ
కృతతద్బ్రహ్మపురందరుల్ ద్విజులు వర్తింతర్ధరామండలిన్. ౩౭

శా. ఛందస్సుల్ కనిపెట్టినట్టిఋషులున్ సర్వంసహాచక్రమె
ల్లందోర్విక్రమమొప్ప నేలిన మహాలక్ష్మీకులౌ రాజులున్
బృందారణ్యములోను గాఁగలుగు నుత్కృష్టంపుఁ దీర్థమ్ము ల
స్పందుల్ సర్వమతప్రవర్తకులు నిచ్చల్ వొల్చిరిచ్చోటనే. ౩౮

క. ఈవర్షమునందలి వి
ద్యావై భవనాగరికత లాదృతిమై నా
యీవర్గస్థులు కైకొని
ప్రావీణ్యము మెఱసిరిప్డు పరమోన్నతులై. ౩౯

వ. ఇహసుఖమందుపట్టునసె యిందలి సంగతులన్ గ్రహించి వా
రహరహమున్ బరిభూతసుఖ మందఁగ నేరిచిరంతె కాని ధూ
ర్వహులయి పారిమార్థికపు వైభవమందఁగ నల్లవారికిన్
దహసేహ శ్రేష్ఠ శ్రేయమును దద్గిరి వారికి లేదు నేటికిన్ ౪౦

ఉ. ఇచ్చటి విప్రులేమి మఱి యిచ్చటి క్షత్రియజాతియేమి యిం
కిచ్చటి వైశ్యులేమి పయి నిచ్చటి పాదజులేమి యైహికం
బెచ్చుసుఖంబుగాఁ దలఁప, రెంతయు నప్పరలోకసౌఖ్యమే
హెచ్చని తద్విరుద్ధసుఖ మేలవముల్ గొన రప్రమత్తులై. ౪౧

శా. చాతుర్వర్ణ్యము లెక్కయేమి యిచటన్ జంఝాలముఖ్యుల్ సుధు
ర్జాతుల్ గూడ నిహంబుకన్నఁ బరమే శ్రేయస్సాపాదిగాఁ
జూతుర్వేయును నేల ? జన్మమది యిచ్చోఁబూర్వపుణ్యాప్తిసం
భూతంబౌ నని యేకవాక్యముగఁ జెప్పం బూర్వపుల్ గ్రంథముల్. ౪౨

శా. ఈవర్షమ్మున నున్నపర్వతములం దెంతేని వింధ్యాద్రి స
ద్గ్రావోపేతము నున్నతోన్నతమునై రాజిల్లు నమ్మేరువన్
గ్రావమ్మందలి యీసుచేత నిదియే కాదా ! త్రిలోకమ్ములన్
ధీవిభ్రాంతములౌ నటుల్ కలఁచి మున్ బెంపొందె నత్యుద్ధతిన్.

మ. అలవింధ్యాద్రికి దక్షిణాశఁగల వత్యైశ్వర్యపర్యాప్తిశో
భిలు సంస్థానము లెన్నియేని మఱి తత్పృథ్వీశసంస్థానపం
క్తులలో నొంటఁ గళింగదేశమున నెంతో కాంతిఁ జెన్నారు బొ
బ్బిలిసంస్థానము శూరతాగరిమకున్ బేరై యశఃకందమై. ౪౪

తే.గీ. "అచటఁబుట్టిన చిగురుఁగొమ్మైనఁ జేవ"
అనుచుఁ బెద్దన మును చెప్పినట్టి విధము
బొబ్బిలిపురమ్మునను సరిపోవుఁగాని
అతిశయోక్తి వేఱొక్కట నతుకుపట్లు. ౪౫

ఉ. ఇంతకు హెచ్చురాఁబడికి నెంతయుఁ దావలమై చెలంగు భూ
కాంతుల రాజధానులను గంటిమికాని యొకంట నిన్ని శ్రీ
మంతము లైనసౌధముల మన్ననకెక్కిన కోటచూడలే
దంతును భ్రాంతునుంగలదె ? యన్నరపాలుని సౌధరాజికిన్. ౪౬

తే. గీ. ఆంధ్రదేశమ్మునంగల యఖిలరాజ
మణుల కోటలయందలి మాడుగు లవి
యెల్లనొకతల యిందలి వెల్లనొక్క
తలగ నిడి తూఁప నీవియె హెచ్చులుగఁ దూఁగు. ౪౭

ఉ. అన్నియు నభ్రచుంబనసమర్థము లన్నియుఁ జిత్రచిత్రసం
పన్నము లన్నియుక్ విమలభాకమనీయము లన్నియుక్ జమ
త్కృన్నళినాకరానిలసమృద్ధము లన్నియుఁ దన్నృపాలున
భ్యున్నతి దెల్పఁగాఁ దగిన పొల్పెసలారెడి వల్లసౌధముల్. ౪౮

చ. వెనుకటి విన్నయున్నను నవీనముగా మనరాజచంద్రుఁడే
పున మటికొన్ని సౌధములు పుణ్యయశోనిధి తండ్రిగారిపే
రున వెలయించుపూనికయి రూఢిగ వింటిమి; కేండ్లకెందుఁ దృ
ప్తిని గనరామి దెల్పుదురు పెద్దలు ; వార లసత్యవాదులే? ౪౯

ఉ. ఇప్పటి బొబ్బిలింగుఱిచియే యిపుడిరచుక సంగ్రహించి నేఁ
జెప్పితి వెన్క బొబ్బిలి విశేషములం దిలకింప నొక్కనాఁ
డప్పురి తూర్పునందు నొక యర్ధపుఁగ్రోశముఁ బోయినార మం
దిప్పుడు రాతికంబమొకఁ డెత్తియునట్టిది చూడనయ్యెడిన్. ౫౦

క. * వెనుకటి యుద్ధమునకుఁ జెం
దిన ముఖ్యాంశములు దానఁ దేటతెలుఁగు బా
సను వ్రాయఁబడిన వున్నవి
మొన మొన్ననె జ్ఞాపకార్థము నిలిపి రదియుక్. ౫౧

* ఈ స్తంభము బొబ్బిలికోటయుండు స్థలమందు గుఱుతునకుఁ గట్టింపఁబడినది. యమ్. బుస్సీని సహాయము చేసికొని విజయనగరపురాజాగా రగు విజయరామరాజుగారిచేత 1757 సం. జనవరి నెలలో సదరుకోట ముట్టడింపఁబడినది.

అప్పటిరాజాగారగు గోపాలకృష్ణ రంగారావుగారు 8 గంటలసేపు యుద్ధము చేసిన పైని తమకోటను కాపాడికొనుట అసాధ్యమనియు, మానముకన్న ప్రాణము విడుచుటే ముఖ్యమనియు తలంచి అంతఃపురస్త్రీలను పిల్లలను చిచ్చుపెట్టి చంపించి పిమ్మట యుద్ధములో తమ వీరభటులతో వీరస్వర్గమందిరి. తన ప్రభువునందు విశ్వాసముగల తాండ్రపాపయ్య యను సరదారుఁడు రాజామునుండి వచ్చి మూడవనాటిరాత్రి జాగరూకతగల పహరాలను సేర్పునదాటుచు డేరాలోఁజొచ్చి విజయరామరాజుగారిని పొడిచి చంపి పగదీర్చుకొనియెను.

ఇది 1891 సం. శ్రీరాజా శ్రీవేంకటశ్వేతాచలపతి రంగారావుగారి వలన కట్టింపఁబడినది.

తే.గీ. దాని నిల్పినయట్టి భూజాని నేఁటి
కేనిఁ కిఁ బితామహుండు విజ్ఞానఘనుఁడు
అంతటి ప్రయోజకుండు ధరాధిపతుల
యందు నెందు లేఁడని చెప్ప వింద మెందు. ౫౨

ఉ. బొబ్బిలివారికిన్ మిగులఁ బెంపిరిపోవు యశంబునిచ్చి వే
రబ్బురమున్ ఘటించునల యల్లడి యుద్ధము కారణమ్ముగాఁ
బ్రబ్బినకీర్తి నన్నగరి పాడఁటి జాడఁటి కాడువాజియున్
దిబ్బగమాటియున్ బ్రథితదృశ్యములందొక దృశ్యమైతగన్. ౫౩

చ. అది గనుఁగొన్నమాత్ర విజయావనిపాలుని దుర్నయంబు దు
ర్మదులు పరాసుసైన్యముల రాయిడి దుష్టతురుష్కసైన్యరా
డదయత వెల్మశూరుల నయాంచితబాహుపరాక్రమస్ఫుర
త్కదనము నొక్కపెట్టుగను గన్నులఁగట్టిన యట్లు ద్రేలెడిన్.

శా. వీరక్షేత్రమటన్న పేరుగనుటన్ విశ్వస్తుతిన్ బొల్చుటన్
శూరశ్రేష్ఠుల సచ్చరిత్రములచే స్తుత్యార్హమౌటన్ సమి
ద్ధీరాగ్రేసరులైన వెల్మల యసృక్తేజంబుచే నానుటన్
శ్రీరంజిల్లని తత్ప్రదేశ మఖిలప్రేమాస్పదం బయ్యెడిన్. ౫౪

ఉ. ప్రాఁత యయోధ్యకుం బిదపఁబట్టణమొక్కఁ డయోధ్యపేరనే
రీతిగఁ బూర్వపేర్పడె నిరీతికమై యటులే యిటన్ సుఖ
ఖ్యాతికిఁ గొత్తబొబ్బిలియు నాకరమై చెలువారె రావణా
రాతికుటుంబమంబలెనె రాజకుటుంబము నిల్చె నిచ్చోటన్.

శా. ఆసంస్థానపుఁ బ్రాక్చరిత్ర ప్రథమం బాలింపుఁడామీఁదటన్
శ్రీసంపన్నముగాఁగఁ బ్రస్తుతకథన్ జెల్వారవిన్పింతు స్వ
ర్వాసుల్ సైతము చోద్యమందఁగల దుర్వారప్రతాపాఢ్యుఁ డు
ర్వీసాధ్వీమణి భర్త వేంకటగిరి శ్రీనాయకుండొప్పగున్. ౫౬

మ. పెదరాయం డను పేర నొప్పెసఁగు నా పృథ్వీశుఁడే రాజ్యపుం
బదవిన్ దూరుపుదేశమం దెలమి సంపాదించి యచ్చో సుతున్
ముద మొప్పారఁగ నుంచె నీతఁడు యశఃపూర్ణుండు లింగాహ్వయుం
డుదితార్కప్రభతోడ నేలెఁ బిత్రుదత్తోర్వీస్థలిన్ బిమ్మటన్. ౫౭

చ. జనకునకున్ జమీ నెవఁడొసంగెనొ యట్టి తురుష్కపాళి పెం
పున నొకరాజకార్యమును బూని యిటన్ జనుదెంచి వేఁటఁబో
యిన యపు డాత్మజాతు నరులెత్తెఱఁ బట్టుకపోవ నప్డు చే
యునదియు లేక శింగన నృపోత్తము సాయము వేఁడె వేఁడినన్. ౫౯

మ. తనసేన న్నడిపించి ఖానుకొమరున్ దద్వైరిబంధమ్మునుం
డి నిమేషమ్మునఁ దెచ్చియిచ్చుటయుఁ దద్ధీరత్వమున్ జాలనా
యన వేనోళ్ల నుతించి పూర్వమట మున్నర్పించు రాజ్యమ్ముగా
కనఘుం డింకొకకొంత యిచ్చిచనె స్వీయంబైన దేశానకున్. ౬౦

తే. గీ. అలతురుష్కుని పేరు బెబ్బులికి వాచ
కంబయి తురుష్కభాషలోఁ గ్రాలుకతన
బెబ్బులి యనంగ నొకకోట పృథివిపతియుఁ
గట్టె నాతనియెడఁ గృతజ్ఞత యెసంగ. ౬౧

తే. గీ. బెబ్బులియె నాఁడు నాఁటికి బొబ్బిలి యయి
యెల్లఁ దెసలఁ బేర్కొనఁబడె; నిమ్మహీశుఁ
డాత్మజులు లేమి దత్తుఁగా నల్ల వేంక
టగిరి వంశమ్మునుండి తాను గొనెఁ గొమరు. ౬౨

ఉ. వెంగలరాయనామమున విశ్రుతుఁడౌ నలదత్తుఁ డెంతయున్
రంగుగ రాజ్యపాలన మరాతిభిదాభిదురంబుగా నొన
ర్చెం, గవులన్ బుధేంద్రుల భరించెఁ, జరించె జగమ్ము "వీనికీ
డుంగలదే" యటంచును గడుంగడుఁ దన్నునుతించి మ్రొక్కఁగన్. ౬౩

చ. అతనిసుతుండు రంగపతి యన్నిట నన్నరనాథుకన్న ను
న్నతిఁగని రాజ్యమేలె; సుగుణంబులప్రోవు తదాత్మజుండు భూ
పతి నలరించి మించెను బ్రజల్ జయవెట్టి తనున్నుతింప స
ద్వ్రతుఁ డితఁ డొప్పు రాయఁడపరంగధరారమణాభిధానుఁడై. ౬౪

తే. గీ. అతఁడు గోపాలకృష్ణరంగావనీంద్రు
దత్తుఁగాఁగొనె; నీరంగ ధరణినాథు
కాలమునయందె విజయనగరపు రేని
తోడ యుద్ధప్రసక్తి ప్రస్తుతమునయ్యె. ౬౫

ఉ. ఆకదనమ్మనం దతని యాప్తులు నాతఁడు సోదరుండు ని
ర్భీకుఁ డపారశౌర్యనిధి వెంగళరాయఁడు చూపినట్టియు
ద్రేకము నేఁటికిన్ సకలదేశమువారలు చెప్పికొంద్రు త
త్పాకమె నెల్మవాళికి నపారయశఃప్రదమయ్యె నెల్లెడన్. ౬౬

క. గోపాలకృష్ణరంగ
క్ష్మాపతికొమరుండు నిసువు గాక కడమవా
రాపన్ను లగుచు సురపురిఁ
బ్రాపించిరి వెలమవారు పటుశౌర్యమునన్. ౬

తే. గీ. అతఁడు వేంకటరంగరాయావనీంద్రుఁ
డల పరీక్షిత్తుబలె వృద్ధినంది తనకుఁ
గలుగుగండమ్ము లెల్లను గడచి గోల
కొండపురికేగి ఫాదుషా కొలువుఁ జొచ్చి. ౬౮

ఉ. ఆయన ప్రీతికై కొనెడి యంతకుమున్న స్వదేశ మెల్ల నాం
గ్లేయుల యేల్బడింబడియెఁ; గీర్తిధనుండగు బొబ్బిలిప్రభున్
శ్రీయుతుఁజేసి యాంగ్లనృపశేఖరు లెంతయు గారవించి రా
ష్ట్రాయితుఁగా నొనర్చ బిరుదావళు లిచ్చి నిజాముభూపుఁడున్. ౬౯

తే.గీ. యుద్ధపుంజోటఁ గాకిపుడున్న ప్రాఁతె
కోట క్రొత్తకోటలపేర నేఁటి వారు
వాడికొను కోటలం దల ప్రాఁతకోట
యావిభుఁ డిటీవలను వెలయించినదియె.

ఉ. ఈయన రాజ్యకాలమున నెంతయు రాజ్యము వృద్ధిచెందె జా
తీయపుధర్మముల్ బుధనుతింగనె విప్రుల కగ్రహారముల్
శ్రీయుతముల్ పొనర్చె నుతు స్వీకృతుఁగా నొవరించె నారస
శ్రేయము లేమి రాయఁడప శ్రీనరపాలుని రావువంశజున్. ౭౦

ఉ. రాయఁడపప్రభుండు తనరాజ్యపువృద్ధికి నేమి, స్వప్రజా
శ్రేయముపట్ల నేమి, కవిశేఖరసత్కృతికేమి, మేటిదే
వాయతనాదుల న్నిలుపునట్టి ప్రసక్తికి నేమి తండ్రి పై
చేయయి తద్దయున్ యశముఁ జెందె ప్రభుత్వ మొనర్చెఁ జక్కఁగన్.

ఉ. ఈనరపాలుకాలముననే కడుఁ బొంపిరివోయె నాత్మసం
స్థానమునం దసంఖ్యముగ ధర్మము లయ్యవియెల్ల సత్కవీ
శానులు పూర్వమే వినుతిసల్పి కృతుల్ రచియించి రందుచే
నేనిట విస్తరింపక గణించి స్పృశించి యుదాహరించితిన్. ౭౩

చ. అనఘుఁ డితండు వైష్ణవమతాస్థ కడుం జెలువారఁ దన్మత
స్థనియతసంగతుల్ గొనుచు ధన్యుఁడు భక్తికి నాలవాలమై
వినుతికి నెక్కె; నీయన వివేక మమేయము పుణ్యకీర్తిసం
జనకము వర్ణనీయగుణసంఘుఁ డితండు సమస్తభంగులన్. ౭౪

చ. నలువురు పుత్రు లీయనకు నల్వమొగంబులవోని యుత్తముల్
గలిగిరి వారలెల్లరును గణ్యయశుల్ సుగుణాలవాలముల్
కలికలుషాపహర్తలు జగన్నుతు లందుఁ బ్రభుత్వమూనె ను
జ్జ్వలమతి శ్వేతశైలపతి వారల కగ్రజుఁడై చెలంగుటన్. ౭౫

శా. శ్వేతాద్రిప్రభు రంగరావు ధరణిన్ శిక్షించుచుం దండ్రి సం
ప్రీతిం బూనిన ధర్మకార్యములు పేర్మిం బూర్తిఁ గావించి ప్ర
ఖ్యాతిప్రాపకుఁడయ్యె రాజ్యమునకున్ గల్పించె బల్ వృద్ధి శ్రీ
సీతారాముని దేవళమ్మునకు నిచ్చెన్ వృత్తి సంతృప్తిఁగన్. ౭౬

చ. ఇతఁ డనపత్యుఁ డౌటఁ దన నిద్ధచరిత్రునిఁ బీఠికాపురీ
క్షితిపతి పుత్రు దత్తునిగ స్వీకృతిఁ జేసె; నతండు సర్వపం
డితహితుఁడై నిరీతిగ మనీషిహితమ్ముగ రాజ్యమేలి యం
చితమగు కీర్తిఁ గైకొని ప్రసిద్ధికి నెక్కె వదాన్యమౌళియై. ౭౭

సీ. ధర్మాత్ముఁ డితఁడు సీతారామకృష్ణ రాయఁడపరంగారావటన్న పేరఁ
బరఁగి నృపోచితబహువిద్యలే కాక విప్రోచితములగు విద్యలందు
సైతము నైపుణి జనకు ప్రయత్నమ్ము కారణమ్ముగను సంగ్రహమొనర్చి
చక్కఁగా రాజ్యమ్ము శాసించి పెక్కులు ధర్మకార్యమ్ములు తగ నొనర్చి

తే.గీ. యును బురాకృతకారణమున నపత్య
భాగ్యమును నోఁచకే స్వర్గపదవిఁ జెందె;
బిదపఁ దద్భార్య తద్రాజ్యపదవి నూని
లక్ష్మి చెల్లయాంబిక యేలె లక్షణముగ. ౭౮

తే.గీ. ప్రాఁత క్రొత్తశబ్దమ్ముల వ్యవహరింపఁ
బడెడి యారెంట రెండవ వరణమునకు
లలి మొదలువెట్టినట్టి దీ లక్ష్మిచెల్ల
యాంబికయె యన్వయవృద్ధి నాత్మఁగోరి. ౨౯

తే.గీ. స్థలశిలాభోగమహిమలు దైవమునకుఁ
గాక మనుజుల కెటు లెఱుఁగంగనగును!
క్రొత్తకోటఁ గట్టినమీఁదఁ గొనలుసాఁగెఁ
దనదు వంశము తామరతంప రగుచు. ౩౦

చ. అటువయి నియ్యెడంబొడమి యన్యులవంశము నిల్పిపొంటె నే
గుట ఘటియించెఁ గాని తమకోసము వేఱొకచోటినుండి యి
ప్పటికి మఱొక్కఁ డియ్యెడకు వచ్చుప్రసక్తి ఘటింపలేద; య
చ్చోటుమహిమంబ యిట్టికులశోభకుఁ గారణ మెన్నిభంగులన్. ౩౧

ఉ. స్త్రీలనుగూడఁ గొందఱు పతివ్రతలొక్కొక చిక్కునందు ని
ర్వేలమనీష వంశ మభివృద్ధికి రాఁదగునట్టి తంత్రముల్
పాలకసత్కుటుంబినులు పాడిగఁజేయుట మున్నచించు మీ
శీలవతీలలామ మిటఁ జేసిన సత్కృతి కవ్వి లొచ్చగున్. ౩౨

క. ఏమయిన నేమి వంశం
బీమెయినభివృద్ధిఁగొనుట కీమెయె మూలం
బీమెయివె యెల్లకాలం
బీమహి పులవంశవృత్తు మెదిగెడుఁ గాతన్. ౩౩

ఉ. ఆగతి నేలియేలి పతియాజ్ఞ యొసంగిన కారణమ్మునన్
శ్రీగణనీయు వేంకటగిరి ప్రభుపుత్రుని దత్తుఁగాఁగఁ దా
నీగుణపేటి గైకొనియె నీయన పూర్వుల కన్నమిన్నయై
బాగుగరాజ్యమేలి బహు భంగుల కీర్తిగడించెదిక్కులన్. ౩౪

సీ. శ్రీయుత వేంకట శ్వేతాచలపతి రంగారాయనాముఁ డీక్ష్మాపమౌళి
వెనుకటి రాజుల కినుమడిగా రాజ్య మభివృద్ధిచేసి ద్రవ్యార్జనమ్ము
సలిపి సర్వవిధాల జనులమెచ్చుచుఁ గొని యఖిలవిద్యారహస్యము లెఱింగి
తనయుల సనయుల మనుమల ఘనమ్ముల మునిమనుమల నైతము మొదమలరఁ

తే.గీ. గనియు వారల యభివృద్ధి గన్నులారఁ
గాంచి యిందఱఁగూడ సమంచితావ
నీపతులఁజేసి తన నేర్పు భూపులెన్న
సుకవినుతిఁగనెఁ గడుఁబ్రయోజకత నలరి. ౪౫

క. ఈరాజవరాళి మఱియు మ
హారాజను బిరుదమంది యాంగ్లేయ మహా
ధీరుల గౌరవమునఁ బాఁ
బారమ్యముఁ గాంచి మించెఁ బరమోన్నతుఁడై. ౪౬

తే.గీ. తెలుఁగు 'యూనివరిసిటికిఁ' దేజు దెచ్చెఁ
దాను "ప్రోచాన్సలరు" పదమూని నిలిచి
అంతియేగాక యద్దాని కవుల స్థాల
లక్షుఁ డీతఁడొసఁగె నొకలక్ష ధనము. ౪౭

తే.గీ. ఈయన ప్రయోజకత్వమ్ము నెన్నవశము
గాదు; కృతకృత్యుఁ డితఁడు భూకాంతులందుఁ
గొమరు లిరువురు గలిగి రీకువలయేశు
నకు సుకవివర్ణనీయగుణగణాఞ్చితులు. ౪౮

చ. ఇరువురు యోగ్యులే యిరువు రిద్ధచరిత్రులె యిర్వురున్ మహా
సరసులె యిర్వురున్ గవిప్రశంసకు నర్హులె యిర్వురున్ మహా
స్త్రరణులె యిర్వురున్ గడు నుదారులె యిర్వురు రామలక్ష్మణ
స్ఫురణులె యిర్వురుం గరుణఁ బొంపిరివోయెడివారె రాసుతుల్. ౪౯

తే.గీ. అట్టి యిరువురలోన రెండవ కుమారుఁ
డైన శ్రీరామకృష్ణ రంగావనీంద్రు
నకుఁ గుమారకు లిర్వురు నొక కొమార్త
యును జనించి రత్యంతసద్వినుతగుణులు. ౫౦

తే.గీ. అందు రెండవపుత్రకు నాత్మజనకు
తమ్ముఁడగు జటప్రోలు సంస్థానపతికి
సురభి వేంకటలక్ష్మరాడ్ధరణివిభున
కిడియె దత్తుఁగ శ్రీరామకృష్ణవిభుఁడు. ౫౧

తే. గీ. ఇంకఁ బ్రకృతంబు వివరింతు నీనృపాలు
నన్నగా రన్నివిధముల నన్నగారి
యెలమిగల వేంకటకుమార కృష్ణరంగ
రాయ బహదూరు ప్రస్తుతరాజ్యనరుఁడు. ౧౨

చ. మనకృతినేతయైన జనమాన్యచరిత్రుఁడు రామకృష్ణరం
గ నృపతియుఁ జనార్దననృకాంతుఁడు నాఁగఁ గుమారులిర్వురున్
వినయవివేకమాన్యులయి విశ్రుతికెక్కిన కూఁతు లిర్వురున్
మన నృపుతండ్రి వేంకటకుమారనృశౌరికిఁ గల్గి రొప్పుగన్. ౧౩

తే. గీ. ఇట్టికొమరులఁ గూఁతుల నెలమిఁగాంచి
యంచితమ్మగు సంపత్తి నధిగమించి
రాజ్యపదమాని సత్కీర్తిఁ బూజ్యభావ
మంది భగవత్పదంబున కరిగె నితఁడు. ౧౪

చ. పదపడి తాతగారు గుణభవ్యుఁడు సర్వవిధాల సేమ మొ
ప్పిదముగఁ జూచుచుండ మనపృథ్వివిభుండు స్వకీయరాజ్యపుం
బదవిని దాల్చి భూజనులు బాగని మెచ్చ నృపోచితంబులై
పొదలెడి విద్యలందుఁ బరిపూర్ణత గాంచి రహించె నెల్లెడన్. ౧౫

చ. నృపులకు నుండుసద్గుణములే యితనిన్ వరియించెఁ గాని త
న్నృపతుల కుండుదుర్గుణము లేవియు నీయనఁ జేరలేదు పు
ణ్యపుమహిమంబగాదె యిది! యౌవనమున్ ధన మాధిపత్యమున్
రిపువివేకమున్ సఖునిరీతిగఁ జేర్చుట యెందుఁజూడమే! ౧౬

చ. అది యటు లేద; యీతఁడు పరాంగనఁ దల్లిగఁ జూచు భూప్రజల్
ముదముగ నుండుటే యితని ముఖ్యమనోరథ, మల్లవారి సం
పద కెదహర్షమందు; నివి పార్థివులందుఁ బ్రియత్నలభ్యముల్
సదయత దాతృతాదిగుణ సత్తయు నీయన కుగ్గుతోడివే. ౧౭

చ. వయసునఁ జిన్నయయ్యు గుణవర్ధనఁ నీయతఁ బెద్దపెద్దలై
జయముగ రాజ్యమేలిన రసాతలనేతలకన్న మిన్నయై
స్వయముగ రాజ్యతంత్రములఁ బాలనఁజేయుచు నచ్చకీర్తి యె
ల్లయెడల నించి మించె శుభలక్షణుఁ డిన్నరపాలమౌళియున్. ౧౮

సీ. ఈనరపాలున కెల్లదేశములఁ బ్రఖ్యాతులౌ నూజివీణ్పేతలందుఁ
బొగడొందు నల తేలప్రోలి శ్రీశోభనాద్రి యప్పరాయని కూఁతు రనఘచరిత
జటప్రోల్విభుండు లక్ష్మారావు దౌహిత్రి పతిదైవత సుభద్ర పట్టమహిషి
గాఁగ నిందిర యనఁగాఁ దగు నొకకూఁతు, రొక కొమరుఁడు నిప్పటికి జనించి

తే. గీ. రితని పేరు శ్రీగోపాలకృష్ణ వేంక
టయుత రంగరావని ప్రకటగతి వెలసె
భావి యుపరాజితనికి శోభనము లెల్ల
గతుల సమకూర్చుఁగాక శ్రీపతి కృపాబ్ధి. ౯౯

క. ఇది బొబ్బిలి నరపాలుర
సదమలవంశక్రమంబు చదివిన విన్నన్
ముదమొసఁగు నాయువిడు సం
పదలన్ బొదలించు నృపసభల నలరించున్. ౧౦౦

ఉ. నావుడు సభ్యులిట్లని రనంత ముదమ్ము ఘటిల్లె బొబ్బిలి
శ్రీవరువంశమున్ వినికిఁజేసితి రయ్యనఘాత్మ రాజ్యసు
శ్రీవరియించునట్టి యభిషేకకథాక్రమమున్ వచించి ము
మ్మావలరింపఁజేసి కృతకృత్యత నొందఁగదయ్య సత్కవీ! ౧౦౧

చ. అనవుడు వేంకటేశుఁ డను నార్యవరుల్! వినుఁడయ్య! యిప్పుడే
వినిచెదఁగాని సూర్యుఁ డదె వే చరమాద్రికి నేగుచుండె న
య్యినునకు నర్ఘ్యమిచ్చుటకు నేగెద రిందలివారు కొంద ఱం
దున నిపు డాఁపి ఱేపు వినుతున్ మఱినావుడు సభ్యులాదటన్. ౧౦౨

క. మంచిదని లేచి రంతట
నంచితగతి సూర్యుఁ డరిగె నపరాబ్ధికిఁ గా
వించిరి సంధ్యాకృత్యము
లెంచిరి ప్రకృతనరపతికి నెల్ల శుభంబుల్. ౧౦౩

గద్య. ఇది శ్రీ తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబైన శ్రీబొబ్బిలి పట్టాభిషేకం
బను మహా ప్రబంధమ్మునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీరస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః.

# శ్రీ బొబ్బిలి పట్టాభిషేకము

## ద్వితీయాశ్వాసము

క. మఱుచటి యుదయమ్మున నం
దఱు స్నానాద్యుచితకృతులఁ దనరి విడిదిమం
దిరమున సభతీర్చిరి శ్రీ
నరపతి చరితంబు వెంకన వచించె నిటుల్. ౧

ఉ. స్వస్తినృపాలసూతికిఁ బ్రశస్తతరస్తవనీయనీతికిన్
బ్రస్తుతమాలకింపుఁడు సభాసదు లాప్రభవాబ్దమాగతిన్
నిస్తులశోభనాప్తి కమనీయముగా విలసిల్లె సత్కవీం
ద్రస్తుతమాఘ మాఖము పదంపడి మాసమువచ్చెఁ జెచ్చెరన్. ౨

క. పదునెన్మిది వందల నలు
వదితొమ్మిది లెక్క శాలివాహనశకమునన్
బదియును దొమ్మిదినూర్ల
ర్వదియెన్మిది సంఖ్య హూణవత్సరమందున్. ౩

ఉ. శ్రీయుతమైన ఫిబ్రవరి రెండవతేదిని ద్వాదశీమరు
న్నాయకమంత్రివాసరమునన్ సితపక్షమునన్ మఖర్క్షముం
బాయనిరాత్రిఁ జెన్నలరు మాసమ్మునం దగుమీనమందు శ్ర
శ్రేయసమూలమైన మృగశీర్షమునన్ సితభానుఁడున్నెడన్. ౪

ఉ. ఉంచె ముహూర్తమున్ బ్రభువనకున్నతిగోరి పురోహితుండు ని
ర్వంచితశక్తి ఖేటబలనైఖరి నారసి: మున్నె శోభనో
దంచితమైన లేఖల యథావిధిగా వెస ముద్రణంబు గా
వించి నృపాలకుం డనిచె విశ్రుతిగాంచిన యెల్లవారికిన్ ౫

క. సుముహూర్తవార్త విని గ్రా
మమువా రెల్లరుఁ బ్రమోదమగ్నులగుచు గే
హములు కలంకృతిసేయుచు
యమితోత్సాహమునఁ బొడలి యనుకొని రిట్టుల్. ౬

ఉ. ఈతని యోగ్యతాగరిమ మెంతయు భూజనవర్ణనీయమై
చేతము దన్పు మంచిపరిశీలన నెమ్మది సన్మనీష ప్రి
ఖ్యాతియెడంగుహాతూల మహంకృతిలేమి మొదల్ గొనమ్మ లీ
నేతకు వన్నెపెట్టు గణనీయుఁ డితండు నృపాలకోటిలోన్. ౭

చ. వయసునఁ జిన్నయయ్యుఁ గవివర్ణ్యములైన గొనమ్మ లొప్పి మేల్
జయము నయ మ్మయమ్ముఁ దను సంతతముంగని కొల్వ నెంతయున్
దయయు సుదారతాగుణ మతంద్రములై తన కగ్రిమందుఁ ద
ద్దయును మెలంగ వర్తిలెడి ధన్యుఁడు మాన్యుఁడు సర్వభంగులన్. ౮

వ. ఇట్లు పలువిధంబుల వినుతించుచుండిరి మన నృపాలుండును దమ యనూచానాచారప్రకారంబున. ౯

క. ప్రేమన్ సీతారామ
స్వామికి శుభలేఖనిచ్చి పంపెన్ సీతా
రామపురవాసునకుఁ దమ
సేమం బెల్లపుడుఁ గోరు శ్రీవాసునకున్.

క. శివకరునకు బొబ్బిలిపురి
నివసించెడి వేల్పునకు మునిగణనుతునకున్
బ్రవిమలమతి శుభలేఖన్
కువలయపతి పంపె వేణుగోపాలునకున్.

మ. ఇటు లాచారము నిర్వహించి యటుపై 'నింగ్లీషు గొర్మెంటు'కు
త్కటవిశ్వాసమెలర్ప లేఖ ననిచెన్; దర్వాత మైసూరి, కం
తట శ్రీకేరళనేత, కాపిదప భూదారుండు తానంపె వేం
కటగిర్యాఖ్యపురీనరేంద్రునకు సత్కారంబు తోరంబుగన్.

సీ. ఆమీఁదఁ బీఠపురీమహారాజున కలజటుపోలి ఘాతలవిభునకుఁ
దేలప్రోల్నృపతికి నోలి వెంట్రప్రగడనరేంద్రునకు విజయనగరేశు
నకు జయపురనాథునకును గిర్లమపూడిసేతలో నైన మన్నీలకపలఁ
దక్కిన బంధుమిత్రవాత్రితమునకుఁ జేరైన విద్వత్కవీశానులకును

తే. గీ. గాయకులకు గాయనులకుఁగడుఁ బ్రియమున
వేలువేలుగ లేఖ లంపించె ఱేఁడు
తనదు పట్టాభిషేకంబు దిశదిశలను
వ్యాప్తిగనఁజేయు కోరికి యాత్మ నొలయ. ౧౩

ఉ. ఈగతి నెల్లయెల్లలకు నేర్పడఁగా శుభలేఖలంపి యా
భోగమహేంద్రుఁ డాత్మపురిఁబొల్పలరారెడి మేడలన్నియుః
బాగుగ నేత్రపర్వమగుభాతి నలంకృతి బాదుకొల్పఁగా
నాగరులైన శిల్పులకు నానతి యిచ్చె ననంతరమ్మునన్. ౧౪

సీ. క్రొత్త కోటనెలర్చు క్రొత్త మేడలు ప్రాఁతకోట మేడలు నీటుగులుకఁజేసి
శ్రీవేణుగోపాలు దేవళమ్మును దాని ప్రాకారమును గోపురమును జక్కఁ
గా నలంకృతిఁజేసి ఘనమగు హైస్కూలు బాలికల్ చదివెడి పాఠశాల
యును వలంకృతములై తొబుప్పారఁగావించి రాజధానికి బాహిరముగనున్న

తే. గీ. మేడలన్నియుఁ బొలుపుమై మెఱయునట్ల
లంకృతమ్ములు గావింపఁబొంక మెసఁగి
పాలసందర్భమువలెఁ బ్రోలు వరిఢవిల్లెఁ
గనుఁగొనెడివారి కానంద మినుమడింప. ౧౫

సీ. ఎచటఁ జూచిన సొంపు లింపునింపెడి కాయమానములత్తి విమానములుగ
నెటఁగన్నఁ గైలాసశృంగమ్ము దలపించు మేటిమేడల సౌరు మిన్నుముట్ట
నేయెడఁ గనుఁగొన్న నిందధనుస్సులో యననొప్పు "నార్చు" లాహ్లాదమొసఁగ
నెందుగాంచిన లచ్చికిరవైనచెల్వు చెల్వారు తోరణపు సింగారమలర

తే. గీ. నెచట నీక్షింపఁ బెండ్లియిండ్లే యటన్న
భ్రాంతిగల్పించు గేహవిభ్రమము లొలయ
శుభపరంపరాకలితమై సొబగుమీఱి
పొబ్బిలిపురమ్ము చెన్నారె నబ్బురముగ. ౧౬

మ. ధనురాకారముగాఁగ ద్వారములు సంధానించి యందందు మే
ల్కానకంపుంగళలీను నక్కరములన్ గల్పించియున్ "స్వాగతం"
బని యాకారణముం బొనర్చెఁ బ్రతివీథ్యంతఃప్రదేశమ్ములన్
గన సేతెంచెడి వారి కందఱకు సత్కారమ్ము తోరమ్ముగన్. ౧౭

మ. తన జామాత్రభిషేకదర్శననితాంతప్రీతితోఁ దేలప్రోల్
జననాథుండు సదారుఁడై సనుతుఁడై సప్రేష్యుఁడై ముందుగాఁ
జనుదెంచెన్ నృపచిహ్నముల్ వొలయ నాక్ష్మాజాని మానించి యు
య్యానఁ దోడ్తెచ్చిరి వాద్యఘోషములతో నానందసాంద్రమ్ముగన్. ౧౮

తే. గీ. ప్రాఁతకోటనెసంగు విస్మితమైన
సౌధ మతనికి విడిది నొసంగి రెలమి
ఘనుఁ డటులె వచ్చె వెంట్రప్రగడ నృపతియు
నటులె తోడ్తెచ్చి విడిదియు నటులె యిడిరి. ౧౯

తే. గీ. తేల ప్రోలిలనృపాలుఁ డిత్తెఱఁగున మును
ముందుగా వచ్చి యభిషేకమునకు వచ్చు
భూపతుల కెల్ల సక్రమమ్ముగను వలయు
సత్కృతు లొనర్చునట్టి ప్రసక్తినుండె. ౨౦

తే. గీ. శోభనాద్రిప్పరాయఁ డీచొప్పునఁ దన
యల్లు నభిషేకమునకుఁ దోడైనకతన
బంగరొకుఁ దావి యబ్బినభాతి మిగుల
నలరెఁ బట్టాభిషేకమహోమహంబు. ౨౧

మ. తన పెత్తాతకుమారుఁ డాత్మజులతోఁ దత్తత్కుమారాప్తభృ
త్యనికాయమ్ములతోడ వేంకటగిరిక్ష్మాధీశుఁ డాంగ్లేయప
ర్ధనజార్జిప్రభుగౌరవార్పిత మహారాజాంకుఁ డేతెంచె స
జ్జనసంఘస్పృహణీయసద్గుణగణాంచద్భాగధేయుండొగిన్. ౨౨

మ. ఘనుఁ డా భూవరుఁ డిట్లు వచ్చి యల జింఖానాఖ్యబంగాళయం
దునఁ దా డిగ్గియు విందుఁ గొంచెముగ నందుం గుడ్చి యున్నంతఁ జే
ర్మి నితాంతం బిగురొత్త బొబ్బిలిపురీ శ్రీనాథుఁ డాతనిఁ దో
డ్కొనిరా నేఁగె నశేషవైభవముతోఁ గ్రొంగ్రొత్తవాద్యాళితో. ౨౩

ఉ. నాలుగు గుఱ్ఱముల్ కడుఘనంబుగఁ బూన్చిన మంచి "సార్టు" పై
భూలలనామనోహరునిఁ బుత్రులతో విడియించి ప్రేమ్మిడిన్
బోలికిఁ దెచ్చి యుత్సవము బోరన నేగఁగఁ జేసి సద్యశ
శ్శాలిని గొల్పి కోటగల సౌధమున న్నిలిపె న్నృపేంద్రుఁడున్. ౨౪

క. అది శ్రీకృష్ణమహాలునాఁ
బొదలెడి సౌధమ్ము, దానిపొంతకు నోఁడే
గఁదగన్ మ్రోసెను దుందుభి
మొదలగు వాద్యములు సేన ముంగల నిలిచెన్. ౨౫

తే. గీ. మేడ పైభాగమున యందు నోఁడు విడియ
మఱి తృతీయచతుర్థకుమారులకును
క్రిందిభాగము నొసఁగి రమందముద మె
సంగ వార లందుండి రభంగురముగ. ౨౬

తే. గీ. మఱియు వేంకటగిరి శ్రీకుమారవిభున
కతని పెదతమ్మునకుఁ "బ్రాహ్మ హాలు" విడిదిగ
నొసఁగి రవ్వార లందుండి రెసక మెసఁగ
స్ఫీతసజ్జనగోష్ఠీసమేతు లగుచు. ౨౭

సీ. ఘనుఁ డినుగంటిపత్రికాశరాయనికుమా రకుఁడు వేంకటరామప్రభుఁడుఁ గాడ
వేంకటగిరిమహీవిభుల కత్యంతసన్నిహితబంధుండయి నెగడు కతనఁ
బ్రీతిచెన్నార నానేతలతోడనే చనుదెంచి యువరాజఘనునితోడఁ
"బ్రాహ్మహాలు న"గౌరవంబొప్ప నివసించె రావు గంగాధర రామరావు

తే. గీ. నెలమి శ్రీవేంకటకుమార కృష్ణయాచ
భూపతియు నేఁగుదెంచి రీ శ్రీసుతులకు
నెదురుగా రాజచిహ్నములెల్ల నంపి
గారవించిరి పేర్మి యథావ్యారీగాఁగ. ౨౯

క. తురగద్వితయముఁ బూన్చిన
కరమరుదగునట్టి మేల్ శకటమున వారిన్
బరివేష్టింపించి పెస స
గరికిన్ రప్పించి రథిక గౌరవ మెసఁగన్. ౩౦

శా. సీతారామవిలాసనామకము సుక్షేమంకరంబౌ "మహల్"
చేతోమోదముగాఁగ వారి కిడి రాశ్రీమంతులచ్చోటు తా
మేతేరంగ "సిపాయి దండును" గడుఁ హృద్యమ్ములౌ వాద్యముల్
ప్రీతిన్ గౌరవభావముప్పతిలఁగాపీతెంచె నత్యున్నతిన్. ౩౦

మ. సకుటుంబమ్ముగ నంతఁ బీఠనగరీసామ్రాజ్యధౌరంధరీ
వికచాంభోరుహలోచనావిభుఁడు దా విచ్చేసె నా ట్రేని రా
కకు బల్ మోదమునంది భూవిభుఁడు డంకాలోను గాఁగల్గు రా
జ్యకళాధాయకమైన చిహ్నములు తానంపించె సంరంభియై. ౩౧

క. తురగచతుష్టయయుతమై
వఱలెడి సారటున భూమివరు సుతసహితున్
గరమాదరమున విడియిం
చిరి యూరేగింపుతోడఁజేర్చిరి నగరిన్. ౩౨

తే. గీ. నగరిదరి కేఁగునంత సేనానివహము
"బ్యాండు" వాద్యంబు తనరఁ దత్ప్రభున కుచిత
గౌరవాతిశయమ్ములు గడలుకొలిపి
మిగుల మన్నించి రానందమగణితముగ. ౩౩

క. మఱియున్ ట్రేనికి నెదురుగ
మరియాద గడలుకొనంగ మహిపతి వారాం
బురుహాక్షుల మేళమ్మును
మఱి కొన్ని సువాద్యములు నమర నంపించెన్. ౩౪

క. మఱి వీరి మహారాజ్ఞికి
నరపాలుం డనిచెఁ దా "జనానామోటా"
రరుదగు నుత్సవ మలరఁగ
సిరికిఁ దగిన గౌరవంబుచేసి కడంకన్. ౩౫

తే. గీ. ఇట్టు లెంతేని గౌరవమెలమిఁజేసి
తాను స్వయముగ రైలునొద్దకు నెదురుగఁ
జని కడుంబేర్మిఁ జూపి యసత్కారముగ
నగరికిం దోడి తెచ్చె నిన్నాణ మెసఁగ. ౩౬

తే. గీ. లక్ష్మికి నివాసమై సర్వలక్షణముల
నలరు లక్ష్మీవిలాసమన్నట్టి మహాలు
నమ్మహారాజునకు నిడి యతనిరాణి
కమ్మహాలు నంటియున్న హర్మ్యమ్ము నిడిరి. ౩౭

తే. గీ. ఈమహారాజు బొబ్బిలి కేఁగుదెంచు
టిదియె ప్రథమంబు గానఁ బౌరులెల్ల నిమ్మ
హీశఖ్యతున కెదురుగా నేగి దర్శ
నంబుఁ గావించి కాంచి రానందగరిమ. ౩౮

తే. గీ. షేరు మహామత్పురీజమీందారుఁడైన
యలఘుఁ డల్లభానోజీరా వరుగుదెంచె
రహి విడిదిగ నొసఁగిరి "దర్బారుమహాలు"
గౌరవం బెంతయేనియుఁ గడలుకొనగ. ౩౯

మ. చెలికాన్యన్వయుఁ డైనగోపధరణీశ్రీకాంతుపుత్రుండు ని
ర్మలసత్కీర్తికరుండు వేంకటగిరిక్ష్మానేతదౌహిత్రుఁడు
న్నలినాక్షాంఘ్రిసరోజభక్తుఁడు జగన్నాథప్రభుం డోలిబొ
బ్బిలి కేతెంచెను గారవించెఁ గడునుర్వీనేత యీభూపతిన్. ౪౦

క. తనజననిమేనయత్తకుఁ
దనయుండగు నీనృపాలుఁ దద్దయు సమ్మా
ననమాచరించి "బౌన్ హాల్"
లొనర విడిది యొసఁగె భూవరోత్తముఁ డెలమిన్, ౪౧

సీ. ఘనుఁడు 'జిల్లాకలెక్టరు' సభార్యుండయిచనుదెంచె నిమ్మహోత్సవమునకాడఁ
బోలీసుశాఖలోఁ జాలపెద్దధికారి యేతెంచె నీవేడుకెలమిఁ గనఁగ
దండి శ్రీ "సూపరింటెండింగు నింజనీయరు" తాను వేడుకనరయవచ్చెఁ
గడఁకమై "డిస్ట్రిక్టు మెడికలాఫీసరు" భార్యతో వచ్చె వైభవముసూడ

తే. గీ. ఆంధ్ర "యూనివరిసిటీ" మహాధికారి
"వైసుఛాన్సలరు" పదవివఱలుమేటి
రెడ్డిగా రేగుదెంచి రరీణ కట్ట
మంచి వంశముక్తాఫలత్వాంఛితుండు. ౪౨

తే. గీ. "రాజ మహ" లిచ్చి రహ్వారికోజ విడిది
భోజనాదిసౌకర్యముల్ పొందుపఱుపఁ
జెన్నపురినుండి పిలిపించె నన్నరేంద్రుఁ
డల "బసోటాబ్రిదర్సు" బొబ్బిలికి నెలమి. ౪౪

తే. గీ. శ్రీకరంబగు పట్టాభిషేకమునకుఁ
గొంతవ్యవధి యుండంగనే కువలయాధి
పతులు నుద్యోగులును మహాపండితులును
గవులు గాయకులును జుఱిఁగడలుకొనిరి. ౪౫

క. ఇరువదియేడవ దగు జన
వరి తేదీనాఁడు వేఁడుస్వామి సెలవు ప
త్త్రరముగఁ గొన సీతారాం
పురమున కేతెంచె మేటిమోటారుపయిన్. ౪౬

తే. గీ. దేవళము నొద్ద మోటారు దిగకమున్న
మేళతాళము లొప్పారనోలి నర్చ
కుండు శఠగోపనహితుఁడై కొండొక యెదు
రుగను గోపురముదరికరిగి కడంక. ౪౭

తే. గీ. పంచశఠగోపములను సముంచితముగ
నొసఁగి "తోమాల" లొకరెండు వసుమతీశు
గళమున నలంకరించె భూకాంతుఁ డవల
స్వామి దర్శనమునకు దేవళము సొచ్చి. ౪౮

ఉ. దేవరకున్ సభక్తిగ నతింబొనరించి "మహానుభావ! యో
దేవ! భవత్ప్రభుత్వము నదీవనభూధ్రచతుస్సముద్రము
ద్రావధికంబుగా జగమునంతయు నిండి వెలుంగు నిట్టి నీ
సేవకులందు నేనొకఁడఁజేసెడి విన్నప మాదరింపుమీ. ౪౯

చ. వెలసెడి నీదు తేజము పిపీలికఁదొట్టియు నాగజంబు, నీ
కళిగనరానిచో టొకటిగాని జగమ్మునఁ గానరాదు రా
జులనియు భృత్యులంచనియుఁజొప్పడు భేదము నీదు తేజపు
న్నలువపు హెచ్చుతగ్గులని ప్రాజ్ఞమతుల్ వచియింతురో ప్రభూ! ౫౦

శా. మాపూర్వుల్ భవదీయపాదముల సామ్రాజ్యస్థమైఁ గొల్చుటన్
నీపేర్మిన్ మిగులన్ గడించిరది భూనేతృత్వమున్ వారికిన్
బ్రాపౌనట్లు ఘటించె నయ్యదియుఁ బారంపర్యతఃప్రాప్తమై
నాపాలై నది నేఁడు నీసెలవుకై నారాక విశ్వప్రభూ. ౫౦

శా. ఈవున్ రాజవు మేము రాజుల మటంచేమాత్రమున్ శంకలే
కేవాకుప్రత్తము పర్వతంబయిన యట్లే తాఁబదార్థంబగున్
దేవా! యప్పరమాణువున్ మనకు నింతేవాసి మాసర్వమున్
గావ న్నీవ కలాఁడవెప్పటికి నాకల్పం బనల్పోన్నతిన్. ౫౧

ఉ. ఎంత ప్రభుత్వమబ్బినమనెల్లపుడున్ భవదీయసేవయం
దంతము లేని యాదరము, నార్యుల మన్చుటయందు నాస్థ, యే
వంతయు లేని జీవిత, మవంధ్యముగాని ప్రవర్తనంబు, సు
స్వాంతము నాకొసంగి ననుసాకుటకే ఘటియింతు నంజలిన్.” ౫౨

వ. ఇట్లనేక ప్రకారమ్ముల భక్తిరసప్రచురంబుగ నద్దేవుకటాక్షంబు నర్థించిన యనంతరంబు. ౫౩

క. పరివారదైవతమ్ముల
దరిసెన మొనరించి ముద మెడం బొదలఁగ భూ
వరుఁ డల్ల రాజ్యలక్ష్మిని
దరిసించెన్ స్వామివారిదయితన్ బ్రీతిన్. ౫౪

శా. అమ్మా! సర్వనియంత్రిశ్రీవయని వేదాంతమ్ములం దెల్లెడన్
నమ్మన్ బల్కుట యిందు నట్లగుట నీనాథుండు మమ్మెప్డుఁ జే
రిమ్మన్నించుచునట్లు ఘటింపుమని నీప్రేమంబు నర్థింతు రా
జ్యమ్మున్ మేము భవత్కృపార్థుల మె సుమ్మా! రాజ్యలక్ష్మ్యంబికా! ౫౫

మ. ధరణీపాలుఁడు భక్తిలోలుఁ డిటు సీతారాములన్ వేఁడి యా
ద్ధురభక్తిన్ శతగోపతీర్థముల నెంతో నమ్రతన్ స్వీకరిం
చి రహిన్ దోసిలియొగ్గి యాజ్ఞగొనియెన్ జేతోముదం బొప్ప స
త్వర మాత్మీయధరాధిరాజ్యపదవీపట్టాభిషేకార్థమై. ౫౬

మ. ఇటు లాచారము నిర్వహించి నృపుఁ డెంతే వేడ్కమై బొబ్బిలీ
కటకంబుం జనుదెంచు నప్పటికి నాకాశమ్మునం దెందు నె
క్కటిసంచారమొనర్చి తా నలసి యక్కంజాతబంధుండు ప
మ్మట విశ్రాంతిని జేకొనన్ వరుణసామ్రాజ్యంబుఁ జొచ్చె న్వెసన్. ౫౭

తే. గీ. సంజ చెన్నారె రాఁబోవు సద్విభుఁడయి
రాత్రి కామిని నిగిడించు రాగమనఁగఁ
గ్రమముగా నంతఁ దమము నల్గడలఁ బర్వె
నాపెలోనుండి యుబుకు మోహం బనంగ. ౫౮

శా. రాజల్లంత ననంతరాజ్యపదసామ్రాజ్యాభిషిక్తుండు గా
నోజన్ దిక్సతు లెత్తు నారతులు నానొప్పారె నందంద స
ద్రాజుల్ తద్విలసద్గవీకలన నాస్థానంబు శోభిల్లె స
ద్రాజిం డక్క మహోత్కటంగలుగునే? రమ్యత్వమాస్థానికిన్. ౫౯

క. జనవరి నెల యిటు ముగియఁగఁ
జనుదెంచెన్ ఫిబ్రవరి వెసన్ భూపతిమ
న్నన వేణుగోపదేవుని
గని యాజ్ఞను స్వీకరింపఁగా మది నెంచెన్. ౬౦

తే. గీ. కంఠమున వెండిమువ్వలు గ్రిలుగొలుసు
కాళ్లకును మంచి మువ్వల కడియములును
వెండిముత్యాల బావిలీ ల్వీనులకును
వెండి ఖిళ్లలజూల్ మెడ వెలయనించి. ౬౧

తే. గీ. మొగమునఁ "బటాయి" మజీమూర్ధమున "శిరాను
చంద్రవంక" లోనుగ గలసకలవిధము
లగు నలంకృతు లొనరించి నగవిరోధి
యేనుఁగుం బోని పట్టపుటేన్గు నెలమి. ౬౨

ఉ. ద్వారమునందు నిల్పి "హవుదా" పయిఁ జొప్పడఁగట్టునంత భూ
దారుఁడు స్వామిదర్శనవిధానము నెమ్మదిఁ బాదుకొల్పి యా
స్వారికి "రామమోహన" గజమ్మునయం దొగిఁ గూరుచుండె సొం
పారఁగఁ జామరల్ విసరునట్టి భటద్వయి పక్కలన్ దగన్. ౬౩

తే. గీ. ఫిబ్రవరి యాదదినమునఁ బృథివిపతియు
నఖ్ఖరంపుఁ బ్రొపత్తి తాఁ బ్రబ్బికొనఁగ
నిబ్బరంబైన వేడ్కమైఁ బొబ్బిలీపుర
ముబ్బి వాహ్వాళి నెడలె నోహో! యనంగ. ౭౩

సీ. వెల్లజెండాతోడ నెఱుఁగొందు నొకయేనుఁ గాన్నపాలుర క్రమముదు నడిచె
రమణీయమగు నగారా మోత కిరవైన నాగంబు వేఱొండు నడిచె నదలఁ
బనపడి నౌబత్తువారల సింగారంపు నకుంతో గజమొండు నడచెనుండె
ఢంకాధ్వనులు "ఢమ్ము ఢమ్ము ఢ"మ్మని మ్రోయ నావెన మొక్కండు తర్వాతనడచె

తే. గీ. జాను మీఱెడి వేఱు జెండాను దాల్చి
తురగ మొక్కటి నడిచె నుద్ధురత బిగులు
నెగడ నొకవాజి రాజు తీరుగను నడచె
నాపయిని సాఫు సవ్వారు లలరనడచె. ౭౪

తే. గీ. ఆపయిఁ బదాతివర్గము "బ్యాండు" నడచె
బిదపఁ "డాషా" ధ్వనులు మీఁద భేరికాస్వ
నములు శంఖరవములు వారమృగనేత్ర
లాడు లాస్యమ్ములును జోలుపారె మిగుల. ౭౫

ఉ. పట్టపు టేనుగున్న కిరుప్రక్కల మేటి తుపాకులూని బల్
దట్టులు జోదులున్ మిగులదట్టులు పేల్ "సరదార్లు" బల్లెముల్
పట్టుక కొందఱున్ గనులపండువుగా రజతంపువేత్రముల్
పట్టుక "చోపుదారులు" ను వైభవమొప్ప మెలంగి రయ్యెడన్. ౭౬

తే. గీ. సూర్య చంద్ర బింబమ్ములసొంపుగలుగు
రాజచిహ్నమ్ములను దాల్చి రాజభటులు
నడచి రిర్వురు పట్టంపునాగరాజ
మునకుఁ జేరువఁ గనువారు ముదము చెంద. ౭౭

చ. మకరపుఁ దోరణమ్ము గరిమం జెలువారఁగ నుత్సవమ్ముతోఁ
బ్రకటతరమ్ముగా సపరివారముగా "దరబా" రనన్ బ్రసి
ద్ధికినెలవైన యమ్మహాలుకేఁ కువమై విడి రాజు రాజవీ
థికి నొగివచ్చెఁ జూపఱు లవేపనిగాఁ దనుఁగాంచుచుండఁగన్. ౭౮

ఉ. అట్లు చనుదెంచె నొడతనియాప్తులలోఁ గడుముఖ్యులైన వేం
కటగిరి రాజు నయ్యనఘు గాదిలిపుత్రులుఁ బేర్మి మీఱ నం
తట వెనువెంట నాగజరథమ్ముల సొంపెసలార నెక్కి యు
ద్భటమగు నుత్సవమ్ము వెడఁబొల్గొని రారయువారు మేలనన్. ౨౦

మ. అపుడా యేన్గు నొయారపున్నడలతో నత్యంతమాంద్యమ్ముమై
గవిసర్ణ్యమ్మగు రీవితో నడచె వెన్కన్ దుర్గ్పనర్వార్లభూ
ధవు దాడాపున నేఁగుచుండి రిటు తద్రాజేంద్రుఁ డేతెంచె ను
త్సవ సొంతే నలరార దైవతగృహద్వారప్రదేశానకున్. ౨౧

క. నరవరుఁడు దేవళపు గో
పుర పురసమీపమున కిట్టుపుద మొదవఁగఁ దా
నరుదెంచి గజముడిగి బం
గరు గిండియలోని జలము గైకొని పిదపన్. ౨౨

శా. పాదక్షాళన మాచరించి యెదురై వాద్యాలతో వేదపు
న్నాదం బొప్పఁగ శంఖపుణ్యరవముతో నవ్యోత్సవశ్రీదగం
గాఁ దోతెంచెడి స్వామిపాదుకల నగ్రంబంద వీక్షించి యా
పాదం బొప్ప నమస్కరించి మదిలోఁ బొంగారు భక్త్యున్నతిన్. ౨౩

క. నవరత్నఖచితమగు కే
శవు శఠగోపమ్ము పుష్పసహితమ్ముగ భూ
ధవుఁ డైదుసార్లు గైకొని
శివకరములు మాలికలును జేకొని పిదపన్. ౨౪

తే. గీ. ఆలయములోనికరిగి యందందుఁ బొలుచు
నట్టి పరివారదేవతలందు నొక్క
రొక్కరిని వేలువేలుగా నక్కజంపు
భక్తి దరిసించి నుతియించెఁ బార్థివుండు. ౨౫

మ. గరుడాళ్వారికిఁ బ్రొక్కి వాయుసుతు భక్తగ్రామణిన్ బేర్మిమై
మఱియున్ భక్తి నమస్కరించి పయి నమ్మాళ్వారి సేవించి స
త్వర మచ్చోటెని బాసి యేఁగి యట సీతారాము దర్శించి యా
ధరణీభర్త నమస్కరించె నల రాధాకృష్ణులన్ జిష్ణులన్. ౨౬

క. శ్రీరామానుజు వలనొని
రారాజద్రాజ్యలక్ష్మి రహిఁ బ్రొక్కి ధరా
ధారుండు వేణుగోపా
లారాధన పొందె నధిగె ననుపమభక్తిన్. ౭౭

తే. గీ. పూర్ణభక్తి నద్దేవుని పూజసలుపఁ
జేసి మంత్రపుష్పంబు విశేషముగ స
మర్పణ మొనర్చి యామీఁద మహీపుఁ డతనిఁ
దనదు పట్టాభిషేకవిధానమునకు. ౭౮

తే. గీ. వినతి సంజలి ఘటియించి పెక్కు నతుల
నుతులొనర్చియు భక్తిమై నతు లొనర్చి
స్వామి ! నీకృప కల్మి నిచ్చలును మాకొ
లమ్ము రాజ్యమ్ముఁ బూని చెలంగుచుండె. ౭౯

ఉ. ఎన్నఁటి కిట్టి సత్కృపయె యీభవదంఘ్రిసరోజసుభక్తిసం
పన్నులమైన మాయెడలఁబాలఁగఁజేయుము మేము మాధరిత్రీ
భృన్నతి నెట్లు గోరుదుమొ పూర్తిగ నీవును మాకునై మహీ
భృన్నతిఁగోరి పూజ గొనుచుండుము రాఘవులంబు వర్ధిలన్. ౮౦

శా. యావల్లోకము నీయధీన మిది పాల్యంబెట్టులో వొడ్లకో
దేవా ! నీదు ననుజ్ఞ నైకొనియె మాదృక్షుల్ ప్రజాపాలన
శ్రీవిధృత్వపదమ్మునైకొనుట నీచిల్లేశ మేమాత్రమో
మావంక ప్రసరించుటం జుమి ! ప్రజామాన్యత్వమబ్బెఁ బ్రభూ. ౮౧

చ. ఎఱుఁగనివారు "మేమె పరమేశులు" మంచనుకొంద్రుగాని ధీ
వరు లటు లెంచఁబోరు భగవంతుఁడె సర్వవిభుండు వానిదౌ
కరుణకుఁ బాత్రులై ధరణికాంతపదమ్మున కర్హులౌదు రం
చరసి ప్రజానురంజనమువం దనురక్తివహింతురో ప్రభూ ! ౮౨

చ. అని బహుభంగులన్ దనదువాత్మఁగలట్టి వివేక మెల్ల దే
వున కతిభక్తిమై వినిచి పూర్వపురాజుల యట్ల యమ్మహా
త్ముని దన భావిరాజ్యపదధూర్వహణంబున కాజ్ఞయిమ్మటం
చు నడిగి యచ్చోటు వెడలుచునొఁ గడుఁ బొంపిరిపోవు భక్తితోన్. ౮౩

చ. మఱియు నరేశ్వరుండు హనుమంతుని రాజతశిల్పకల్పితున్
సారిది నొనర్పఁజేసి మధుసూదనుఁడౌ నలశౌరికిన్ మహా
త్తరమగు పేర్మితో నొసఁగఁ దా మదినెంచియు దానిఁగూర్చి యు
త్తరువు నొసంగె నంత ఖిలెదారునకున్ బనికై కడంగఁగన్. ౧౩

తే. గీ. ఇట్లు దేవుని దర్శించి యెలమి నాల
యమ్ము వెడలి మహోత్సవం బరర నేఁడు
కోటలోనికిఁ జనియె నెక్కుడు ముదమునఁ
బిదప జరిగిన వేడుక వినుతు వినుఁడు. ౧౪

శా. అంతన్ సూర్యుఁడు లోకమెల్లెడలఁ దానాత్మీయ తేజమ్ము న
త్యంతమ్మున్ బ్రసరింపఁజేసి తమమున్ ధ్వస్తంబు గావించి యే
కాంతం బించుక విశ్రమించుటకునై కాంక్షించుచున్ బశ్చిమా
శాంతస్థాయిసముద్రపున్ గృహము డాయంబోయె నల్లల్లనన్. ౧౫

ఉ. శ్రీశున కా నిసిన్ గరుడసేవ నొనర్పఁగ నెంచి యేఁడు పృ
థ్వీశులుఁ దాను గాల్నడలనే భగవంతుని వెంటనంటి ర
బ్రాత్రికిఁ దుల్యమై జనపరంపర లెల్లెడ నిండె భూమి యా
కాశము నొక్కటై దెసలు గ్రక్కదలన్ నినదంబు గ్రమ్మఁగన్. ౧౬

శా. శ్రీమద్వేంకటగిర్యధీశ్వరుఁడుఁ దత్పృథ్వీశపుత్రుల్ మహో
ద్ధామశ్రీకుఁడు తేలప్రోలి విభుఁ డుద్యత్కీర్తి సింహాద్రిరా
డ్భూమీశుండును లోనుగాఁ గలుగు భూపుల్ దోడ రాఁ గాల్నడన్
స్వామిన్ గాంచుచు నుత్సవమ్ము నడపెన్ క్ష్మాకాంతుఁ డుల్లాసియై. ౧౭

తే.గీ. నాలు తరవారు గొని మహీపాలుఁ డిట్లు
వేణుగోపాలదేవుని వేడుకతఱిఁ
బాదచారియై చరియించు భావ మెంత
యేని గవివర్ణ్యమై ముదమొసఁగఁజేసె. ౧౮

సీ. నౌబత్తు జెండాయు నలువౌ నగారాయు నొక గజేంద్రమ్ముపై నొప్పుగులుక
బ్యాండు తాషాశంఖ పటహముల్ వీరకాహళులును బటురావముల నొనర్ప
"శ్రీచిహ్న"మొదల్లుగాఁ జెలువారు వాద్యవిశేషముల్ శ్రుతులకుచ్చెరువునింప
వేశ్యకాంతలు నృత్యవిస్ఫూర్తి గానంపు మెలుఁగు లొప్పిడిరితో మేళమాడ

తే.గీ. వెండి గరుడవాహనముపై వేణుగోప
బాలుఁడు సరుక్మిణీకుఁడై బయలువెడలె
భక్తిమై ఱేఁడు బందుగుల్ బలసికొలువఁ
గనుఁగొనెడివారి కానంద మినుమడింప. ౯౦

తే.గీ. వెండి గజవాహనముపై వేడ్క మెఱయ
నెలమితోడ సీతారాముఁ డేగుదెంచెఁ
జక్రినారాయణస్వామి సర్పవాహ
న మ్మధిష్ఠించి వేంచేసె నలువుమీఱ. ౯౧

చ. ఇటు తిరువీథు లేగుతఱి నేమని చెప్పుదుఁ జిచ్చుబుడ్లు న
త్కటపు మతాబులున్ గడునుదారములైతగు మందుగుండ్లు నా
క్కట దివిఁ బర్వఁగా నిసి పగల్ ఫగిదిన్ వెలుఁగొందె దేవుఁ డం
తటఁ బురికేగుదెంచెను ముదంబున ఱేఁడును రోడ రాఁ దగన్. ౯౨

తే.గీ. తొమ్మిదిన్నఱ కుత్సవం బిమ్ముమీఱ
గుడి బయలుదేరి భూజాని కోటచుట్టు
గలుగు తిరువీథు లమ్మెయిఁ గలయఁదిరిగి
యర్ధరాత్రమ్మునకు గుడి కరుగుదెంచె. ౯౩

మ. అలదేవోత్సవముం గనుంగొనుచు "లోకారాధ్యుఁడైనట్టి తి
ర్మలనాథుండు సభార్యుఁడై నృపుని సామ్రాజ్యాభిషేకమ్మునం
దలి తాత్పర్యమునం గృపాపరతమై నాఁడట్లు వేంచేసె బొ
బ్బిలి కంచున్ మదిఁ జూపబుల్ పొగడి రుద్వేలప్రమోదమ్మునన్.

ఉ. దేవునిదర్శనమ్ము నరదేవునిదర్శన మొక్కమాఱె యి
ట్లీవగఁ జేకుఱన్ బ్రజల కెక్కుడు మోదము సంఘటిల్లె; నా
నావిషయాగతుల్ ప్రజలు నాఁటిదినమ్మున వేనవేలుగాఁ
బ్రోవయి పట్టణంబున కపూర్వపుశోభ ఘటించి రెమ్మెయిన్. ౯౫

తే. గీ. రాజు స్వయముగఁ దగినయేర్పాటు లొప్పఁ
జేసి వీక్షించు కతనఁ గించిత్తుగూడఁ
బ్రజల కయ్యుత్సవమ్మున బాధ గలుగ
దయ్యె నెయ్యెడ శాంతియే యతిశయిల్లె. ౯౬

తే. గీ. ఉత్సవం బైన పిదప రాజోత్తముండు
కోట కేతెంచియును నిద్రిగొనక తనదు
భావిపట్టాభిషేకసంభారవిషయ
మందు నిర్మగ్నుఁడై కృత్య మరయుచుండె. ౯౭

ఉ. అంతటఁ గొంతసేపునకు నారవముల్ పచరించెఁ గోళ్లు సు
స్వాంతులు వృద్ధులెల్ల భగవంతునిపైఁ బదపద్యముల్ విని
శ్చింతులు పాడఁజొచ్చి రభిషేకముఁ జూడఁగ నేగుదెంచు త
త్ప్రాంతపుటూళ్లమానిసుల రాయిడి హెచ్చఁగఁజొచ్చె రచ్చలన్. ౯౮

చ. ఇటు తెలవారెఁ దూర్పుదెస యించుక యొఱ్ఱవడందొడంగె ని
ట్టటు మెలమెల్లఁగా నడువనయ్యెను శీతలవాతపోతముల్
బొటబొట మంచుబిందువులు భూరుహశాఖలనుండిరాలె ను
త్కటములు పక్షిరావములు కర్ణసుఖమ్మొనరించె నయ్యెడన్. ౯౯

సీ. వందిమాగధులు "దేవరకు జయంబగుఁ గా" కంచుఁ బద్దెముల్ వాకొనంగ
రాజచిహ్నము నగారా కోటద్వారాన "గణగణ"యని మ్రోఁతగడలుకొలుప
గాయకుల్ శ్రుతిలీనగతి మేలుకొల్పుల నతిమృదువుగఁ బాడిహాయినింప
వైణికుల్ చక్కఁగా వీణలుశ్రుతిఁజేసి భూపాలరాగవిస్ఫూర్తి నెఱప

తే. గీ. నృపతి శయ్యాతలము డిగి నిత్యకృత్య
ములను ముగియించి యభిషేకమునకు ముందుఁ
గాఁదగిన మంగళస్నానకార్యమునకు
సిద్ధముగనుండెఁ దన మహిషియును దాను. ౧౦౦

చ. రవి యుదయించె నంతటఁ గరంబును మంగళవాద్యఘోషముల్
భువియును నాకసం బలమి భోరన మ్రోయఁగ స్నానపూర్ణమహో
త్సవమునకైన వస్తుసముదాయము నొకడు లేగ తెచ్చి య
త్సవ మది చాలవర్ణ్య మగుఁ జక్కఁగఁ జూచిరొ తీరఁగాపరెన్. ౧౦౧

ఉ. సానులమేళముల్ గడుఁబసందగు బ్యాండ్లు నినాదముల్ కన
ద్గానపురస్సరమ్ములు నగారలు దాసజనప్రతానదా
సీనికరమ్ములున్ మటివిశిష్టపురోహితు లిందఱుగ్గిరా
నూనెదు లోనుగాఁ గలుగు నూతనవస్తువు లాహరింపఁగన్. ౧౦౨

తే. గీ. నలుగు బిండియు సీకాయ నవ్యసురభి
తంబు గుంకుమపసపు నిలాధవునకుఁ
బట్టమహిషీయుతునకు నభ్యంజనమ్ము
పొంటెఁ బరిచారికలు తెచ్చియంటి రంత. ౧౩

ఉ. అంతిపురమ్ము తోఁడును యథార్థ్వముగా నొగిఁ దానమాడి శ్రీ
మంతములుగా బురార్జితసమర్చితముల్ ధరణీతనూభవా
కాంతుని రాధికాహృదయ కాంతుని పాదుకలగా యజింపఁ ద
త్ప్రాంతమునం దెలర్చు నలయర్చన గేహము వంక కేగుచున్. ౧౪

తే.గీ. అటమటఁ "ప్రపన్న పాడి" యనునాఖ్యచేఁ బ్ర
సిద్ధమైన శ్రీచూర్ణమ్ముచేఁ దిలకము
నెలమి దిద్ది పీతాంబరములు ధరించి
పూజ "మహాలుకు" విచ్చేసె నోజమెఱయ. ౧౫

మ. చిరకాలమ్మననుండి పూర్వు లెటులాశ్రీపాదుకాపూజ న
క్కఱమైఁజేయుదు రట్లె సర్వమును వేడ్కగా నల్పి యోపాదుకే
శ్వర ! మా రాజ్యము మేము సర్వము భవచ్ఛశ్వద్దయాశీఃపరం
పరకుగా లోఁగినవార మాజ్ఞ యిడుమా ! పట్టాభిషేకానకున్. ౧౬

తే. గీ. ఇట్లు పాదుకలకడ నరేశ్వరుండు
తనకు నిష్టకామ్యార్థసిద్ధిని గుఱించి
ప్రార్థనము సల్పె మఱియు నీపాదుకాచ
రిత్రి మొక్కింత నిట విస్తరింతు వినుఁడు. ౧౭

వ. ఈ శ్రీసీతారాములయు రాధాకృష్ణులయుఁ బాదుకలు మున్ను వీరిపితా
మహునిచే శ్రీబృందావనక్షేత్రమునుండి సప్రయత్నమ్ముగను సభక్తికమ్ముగను
నానీతమ్ములై కోటలో గృహదేవతార్చనార్థముగ నొకమహలులోఁ బ్రతి
ష్ఠింపఁబడి నాఁటనుండి యింతదనుకఁ బ్రతిదినమును బ్రాతస్సాయంకాలముల
యందు ధూపదీపనైవేద్యాదిషోడశోపచారవిధులచే నర్చింపఁబడుచున్న
యవి. ఇక్కతమ్మననే యమ్మహలునకుఁ "బూజామహా" లను నామము
నాఁటనుండియుఁ బ్రసిద్ధమ్మయ్యె, మఱియును. ౧౮

క. ఇరువురు సపర్యకును నొ
క్కరు వంటకు వైష్ణవపరిచారకులు లచటనుం
దురు స్మార్త లిర్వురట శ్రీ
వర గానము సేయుచుంద్రు భక్తి యెలర్పన్. ౧౦౯

సీ. ఇంతియకాదు శూద్రు లొకయిర్వురు నౌకరు లుందు, రందు శ్రీ
మంతులు బొబ్బిలీ పురరమాధవులో మనరావు కోడు ల
త్యంతము భక్తితో సహరహమ్మును నందుచు బ్రిసాదతీర్థముల్
స్వాంత మెలర్పఁగొందు రిది సర్వజనస్తవనీయమౌఁ గదా ! ౧౧౦

క. ప్రతి శుభకార్యమునకు ముం
దతిభక్తిని పాదుకలకునర్చాదిక మా
దృతిసలిపి కాని తత్త
త్కృతికిఁ మొదలిడరు వీరోగిఁ, వినుఁడార్యుల్ ! ౧౧౧

క. ఇది పాదుకలచరిత్రము
తదుపరి సప్తాంగవృద్ధిదమ్మగు లక్ష్మీ
హృదయేశుఁడు నారాయణు
సదమలపూజయును సలిపె తన్మానేత వెసన్. ౧౧౨

వ. రక్తమృత్తికచేఁ జక్కఁగా నలుకఁబడిన పవిత్రభూమియందు శ్రీరాజ
సంస్థాన పురోహితుఁడు కోటికలపూడి చినకోదండ రామయార్యుండు పరి
శుద్ధతండులములచే నాచార్యబ్రహ్మమండపములు నిర్మించి యందష్టదిక్పాల
కావాహనమ్మును దన్మధ్యభాగమ్మునఁ బుటపాకపరిశుద్ధసువర్ణమయమ్మగు
శ్రీలక్ష్మీనారాయణ ప్రతిమయుఁ బ్రతిష్ఠించె. ౧౧౩

క. పదివిధముల యోషధులును
బదివిధముల మృత్తికలును బంచవిధములౌ
సదమలపల్లవములు నట
పదిభూజత్వచము లచట భద్రిపఱచియున్. ౧౧౪

క. తొమ్మిది ధాన్యమ్ములు, ర
త్నమ్ములు తొమ్మిదియు, మూడుధాతు లయిదు గం

ధమ్ములు దూర్వాక్షతలు ఫ
లమ్ములుఁ బుణ్యాపగాజలమ్ములు విరులున్. ౧౧౫

క. పంచామృతములు మంత్రి స
మంచితముగఁ గలశముల యథార్హముగఁ బ్రా
నుంచియు వస్త్రములు సమ
ర్పించి పురోహితుఁడు కడు వివేచన యలరన్. ౧౧౬

క. ప్రతిమాదిశుద్ధి కావిం
చి తగన్ బ్రాణప్రతిష్ఠఁ జేసియు లక్ష్మీ
యుతు నారాయణు దిక్పా
లతతిన్ బూజింపఁ జేసె లలి నృపవరుచే. ౧౧౭

తే. గీ. ఇట్లు పూజించి నరపతి యెఱిఁగి భావి
కార్యసంసిద్ధికై పలుగతుల వేఁడి
మదిని సద్దేవు పాదపద్మములు నిలిపి
ప్రాజ్ఞమహలుకడకేగె సంభ్రమ మెలర్ప. ౧౧౮

గద్య. ఇది శ్రీ తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం బైన శ్రీ బొబ్బిలి పట్టాభిషేకం బను మహాప్రబంధమ్మునందు ద్వితీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః.

# శ్రీ బొబ్బిలి పట్టాభిషేకము

## తృతీయాశ్వాసము



ఉ. ప్రమదోద్రేక మెలర్ప నంతట మహాపట్టాభిషేకంపుల
గ్నము డాడాపుగవచ్చె భృత్యజనసంఘంబుల్ దనుంగొల్వఁ బ
ట్టమహాపీఠ మెలర్చు 'హాలునకు' వేడ్కన్ ఱేఁడు దానేగె న
య్యమరేంద్రుం బురుడింపఁజేసెడి యనర్ఘాలంకృతుల్ భాసిలన్.

సీ. "స్లేడ్లు, లస్టర్లు" వాసించు జవాదిబుడ్లత్తరుబుడ్లు 'రా' నద్దములును
పన్నీరుబుడ్లు తివాసీలు నిల్వుటద్దములుఁ జిత్రములు జంత్రింపుఁగీలు
బొమ్మలు మెఱుఁగుదీపమ్ములు "లాంతర్లు"సౌరు నిండారుమేల్తోరణముఁ
ఝాలరంగులకళ్కి సోలిమైఁ జెన్నారు డాలుదైవారు జెండాలగములు

తే.గీ. మఱియుఁ జిత్రవిచిత్రవిస్ఫురితవివిధ
నూత్నవస్తువులలర ననూనమైన
సిరికిఁ డావయి పట్టాభిషేకహర్మ్య
మల సుధర్మోపమాలబ్ధి ననుకరించె.

తే.గీ. మఱియుఁ బట్టాభిషేక సన్మంటపమున
కెదురుగా "జాల్మతీ" తోడి యేనుఁగులును
నట్టి గుఱ్ఱమ్ములును గడునంద మెసఁగఁ
బ్రాభవపు సౌరు మీఱి దైవారుచుండె.

క. "చెమికీ సల్మా చెతురం
జి" మెఱయు నలుకంబములను జెన్నారెడిబల్
"చెమికీ సల్మా" పని గల
"సమేన" సమకూర్చి మఱియుఁ "జెతురంజి" పయిన్.

క. ఔదుంబరదారుమయం
బై దివ్యత్కనకమయము నై చూపఱ కా
మోదంబు గలుగఁజేసెడి
శ్రీ దనరారు నొక మేటి సింహాసనమున్. ౫

తే.గీ. దాని చెంగట బంగారు "గా" నమర్పఁ
బడిన పాదపీఠమ్మును గడుఁబసందు
గా నమర్చి సింగారంబుగడలుకొల్పి
రట్టి సింహాసనపు దక్షిణాశయందు. ౬

తే. గీ. నలువురు కుమారులును దనకెలన నలర
వేంకటగిరీశ్వరుండు గోవిందయాచ
విభుఁడు గూర్చుండె దశరథప్రభుఁడె యీతఁ
డని తనుం గాంచు చూపఱు హర్షమంద. ౭

సీ. కొమరు లిర్వురతోడఁగొమరారెఁ బీఠికాపురమహారాజు బల్ సిరియెలర్ప
మఱియుఁ గిర్లంపూడిమహిపాలుఁడచట నేయింపుసొంపులుగుల్క నెసకమెసఁగె
సిరిపురంపుఁగుమారసింహుఁడిన్గంటివంశోద్భవుం డచట నేయొఱపు మెఱసె
సంగమువలన "స్కెక్షఁబీ" జమీందారు శ్రీకృష్ణరంగరాట్ఛేఖరుండు

తే. గీ. నచటనె తనర్చె "షేరుమహమ్మదు" పుర
పుంజమీందారును "గలెక్టరింజనీయ"
రాంధ్ర "యూనివరిసిటీ" మహాధికారి
మొదలుగాఁగల మేటులు పొదలిరచట. ౮

ఉ. అంతిపురంబువారిమరియాదకు లోపము రాని ఫక్కి నా
చెంతనె ప్రస్తుతంపు మహిషీమణి లోనగురాణివాసపుం
గాంతల కాసనంబులు తగంగ నమర్పఁబడెన్ విశుద్ధను
స్వాంతలు గూరుచుండి రటనందఱు రాణులు రాణమీఱఁగన్. ౯

తే. గీ. మఱియు సింహాసనంపు వామదిశయందుఁ
దేల్ప్రోల్ జేఁడు శోభనాద్రిపార్థివుండు
"వెంట్రప్రగడ" సింహాద్రిపృథ్వీపతియు
మొదలగు జమీనుదారులు పొదలి రెలమి. ౧౦

ఉ. మేధ మెయిన్ బృహస్పతిసమీకృతుఁడౌ నలపీఠికాపురీ
నాథుని దత్తపుత్రకుసునందనులం బ్రథముండు మేటి గం
గాధర రామరాయనృపకాంతుఁడు పాములపాటి వీఁడు పృ
థ్వీధవు వామభాగమునఁ దేఁకువమైఁ జెలువారె నయ్యెడన్. ౧౧

తే. గీ. రాజమన్నారు బహదరు రాజమౌళి
యును నటనె యాసనమ్మున నొప్పుమీఱె
మఱియుఁ జెలికాని గోపాలమహీపసుతుఁడు
శ్రీజగన్నాథరావందఱ యోజమెఱసె. ౧౨

ఉ. తక్కిన రాజబంధుసముదాయముగూడ యథోచితంపు మేల్
ఫక్కిని దత్తదాసనములన్ జెలువారెను సింహపీఠికిన్
ముక్కున నూటిదిక్కునఁ బ్రమోదముమై నృపమంత్రిలున్ యశో
భాక్కులు పండితుల్ కవులు భాసిలుచుండిరి పెద్దరైతులున్. ౧౩

శా. ఈరీతిన్ గమనీయశోభ కిరవై యేపారుపట్టాభిషే
కారంభంపుమహాసభాభవనమం దయ్యెప్రజల్ గూని సిం
గారంబున్ గనుచెప్ప చెప్ప దని వేడ్కల్ సేయుచున్నంత బల్
ధీరస్వాంతుఁడు ప్రస్తుతంపునృపుఁ డేతెంచెన్ యథాగ్నోన్నతిన్. ౧౪

సీ. నవరత్నఖచితసుందరకంకణమ్ములు హస్తపల్లవముల నవఘళింపఁ
బచ్చలహారమ్ము లచ్చంపుటాణిముత్తెంపుహారము లెద నింపులింపఁ
గనులకు మిఱుమిట్లు గడుఁగొల్పి హవణించు "జరమైమరపు" మేనఁ జౌకళింప
హీరాదిమణుల నిగారమ్మున కగారమైన "సర్పేషు" సౌరలమి వెలుఁగ

తే. గీ. మెఱఁగి సహర్మ్యఖకమలంపు జిగిని దెగడు
సొగసు మొగమునఁ జిఱునగ విగురు నెఱప
హితపురోహితమంత్రిసహితుఁడగు రామ
కృష్ణ రంగరాయఁడు సభ కేగుదెంచె. ౧౫

ఉ. అంతకుమున్నె తల్లియగు నల్ల 'డవేజరు' రాణిగారి య
య్యంతిపురాన కేగి యట నాయమ కెక్కుడుభక్తి మ్రొక్కి "శ్రీ
మంతుఁడ వాయురున్నతిసమన్వితిమంతుఁడవై యశమ్ము గొ
మ్మింతయు" నంచుదీవన లనేకము గైకొనె వీఁడు పోడిగన్: ౧౬

వ. అట్లాశీర్వదించి యామె వెండియు ని ట్లనియె. ౧౭

తే. గీ. నాయనా ! నీమనంబు విజ్ఞానమునకు
నిలయమని యే నెఱింగియు నీకుఁ గొన్ని
చెప్పఁదగు నంశములను స్పష్టీకరించి
చెప్పుచుంటిని మదిఁ బెట్టఁ జెల్లు నివియు. ౧౮

మ. నృపతిత్వమ్ము వహించు దంట ! మని కెంతే నోరపున్నేరుపుణ్
గపటంబుణ్ ఋజుభావముణ్ మృదుతయుణ్ గాఠిన్యముణ్ లోనుగా
నుపమాతీతము లైనమే ల్గొనము లెన్నో చెన్నుమీఱ న్వలెణ్
రిపుషడ్వర్గజయంబు ముఖ్యమగు నుర్వీనేత కెప్పట్టునణ్. ౧౯

క. అంతశ్శత్రువిజేతకు
నెంతయు బాహ్యారిపువిజయ మెల్లిదమగు ధీ
మంతు లటులౌట దీనికె
యింతగఁ బ్రాముఖ్యమిచ్చి రెఱుఁగంగఁ దగుణ్. ౨౦

తే. గీ. ఆత్మదృష్టాంతమున నృపుఁడన్నియెడలఁ
జనఁగరా దొకకొన్నిటఁ జనఁగవచ్చు
విస్తరింప సంగ్రహముగ వినుము సకల
కృతుల జాగ్రత్తవలయు నరేంద్రునకును. ౨౧

చ. మును పలకృష్ణరాయనృపముఖ్యుని మంతిరి సింహపీఠమం
దున నెలకొల్పి యాపిదపఁదొల్లి వచింపఁగ విస్మరించిన
ట్టినయ మొకానొకం డెటు పఠింపఁగఁజేసెనో నీకు దేశికుల్
వినిచిరె యుందు రెందుఁ బృథివీపతి సర్వమెఱుంగు టొప్పగున్. ౨౨

క. ఇటు తల్లిగారు నొడివిన
పటుతరమగు నీతులను నృపాలుఁడు విని పి
మ్మటఁ బరిమళ మలరారిన
పుటపాకపుఁ గనకమనఁగఁ బొలుపున మించెన్. ౨౩

సీ. పిమ్మట నల్ల "దఫేదారులును సుబేదారులు" మఱి "హవల్దారులును" "జ
మేదారు!" లెలమి "తాణేదారులును సముద్దార్లు ఖిలేదార్లు" బార్లుగట్టి

నడువ 'సిఫాయీలు' నెడనెడఁ 'దురుపు సిఫాయీలు' దోతేర 'బల్లెముపరుదార్లు చోటేపరుదారులు' వివిధాయుధములు దాల్చి యథాక్రమముగ రాఁగఁ

తే.గీ. బండితులును గవీంద్రులు బందుగులును
గాయకులు కడు దగ్గఱగా మెలంగఁ
బ్రతిపదమున 'సలాం' మని పలుకు 'చోపు
దారు' లగ్రభాగమ్మునఁ దనరుచుండ. ౨౫

క. మఱియు 'బయాస్కాప్ఫిలుముల'
నఱిముఱిమైఁ దీయు శిల్పు లాదృతితోడన్
బరివేష్టించుచు రా నృప
వరుం డరుగుదెంచె నల సభాస్థలి కెలమిన్. ౨౬

క. పరిహాసకులును మాగధ
వరులును "ఫోటోలు" దీయువారును దత్త
త్పరిసరముల నరుదేరఁగఁ
బురందరుఁడు వోలె నవనిపుఁడు చనుదెంచెన్. ౨౭

క. 'నౌబత్తు నగారా డం
కా బిగులున్ బ్యాండు' శంఖకాహళులును భే
రీబృందమ్ములు మ్రోఁగఁగ
నాబొబ్బిలినృపతి సభకు నపుడరుదెంచెన్. ౨౮

తే.గీ. అందకత్తియలైన పణ్యాంగనలు సు
మాళముగ మేలమాడ సమంచితగతిఁ
బసపుఁ గుంకుమ మత్తరుఁ బళ్లెరముల
వెంటఁ బుణ్యాంగనలు దేఁగ వెడలె విభుఁడు. ౨౯

క. బంగారు కలశములతో
రంగారు జలమ్ముఁ బూసరములు ఫలమ్ముల్
మంగళకరముగ దీవి చె
లంగఁగ నంగనలుదే నిలాపతి వెడలెన్. 30

సీ. సరదారు రావువంశభవుండు శ్రీశోభనాద్రి సూర్యారాయఁడన్వయాశ్రి
మాగతవీరఖడ్గాంచితహస్తుఁడై గారినిమై మార్గముచూపుచుండ

ఘనుఁ డినుగంటి వేంకటభుజంగవిభుండు చెలికాని శోభనాచలనృపుఁడును విచ్చుకత్తులతోడ వెరవుమైఁ జక్రరక్షకులయి యుభయపార్శ్వముల నిలువ

తే. గీ. రమణ నినుగంటి గోపాలరావును జెలి
కాని చెల్లరావును గరకలితరజత
వేత్రులై తన్ను సేవింప విభుఁడు వెడలె
నపుడు పట్టాభిషేకమండపము దరికి. ౩౦

తే. గీ. రావువంశ్యుండు గోపాలరావు దామె
రకులజుఁడు బుచ్చివేంకటరావు వీర
లిరువురును బార్శ్వములనుండి యెలమిఁ జామ
రములు వీఁచుచునుండిరి రాజమణికి. ౩౨

తే. గీ. మఱి "హుజూరు హుమేజుదార్" సిరుగుడుకుల
భవుఁడు శ్వేతాతపత్రమ్ముఁబట్టె, రంగ
నాయకులు ముద్రికను శ్రీజనార్దననృప
వరుఁడు భూజాని యనుఁగుసోదరుఁడు వట్టె. ౩౩

ఉ. బంగరు పళ్లెరమ్మున నభంగురశోభ యెలర్ప తేని య
య్యుంగరముంచి పట్టుకొని యోజ జనార్దనకృష్ణరంగరా
, యాంగజుఁ డేగుదేర నృపుఁ డత్యధికాంచితలీల సింహపీ
ఠాంగణసీమకుఁ మదగజాధిపయానమునఁ జనెఁ వెనఁ. ౩౪

శా. సేనాబృందము తేనిఁగాంచి వినయశ్రీ మేరమీఱంగ న
త్యానందమ్మెసఁగఁ యథోచితపు మర్యాదాకృతుల్ సల్పఁగా
భూనాథుం డవి స్వీకరించి యటుపైఁ బూజాదికం బావృపా
స్థానస్థమ్మగు సింహపీఠి కెలమిఁ జల్పించెఁ జల్పించియుఁ. ౩౫

తే. గీ. మూఁడుసార్లు ప్రదక్షిణము నొనరించి
సరిగ సుముహూర్తవేళను జనవరుండు
భూరిమంగళవాద్యముల్ భోరుకలఁగ
శ్రీవి సింహాసనమ్మధిష్ఠించె నెలమి. ౩౬

వ. అధిష్ఠించుటకు మున్న యన్నరవరుండు. ౩౭

మ. వినుఁడీ నాప్రజలార! మీయెడల నే విశ్వాసినై యుందు మీ
రనయమ్మున్ సుఖమందఁగల్గుటకె యేనత్యంతమున్ యత్నమున్
బొనరింతున్ మిము నాకుఁ బూర్వులగు మాభూపాలు రేరీతి మ
న్ననమై మన్చిరో యట్టులే మనుతు నంతఃప్రేమ దీపింపఁగన్. ౩౮

చ. ఎఱుఁగుదు "రాజభావమున కెన్నియొ రెట్టులు సౌఖ్యదంబుగాఁ
బరగుఁ బ్రజాత్వ" మన్ననుడి; పాలకవంశమునందుఁ బుట్టి భూ
భరము వహింపకుంటయును భావ్యము గామి యెఱుంగుదున్; క్షితీ
శ్వరపద మక్కతమ్మునన సాధుహితమ్ముగఁ దాల్చ నొప్పితిన్. ౩౯

మ. గురుభావమ్మున కన్న శిష్యపదమే కూర్చున్ ముదంబంచు ను
ర్వర నెవ్వార లెఱుంగ? రట్లైటేఁగి భావ్యంబౌ గురుత్వంబు నె
వ్వరు వోనాడరుగా? పరంపరగ భూపాలాన్వయస్థుండనై
నెఱవన్ భూభరణప్రయాసమునకున్ విందైనఁ గాకుండినన్. ౪౦

క. విగుణములయ్యు స్వకులధ
ర్మగతుల్ శ్రేయస్కరములు; మఱి యెంతగ భూ
రిగుణయుతములై యొప్పియుఁ
దగ వొగిఁ గైకొనఁగ నన్యధర్మానుగతుల్. ౪౧

చ. అని భగవానుఁ డాడునుడి యార్యహితం బగుటన్ బ్రజానురం
జనమున బుద్ధి నిల్పి యిది సజ్జనసమ్మతి సింహపీఠి నుం
డ ననుమతించుచుంటి క్షితినాథుని నన్నును మిమ్ము సృష్టిచే
సిన భగవంతుఁడే మనకు శ్రేయముఁ గూర్చుత సర్వభంగులన్. ౪౨

క. ఈరీతి సంగ్రహమ్మగ
భూరమణుఁడు వలికి తూర్యముఖవాద్యమ్ముల్
భోరన మ్రోయఁగ వేడ్కను
దారమ్ముగ సింహపీఠి నారోహించెన్. ౪౩

శా. ఆరోహించెనొ లేదొ భూవిభుఁడు సింహాసంబు తోడ్తో శిరం
గీరావమ్ములు మ్రోసె, భూనభము లేకీభూతముల్ గా సభా
స్తారోదంచితహస్తతాళరవముల్ దైవారె, మేల్ "బాణసం
చా" రావమ్ములు మిన్నుముట్టెఁ గడునుత్సాహమ్ము దీపింపఁగన్. ౪౪

చ. ప్రకటితమంత్రపూతములు వారిధిపుణ్యనదీజలంబు లం
తయును దెచ్చి బంగరుకలశ్యంబుల నించి యుంచి రు
త్విజులు సదంబుపుల్ నృపతిసోముని మూర్ధమునందుఁ బంచక
ర్ణికలును బ్రాహ్మణర్త్విజు లుదంచితవైఖరి నొల్కఁ బోసి రెమ్మెయిన్. ౮౫

మ. అభిషేక మ్మిటు శాస్త్రచోదితముగా నాభూమిభృన్మౌళికిన్
బ్రభవైవారనోవర్ప్వనంత ధరణీపాలోత్తముండున్ మహా
ప్రభుతాశోభియునైన వేంకటగిరిస్వారాజు శ్రీబొబ్బిలి
ప్రభుహస్తమ్మునఁ జొనిపె ముద్రిక ననర్ఘంబైన ఖడ్గమ్ముతో. ౮౬

క. ముద్రిక నర్పించుటకు స
ముద్రాద్రిసరిత్సమేతముగ రాజ్యం బ
చ్ఛిద్రగతి నేలుకొనుము భ
వద్రాజపదంబు సుకవివర్ణ్యము గాఁగన్. ౮౭

చ. అనియును, ఖడ్గమిచ్చుటకు నర్థము దూరిపువర్గ మెన్నఁడే
నని మొనఁ దారసింపఁ దునుమాడుము కాక యటంచు నింక నా
యనిశితఖడ్గ మన్వయపు శూరపరంపర దాల్చినట్టి దౌ
టను దొలివారిఁబోలి ప్రకటమ్ముగ నేలుమటంచుఁ దెల్పఁగన్. ౮౮

చ. అనుచుఁ బితామహాగ్రజుని యాత్మజుఁడౌ నృపమౌళి మేలి దీ
వన ధ్వనితంబుగా నొసఁగ వానికి రెంటికిఁ గూడ శాస్త్రచో
దన కనుకూలమౌగతి ముదమ్మునఁ బూజయొనర్చి రాజమం
డనుఁడు ధరించి మించె నికటస్థితబంధునృపాలు రుబ్బఁగన్. ౮౯

చ. వెనుక నుదాహరించిన పవిత్రతరద్విజకన్య లా నృపేం
ద్రుని మహిషీమతల్లికి మనోహరసద్గుణవల్లికిన్ గన
త్కనకఘటమ్ములం గొని యథావిధిగా నభిషేకమున్ ముదం
బునఁ బొనరించి రందుఁగల భూపకళత్రము లౌలి మేలనన్.

సీ. పరమపవిత్రులౌ బ్రహ్మచారులకుఁ గన్యాదానములు గొన్ని యధిపుఁ డిడియెఁ
బాత్రభూతులకు విప్రస్వాములకుఁ గొన్ని భూదానములను భూభుజుఁ డొసంగె
గృహవిహీనులకు నాశ్రితులకు నతికొన్ని గృహదానములు రాజబుధుఁ డిచ్చె
కలిదావాగ్నులకు నుసంతతిశాలురకుఁ గొన్ని గోదానములు రాజగోపుఁ డొసఁగె

తే.గీ. మెఱిగి సువర్ణదానంబు శ్రీమూర్తిదాన
మాది పదియాఱుదానమ్ము లర్హులైన
విప్రసత్తములకుఁ బృథివీమహేంద్రుఁ
డొసఁగెఁ దనదు పట్టాభిషేకోత్సవమున. ౫౧

చ. ఆటుపయి "రామమోహన" సమాఖ్య నెసంగెడి పట్టపేన్గు కు
త్కటమగు పూజసల్పియు నుదారము "సిల్వరుమోరు" నాఁగఁబ
ల్దిటమగు పట్టపుం హారికిఁ దేఁకువఁ బూజనొనర్చి దాని పి
మ్మట వృషపూజయుం రథసమర్చనముం బొనరించె ఱేఁడొగిన్. ౫౨

ఉ. ఆపయి బ్రాహ్మణోత్తము లహర్పతితేజుని బొబ్బిలిప్రభు
త్వోపయమోపశోభితు నితోధికవృద్ధియుతుం బొనర్పఁగా
నోపిన మంచివాక్యముల నుచ్చతరస్వరయుక్తికల్మి ను
ద్దీపితుఁజేసి రాద్విజుల దీవనలం గ్రహియించె భూపుఁడున్. ౫౩

క. ముదమలర ద్విజులకు ఫల
ప్రదానములు సలిపి ఱేఁడవారిగఁ దృప్తిం
బొదలించె; నంత సోదరుఁ
డెద భక్తి యెలర్ప మ్రొక్కెఁ గృష్ణవిభుఁ డొగిన్. ౫౪

తే.గీ. రహి జనార్దనశ్రీకృష్ణరంగరాయ
నృపతి తను మ్రొక్కినంత భూమిపతి యనుజు
నెక్కుడగు పేర్మి నాశీస్సులిచ్చి గార
వించి మోదాబ్ధి నోలలాడించె మఱియు. ౫౫

సీ. బొబ్బిలినగరికాపూర్వజన్మార్జితఫలభూత! నీకు మంగళము నృపతి!
రావుసత్కులపయోరాశి రాకాచంద్రమఃప్రాయ! నీ కిదే మంగళంబు
సుకవిపండితగేయవికళంకసద్యశఃకలితచ్చారిత్ర! మంగళము నీకు
దానధారాధౌతదశదిగ్వధూగండఫలక! నీకిదిగో మంగళము ఱేఁడ!

తే.గీ. పరమసాధ్వీలలామకుఁ బట్టమహిషి,
కలఘుసంతానసౌభాగ్యకలిత, కఖిల
దేవతాద్విజపూజనాధీనమతికి
మంగళము మంగళము, శుభమంగళంబు. ౫౬

చ. అనుచు సువాసినీజనము లారతులెత్త నృపాలుఁ డా సువా
సినుల నుదారతాగరిమ చెన్నెసలార బహూకరించి హె
చ్చిన బహుమంగళధ్వను లశేషదిగంతము లాక్రమింప నా
సనమున నుండి "ప్రాఙ్నృపాలు" చయ్యన దా దయచేసెనంతటన్. ౫౭

క. ఇనుఁడు నభోమధ్యంబున
ఘనతేజశ్ఛటలు దెసలఁ గలయం బాఱం
గను వెలుఁగఁజొచ్చె సభ్యులు
చనిరి నిజనివాసములకు సంతసపడుచున్. ౫౮

క. ద్వైతాద్వైతవిశిష్టా
ద్వైతమతస్థులగు విప్రతతులకు, భటరా
డ్జాతికి, రిక్తక్షత్రియ
జాతికి సంభావనల నొసంగిరి వెలుచన్. ౫౯

తే. గీ. మఱియుఁ ద్రిమతస్థులైన బ్రాహ్మణులు మొదలు
కొని యశేషజాతులకు నకుంఠితగతి
నాఁడు మొద లాఱుదినము లన్నప్రదాన
మాచరించిరి సుకవివర్ణ్యమగురీతి. ౬౦

ఉ. నాఁటిరేయిని సిటీన్ నృపాలున కనంతముదమ్మున "మేల్ పురీవిహా
రాటనపుర్ మహోత్సవ" మటంచు జనుల్ వినియుంటఁ జేసి "యీ
పోటికిఁ గ్రింకరాదె వెస భాస్కరుఁ?" డంచు క్షణక్షణమ్మునన్
బోటులుఁ బూరుషు ల్వారి నభోమణి దూఱఁదొడంగి రీసునన్. ౬౧

చ. అది గుఱితించిరో యన సహస్కరుఁ డస్తగిరీద్వనాంతసం
పదఁ గనఁ బోయె రిక్కలు క్రమమ్ముగఁ దోఁపఁగఁ జాయెఁ జందురుం
డుదయమహాద్రిశృంగమున నొప్పులుగుల్కవెలుంగఁజొచ్చె న
య్యద నల బొబ్బిలీట్ప్రజల కభ్యుదయప్రదమయ్యె నెట్టిటన్. ౬౨

తే. గీ. "రామమోహన" మను పేర రహి నెసంగు
నల్ల పట్టపుటేనుఁగు నెల్లగతులఁ
గడు నలంకారకలితమ్ముగా నొనర్చి
సిద్ధపఱచిరి తద్ధులా శిల్పివరులు ౬౩

ఉ. చారుతరంపు వెండిపయిఁ జక్కని బంగరుపూఁత నొప్పునం
బారిని బర్వతాభమగు పట్టపుటేనుఁగుమీఁదఁ గట్టి రం
భోరుహమిత్రుఁడో యనఁగఁ బొల్చెడి బొబ్బిలిఱేఁడు దాన సిం
గారముగా నెసంగెఁ దనుగాంచి పురీజను లుల్లసిల్లఁగన్. ౨౪

చ. గజరథమందు వాద్యము లఖండగతిం జెలువార నెల్లెడం
బ్రజ లతివేలరీతి గనుపట్టఁగ నైకవిధమ్ములై ధరే
డ్విజయము దెల్పు మందుపని విన్నను వౌ నలబాణ సంచసం
చు జగదతీతమై వొలయ శోభిలె నుత్సవ మగ్రగణ్యమై. ౨౫

శా. భేరీవాద్యపుశ్రేణు ముందు నడువన్ బృథ్వీశు నప్పట్టపున్
గారాబంపుగజంబువెన్కఁ గడు మందంబౌగతిన్ రా మహో
దారప్రక్రియ నుత్సవం బలరె దూరాయాతనానావిధ
శ్రీరాజజ్జనవేషభాషలఁ బురశ్రీమించి రాజించఁగన్. ౨౬

ఉ. మేడల నెక్కి కొందఱును మిట్టప్రదేశము లెక్కి కొందఱున్
గోడల నెక్కి కొందఱును గోర్కిదలిర్ప యథార్థరీతిమైఁ
జూడఁదొడంగి రానృపతిసూను గజోపరిసంస్థితున్ ధరా
ధ్రీడుపరిస్థితుండగు దినేంద్రునిఁ జూచెడిపోల్కి నయ్యెడన్. ౨౭

౨౮

ఉ. రాముఁడు కృష్ణుఁడుం గలిసి రాజితుఁడై జనియించెనంచుఁ ద
న్నామమె తెల్పుఁగాని సుగుణంబులలో మఱి యందు నేకప
త్నీమహితవ్రతాభిగమదీక్షయెడన్ ధ్రువ మల్ల రాముఁడే
యీమహిపాలుఁ డింకొకటఁ గృష్ణుఁడుగాఁ జెలువారెనేనియున్. ౨౯

మ. అనుభావమ్ము పురమ్మునం దఱచుగా నాబాలగోపాలమున్
జనవిఖ్యాతమయాటఁ దన్నృపమణిన్ సౌందర్యరాశిన్ గనుం
గొను నారీజనమెల్లఁ దండ్రి యనుచున్ గోవిందుఁడంచున్ గనుం
గొనిరే కాని మఱొండు బుద్ధిని గనుంగోలేద యేదిక్కునన్. ౩౦

ఉ. దేవునికన్న సుందరులు దేశమునందు మఱెందునుండ ర
ద్దేవునిఁ జూచుపట్టునఁ బతివ్రతమాటటులుంతె మెట్టి దు
ర్భావపుసోయగంపు నెఱజాఁగకు నేనియు బుద్ధి నన్యథా
భావము పుట్టదట్టి మనపార్థివుఁ డెంత యదృష్టవంతుఁడో!

సీ. దయకు నింతటివాని ధరఁజూడనేర మీతనికి నీతఁడెసాటి యనెడివారు
ఔదార్యమునకు నీయనఘుఁజెప్పినచోట నన్యుఁజెప్పుటదోస మనెడివారు
ప్రజలకష్ట మెఱింగి పాలించు ప్రభు వీతఁ డన్యులమాట లే మనెడి వారు
నరపాలకుల దుర్గుణములం దొకటిగూడ నరయలే మితనియం దనెడివారు

తే.గీ. రాజ్య మున్నంతమాత్రన రాజుగాఁడు
రంజనయొనర్చెగద ? పొందు రాజశబ్ద
మట్టియోగ్యత యితనియం దలరుకతనఁ
గాఁడు ఘృతకోశ మితఁడు నిక్క మనువారు. ౨౨

ఉ. మేఁకలవంటి భూప్రజలమీఁదఁ బ్రభుత్వ మొనర్చుటన్న ను
శ్రీకులకెల్ల సాధ్యమగు చెద్దియె చేతను గత్తిగల్గుటన్
లోకుల యంతరంగములలో నిముడందగు ఱేఁడె ఱేఁడు దు
ర్ధీకుని సైతముం బయికి దేవుఁడె యందురు భీరులౌ ప్రజల్. ౨౩

ఉ. అందుకె పూర్వరాజులు రహస్యమునం దమ మంచిచెడ్డలన్
సందులు గొందులుం దిరిగి చారులచే విని మాఱువేసముల్
వొంది గ్రహించియున్ బ్రజల పొత్తునకై ప్రియతించువార, తే
చందమునచేతఁగాని ప్రజ సంతసపెట్టిన రాజె రాజగున్. ౨౪

క. సతి మనములోన నిమిడిన
చతురుఁడె చతురుండు ప్రజల స్వాంతమునం దా
దృతిగలిగింపఁ గలుగు నర
పతియే నరపతి యితర నృపతులు నృపతులే. ౨౫

ఆ.వె. ఇట్టి ప్రభువు మన యదృష్టవశమ్మునఁ
దారసించె ననుచు ధన్యవాద
మెలమిఁ జేయు ప్రజల కెంతేని యానంద
మినుమడింపఁ బురము నేగె నృపతి. ౨౬

ఉ. ఈగతిఁ బట్టణంబెలమి నేగి క్రమమ్ముగఁ గోటయొద్ద నా
నాగము డిగ్గి యాధరణినాథుఁడు సేవకు కేలుపూని లీ
లాగమనంబులో స్తుతికళావిదు లంచితగద్యపద్యముల్
బాగలరన్ బఠింపఁగ సభాస్థలికిన్ జనుదెంచె నేర్పుతోన్.

తే. గీ. అప్పటికిఁ దెల్లవారె మున్నరుణుఁ డుదయ
మందె నినుఁడును నుదయాద్రి యనెడి సింహ
పీఠముననుండి వైదికవితతి యొసఁగు
నర్ఘ్యములు గొనుచుండె నయ్యవసరమున. ౭౮

క. జనపతియు రాజబాంధవ
జనమంత్రిపురోహితాదిజనయుక్తుఁ గడుం
దనరెడి యాసభ సింహా
సనమునఁ గూర్చుండెఁ బాకశాసనుఁ డనఁగన్. ౭౯

క. ఇరువురు సేవకు లపుడ
న్నరపతి కిరుప్రక్కలందున న్నిలిచి వెసన్
సురటీలు వీచుచుండిరి
పరమోత్కృష్టప్రభుత్వభావము మెఱయన్. ౮౦

క. పోరినడుముల గట్టుక మేల్
తరమగు నుద్యోగులున్ ప్రధానులు రాడ్బం
ధురబంధుజనులు వీఁక "న
జరులు" గొని నరేంద్రునెదుట సభనిలిచి రొగిన్. ౮౧

తే. గీ. వెండిబెత్తమ్ములను బూని వేడ్కఁ "జోపు
దార్లు" గద్యపద్యమ్ము లుదారఫణితిఁ
బేర్కొనుచు దారిచూపఁగఁ బృథివిపతికి
"నజరు" లర్పించి రపుడు విన్నాణమెసఁగ. ౮౨

ఉ. ఆటనివేడ్కమై "నజరు" లర్పణసేసెడివారిపేళ్లు శ్రీ
వారి "హుజూరు రైటరు" సభాసదులెల్ల వినన్ వచింప శ్రీ
వా రభినీతిపై విననవైఖరి సూచనసేయుచుండ శ్రీ
వారికరమ్మునం దిడిరి వారు 'నజర్లు' వినీతిమంతులై. ౮౩

తే. గీ. అటు సమర్పించి రా జన్యునంద దృష్టి
నిల్పి వెనుకకు నడచుచు నియమితమగు
నాసనమ్ముల "నజ" రిచ్చినట్టి యెల్ల
వారుఁ గూర్చుండి రాసభవార లలర. ౮౪

ఉ. ఆదిని రాజబంధువు లనంతరమం దల "మేనెజర్లు" నా
మీఁదట "ఖిల్లెదారు" లటుమీఁదఁ "గచేరికి" ముఖ్యులై నృప
శ్రీదళుకొత్తఁ ద్రావాయు శుభశీలురు మేల్గణకుల్ "నజర్లు" భూ
మీదయితప్రకాండునకు మేలుదలంచుచు నిచ్చి రచ్చుగన్. ౮౫

ఉ. ఇచ్చుట తప్పఁ బుచ్చుకొను టెన్నఁడుగాని యెఱుంగనట్టి యా
యచ్చపురావువంశజుఁ డహర్పతితేజుఁడు కాన్కలన్ మహీ
భృచ్చతురుండు కైకొనియె నిచ్చినదానికి వేయిరెట్లు తా
నిచ్చుతలంపుతో; నదియె యేలిక నృపాలుర ధర్మమౌఁ గదా! ౮౬

తే. గీ. "నజరు" లిటు "దాఖలైన" యనంతరమునఁ
గుడికెలన రాజబంధువుల్ గూరుచుండి
రెడమకెలనఁ దక్కిన సభ్యులెల్లఁ గూరు
చుండి రిడిరి తాంబూలమ్ము లొక్కొకరికి. ౮౭

తే. గీ. పిదప "దర్బార్" నిలుపుచేసి పృథివిపతియు
రాజచిహ్నముల్ దైవారఁ బ్రాజ్ఞపాలుకు
నెలమి దయచేసి విశ్రాంతినించుకంత
కైకొనియెఁ గార్యభారవిక్లాంతి తొలఁగ. ౮౮

వ. పదపడి ఫిబ్రవరి మూఁడవనాఁటియుదయమున నవఘంటాపరిమితమ్మగు
కాలమ్మున. ౮౯

సీ. వేణుగోపాల "బేబీవెల్లుఫేర్ సెంట" రన్న పేరొప్పఁ బట్టాభిషేక
మునకు స్మారకచిహ్నముగ నేఁడు ఘటియించెఁ జంటిబిడ్డలకు మేల్ సరవిగూర్పఁ
బ్రతిదినంబచట ముప్పదిమంది శిశువులకెలమిఁ బాలొయ్యుట కేరుపాటు
'నరు'సాక్కరితయటఁ బెరిమనై శిశువులయారోగ్యమునుగూర్చియరయుచుండు

తే. గీ. నల్ల భవనంబు తెఱచుటకై నృపాల
వరుఁడు వేంకటగిరిమహాప్రభుసమేత
ముగఁ "గలెక్టరు" నద్దొరమగువ "స్మి
"స్మాటరు" దొరసానియు రాఁగఁజవియె నెలమి. ౯౦

సీ. నరపాలుఁ డటులేగి గరిమమై "సౌటరు" దొరసానిఁగని మహాదర మెలర్పఁ
బలికె "నోసాధ్వి! బిడ్డలపోషణార్థమైయేర్పడినట్టి యీగృహము తాళ
మీవు సడల్చుటయెంతేని శ్రేయస్కరంబు" నావుడును నారమణి పెలుచ
నరపతి కభివందనం బొనర్చుచుఁ గడు వినయమ్ము నెఱపి యాబీగమపుడు

తే. గీ. తెఱచె; నరపాలకుండు కప్పురపు హార
మూపె కర్పించె గౌరవంబనఘులింప
నెసఁగెఁ గరతాళరవమెల్లయెడల సభను
గలజనంబుల యామోదగరిమ దెలుప. ౯౧

సీ. సరవి నీ "యిన్‌స్టలేషను" జ్ఞాపకార్థమై "హైస్కూలు" ప్రక్కమహామొదమునఁ
గట్టింపఁదలఁచిన ఘనతరంబైన "హాస్టలుకుఁ" బునాదిరా యెలమినపుడు
వేయింపఁగా నెంచి శ్రీయుతుండగు రేఁడు సపరివారమ్ముగఁ జక్కనటకు
నల "కలెక్టరు" మఱియాతని దొరసాని తక్కనుద్యోగులు పెక్కుమంది

తే. గీ. బలసి వెంబడి రాఁజని పరమగౌర
వంబు చూపించి కోర "గవర్నరుకుఁ" బ్ర
తినిధిగానున్న యాదొర ఘనుఁడు వెండి
తాపితో సున్నమును రాయి దాపె నచట. ౯౨

ఉ. అంతట భూపుఁ డాదొర కనంతముదమ్ముఘటిల్ల సమ్ముద
స్వాంతముతోడఁ గప్పురపు హారముఁ గంఠమునంగు వైచె; న
ల్లంతఁ దదుత్సవార్థము సమాగతులైన జనుల్ వెసన్ దిశా
ప్రాంతములెల్ల నిండుగతి హస్తరవంబు లొనర్చి రేపునన్. ౯౩

ఉ. ఈనికిఁ బాతయుక్ గుణగరిష్ఠుఁడు శ్వేతగిరీంద్ర రంగభూ
జాని యనేకముల్ బిరుదశబ్దము లాంగ్లనృపాలరాజ్యమం
దూనిన మేటి తానొసఁగె "యూనివరిసిటి" కొక్కలక్షగో
దానము తెల్గుబాస వెసఁ దామరతంపరగా నెలర్పఁగన్. ౯౪

ఆ. వె. అట్టు లొసఁగి మఱియు నయ్యేడఁ "బోర్డిఛాన్స
ల" రను పదవినూని గరిమ మెఱసె
దాని "రోబ్సు" తోడఁ దనరు "పోటోగ్రాపు"
స్కూలులోన నిలిపె నోలి రేఁడు. ౯౫

ఆ. వె. దాని లోకులకుఁ బ్రదర్శించుచుపాంటె శ్రీ
రెడ్డిగారిఁ గోరె నేఁడు పేర్మిఁ
గట్టమంచికులుఁడు ఘనుఁడు శ్రీ రెడ్డిగా
రట్లొనర్చి రెలమి యనవఘంప. ౯౬

చ. పిదపఁ గళత్రయుక్తముగఁ జేర్మిఁ "గలెక్టరు" గారి గౌరవా
స్పదమగు రీతి "రాణ్మహలు" చక్కటికంపెయుఁ దాను గోటనే
బదిలముగాఁగ నేఁడు పరివార సమేతముగాఁగ నేగె; న
ప్పదపడి వార్ధకత్వమున భానుఁడు వేల్పఁ కొడంగె వాయువీన్. ౯౭

ఉ. ఆసమయమ్మునన్ మరల నంచిత వేషముతోడ నేఁడు సిం
హాసన మెక్కె; మంత్రులును నాగపు బంధునృపాలురున్ యథా
స్థానసమాశ్రితిన్ జెలఁగి; రట్టియెడన్ సుకవీంద్రులున్ బుధా
గ్రేసరులున్ యథార్థముగ నేనికి దీవనలిచ్చి రచ్చగన్. ౯౮

శా. తాతా రాయఁడుశాస్త్రిగారు విబుధాధ్యక్షుండు షట్శాస్త్రవి
ష్ణాతుండున్ విజయాఖ్యపట్టణవిశేషఖ్యాతిమత్ప్రాశా
లాతిస్ఫీతమహామహోత్తమతమోపాధ్యాయశబ్దాంకితుం
డేతద్రాణ్మణి కిచ్చె దీవనల నెంతేఁ బేర్మి దైవారఁగన్. ౯౯

చ. తిరుపతి వేంకటేశ కవిధీరులలో నొకఁడైన వేంకటే
శ్వరకవి యొక్క శ్లోకమున సర్వశుభమ్ములు సేకరించి భూ
వరునకు దీవనల్ సలిపి వ్రాసిన తక్కిన పద్యముల్ సువి
స్తర మవకాశ మబ్బమిని "దాఖలు" చేసె నృపాలు సన్నిధిన్. ౧౦౦

— ♦ఆశీర్వచన శ్లోకము ♦—

శ్లో. శుభమస్త్వవిఘ్నమస్తు
శ్రీరస్తు చిరాయురస్తు విజయోస్తు
అస్తు ధనధాన్యరాజ్య
శ్రేయోవిద్యాయశఃప్రజాసిద్ధిః. ౧౦౧

శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ.

సీ. ఆకెళ్ల సూర్యనారాయణశాస్త్రిగారొబ్బిలిసంస్థాన పూజ్యమాన
సారభాషాపాఠశాలా ప్రధానపండితుఁడు దీవించె భూపతివతంసు;
హైస్కూలు తెలుఁగుపాధ్యాయుండుబుద్ధాకులుండు శ్రీబాలకృష్ణుండుశాస్త్రి
బిరుదాంకితుండు భూవరు నాయురారోగ్యవిభవాన్వితునిగ దీవించెమఱియు

తే. గీ. వెలమవారును బొబ్బిలి వీటనలరు
జనులు 'నాఫీసరులు' నైతు లెనసి ఱేని
కెంత నభినందనము లిడి యలరఁజేసి
రధిపుఁ డయ్యవిగొని మోదమంది పిదప. ౧౦౨

సీ. "వినుఁడయ్య! మీరు మీ రనువైన భక్తితో నొసఁగెడి యభినందనోక్తులకును
సంతసించితిని బ్రజాహితార్థము నేను రాజ్యభారంబు నిరంతరంబు
వహియింతు మీసౌఖ్యవైభవం బది నాదుసుఖమని మదిసదా చూచువాఁడ
మీరు కష్టిపడంగ నారూఢి నదియెల్ల నాదు కష్టమ్మని నమ్మువాఁడ

తే. గీ. రాజశబ్దార్థమరయఁగ రాష్ట్రజనుల
రంజనమ్మునఁ గాని సార్థకత గనద
టంచుఁ బెద్దలు సెప్పెడి యర్థమెఱిఁగి
సర్వగతుల వర్తింతు నిస్సంశయముగ." ౧౦౩

క. ఇటు నొడివి ప్రాజ్ఞహృల్లోకం
తట విజయము సేసె ఱేఁడు; తదనంతర మ
ప్పటి కాసభయును ముగిసెను
దటుకున రవి యస్తమించు తఱియును దరిసెన్. ౧౦౪

వ. మఱియు నానాఁడె యంత కొక్కింత యనంతరంబున.

ఉ. గాయనులందుఁ బేర్గలిగి గౌరవభాజనమా టెకాక మే
ల్గాయకవర్గమందును జగమ్మునఁ గీర్తిఁ గడించినట్టి సు
స్త్రీ యల నాగరత్నము "కచేరీని" గాన మొనర్చె నెల్ల రా
ప్యాయనమంది సంతసిలి రాసభఁ బండితపామరుల్ దగన్. ౧౦౫

క. అని నొడువుచున్న నెంకనఁ
గని సభ్యులు పల్కి "రోసుకవివర ! నీ చె

ప్పిన తక్కినపద్యములవి
జనపాలుని కెపుడు వినికిసలిపితివా ? యటెన్. ౧౦౬

క. కల దింక నొక్కసందియ
ములఘులు బొబ్బిలినృపాలు రందఱకును జె
న్నలరెడి "రంగారా" వని
తిలకముగాఁ బేరితుద నదియు నెందులకో ! ౧౦౭

తే. గీ. వేంకటగిరి ప్రభులకెల్ల వెనుక నుండి
వెలయు "యాచేంద్రు" లనుమాట పేరి తుదను
దాని కొక సంప్రదాయమ్ము తనరు నది యె
ఱుంగుదుముగాని దీనికెఱుంగ మనఘ ! ౧౦౮

క. ఈరెండు విషయములు చెప్ప
లారఁగఁ జవులూర వినఁగ" ననుటయుఁ గవి య
వ్వారలఁ గనుఁగొని మది పొం
గారఁగ వచియించె నిట్టు లాదృతి మెఱయన్. ౧౦౯

తే. గీ. ఇందు మొదటిది క్రమముగా నేను జెప్పఁ
చరితమున మీరడుగకున్న నెఱుకపడెడి
యంశమే కాని మఱచినయట్టిదానిఁ
గూడ జ్ఞప్తికిఁ దెచ్చుటకు ముదమయ్యె. ౧౧౦

తే. గీ. శ్రద్ధగా విను శ్రోతలచంద మింత
యొప్పనే యని సూతునికున్నయంత
శక్తి నాకున్న లేకున్న శౌనకాది
మునుల కీరు దీటని పల్కి ముదముమీఱ. ౧౧౧

క. కత మొదలువెట్టెఁ బంకజ
హితుఁ డటు లస్తంగతించునెడఁ జల్లఁగ ని
ర్జితనాకలోకవారయు
వతి యారత్నమ్ము పాట పార్థివుఁ గఱచెన్. ౧౧౨

తే. గీ. మంగళోదగ్రముగఁ దుదమంగళంబు
త్యాగరాయకృతిం బాడి నాగరత్న
మంత విరమించెఁ జందుఱం డెంతయేని
గళలతో సత్కవియుఁ బోలెఁ గ్రాలఁ దొడఁగె. ౧౧౪

గద్య. ఇది శ్రీ తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం బైన శ్రీ బొబ్బిలి పట్టాభిషేకం బను మహాప్రబంధమ్మునందుఁ దృతీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః.

# శ్రీ బొబ్బిలి పట్టాభిషేకము

## చతుర్థాశ్వాసము

---

క. శుభమస్తు! వినుఁడు సభ్యులు!
సభ కిట్టు లహర్నిశంబు జరుగఁగ విద్యా
ప్రభయును నైశ్వర్యంపుం
బ్రభయును నొక్కెడకుఁ జేరి భరముగ నలరెన్. ౧

శా. ఈరీతి న్నరపాలచంద్రునకు నాయీగోష్ఠి రేయుంబవ
ల్లారూఢిన్ క్షణమైన తీరని గతిన్ వ్యాసంగ మొప్పారి ని
ద్రారాహిత్యమె కాదు, జగ్ధికి నలబ్ధంబయ్యెఁబో! కాల; మా
యారీతిన్ గని వేంకటేశకవి యిట్లాత్మన్ విలోకించెడిన్. ౨

చ. నృపుఁ డతిశాంతచిత్తుఁడు బరేంగితవేది మహానుభావుఁ డి
ట్లపరిమితంపు టుత్సవములందుఁ దగుల్కొని విశ్రమంబులే
క పవలు రేయు నొక్కగతిగా శ్రమసేయుచునున్నవాఁడు లే
దిపుడు కవిత్వపున్ వినికి కిమ్మగు నయ్యవకాశ మెమ్మెయిన్. ౩

మ. మఱియుం గొన్నిదినమ్ము లున్నయెడ సమ్మానమ్మునై సత్సభాం
తరమం దస్మదుదీరితంబగు కవిత్వమ్మున్ వినుంగాని యా
వలను న్నిల్చుట కాత్మజోపనయనవ్యాపార మంగీకృతిన్
దొరకో నీదటుగాన నేఁగుపనికై తొల్దొల్త యత్నించెదన్. ౪

మ. ఉపనీతిన్ వెసనిప్పు డాపునెడ నెడ్డోగాని వీలౌ ముహూ
ర్తపు లగ్నమ్మది చిక్కుఁ దిప్పనియు, సంధానంబు నీరెంటికిన్
సుపరీక్ష్యంబులు లగ్నముల్ తఱచుగాఁ జూపట్ట వెట్లేని యే
గుపనిన్, జూచుట కర్జ మాత్మజుని వడ్గున్ జేయు నప్పాన్కితో. ౫

క. వేనికి మనవిం జేసెడి
మానిసియుం గానరాఁడు మనుజేశునితోఁ
దానెంత చనవుగల్గియుఁ
బో నవసర మెఱిఁగికాని పోరాదుగదా ! ౬

క. మనకుఁ గలకార్యభర మా
దినె మనవి లిఖించి తన్నిదేశమ్మున వ
చ్చిన సంగతి నరపాలుని
మనమం దుండినను స్మృతి సమయ మిది రౌటుతా. ౭

తే. గీ. ఎంతమంది దేశాధీశు లెంతమంది
రాజబంధువు లెందఱార్యమణు లెంద
ఱాంగిలేయఘనోద్యోగు లవుర ! యిట్టి
సందడిని వేని కెట్లు విశ్రాంతి కలుగు? ౮

చ. అని మదినెంచి వేని మది కత్తెడునట్లుగఁ దేటతెల్లమై
పనుపడు రీతి దీర్ఘమగు పద్యము నొండు లిఖించి 'పోస్టు' లోఁ
నినిచి నృపాజ్ఞఁగైకొనకె నేర్పున నూరికి నేగనెంచు న
య్యనువున నీయుదంతము ధరాధిపు సన్నిధి కేగనెట్టులో. ౯

చ. జనపతి రాత్రికాలమని స్వాంతమునం దలపోయ "కాను, బు
త్రుని యుపనీతిహేతువునఁ దొందరగాఁ గవివర్యుఁ డేగుటే
యనువగు నిప్పుడే పిలిచి యాయన వాగమృతంబుఁ గ్రోలి వెం
టనె సెలవిత్తుఁగా" కని తటాలునఁదాఁ గబురంపెఁ జేర్మితోన్. ౧౦

ఉ. ఇంగితవేదియైన నృపుఁడిట్లనురాగముఁజూప నెంతయున్
బొంగి కవీశ్వరుండు తనపుత్త్రుని యయ్యుపనీతికార్యపున్
సంగతి వేని నెమ్మది నెసంగుటకున్ గొనియాడి శిష్యపం
క్తిం గొని వేని దర్శన మొగిం బొసరింపఁగ నేగె నా నిసిన్. ౧౧

క. జనపతి వేంకటగిరి నృప
తనయులు దాను నొక సభను దగఁదీరిచి యా
య్యానఁ జంద్రశాలఁ బద్యము
లను విని యానందమున నలరి కడు మెచ్చెన్

తే. గీ. మెచ్చి "మామది కెంతయు మేలుఁగొలిపె
మీ కవిత్వప్రసక్తి మేల్మేలు ! మీకు
నిచట నుండుట కవకాశ మెంతగలదొ ?
తెల్పుఁ" డన వేంకటేశుండు దెల్పె నిట్లు. ౧౩

క. భృగువార మ్మానాఁడు ప
యి గణింపఁగ రెండు నాళ్ల కెక్కుడుగా నే
నీఁగ నిచట నిల్చు టదియుఁ బొ
సఁగ దాత్మజు వడుగు దరికిఁ జనుదెంచె నృపా ! ౧౪

తే. గీ. ఇందువారమ్ము నాఁటి కెల్లేని యేగు
న ట్లనుగ్రహించినయెడ నాత్మజన్ము
వడుగు రేపనఁగా నేగ వలనుపడెడి
ననఁగ నృపుఁ డట్లె సెలవీఁగ ననుమతించె. ౧౫

ఉ. అప్పటికి న్నిశీథసమయమ్మునుగూడ నతిక్రమించె ; నిం
కిప్పటి కాజ్ఞయం చడిగి యేగెఁ గవీంద్రుఁడు ; ఱేఁడు శయ్యపై
ఱెప్పలు మోడ్చునంతఁ జెలరేగెను గుక్కుటరావముల్ ముదం
బొప్పఁగ వందిమాగధజనోక్తమృదూక్తు లుపాంగమై తగన్. ౧౬

శా. ప్రాతఃకాలము వేఁటయాకతన భూపాలుండు తత్తద్భట
వ్రాతంబుల్ గొలువంగ దోడినృపవర్గం బుత్సుకత్వమ్మునై
నేతేరన్ మఱిఁ గొంద ఱున్నతులు సత్కృత్యర్హు లుద్యోగులో
శ్వేతాస్యుల్ వెనఁ దోడరా నరిగె నుద్వేలాటవీభూమికిన్. ౧౭

శా. కాంతారమ్మున కట్టులేగి మృగయాకౌతూహల మ్మొప్పఁగా
జంతువ్రాతమునందు కొని కెలమిన్ జంపంగ నర్హమ్ములై
క్షంతవ్యమ్ములుగాని కొన్నిటి నొగిన్ శాసించి భూపాలుఁ డ
త్యంతశ్రాంతిమెయిన్ బురం బరిగె మధ్యాహ్నమ్ముగా వేగమే. ౧౮

సీ. జోల నానాఁడు సాయంకాలమందు "జింఖానబంగాళా"కుఁగరితురంగ
సేనాసమేతుఁడై భూనాథుఁ డనుఁగుభూపతులతో హితులతో స్వారివెడలి
'పోలో' యనెడి యాట పొల్పుమైనాడి పౌరుల బంధుగులఁగవీంద్రులను నంతి
పురమువారల మహత్తరమైన యానంద మున్నితేల్చు నట్లొనరఁజేసె

శా. ఆగుఱ్ఱమ్ములజోరు నారవుతులందల్లారునాతీరు నా
యా గడ్డుందఱు లందు వార్సలుపు నాయా తాలుమార్పోవు నే
లాగుల్ వర్ణనసేయనాఁ గవుల ? శ్రేలా శిల్పి చిత్రింపనా?
'బాగుం బా' గని చూచి మెచ్చుటయె సంభావ్యంబు నాబుద్ధికిన్. ౨౫

ఉ. అందును బొబ్బిలి ప్రభునియాట విచిత్రపుటాట, సవ్యసా
చిం దలపించుఁ గందుకముఁ జే లగుడమ్మునఁ గొట్టునప్పు డా
చందము నడ్డదిడ్డముగఁజాచి యొకప్పుడు చెండుగొట్టు నా
చందము వర్ణనీయము లసాధ్యము లొండొక యాటకాండ్రకున్. ౨౬

చ. ఇతఁడు కృతీశ్వరుం డనియు నిట్టులు మెచ్చిన మెచ్చుచే మహో
న్నతముగ నన్ను గౌరవమునం గన వీలగు నంచు నెంచి యీ
గతి నసదో గొన మ్మెటులొ కల్పితముం బొనరించినట్లు మీ
మతిఁ దలపోయఁ గాదు ధృతిమంతుఁ డిట న్నరపాలుఁ డన్నిటన్. ౨౭

ఉ. వేంకటరామరాయపృథివీవరునాటయు బొబ్బిలీంద్రుఁ డే
పొంకముఁ జూపుఁ దాదృశపుఁ బొంకముఁ జూపెడు నట్టిదే, జనా
హంకృతిఁ బొల్చు నశ్వములయందుఁ దదేతదధీశులుండి యే
జంకును గొంకునుం గనక సల్పిరి యాట విచిత్రపుం గతిన్. ౨౮

ఉ. ఆటలు లేవొ ? తాదృశపు టాటల నాడెడి యాటకాండ్రు లే
రోటు ? జగమ్మునం దెట నొహో ! యిట నశ్వములందుఁ బాటుగా
దాఁటుటె కాదు ప్రాణములుదాఁ కెడునట్టి ప్రసక్తి గూడ రా
నాట శుభ్రితంబగుల్ ; సమరమా నిది యిప్పటి నేల తెండ్లకున్. ౨౯

శా. హేలాకీలితదీర్ఘదండకరులై యిర్వాగు నబ్బంతి న
'గ్గోలుం' దాఁటఁగఁజేయ సారెకును ద్రొగ్గు న్నిగ్గు గుఱ్ఱాల ను
య్యాలల్ దూఁగుచు మధ్య నాఁగుచును ఘుర్మాంభస్సునం దోఁగుచున్
'పోలో' నాడిరి రంగభూత్థితరజఃపుంజమ్ము నం దోఁగుచున్. ౩౦

క. ఏడున్నఱ నిముసమ్ములు
పోడిమిమై వాడి శ్రమము పొంపిరవోఁగా
నాడక యైదుని వేషము
తాఁ దాక న్నిలుచుచుండు దరిపొఱు నొక్కటై. ౩౧

చ. రవి యుదయించె మిత్రములు రాజులు బందుగు లెల్లవారు రా
జవరునితో వినోదములు సల్పుచుఁ గొండొకసేపు గడ్పి ; రం
త విభుని నాంగిలేయజనతాఘనతాస్పదులోలిఁ జూచి “చూ
పవలయు నేఁడు మాకు నొగి ఘాతులవేఁట” యటంచు వేఁడఁగన్. ౩౯

మ. అలయాంగ్లేయులతోడ బందుగులతో నానంద మొప్పార బొ
బ్బిలికిం గొండొకదవ్వునన్ జితమహాక్షిశ్రీకమై రంగరా
యలపేరన్ జెలువారు నాహ్రదము డాయంబోయి యేఁ డందు ఘా
తుల వేఁటాడి తటాలునం బురికిఁ దాఁ దోతెంచె నవ్వారితోన్. ౪౦

మ. పరిమదంబొప్పఁగ నాఁటిరేయి చవులూరన్ బెంగుమీరార్నగర
త్నము పాడన్ దగు రాజబంధువులతో నానానృపశ్రేణితో
సుమనోవర్గముతోఁ బురీజనులతో సొంపారు నాస్థానమ
ధ్యమునన్ భూపతి సింహపీఠగతుఁడై యాలించె వాలాయమున్. ౧౪

ఉ. ఆమఱునాఁడు తోడినృపు లాదృతిపాత్రులు రాజబంధువుల్
శ్రీ మెఱయంగ రా నృపతిశేఖరుఁ డేగె ననేకదుర్గమ
గ్రామసమాకులమ్మును నగమ్యధరాధరసంవృతంబు ను
ద్దామనికుంజపుంజకలితంబును నా వనసీమ కేడ్తెఱన్. ౪౨

క. గిరులన్ దరులన్ గిరిని
ర్ఝరులన్ వనపంక్తులన్ గరము నెమకి మృగో
త్కరముఁ బోరిఁ జంపి నృపతియుఁ
బరివారముగూడ నలసి, బడలిరి పెలుచన్. ౪౩

క. ఇటు వేఁట సలిపి రవి పడ
మటిగిరిదరి కరుగునంత మహిపాలుం డు
ద్భటభటులతోడ భూభృ
ద్ఘటతో వెస నరుగుదెంచెఁ గటకమ్మునకున్. ౪౪

తే. గీ. ఘనుఁడు తనతండ్రియైన వేంకటకుమార
కృష్ణరంగరాయని పేర “గెస్టుహౌసు”
నొక్కదానిని గట్టింప నూహచేసి
కుఱుచకటిదినమ్మునందు ఘనమ్మొనర్చెను. ౪౫

ఉ. ఆపురి నెల్లభూవిభుల కందఱకుం దలమానికమ్మునై
యేపలరారు రావు పరమేశుల యేల్బడి రాజధానియై
కాఁపురమయ్యె లచ్చి కలకాపురమైత్రికిఁ దావలమ్మునై;
ధీపరమావధుల్ మిగుల ధీరవరేణ్యులు తత్పురిద్విజుల్. ౫౨

ఉ. ఈపురిరాజులందుఁ బదియేనవ పూరుషుఁడున్ నవస్థిరా
స్థాపకుఁడున్ బరాక్రమకథాప్రథితుండగు పెద్దరాయప్ర
థ్వీపతి సచ్చరిత్రమును విన్చియె యుంటి నొకింత రాజ్యసం
స్థాపకుఁ డీతఁ డీదిశను దక్కిన పూర్వులతోఁ బనేమిటన్. ౫౩

తే. గీ. ఎంతరాజ్యమ్ము నేలిన నేమి, మనకు
'యాచ' శబ్దంబు వదలక యట్టె నిలిచె;
'సోమయాజిత్వ' మార్జింప నేమి, నంబి
శబ్ద మది వీడ లే'దన్న సామ్య మిదియ. ౫౪

చ. అని మదినెంచియో యనఁగ నార్జనచేసె నితండు తూర్పునం
దున నొకరాజ్య మయ్యెడ ఘనుండలరాయపగారు పుత్రు లిం
గనరపాలునుంచి చనె నాత్మపురమ్మున; కంతమీఁద లిం
గనృపమౌళి నూత్నబిరుదార్జకుఁడై యశమంచె దిక్కులన్. ౫౫

తే. గీ. బిరుద మార్జించినట్టి వివరము సర్వ
మిచటఁ బ్రస్తుతమాట మీకిపుడు వినుతు;
నే తురుష్కుని మెప్పించి యితని తండ్రి
యిట జమీన్ గొనె నల ఖానుఁ డేపు మిగిలి. ౫౬

క. శ్రీకాకుళపట్టణమున
వీఁకన్ దనసేనతోడ విడిసి యొదో కా
ర్యాకులత నుండుతఱిఁ గొడు
కా కటకము విడిచి దూర మరిగె మృగయకై. ౫౭

తే. గీ. అట్టు లరిగి 'పళాస' యన్నట్టియూరి
కనతిదూరాన 'రంగపాఁ' కనెడిచోట
వేటలాడుచు నుండంగ వీరుఁ డొక 'పి
తూరి దారుఁ' డివ్వానిపై వైరమూని. ౫౮

ఉ. ఏయడిగాని యాత్మ నలయించిన యప్పుడు గాని నమ్మఁగా
గోయుదు; రిపు సేనొక తురుష్కుఁడ నయ్యు భవన్మతస్థరా
మాయణగాథ నమ్మఁగలయట్టిఁడనైతి; సముద్రి మడ్డటన్
బాయని బల్ వెదుర్పొదలు బాటకు నడ్డిట నేమిసేయుదున్? ౬౬

చ. అని మురపిల్లు ఖానుని దురార్తికి మిక్కిలి నొచ్చికొంచు లిం
గననరపాలుఁ "డెంతపని యవ్వనపాలుని క్రొవ్వడంచి గ్రి
క్కున భవదాత్మజాతు నిదిగోఁ గొనివచ్చితిఁ జూడు" మంచుఁ బ
ల్కిన వీని కుందుదక్కి మన లింగనకున్ ఘటియించె నంజలిన్. ౬౭

క. ఇచ్చటన యుండుఁ డీరని
హెచ్చరికం బలికి నృపతి యేగెన్ దన సై
న్యోచ్చయముతోడ నచ్చటి
విచ్చలవిడి త్రోవ లెఱుఁగు వెరవరి యగుటన్. ౬౮

ఉ. ఏగియు "రంగవాఁక" కొక యించుక దవ్వున సేన నిల్పి భే
రీగుణ మాచరింపుట కరిందముఁ డాజ్ఞ యొసంగె; నంతలో
రేఁగి "పితూరిదారులు" కరిం గని మోఁగెడి కుక్కలట్లు య
వ్వాఁగు మరల్పఁగాఁ దమదు వాఁగులతో నెదిరించి రేడ్తెఱన్. ౬౯

క. ఇరువాఁగున కట సమరం
బఱిమిఱి నయ్యెన్ ధనుస్సు లంపగములు మేల్
పరశువులుఁ జంద్రహాసము
లరివిజయప్రసాధనమ్ములై యొసలారన్. ౭౦

తే.గీ. కొంతసేపట్లు పోరి యక్కొండముచ్చు
వాఁగు లిన్నరపాలుని వాఁగుబారి
కాఁగఁగా లేక సహజమైనట్టి చాటు
యుద్ధమునకుఁ గడంగి రెందో యడంగి. ౭౧

ఉ. అంతట శత్రుసైనికుల కయ్యవకాశము లాకళించు నే
ర్పెంతయునున్కి నయ్యెడల కేగి పలాయితులం బొనర్ప భా
వంతయు నిల్వరాని వెస నాత్మనివాసములం ద్యజించి యా
జంతువు లేగి రయ్యచలజాలవిశాలవనాళి వెంబడిన్. ౭౨

ఆ.వె. "రంగవాఁక" యొద్ద రణమున నరిఁదోలి
నాదు కొమరుఁ దెచ్చి నా కొసంగి
నట్టిపనికి జ్ఞాపకార్థమ్ము రంగరా
వనెడి బిరుదుదాల్పు మవనినాథ! ౮౦

క. అని సంతోషాతిశయం
బున 'ఖానుం' డొసఁగినట్టి ముఖ్యబిరుదు యా
చనృపాలురలో బొబ్బిలి
జనపాలుర కెల్లఁ గులవశమ్ముగ నెగడెన్. ౮౧

క. 'పోటుల్ గ్రామము'లను పే
ర్నాటం గోలె గడియించె నాజనపదముల్
నేఁటి కవియు నా పేరనఁ
బాటింపంబడుచునుండెఁ బండ్రెండూళుల్. ౮౨

క. మీ యడిగిన ప్రశ్నమునకు
నా యెఱిఁగిన యంతలో వినం జెప్పితి న
య్యా! యుత్తరమ్ము బొబ్బిలి
శ్రీయమ్మన కిక్కయగుచుఁ జెలఁగుత మెపుడున్. ౮౩

మ. నెల వర్షమ్ములు మూఁడుగాఁ గుఱియుట న్నిండారు సస్యంపు భూ
ములతోఁ బాయని యన్నవస్త్రములతో బొల్పారు గ్రామస్థితా
ఖిలతత్తద్గృహమేధివర్గములతోఁ గీర్త్యున్నతిన్ మించి బొ
బ్బిలిరాజ్యం బధినేతకున్ సుఖదమై పెంపారి సొంపారుతన్. ౮౪

మ. చలనం బించుక లేని సంపదలతో సంతానసౌభాగ్యముల్
గల శుద్ధాంతముతో నితాంతవిజయాఖండప్రతాపాత్తకీ
ర్తిలతాలవాలములైన బంధుగులతోఁ దేజస్సుతో నేఁటి బొ
బ్బిలిరాజన్యుఁ డెసంగుఁగాత నుతదోర్వీర్యప్రతాపమ్ముతో. ౮౫

శా. రంగద్యాచనరేంద్రవంశమణియై రంజిల్లి యా "రంగవాఁ"
కం గీర్తిన్ గడియించి యుద్ధమున రంగారాయనామాంకితుం
డుం గల్పాంతవిభాసిరాజ్యవిభవుండున్ గాఁ బ్రిథంగాంచు నా
లింగన్నన్ బురణించి శోభిలెడి దోర్లీలన్ విభుం డొప్పుతన్. ౮౬

చ. తన పొనరించు సత్కృతులు తద్దయు భావినృపాలకోటి వ
ర్తనకు నిదర్శనమ్ములయి దారినిఁజూపఁగ శాశ్వతమ్ముగా
ననుపఁగఁ జాలు కబ్బముల నోలిరచించు కవీంద్రు లెల్లెడన్
దనపురి నుల్లసిల్ల సుహితమ్ముగ రంగనృపాలుఁ డేలుతన్. ౯౪

శా. జారుల్ చోరులు దుర్మదాంధులు దురాచారప్రచారుల్ నిరా
ధారుల్ ధీరులుగాని పాఱులు వృథాదంభవ్రతుల్ రోసులే
వారన్ ముందునకేని లేక సుఖవిభ్రాజిష్ణువా రాజ్యవి
స్తారం బేలుచు బొబ్బిలీంద్రుఁడు మహేంద్రశ్రీకుఁ డొప్పారుతన్. ౯౫

మ. రజనీనాథు జిగిన్ నగించు తురగవ్రాతమ్ములున్ జూపఱ
క్కజమందంగల బల్ గజమ్ములు ధరాకాశమ్ము లాక్రమ్మెడిన్
బ్రజకున్ జూపెడి మేటిసౌధముల సౌభాగ్యమ్ము శోభిల్లు వీ
రజయశ్రీకము బొబ్బిలిన్ సొబగుమీఱన్ రంగరా వేలుతన్. ౯౬

శా. పాతివ్రత్య మెలర్ప భూసతి తనుం బ్రాణమ్ము ప్రాణమ్ముగా
పాతత్వాదృతినాదరింప బహుళాచ్ఛప్రస్ఫురచ్చంద్రికా
జ్యోతిర్ద్యోతియశోభిశోభి యగుచున్ సూర్యగ్రణుల్ మెచ్చఁగా
నేతద్బొబ్బిలి నేలుఁగాతఁ జిర మా యీరంగరావర్మలిన్. ౯౭

శా. ఐశ్వర్యంబది యెంతయుండినను విద్యాగోష్ఠి లేకున్న నీ
విశ్వంబుల్ దలక్రిందుసేయఁగల నుర్వీనేతయేయైన స
ద్విశ్వాస్యత్వములేమిఁ జూడ రతనిన్ విద్వాంసు; లట్లౌట వి
ద్వైశ్వర్యంబులు గూడి బొబ్బిలి నృపప్రాసాద మందుండుతన్.

మ. నిరతంబున్ దమ కోటలో నిలిపి నిర్ణిద్రాస్థ నేదేవతా
వరుపాదద్వయి బొబ్బిలిప్రభులు దివ్యస్వర్ణపుష్పమ్ములన్
బరిపూజింతు రతండు శ్రీహరి కృపాపర్యాప్తి శ్రీరామకృ
ష్ణరసానాథు సతీసనాథు మనుచున్ సంతానసంయుక్తునిన్.

శా. పూతమ్మైన మనమ్ముతో వితతమా పున్నెమ్ముతో విద్యను
స్యూతాచారముతో మహామహిమతో సూర్యగ్రణీసత్కవి
వ్రాతస్ఫీతసభావిభాసిసుచరిత్రస్తోత్రపాత్రమ్ముగా
నేతద్బొబ్బిలి రంగరాట్ప్రభువరుం డేలంగ దీవించెదన్.